# సారూప్యౌషధశాస్త్రసారము.



## ప్రథమభాగము.

## హోమియోపతీమెటీరియామెడికా

అనబడు

# వస్తుగుణదీపిక.

## (Homoeopathic Materia Medica - in Telugu)

గ్రంథకర్త:

## యనమండ్ర గణపతిరావు

హోమియో ఫిజీషియన్.

ద్వితీయముద్రణము 2000 ప్రతులు.

కాకినాడ జగన్నాథపురమునందు

శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి

వై. గణపతిరావు అండు కంపెనీ,

అమెరికా హోమోపతీ ఫార్మసీవారిచే ప్రచురింపబడినది.

1938.

సాదాప్రతి వెల రు. 1—8—0.

క్యాలికోప్రతి వెల రు. 2—0—0.

Copies obtainable against orders accompanied by advance of price and postage.

*From ;—*

**Y. GANAPATI RAO & Co.,**

*American Homœopathic Pharmacy,*

YESUVARI STREET.

**JAGANNAICKPUR, COCANADA** P. O.

*East Godavari District.*

---

ఈ గ్రంథముయొక్క ప్రతులు వలయువారు పుస్తకము ఖరీదును పోస్టుఖర్చును పంపుచు యీదిగువ చిరునామాకు వ్రాసిన బడయగలరు.

వై. గణపతిరావు అండు కంపెనీ,

అమెరికా హోమియోపతీ ఫార్మసీ,

యేసువారివీధి,

జగన్నాథపురం, కాకినాడ పోస్టు,

తూర్పు గోదావరిజిల్లా.

# ప్రథమముద్రణమునకు ఉపోద్ఘాతము.



హోమోపతీ వైద్య విధానమును జర్మనీదేశస్థుడైన శామ్యూల్ ఫ్రెడెరిక్ హానిమన్ అను పాశ్చాత్య సుప్రసిద్ధవైద్యుడు ఇప్పటికి సుమారు 150 సంవత్సరములక్రిందట కనిపెట్టెను. ఈతడు జర్మనీదేశములో మిసెన్ అను నొక చిన్నపట్టణమునందు 10-4-1755 తేదీని ఒక బీదకుటుంబములో జన్మించెను. వయస్సు వచ్చినపిదప తన స్వశక్తివలననే జీవనము చేయుచు, చదువ నారంభించి, క్రమముగా పాశ్చాత్య వైద్యమునందు త్తీర్ణుడై ఆవైద్యమును సాగించుచు, హోమోపతీ వైద్య విధానమును కనిపెట్టెను. ఔషధముల గుణములను రుజువుచేయుటలో ఔషధములను మనుష్యులమీదనే ప్రయోగించుట ఉత్తమ పద్ధతియనియెంచి, ఈతడు సుమారు 100 ఔషధములను తనమీదను తన శిష్యులమీదను, ప్రయోగించి వాటి గుణములను నిర్ధారణచేసి, స్వయముగా నొక వస్తుగుణదీపికను వ్రాసెను. ఈతడు శిష్యుల నెందరినో యీవైద్యమునందు ప్రవీణులుగ జేసెను. ఈవైద్యముయొక్క ఆధిక్యతను (అనగా త్వరితముగను, శాశ్వతముగను, అపాయము కలుగకుండగను, వ్యాధులను కుదుర్చుటకుగల అవకాశమును) ప్రపంచమునకు వెల్లడిచేసెను. మరియు నీతడు ఈవైద్యసిద్ధాంతమును గూర్చి 'ఆర్గనన్' (Organon) అనబడు సిద్ధాంతగ్రంథమును, తాను అనేకవ్యాధులను కుదుర్చుటవలన గలిగిన యనుభవముమీద దీర్ఘవ్యాధులను గూర్చి యొక గ్రంథమును, యిట్లే వైద్యసంబంధమైన విషయములను గూర్చి గ్రంథములు వ్రాసినాడు. ఇతడు తనయావచ్ఛక్తిని యీహోమోపతీ వైద్యమునకే వినియోగపరచి 2-7-1843 సంవత్సరమున పరలోకగతుడయ్యెను.

నాటినుండియు యీవైద్యము క్రమముగా ప్రపంచమందంతటను మెప్పుపొంది, సమస్త దేశములందును వృద్ధినొందుచున్నది. డాక్టరు కెంటు మున్నగు పాశ్చాత్య హోమోపతీవైద్యులు, హానిమను గారివలెనే ప్రప్రథమమున పాశ్చాత్యవైద్యము నభ్యసించినను, హోమోపతీవైద్యము ఎక్కువ శ్రేష్ఠమైనదగుటచే యీవైద్యమును అవలంభించి యీకాలపు ప్రజలకు యీవైద్యమునందలి ఆధిక్యతను వెల్లడించియున్నారు; మరియు వీరిలో కొందరు యీవైద్యతత్వము, వస్తుగుణదీపిక మొదలగు వివిధాంశములను గూర్చి గ్రంథములను వ్రాసియును, యీమందులను సుప్రసిద్ధముగా తయారుచేయుటకు యంత్రములను (కెంటు పొటెన్టైజరు, స్కిన్నరు మెషినరీ, ట్రిచురేటింగు మెషినరీ మొదలయినవి) కనిపెట్టియును యీవైద్య వ్యాప్తికొరకు అనేకసంఘములను స్థాపించియు వైద్యప్రచారమునుగావించి యున్నారు. డాక్టరు కెంటుగారి ఉద్దేశ్యప్రకారము (నిజమైన) హోమోపతీ వైద్యు లనబడువారు వైద్యమును (పాశ్చాత్యవైద్యమును కాబోలును) పూర్తిగా నేర్చుకొనినపిదప హోమోపతీ వైద్యమును అభ్యసించవలయుననియు, రోగికి గల రోగలక్షణములను పోలిన లక్షణములను గలుగజేయునట్టి ఔషధమును గుర్తించి ఆఔషధమును అట్టిరోగలక్షణములకు సూక్ష్మమోతాదులలోనిచ్చునట్టివారునుఅయియుండవలయుననితోచుచున్నది. ఇట్టి నిజమైన హోమోపతీవైద్యులచే అమెరికా మొదలగు దేశములలో యింటర్నేషనల్ హానిమానియస్ ఎసోసియేషన్ [వీరి మెంబర్లడిగ్రి ఎం. ఐ, హెచ్. ఏ. (అమెరికా).] మొదలగు పెద్దపెద్ద (నిజమైన) సంఘములుస్థాపింపబడి సరియైన కట్టుబాటులతో నడపబడుచున్నవి. ఇట్టి డాక్టర్లును, వీరిసంఘములును యీప్రపంచకమునకు ఆదర్శములు. అందుచేతనే యిట్టిడాక్టర్లుగల జర్మనీ, అమెరికా, ఇంగ్లాండు, స్పెయిను, ఇటలీ, హిందూదేశములోని బంగాళారాష్ట్రము, జపాను మొదలగుచోట్ల హోమోపతీవైద్యము మిక్కిలి

అభివృద్ధిని గాంచుచున్నది. హోమోపతీ డిగ్రీలను అబద్ధముగాను, అక్రమముగాను, పేరుపొందిన దూరపు యెసోసియేషనులను మోసగించియు, సంపాదించి; బూటకపుమాటలాడుచు, దొంగవేషములను వేయుచు యుండు అబద్ధపు డాక్టర్లుబయలుదేరుట యీ వైద్యవిధానమునకు కళంకము. డాక్టరు కెంటు మొదలగు సుప్రసిద్ధ హోమోపతీవైద్యుల అభిప్రాయములను తారుమారుచేసి ఆడునట్టి మాటలతో ప్రజలను నమ్మింపజేయబూనిన డాంబికవైద్యులు యీహోమోపతీ వైద్యాభివృద్ధికి వేరుపురుగులని వేరే వ్రాయనవసరము లేదు.

ఈ పుస్తకములో వ్రాయబడిన మోతాదులను సహచరులనుగూర్చి కొలదిగా నిక్కడవివరించెదను. మోతాదువిషయములో ప్రతిమందుచివరను (1) టించరు మొదలు 200 వరకు అనియు (2) 6 మొదలు 1,000 వరకు అనియు (3) 30 మొదలు 1,00,000 వరకు అనియు యిట్లు వ్రాసియున్నాను. వీటికి (1) మదరుటించరు, 1, 3, 6, 12, 30, 100, 200 పొటెన్సీలను వాడవచ్చుననియు (2) 6 మొదలు 1,000 వరకు అనునపుడు 6, 12, 30, 100, 200, 500, 1000 పొటెన్సీలలో వాడవచ్చుననియు (3) 30 మొదలు 1,00,000 వరకు అనునపుడు 30, 100, 200, 500, 1,000, 10,000, 1,00,000 పొటెన్సీలలో వాడవచ్చుననియు అర్థము. 30 కన్న తక్కువ పొటెన్సీలు వాడుట వ్రాయబడని (సిఫిలినం, గనోరినం, బ్యాసిలినం మొదలగు) మందులకు 30 కన్న తక్కువపొటెన్సీలు వాడకూడదు. తరుణవ్యాధులకు చిన్నపొటెన్సీలను, దీర్ఘవ్యాధులకు రోగియొక్క వయస్సునుబట్టియు, వ్యాధియొక్క తీవ్రతనుబట్టియు, పెద్దపొటెన్సీలను వాడవలయును. మరియుచిన్నపిల్లలకు 30 పొటెన్సీవరకును, పెద్దవారికి 30; 200 పొటెన్సీలలోను సాధారణ

ముగా వాడవచ్చును. 30 వరకును చిన్నపొటెన్సీలనియు అంతకుమించినవి పెద్దపొటెన్సీలనియు తెలియవలెను. 30 పొటెన్సీవరకు దినమునకుమూరు మూడు మోతాదులను వాడవచ్చును. 100, 200 పొటెన్సీలను దినమున ఒకసారి వాడినచాలును. 500, 1000 పొటెన్సీలను వారమున కొక తూరి వాడినచాలును. ఇంతకు పైపొటెన్సీలను 1, 2 లేక 3 నెలలకు వ్యాధియొక్క పద్ధతినిబట్టియు, వైద్యుడు తన అనుభవమును, శాస్త్ర పరి చయమును, అవసరమునుబట్టియు ఒక్కొక్క మోతాదును కడుజాగ్రతతో వాడవచ్చును. వైద్యులుకానివారు 200 కన్న ఎక్కువ పొటెన్సీలను వాడుట మంచిదికాదని నాఅభిప్రాయము. కొన్ని ఔషధముల లక్షణముల చివరను సహచరులని వ్రాయబడియున్నది. సహచరి అనగా ఒకప్రధాన ఔషధమును వాడుటవలన ముఖ్యమైన లేక ఎక్కువ బాధకరముగానుండు లక్షణములు ఉపశమించిన పిమ్మట రోగముయొక్క పూర్తి నివారణకు సహాయపడు మరియొక ఔషధము. దీనికి ఉదాహరణము:—ఒక రోగ లక్షణ సముదాయమునకు నక్సువామికాను యిచ్చినయెడల చాలవరకు రోగలక్షణములు తగ్గి, మిగిలిన లక్షణములు నక్సువామికావలన తగ్గనపుడు ఆలక్షణములను తగ్గించగలిగినట్టియు అదివరలో నక్సువామికావలన కలిగిన గుణమును తీసివేయకయు యుండునట్టి సల్ఫరు మొదలయిన ఔషధములనే సహచరులందురు. ప్రధానఔషధమును, దాని సహచరులను మిశ్రమునుచేసిగాని మార్చుచుగాని ఎప్పుడును యివ్వరాదు.

నేను యీపుస్తకముతోపాటు వ్రాసినట్టియు, ప్రస్తుతము అచ్చులో నున్నట్టియు సాయూప్యౌషధశాస్త్రసారము ద్వితీయభాగమును "హోమో పతీవైద్యము"ను, జీవరసాయనశాస్త్రసారమును, దీనివలెనే ప్రజా సౌకర్యము నిమిత్తము పుస్తకము ఒక్కంటికి ఖరీదు రు. 1-0-0 మాత్రమే

వేసియున్నాను. ఈ మూడు పుస్తకములును; నాచేవ్రాయబడి ప్రస్తుతము అచ్చులోనున్న చికిత్సాసూచికపటములు రెండును (రెండింటియొక్కయు మొత్తముఖరీదు రు 0-2-0 మాత్రమే) దగ్గరనున్నయెడల వైద్యులకును గృహస్థులకును అందరికిని ఉపయోగకరముగా నుండగలవని నా నమ్మకము. బంగాళా రాష్ట్రములోని కంపెనీలవలెనే, నేనుబోరిక్ అండు టాఫెల్ అను అమెరికా దేశపు కంపెనీనుండి హోమోపతీ మందులను మరియు బయోకెమిక్ మందులను స్వయముగా తెప్పించి మన చెన్నపురి రాజధానిలో టోకునను చిల్లరను అమ్మునట్టి వై. గణపతిరావుఅండ్ కంపెనీని స్థాపించియున్నాను. ఈకంపెనీతప్ప కాకినాడలోగాని యీరాజధానిలో మరి ఎక్కడను గాని బోరిక్ అండు టాఫెల్ కంపెనీనుండి స్వయముగా మందులు తెప్పించి అమ్మువారు మరియొకరు ఏడేండ్లనుండి ఇప్పటివరకును లేరు. ఈకంపెనీలో ఔషధములు మాత్రలురూపమున 30 పొటెన్సీవరకు డ్రాము 1కి రు 0—1—3 వంతున అమ్మునట్లు ఏర్పాటును చేయుటకు నాకు ఎట్టివుద్దేశ్యముకలిగెనో, అట్లే, వైద్యగ్రంథములనుకూడ అతి స్వల్పధరలకు అమ్మ ఏర్పాటుతో గ్రంథములను వ్రాయుటకునుకూడ నాకు వుద్దేశ్యమును, శక్తియును, హోమోపతీవైద్యాభివృద్ధికొరకుకలిగినవి.

ఈగ్రంథముతోపాటు యిప్పుడు హోమోపతీ వైద్యము మీద నొకటియును, 12 టిస్యూలవణములతో చేయు వైద్యముమీద నొకటియు మొత్తము 2 ఇంగ్లీషు పుస్తకములనుకూడా ప్రతి 1కి రు 0—8—0 చొ॥అమ్ముటకు యేర్పాటుచేసి అచ్చువేయించుచున్నాడను. యిప్పుడు అచ్చు అగుచున్న గ్రంథములన్నియు వెలువడినపిమ్మట బాలరోగ చికిత్స మొదలగు ప్రత్యేకవిషయములమీదగూడ పుస్తకములను వ్రాయ నిశ్చయించినాడను. మరియు కాకినాడహోమోపతీ పత్రికయను యొక మాస

పత్రికను (సాలుఒకటికి రు 1—4—0 చందాతో) త్వరలోనే ప్రచురించుటకుగూడ ఏర్పాటు చేయుచున్నాడను. యీ సంవత్సరమున నేను కాకినాడహోమోపతీ మెడికల్ కాలేజీని స్థాపించితిని. యిందులోని ఉపాధ్యాయులు అనుభవనీయులును, నిజమైన డిగ్రీలు గలవారును, వైద్యమును నేర్పుటయందును చేయుటయందును శక్తి సామర్థ్యములు గలవారును, వీరిలో నొకరు పాశ్చాత్యవైద్యములో గ్రాడ్యుయేటును అయివున్నారు. నాస్వంత లైబ్రరీ సుమారు 1,750—0—0 రూపాయిలు విలువగలది ఈ కాలేజీ నిమిత్తము ఉపయోగింప నేర్పాటుచేసినాను. ఇదిగాక నాయొక్క హోమోపతీ లేబరేటరీయును, వైద్యాలయమును యీ కాలేజీ విద్యార్థుల అనుభవముకొరకు చాలవరకుపుపయోగింపబడును. ఇన్నివిధముల నేను చేయుచున్నకృషిని సరియైన మనస్సుతో గ్రహించి, నేను చేయుచున్న ప్రజాసేవవలని లబ్ధిని ఆంధ్ర సోదర సోదరీమణులందరును పొందుదురని నమ్ముచున్నాను.

గ్రంథములను వ్రాయుటకు నాకిదియే ప్రథమము గాన వీటిలో వ్రాయబడిన హంశములలో దోషములేమైన యున్నయెడల వెంటనే దయతో వాటిని నాకు తెలియపరచినచో ద్వితీయముద్రణలో సవరించుకొనెదను.

ఇట్లు,

జగన్నాథపురము,
కాకినాడ,
15—6—1934.

డాక్టరు. వై. గణపతిరావు,
ఎఫ్. సి. ఆర్. ఏ (గ్లాస్గో),
ఎఫ్. ఐ. ఎస్. ఏ (లండన్).
గ్రంథకర్త.

# ద్వితీయముద్రణమునకు ఉపోద్ఘాతము.

15-6 34 తేదీని ప్రచురింపబడిన యీగ్రంథముయొక్క ప్రథమ ముద్రణము బాపతు 2000 ప్రతులు అయిపోవుటవలన యీద్వితీయ ముద్రణమునకు కారణము కలిగినది. ఈసారి గ్రంథముయొక్క పేరులో కొలది సవరణ పెద్దల అభిప్రాయముననుసరించి "హోమియోపతీ మెటీరియా మెడికా" యని చేయవలసివచ్చినది. ప్రథమ ముద్రణమునందు 312 ఔషధముల యొక్క వస్తుగుణములు 654 పేజీలలో ముద్రింపబడినవి. ఈసారి గ్రంథమునందలి ఔషధములసంఖ్యయు, ఔషధములనుగూర్చి వ్రాయబడిన హంశములును, పలువిధముల పెంచబడి, 402 ఔషధములనుగూర్చి 770 పేజీల గ్రంథము వ్రాయబడినది; మరియు గ్రంథము మూడుభాగములుగా విభజింపబడి ఒక్కొక్క భాగమునందు ఒక్కొక్కబాపతు ఔషధములను గూర్చి వ్రాయబడినది; ఇంతేకాక, ఆయుర్వేదవైద్యులకును వైద్యేతరులైనను వైద్యపరిచయము గలవారికి సహితము బోధపడునట్లును, సర్వవిధముల వుపయోగకరముగా నుండునట్లును, తెలిసినంతవరకు ఔషధములకు తెలుగుపేర్లను వ్రాయబడినది. గ్రంథమునందు, ఔషధలక్షణములు ఒకే తీరున వ్రాయబడి, ద్వంద్వార్థములు. అపార్థములు మున్నగు దోషములు లేకుండునట్లు చేయడమైనది. కాబట్టి, తెలుగున హోమియోపతీవైద్యము నభ్యసించు విద్యార్థులకును, ఇతరవైద్య విధానముల ననుసరించుచు దీని యందు అభిరుచిగలవారికిని, తమంతటతాము స్వంతముగా ముఖ్యమైన హంశములను నేర్చుకొని తమతమయిండ్లలో తామే వైద్యముచేయవలచిన వారికిని యీగ్రంథమున్నూ దీనితోపాటు అచ్చుఅయిన "హోమియోపతీ వైద్యము" అనబడు చికిత్సాగ్రంథమును ఎక్కువ వుపయుక్తముగా నుండగలవని నమ్ముచున్నాను.

యీ గ్రంథముయొక్క పేజీలసంఖ్య పెరుగుటచేతను, బైండింగు వెనుకటికన్న ఎక్కువ బాగుగా చేయబడుటచేతను, ప్రింటింగు పేపరుకు ధర పెరుగుటచేతను యీ గ్రంథమునకు ధర హెచ్చుచేయవలసి వచ్చినది.

జగన్నాధపురం, కాకినాడ.
1—4—1938

యిట్లు,
గ్రంథకర్త.

---

# విషయసూచిక.



# హోమియోపతీమెటీరియామెడికా

ఇది సారూప్యౌషధశాస్త్రసారము అనబడు
గ్రంథముయొక్క ప్రథమభాగము.



# వస్తుగుణదీపిక.



## Section 1. Vegetable Kingdom.

## ప్రథమాశ్వాసము : వనౌషధులు.



### 1. యాబిసునైగ్రా. ABIES NIGRA.

జీర్ణకోశసంబంధమైన వ్యాధులతో ద్వంద్వముగాయుండు యితర రోగములమీద పనిచేయును. తినినఆహారము జీర్ణకోశమువద్ద నొకప్రక్కను జీర్ణముకాకుండా పెద్దగడ్డవలె నుండుట. పొగాకు, టీ, వలని దోషములతోను హృదయదోషములతోను ద్వంద్వముగా వృద్ధాప్యమునందు కలిగిన అజీర్ణదోషమునకును, మలబద్ధమునకును, ఇది అమోఘమైనది. త్రేణుపులను దగ్గును మాన్పును.

తల, మెదడు:—తలనెచ్చన. ముఖముకందుట, మందముగనుండుట, రాత్రి నిద్రపట్టకపోవుట, ఆకలిగానుండుట, చదువుటయందును, ఆలోచనయందును, అయిష్టత. నిద్రలో దుష్టకలలు వచ్చుట.

అన్నకోశము:—ఉదయమున ఆకలిలేకపోవుట, మధ్యాహ్నమునను రాత్రియందును అపరిమితమైన ఆకలి. తరచు త్రేణుపులు వచ్చుచుండుట. భోజనానంతరము వచ్చు కడుపునొప్పి.

శ్వాసావయవములు:—ఊపిరి అందకపోవుట=యీగుణము పరుండినపుడు ఎక్కువగుట. గుండెలలో బాధగను, బరువుగనుయుండుట.

స్త్రీఅవయవములు:—వరుసగా మూడునెలలు ఋతువాగిపోవుట.

వృద్ధికము:—భోజనానంతరము.

పోలికలు:—అజీర్ణముకు తూజా, సెబీనా. తేనీటి దోషములకు తూజా. ఇతరములకు—కాలీకార్బ్, నేట్రంమూరు. పల్సటిల్లా.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 2. యాబ్రొటేనం. ABROTANUM.

అతి ఆకలి, ఎడతెగని అజీర్ణము, కడుపులోమంట, కడుపు బిగపట్టుచున్నట్లుబాధ, ఒకప్పుడు దుర్వాసనతోగూడిన వమనము, అజీర్ణవిరేచనములుగలవారి కిది బాగుగా పనిచేయును. రోగము దేహమునందు ఒక స్థానమునుండి మరియొకస్థానమునకు మారుచుండుట లేక, ఒక రోగగుణమును మాన్పినయెడల వెంటనే సంబంధములేనట్టి మరియొక రోగగుణము కనపడుట. ఉదాహరణము: —(1) నీళ్లవిరేచనములు ఆపినయెడల మేహవాతరోగము ప్రవేశించుట. (2) మేహవాతరోగము నయమగుచున్నప్పుడు మూలశంఖ యెక్కువగుట. (3) మూలశంఖను నీళ్లవిరేచనములును మాన్పినచో అజీర్ణదోషము ప్రవేశించుట.

మేహవాతరోగము అణచిపెట్టబడినపుడు కలుగు ఇతరబాధలను, పసిపిల్లలకును, చిన్నపిల్లలకును ముక్కునుండి కలుగు రక్తస్రావములను, బుడ్డలను, కాళ్లు యెండిపోవుటను మాన్పును. పసిపిల్లల బొడ్డులోనుంచి

రక్తము, నీటివంటి పదార్థము కారుటను మాన్పును. మహావాత నొప్పులు ఒకమారు కీళ్లలోనుండి గుండెలలోకిన్ని, ఇంకొకమారు వెన్నెముకలోనికిన్ని మారుట. బిడ్డ చిక్కిపోవుట, దిగువ అవయవములు ప్రధమముగ యెండిపోవుటతో ముందుగా గుర్తింపబడుట.

కాళ్లు, చేతులు :—వ్రేళ్లువంగకపోవుట, వాపు. మణికట్టులోను, చీలమండలోను నొప్పి, వాపు, నుంటగాను యుండుట.

జ్వరము :—మహావాతజ్వరము. క్షయరోగములో మిక్కిలి చలితోను, నిస్త్రాణతోనుకూడిన జ్వరము.

పోలికలు :—స్టేనంమెట్, సల్ఫరు, బెరీటాకార్బ, ఎథూజా, యాంటింకూడం, కాల్కికార్బ, అయోడియం.

వృద్ధికము :—చల్లనిగాలిలోను, రాత్రియందును సాధ్యము వూరుట ఆపివేయబడుటవల్లను.

వుపశమనము :— కదలికవలన.

మోతాదు :—3 మొదలు 30 పొటెన్సీ.

బాహ్యోపయోగము :—ఈమందు మదరుటించరును, సరిసమానముగా కాచి చల్లార్చిన నీళ్లలోకలిపి తేమవలనను, శీతలమువలనను వచ్చిన కాళ్ల ఒరుపులకు, పుండ్లకు పట్టించినగాని, కడిగినగాని అవి నయమగును. విస్తారము నడకవలననుగాని, చాలసేపు నిలుచుండుటవలననుగాని, కాళ్ల నరములలోకలిగిన నొప్పిని మాన్పుటకు కాళ్లకు పట్టించవచ్చును.

---

## 3. యాబ్సింతియం. ABSINTHIUM.

ఇది మూర్ఛ మొదలగు నరముల సంబంధమైన రోగములలో బాగుగా పనిచేయును. ఫిట్టువచ్చుటకు ముందు శరీరము కంపమొందుట, నాలుకనుకొరుకుట, నోటినుండి నురగవచ్చుట, మొదలగు చిహ్నములు

బయలు దేరుట, అకస్మాత్తుగా దేహము మొద్దుబారినట్లగుట, పరాకుమాటలు, కొద్దిగా స్మృతితప్పుట, నిద్రపట్టకపోవుట. అపస్మారము లేక హిస్టీరియా లోను, పిల్లలలోకలిగెడు బాలపాపచిన్నెవంటి జబ్బులకును, సాధారణముగా కంపము, నరములయందు బలహీనత, మొదలగు నరములసంబంధమైన వ్యాధులలోను యిది బాగుగా పనిచేయును. లేచినచో తలతిప్పు వచ్చి, వెనుకకు తూలిపడునట్లు అగుట కన్నులు చీకట్లుగ్రమ్ముట, దృష్టికలలు వచ్చుట, దయ్యములు, భూతములు కంటికెదురుగా కనపడినట్లు అగుట, పిల్లలకు నిద్రపట్టకపోవుట—వీటికి యిది బాగుగా ఉపయోగపడును. ఒకదినముననే అనేకసార్లు కంపములువచ్చుట. సంధితో రోగి అస్థిమితముగా అటు నిటు నడుచుచుండుట.

పొత్తికడుపు :— త్రేణుపులు కడుపుబ్బరింపు, వమనములగుట.

మూత్రావయవములు:— ఎల్లప్పుడును మూత్రమునువిడుచుటయందు కోరిక. మూత్రము నారింజపండు రంగుతో గుర్రపుమూత్రపు వాసన.

పోలికలు :— ఆర్టిమీషియావల్గ, యాసిడ్ హైడ్రో, సినా, సిక్యూటావిరోసా, బెల్లడోనా, సైప్రిమోనియం, యాసిడ్ నైట్రిక్.

మోతాదు :— 6 మొదలు 30 పొటెన్సీ.

---

## 4. యెకాలిఫా ఇండికా. ACALYPHA INDICA.

(హిందూదేశపు ఔషధము—కుప్పిచెట్టు)

ఇది శ్వాసకోశము, జీర్ణకోశనాళము (Alimentary canal) వీటినుండి కలుగు రక్తస్రావములలోను, వీటిసంబంధమైన యితర రోగముల లోను బాగుగా పనిచేయును. అపరిమితమైన పొడిదగ్గుమీద ఉదయమందు శుద్ధరక్తము వెడలుట, సాయంకాలము చిక్కని రక్తము నల్లగాను, ముద్దల

వలె స్రవించుట. రాత్రిభాగమందు అపరిమితమైన దగ్గు. క్షయాసంబంధమైన దగ్గు. ఛాతీనుండి రక్తస్రావము.

పాత్రికడుపు :—ప్రేగులలోమంట, మలము పచ్చగాను గుడగుడలాడుచు అపానవాయువుతో కలిసి ధ్వనితో వెడలుట, పాత్రికడుపు ఉండచుట్టుకొనిపోవునట్లుండుట, ఉదయమున ఆసనమునుండి రక్తముపడుట.

వృద్ధికము :—ప్రసయమునను మరియు సాయంత్రమునను.

పోలికలు :—మిల్లిఫోలియం ఫాస్ఫరసు, కాలీనైట్రికం, యాసిడ్ ఎసిటిక్, హేమామెలిసు, ఇపెకాక్, ఎకోనైటు.

విరుగుళ్ళు :—కాల్కేరియాకార్బ.

మోతాదు :—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 5. ఎకోనైటు నేపెల్లసు. ACONITE NAPELLUS.

(హిందూదేశపు ఔషధము—సంస్కృతమున "విష" అనియు, హిందీలో "మితజహార్" అనియు అందురు.)

నీరసస్థూలకును, కాయశరీరులకును, నల్లని తలవెండ్రుకలు గలవారికిని, రక్తపుష్టిగలవారికిని, మేహావాతశరీరులకును, ఎల్లప్పుడును వుల్లాసముగా నుండునట్టివారికిని వచ్చు రోగములకిది వాడదగినది.

భయము, జంకు, చలి, పొడిగాలి, చల్లదనము, వేడిమి-ముఖ్యముగా యెండవేడిమి, దెబ్బతగులుట, శస్త్రచికిత్స; విచారము, చమట నణచిపెట్టుట-వీటివలనవచ్చు రోగలక్షణములకిది ముఖ్యముగా వాడతగినది.

చర్మము పొడార్చుకుపోవుట, మంటలుగా నుండుట, చల్లని నీటిని త్రాగవలయునని తీవ్రమైనకోర్కె, ముఖము కిందబారుట, ఒక్కొక్కప్పుడు ముఖము పాలిపోవుట. ♦ కంటిలో నలక పడుటవలనగాని, కంటికి

శస్త్రచికిత్సవలనగాని, పొడిగానుండు చల్లనిగాలి తగులుట వలనగాని, (Conujnctivitis) కంటి ఆమత్వచల వాపులు బాధలు వచ్చుట. ♦ఎడమ ముంజేతికి తిమ్మిరెక్కుటవలనకదల్చుట కష్టముగానుండుట. ♦రోగి తాను ఫలానాదినమున చనిపోవుదునని చెప్పుట—ఈలక్షణము ముఖ్యముగా గర్భిణీస్త్రీలలోను, బాలింతరాండ్రలోను కలుగుట. ♦లేచుటతోడనే, అదివరలో కందబారియున్న ముఖము చావుముఖమువలె పాలిపోవుట. ♦ బహిష్టులో జడుచుకొనుటవలన ఋతువు ఆగిపోవుసూచనలు గలుగుట. ♦వేసవికాలములో తుక్కుతుక్కుగా నెడలు పసరువిరేచనములు. ♦అవయవములు మొద్దుబారుట, తిమ్మిరెక్కుట. ♦ గురకతోనుండు దగ్గువలన తొలికునుకునందే మెలకువకెందుట-ఈలక్షణము పొడిగాను చల్లగాను యుండు పడమటిగాలి తగులుటతో నిది చిన్నపిల్లలలో గలుగుట. ♦ కప్పుకొనిన వస్త్రమును తీసివేయుటను, తాకుడును, బాధను, భరింపజాలకుండుట. ♦ వేడిమి, బాధ, వాపు మున్నగువాటితోవచ్చు జ్వరముల ప్రథమావస్థ. ♦అస్థిమితము, ఆతురత, జ్వరముకు ముందువచ్చు చలి, కురుపు. ♦గట్టిగను, పుష్టిగను తొందరతోను యుండు నాడి, శరీరవేడిమితోనుండు దాహము. ♦తొందరతోకూడిన ఆతురత, బాధ, అటునిటు కదలుచుండుట. ♦మానసికోద్రేకమువలనగాని, వైను తాగినపిదపగాని, చల్లని పొడిగాలి తగిలిన పిమ్మటగాని, దగ్గినను, కాండ్రించినను, సులభముగా రక్తవమనమగుట. ♦ తీవ్రమైన చలికి పిమ్మట శరీరము పొడిగానుండుటతో వెచ్చదనము వచ్చుట మరియు ఛాతీలో బల్లెముతో పొడిచినట్లుండుబాధలు. ♦ చల్లదనమువలన లేక చల్లగాలివలన చమటపట్టుటనాపుచేయబడుటవలన వచ్చు కంటిరోగములు మరియు శ్వాసావయవరోగములు—ఇవి దీని ముఖ్యలక్షణములు—

అస్థిమితముగల మూడు ఔషధములలోను ఇది ఒకటి. తక్కినవి (1) ఆర్సెనికం ఆల్బం, (2) రూస్టాక్సు. బాధను మాన్పు మూడు ఔషధములలోనుకూడ నిదియొకటి. తక్కినవి (1) కెమోమిల్లా, (2) కాఫీ.

మనస్సు :—మిక్కిలి భయము, ఆతురత. బాధలు భరింపశక్యము గాకుండా యుండుట. అసౌఖ్యత, భయము, విసుగుదల, పరవశత్వముతో కూడిన తెలివిసంధి. భవిష్యత్తునుగురించి మాట్లాడుట. సంగీతమును సహించలేకపోవుట, దీనివలన విచారముగలుగుట (యాంబ్రాగ్రీషియా, సెబీనా. ఈగుణము బహిష్టు అయినపుడు కలిగినయెడల నేట్రింకార్బ వాడవలెను) తనయెదుట జరిగినవన్నియు కలలో జరిగినట్లుగా భావించుట.

తల:—బరువు, వేడి. బ్రద్దలగుచున్నట్లుండుట. లేచుటవలన ఉద్రేకించు తలతిప్పు (నక్సువామికా, ఓపియం) ఇది తల అదిరిన ఎక్కువగుచుండుట. తల వెంట్రుకలు ఊడపీకుచున్నట్లు తల నొప్పిగాయుండుట. జలుబువలనవచ్చిన తలభారము.

కన్నులు:—ఎరుపు, వేడి, మంట. కనురెప్పలు వాపు, ఎరుపు, దళసరిగాను, గట్టిగాను ఉండుట. వెలుతురును చూచుట కష్టముగా నుండుట. ఆకస్మాత్తుగావచ్చిన గుడ్డితనము.

చెవులు:—ఎఱ్ఱగాను, వెచ్చగాను, వాపుగానుయుండుట. చెవిలోపోటు (కెమోమిల్లా). ధ్వనియందయిష్టము, చెవులలో హోరు, చెవిబ్రద్దలగుచున్నట్లుగా నొప్పి.

ముక్కు:—ఆఘ్రాణశక్తి ఎక్కువగుట, ముక్కుమొదటనొప్పి, నీరుకారుట, తుమ్ములు, దిబ్బడవేయుట, ఎఱ్ఱనిరక్తస్రావము. శీతగాలివలన గలిగిన రొంప. ముక్కులోని ఆంతుత్వచలు తడిలేక యుండుట లేక ముక్కునుండి కొద్దిగా నీరుకారుచుండుట.

ముఖము:—ఎఱ్ఱగాను, వేడిగాను, కందినట్లుగాను, వాపుగాను ఉండుట. ఎడమవైపున పార్శ్వపునొప్పి వచ్చుచుండుట. దౌడలలోనొప్పి. ముఖముకు సంబంధించిన నరములబాధలు. ఒకబుగ్గ ఎఱ్ఱగాను, రెండవబుగ్గ పాలిపోయినట్లుగాను ఉండుట. (ఇపెకాక్, కెమోమిల్లా). ముఖము ముడుచుకొని పోయినట్లుండుట.

నోరు:—నోరు చేదు-ఒకప్పుడు దుర్వాసనగా యుండుట పొడి గాను, తిమ్మిరిగాను. మొద్దుబారియుండుట. నాలుక తెల్లగాను (యాంటిం కూడ్రిక్), వాపుగాను, ఆర్చుకొనిపోయి, మంటగను, మరదతో మొద్దు బారియుండుట, దీనివలన మాట్లాడుట బహుకష్టముగాయుండి నత్తితో మాట్లాడుచుండుట. కొండనాలుక పొడుగై నాలుకకు తగులుచున్నట్లుండుట. ఇగుళ్ళువాపు, మంట, బాధ. పండ్లు చల్లదనమువలన మిక్కిలి బాధ, పోటుగానుండుట. నమలుచున్నట్లును అడుగుచౌడను ఎల్లప్పుడును కదల్చుచునేయుండుట. పండ్లు పటపటకొరుకుట.

కంఠము:—ఎరుపు. ఆర్చుకొనిపోవుట, ముడుచుకొనిపోవుట, మొద్దుబారుట, మంట, పోటు, గవదకాయలు వాపుతోను, పొడిగాను యుండుట. కంఠము వాచుట.

అన్నకోశము:—భయము, వేడి, విస్తారము చెమట, అతిమాత్రము తో కూడిన వమనములు. నీళ్ళుతప్ప తక్కినవన్నియు రుచికి చేదుగా నుండుట. అధికమైన దాహము. పానీయములు పుచ్చుకొనినపిమ్మట వమనము చేసుకొనుట; అపుడుకూడ చనిపోవుదునని చెప్పుట. రక్తము, పైత్యరసముతోగూడిన ఆకుపచ్చని వమనము లగుచుండుట. అన్నకోశము నుండి గొంతుకవరకు మంట. ఆహారము కంటపడినయెడల వమనము వచ్చుట. ఎక్కిళ్లు, త్రేపులు.

పొత్తికడుపు:—వెచ్చగాను, ఉబ్బరముగాను, గుల్లబారియుండుట. ముట్టుకొనినయెడల చాలబాధ. శూల. బొడ్డుప్రక్కలను మంట వెచ్చని పానీయము త్రాగుటవలన ఉపశమించుట (మెగ్నీషియా ఫాసు). ఏవైపునకు తిరిగిపరుండినను ఉపశమనము లేకుండుట.

మలము, మలాశయము:—ఇది రక్తగ్రహణికి దివ్యౌషధము. జిగటతో కలిసిగాని, విడిగాగాని, రక్తము వెడలుచున్నప్పుడును దీనితోపాటు మిక్కిలి బాధతోకూడి కొద్దికొద్దిగాను, తరుచుగాను, మలము వెడలుచుం

డుట, ఆసనము తీపు, పోటుగా యుండుట. పిల్లలకు వేసవికాలములో కలుగు నీళ్లవిరేచనములకును వీటి ననుసరించియుండు జ్వరము, నీరసము, నిద్రలేమి మొదలగువాటికి ఇది బాగుగా పనిచేయును. రక్తముతో కూడిన మూలశంఖ (హెమామెలిస్). రాత్రియందు ఆసనములో దురద, బాధ, పోటు. వమనము, అతిదాహము, మూత్రము బంధించుట. భయము, ఆతురత. జిగట, రక్తముతో కూడిన ఆకుపచ్చని కలరా విరేచనములు.

మూత్రావయవములు:—మూత్రము కొద్దిగాను, ఎఱ్ఱగాను, వేడిగాను, బాధతోను వెడలుట. మూత్రకోశద్వారములో మంట, తీపు. మూత్రనాళములో మంట. మూత్రము విడచునపుడు ఆతురత. మూత్రము బంధింపబడినపుడు విరామములేమి. బాధవలన కేకలువేయుచుండుట. మూత్రాశయము వాపువలన ఎక్కువబాధ, ఒకప్పుడు ఎక్కువచెమట. నీళ్ళవిరేచనములతో పాటు మూత్రము విస్తారముగా వెడలుచుండుట. జలుబువలన పిల్లలలో మూత్రము బంధింపబడి వారు మిక్కిలి ఏడ్చుచుండుట.

పురుష అవయవములు:—వృషణములు నలుగగొట్టినట్లునొప్పి, వాపు, గట్టిపడుట. సంభోగేచ్ఛతగ్గుట.

స్త్రీ అవయవములు:—రక్తపుష్టిగల పడుచుపిల్లలలో ఋతువు ఆగిపోవుట. జడుసుకొనుటవలన ఋతువు ఆగిపోవుట. ఋతుస్రావము అల్పముగాను, విస్తారముగాను వెడలుట. మరియు దీనితో పాటు ముక్కునుండి రక్తస్రావము. మర్మావయవము ఆరిపోయి వెచ్చగ, వాపుగ, బాధగ యుండుట. సూతికజ్వరము(దీనిలో 2x వాడవలెను). కుసుమ విస్తారముగాను, చిక్కగాను, పచ్చగాను అగుట. స్తనములలో నొప్పి, బాధతో గూడిన జ్వరలక్షణములు, తీవ్రమైన స్రావములు. ప్రసవానంతరము నొప్పులు ఎక్కువగాను, చాలకాలమువరకును ఉండుట.

శ్వాసావయవములు:—ఊపిరిపీల్చునపుడును, ముట్టుకొనినయెడలను స్వరపేటికలో మిక్కిలిబాధ. పొడిదగ్గు, మోతతో కూడిన గురక. స్వర

పేటికవాపుతో కూడిన దగ్గు. దగ్గునపుడు శ్లేష్మముతోపాటు రక్తముపడుట. శీతగాలివలనగాని, చల్లనిపానీయములవలనగాని, పొగాకుసంబంధమైనచుట్ట సిగరెట్టు మొదలైనవి ఉపయోగించుటవలనగాని, సాయంకాలమునను, తరుచు అర్ధరాత్రికి తరువాతను ఉద్రేకించుదగ్గులు. ఛాతీలో కుట్టుచున్నట్లుండుట. కుడిపార్శ్వమున పరుండుట కష్టముగానుండుట. దగ్గు బాధవలన పరుండలేక లేచికూర్చుండుట. గుండెలలో బరువు. రొమ్ము ఎముక (Sternum) క్రింద మంట. దద్దుర్లు అణచిపెట్టుటవలన వచ్చిన ఉబ్బసము. శీతగాలివలన వచ్చిన దగ్గులు. జలుబుతో కూడిన దగ్గులు.

హృదయము:— గుండె దడదడ. అస్థిమితము. ఆతురతతో గుండె కొట్టుకొనుచుండుట. ఎడమభుజములో నొప్పితో కలిసియుండు హృదయ బాధలు. గుండెలలో కుట్టుచున్నట్లునొప్పి, ఛాతీ ముడుచుకొనిపోయినట్లు బాధ. జ్వరములో నాడి బలముగా గట్టిగ పుష్టిగ యుండుట.

మెడ, నడుము:— మెడ నరముపట్టుట. భుజములమధ్య చితుక కొట్టినట్లుబాధ. వెన్నెముకలో బాధవలన శ్వాస తీసుకొనుట కష్టముగానుండుట. వీపున చీమలు పాకుచున్నట్లుండుట.

కాళ్లు, చేతులు:— ఇవి మొద్దుబారి తిమ్మిరిగాయుండుట. వ్రాయుచున్నప్పుడు వేళ్ళలో పురుగులు పాకుచున్నట్లుండుట. చేతులు మంచువలె చల్లగానుండుట. అరిచేతులలో చెమటపట్టుచుండుట. పిక్కలు లాగుచుండుట. ఒకప్పుడు చేతులు వెచ్చగాను, పాదములు చల్లగాను వుండుట. మహావాతమువలన వేళ్ళలో వాపు, వేడి, బాధ యుండుట; ఇవి రాత్రియందు ఉద్రేకించుట. వాచినచోట ఎఱ్ఱగా నిగనిగలాడుచుండుట.

నిద్ర:— తరుచు ఆవలింతలు. మందముగాను, నిద్రమత్తుగాను వుండుట. అర్ధరాత్రిమునకు పిమ్మట, అస్థిమితమువలనను, ఆతురతవలనను నిద్రలేమి (30 పొటెన్సీలో వాడుట మంచిది). నిద్రనుండి అకస్మాత్తుగా లేచుట. పగలు జరిగినవి, చూచినవి, అన్నియు రాత్రి కలలోనికివచ్చుట. శాంతిలేని కలలతో ముసలివారిలో రాత్రి నిద్ర సరిగా పట్టకపోవుట.

చర్మము :—ఎఱ్ఱని వాపు, నెచ్చదనము. పొంగులోవలె దద్దుర్లు. ఒకప్పుడు ఆర్చుకొనిపోయి తెచ్చగానుండుట. మొద్దుబారి యుండుట. ఒకప్పుడు మంటతో కూడియుండుట.

జ్వరము :—వేడి, విదాహము, మిక్కిలి ఆతురత, బాధతో అటు నిటు కొట్టుకొనుట. నాడి గట్టిగాను, పుష్టిగాను, త్వరితముగాను యుండుట. ఉష్ణజ్వరములయొక్క ప్రథమావస్థలో నిది బాగుగా పనిచేయును. ఇది రొంపతో కూడిన జ్వరములోను, పిల్లలకు పండ్లు వచ్చునపుడు వచ్చు జ్వరములోను, పేగులలో నులిపురుగులు మొదలయినవి యుండుటవలన వచ్చినజ్వరములోను, మేహవాత జ్వరములోను, ప్రసవానంతరము వచ్చిన జ్వరములోను, పైత్యజ్వరములోను, క్షయతో కూడిన జ్వరములోను, పొంగు, ఆటలమ్మ వీటిలోవచ్చు జ్వరములలోను అతివేడితో కూడిన అన్ని బాపతుల జ్వరములయొక్క ప్రథమావస్థలో బాగుగా పనిచేయును. మన్యపుజ్వరము, రక్తదోషమువలన కలుగు జ్వరము, మశూచికములోవచ్చు జ్వరము, సన్నిపాతజ్వరము—వీటికిది పనిచేయదు. చెమటపట్టినపిమ్మట దీనిని వాడనవసరమే లేదు.

ఉద్రేకము, :—శ్వాసకోశసంబంధమైన వ్యాధులలో సాయంకాల మందును; ఎడమనైపున పరుండుటవలనను, వెచ్చనిప్రదేశమునందుండుట వలనను, వెచ్చదనమునిచ్చు వస్త్రములను కప్పుకొనుటవలనను.

ఉపశమనము:—శరీరముమీద ఏమియు కప్పుకొనకుండుటవలనను, విశ్రాంతివలనను, చెమట పట్టినపిమ్మటను.

ఈఔషధముయొక్క దుర్గుణములను Vineger వినిగార్ లేక శెనగపులుసు మాన్పును. పుల్లనివస్తువులు, నైను, కాఫీ, లిమనేడు, పుల్లని రుచిగల పండ్లు తినునపుడు యీఔషధము అంతగా పనిచేయదు.

విరుగుళ్లు:—యాసిడుఎసెటిక్, కెమోమిల్లా, కాఫీ, నక్సువామికా.

ఇది-బెల్లడోనా, కేమోమిల్లా, కాఫి, స్పాంజియా, నక్సువామికా, పెట్రోలియం, సేపియా, సల్ఫరు, విరేట్రం అల్బం—లకు విరుగుడు.

సహచరులు :—ఆర్నికా, జెల్లసోనా, బ్రియోనియా, ఇపెకాక్.

మోతాదు :—3 మొదలు 200 పొటెన్సీ.

---

## 6. యాక్టియా స్పైకేటా. ACTAEA SPICATA.

జమసుకొనుటవలనను, అలసటవలనను వచ్చిన రోగములకు ఇది వాడ తగినది. కుడిభుజము, గుత్తి పీటిలోకలుగు మేహవాతనొప్పుల నిది మాన్పును. చిన్నచిన్న వేళ్లసందులలో చీల్చుచున్నట్లును, లాగుచున్నట్లును వుండు నొప్పులు అలసటవలన ఎక్కువగుచుండుట. మరియు నివి అకస్మాత్తుగా వచ్చుచుండుట. ఒకప్పుడు నొప్పులు ముఖమునకు కూడ వ్యాపించుచుండుట. ఫుప్పిపండ్లనుండి నొప్పులు కనుబొమలలోనికి వ్యాపించుచుండుట. ఇది పురుషులకు బాగుగా పనిచేయును. మరియు యాక్టియా రేసిమోసా (లేక సిమిసిఫ్యూగా రేసిమోసా) స్త్రీలకు బాగుగా పనిచేయును.

మనస్సు:—రాత్రిపరుండినపుడు చనిపోవుదునేమోయని భయముతోచుట. మానసికపరిశ్రమలవలనవచ్చిన రోగగుణములు. విపరీతమైనసంధి.

తల:—త్రాగినవానికివలె దిమ్ముగానుండుట. తలభారము రాత్రియందును, నడచుటవలనను ఎక్కువగుట, నొప్పి కనుబొమలవరకు వ్యాపించుచుండుట, దీనితో ముక్కునుండి నీళ్లవంటి స్రావము నెడలుట.

కన్నులు:—అన్నివస్తువులును నీలిరంగుపూసినట్లగుపడుట.

అన్నకోశము:—చీల్చుచున్నట్లు, పొడుచుచున్నట్లువుండుట. బాధతోకూడిన పుల్లని వమనములు. పుట్టచర్మము.

మూత్రావయవములు:—మూత్రపిండములవద్ద నొప్పి. మూత్రములో తెల్లని మడ్డివంటిపదార్థము, సన్నని రాళ్లు పోవుచుండుట.

శ్వాసావయవములు:—చలిగాలివలన శ్వాస కష్టముగా నుండుట. ఛాతీలో నొక్కివేయుచున్నట్లు నొప్పిగానుండుట. రాత్రియందు శ్వాస సరిగానుండకపోవుట. ఒకప్పుడు శ్వాస సరిగా అందకపోవుట.

కాళ్లు, చేతులు:—నడచినపిమ్మటను, అలసటవలనను, నొప్పులు వాపులు ఎక్కువగుట. చీలమండలు, బొటనవ్రేళ్లు, గుత్తులు, వ్రేళ్ళు మోచేతులు-నీటిలో మేహవాతనొప్పులు (కాలోఫైలం).

జ్వరము:—జ్వరములో భయముతోకూడిన వణకు వెచ్చనయు, వమనములును వచ్చుట. సంధి ఎక్కువగా నుండుట.

వృద్ధికము:—తాకుడువలన, కదలికవలన, చల్లగాలివలన.

ఇది-నక్సవామికా-కుసిక్మట బాగుగా పనిచేయును.

పోలికలు:—ఆర్నికా, బ్రియోనియా, రూస్టాక్స్, కాలోఫైలం, లైకోపోడియం.

మోతాదు:— 3 మొదలు 30 పొటెన్సీ.

---

## 7. ఎడోనిస్ వెర్నలిస్. ADONIS VERNALIS.

మూత్రిసంబంధమైన రోగములుగాని, మేహవాత రోగములుగాని, విషపడిశెముగాని, వచ్చినపిదప హృదయములోని కండరములు క్రొవ్వు వంటి పదార్థముగా మారిపోయి హృదయము చెడిపోయినవారికిది బాగుగా పనిచేయును. అట్టివారికి నాడి సరిగానుండదు. మూత్రము తక్కువగా యగుచుండును. హృదయము వాపు, బలహీనముతో కూడియుండును. ఇట్టి రోగులు బహునిస్త్రాణగా యుందురు. హృదయములో బలము తగ్గి యుండును, నాడి మందముగాను, నీరసముగాను వుండును. హృదయమునకును ఛాతీకిని నీరుపట్టును. కాళ్ళు, ఇతర అవయవములు ఉబ్బును. అట్టి వారికి దీనిని వాడినయెడల హృదయమునకు బలమునిచ్చి, బాగుపరచి, మూత్రమును వృద్ధిచేసి, ఉబ్బులను మాన్పును. డిజిటాలిసువలెగాక దీనిని వాడినయెడల అపాయ మేమియును లేదు.

హృదయము:—హృదయరోగము ననుసరించియుండు ఉబ్బసము. హృదయమున మేహవాతదోషమువలన కలిగిన నాడీ వేగమును, మందము

నుకూడ మాన్పి హృదయమును సరియైన స్థితిలోనుంచును (కాల్మియా లేటిఫోలియా). గుండెదడ, వూపిరాడకపోవుట.

అన్నకోశము:—బరువుగా నున్నట్లుండుట. అతిఆకలి.

మూత్రము:—తక్కువగా నగును. శ్వేతధాతువు కలిసియుండుట. మూత్రముపట్టి చూచినయెడల దానిపైని నూనెవలె తేలియుండుట.

శ్వాసకోశములు:—గుండెలలో బరువు. శ్వాసపీల్చుట కష్టము.

నిద్ర:—విపరీతమైన కలలు, వీటివలన అస్థిమితము.

కాళ్ళు, చేతులు:—నీరుపట్టుట. నడుమునొప్పి, కొయ్యబారుట.

పోలికలు:—డిజిటాలిస్, క్రెడేగసు, కన్వల్లేరియా, స్ట్రోఫాంతసు.

మోతాదు:—5 మొదలు 10 చుక్కలు మదరుటించరు.

---

## 8. ఎస్క్యులసు హిప్పో. AESCULUS HIPPOCASTANUM.

విరేచన బద్ధమున్నను లేకున్నను, నడుమునొప్పితోనుండు మూలశంఖ. ♦ మూలశంఖ వేరుశెలగకాయల వురవను, వూదారంగుగాను, మంటగను, పోటుగను, ఆసనములోపలనే (వెలుపలకురాకుండగ) యుండుట. ♦ విచారము, చిరచిర—యివి ద్వంద్వముగాగాని విడిగాగాని గలుగుచుండుట. ♦ సిరలుబ్బుట, మరియు సిరల సంబంధమయిన పుండ్లు—వీటినంచవలు నీలిరంగుగా నుండుట. ♦ పొత్తికడుపులోను, ప్రేగులలోను నొప్పులు, బాధలు—ఇవి అజీర్ణముతోను పొట్ట వుబ్బరించుటతోను యుండుట. ♦ విరేచనానంతరము బాధ. ♦ ముందుకు వంగినను, నడచినను, వెన్నెముక దిగువను తుంట్లలోను తీవ్రమగు బాధవచ్చుట. గొంతుకనొప్పి ♦ ఆసనము చిన్నచిన్న పుడకలతో నింపబడినట్లువలెను, పొడిగా యున్నట్లువలెను బాధగానుండుట. ♦ ముదరరంగుగను, చిక్కగను, కదలినచో నడుములో అతిబాధతోను, ఒరుపును గలుగజేయుచు వెడలు కుసుమ.—ఇవి దీని ప్రధాన లక్షణములు.

మనస్సు:—చిన్నపిల్లలు నిద్రలో వులికిపడి కంగారుతో మేలకువ జెందుట (లైకోపోడియం). మందముగాను, విచారగ్రస్తముగాను, కోపముగాను వుండుట. మనస్సు నిలకడయుండకపోవుట.

తల:—మిక్కిలి భారము. వెనుకభాగమందు బ్రద్దలగుచున్నట్లు నొప్పి. నుదుటియందును కుడికంటిమీదను నొప్పి. పార్శ్వపునొప్పి—ఇది కుడివైపునుండి యెడమవైపుకు పొడుచుచుండుట. కూర్చుని లేచినయెడల తలభారము యెక్కువగుట.

కన్నులు:—మిక్కిలియెఱ్ఱబారుట, నీళ్లుకారుచుండుట, మంటలుగానుండుట. గుండ్లలోనొప్పి, బాధ, పోటుగా నుండుట. కండ్లరోగములు మానినపిమ్మట కండ్లలోని దుష్టరక్తనాళములవాపులు.

ముక్కు:—ఆరిపోవుట. పీల్చునపుడు గాలి చల్లగా నుండుట. తుమ్ములు. దీనివెనుక ముక్కునుండి నీళ్ళుకారుట.

నోరు:—నాలుకమీద తెల్లని లేక పసుపుపచ్చని పూత. చిక్కని, పసుపుపచ్చని శ్లేష్మము నోటినుండి వెడలుచుండుట. లాలాజలము ఎక్కువగా వూరుచుండుట. నాలుకమీద కాలినట్లువలె పుండ్లు.

కంఠము:—పొడిగాను, వేడిగాను, ఒరుపుగా నున్నట్లుండుట. గుటకవేయునపుడు చెవిలో పొడుచుచున్నట్లుండుట. గొంతుకలోమంట నప్పపనలోని దుష్టరక్తనాళములు వాచి బాధగానుండుట. తియ్యని రుచితోకూడిన తీగెవంటి శ్లేష్మమును క్రిందిక్రించి ఉమ్మివేయుచుండుట.

అన్నకోశము:—ఎడతెగని వమనము, ఓకరింపు. అన్నకోశములోపుండు, దీనితోపాటు వమనములు తేన్పులు భోజనమైన మూడు గంటలకు కడుపులో రాయివలె బరువుగానుండి కొరుకుచున్నట్లు, పొడుచుచున్నట్లు, నొప్పిగా నుండుట.

పొత్తికడుపు:—బొడ్డుదగ్గరనొప్పి. కామెర్లు. పొంగరింపు. మూలశంఖతోకూడిన శూల. గిలకవలన కుడివైపున కోయుచున్నట్లుండుట. కాలేయమువద్ద నిండుగాను, ముట్టుకొనినయెడల నొప్పిగాను వుండుట.

మలము, మలాశయము:—మూలశంఖకు, నక్సువామికా, సల్ఫరు, కాలినోస్నియాలనువాడి, అవిపని చేయనపుడు యిది వాడినయెడల బాగుగా పనిజేయును. మలము బెడదినపెమ్మట మిక్కిలిబాధ, మలాశయము వెలుపలకు వచ్చుట. ఆసనములో కత్తితో పొడుచుచున్నట్లు మూలశంఖ వలని బాధ. మూలశంఖతో రక్తస్రావము.

మూత్రావయవములు:—మూత్రము వెచ్చగాను, యిటికపొడి రంగుగాను, మడ్డితోను వెడలుట. ఎడమ మూత్రపిండములో నొప్పి.

పురుషఅవయవములు:—నిద్రలో స్ఖలనములు. మలము వెడలునపుడు ప్రాస్టేటుగ్రంధినుండి స్రావము.

స్త్రీ అవయవములు:—సాధారణముగా మాననటువంటి (నిలుచగా యున్న) చిక్కని, పసుపుపచ్చని కుసుమ, దీనితో నడుమునొప్పి. బహిష్టు అయినపిమ్మట కుసుమసంబంధమైన ఎక్కువస్రావము.

శ్వాసావయవములు:—గుటక వేయునపుడును, గట్టిగా ఊపిరిపీల్చునపుడును, దగ్గు యెక్కువగుట. ఛాతీలో ముడుచుకొనిపోయినట్లుండి నొప్పిగా నుండుట. వెచ్చదనము. కాలేయదోషముతో దగ్గువచ్చుట. ఊపిరి ఆడకపోవుట. ఉదయమున శ్లేష్మము ఎక్కువగానుండుట. దగ్గువలన గొంతుక బొంగురుపోవుట.

హృదయము :—మూలశంఖ ననుసరించివచ్చిన హృదయరోగములు.

మెడ, నడుము :—మెడనొప్పి, వెన్నెకములో బలము తగ్గుట. నడుము నొప్పి నడచినను, ముందరకు వంగినను ఎక్కువగుట. తుంట్లలో నొప్పి.

కాళ్లు, చేతులు :—అన్ని కీళ్లసంధులలో నిలువగాయున్న మేహవాతపు నొప్పులు. తొడలమీదను కాళ్లమీదను కలిగిన దుష్టరక్తనాళముల వాపులు. మోకాళ్ళువాపు, బాధ, వంగకపోవుట.

జ్వరము :—సాయంకాలము 4 గంటలకు చలి తీవ్ర పొడుగునను వుండుట. జ్వరము రాత్రి 7 గంటలు లగాయతు 12 గంటలవరకును,

చర్మము వేడి, ఆర్చుకొనిపోవుటతోను యుండుట. చెమట వచ్చగాను, ఎక్కువగాను వుండుట.

శ్వాసావయవములు, మెదడు, మున్నగు అవయవములలో రక్తమెక్కువగా జేరియుండుటచే అవి నిండుగానుండుట.

వుద్రేకము :—నడచుటవలన, వర్ష కాలములో, ఉదయమున లేచిన పిమ్మట, విరేచనము పిమ్మట, భోజనానంతరమున, మధ్యాహ్నమున.

వుపశమనము :—చల్లగాలివలన, వేసవిలో, మూలశంఖునుండి రక్తము స్రవించినపిదప.

పోలికలు :—ఏలోస్, కాలిన్సోనియా, నక్సువామికా, సల్ఫరు, ఇగ్నేషియా, యాసిడుమూర్, నిగండియం అమెరికానమ్.

మోతాదు :—3 మొదలు 200 పొటెన్సీ.

బాహ్యోపయోగములు :—రక్తము వెడలునట్టియు మరియు రక్తము వెడలనట్టియు మూలశంఖకును, వెన్నెముక దిగువభాగమందు బాధ యున్నపుడును, వెన్నెముకవద్దను కాలేయమునందును వాపులకును; పురీష నాళములోని పుండ్లకును, దీనిని పైకివాడవచ్చును.

---

## 9. ఎథూజా—సైనాపియం. AETHUSA-CYNAPIUM.

వేసవికాలమునకు సంబంధించిన రోగలక్షణములమీదను, చిన్నబిల్లలకు పండ్లువచ్చు కాలమునగలుగు రోగలక్షణములమీదను, పసిబిల్లలకును ముసలి వారికిని వచ్చు కలరాలక్షణములమీదను, పైత్యతత్వముగలవారి రోగలక్షణములమీదను ముఖ్యముగా వాడతగినది.

ఆతురతను బాధను తెలియజేయుచున్నట్లు ముక్కుశోణములు ఎగలాగుకుపోవుట. ● పాలనే ఆహారముగా త్రాగు చంటిపిల్లలకు పాలు సరిపడకపోవుట మరియు వారు పాలనుత్రాగినవెంటనే కక్కివేయుట, అటుపిమ్మట నీరసమువలన మగతి జెందుట. ● బిళ్లబిళ్లలవలె పాలను, జున్నువలెనుండు పదార్థము

ను కష్టపడుట లేక వమనము చేసుకొనుట. ♦ అతినిస్త్రాణవలన బిడ్డ తనతలను నిలప లేకపోవుట మరియు నిలువుండ లేకపోవుట. ♦ పిల్లలకు పండ్లువచ్చుకాల మునకు కంపములువచ్చుట. కంపములతో బొటనవేళ్లు ముడుచుకుపోవుట, ముఖము ఎర్రబడుట, చూపు దిగునదై పునకు మారుట, కంటిపాపలు పెద్ద వగుట మరియు నివి కదలకుండుట, తేరబారిచూచుట, నోటివద్దనురగలు వచ్చుట, పండ్లు గట్టికరచుకుపోవుట, నాడి వేగముగను, చిన్నదిగను, గట్టి గను యుండుట—ఇవి దీని ముఖ్యలక్షణములు.

ఇది పిల్లలలోకలుగు కలరా (Cholera Infantum)కు అనగా వమనములు, వాంతులను కట్టుటలో అమోఘముగా పనిచేయును. పాలు త్రాగుటవలన వమనములగువారికిని, పాలు సరిపడనివారికిని బాగుగా పని చేయును. ఇది పిల్లల వమనములను కట్టును. పాలు పట్టినవెంటనే కక్కు కొనుట, లేదా పాలు ఇమిడినయెడల మరికొంతసేపటికి బిళ్లలవలె బహు కష్టముతో వమనమగుట. ఇట్టిస్థితిలో పాలుపట్టుటను ప్రస్తుతము మానని యెడల తుదకు ఆలక్షణములు కలరాలోనికి మారును. బిడ్డ అజీర్ణవిరేచన ములు, వమనములు మగత—వీటితోకూడిన రోగములో మునిగియున్నను మధ్యమధ్యను పాలు త్రాగుచున్నదిగదా యని బిడ్డకు భయములేదనుకొని యెదరు ఇది మిక్కిలి పొరపాటు. అట్టి స్థితిలో పాలు త్రాగుచుండుట రోగలక్షణమేగాని ఆరోగ్యచిహ్నముగాదు. ఇది వెంటనే సరిగా గుర్తిం పనిచో ప్రమాదము తటస్థించగలదు.

మనస్సు:—అస్థిమితము, ఆతురత, ఏడ్పు గలుగుట. తెలివితప్పి యుండుట. పరాకుమాటలు వచ్చుట. తనగదిలో ఎలుకలు, పిల్లులు పారుచున్నట్లు అస్వాభావికమైన ఊహలు తోచుట. ఇట్టి చిత్తభ్రమ యీ ఔషధసేవవలన తగ్గును.

తల:—విరేచనమైనపిదపను, అపానవాయువువెడలిన తరువాతను తలభాగము మొదలగు రోగగుణము లుపశమించుట (శాంగ్వినేరియా). తలనొప్పి, నిద్రమత్తు. తలనొప్పితగ్గినను తలవేడి తగ్గకపోవుట. నొప్పి

ముచ్చిలిగుంటలో ప్రారంభించి మెదడు నుండి వెన్నెముక దిగువ భాగమువరకును వ్యాపించుట.

కన్నులు:— మానని కండ్లకలక. కండ్లఎరుపు, వాపు.

చెవులు:—దురద, పోటు, పచ్చనిస్రావము.

ముక్కు:—చివరను తామరవలె బయలుదేరుట.

నోరు:—నీరూరుచుండుట. నెమ్మదిగా మాట్లాడుట. నాలుక తేమగాను, తెల్లగానుఉండుట. ఎక్కిళ్లు విడిచి విడిచి వచ్చుచుండుట.

అన్నకోశము:—పెద్ద పెద్ద వమనములగుట. వీటివలన కడుపులో బాధగానుండుట. యీబాధ ఏమిటియో చెప్పలేకపోవుట. ఉద్రేకము వలనను, మానసికరోగముల వలనను ఆహారము జీర్ణముకానపుడు యిది బాగుగా పనిచేయును. ఆహారమును చూచినఎడల వమనము వచ్చుట. ఎల్లప్పుడును చిరుతిండి తినుచుట్టివారిలో కలుగు అజీర్ణమును మాన్పును. చంటిపిల్లలలో పాలు పడకపోవుటవలనను, పండ్లు వచ్చు కాలమందును, వేసవియందును కలుగు అజీర్ణమును, అజీర్ణవిరేచనములగుటను మాన్పును. వమనములలో ఆకుపచ్చని ఆమము వెడలుట, వమనములతోపాటు విరేచనములు కూడ ఆకుపచ్చగాను లేక రక్తజీరతో కలసిగాని పోవుట. వమనానంతరము దేహము చల్లబడుట. మగత (మెగ్నీషియాకార్బ). వమనములు అయినపిమ్మట తిరిగి ఆకలిగొనుట.

మలము మలాశయము:—నీళ్ల విరేచనములు ఆకుపచ్చగాను, అతితీవ్రగను, కోయుచున్నట్లు బాధతోను, వెడలుట రక్తవిరేచనములు.

జ్వరము:—జ్వరములో దాహము లేకపోవుట. చమటయున్నను కప్పుకొనుటకు యిష్టము. ఉదయమున జ్వరము వచ్చుట.

నిద్ర:—పిల్లలలో నిస్త్రాణవలన నిద్ర వెంటనేవచ్చుట.

ఉద్రేకము:—మలవిసర్జనానంతరము, వమనానంతరము, తెల్లవారుజామున 3, 4 గంటలకు, సాయంకాలమందు, వెచ్చదనమువలన, వేసవిలో, భోజనానంతరము, పానీయములు త్రాగినపిమ్మట.

ఉపశమనము:—బహిరంగగాలిలో, సహవాసకులవలన, నిద్రకుపిదప.

సహచరులు:—కాల్కేరియాకార్బ.

పోలికలు:—ఆర్సెనికంఆల్బం, ఇపెకాక్, సేపియా, సిక్యూటా, కోనియం, యాంటింకూడం, కాల్కేరియాకార్బ, మెగ్నిషియాకార్బ.

“ఓపియం” నకిది విరుగుడు.

విరుగుళ్లు:—సిక్యూటా, కోనియం, బోరిస్టా, యాంటింకూడం, క్రియసోటం, లోబీలియా ఇన్ఫ్లేటా, మెర్క్యూరియస్.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ

---

## 10. ఎగేరికసు. AGARICUS MUSCARIUS.

అస్థిమితము, లేతరంగు దేహచ్ఛాయ, నీరసముగనుండు పలుచని శరీరముగల రోగులకును, రక్తప్రసారము మందముగానుండు వయోవృద్ధులకును ఇది యెక్కువ వుపయుక్తమైనది.

అధికసంభోగము, మంచు, జలుపు, యెండ, మానిసికపరిశ్రమ, మానసికోద్రేకము, కాఫీ, టీ, పుగాకు, తాగుడు, రక్తమువిషతుల్యమగుట—వీటివలని దోషములకిది ముఖ్యముగా వాడదగినది.

వెన్నెముకను తాకుట బాధకరముగానుండుట. ♦ విద్యుచ్ఛక్తివంటి యొకశక్తివలన వలె కలుగుకంపరకంపములు మరియు యీడ్పులు, గంతులు. ♦ తేమలోనానుటవలన వలె అవయవములు మంటలుగను, దురదగను, ఎఱ్ఱగను యుండుట. ♦ వెన్నుపామునందు తీవ్రమైన మంటలు, పొడుచుచున్నట్లు బాధలు బయలుదేరుట. ♦ వెన్నెముక పొడుగున చీమలుపాకుచున్నట్లుండుట. ♦ శరీరము మంచుగడ్డ కగిలినట్లు లేక మంచుతో చేయబడి సూదులు గుచ్చుచున్నట్లు భావనగలుగుట. ♦ కొరియారోగలక్షణములు ప్రవేశించుట, దీనిలో అప్రయత్నముగాను కండరములు రోగియొక్క స్వాధనము

తప్పుటకోను, రోగి గంతులు వేయునట్లగుట. ● పరాకుమాటలాడుట. ● బిడ్డలు మానసికముగాను శారీరకముగాను వృద్ధిపొందకపోవుట బిడ్డ నడచుటను, మాట్లాడుటను ఆలస్యముగా నేర్చుకొనుట. మరియు, ఒకసారి తెలివితక్కువగాను మందముగాను, మరియొకసారి ఎక్కువ చురుకుగను, తెలివిగను కనబడుచుండుట — ఇవి దీని ముఖ్యలక్షణములు.

మనస్సు:—వ్యతిరేకస్వభావము. పరిశ్రమయందు అయిష్టత. నిర్భయత్వము. సంధిలో కేకలు, పాటలు, గొణుగుకొను ౨. పాక్కులతో కూడిన చర్మవ్యాధి నణచిపెట్టినందువలన వచ్చిన మూర్ఛ (పల్ఫరు, సోరినం). కంపము మొదలయినవి నిద్రలోనుండవు.

తల — సూర్యరశ్మివలనను, నడకవలనను తలతిప్పు వచ్చుట. త్రాగుబోతుల తలనొప్పులు. ఆఫీసు గుమస్తాలలో ఎల్లప్పుడును ఒకచోటనే కూర్చుండి వ్రాయుచుండెడివారిలో గలుగు తలనొప్పులు. నుదిటిలో మేకు కొట్టినట్లు నొప్పిగానుండుట (ఇగ్నేషియా, కాఫీ). వెచ్చదనముకై తలను కప్పుకొనవలెనని యుండుట (సైలీషియా). ఎడమపార్శ్వమునొప్పి.

కన్నులు:—విశేషఉపయోగమువలనచూపు కష్టముగాలేక బాధగా నుండుట. చదువుచున్నప్పుడు అక్షరములు కదులుచున్నట్లు అగుపడుట. ఒకవస్తువు రెండుగా అగుపడుట (జెల్సిమియం). దృష్టిమాంద్యము. కండ్ల చికిలింపు, దురద, మంట, పుసులు, ఎరుపులు—వీటిని మాన్పును.

చెవులు:—చలికొనిపోయినట్లు మంట, దురద. చెవులలో ధ్వనులు.

ముక్కు:—చీదుటతో ముక్కునుండి రక్తస్రావము.

ముఖము:—బిగకట్టినట్లుండుట. దురదలు మంటలు.

నోరు:—కంఠము, పెదవులు వంటగా యుండుట. చల్లగాలిచే ఎక్కువగువట్టి పండ్లసలుపు, పోటు. ఐదాహము, నాలుక ఆర్చుకొనిపోవుట. గుటకవేయుట కష్టముగానుండుట. నాలుకపై తెల్లనిపూత. ఇగుళ్ళనుండి రక్తస్రావము.

అన్నకోశము:—అమితఆకలి, కడుపు ఉబ్బరింపు, త్రేనుపులు, భోజనానంతరము మూడుగంటల పిమ్మటను మంటగానుండుట, పిదప కడుపులో బరువుగానున్నట్లుండుట. కాలేయమువద్ద పోట్లుతో కూడియున్న అజీర్ణబాధలు ఎక్కిళ్లు, వికారము, వమనములు.

పొత్తికడుపు, మలాశయము:—కాలేయములోను ప్లీహములోను గుచ్చుచున్నట్లు నొప్పి (సీవోతము). కడుపు ఉబ్బరము, ఎక్కువ దుర్వాసనగానుండు అపానవాయువు మలము వెడలుట. ఆసనము దురద.

మూత్రావయవములు:—పోటు, బాధ. తరుచు అల్పాచమానము అగుచుండుట, అకస్మాత్తుగా మూత్రవిసర్జనము చేయుచుండుట.

పురుష అవయవములు:—లేపనము లేకున్నను సంభోగేచ్ఛ ఎక్కువగయుండుట. స్ఖలనము స్వల్పముగా నుండుట.

స్త్రీ అవయవములు:—ఎక్కువ ఋతుస్రావము. ఋతువు మామూలుకన్న త్వరలోనగుట. ఋతుశూల. ఎక్కువైన సంభోగేచ్ఛ, దురదతోకూడిన కుసుమ, మర్మావయవములో దిగలాగుచున్నట్లుండు అపరిమితమైన బాధ-ఇవి ముట్లుడిగినవారిలో ముఖ్యముగా నుండుట.

శ్వాసావయవములు:—తుమ్ములు వచ్చినపిమ్మట దగ్గు ఉపశమించుట. భోజనానంతరము ఉద్రేకించు దగ్గు. దగ్గుచున్నంతసేపును తలలో నొప్పిగానే యుండుట. గుండెలలో బరువు, ఆయాసము, ఊపిరిపీల్చుట కష్టముగానుండుట.

నిద్ర:—చర్మము, దురద, మంటవలనను నిద్రలేదు. పగటివేళయందును ముఖ్యముగా భోజనానంతరమునను నిద్రమత్తుగా నుండుట.

మెడ, నడుము:—మెడ నరముపట్టుట. నడుములో నొప్పి. వెన్నెముకలో కరుక్కుమని శబ్దమగుట.

కాళ్లు, చేతులు:—పక్షవాతమువంటి నరములసంబంధమయిన రోగములకిది దివ్యౌషధము. ఎడమకాలు కుడిచేయి లేక ఎడమచేయి కుడికాలుకు పక్షవాతము వచ్చుట. బాధలు-తిమ్మిరి, మొద్దుబారుట, చల్లదనము,

దురద, మంట, ఎరుపుతోను కూడియుండుట. చేతులవేళ్లు వాచుట. కండరములు ముడుచుకొనిపోవుట. కాళ్ల ఒరుపులకు బాగుగా పనిచేయును. కీళ్లు వంగకపోవుట. పాదములలో తిమ్మిర్లు.

జ్వరము :— సాయంకాలమందు ఉడుకు తగులుచుండుట. విస్తారము చెమట. అక్కడక్కడ శరీరములో మంటలు. సన్నిపాతజ్వరములోను సంధిలోను రోగి మంచముమీదనుండి లేచిపోజూచుట.

ఉద్రేకము :— సంభోగానంతరము, బహిష్టులో, ఉదయమున, చల్లగాలిలో, భోజనానంతరము, చలిగాలివలన, ఆలోచనచేయుటవలన.

ఉపశమనము :— నెమ్మదిగా నడచుటవలన, పడకవేడిమివలన.

పోలికలు—: బొవిస్టా, సిమిసిఫ్యూగా ఓపియం, కెన్నబిస్ ఇండికా, స్ట్రామోనియం, కాఫీ, సిక్యూటా, విరేట్రం ఆల్బం, ఆర్సెనికం ఆల్బం.

విరుగుళ్లు :— యాబ్సింతియం, కాఫీ, క్యాంఫరు, కాల్కేరియా కార్బ్, పల్సటిల్లా, రూస్టాక్స్, నూనె, వైను, బ్రాందీ, కేంఫరు.

మోతాదు :— 3 మొదలు 2(0 పొటెన్సీ. చర్మరోగములలోను మెదడుకు సంబంధించిన రోగములలోను తక్కువ పొటెన్సీలలో వాడుట మంచిది. దీని గుణకాలపరిమితి నలుబది దినములు.

---

## 11. యాగ్నస్ కేస్టసు. AGNUS CASTUS.

నపుంసకత్వమును మాన్పుటలో యిది అగ్రగణ్యమైనది (లైకోపోడియం). ఇది శోషరససంబంధమైన (Lymphatic) తత్వములమీద బాగుగా పనిచేయును.

చిన్నవయస్కులు చిన్నతనములోనే తమ సంభోగశక్తిని దుర్వినియోగము చేయుటవలన వారి సత్వములు చెడిపోయి, వయోవృద్ధులవలె నగుట. అట్టివారికి కఠినమైన మానసిక దోషములు, అస్థిమితము, అతినిస్త్రాణ,

తరుచు రేతస్ఖలనములు అగుట, తననే తాను దూషించుకొనుట, విచారము మున్నగు లక్షణములు గలుగుట. ♦ సంభోగవాంఛ తగ్గుట లేక నశించుట. పురుషావయవము కృశించుటకో. శృంగార సంబంధమైన ఆలోచనలు సహితము లేపనమును కలిగించలేకుండుట. వృషణములు చల్లగను, గట్టిగను, బాధగను, వాపుగను యుండుట.

మనస్సు:—పరధ్యానముగానుండుట. నరములనిస్త్రాణతో బాధపడు యువకులలో, పురాకు వుపయోగమువలన కలిగినగుండెదడను పోగొట్టును. రోగి విచారగ్రస్తముగానుండితనకు మరణము త్వరలోనే రాగలదనియు, ఇంతలో తాను ఏమియు చేయగలిగినది లేదనియు అనుకొనుట. జ్ఞాపకశక్తి తగ్గుట ఒక్కొక్కప్పుడు జ్ఞాపకముంచుకొనవలెనన్నను దానిని రెండుసార్లు చదువవలసి వచ్చుట (లైకోపోడియం, యాసిడ్ ఫాస, సేపియా). మనోనిశ్చలత లేకపోవుట, వాసన(సువాసనగాని, దుర్వాసనగాని) వేయుచున్నట్లు తలచుచుండుట. దూరపుఆలోచనతోచకపోవుట. జ్ఞాపకశక్తితగ్గియుండుట.

కండ్లు:—పాపలు పెద్దగుట (బెల్లడోనా). కండ్లు దురదలు.

చెవులు:—వినపడకపోవుట, చెవులలో హోరు.

నోరు:—వేడియైన ఆహారపానీయములవలన పండ్లుసలుపుట.

ఛాతీ:—రొమ్ముకవద్దనొప్పి, గట్టిగా ఊపిరి పీల్చినపుడు ఎక్కువ భారముగా నుండుట.

పొత్తికడుపు:—నొప్పి, ప్లీహముషాచుట. ఆసనములో లోతైన (Fissure of anus అనబడు) పుండ్లు. మలము పల్చగానున్నను మలబద్ధముండుట. నిద్రయందు కడుపులో గుడగుడలాడుట.

మూత్రావయవములు:—తరుచు మూత్రవిసర్జన.

పురుషఅవయవములు:—సంభోగేచ్ఛ, మరియు లేపనము తగ్గుట లేక పూర్తిగా నశించుట. సంభోగక్రియను సంబంధించిన ఆలోచనలు మనస్సునందు ఎన్ని కలిగినను అంగదౌర్బల్యము అగుపడుట. వృషణములు చలిబొనిపోయి గట్టిపడి, వాచి బాధగానుండుట. పురుషావయవము

సన్నగిలి ముడుచుకొనిపోవుట. నపుంసకత్వము. సంభోగశక్తిగాని వాంఛగాని యుండకపోవుట (కెలేడియం, సిలీనియం). జీర్ణించిన శగరోగము మలవిసర్జనకాలమున స్రావిస్టేటుగ్రంథి సంబంధమైన స్రావము. శెగసంబంధమైన పచ్చని స్రావము. పలుసార్లు శెగరోగము తగులుచుండుట. హస్తప్రయోగమువలన కలిగిన నిస్త్రాణ. మేహవాతపు నొప్పులు. వివాహము కానివారిలో కలుగు నరముల నిస్త్రాణను, శుక్లనష్టమును మాన్పును. ముసలితనములో పడుచువానివలె నటించు నపుంసకులకు చాల ఉపయోగమైనది. పలుసార్లు శెగరోగము తగులుటవలన కలిగిన నపుంసకత్వము. శెగరోగము అణచిపెట్టబడినందున కలిగిన దుర్గుణములు (మెడోరినం).

స్త్రీ అవయవములు:—రంగులేనట్టి కుసుమ. యిది తగిలిన చోట బట్ట పసుపురంగుగానగుట. స్తన్యము తగ్గిపోవుట లేక అసలే లేకపోవుట (ఎసఫాటీడా, లేక్ కేనినమ్, లేక్ డిఫ్లోరేటం) విచారగ్రస్థముగానున్నప్పుడు స్తన్యము సరిగా నుండకపోవుటను మాన్పును. సంభోగేచ్ఛ నశించుటను మాన్పును. గర్భాశయము వెలుపలికివచ్చుటను, కోడిగుడ్డులోని తెల్లని సొనవంటి కుసుమను మాన్పును. ఋతువు ఆగిపోయి సంభోగేచ్ఛలేనట్టి స్త్రీలలో కలిగిన వంధ్యత్వమును పోగొట్టును. మావిని వెలువరించుటలో చాల సహాయపడును. అపస్మారము (హిస్టీరియా) తోకూడిన గుండెదడ. ముక్కునుండి రక్తస్రావము.

కీళ్లు:—ఎముకలు గూళ్లలోనుండి తప్పించుకు పోయినంతటి నొప్పి.

జ్వరము:—నాడి సన్నగాను, నిస్త్రాణగాను ఉండుట. చలి, వణకుగాను లోపలను, పైకి శరీరము వెచ్చగాను ఉండుట. చేతులు చల్లగానుండుట. తరచు అవయవములు వెచ్చగాను, ముఖ్యముగా ముఖము కందబారి, వెచ్చగాను ఉండుట, బహిరంగమైన గాలిలోనడుచుచున్నపుడు చేతులకు చమటపట్టును.

నపుంసకత్వమును పోగొట్టుటలో దీనివెనుకను, కెలేడియంగాని సిలీనియంగాని వాడినయెడల బాగుగా గుణమిచ్చును.

పోలికలు:—సిలీనియం, యాసిడ్ ఫాసు, లైకోపోడియం.

విరుగుళ్ళు:—కేంఫరు, నేట్రింమూరు, ఉప్పనినీరు.

మోతాదు:— 3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 8—14 దినములు.

## 12. ఎగ్రిఫిసు న్యూటాన్సు. AGRAPHIS NUTANS.

ఇది గవదకాయలు లేక టాన్సిల్సు పెరుగుటను, ఎడినాయిడ్సు అను మాంసగ్రంథుల దోషములను మాన్పును. చల్లనిగాలి పీల్చుటవలన వచ్చు రోగములు, వీటిలో ముక్కునుండి నీళ్లుకారుట, ముక్కు దిబ్బడ వేయుట, గొంతుకరొంప, మొదలగు ముక్కు, గొంతుకసంబంధమైన రోగములను మాన్పును. శీతగాలి తగులుటవలన చలి, వణుకువచ్చుట (సైలీషియా.)

ముక్కు:—ఎడినాయిడ్సువలన కలిగిన ముక్కుదిబ్బడ, ముక్కు నుండి ఎడతెగని స్రావము.

కంఠము:—గొంతుకరొంప, దీనివలన మాట సరిగా వినబడకపోవుట. చిన్నతనములో మూగతనమువచ్చుట, అనగా మాటలురాకపోవుట యున్నను యీలక్షణములతోపాటు చెవుడుఉండదు.

పోలికలు:—సేపా, కాల్కేరియాఫాసు, కాల్కేరియా అయోడు.

మోతాదు:—టించరు మొదలు 3x టించరుకు మోతాదు 1 చుక్క.

## 13. ఎగేవ్ అమెరికానా—AGAVE AMERICANA.

(3. హిందూదేశపు ఔషధము—తెలుగున “ రాకాసి మట్టలు ” అనియు సంస్కృతమున “ కంటల ” అని యందురు.

పిచ్చికుక్క కాటువలన వచ్చు రోగ (హైడ్రోఫోబియా Hydrophobia) లక్షణములమీద ఇది అమోఘముగా పనిచేయును. సెగరో

గులలో బాధకరమైన లేపనమునకును, ఆహారదోషములు మున్నగు వాటితో రక్తస్రావలక్షణములు నిస్త్రాణ మున్నగునవి గలిగియుండు "స్కర్వీ" వ్యాధికిని, మూత్రావరోధమునకును ఇది ముఖ్యముగా వాడదగినది,

పోలికలు:—లెకెసిస్, హైడ్రోఫోబినం, ఏలోసు.

మోతాదు:—మదరుటించరును, చిన్నపొటెన్సీలును.

---

## 14. ఎలాంతసు. AILANTHUS GLANDULOSA.

స్థూలశరీరములకు, నరమునిస్త్రాణచే బాధపడువారికి, ముఖ్యముగా స్త్రీలకు, పిల్లలకు, పైత్యతత్వము గలవారికిని ఇది బాగుగా పనిచేయును.

రోగముప్రవేశించుటతోనే, రోగి అతినిస్త్రాణజెందుట ♦ పొక్కు, దద్దురుతోకూడి స్వల్పజ్వరముతోవచ్చు ప్రమాదకరమైన రోగములు, ఇట్టి వాటిలో ఆకస్మికముగను, విపరీతముగను నిస్త్రాణవచ్చుట, శరీరఛ్ఛాయ వూదారంగుగా నగుట, మగత, మరియు వమనములు వచ్చుటయు—గలుగుట. ♦ రక్తదోషమును సూచించు నీలిరంగుదద్దురు, పొక్కులు మశూచికము, పొంగు మున్నగురోగములలో బయలుదేరుట. ♦ స్రావములు దుర్వాసన, నగరువాసనవేయుట. ♦ గొంతుక పుండుపడుటవలనను యితర కారణములచేతను, నొప్పిగను వాపుగను యుండుట. ♦ రక్తదోషమే కారణముగా గలిగి, దుష్టక్రిముల దోషములతో గూడియుండి, మగత, వుద్రేకము, అతి నిస్త్రాణతోయుండు అంటువ్యాధులువచ్చుట.

మనస్సు. తల:—మత్తుగానుండుట, అస్థిమితము, తలభారము, ముఖమునందు చురుకుదనము లేకపోవుట. ముక్కునుండి రక్తముతోకలసి, దుర్వాసనగానుండు పల్చనిస్రావముపెడలుట.

గొంతుక:—బాధ. పైకిని లోపలికిని వ్యాపించు ఎర్రనివాపు. మెడ బాధ. వాపు. గొంతుక బొంగురు. నాలుక పొడిగానుండి, శేగురు రంగుగా నుండుట. పండ్లు పాచిచే కప్పబడియుండుట. గుటకవేయునపుడు బాధ చెవిలోనికి వ్యాపించుట.

శ్వాసావయవములు:—శ్వాస తొందరగా పీల్చుట. పొడిదగ్గు ఆగిఆగి వచ్చుచుండుట. శ్వాసకోశములు ఆలసటవలన బాధగానుండుట, శ్లేష్మము వెడలువరకు దగ్గు వచ్చుచునేయుండుట.

అన్నకోశము:—చలితో వచ్చు వమనములు, వేవిళ్లు.

పురుష అవయవములు:—అంగముమీద సవాయిపుండ్లు.

నిద్ర:—మత్తుగానుండుట. అస్థిమితమైననిద్ర.

చర్మము:—ప్రతిసంవత్సరమును దద్దుర్లతో కూడిన చర్మరోగము వచ్చుచుండుట. పెద్దపెద్ద నీటిపొక్కులు, ఇవి నల్లని ద్రవముతో నిండియుండుట. పొక్కులు చిన్నచిన్నవిగా నుండుట.

ఉద్రేకము:—వుదయమున.

ఉపశమనము:—కడుపున పరుండినపుడు ఛాతీ సంబంధమైన రోగములకు. నడుచుచున్నప్పుడు పండ్లకలుపు, నొప్పికి.

పోలికలు:—ఎకెసిస్, బేప్టీషియా, యాసిడ్ మూరు, రూస్టాక్సు.

విరుగుళ్లు:—రూస్టాక్సు, నక్సువామికా, ఏలోసు.

రూస్టాక్సు ఆల్కహాలు, నక్సువామికా-లకిదివిరుగుడు.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 15. ఎలట్రిసు ఫేరినోసా. ALETRIS FARINOSA.

ఇది గర్భాశయరోగములమీద బాగుగా పనిచేయును. ముఖ్యముగా గర్భవతులకును రక్తహీనులగు బాలికలకును బాగుగా ఉపయోగపడును. గర్భాశయమునకు అమితమైన బలమునిచ్చి తెల్లకుసుమను, ఎక్కువ బాధతో కూడిన మలబద్ధమును, అజీర్ణమును మాన్పును. రక్తవిహీనతకెంది పాలిపోయిన యుక్తవయస్కురాండ్రకు అమోఘముగా పనిచేయును. చిన్నవయస్సులోనే రజస్వలగుటయు, అమితమైన ఋతుస్రావమగుటను మాన్పును. గర్భస్రావము రాకుండగ ఆపుజేయును.

మనస్సు:—మనస్సు, శరీరము, అంనటచెందుట. నిలకడలేమి.

తల:—నిస్త్రాణతో కూడిన తలతిప్పు. తలవెనకభాగమున బరువుగానుండుట. తల వెనుక కులాగుచున్నట్లును, నొక్కుచున్నట్లును ఉండుట.

కండ్లు:—మబ్బుగాను, నొప్పిగాను ఉండుట.

చెవులు:—ఎడమచెవి సరిగా వినపడకపోవుట.

అన్నకోశము:—ఆకలి మందముగా నుండుట. ఇది గర్భాశయ రోగములతో కూడి యుండుట. కొద్ది ఆహారము తీసుకొనినను పొట్ట ఉబ్బరించుట. సాయంకాలమందు, మధ్యాహ్నమునను తినిన అహారము రుచితో కూడిన తేన్పులు వచ్చుట.

పొత్తికడుపు:—నులినొప్పి, పీకుచున్నట్లుండును. హిస్టీరియా లేక అపస్మారసంబంధమైనశూల, అపానవాయువు వెడలినచో నొప్పితగ్గుట.

మూత్రావయవములు:—మూత్రము కొద్దిసారులు మాత్రమే వెడలుట. మూత్రము కొద్దిగానగుట. ఇది ఫాస్ఫేట్సుతో కలిసిపోవుచుండుట.

స్త్రీ అవయవములు:—ఋతువు ఆగిపోవుట, ఒకప్పుడు విస్తారమైన ఋతుస్రావము, స్రావము చిక్కగా నల్లని ముద్దలవలె వెడలుచుండుట. నీరసముతో కూడిన కుసుమరోగము. గొడ్డుతనమును పోగొట్టును. గర్భవిచ్ఛిత్తును ఆపుజేయును. తరుచు గర్భస్రావములగుచుండుటను మాన్పును. గర్భాశయము మిక్కిలి బరువుగానుండి, ఒకప్పుడు వెలుపలికి వచ్చుట. బహిష్టుకుపూర్వము దగ్గు వచ్చుచుండుట. ఋతువు మామూలు కన్న త్వరగాను, ఎక్కువ స్రావముతోను, ఎడతెగని నొప్పులతోను కూడియుండుట (బెల్లడోనా, కేమోమిల్లా, కాలీకార్బ, ప్లాటినా). ఒకప్పుడు ఋతువు ఆగిపోవుట లేక తక్కువ స్రావమగుట (సినీషియో).

ఛాతీ:—కత్తితో పొడిచినట్లు ఎడమరొమ్ములో నొప్పిగానుండుట

మెడ, నడుము:—మెడమధ్యను నొప్పి ఎడమ భుజములోనికి పోవుచుచుండుట. నడుమునొప్పి లాగుచున్నట్లుండుట దీనితో పాటు తీగవలెవెడలు కుసుమ నడుచునపుడు స్రవించుచుండుట.

నిద్ర:—అర్ధరాత్రిమునకు పూర్వము అస్థిమితమునలన నిద్రలేమి.

జ్వరము:—చలి. ముఖము పొంగరింపు. కాళ్లుచేతులు చల్లదనము. తల, ముఖము, వెచ్చగానుండుట.

పోలికలు:—హెలోనియాస్ డయోకా, హైడ్రాస్టిసు, చైనా.

మోతాదు:—మదరుటించరు లగాయతు 200 పొటెన్సీ.

---

## 16. ఆల్ ఫాల్ ఫా. ALFALFA.

ఇది ముఖ్యముగా నరముల ఉద్రేకమును తగ్గించి సుఖనిద్రను యిచ్చును. ఆకలిని వృద్ధిచేయును. తినిన ఆహారమునకు తగిన పుష్టిని యిచ్చుటకు సహాయపడును. ఆహారములోనుంచి దేహపుష్టికి కావలసిన పదార్థములను తీసుకుని దానిని రక్తములోనికి మార్చుటలోను అవసరము లేని మిగతా పదార్థములు మలమూత్రావయవముల ద్వారా శరీరములో నుంచి వెలువరించుటలోను చాల సహాయపడును. అవయవములు అన్నిటి కిని అమితమైన పుష్టినిచ్చును. కండరములలో క్రొవ్వునుపట్టించి తూని కను వృద్ధిచేయును. ఇది ఒకరోగికి రెండునెలల కాలములో 10 పౌన్లు తూనికను వృద్ధిచేసినది. ఇది మనస్సును నిర్మలముగా ఉంచును, రక్తము ను శుభ్రపరచును, విరేచనమాంద్యమును మాన్పును, రక్తహీనముగలిగి పాలిపోవుటను మాన్పును. నీరసమును, నిస్త్రాణను, తగ్గించి రక్తమును వృద్ధిచేసి బలమునుచేకూర్చును. పాలతల్లులకు పాలను వృద్ధిచేయును, ఇది ఎక్కువ ఆరోగ్యవంతమైనటువంటిన్ని, అమిత బలమును కలుగజేయు నట్టిన్ని, స్తన్యమును వృద్ధిచేయును. మేహవాత సంబంధమైన రోగముల మీదను, అతిమూత్రవ్యాధిలోను, ఫాస్ఫేట్సు మూత్రములో కలిసిపోవు చున్నపుడును, ప్రోస్టేటు గ్రంధి (Prostate Gland) వాచి పెద్ద దైనపుడును దీనిని వాడనగును. మూత్రకోశమునందు రాయి ఉత్పత్తి యగుటను కూడ మాన్పును.

మనస్సు:—అస్థిమితము, చురుకుగా లేకపోవుట, ఏమియూ తోచక పోవుటను మాన్పి ఆలోచన చేయుటలో చురుకుదనము నిచ్చును. విచార ముతోను, కోపముతోను యుండుట. ఈ గుణములు సాయంకాలము ఎక్కువగుట.

తల:— నడినెత్తి బరువు. ఎడమపార్శ్వమునందు నొప్పికలిగి కంటి లోపలకు, కండ్ల పైభాగమునకు వ్యాపించి సాయంకాలమైనకొలది బాధ ఎక్కువగుట.

ముఖము:—కందుట.

చెవులు:— రాత్రి దిబ్బడవేయుట. ఉదయమున సరిగా వినబడుట.

అన్నకోశము:—అతిదాహము, ఆకలి మందగించుట, అమితమైన ఆకలి, తరుచు ఆహారము తీసుకొనుటవల్ల నియమితకాలములో భోజనము చేయుట కుదరకపోవుట. చిరుతిండియందును, తీపివస్తువులయందును, ఎక్కువ యిష్టముండుట.

పొత్తికడుపు:—వాయువుచేరుటవల్ల పొంగరించుట. భోజనమైన కొన్నిగంటలకు పేగులలో ఒకవిధమైన నొప్పి బయలుదేరుట. ఆనొప్పి ఒకమారు ఒకవైపునను, యింకొకమారు యింకొక వైపునకును మారుచుం డుట. మంటతోకూడిన వాయువుతో కలిసి పచ్చగాను, పల్చగాను, బాధ తోను, తరుచుగాను విరేచనములు అగుచుండుట. చాలకాలమునుండి బాధపడుచున్న ఎపెండిసైటిసు అనబడు క్రిమికయొక్క వాపుతోకూ డిన వ్యాధిలో యిది బాగుగా పనిచేయును.

మూత్రము:—తరుచు అల్పాచమానము చేయవలసి వచ్చుచుండుట.

నిద్ర:—మామూలుకన్న ఎక్కువ సుఖనిద్రనిచ్చును.

పోలికలు:—అవీనాసటీవా, యాసిడ్ ఫాసు, కాలీఫాసు.

మోతాదు:—మదరుటించరు లగాయతు 30 పొటెన్సీ.

## 17. సేపా—ఏల్లియం సేపా. CEPA—ALLIUM CEPA.

(4. హిందూదేశపు ఔషధము—నీరుల్లిపాయ)

కండ్లు, స్వరపేటిక, ముక్కు వీటి సంబంధమయిన రోగములు జలుబుచే గలిగినపుడు ఇది ముఖ్యముగా వాడదగినది.

తేమగాలి తగులుటవలన, జలుబు చేయుటతో, తేమలో నానుట వలన, చెడిపోయిన చేపలను తినుటవలన, దెబ్బతగులుటతో, శస్త్రచికిత్సవలన—ను వచ్చిన రోగలక్షణములకిది వాడతగినది

♦ ముక్కునుండి ఎడతెగని, నీళ్లవంటి స్రావము మరియు కన్నులు నీళ్లతో నిండియుండుట. ♦ వగరుగనుండు పల్చని స్రావము ముక్కునుండి వెడలు చుండుట, మరియు, తుమ్ములు మానకుండగ వచ్చుచుండుట, ఈ లక్షణములు బహిరంగమైన గాలిలో వుపశమించుచు, మరియు వెచ్చని (గాలిరాని) గదిలో వుద్రేకించుట—ఇవిదీని ముఖ్యలక్షణములు.

బాధలు ఎడమవైపునుండి కుడివైపుకు వ్యాపించుట. దెబ్బ తగిలిన పిమ్మట (కాలు, చేయి, మొదలగు) అవయవములు శస్త్రసహాయమున తీసివేసిన పిమ్మట ఆయా అవయవముల ననుసరించియున్న నరములకు సంబంధించిన బాధలు.

మనస్సు:—ఎక్కువ ఆతురత.

తల:—జలుబుమీదవచ్చిన తలనొప్పి. ఇది సాయంకాలమందును గాలి సరిగా రానట్టి గదిలో నున్నప్పుడును ఎక్కువగుట. (పల్సటిల్లా, యూఫ్రేషియా) మరియు నిది బహిరంగమైన గాలిలో వుపశమించుట. బహిష్టు అయిన పిదప తలనొప్పి మానుట, మరియు ఋతుస్రావము ఆగిన పిమ్మట తలనొప్పి తిరిగి వచ్చుటయు (లేకసిస్, జింకంమెట్) నుండునని యీ డాక్టరు బోరిక్‌గారు వ్రాసిరి.

ముఖము:—ముఖమునకు పక్షవాతము వచ్చుట.

కన్నులు:—మంటగను, దురదగను, నీరు కారుచును యుండుట. కండ్లు ఎర్రగానుండుట, వెలుతురును చూడలేకపోవుట.

చెవులు:—చిన్న పిల్లల చెవిపోటును మాన్పునట్టి ముఖ్యమైన మూడు ఔషధములలో నిదియొకటి. తక్కినవి (1) పల్సటిల్లా, (2) కేమోమిల్లా.

ముక్కు:—ఎడతెగని తుమ్ములు, నీరువంటి స్రావము. ముక్కు దిబ్బడవేయుట, వీటితోపాటు తలభారము, దగ్గు, గొంతుక బొంగురుపోవుట. ఇది ముక్కులో కాయలను హరింపచేయును. ముక్కు ఒరియుట.

అన్నకోశము:—తీరని ఆకలి, దాహము, త్రేపులు.

పొత్తికడుపు:—కడుపులో గుడగుడలు, దుర్వాసనగల అపానవాయువు వెడలుచుండుట. కడుపు వుబ్బరింపుతో కూడిన శూలలకిది మంచి ఔషధము. బొడ్డుచుట్టూ కుట్టుమన్నట్లుండు బాధను మాన్పును.

ఆసనము:—అర్ధరాత్రిమునకు పిమ్మటను, వుదయమునను, నీళ్లవిరేచనములు. ఆసనము దురద, ఎక్కువ చెచ్చదనము, తీపు, పోటు.

మూత్రావయవములు:—రొంపతోపాటు మూత్రమెక్కువగా వెడలుట. మూత్రము ఎర్రగానుండుట. మూత్రద్వారము మంట, బాధ.

శ్వాసావయవములు:—ఇది అజీర్ణము, అపానవాయువు, శూల, వమనము, కడుపువుబ్బరింపు— వీటితోకూడిన కోరింతదగ్గును మాన్పును. దగ్గు, గురక (చెలిడోనియం). ఊపిరి తిరుగకపోవుట. ఛాతీలోనిబాధ చెవివరకు వ్యాపించుట. రొంప, నీళ్ళవంటిస్రావము—వీటివలన పెదవి ఒరియుట (ఎమోనియంమూరు). చలిగాలి పీల్చుటవలన వచ్చుదగ్గు.

గొంతుక:—గొంతుకరొంప, దగ్గినప్పుడు కంఠము పట్టుకొనవలసి వచ్చుట. రొంపవలన గొంతుక బద్దలగునంతటిబాధ. గొంతుక బొంగురు.

కాళ్ళు, చేతులు:—కాళ్ళు నీళ్లలో నానుటవలన వచ్చిన రోగగుణములు. భుజములు నొప్పిగానుండుట, గోరుమట్టు.

చర్మము:—ఇది పొంగురెుక్క పథమావస్థలో బాగుగా పనిచేయును, శస్త్రముచేసినపిమ్మట నరములలో వచ్చునట్టి బాధలనుమాన్పును.

నిద్ర:—మత్తు, తలనొప్పితోకూడి ఆవలింతలు వచ్చుట. కలలు. గాఢనిద్రలో తేరబారిచూచుట. రాత్రి 2 గంటలకు మెలుకువ వచ్చుట.

ఉద్రేకము:—వేడిగానున్న గదిలోను, సాయంకాలమున.

ఉపశమనము:—బహిరంగమైన గాలిలో, అటునిటు తిరుగుటవలన, చల్లని గదిలో.

సహచరులు;—ఫాస్ఫరసు, పల్సటిల్లా, తూజా, సర్సపరిల్లా.

విరుగుళ్లు:—ఆర్నికా, కేమోమిల్లా, నక్సువామికా, విరేట్రంఆల్బం.

పోలికలు:—ఎకోనైటు, కాలీఅయోడు, ఇపెకాక్, యూఫ్రేషియా, జల్సీమియం, లిలియంటిగ్.

దీనికి పిమ్మట వాడరానివి:—ఎలియంసతీనా, ఏలోసు, స్కిల్లా.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

---

## 18. ఎల్లియం సతీవా. ALLIUM SATIVA.

(హిందూదేశపు ఔషధము. 5. వెల్లుల్లిపాయ.)

మితిమీరిన భోజనమువలనను, అనారోగ్యమైన నీటిని త్రాగుటవలనను వచ్చినరోగములనిది మాన్పును.

ఇది ఆంత్రములలోని పొరల దోషములను మాన్పును. విరేచనబద్ధమును మాన్పును. ఇది స్థూలశరీరులలో అజీర్ణరోగమును, స్రావములను మాన్పును. అతిపైత్యమును, ఎక్కువ విరేచనబద్ధమును మాన్పును. మితిలేని భోజనము (ముఖ్యముగా మాంసముతో కూడిన ఆహారములు), స్వల్పముగా పానీయములు పుచ్చుకొనుట అలవాటు కలవారికిని, క్షయరోగులకును ఇది బాగుగా పనిచేయును. ఇది వాడుటవలన శ్లేష్మను, దగ్గు తగ్గును మరియు, శరీరములోని శీతోష్ణములు సమముగానుండును, రోగియొక్క తూనికవృద్ధియగును, నిద్రసరిగా పట్టుచుండును. నోటినుండిగాని, ముక్కునుండిగాని రక్తస్రావమగుచుండుటను మాన్పును.

దీనిబాధలు (సల్ఫరు, స్టేనం వలె) క్రమముగా ఉద్రేకించి పిమ్మట ఉపశమనము నొందును.

మనస్సు:—తనరోగము కుదరదని నిరాశచెందుట. ఏదో ఒక ఔషధమును తనరోగము మాన్పజాలదనుకొనుట. తనకు విషము పెట్టెదరనుకొనుట.

తల:—భాగము. కనుబొమలు అదుచున్నట్లుండుట. చెవినుండి స్రావము, చెవుడు, అజీర్ణముతో కూడిన తలనొప్పి.

నోరు:—భోజనానంతరమునను, రాత్రియందును, తియ్యని లాలాజలము ఊరుచుండుట. గొంతుకలోగాని, నాలుకమీదగాని వెంట్రుకలు యున్నట్లనుమానము. నాలుక చిన్నచిన్న ఎఱ్ఱని పొక్కులతో కూడి పొలిపోయినట్లుండుట

అన్నకోశము, పొత్తికడుపు:—ఎడతెగని ఆకలి. మంటతో కూడిన త్రేనుపులు. తీసుకొను ఆహారములో మార్పువచ్చినచో బాధకలుగుట. అంత్రములలో నులినొప్పితో కూడిన విరేచనబద్ధము, వయస్సుమీరిన స్థూల శరీరుల అజీర్ణదోషమును పోగొట్టును. ఇట్టివారికి భోజనములో కలుగు మార్పులవలన విరేచనబద్ధము కలుగుటనుకూడ మాన్పును.

శ్వాసావయవములు:—ఛాతీలో శ్లేష్మసంబంధమైన గురక. ఉదయమున తెగిపడనటువంటి చిక్కని శ్లేష్మముతో కూడిన దగ్గు. తరుచు జలుబు చేయుచుండుట. శ్లేష్మము దుర్వాసనతో కూడియుండుట. ఛాతీలో శూలముతో పొడుచునట్లు బాధయుండుట.

మూత్రావయవములు:—మధుమూత్రమును మాన్పును. మూత్రము స్వల్పముగానే వెడలుట. ఒకప్పుడు విస్తారముగాగూడ వెడలుట.

స్త్రీ అవయవములు:— మర్మావయవముల మీదను, స్థనములమీదను, పొక్కులుబయులుదేరుట. స్థనము వాపువలన బాధగానుండుట. బహిష్టుతోవచ్చు తలనొప్పులు. వీటివలన కన్నులెత్తి చూచుట కష్టముగా నుండుట, ఋతుస్రావము అగుచున్నకొలది తలనొప్పి ఉపశమించుట, మరియు బహిష్టుకువెనుక తిరిగి తలనొప్పి ఎక్కువగుటయు ఈ యౌషధ లక్షణమని డాక్టరు క్లార్కు గారు వ్రాసిరి.

నడుము:—నడుమునొప్పిని మాన్పును.

జ్వరము:—పూర్వాహ్ణమందును, సాయంకాలమందును వణకు. చలి ఒకపార్శ్వమున మాత్రమేయుండుట. వమనములు. చమట దుర్వాసన దురదతోకూడియుండుట.

ఇది మాంసభక్షకుల రోగములమీద బాగుగా పనిచేయును. మాంస భక్షకుల రోగములమీద పనిచేయు ఇతరఔషధములేవన:—బ్రియోనియా లైకోపోడియం, నక్సువామికా, కోలోసింథిసు, డిజిటాలిసు, ఇగ్నేషియా.

వృద్ధికము:—నడచుటవలన, చదువుటవలన, సాయంకాలమున, బహిరంగమైనగాలిలో, కదలికవలన, రాత్రియందు.

వుపశమనము:—వంగుని కూర్చుండుట వలన.

సహచరులు:—ఆర్సెనికం ఆల్బం.

విరుగుళ్లు:—లైకోపోడియం.

పోలికలు:—ఆర్సెనికంఆల్బం, కాలీ నైట్రికం, కేప్సికం, సెనీగా, నక్సువామికా, లైకోపోడియం.

దీనికిపిమ్మటవాడరానివి:—ఏలోసు, స్కిల్లా, ఏల్లియంసేపా.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

---

## 19. అల్నసు రుబ్రా. ALNUS RUBRA.

ఇది చర్మవ్యాధులమీదను, మాంసగ్రంథుల వాపులమీదను, అజీర్ణ ములమీదను బాగుగా పనిచేయును. ఇది ధాతుపోషణను సరిగానుం చును గాన మాంసగ్రంథుల వాపులను, క్షయరోగచిహ్నములను మాన్పు ను. నోటిలోను, గొంతుకలోని, తేమతోకూడిన పచ్చనిపొరలపై బయలు దేరిన పుండ్లను మాన్పును. జీర్ణరసములోని దోషము వలన గలిగిన అజీర్ణ మును మాన్పును. మేహవాతదోషములను, సవాయివ్యాధిని, జీర్ణించిన సెగ నుకూడ మాన్పును.

స్త్రీ అవయవములు:— కుసుమ, దీనివలన మర్మావయవములో పుండుపడి రక్తము స్రవించుచుండుట. ఋతువు అగిపోయి నడుములో నుండి మర్మావయవములోనికి మంటతోకూడిన బాధవ్యాపించుట.

చర్మము:—మంత్రిముపొక్కులు, మాంసగ్రంధులవాపు, తామర వంటి చర్మరోగము. చర్మరోగములలో దీనిని పైకికూడ వాడవచ్చును.

పోలికలు:— హెపార్ సల్ఫర్, కాలీఅయోడం, మెర్క్యూరియస్, ఫైటోలక్కా, బాప్టీషియా, నక్సువామికా.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 20. ఏలోస్. ALOES.

ముఖ్యముగానిది శ్లేష్మరోగములమీదను, వయోవృద్ధులలోను, ముట్లుడుగుకాలములో కలుగు నరములసంబంధమైన వ్యాధులలోను, శరీర పరిశ్రమ లేకపోయినందున వచ్చిన రోగములమీదను మంచిపని చేయును.

పొట్టవేర్లాడుట, వుబ్బరింపు, పొట్టలోగుడగుడలు. ♦ నీళ్లవిరేచనములు వెడలనున్నట్లు పొట్టలో ఒకవిధమైన నీరసముగా నుండుట. ♦ రక్తవిరేచనములతో ఆసనముతీపు. ♦ మూలశంఖ మొలలు దురదతోను, మంటతోను, వెలుపలకు చొచ్చుకుని వచ్చుట—యీ బాధలు శీతలోపచారముల వలన వుపశమించుట. ♦ జ్వరము వచ్చునట్లువలె చర్మము, ముఖ్యముగా పాదములు వెచ్చగానుండుట. ♦ విరేచనమునందు ఆమము ముద్దలుముద్దలుగాను నీళ్లవలెను వెడలుట. ♦ మలాశయమునందు దిగలాగుచున్నట్లు బాధతో మూలశంఖ మొలలు ద్రాక్షపళ్లగుత్తివలె బయటకువచ్చుట. అపానవాయువు వెడలునప్పుడును, మూత్రము విడుచునప్పుడును పలుచని మలము వెలుపడుట. ♦ తెల్లగాకగట్లకొందరగానీళ్లవిరేచనము అగుట. ఆహారపానీయములు తీసికొనినపిదప ఆసనమువద్ద కండరము బిగువుతగ్గుటతో తొందరగా వెడలు నీళ్లవిరేచనములు.

అతి బాధతో కూడిన జిగటవిరేచనములను కట్టును. రోగి పుదేకమును నిచ్చు ఆహారములను కోరుచుండుటను. మాన్పును.

మనస్సు:—ఎక్కువకోపము, పరిశ్రమయందయిష్టము, ఆయాసముగల్గుట. రోగి జీవితమునందు నిరాశ చేసికొనుట.

తల:—తలదిమ్ము, విరేచనానంతరము తలనొప్పి, ఇవి వేడిమివలన ఎక్కువగుచుండుట; మరియు నివి శీతలోపచారముల చేత ఉపశమించుట (ఆర్సెనికంఆల్బం). నుదిటియందు నొప్పిగానుండి కండ్లు బరువుగానుండుట, వికారము. విరేచనబద్ధముతో కూడిన తలనొప్పులు, నుదుటనొప్పి ఇవి నడచుటవలన ఎక్కువగుట (బెల్లడోనా, బ్రియోనియా).

కన్నులు:—నుదిటిలోని నొప్పివలన కండ్లుమూసుకొన వలసివచ్చుట. కండ్లు ఎర్రబడి వస్తువులన్నియు పసుపుపచ్చముగా కనపడుట. కండ్లనుండి నీరుకారుట. గుడ్డులోపల మిక్కిలి బాధగా నుండుట.

ముఖము:—తలనొప్పితో వెచ్చదనము. పెదవులు ఎగబారుట.

చెవులు:—పోటుగానుండుట. సంగీతము, చప్పుడు అయిష్టముగా నుండుట, యివి రోగిని కంపింపజేయుట.

ముక్కు:—ఉదయమున పక్కనుండి లేచుటతో రక్తస్రావము.

నోరు:—రుచి చేదు, పుల్లన. లాలాజల మెక్కువగా ఊరుట.

అన్నకోశము:—మాంసరసము నయిష్టము. ఎప్పుడును ద్రవపదార్థములనే కోరుచుండుట. భోజనానంతరము త్రేనుపులు, ఆసనముదురద.

పొత్తికడుపు:—బొడ్డుచుట్టును నొక్కినయెడల బాధ యెక్కువగుట. కాలేయమువద్ద వెచ్చదనము, పొంగరింపు, నొప్పి నిలుచుండిన యెడల వృద్ధిచెందుట. పొత్తికడుపు ముట్టుకొనినయెడల బాధగానుండుట. వాయుపూరితమై యెక్కువ బాధగానుండుట, ఇది భోజనమైన పిమ్మట యెక్కువ వృద్ధిచెందుట. గుడగుడ లాడుచుండుట. వాయువు బయటికి వెడలుచున్నప్పుడు మంట, దుర్వాసన, బాధ తగ్గుట. మధ్యమధ్య విరేచనానుమానముండినను విరేచనమవక పోవుట. భోజనానంతరమునను పానీ

యము తాగినపిమ్మటను వెంటనే విరేచనమునకు తొందరగా పరుగెత్తవలసి వచ్చుట (క్రోటనుటిగ్).

మలము, మలాశయము:—ఎల్లప్పుడును విరేచనానుమానము. ఇది భోజనానంతరము ఎక్కువగానుండుట. మలాశయములో మిక్కిలి బరువు, దీనివలన విరేచనమగునుకొనును గాని అపానవాయువుమాత్రమే వెడలుట (నేట్రంమూరు). వాయువు వెడలునప్పుడు పలుచని విరేచనము తెలియకుండగనే అగుట. ప్రాతఃకాలమున పచ్చని విరేచనమగుట, దీనివలన రోగి పక్కనుండి పరుగెత్తవలసివచ్చుట (సోరనం, రూమెక్సు, సల్ఫరు).విరేచనము వెచ్చదనముతోను, పల్చగాను, పసుపుపచ్చముగాను, అజీర్ణముగాను, ఎక్కువతీపు, బాధతోను వెడలుట. విరేచనానంతరము రోగి బహునిస్త్రాణ చెందుట. విరేచనమైనపిమ్మట బాధతోకూడి విస్తారము జిగట వెడలుచుండుట. మూలశంఖ ద్రాక్షగుత్తివలె వెలుపలికివచ్చుట. బీరు(Beer) త్రాగువారిలో కలుగు నీళ్లవిరేచనములు. విరేచనము ఫల్లనిపదార్థములు తినుటవలనను, అప్రియత్నముగను అపానవాయువుతోకలిసి వెడలుట (యాసిడ్ ఫాసు, నేట్రంమూరు). శీతలోపచారములవలన మూలశంఖబాధ వుపశమించుట.

మూత్రావయవములు:—మూత్రానుమానముతోపాటు విరేచనానుమానముగూడ యుండుట. వయోవృద్ధులలో తెలియకుండగనే అల్పాచమానమగుట. ప్రాస్టేటుగ్రంధి వాపువలన బరువుగాను, బాధగానువుండుట.

పురుషావయవములు:— సాయంకాలమందును, భోజనానంతరమును, మెలుకువ వచ్చినపిమ్మటను సంభోగేచ్ఛ యెక్కువగుట.

స్త్రీ అవయవములు:—ఆసనములో తీపు, యిది నిలుచుండునప్పుడును, బహిష్టుఅయినప్పుడును ఎక్కువగానుండుట. ముట్టుడుగు కాలములో వచ్చు స్రావములను కట్టును. బహిష్టు అతిత్వరితముగాను, ఋతుస్రావము ఎక్కువగాను అగుటను మాన్పును. శూలతోకూడిన రక్తకుసుమమునుకట్టును. పైగుణములతోకూడి గర్భాశయము వెలుపలకు గచ్చుట.

శ్వాసావయవములు:—వర్షఋతువులో వచ్చు దగ్గులు, శ్వాస అంద కపోవుట, పొత్తికడుపులోనుంచి ఛాతీలోనికి పోట్లు పొడుచుచున్నట్లుండుట.

మెడ, నడుము:—ఒకమారు నడుమునొప్పి, మరియొకమారు తలనొప్పి, ఇది మూలశంఖతో మారుచుండుట. నడుమునొప్పి కూర్చున్నపుడును, రాత్రి మెలుకువ వచ్చినప్పుడున్ను యెక్కువగుట. మరియు నిది కదలికవలన వుపశమించుట.

చర్మము :—వర్షకాలము వచ్చుసరికి ప్రతిసంవత్సరమును చిడుము బయలుదేరుచుండుట (సోరినం).

ఉద్రేకము:—భోజనానంతరము, పరిశ్రమ లేనికారణముచేత, వేసవిలో, నిలుచుండుటవలన, వుదయమున.

ఉపశమనము:—చల్లదనమువలన, చల్లనినీళ్లవలన, అపానవాయువుగాని విరేచనముగాని వెడలినపిమ్మట, స్నానానంతరమున, వెలుతురువలన, బహిరంగమైన గాలిలో.

సహచరులు :—సల్ఫరు.

విరుగుళ్లు:—ఓపియం, కేంఫరు, నక్సువామికా, లైకోపోడియం.

పోలికలు :— ఏల్లియంసతీవా, కాలీబైక్, లైకోపోడియం, ఏల్లియంసేపా, ఎస్కులసుహిప్, పోడోఫైలం, మెర్క్యూరియసు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ. ఆసనసంబంధమైన రోగములలో 3 వ పొటెన్సీ లగాయతు వాడుట మంచిది.

---

## 21. ఆల్‌స్టోనియా స్కాలా్. ALSTONIA SCHOLARIS.

(హిందూదేశపు ఔషధము. 6. పాలగరుడ, ఏడాకుల అరటిచెట్టు లేక ఏడాకుల పొన్నచెట్టు.)

అతి నిస్త్రాణను కలుగజేయు జ్వరములకు పిమ్మట బలవర్ధకౌషధముగా వాడతగినది. మన్యపుజ్వర లక్షణములు, జిగటవిరేచనములు, నీళ్ళ

విరేచనములు, రక్తవిహీనత, అజీర్ణదోషములును దీని వుపయోగమును సూచించును.

♦ అన్నకోశము ఖాళీగా యున్నట్లుండుట. ♦ పొత్తికడుపులోతున పడినట్లుభావన. ♦ అతినిస్త్రాణ.—ఇవి దీని ముఖ్యలక్షణములు.

పొత్తికడుపు:—తీవ్రముగా వెడలు నీళ్లవిరేచనములు. రక్తవిరేచనములు. జిగటవిరేచనములు. —ఈలక్షణములు మన్యపుజ్వరముతోడను, చెడిననీళ్లను త్రాగుటవలనను వచ్చుట. భోజనమయినవెంటనే నీళ్లవిరేచనములగుట. బాధలేకుండగ వెడలు నీళ్లవిరేచనములు (యూనిడుఫాసు).

పోలికలు:—చైనా.

మోతాదు:—టించరును, చిన్నపొటెన్సీలును. దీనిని మేహవాతనొప్పులకును, పుండ్లకును, మదరుటించరును కొబ్బరినూనెలోగాని, గ్లిసరినులోగాని కలిపి వాడవచ్చును.

---

## 22. ఎమిగ్డలను పెర్సికా. AMYGDALUS PERSICA.

ఇది పలువిధములైన వమనములను కట్టును. గర్భిణీస్త్రీలలోకలుగు వేవిళ్లకిది దివ్యౌషధము.

కన్నులు:—ఎరుపుతోకూడిన బాధ.

మూత్రావయవములు:—మూత్రకోశమునుండి రక్తస్రావములు.

అన్నకోశము:—అన్నహితవు లేకపోవుట ఏఆహారమైనను యిమడకపోవుట. రుచి, వాసన తెలియకపోవుట. నాలుకపొడుగు, సన్నముఅగుట. నాలుక చిగురు, అంచులు యెఱ్ఱగానుండుట. తరుచువమనము, తలత్రిప్పువచ్చుట. రక్తవాంతి. వేవిళ్ళు. చిన్నపిల్లలలో వమనములు.

పోలికలు:—ఇపెకాక్, సింఫోరికార్పసురేసిమోసా.

మోతాదు:—మదరుటించరును చిన్నపొటెన్సీలును.

---

## 23. ఎనకార్డియం. ANACARDIUM ORIENTALE.

(హిందూ దేశపు ఔషధము. 7. దీనిని సంస్కృతమున " భల్లాతక, అగ్ని ముఖి " యనియు, తెలుగున " జీడిగింజలు " అనియు అందురు.)

పొక్కులను దద్దుర్లను ఎదుగనీయకుండుట, లేక అణచిపెట్టుటవలనను, పరీక్షలవలనను వచ్చు రోగలక్షణముల నిది మాన్పును.

♦ తన సంకల్పములు రెండుగా యున్నట్లును, ఒకటి విధించుపనిని రెండవది నిషేధించునట్లును తోచుట. ♦ జ్ఞాపకశక్తి ఏమియు లేకపోవుట. ♦ జ్ఞాపకశక్తి వక్కసారిగా నశించి, ఇటీవల జరిగిన విషయము లయినను జ్ఞాపకముండకపోవుట. ♦శరీరమునందచ్చటచ్చటనొక్కుచున్నట్లును, మేకు వంటిది గుచ్చుకుపోవుచున్నట్లును లేక కొయ్యకొట్టినట్లును బాధగాయుండుట.—ఇవిదీని ముఖ్యలక్షణములు.

ఇది నరములసంబంధమైన వ్యాధులమీద బాగుగా పనిచేయును. సవాయివ్యాధివలన కలిగిన జ్ఞానేంద్రియముల దోషములను అనగా వాసన, దృష్టి, వినబడుట వీటిమందమును మాన్పును. పరిశ్రమయందయిష్టత. పరీక్షకువెడలనున్న విద్యార్థులకు కలుగు భయమును మాన్పును. ప్రతిసారి ఒట్టు పెట్టుకొనవలయుననియు, ప్రమాణములు చేయవలయుననియు కోరిక యుండుట (లేక్ కేనినం). అజీర్ణవ్యాధిలో నక్సువామికాకును దీనికినిగల తారతమ్యము తెలిసికొనవలసిన విషయము-ఎనకార్డియమునకు అన్నకోశము కాళీగానున్నప్పుడు బాధగానుండి ఆహారము తీసుకొనినయెడల తగ్గును. నక్సువామికాలో భోజనమైన 2, 3 గంటలకు బాధ ఎక్కువగానుండి ఆహారము జీర్ణమైన వెంటనే తగ్గును.

మనస్సు:—జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును. పరధ్యానము, అతిసులభముగా కోపమువచ్చుట, అందరిని అనుమానించుట (హైయస్యామసు). బుద్ధిమాంద్యము. తనయందును, ఇతరులయందును నమ్మకముండకపోవుట. తన్ను ఎవరో వెంబడించుచున్నట్లు ఆందోళనగావుండుట. అధైర్యము. దుర్మార్గపు ఆలోచనలు తోచుచుండుట. మశూచికము కు పిమ్మట జ్ఞాపకశక్తి తగ్గుట.

తల:—తలతిప్పు, మానసిక పరిశ్రమవలన నుదిటిలో మేకుకొట్టి నట్లునొప్పి. ఇట్టినొప్పి కనుబొమలలోను, నడినెత్తిమీదను, తలవెనుకభాగమునను కలుగుచుండుట, మరియునిది భోజనము చేయుచున్నప్పుడు వుపశమించుట (సోరినం). మానసిక పరిశ్రమ లేనివారిలో అజీర్ణసంబంధమైనట్టియు, నరముల సంబంధమైనట్టియు తలనొప్పి (అర్జెంటం నైట్రికం, బ్రియోనియా, నక్సువామికా).

కన్నులు:—వస్తువులు దూరముగానున్నట్లగుపడుట. దృష్టిదోషము.

చెవులు:—సరిగా వినబడకపోవుట. దూదిపెట్టుకున్నట్లుండుట.

ముక్కు.—ముసలివారిలో గొంపతోకూడియున్న గుండెదడ, తరుచు తుమ్ములు వచ్చుచుండుట.

ముఖము:—పాలిపోయినట్లుండుట.

నోరు:—బాధతోకూడిన నీటిపొక్కులు. దుర్వాసన. నాలుక వాచినట్లుండి మాటలాడుటకును, నోరు కదల్చుటకునుకూడ కష్టముగానుండుట, మరియు లాలాజలము ఎక్కువగా ఊరుచుండుట. మిరియములు తినినవారివలె పెదవులు మండుచుండుట. గొంతుకలో గోకుచున్నట్లుండుట.

అన్నకోశము:—ఖాళీగానున్నట్లు అగుపడుటవలన బాధగానుండుట. ఇది భోజనముచేసినపిమ్మట వుపశమించుట (చెలిడోనియం, ఆయోడియం). జీర్ణశక్తి తక్కువగా నుండుట. కడుపు పొంగరించి వ్రేలబడియుండుట, అజీర్ణరోగులలో భోజనానంతరము వుపశమనము కలుగునపుడిది బాగుగా పనిచేయును. తొందరగా ఆహారమును మ్రింగుట పానీయములను త్రాగుట వలని అజీర్ణదోషము. జీర్ణకోశములోకలుగుపుట్టవ్రణము అనబడుకేన్సరు (Cancer) ను మాన్పును.

పొత్తికడుపు:—గోకుచున్నట్లు, కుట్టుచున్నట్లు, గుడగుడలాడుచున్నట్లువుండుట. ఆంత్రములలోనికి గసికికొట్టినట్లు బాధగానుండుట.

మలము, మలాశయము:—మలాశయముయొక్క శక్తితగ్గుట. విరేచనమగుటయందు కోరికయుండును గాని, విరేచనమవకపోయినను బహిర్దేశ

మునకు వెళ్లివచ్చినంత మాత్రమున యీ కోరిక తగ్గుట. ఆసనము ముడుచు కొనిపోయి నట్లుగా నుండుట, మలము మెత్తగానున్నను బహుకష్టము మీద వెడలుట (ఎల్యూమినా, ప్లాటినా, సైలీషియా, సేపియా వీరేటమ్ ఆల్బం). ఆసనము దురదగాను, తేమగాను వుండుట. బాధతో కూడిన మూల శంఖ. విరేచనమగునపుడు రక్తము స్రవించుట.

పురుషావయవములు:—నిద్రయందు స్వప్నములేకుండగనే స్ఖలనమగుట. విరేచనకాలమందు ప్రాస్టేటుగ్రంధినుండి స్రావము. సంభోగశక్తి తగ్గుట. స్ఖలనానంతరము నరముల విస్త్రాంతి.

స్త్రీ అవయవములు:—దురద, నొప్పితో కూడిన కుసుమ. ఋతుస్రావము తక్కువగానగుట, వేవిళ్లు. అధికసంభోగమువలన కలిగిన మనోవ్యాకులతను, అపస్మారమును మాన్పును.

శ్వాసావయవములు:—ఛాతీలో కోయ్యకొట్టినట్లును, నొక్కుచున్నట్లును నొప్పిగానుండుట. ఛాతీలో బరువుగాను, వెచ్చగాను, ఆతురతగాను వుండుటవలన రోగి బహిరంగమైన గాలినికోరుట.

హృదయము:—దడ. గుండెలో కుట్టుచున్నట్లుండునొప్పి.

మెడ:—మెడనరము పట్టినట్లుండుట. భుజములు బరువు.

కాళ్లు, చేతులు:—పక్షవాతములోవలె నీరసముగానుండుట. మోకాళ్లలో పట్టుపట్టినట్లును, బిగించికట్టినట్లును వుండుట (కేక్టసు, సల్ఫరు.) పిక్కలు లాగుట. చేతులమీదను అరిచేతులలోను సురుగుడుకాయలవలె బయలుదేరుట (నేట్రంమూరు). వేళ్లమీద పొక్కులు బయలుదేరివాచుట అవయవములలో నొప్పులు లేచినను కదలినను ఎక్కువగుట. కూర్చున్నపుడు కాళ్ళు అస్థిమితముగానుండి, నడచుటతో తగ్గుట.

నిద్ర:—వరుసగా చాలరాత్రులయందు నిద్రయుండకపోవుట. ఆతురతతో కూడిన స్వప్నములు వచ్చుచుండుట.

చర్మము:—విస్తారము దురదతో కూడిన మంత్రపుపొక్కులు. వీటిని గోకిన కాలదని మంట, దురద యెక్కువగుట. ఎఱ్ఱని నీటిపొక్కులు కుష్ఠురోగము (6-వ పొటెన్సీవలన గుణముకలిగినది). బోదకాలు.

ఉద్రేకము:—వేడినీటివలన, లేచుటతో, వ్రాయుటను, నడుచుట వలన, తలను వెనుకకు వంచుటవలన.

ఉపశమనము:—వెచ్చదనమువలన, భోజనానంతరమున పరుండి నపుడు, మర్దించుటవల్ల, రోగప్రదేశమును మర్దించుటతో.

సహచరులు,—ప్లాటినా.

పోలికలు:—రూస్టాక్సు, యాంటిమొంటార్టు, యాపిసు, యాసిడు ఫాసు, నక్సువామికా, నేట్రంమూరు, పల్సటిల్లా.

విరుగుళ్లు:—కాఫీ, యూకలిప్టసు, రూస్టాక్సు, గ్రిండీలియా.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాలపరిమితి 30 దినములకు పైగా నుండును.

---

## 24. ఎనగాలిసు. ANAGALLIS.

ఇది ముఖ్యముగా చర్మరోగములమీద పనిచేయును. ప్రతిచోటను దురద, తిమ్మిరివుండుట. చెడిపోయిన ఎముకముక్కలను కురుపులు వ్రణములయొక్క రంధ్రములద్వారా బయటకు త్రోసివేయును. మెదడు నుపయోగించువారిలోకలుగు తలనొప్పులను మాన్పును (యాసిడ్ పిక్రిక్).

మనస్సు:—మిక్కిలి చురుకుగాను, ఆనందముగాను వుండుట. ప్రతివస్తువును తనకు సంతోషమును గలుగజేయును.

తల:—కడుపులో గురగురలాడుటతోను, త్రేనుపులతోను కూడిన తలనొప్పి, ఇది కాఫీత్రాగుటవలన తగ్గుట. రోగి మందముగానుండి తల దిమ్ముతో బాధపడుచుండుట. ముఖముమీద కండరములలో నొప్పులు.

ముక్కు:—రక్తస్రావము. విపరీతమైన తుమ్ములు, వీటితో పసుపుపచ్చని స్రావము వెడలుట. ముక్కునుండి నీళ్లుకారుచుండుట.

పొత్తికడుపు:— వాయుపూరితమై యుండుట.

మలము, మలాశయము:— మూలశంఖ. దుర్వాసనతో కూడినఅపాన వాయువు, మలము పల్చగాను, పసరువలెను, నీళ్ళవలెను వెడలుట. ఒకప్పుడు వుండలవలెను, గట్టిగా రాయివలెను వెడలుట.

మూత్రావయవములు:— మూత్రము పసుపుపచ్చనిరంగుగలిగియుండుట. మూత్రము విడుచునపుడు మూత్రద్వారము మంటగానుండుట. మూత్రద్వారము మూసుకొనిపోవుట. మూత్రము రెండుధారలుగా పడుట.

మర్మావయవములు:— ఉద్రేకమువలన సంభోగేచ్ఛగలుగుట.

చర్మము:— చేతులమీద, వేళ్లమీద దురదగాను, పొడిగాను వుండుట. వేపపువ్వువంటి దద్దుర్లు, ఇవి అరిచేతులలోకూడ యుండుట. కీళ్ల సంధులలో వాపులు, పుండ్లు, సురుగుడుకాయలు లేక చమటకాయలు. చర్మమును మృదువుపరచును. తామరను మాన్పును (సేపియా).

కాళ్లు, చేతులు:— మేహవాతపునొప్పులు. భుజము, చేయినొప్పి.

ఉద్రేకము:— కనుబొమలు తాకుటవలన కుడివైపు కనుగుడ్డులో నొప్పికలుగుట.

ఉపశమనము:— కాఫీవలన తలనొప్పితగ్గుట. లేపనముతోను, అంతపముందుగను మూత్రనాళములో యున్న మంట సంభోగమందుపశమించుట.

పోలికలు:— సైక్లమెన్, కాంసి, సేపియా, పల్సటిల్లా, రూస్టాక్స్.

మోతాదు:— 1 మొదలు 30 పొటెన్సీ.

---

## 25. ఎనంథిరం. ANANTHERUM.

(హిందూదేశపు ఔషధము. 8. వట్టివేళ్లు.)

ఇది ముఖ్యముగా కురుపులు, పుండ్లు, పుట్టవ్రణములు, సెగసవాయి దోషములు; మాంసగ్రంథులవాపులు, బాధలు, కంతులు మున్నగువాటిని

మాన్పును. శరీరముపై చీములు పొక్కుచున్నట్లుండు భావన, పుండ్లనుండి దుర్వాసనతోగూడిన స్రావము వెడలుట, తేమ్రగుపులు, వూపిరి దుర్వాసనతో నిండియుండుట — యివి దీని ముఖ్యలక్షణములు.

మనస్సు:—ఎక్కువ మనోవికాసము, మనస్సు మొద్దుబారుట, జ్ఞాపకశక్తితగ్గుట, వాడియైన బాణముతో మెదడుచీల్చివేయబడినట్లు బాధగా తోచుట, మరియు యీబాధ మధ్యాహ్నమున వుద్రేకము జెందుట.

తల:—కంతులు బయలుదేరుట; తల నిండుగాను, తిరుగుచున్నట్లును యుండుట; కుడివైపునను, నుదిటిలోను, కనుబొమలలోను మంటలుగాను, పోట్లుగాను బాధవచ్చుట, మరియు యీబాధతో వికారము, వమనానుమానము, కండ్లు ఎక్కువ బరువుగాను యుండుట; ఈబాధల వలన పిచ్చియెత్తినట్లగుట. బాధలు ధ్వనులవలనను, వెలుతురు వలనను, కదలికవలనను, మరియు అపరాహ్ణమందును రాత్రియందును వుద్రేకము జెందుట; తలలో నీరుయున్నట్లుండుభావన నడుచుచున్నప్పుడు ఎక్కువగుట; తలపైనీటిపొక్కులు, చీముతోనిండి పక్కులుకట్టిన కురుపులు, పుండ్లు.

కన్నులు:—కనుబొమలవద్ద సురుగుడుకాయలవంటి చిన్నచిన్న కాయలు బయలుదేరుట; కండ్లయెదుట మంటలు గుండ్రని ఆకృతిగా (చక్రమువలె) కనిపించుట; ప్రతివస్తువు ఎక్కువ కాంతితోను నిగనిగలాడుచుండును కనిపించుట.

చెవులు:—సాయంకాలమునను, తేమగాలిలోను, హెమము ఎక్కువగుట; గులిమి విస్తారముగా వుత్పత్తియగుట.

ముక్కు:—ముక్కుచివర కురుపులు, చిన్నచిన్నకంతులు బయలుదేరుట. పీల్చినవూపిరి మంచువలె చల్లగాయున్నట్లుతోచుటతో తుమ్ములు వచ్చుట, పుండ్లనుండి అకుపచ్చగాను దుర్వాసనతోను యుండు స్రావము వెడలుట, ముక్కుఎముకలవద్ద యెక్కువబాధ. ముక్కు మొదట చితుక

కొట్టినట్లు బాధగాయుండుట, ముక్కు-చివర చల్లగాను, పాలిపోయినట్లు గాను, మొనతేరినట్లుగను యుండుట.

ముఖము:—పసుపుపచ్చగాను, ఎర్రనిమచ్చలతోను యుండుట, కుట్టుచున్నట్లు బాధతోనుండు మొటిమలు బయలుదేరుట. కనుబొమలు, గడ్డము (వెంట్రుకలు) ఊడిపోవుట (పేనుకొరుకుట). ముఖము ఎముకలు వేరుచేయబడినట్లు లేక నలుగగొట్టబడినట్లు నొప్పిగానుండుట, సవాయిసంబంధమైన పుండ్లు. దౌడలు దగ్గరబడుట, మాంసగ్రంధులు వాచుట, మరియు చీముపట్టుట.

నోరు:—నాలుక వంచలుచీల్చబడినట్లువలె లోతైన పుండ్లుపడుట' పండ్లు చెడిపోయి ముక్కలుముక్కలుగా విడిపోవుట; నోటినుండి దుర్వాసన; పండ్లను బలవంతముగా వూడపీకినట్లు బాధగానుండుట, నత్తిమాటలాడుట, నాలుకమొదట కోసివేయబడినట్లు బాధగానుండుట, రసదోషమువలనవలె లాలాజలము యెక్కువగా వూరుట, మరియు నిస్త్రాణజెందుట, రుచి చేదుగాను లేక తియ్యగాను లేక రక్తపురుచిగాను యుండుట.

గొంతుక:—గవదకాయలు లేక టాన్సిల్సు, మంటగాను, కుట్టుచున్నట్లు బాధగాను, ఒక్కొక్కప్పుడు చల్లగాను వుండుట, దాహముజెందుట. "నీళ్లు" యనినమాట వినినప్పుడుగాని; నిగనిగలాడుచుండు వస్తువులు కనబడినప్పుడుగాని, గొంతుక ముడుచుకుపోవుట, గొంతుక వాచి బాధగానుండుట. మరియు నిండుగా నున్నట్లును లేక కప్పివేయబడినట్లును భావన గలుగుట.

అన్నకోశము:—ఆంత్రములయందు బద్దివలె వెడల్పుగను పొడవుగను వుత్పత్తిఅగు ఒకవిధమైన (Tapeworm) పురుగును సంబంధించిన దోషముచే బాధపడువారివలె అర్ధరాత్రిమున తీరనిఆకలిగొని నిద్రనుండి మెలకువజెందుట; ఎక్కువగా వికారము, వమనానుమానము గలుగుట, ఆహారమును, రక్తమును, లేక పైత్యరసమును వమనము చేసుకొనుట. ఆహారపురుచితో త్రేపులు వచ్చుట. చీల్చుచున్నట్లును కొరుకుచున్నట్లును

బాధగానుండుట. ఒకవుండనంటిది పైకిని దిగువునకును కదలుచున్నట్లు భావనగలుగుట, లాగుచున్నట్లు, పీకుచున్నట్లు, ముడుచుకొనిపోవునట్లు వుండు బాధలు.

పొత్తికడుపు:—ప్లీహమువద్ద మంటలుగాను, పోట్లుగాను వుండుట. పేగులలో నులిమివేయుచున్నట్లును, చీల్చుచున్నట్లును యుండుట, మరియూ వీటితో వికారము, వమనములు ద్వంద్వముగా యుండుట; కాలేయము వాచుట, బాధగానుండుట, గజ్జలలోవాచుట.

మలము, మలాశయము:—మలము అమముతోగూడియు, రక్తముతోగూడియు, పసుపుపచ్చన, గోధుమ మిశ్రిమ వర్ణముగాను వెడలుట. లేక తెల్లగను, కలరాలోవలెను వెడలుట. విరేచనము దుర్వాసనగను మరియు పొత్తికడుపులోను ఆసనములోను శూలతోను మంటతోను వెడలుట; ఆసనము దురద; తీరని విరేచనబద్ధము; మలము గట్టిగాను వుండలవలెను లేక మేకపెంటికలవలెను వెడలుట. ఆసనమువద్ద పెద్దపెద్ద కురుపులు బయలుదేరుట, మూలశంఖ.

మూత్రావయవములు:—నిద్రిలోను, నడుచుచున్నప్పుడును, అప్రియత్నముగా మూత్రిము వెడలుట, మూత్రిము మురికిగాను, చిక్కగాను, అమములోనిండియు వెడలుట, తరుచు మూత్రినుమానము.

పురుషావయవములు:— సవాయి రోగముతోవలె పుండ్లుఅగుట, సంభోగకోర్కె తీర్పప్రియత్నించుకొలది, సంభోగవాంఛ ఎక్కువఅగుటతో హస్తప్రియోగము చేయనుద్యమము గలుగుట, మరియు తుదకు (మద) పిచ్చియెత్తుట.

స్త్రీ అవయవములు:— స్థనములలో పుండుపడినట్టి గట్టికంతి, చర్మోనలు పుండ్లుపడుట, స్థనములు వాచుట. మర్మావయవమునందు తెల్లని లేక ఎర్రిని దద్దురు లేక పొక్కులు బయలుదేరుట.

శ్వాసావయవములు:—స్వరపేటిక పుండుపడినట్లుండుట, త్రాగిన పానీయములు ముక్కురంధ్రములలోనికి వచ్చుట, గొంతుక బొంగురుతనము;

మానునట్టియు, విడిచివిడిచి వచ్చుచుండునట్టియు, మరియు శరీరమును కంపింపజేయునట్టియు దగ్గు సాయంకాలమందును రాత్రియందును గాలి దుమ్మును పీల్చుటవలనను వుద్రేకము జెందుట.

హృదయము:—హృదయసమీపమున మంటగాను కుట్టుచున్నట్లును ముడుచుకుపోవునట్లును నొక్కుచున్నట్లుగాను బాధగానుండుట; హృదయము ఆగిపోవునట్లును, శవమువలె బలములేనట్లును తోచుట.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—నడుము నొప్పి; మెడ మరియు నడుము కొయ్యబారుట, పైఅవయవముల కీళ్ళసంధులలో వాతపు (మేహ వాతపు)నొప్పులు; గోళ్ళు చెడిపోవుట, మరియు నివి వక్రముగా యెదుగుట, చంకలలోని మాంసగ్రంధులు వాచుట, పాదములకు దుర్వాసనతోగూడిన చెమటపట్టుట.

చర్మము:—కురుపులు, పుండ్లు, దురదలు, పొక్కులు, దద్దురులు.

వుద్రేకము:—పంటిసలువునకు వైనువలనను కాఫీవలనను.

వుపశమనము:—కాఫీవలన మొదట వుద్రేకము జెందినపిదప.

పోలికలు:—ఆవీనాసతీవా, తూజా, మెర్క్యూరియస్, స్టాఫిసేగ్రియా, బెల్లడోనా, లెకెసిస్, కెన్నబిస్ యిండికా.

విరుగుళ్ళు:—ఆరోమెటిక్ లిక్కర్సు (సువాసన (బ్రాందీలు).

సరిపడనివి:—వైనులు, స్పిరిట్సు.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 26. అంగశ్చురా. ANGUSTURA VERA.

ఇది పక్షవాతమువీుదను, మేహవాతనొప్పులవీుదను బాగుగా పని చేయును. నడక బహుకష్టముగానుండుట, నడుచుచున్నప్పుడు కీళ్లసంధులలో కరుక్కుమని శబ్దమగుచుండుట, శరీరములోనున్నట్టి పొడుగుపాటి

ఎముకలుపుచ్చుట. ఎముకల సంబంధమైన నొప్పులు. కండరములలోను, కీళ్లసంఘలలోను ముడుచుకొనిపోవుచున్నట్లుండుట. ధనుర్వాతము.

తల:—నొప్పి సూర్యాస్తమయసమయమందు ప్రారంభించి రాత్రి పరుండువరకును వుండుట. తలనొప్పి నొక్కుచున్నట్లుండుట. ముఖము వెచ్చన. బాధవలన తాగినవానివలె స్మారకము తప్పుట..

అన్నకోశము:—భోజనానంతరమునను, పొగచుట్టతాగిన తరువాతను నోరు చేదుగానుండుట. పులితేనుపు. కాఫీయందు ఎక్కువ కోర్కెయుండుట: భోజనమందిచ్ఛయుండకపోవుట. భోజనము చేయుచున్నపుడు పైత్యవికారముతోకూడిన వమనానుమానము గల్గుట.

మలము, మలాశయము:—తరుచు పెద్దపెద్ద ఆంబకి రేచనములు,వీటితోపాటు శూలపచ్చుచుండుట. రాత్రింబవళ్లు నీళ్లవిరేచనములగుట. విరేచనమునకు ముందుగ, కడుపులో కోయుచున్నట్లు బాధగానుండుట, విరేచనమగునపుడు ఆసనము మంటగానుండుట.

మూత్రావయవములు:—తరుచుగా మూత్రవిసర్జనానుమానముతో మూత్రము స్వల్పముగా వెడలుచుండుట. ఒకప్పుడు మూత్రమెక్కువగా వెడలుట. అప్పుడు మూత్రకోశము బరువుగానుండుట. మూత్రము వెడలినపిమ్మట మూత్రనాళములో తీపుగానుండుట.

వృద్ధికము:—నొక్కుటవలన, పరిశ్రమవలన, కదలికవలన.

ఉపశమనము:—శీతలోపచారముల వలన.

పోలికలు:—నక్సువామికా, రూటా, మెర్క్యూరియసు.

విరుగుళ్లు:—కాఫీ, బ్రియోనియా, చెలిడోనియం.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 3 మొదలు 4 వారములు.

## 27. యాంతిమిస్. ANTHEMIS NOBILIS.

(హిందూదేశపు ఔషధము. 9. సీమచామాలి పుష్పము.)

అజీర్ణదోషములును, పొట్టలో ఎక్కువ చల్లదనమును, చల్లనిగాలిని, చల్లదనమును భరింపలేకపోవుటయు దీనిముఖ్యలక్షణములు.

తల:—నడినెత్తిని తీవ్రమైననొప్పి, తల లోపలనుండి బయటకు నొక్కివేయుచున్నట్లును కపాలము ఎగిరిపోయినట్లును యుండుబాధ.

నోరు:—నాలుకపై అచ్చటచ్చట తెల్లనిపూత.

పొత్తికడుపు, మలాశయము:—పొట్టలో అడ్డముగాయున్న పెద్ద పేగువద్ద కుడిపైపునుండి ఎడమపైపునకు నొప్పివ్యాపించి, అంత్రములు సడలిపోయి, ప్రథమమున మలము తెల్లగను, అటుపిమ్మట బద్దివలెను వెడలి అటుపిమ్మట వాంతులు, పొట్టలో నమలివేయుచున్నట్లుండు నొప్పిగల్గుట. మరియు, విరేచనమునందు కోర్కెగలుగుచుండినను విరేచనమవకుండుట. పొట్టలో ఎక్కువ చల్లదనము, చలి,—ఇది ఇగువకు మోకాళ్లవరకు వ్యాపించుట. క్రిమిదోషముతోవలె ఆసనము దురద.

స్త్రీ అవయవములు:—గర్భాశయరక్తస్రావములు.

శ్వాసావయవములు:—రొంప, తుమ్ములు, కన్నీళ్ళుకారుచుండుట, ఇంటిలోపల నున్నప్పుడు లక్షణములు దేృకించుట. గొంతుక ముడుచుకొని పోయినట్లు బాధ. గొంతుకలో గిలిగింతలుపెట్టుచుండుటతోనుండు దగ్గు వెచ్చనిగదిలో వృద్ధికించుట.

మూత్రావయవములు:— తరుచు మూత్రము వెడలుట. మూత్రకోశము పెద్దదై వేృలాడుచున్నట్లుభావన. రేతోవాహికపాడుగునను బాధ.

చర్మము:—చర్మము మెత్తగను, వేృలాడుచును యుండుట. ఒరిసినట్లు అరికాళ్ళు దురదగానుండుట.

పోలికలు:—సినా, కాలీసల్ఫ్.

మోతాదు:— 3 మొదలు 30 పొటెన్సీ.

## 28. ఎపోసైనం. APOCYNUM CANNABINUM.

♦ ఉబ్బులక్షణములు కాలేయ దోషముల ననుసరించి యుండుట ♦ తరచుగను, బాధలేకుండగను, పెద్దపెద్ద విరేచనము లగుచుండుట. ♦ తల గడనుండి తలనెత్తినచో సొమ్మసిల్లునంతటి నిస్త్రాణ ♦ యుక్తవయస్కురాండ్రిలో బహిష్టు అణగిపోవుట. ముట్లుడుగు కాలమందు గర్భాశయ రక్తస్రావములు—ఇవి దీని ముఖ్యలక్షణములు.

దీనిలక్షణములు చాలవరకు "యాపిసు" ను పోలియుండును. ఇది ముఖ్యముగా తలకు, ఛాతీకి, నీరుపట్టుటను, అపరిమితమైన ఋతురక్త స్రావమగుటను మాన్పును. చమట, అల్పాచమానము తక్కువగా నగుట. కనుయినా ఎక్కువగా వాడినపిమ్మట వచ్చిన ఉబ్బులమీద నిది బాగుగా నడుచును. వాపు, బాధ, రసితోకూడిన పొరలలో ఉబ్బు, వీనితోపాటు దాహముండుట (యాసిడ్ ఎసెటిక్). నీళ్లుత్రాగిన అవి యిమడక పోవుటతో వమనమగుట (ఆర్సెనికం ఆల్బం). జలోదరము. యాపిసు, ఎపోసైనం మరియు డిజిటాలిసువలన కుదరనిఉబ్బులు "బ్లేటా ఓరియంటాలిసు" వాడుటవలన కుదిరినవి. త్రాగుడువలన కలిగిన రోగగుణముల నిసెపోగొట్టును.

తల:—నీరుపట్టుట, ఒకకన్నుకు దృష్టి చెడిపోవుట, తలభారము.

హృదయము:—నాడి ఒకప్పుడు సరిగాను మరొకప్పుడు విడిచి విడిచియు కొట్టుకొనుచుండుట. ఇంకొకప్పుడు నాడి సన్నగిలిఅనకపోవుట. పుగాకు నుపయోగించుటవలన వచ్చు హృదయరోగములు.

శ్వాసకోశము:—పొట్టలోను, ఛాతీలోను నొక్కుచున్నట్లుండుటచే ఊపిరాడకపోవుట (లోబీలియా ఇన్ఫ్లేటా).

మూత్రావయవములు :— మూత్రావయవదోషముతో కూడిన ఉబ్బులు. మూత్రపిండముల దోషములవలనవచ్చిన రోగములనిది మాన్పును.

స్త్రీ అవయవములు:—పడుచుపిల్లలలో ఋతువు ఆగిపోవుట.

కాళ్ళు, చేతులు, పొట్ట, ఉబ్బుట. ముట్టుడుగు కాలమునందు గర్భాశయ రక్తస్రావములు. తలతిరిగుట, వమనానుమానము, గుండెదడ, నాడిదుడుకుగానుండుట, నిస్త్రాణచెందుట. గర్భిణులలోవచ్చు పొడిదగ్గులను మాన్పును (కోనియం). పురుడువచ్చిన పిదప వచ్చు కంపములమీద నిది బాగుగా పనిచేయును.

మలము, మలాశయము:—మలము పల్చగానున్నను, విరేచన బద్ధముండుట. ఒకప్పుడు అజీర్ణసంబంధమైన నీళ్లవిరేచనములు, విరేచనానంతరము బహునీరసముగానుండుట. మూలశంఖవలన ఆసనములో కొయ్యకొట్టినంతటి బాధయుండుట.

శ్వాసావయవములు:—పడకనుండిలేచుసరికి ముక్కు, గొంతుక పచ్చని చిక్కని శ్లేష్మముతో నిండియుండుట. పసిపిల్లలలో ముక్కునుండి ఎడతెగని స్రావమును రొంపను మాన్పును (శాంబూకసు).

కాళ్ళు, చేతులు:—ఒకచేయి ఒకకాలు ఎప్పుడును కదల్చుచుండుట (ఎడమవైపువాటికి బ్రియోనియా).

నిద్ర:—అస్థిమితముతోకూడిన నిద్ర.

పోలికలు:—స్ట్రామోనియంతసు, యూపెసు, ఆర్సెనికం ఆల్బం, యూపిడు ఎపెటిక్, డిజిటాలిసు, చైనా, కోల్చికం.

వృద్ధికము:—చల్లదనమువలన, శీతలోపచారముల వలన, కదలిక వలన, హృదయమున మెలకువ జెందుటతో.

ఉపశమనము:—పరుండుటవలన.

మోతాదు:—టించరు మొదలు 200 పొటెన్సీ. టించరుకు మోతాదు 1కి 5 చుక్కలు కొంచెమునీళ్లలో వేసి ఒక్కమోతాదుగా వాడవచ్చును. త్రాగుడువలన కలిగిన దుర్గుణములను మాన్పుటకు టించరును మోతాదుకు ఒక డ్రామును 4 ఔన్సుల నీళ్లలో కలిపి పుచ్చుకొనవలయును.

## 29. ఎపోమార్ఫియా. APOMORPHIA.

వికారము లేక తలతిరిగ్గు, బడలిక లేక ఆలసట, మరియు లాలా జలము, ఆమము, కన్నీళ్లు, ఎక్కువగా వెడలుట గలుగుచు, అతి తీవ్రము గాను, ఆకస్మికముగాను వాంతులగుట.—ఇవి దీని ముఖ్యలక్షణములు.

ఇతర రోగలక్షణములకు (మెదడుపై బయలుదేరు కంతులయొక్క ఒత్తుడు మున్నగువాటికి) సంబంధించి వమనములగుట. విడువని వికారము, నిద్రలేమి, అతి ఆందోళన మరియు పరాకుమాటలతో తలతిరిగ్గు, విరేచన బద్ధము. శరీరము శుష్కించుట, అపస్మారలక్షణములును నల్లమందును త్రాగుడును అలవాటుగల రోగిలో గల్గినప్పుడు డాక్టరు హాల్బర్టుగారీ యౌషధమునిచ్చి కుదిర్చిరట.

సముద్రయానమునందుగల్గు వమనములను వేవిళ్ళను, వమనముకొరకు తీరని ఇచ్ఛగల్గుటను, వికారమును, సాధారణ వమనములను, గుండెలలో మంటను, వీపు పైభాగమున బాధను నల్లమందు అలవాటును త్రాగుడువలని దోషములను ఇది మాన్పును.

తల:—కనుపాపలు పెద్దవగుట, తలతిరిగ్గు, తలవెచ్చన.

**పోలికలు:—యాంటిమెంటార్టు, ఇపెకాక్, ఓపియం.**

**మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.**

---

## 30. యాక్విలీజియా. AQUILEGIA VULGARIS.

ఇది హిస్టీరియా లేక అపస్మారముమీద పనిచేయును. అపస్మారములో, తలలో ఒకవిధమైన బాధగానుండుట, గొంతుకలో ఉండవలె లేక బంతివలెనుండుట. ముట్లుడుగుకాలములో ఉదయమున పసరుతోకూడిన వమనములగుచుండుట,—ఇవి దీని ముఖ్యలక్షణములు.

మనస్సు:—నిద్రపట్టకపోవుట. నరముల నిస్త్రాణ, దీనివలన శరీర మంతయు కంపించుచుండుట.

స్త్రీ అవయవములు:— యుక్తవయస్కురాండ్రిలో వచ్చుబుతు శూల. బహిష్టులో స్రావము తక్కువగానగుట. రాత్రియందు నడుములో కుడివైపున నొక్కుచున్నట్లు నొప్పిగానుండుట.

పోలికలు:—ఎకోనైటు, యాక్టియారేసిమోసా.

మోతాదు:—1 మొదలు 30 వరకు.

---

## 30 ఆర్నికా. ARNICA MONTANA.

భయమువలనను, క్రోధమువలనను, అధిక సంభోగమువలనను, ప్రమాదవశమున తగిలిన దెబ్బలవలనను, వచ్చు రోగములలో నిది బాగుగా పనిచేయును. రక్తపుష్టిగల మనుష్యులకును, నరములనిస్త్రాణచే బాధపడు వారికిని ఇది బాగుగా వుపయోగపడును.

దెబ్బలు లేక గాయములవలన శరీరముకమికిపోవుట, రక్తము పేరుకొనుట, రక్తము స్రవించుట, వాపుగాను బాధగాను వుండుట మొదలగు లక్షణములకు దీనినివాడనగును. ఈసందర్భమున యాసిడ్ సల్ఫ్యూరిక్, కలెండ్యులా, కోనియం, హైపెరికం, లెడం, రూస్టాక్సు, రూటా, స్టాఫిసేగ్రియా, సింఫైటం అను మందుల గుణములయొక్క తారతమ్యముచూచి వుపయోగించుట మంచిది. అతినీరసము, దేహమంతయు చితుకకొట్టినట్లు నొప్పిగాయుండుట, తలగాని ముఖముగాని వెచ్చగానుండుట. తక్కిన శరీరమంతయు చల్లగానుండుట, రక్తనాళములనుండి బహుసులభముగా రక్తము స్రవించుట.

♦ పరుండి యున్నవైపు అవయవములు లేక పార్శ్వములు ఎక్కువ నొప్పిగా యుండుట. ♦ త్రేనుపులు చెడిపోయిన గుడ్లవాసనతో నుం

డుట. ♦ ముఖముగాని తలగాని వెచ్చగాయుండి, మిగిలిన శరీరమంతయు చల్లగా నుండుట. ♦ ఛాతీలో ఎడమవైపు కుట్టుచున్నట్లుండుబాధ పొడి దగ్గువలనగాని కదలికవలనగాని వృద్ధికించుట, మరియు నొక్కుటవలన వుపశమించుట. ♦ దెబ్బలుతగులుట, పడుట, అవయవములు నలిగిపోవుట చితికిపోవుట, విరిగిపోవుటవలని దోషములు. ♦ బాధగావున్న ప్రదేశము లందు అస్థిమితము.—ఇందుపడనవి తమతమస్థానములను తరుచుమార్చుచుం డుట మరియు ప్రతిచోటును గట్టిగాయున్నట్లు భావనగలుగుట. ♦ సన్ని పాతజ్వరములో రోగి నిర్లక్ష్యభావముతో నున్నట్లగపడుట. మగతగానుం డుట. ప్రశ్నలకు ప్రత్యుత్తరములు చెప్పుచూ నిద్రజెందుట, వూపిరి దుర్వాసన, శరీరమందచ్చటచ్చట పొడలుపొడలుగా యెఱ్ఱని మచ్చలు. ♦ రోగి పుల్లనివస్తువులను సారాయి మొదలగు పానీయములను, చల్లనినీటిని కోరుచుండుట. మాంసము, పాలు, పొగాకు వీటియందయిష్టత జెందుట.

మనస్సు:—పరాకుమాటలు. తనలోతాను గొణుగుకొనుట, ఒకప్పు డు మగతగా యుండుట, ఇట్లు మన్యపుజ్వరములోను, సన్నిపాతజ్వరము లోను కలుగుచుండుట (బేప్టీషియా, యాసిడ్ ఫాసు) శరీరములో చితుక కొట్టినట్లు నొప్పిగాయుండుటచే, యితరులు తన్ను తాకుటకుగాని, సమీ పించుటకుగాని భయముగా నుండుట, మఱియు యీనొప్పివలన రోగి స్థిమి తముగా పరుండలేక తరుచు దొర్లుచుండుట. హృదయవేదనవలన చని పోవుదునను భయముతో, నిద్రనుండి మెలకువజెందుట. సంధిలో ప్రక్క గుడ్డలను పోగుచేయుట. జ్ఞాపకశక్తి తగ్గిపోవుట. రుద్రవాతము. పిచ్చి.

తల:—నరముల దోషములవలన పార్శ్వపునొప్పులు వచ్చుచుండుట. ఉదయమున నడచుటవలని తలనొప్పి. కనుబొమలలో కుట్టుచున్నట్లు నొప్పులు. దెబ్బలుతగులుటవలన కలుగు వ్యాధులు, తలవెచ్చగా నుండుట. శరీరమంతయు చల్లగానుండుట. తల ముడుచుకొనిపోయినట్లుండుట. తల త్రిప్పు పరుండుటవలన వుపశమించుట. నొక్కుచున్నట్లుండు తలనొప్పి.

కన్నులు:—కండ్ల నెక్కువగా వుపయోగించుటవలన కలుగు కండ్ల

నొప్పులు. కండ్లు లోతునపడుట. దెబ్బతగులుటవలన చితుకకొట్టినంతటి నొప్పితోను, వాపుతోను, యెరుపుగాను వుండుట. రక్తస్రావము. రక్తము గడ్డకట్టినపుడు వెంటనే దానిని హరించివేయును. రెప్పలు ఆర్చుకొని పోయి వెచ్చగాను వాపుతోను, నొప్పిగాను వుండుట. పాపలు ముడుచుకొనిపోవుట.

చెవులు:—చితుకకొట్టినట్లు నొప్పి. చెవులవెనుక పొట్టుచున్నట్లు పోటుగానుండుట. చెవులు ఆర్చుకుపోయి యుండుట. రక్తస్రావము. ధ్వనులు వినపడుచుండుట. కదలుచున్నప్పుడు సరిగా మాట వినపడకపోవుట.

ముక్కు:—దగ్గుటవలన పలుచని, ముదరరంగు రక్తము స్రవించుట. వాచి, చల్లగ, నొప్పిగ వుండుట. విపరీతమైన తుమ్ములు.

ముఖము:—ఒకదౌడ యెర్రగాను, మంటగాను వుండుట. అడుగుపెదవి 'టైఫసు' జ్వరములో వణకుచుండుట. పెదవులు పగులుట. ముఖము ముడుచుకొనిపోయినట్లుండుట.

నోరు:—ఆర్చుకుపోయి దాహముతోను దుర్వాసనతోను యుండుట. శస్త్రచికిత్సానంతరము పంటినొప్పివచ్చుట. పండ్లను వూడతీసిన పిమ్మట కలుగు రక్తస్రావమును కట్టును.

అన్నకోశము:—దెబ్బలు తగులుటతో అన్నకోశమంతయు నొప్పి, బాధగలుగుట. మరియు అన్నకోశమునుండి రక్తమును వాంతిచేసుకొనుట. చేదుగాను కుళ్ళినగుడ్లవాసనను పోలిన త్రేణుపులు. రక్తవమనానంతరము భోజనముచేసినను పానీయముత్రాగినను తరిగితిరిగి రక్తవమనము లగుచుండుట. భోజనముచేయునపుడు రాతిచే నొక్కబడుచుండునట్లుండుబాధ. మరియు అన్నకోశము వెన్నెముక వైపునకు నొక్కివేయబడుచున్నట్లు వుండుట.

పొత్తికడుపు:—ఉబ్బరించుట (కార్బోవెజ్, నక్సువామికా). దుర్వాసనతోకూడిన వాయువుచేరి వుబ్బరించుట. జిగటవిరేచనములతో ఘలె నొప్పి, శూలయుండుట. ప్రక్కయెముకలక్రిందను కుట్టుచున్నట్లు

నొప్పిగానుండుట, దీనివలన ఊపిరిపీల్చుట కష్టముగానుండుట.

మలాశయము:—రాత్రి, నిద్రలో అప్రయత్నముగా మలమువెడలుట. మలము పల్చగాను, ఆమముతోకూడి తెల్లగాను, నురగగాను వెడలుట; ఒకప్పుడు రక్తము, చీము, తీపుతో వెడలుట. తరుచు విరేచనములగుచుండుట. నీరసమువలన ప్రతివిరేచనానంతరము పరుండవలసివచ్చుట.

మూత్రావయవములు:—మూత్రము త్వరగా వెడలకపోవుట. మూత్రములో యిటుకపొడివంటి పదార్థము వెడలుచుండుట. ఒకప్పుడు మూత్రములో రక్తముకలసి వెడలుచుండుట. దెబ్బలవలని రక్తస్రావము. మూత్రపిండములవాపు. ఎక్కువపరిశ్రమవలన మూత్రము ఆగిపోవుట.

పురుషావయవములు:—ఇవి వాచి నీలిరంగు, ఎరుపు మిశ్రమముగా కనపడుట. దెబ్బతగిలినందువలన వచ్చిన బుడ్డ. అధికసంభోగమువలన గలిగిన నపుంసకత్వము.

స్త్రీ అవయవములు:—బహిష్టుకు బహిష్టుకు మధ్యను రక్తస్రావము కలుగుచుండుట. చన్మొనలు పుండ్లగుట, బాధగానుండుట. ప్రసవానంతరము మర్మావయవములో నొప్పులుగానుండుట. ఇది వేవిళ్లకుపుంచి ఔషధము. పడుటవలన గర్భవిచ్ఛిత్తు అగుటను మాన్పును. నొప్పులు యెక్కువగావచ్చుచున్నను శీఘ్రముగా ప్రసవము కాకపోవుట. మరియు శరీరమంతయు చితుకకొట్టినట్లుండుట. గాయములవలనగలుగు స్తనముల వాపు. దెబ్బతగులుటవలన గర్భాశయము వెలుపలకు వచ్చుట. ప్రసవించిన పిమ్మట దీనిని వాడినయెడల సూతికజ్వరము రాకుండ అపుచేయును. మరియు మైలను వెలువరించి గర్భాశయములోని కండరములు తిరిగి ముడుచుకొనునట్లు చేయును.

శ్వాసావయవములు:—పిల్లలు యేడ్చుటతోవచ్చు దగ్గు. కోరింత దగ్గు. ఫిట్టువచ్చుటకు ముందు బిడ్డ యేడ్చుట. దగ్గువలన కండ్లు యెఱ్ఱబడుట. ఒకప్పుడు ముక్కునుండి రక్తము స్రవించుట. పుబ్బసమువలన

ఇటూఅటూ తిరుగవలెనని యుండుట, అర్ధరాత్రిమగువరకు నిద్ర రాకుం డుట. చనిపోవుచున్నవానివలె నగుపడుట. దెబ్బలవలన గలుగు రక్తస్రావ ములు. ఛాతీలో ఎడమవైపు కొద్దికొద్దిగా కుట్టుచున్నట్లుండు బాధలు వీటితోపాటు కొద్దిగా దగ్గువచ్చుట, యీదగ్గు కదలుటవలన హెచ్చగుట.

హృదయము:—విపరీతముగా పరుగెత్తుటవలన రొమ్ముయొుక్క అడుగున నొక్కుచున్నట్లుండుట. నాడి సన్నముగాను, వక్రముగాను, వూపిరాడకపోవుటతోను, గుండెదడతోను కూడియుండుట. హృదయము క్రొవ్వుచే కప్పబడియుండుట, మరియు నీరుపట్టుట.

నడుము, కాళ్లు, చేతులు:—నడుమువంచి పనిచేయునప్పుడు బాధలు వచ్చునట్లుగా వుండుట. అధికపరిశ్రమవలని నొప్పులు. ప్రతివస్తువు గట్టి గాయున్నట్లగపడుట. నడుము బాధవలన తిన్నగా నడువలేకపోవుట. కీళ్లలోను, నడుములోను, కాళ్లు చేతులలోను చితుకకొట్టినట్లు నొప్పులు. వర్షాకాలమందు వచ్చు కీళ్లనొప్పులు.

చర్మము:—చిన్నచిన్న కురుపు లెక్కువగావేయుట, ఇవి మానుచు వెంటనే తిరిగితిరిగి వేయుచుయుండుట. పడక రాపడమువలని పుండ్లు. దురద, మంటతోకూడిన చిన్నచిన్న మొటిమలు బయలుదేరి, గట్టిగాను అన్నియు ఒకేసైజుగానుయుండుట. చర్మము నల్లగను నీలిరంగుగనుఅగుట.

నిద్ర:—పగలు యెక్కువ మగతగాయుండుట, నిద్రరాకపోవుట. ఒకప్పుడు మగతవలన స్మృతితప్పియుంటూ పరాకుమాటలాడుచుండుట. రాత్రి నిద్రలేచుసరికి తల వెచ్చగానుండుట, ఇది యెక్కువగునని రోగి నిద్రపోవుటకు యిష్టపడకపోవుట. నిద్రలో మృగములు, శవములుమొదలగు నవియుండు భయంకరమైన కలలు కనుట. నిద్రలో పెద్దపెద్ద కేకలువేయు చుండుట, మాట్లాడుచుండుట. ఒకప్పుడు అప్రయత్నముగా మూత్రమును మలమును విడుచుచుండుట నడచుటవలన నిద్రమత్తు, తలభారముకలుగుట.

జ్వరము:—శరీరము, తలవణకుచుండుట, ఒకప్పుడుతల వెచ్చగాను

యెఱ్ఱగాను, ముఖము వెచ్చగాను, చేతులు చల్లగాను తుంట్లు వీపు భుజములు చితుకకొట్టినట్లు నొప్పిగానువుండుట. రాత్రిలయందు పుల్లనివాసనగల చమటపట్టుట. దీనిలక్షణములన్నియు సన్నిపాతజ్వర లక్షణములను పోలియుండును. ఇది మన్యపుజ్వరము, సన్నిపాతజ్వరము, దెబ్బతగులుట వలన వచ్చిన జ్వరము, వీటిమీద బాగుగా పనిచేయును. పైకి వెచ్చగాను లోపల చలిగాను వుండుట. జ్వరమువచ్చుటకు ముందుయెముకలలో లాగుచున్నట్లు నొప్పిగానుండుట. ఉదయమున చలిగానుండుట.

ఉద్రేకము:—విశ్రాంతివలన, పరుండుటవలన, సారాయి మొదలగువాటివలన, తాకుటవలన, తేమతోకూడిన చల్లదనమువలన, కదలికవలన, ధ్వనులవలన.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో, చన్నీటిస్నానముచలన, నిబ్బరముగా కూర్చుండుటవలన, తల పల్లముగానుంచి పరుండుటవలన.

ఇది రూస్టాక్సు, ఎకోనైటు, బ్రియోనియా, ఇపెకాక్, విరేట్రిం ఆల్బం, వీటికి తరువాత వాడిన బాగుగా పనిచేయును.

విరుగుళ్లు:—ఇగ్నిషియా, ఆర్సెనికం ఆల్బమ్, కేంఫర్, కాఫీ.

మోతాదు:—మదరుటించరు మొదలు 200 పొటెన్సీ.

కుక్కలు మరియు పిచ్చియెక్కినట్టిగాని కోపముతోకూడియున్నట్టిగాని మృగములు కరచినపుడు దీనిని వాడరాదు.

బాహ్యోపయోగములు:—మొద్దు ఆయుధములు, పనిముట్లు, వీటివలన కలిగిన కముకుదెబ్బలు, గాయములు తగిలినప్పుడిది వుపయోగించవచ్చును. మరియు బిగువైన పాదరక్షల (జోళ్లు) వలన కాలియొక్క చర్మము కముకుటకు, మరియు వుండుపడుటకు, పడకరాపడమువలన కలిగిన పుండ్లకు, త్వరలో యెదుగనటువంటి కురుపులకు, దురదలకు, వొరుపులకు, ఆనికాయలకు, కీళ్లసంబంధమైన కండరములలోని నొప్పులు బహిరంగమైన శీతగాలివలన కలిగినపుడు, చితికిన లేక నలుగకొట్టబడిన శరీరము

లేక అవయవములకు, విశేషనడకవలన పాదములు పొక్కుటకు, గుర్రపు స్వారివలన తుంట్లలోనొప్పికి, వృషణములలో చితుకకొట్టినట్లుండు బాధకు వీటికి దీనినివాడవచ్చును. ప్రసవానంతరము చన్మొనలలో నొప్పికి, బాధకు వాడవచ్చును, గర్భిణీస్త్రీలు దీనిని 9వ మాసములో చన్మొనలకు పట్టించినయెడల యీబాధ రానేరదు. చర్మము చితికినను లేక పుండైనను లేక కోయబడినను అట్టిచర్మముపై దీనిని వుపయోగించరాదు. అట్టి స్థితులలో కాలెండ్యులా వాడతగినది. పైన వ్రాయబడిన లక్షణములకు ఆర్నికాటించరును పదిరెట్లు నీళ్లలోగాని గ్లిసరినులో కలిపిగాని, కలపక గాని పైకి పట్టించవచ్చును. ఈ ఔషధముతో తయారుచేయు బడు మన్న ఆర్నికాతలనూనె చుండ్రు మొదలగు తలవెంట్రుకల రోగములను మాన్పి చక్కని, మెత్తని, నునుపైన తలవెంట్రుకలు పెరుగునట్లు చేయుటలో చాలా సహాయపడును. మరియు వెంట్రుకలూడిపోవుటను, బట్టతలయగుటను, వెంట్రుకలు తెలుపెక్కుటనుకూడ మాన్పును.

---

## 32. ఆర్టిమీషియావల్గారిస్. ARTIMISIA VULGARIS.

(హిందూదేశపు ఔషధము. 10. మాచిపత్రి)

స్రావములన్నియు ఒకవిధముగా వెల్లుల్లివాసననుబోలిన దుర్వాసనతోయుండుటయు, ఎడమవైపు అవయవములకు పక్షవాతము వచ్చుటయు మరియు కుడివైపుఅవయవములకు కంపముగలుగుటయు దీనిముఖ్యలక్షణములు.

మూర్ఛ, కొరియా రోగములలోవలె శరీరము వంచుకుపోవుచుండుట. హిస్టీరియా లేక అపస్మారము మున్నగు రోగములు, తలకు నీరు పట్టుట, బాలపాపచిన్నె మొదలగు రోగములలో కంపముతో వచ్చు రోగలక్షణములు—వీటిమీద నిది బాగుగాపని చేయును.

మనస్సు:—భయము, విచారము, తలపైదెబ్బతగులుటతో వచ్చు మూర్ఛలక్షణములు. ఫిట్లుదూరదూరముగా వచ్చుచుండుట. బహిష్టుదోష

ములతోగాని, అత్యధికముగా లేక చాలసేపు నృత్యముచేయుటవలనగాని, మూర్ఛసంబంధమైన ఫిట్లువచ్చుట (సాధారణముగానిది క్రిమిదోషము. స్వప్నస్ఖలనములు, బహిష్టుదోషములు, హస్తప్రయోగము మున్నగువాటితో వచ్చునుగాన ఈలక్షణములకు ముందుగా చికిత్స చేయవలయునని డాక్టరు చౌదరిగారు వ్రాసిరి). నిద్రలోనడచుట. భయమువలనగలుగు మానసికదోషములు, రోగస్వభావమును బట్టిగాని లేక శరీరపరిశ్రమవలన గాని, కండరములు కొయ్యబారుటతో గూడిన నరములదోషములు. కంప ములకు పిదపవచ్చు మగత. అపహరించుటయందు కోరిక.

తల:—మెదడునందు రక్తమెక్కువగా జేరుట. పోడుచుచున్నట్లుండు తీవ్రమైనబాధ. కండరములు ముడుచుకుపోవునట్టి దోషములవలన తల వెనుకకులాగబడుట. తలను ప్రక్కవైపులకు లేక వెనుకకు వంచుచుండుట.

కన్నులు:—రంగుఅద్దములలోనుండివచ్చు వెలుతురును చూచిన తల దిమ్మవచ్చుట. యీలక్షణము తెల్లనికాంతిని చూచునప్పుడు మాత్రము కలుగకపోవుట. రోగతీవ్రతగలుగుటకు ముందుగనే కనుగుడ్లు పైపైపు నకు పోవుట. కండ్లనునలుపుకొనినపిదప కొలదిసేపు కంటిబాధతగ్గి, దృష్టి బాగుగా ఆనిననూ కొలదిసేపు కండ్లనుపయోగించిన బాధ లెక్కువగుట.

ముఖము:—పక్షవాతములోవలె ముఖమునందలి కండరములు ఒక వైపు (ఎడమవైపు) ముడుచుకుపోవుటతో మూతివంకరయగుట. ముసలి చూపువచ్చుట. పంటికుదుళ్లకు నమలుచున్నట్లువలె కదలిక గలుగుట. పండ్లను పటపటలాడించుచుండుట, అడుగు దౌడఎముక ముందువైపునకు తోయబడుట.

పండ్లు:—చేతి బొటనవ్రేళ్లు గుప్పిటిలోనికి ముడుచుకొనిపోవుట. కండ్లుపైపైపునకు లాగబడినట్లగుటతో అరచూపువచ్చుట. నోటివద్ద నురగలువచ్చుట మరియు పండ్లు పటపట కొరుకుచుండుట.

నోరు:—మాట స్పష్టముగా ఆడలేకపోవుట, ఎక్కువశ్రమతో

ఒక్కొక్క మాటఆడగలుగుట. ఫిట్టుతోనున్నప్పుడు నాలుక కొరుకుకొనుట.

గొంతుక:—గుటక వేయుట కష్టముగానుండుట. తినుచున్న ఆహారము పక్కవైపులనుండి బయటకు పడిపోవుచుండుట.

అన్నకోశము;—ఆకలితోనున్ననూ అహారమును తీసుకొన లేక పోవుట, వికారము, వమనములు. కడుపులో నొక్కుచున్నట్లు బాధ.

పొత్తికడుపు:—విపరీతముగా నొక్కుచున్నట్లుండు బాధలు. స్త్రీరోగులలో బహిష్టు సరిగానుండక పోవుటవలన ఋతుస్రావము తక్కువగా వెడలుటతో నుండు కడుపునొప్పి.

మలము, మలాశయము:—క్రిమిదోషము. ఆకుపచ్చని నీళ్లవిరేచనములు. మలమూత్రములను ఆగిఆగి విడుచుచుండుట.

మూత్రావయవములు:—మూత్రము పసుపుపచ్చగాను విస్తారముగాను వెడలుచుండుట. మూత్రము చుక్కచుక్కలుగా వెడలునట్టి లక్షణము ఎన్నాళ్లకును మానకుండుట.

పురుషావయవములు:—ఫిట్టుయందు రేతస్ఖలములగుట, రాత్రియందు స్ఖలనములగుచుండుట.

స్త్రీ అవయవములు:—ఋతుస్రావము విస్తారముగా వెడలుట. గర్భాశయము అప్పుడప్పుడు విపరీతముగా ముడుచుకుపోవుచుండుట. గర్భాశయము వెలుపలకువచ్చుట. ఋతుదోషముతో లేక ఋతుస్రావము తక్కువగా వెడలుటతోవచ్చు అపస్మారసంబంధమయిన కంపములు. ప్రసవానంతస్రావము (మైల) అణచిపెట్టబడుట లేక ఆపివేయబడుట. గర్భిణీ స్త్రీలలో గర్భాశయము విపరీతముగా ముడుచుకుపోవుటచే అకాలప్రసవ సూచనలు గలుగుట.

శ్వాసావయవములు:—ఫిట్టులోనున్నప్పుడు శ్వాస గురగురలాడుచు వచ్చుట. ఫిట్టు తగ్గుటకుముందు అనగా తెలివివచ్చుటకుముందు గాఢముగా శ్వాసతీసుకొనుట. శ్వాస ఆగిపోవుచుండుట.

జ్వరము:—వెల్లుల్లిపాయ వాసనగల చెమట, ఎక్కువగా పోయుట.

దిగువఅవయవములు:—దూరము నడచుటవలనగాని దీర్ఘ రోగముల వలనగాని, పాదములకు నీరసము లేక బడలికవచ్చుట.

పోలికలు:—కుప్రం మెట్, ప్లంబం మెట్, బెల్లడోనా, కాల్కేరియా కార్బ్, సిక్యూటావిరోసా, ఓపియం, ఎగేరికస్, యాసిడ్ నైట్రిక్, హయాస్యామస్, కాక్యులస్, సినా, యాబ్సింతియం, స్ట్రామోనియం, రానంక్యులస్, ఇగ్నేషియా, నక్సువామికా, డిజిటాలిస్, ఇండిగో, స్టేనం మెటాలికం, ఇపెకాక్, లేకేసిస్, సల్ఫరు, జింకం మెటాలికం, బ్యూఫో, విరేట్రింఆల్బమ్.

సహచరులు:—స్ట్రామోనియం, పల్సటిల్లా, ఆరం మెటాలికం.

అనుచరులు:—కాష్టికం.

ఎకోనైటు, బెల్లడోనా, సినా, బ్రియోనియా, హెల్లిబోరస్, అయోడియం—యీమందులు వాడినపిదప నిది బాగుగాపనిచేయును.

ఈ యౌషధమును నీళ్ళలో వేసిపుచ్చుకొనినకన్న వైనులో వేసి పుచ్చుకొనిన బాగుగా పనిచేయునని డాక్టరు క్లార్కుగారు వ్రాసిరి.

మోతాదు:—1 మొదలు 200 పొటెన్సీ.

---

## 33. ఆరం ట్రైఫిల్లం. ARUM TRIPHYLLUM.

రక్తమువచ్చుప్రదేశమున బాధగాయున్నను రోగులు అచ్చటనే కెలుకుచుండుట. బాధవచ్చినప్పుడు బాధపడుచు, కెలుకుటను మాత్రము మానకపోవుట. ఇదియును గొంతుక బొంగురుపోవుటయును ముక్కునుండి మంటగను, దుర్వాసనగను, నాసికారంధ్రములకు ఒరుపును గలుగజేయుచు స్రావము వెడలుటయు దీని ముఖ్యలక్షణములు. గొంతుక, నోరు బాధగానుండుటవలన పిల్లలు ఆహారపానీయములను తీసుకొనజాలక పోవుట.

ఇది రొమ్ము కుడివైపు అవయవములమీద బాగుగా పనిచేయును. శరీరమున చాలప్రదేశములందు మంటగానుండుట.

మనస్సు:—బుద్ధిమాంద్యము. అస్థిమితము. పరాకుమాటలు.

తల:—వేడినికలుగజేయునట్టి దుస్తులు ధరించుటవలనను, వేడికాఫీని త్రాగుటవలనను తలనొప్పివచ్చుట.

ముక్కు:—పడిశెముపట్టుట. ఎడతెగని నీళ్ళవంటిస్రావముపలన నాసికారంధ్రములు ఒరియుట. ముక్కుదిబ్బడవేయుట (శాంబూకసు). తుమ్ములు రాత్రియందెక్కువగుట. రక్తమువచ్చువరకు ముక్కును నలుపుచుండుట, పీకుచుండుట, పొడుచుచుండుట.

నోరు:—పెదవులనుండి రక్తమువచ్చువరకు పెదవులుకొరుకుకొనుట.

గొంతుక:—పాడుటవలన గొంతుకబొంగురుపోవుట (ఆర్జెంటం నైట్రికం, కాష్టికం). మతగురువులలోను. నటకులలోను, గాయకులలోను ఉపన్యాసకులలోను, న్యాయవాదులలోను గొంతుకబొంగురుపోవుట లేక గద్గదస్వరమగుట, మరియు నిది మాట్లాడుటవలనను చదువుటవలనను పాడుటవలనను యెక్కువగుచుండుట. గొంతుకనొప్పిగాను పుండుపడినట్లుగాను వుండుటచే గుటకవేయుట కష్టముగానుండుట.

శ్వాసావయవములు:—పుండువలె నొప్పిగానుండుట. ఎడమశ్వాసకోశములో బాధగాయుండుట. ఇది సాధారణదగ్గులమీద బాగుగా నడచును. క్షయరోగ వుపశమనమునకు సహాయకారిగానుండును. కంఠనాళములో యెక్కువ ఆమము చేరియుండుట.

మూత్రావయవములు:—మూత్రము తక్కువగా వెడలుచుండుట, లేక అణచిపెట్టబడుట. ఈ లక్షణములకు దీనిని వాడినయెడల వెంటనే మూత్రము వెడలనారంభించును. ఒకప్పుడు పొలిపోయినట్లుండు మూత్రము విస్తారముగా వెడలుచుండుట.

కాళ్లు, చేతులు:—వేళ్లనుండి రక్తమువచ్చువరకు గోళ్లనుకొరుకుట,

జ్వరము:—సన్నిపాతజ్వరములో మాత్రము బధించుట. పక్క గుడ్డలను పోగుచేయుచుండుట, పీకుచుండుట, శరీరము యెక్కువవెచ్చన.

చర్మము:—ఎఱ్ఱనిదద్దుర్లు బయలుదేరుట, మరియునిది దురదగానుండుట. ఎఱ్ఱనిరక్తము జిమ్ముటతో కూడిన పుండ్లు.

వుద్రేకము:—పరుండుటవలన, వుదయమున,

వుపశమనము:—లేచుటతో.

సరిపడనివి:—కెలేడియంసెగ్.

పోలికలు:—సినా, ఎమోనియంకార్బ, కాస్టికం, సేపా.

విరుగుళ్ళు:—పల్సటిల్లా, మజ్జిగ, యాసిడులేక్టిక్, యాసిడుఎసెటిక్.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ. చిన్నపొటెన్సీలలో దీనిని వాడుట, మరియు తరుచుగా మోతాదులనిచ్చుట మంచిదికాదు.

---

## 34. ఎసాఫోటెడా. ASAFOETIDA.

(హిందూదేశపుఔషధము. 11. ఇంగువ.)

ఇది హిస్టీరియా లేక అపస్మారమను వ్యాధిమీద బాగుగా పని చేయును. ఈవ్యాధిమీద నడచు ముఖ్యమైన 5 ఔషధములలో నిదియొకటి. అవియేవన (1) మోస్కస్. (2) కేష్టోరియం. (3) ఎసాఫాటీడా. (4) వెలీరియానా. (5) యాంబ్రాగ్రిషియా. ఇది యెముకలలో నొప్పులను మాన్పుటలోను స్రావములను కట్టుటలోను బాగుగా పనిచేయును. ఇది రసదోషములమీదను సవాయిదోషములవలన యెముకలుపాడైనప్పుడును, వుబ్బసము, కోరింతదగ్గు, అజీర్ణము, గుండెనొప్పి, నరములసంబంధమైన వ్యాధులమీదను పనిచేయును. చర్మదోషముల నణచిపెట్టుటతో కలిగిన పలు విధవ్యాధుల నిది మాన్పును.

♦ గొంతుకలోనికి వుండవంటిది ఎగబ్రాకుచున్నట్లుండుటతోను

ఒక్కొక్కప్పుడు శ్వాస కష్టముగానుండుట వలన దానిని మిగ్రింగివేయ జూచుచుండవలసి వచ్చుచుండుటయు. ♦ హిస్టీరియా లేక అపస్మార లక్షణములు, నరములదోషములు, దుష్టరక్తనాళములకుసంబందించిన దోషములు—వీటికి సంబంధించిన పలువిధలక్షణములును దీనిముఖ్యలక్షణములు.

మనస్సు:—తనబాధలనుగురించి చెప్పుచుండుట. అపస్మారసంబంధమైన అస్థిమితము, ఆతురత. చిరచిరలాడుచుండుట. ఔషధము తీసికొనినట్లు తలచినంతమాత్రముననే మూర్ఛిల్లుట.

తల:—నుదిటియందు లోపలనుండి వెలుపలవైపుకు నొక్కుచున్నట్లుబాధ. ఎడమకణతలో పొడుచుచున్నట్లుండు బాధ. పార్శ్వపునొప్పి రాత్రియందు వుద్రేకించి విశ్రాంతివలనను బహిరంగమైన గాలిలోను నొక్కుటవలనను వుపశమించుట.

కన్నులు:—కాచబింబముపైపుండు వద్దత్రివ్వుచున్నట్లు బాధగాయుండుట. ఈబాధ రాత్రియందు యెక్కువగానుండుట. కండ్లలోను తలలోను రాత్రియందుబాధ యెక్కువగానుండుట. కండ్లు ఆర్చుకొని పోయినట్లుండుట. మంటగాయుండుట. కనుబొమలమీద రంధ్రముచేయుచున్నట్లు బాధగానుండుట, కంటిపాపలవాపు— ఇవి సవాయివ్యాధికి సంబంధించుట.

చెవి:—దుర్వాసనగా పల్చని చీమువచ్చుట. వినపడకపోవుట.

ముక్కు:—సవాయికిసంబంధించి, దుర్వాసనతోకూడిన ఆకుపచ్చని స్రావము వెడలుచుండుట. ఎముకలువాచి పుండ్లగుట ఇదిరసదోషమువలన కలుగగలదు. ఎముకలు పుచ్చిపోవుట (ఆరం మెటాలికం).

ముఖము:—ఎముకలలో తిమ్మిరిగాయుండుట. బిగపట్టినట్లుండుట. అడుగుపెదవివాచుట.

నోరు:—పండ్లు పటపటలాడించుట. మాట స్వచ్ఛముగా తెలియకపోవుట. నాలుకవాచి తెల్లగానుండుట.

గొంతుక:—గొంతుక, నోరు, ఆర్చుకొనిపోవుట. గొంతుకలోనికి

వుండ వచ్చుచున్నట్లుండుట (ఇగ్నీషియా), ఈ వుండను క్రిందికి దింపి వేయుటకు గుటక వేయవలసివచ్చుట. ఇందువలన ఒకప్పుడు వూపిరాడుట కష్టముగానుండుట. ఇట్లువుండ గొంతుకలోవున్నట్లుతో చుటతోకూడిన హిస్టీరియా లేక అపస్మారమును మాన్పును.

అన్నకోశము:—అపస్మారముతోకూడిన వుబ్బు—దీనిలో గాలి యెక్కువగా అన్నకోశమునందు చేరుటచే యిట్లగుపడుట. ఈవాయువును బయకు తెచ్చుటకు చాలకష్టముగానుండుట. భోజనమునందిచ్ఛయుండక పోవుట. వమనము చేసుకొన వలయునని యుండుట. పొట్టపొంగరించి వ్రేలాడుచున్నట్లుండుట. త్రేణుపులు వెల్లుల్లివాసనతోను, పులిసిపోయి కుళ్లినరుచితోను యుండుట. వాయువు ఊర్ధ్వముఖముగానే వెళ్లుట.

పొత్తికడుపు:—ఉబ్బరముగానుండుట. కండరములు లాగుచున్నట్లుండుట. పొట్ట యెత్తుగుచున్నట్లును శూలగానుయుండుట. మరియు నొక్కినయెడల వుపశమించుట. బాధ యెక్కువగానున్నప్పుడు స్మృతి తప్పుట, పొడుచుచుండునట్లుండు బాధలు అపానవాయువుగాని విరేచనముగాని వెడలినపిమ్మట వుపశమించుట.

మలము, మలాశయము:— మలము యెక్కువగాను నీళ్లవలెను ఒకప్పుడు చిక్కగాను మట్టిరంగువలెను యెక్కువ దుర్వాసనతోను వెడలుట. ఒకప్పుడు విరేచనము కష్టముగాను, గట్టిగాను కుళ్ళువాసనతోను వెడలుట.

మూత్రావయవములు:—మూత్రము గోధుమవర్ణముగాను, ఘాటైన వాసనతోను, వెచ్చగాను వెడలుచుండుట.

పురుషావయవములు:— స్ఖలనానంతరము స్మృతితప్పుట. అండములలో బాధ, ముట్టుకొనుటవలనను కదలినను హెచ్చగుట.

స్త్రీ అవయవములు:— గర్భము దాల్చనివారిలో పాలు కలుగుట వలన స్తనములు వాచుట. పాలు కొద్దిగా వచ్చుచుండుట. సంభోగేచ్ఛ యెక్కువగానుండుట. కుసుమ యెక్కువగాను అనువచ్చగాను దుర్వాసనతోను వెడలుచుండుట. పాలతల్లులలో పాలు యెక్కువగానుండుట,

ఒక్కొక్కప్పుడు తగ్గిపోవుట. గర్భాశయములో కోయుచున్నట్లును, దిగ లాగుచున్నట్లును ప్రసవవేదనలోవలె నొప్పులుగాను యుండుట. బహిష్టు అణచిపెట్టుటవలన వచ్చు అపస్మారమును మాన్పును.

శ్వాసావయవములు:— అప్పుడప్పుడు ఊపిరాడకపోవుచుండుట. శ్వాసకోశములు విస్తరించుటకు వీలులేకుండునట్లుగా ఛాతీ బిగబట్టినట్లుం డుట. ఉబ్బసపుదగ్గు. బొంగురుగాను, గింగురుమనుచువచ్చు వుబ్బససం బంధమైన పొడిదగ్గు. ఊపిరిపీల్చునపుడు దగ్గు వచ్చుచుండుట.

హృదయము:— నరములసంబంధమైన గుండెదడతో నాడి సన్న ముగా వక్రముగా త్వరితముగా కొట్టుకొనుచుండుట. హృదయసమీపమున నెప్పుడును బాధగాయుండుట. ఒకప్పుడు గుండె కొట్టుకొనకుండునట్లుగా గట్టిగా కట్టబడినట్లుండుట. హృదయమువాచి పెద్దదైబ్రద్దలగునట్లుతోచుట.

మెడ, నడుము:—మంట, చురుకుతోను నొప్పులు కుడిఅంసఫలక ములోనుంచి ప్రక్కయెముకలలోనికి వ్యాపించుచుండుట. నడుమునొప్పి విపరీతమైన బాధగానుండుట, ఇందువలన ఏపనియు చేయలేకపోవుట.

చేతులు, కాళ్లు:—ఎముకలు పుచ్చిపోవుట. భుజములగాయితు వేళ్లచివరవరకుకుట్టుచున్నట్లుచీల్చుచున్నట్లు బాధలు. మణికట్లలో చితుక కొట్టినట్లునొప్పి. బొటనవేలిలో కుట్టుచున్నట్లు బాధగానుండుట. పాద ములయొక్కయు పిక్కలయొక్కయు యెముకలువాచుట, పుచ్చిపోవుట.

చర్మము:—దురదగాయుండుటగోకినయెడలదుగద వుపశమించుట. పుండ్లనుండి రక్తముకారుట. చీము యెక్కువగాను, పల్చగాను, అసహ్యచ్చ గాను వాసనతోను వెడలుచుండుట.

నిద్ర:—అలవాటులేదిదే పగలు నిద్రపోవలయునని యుండుట.

జ్వరము:—భోజనానంతరము ముఖమునందు వెచ్చదనము, ఇది ఆతురతతోగాని మగతతోగాని కూడియుండుట, మరియు దాహములేకుం డుట, అప్పుడప్పుడు చలివచ్చుచుండుట.

ఉద్రేకము:—రాత్రియందును, తాకుటవలనను, యెడమవైపునను, విశ్రాంతియందును, ఉష్ణోపచారమువలనను.

ఉపశమనము:—బహిరంగమైన గాలిలోను, కదలికలోను, నొక్కుటవలనను.

విరుగుళ్లు:—చైనా, మెర్క్యూరియస్, పల్సటిల్లా, కేంఫర, కాస్టికం.

మోతాదు:—2 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 4 మొదలు 6 వారములు.

---

## 35. ఎసారం యూరోపం. ASARUM EUROPOEUM.

ఇది యెక్కువ ఇంద్రియజ్ఞానముగలవారి రోగములమీద బాగుగా పనిచేయును. మనస్తాపమువలన చలితో కూడిన కంపమునొందుట. కాళ్లు, చేతులు తేలికగాయున్నట్లగుపడుట. కంటికిశస్త్రచికిత్సానంతరము పొడుచుచున్నట్లుండు బాధలను మాన్పును.

మనస్సు:—గాలిలో నడచుచున్నప్పుడు యెగురుచున్నట్లూహించుట. ఊహలు తోచుచుండుట, మరియునివి మాయమగుచుండుట.

తల:—కూర్చున్నచోటినుండి లేచినయెడల తలతిరుగుట. తల బిగపట్టినట్లుండుటచేత వెంట్రుకలలో బాధగానుండుట. దీనివలన తలదువ్వుకొనుట కష్టముగాయుండుట. తలనొప్పిగాయుండుట తుమ్ములు, రొంప.

కన్నులు:—కండ్లువాచుట, బాధగానుండుట. కండ్లుకలుగుట. సూర్యరశ్మి, వెలుతురు, గాలి సహించలేకపోవుట. చల్లనిగాలివలన రోగోపశమనము కలుగుచుండుట.

చెవులు:— కప్పబడినట్లు చెవుడుగానుండుట. స్రావము వెడలుచుండుట. వెచ్చగానుండుట. ధ్వనులు వినబడుట.

అన్నకోశము:—వమనములు, నీళ్లవిరేచనములు, యెక్కువ శూలయుండుట. ఆకలి లేకపోవుట. వాయువు జేరుట. సారాయి మొదలగు

వాటిని కోరుట. పుగాకు త్రాగుటవలన రుచి చేదుగాయుండుట గుండె లలో అజీర్ణమువలన మంటగాయుండుట.

మలము, మలాశయము:— ఆమము ముద్దముద్దలుగా మలముతో కూడి వెడలుట. మలాశయము వెలుపలికివచ్చుట. అజీర్ణవిరేచనములు. చిక్కని ఆమముతో పల్చని విరేచనమగుట.

స్త్రీ అవయవములు:—ఋతుశూల. బహిష్టుకు పూర్వమును, వెనుకను తలనొప్పివచ్చుట. బహిష్టుకు ప్రథమములో నడుమునొప్పివలన పూపిగపీల్చుట కష్టముగానుండుట. బహిష్టు త్వరగానగుట. మరియు కొంత కాలమువరకు నల్లని ఋతురక్తము వెడలుచుండుట. కుసుమ చిక్కగాను పసుపుపచ్చగాను వెడలుట.

చేతులు, కాళ్లు:— చేతులు, ముఖము వెచ్చగానుండుట.

జ్వరము:— చలిగానుండుట. ఒక్కొక్కవతూవము మంచుపలె చల్లగానుండుట. చెమట సులభముగా పోయుచుండుట.

ఉద్రేకము:—చల్లని పొడిగాలిలోను; గట్టిధ్వనులవలన.

ఉపశమనము:—బహిరంగమైనగాలి, కదుగుటవలన, చలిగాలిలో.

విరుగుళ్లు:— కేంఫర్, వినిగార్.

మోతాదు:— 3 మొదలు 30 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 8 మొదలు 14 దినములు.

---

## 36. అవీనా సటీవా. AVENA SATIVA.

ఇది నాడీమండలముయొక్కయు, మర్మావయవముల యొక్కయు దోషములమీద బాగుగా పనిచేయును. ఇది నరములనిస్త్రాణను మాన్పును. నల్లమందు అలవాటు మాన్పుకొనువారికి చాలసహాయపడును. ఇది మెదడు నుపయోగించువారిలో(ప్లీడర్లు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, వ్యాపారస్థు

లలో) కలుగు నరములనిస్త్రాణను మాన్పును. శరీరములోని రక్తప్రసరణ మును సరియైనస్థితిలోనికి తెచ్చును.

మనస్సు:—బుద్ధి నిలకడగానుండకపోవుట. ఇదిహస్తప్రయోగాగాది దురభ్యాసములవలన, సంభోగదోషములవలనను మరియుయితరదోషములవలనను కలుగుట. జ్ఞాపకశక్తి లేకపోవుట. ఏపని చేయుటకును ఇష్టముండకపోవుట.

తల:—నరములసంబంధమైన తలనొప్పి బహిష్టులోవచ్చుట.నడినెత్తి నొప్పి. దీనితోపాటు మూత్రములో ఫాస్ఫేట్సు పోవుచుండుట.

హృదయము:—నరముల నిస్త్రాణతోకూడిన గుండెదడ.

కాళ్లు, చేతులు:— నరముల నిస్త్రాణవలన మొద్దుబారుట, తిమ్మిరెక్కుట. పక్షవాతమువచ్చినవాటిపలెనుండుట. నడచుటవలనను సాధారణమైన శరీరపరిశ్రమవలనను సంభోగానంతరమునను పిక్కలలోను, యితర అవయవములలోను, లాగుచున్నట్లుండుట.

పురుషావయవములు:—శుక్లనష్టము, నపుంసకత్వము. అధిక సంభోగమువలనవచ్చు బాధలు. ఎక్కువ నరముల నిస్త్రాణను, స్వప్నస్ఖలనములను మాన్పును. నరములకు బలమునిచ్చును. సంభోగవాంఛ తగ్గిపోవుటను మాన్పి సంభోగవాంఛను, శక్తినివృద్ధిచేయును. హస్తప్రయోగాది దురభ్యాసముల వలనిదోషములను మాన్పి నరములకు మంచి పటుత్వమునిచ్చును.

స్త్రీ అవయవములు:—ఋతువు ఆగిపోవుట. ఒకప్పుడు ఋతుశూలవచ్చుట. అంతాశయరోగములను,అపస్మారమునుమాన్పిబహిష్టుసరిగా అగునట్లు చేయును.

మోతాదు:—మదరుటించరు. టించరును 10 లగాయితు 15చుక్కలవంతున ఒక్క మోతాదుగా వాడవచ్చును. 20 చుక్కలకంటె యెక్కువ వాడినయెడల కొద్దిగా వేడిచేసి తలనొప్పిరాగలదు. దీనిలక్షణములు అల్ఫాల్ఫాను కొంతవరకు పోలియుండును. ఈఓషధి మన దేశములోకూడ ఇప్పుడు పెంచబడుచున్నది.

## 37. అజాడిరక్టా యిండికా. AZADIRACHTA INDICA.

(హిందూ దేశపు ఔషధము.—12. వేపచెట్టు.)

ఇది అపరాహ్నమందువచ్చు జ్వరములమీదను, మేహవాతనొప్పుల మీదను, చర్మరోగములమీదను పనిచేయును. రొమ్ముముకలోను, ప్రక్క యెముకలలోను, నడుములోను, భుజములలోను, కాళ్ళు చేతులలోను నొప్పులుగాను, అరిచేతిలోను వ్రేళ్లలోను వెచ్చగాను గ్రుచ్చుచున్నట్లును వుండుబాధలను మాన్పును. క్వయినాను యెక్కువగా వాడుటవలన కలుగు దుర్గుణములను పోగొట్టును.

మనస్సు:—కులాసాగా లేకపోవుట. విచారగ్రస్తముగాను మరపుతోను వుండుట. పరుండవలెననియుండుట. జ్ఞాపకశక్తి తగ్గిపోవుట.

తల:—లేచునపుడు నొప్పిగానుండుట, తిరుగుచున్నట్టుండుట, తలపై చర్మమును తలవెంట్రుకలను సహితము ముట్టుకొనినయెడలనొప్పి.

కన్నులు:—మంటగానుండుట. నీరుకారుట. కుడిగుడ్డులోనొప్పి.

చెవులు:—శబ్దములు వినబడుట. నోరు విప్పినప్పుడు చెవిలో చిటపటమను శబ్దము వినబడుట.

నోరు:—శుభ్రముగానుండకపోయినను నీటిరుచి సరిగానే తెలియుట. లాలాజలము వుప్పగానుండుట.

గొంతుక:—రుచి చేదుగానుండుట.

అన్నకోశము:—ఎక్కువ ఆకలి. దప్పికలేకపోవుట. ఒకప్పుడు అపరిమితముగ చన్నీటిని కోరుట. తియ్యని వస్తువులయందు కోర్కె.

పొత్తికడుపు:—వడివేయుచున్నట్లుండు బాధలు. బొడ్డువద్దనులిమి వేయుచున్నట్లుండుబాధలు. దుర్వాసనతోకూడిన అపానవాయువు వెడలుచుండుట. ప్లీహమువాచుట.

మలము, మలాశయము:—మలము కొద్దిగావెడలుట. విరేచనబద్ధమెక్కువగానుండుట. విరేచనముగట్టిగాను కొద్దిగాను వెడలుట. తృప్తికరముగా విరేచనమవకపోవుట,

పురుషావయవములు:—అధికమైన వుద్రేకముతో ఎక్కువసంభోగేచ్ఛ.

శ్వాసావయవములు:—స్నానానంతరము విడువనటువంటి దగ్గు. శ్లేష్మము తెల్లగాను, చిన్నచిన్న ముద్దలుగాను, కష్టముతోను వెలువడుట.

కాళ్ళు, చేతులు:—మొద్దుబారుట.

చర్మము:—మండుచున్నట్లును, గుచ్చుచున్నట్లును, దురదతోను వుండుబాధలు.

నాడి:—పడిగాను, గట్టిగాను, నిస్త్రాణగానుయుండుట.

నిద్ర:—కలలో దెబ్బలాటలను చూచుట.

జ్వరము:—చలిగానుండుట. జ్వరము సాయంకాలము 3 గంటలు లగాయతు 4-30 గంటలను లోపువచ్చి రాత్రి 7-30 గంటలవరకు యుండుట. ముఖములోను కండ్లలోను, చేతులలోను, అరికాళ్లలోను మంట గను, వెచ్చగను యుండుట. విస్తారముగా చెమటపోయుట. చమట నుదిటిలో ప్రారంభించి పొత్తికడుపువరకు వ్యాపించుట. దిగువ అవయవ ములను చెమటపట్టకపోవుట. మన్యపుజ్వరము.

దీనిలక్షణములు చైనా, ఆర్సెనికంఆల్బం, నేట్రింమూరు, నక్సు వామికాలను కొంతవరకు పోలియుండును.

వుద్రేకము:—అపరాహ్ణమున. బహిరంగమైన గాలిలో.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 38. ఎఖిరాంతిస్. ACHYRANTHES ASPERA LINN.

(హిందూదేశపు ఔషధము.—13. ఉత్తరేణి)

సంస్కృతమునదీనిని "అపామార్గ" యందురు.

తీవ్రదశలోనున్న నీళ్లవిరేచనములను, కలరా వ్యాధిని మాన్పుటలో నిది అమోఘమైనది. రక్తదోషముతో గూడిన లక్షణములమీదను, వీటి తోద్వంద్వముగాయున్న చర్మరోగములమీదను దీనిని వాడనగును.

తల:—తలదిమ్ము, మనస్సు కంగారుగా నుండుటతో నిస్రాణ ద్వంద్వముగాయుండుట.

అన్నకోశము:—పులితేన్పులు, అజీర్ణమువలన ఛాతీలో మంట. కలరాకు సంబంధించిన వమనములు. వమనములు పానీయములు తాగిన వెంటనే అగుచుండుట.

మలము, మలాశయము:—నీళ్లవిరేచనములు. విరేచనముముద్దలుముద్ద లుగానుండు ఆమముతోకలసి వెడలుట. పసుపుపచ్చని నీళ్లవిరేచనములు.

మూత్రావయవములు:—మూత్రము స్వల్పముగా వెడలుట మరియు విపరీతమైన దాహముగలుగుట.

చర్మము:—ఎఱ్ఱని దద్దురువలె బయలుదేరి ఎక్కువ మంటలుగా నుండుట. రాచకురుపులు.

మోతాదు:— 1 మొదలు 6 పొటెన్సీ.

---

## 39. యాండ్రోగ్రాఫిస్. ANDROGRAPHIS PANICULATA.

(హిందూదేశపు ఔషధము—14 నేలవేము.)

దీనిని సంస్కృతమున "భూనింబ" యనియు, బంగాళీలో "కాల్ మేఘ్" యనియు అందురు.

ఇది ముఖ్యముగా కాలేయ దోషములమీదను, మన్యపు జ్వరము, మరియు దీనితో ద్వంద్వముగాయుండు యితర విధములైన జ్వరలక్షణ ముల మీదను, పిల్లలలో కామెర్లు, కడుపులోబల్ల, జ్వరలక్షణములమీదను వాడదగినది.

మనస్సు:—సులభముగా కోపమువచ్చుట. అస్థిమితము. పరిశ్రమ యందయిష్టత.

తల:—దిమ్ము, బరువు, నుదురునొప్పి.

కండ్లు:—ఎఱ్ఱదనము, ఒకప్పుడు పసుపుపచ్చన.

ముక్కు:—జలుబు, రొంప, తుమ్ములు.

నోరు, గొంతుక:—నోరుచేదు. గొంతుక పొడిగా నుండుట. నాలుకపై తెల్లనిపూత,

అన్నకోశము,పొత్తికడుపు:—అజీర్ణమువలన ఛాతీలోమంట. త్రేనుపులు, ఆకలి లేకపోవుట. పొట్ట తాకినచో బాధకలుగుట. కాలేయదోషములు. పిల్లలకు కడుపులో బల్ల పెరుగుట.

మలము, మలాశయము:—పైత్యదోషముతో గూడిన పలుచని విరేచనములు. ఒకప్పుడు విరేచనబద్ధము. నీళ్ళవిరేచనములు. నల్లనివిరేచనము.

మూత్రావయవములు:—మూత్రము ముదరరంగుగను లేక పసుపుపచ్చగను వెడలుట.

జ్వరము:—వెచ్చన, కొలదిచలి మానకుండగయుండుట. వెచ్చనతో శరీరము మంటలుగానుండుట. జ్వరముతో కాలేయదోషములు మలబద్ధము ద్వంద్వముగా యుండుట. జ్వరము ఉదయమున 11 గంటలకును రాత్రి 7 గంటలకును తగులుచుండుట.

ఉద్రేకము:—జ్వరముతో నున్నపుడు.

ఉపశమనము:—చల్లదనమువలన, చన్నీళ్లవలన, చమటవలన.

మోతాదు:— 1 మొదలు 30 పొటెన్సీ.

---

## 40. బాల్ సమమ్ పెరూ. BALSAMUM PERUVIANUM.

చీము, ఆమము యెక్కువగా వెడలుచుండు శ్లేష్మరోగముల మీదను, నిస్రాణమీదను, క్షయజాతిజ్వరములమీదను, చర్మరోగముల మీదను ఇది బాగుగా పనిచేయును.

ముక్కు:—పొక్కులు, పుండ్లు చిక్కనిస్రావము. దుర్వాసనతో కూడిన మాననటువంటి స్రావము. తుమ్ముటవలని రక్తస్రావము.

కంఠము:—గోకుచున్నట్లుండుట.

అన్నకోశము:—తినినఆహారమును,ఆమమును వమనము చేసుకొనుట.

మలము, మలాశయము:— బాధలేకుండగా పల్చనివిరేచనమగుట. మామూలువిరేచనముతోపాటు రక్తము స్రవించుట. ఆంబవిరేచనములు.

మూత్రావయవములు:—మూత్రము కొద్దిగాను, ఆమమువంటిపదార్థముతోను కలసిపోవుట. మూత్రనాళము కప్పబడుట. కోయుచున్నట్లుండుబాధలు. మూత్రము యెక్కువగాను, తరుచుగాను వెడలు చుండుట.

శ్వాసావయవములు :—కంఠనాళములో కొరుకుచున్నట్లుండుట. పొడిదగ్గువచ్చుట. చీమువంటిపదార్థము ఆమముతో కూడి వెడలుట. క్షయజాతిదగ్గు, దీనిలో యెక్కువ శ్లేష్మము, ఆమము వెడలుచుండుట. ఛాతీలో గట్టిగా గురగురలాడుచుండుట (కాలీసల్ఫు, యాంటిమంటార్టు). బ్రాంకైటీసు, క్షయ, వీటిలో చిక్కగా మీగడనుపోలి ఆమము, చీము వెడలుట. రాత్రియందు యెక్కువ చెమటపోయుట. మరియు కొద్దిగాస్రావము, కొద్దికొద్దిగా దగ్గువచ్చుచుండుట.

మోతాదు:—2 మొదలు 30 పొటెన్సీ. క్షయసంబంధమైన లక్షణములమీద 6 పొటెన్సీలో వాడవగును.

బాహ్యోపయోగములు:—మాననటువంటిపుండ్లమీదను, దురదతో కూడిన చర్మరోగములమీదను, చన్మొనలపగుళ్లమీదను, గజ్జి లేక చిడుము మీదను మదరుటించరును 10 రెట్లనీళ్లలోగాని, 5 రెట్ల గ్లిసరిన్‌లోగాని కలిపి పైకి పట్టించవచ్చును.

—

## 41. బాప్టీషియా. BAPTISIA.

ఇది టైఫాయిడ్ జ్వరము (సన్నిపాతజ్వరము) యొక్క అన్ని అవస్థలలోను, ముఖ్యముగా ప్రథమావస్థలోను పని చేయును. మేదస్సు (Lymph) యెక్కువగా యున్న తత్వములు గలవారి రోగములమీద నిది

బాగుగా పనిచేయును.

జ్వరలక్షణములు సన్నిపాతములోనికి మారుచున్నప్పుడు కనిపెట్టి వెంటనే యీమందును యిచ్చినయెడల జ్వరమును సన్నిపాతములోనికి మారకుండగ ఆపుచేయును. ఒకవేళ మారినను యీసన్నిపాతజ్వరలక్షణములయొక్క బాధలంతతీవ్రముగానుండక జ్వరము సులభముగా మానును.

♦ తలపెద్దదిగను, బరువుగనుయున్నట్లు భావన. మరియుముఖము తల మొద్దుబారినట్లుండుట. ♦ ముఖము పొంగరించి వెచ్చగను, ఎర్రగను తెలివితప్పినట్లునుఅగపడుట♦పరాకుమాటలుమగతద్వంద్వముగానుండుటతో రోగి ఎదుటివారి మాటలుగానుచు వినుచూ లేక ఎదుటివారితో మాట్లాడుచు మాట్లాడుచూ నిద్రజెందుట ♦ గొంతుక ఎర్రిన, ముదరరంగుగను దుర్వాసనగానుయుండు పుండ్లతోనూ,గవదలు మున్నగు మాంసగ్రంధులవాపు మున్నగువాటివలనను రోగి నీళ్ళనుమాత్రమే తీసికొనగలుగుట ♦సన్నిపాతలక్షణములతో సంబంధించి ముదరరంగుగానుండు గోధుమవర్ణముగల జిగటవిరేచనములు లేక రక్తవిరేచనములు. ♦ త్రాగినవానివలె మనస్సు కంగారుగాయుండుట ♦ ఛాతీకట్టివేయబడినట్లుండుటతో శ్వాసకష్టముగా నుండుట మరియు, పరిశుభ్రమైన గాలికొరకు కోరిక గలుగుట ♦ శరీరమంతయును చితుకకొట్టబడినట్లును, నిస్త్రాణగను, అలసటగను యున్నట్లు తోచుట ♦ శరీరము ముక్కలుముక్కలుగ విడిపోయి చెదరిపోయినట్లు తోచుటతో రోగి ఆముక్కలను పోగుచేయుచును నిద్రపోకుండగను యుండుట ♦ మెత్తనిపడకపై (పరుపు వగైరాలపై) పరుండినను బల్లపై (గట్టిప్రదేశముపై) పరుండినట్లుతోచుటతో పరున్నవైపును మార్చగోరుట ♦ అప్రయత్నముగా మలమూత్రములను విడచుట లేక మూత్రముబంధింపబడుట ♦ ఉదయమున మెలకువజెందుటతో మనస్సు కంగారుగానుండుట. ♦ స్రావములును వెలువరింపబడు మలినపదార్థములును విడిచినపూపిరియు దుర్వాసనగానుండుట (సోరినం,పైరోజీనియం).—ఇవి దీనిముఖ్యలక్షణములు.

మనస్సు:—ఆలోచనశక్తి లేకపోవుట. మనస్సు కంగారుగాయుం

డుట. కండ్లు సగము మూసికొనవలెనని యుండుట. భయంకరమైన స్వప్నములు. పడకనుండి బయటకు పోజూచుచుండుట. అస్థిమితము.

తల:—నడినెత్తినొప్పి, బరువుగాను, దిమ్ముగాను, పెద్దదైనట్లుగాను తోచుట. తలపైభాగము పైకెగిరిపోవుననుకొనుట. సన్నిపాతములోవచ్చు చెవుడు. తలను యెదుటికి వంచినయెడల మెదడులోనొప్పిగా నుండుట.

కన్నులు:—వెలుతురును భరింపలేకపోవుట, యిందువలన కండ్లు మంటగానుండినను నీళ్లుకారకపోవుట. ఎరుపు, బాధ, వాపు, మంట. కొద్దిగా నీళ్లుకారుచుండుట. మాననటువంటి కండ్లకలక.

చెవులు:—మాటసరిగా వినపడకపోవుట.

ముక్కు:—కొంటుత్రికలు కాలినట్లు వాసనవేయుచున్నదనుకొనుట. గొంపపట్టినవానివలె తుమ్ములువచ్చుచుండుట. ఆమము చిక్కగానుండుట. నల్లనిగక్తము స్రవించుట.

ముఖము:—ఎఱ్ఱగాను, వెచ్చగాను, స్మృతితప్పినవానివలె నగుపడుట (జెల్సీమియం). మొద్దుబారి దౌడలువచ్చగా పాలిపోయియుండుట.

నోరు:—నాలుకమధ్యను పసుపుపచ్చని చారికయుండుట. నాలుక ఆర్చుకొనిపోయి దాహముగాను, నోరు దుర్వాసనతోను వుండుట. సండ్లు గారకట్టుట. పల్చని ఆహారముమాత్రమే గుటకవేయుటకునీలుగానుండుట. గట్టిగానుండు ఆహారము గొంతుకకడ్డపడుట.

గొంతుక:—గవదకాయలువాచి యెఱ్ఱబడుట. గొంతుకనొక్కుచున్నట్లు,ముడుచుకొనిపోవుచున్నట్లువుండుట. దుర్వాసనతోకూడినపుండ్లు

అన్నకోశము:—ఆకలిలేకపోవుట, గుడగుడలాడుచుండుట, ముట్టుకొనినయెడల గట్టిగానుండుట, దాహ మెక్కువగానుండుట, ఆహారమునం దయిష్టముగానుండుట, కడుపు నిండుగానుండుట, వెచ్చగానుండుట.

పొత్తికడుపు:—పొత్తికడుపులోను, కాలేయములోను తరుచుబాధ

గా నుండుట, ఇది నడచుటవలనను, మెట్లెక్కుటవలనను యెక్కువగుట బొడ్డుపద్దపోటు, ప్లీహము బాధ, దీనితోపాటు శరీరమంతటను ముఖ్యముగా చేతులయొక్కయు కాళ్లయొక్కయు చిన్నయెముకలలోనొప్పి. కండర ములను నొక్కినయెడల నొప్పి. కుడిగజ్జలోని మాంసగ్రంథులు వాచుట.

మలము:—మలము దుర్వాసనగాను, పల్చగాను, ముదురరంగుగాను వెడలుచుండుట. జిగటవిరేచనములు. అంబవిరేచనములు. మలము గోధుమ రంగుగాను, ఆమముతోను, రక్తముతోను, ఆసనముతీపు బాధతోను వెడలు చుండుట, ఇది సన్నిపాతలక్షణములతో కూడియుండుట. ముసలివారి జిగటవిరేచనములు, చిన్నపిల్లల నీళ్లవిరేచనములు దుర్వాసనగాయుండుట (కార్బోవెజ్, పోడోఫైలం, సోరినం).

మూత్రావయవములు:—మూత్రముమంటతో వెడలుట. మూత్రము కొద్దిగాను, యెఱ్ఱగాను, దుర్వాసనగాను ఒకప్పుడు పాలిపోయిన ఆకు పచ్చరంగుగాను వెడలుట.

పురుషావయవములు:—అండములవాపు, బాధ, గట్టిపడుట.

స్త్రీఅవయవములు :—ఋతువుచాల త్వరగాను, స్రావమెక్కువ గాను అగుట. ప్రసవానంతరజ్వరము. ప్రసవానంతరము మైల దుర్వాసన.

కాళ్లు, చేతులు:—లాగుచున్నట్లు, పొడుచుచున్నట్లు బాధలు. బాధలు ఒకచోటినుండి మరియొకచోటికి మారుచుండుట. పరుండినవైపు అవయవములు నొప్పిగాను, చితుకగొట్టినట్లు బాధగాను వుండుట (పైరోజీనియం).

చర్మము:—మంట, వేడిగానుండుట. పొంగులోవలె దద్దుర్లుబయలు దేరుట. మశూచికపుపొక్కులు ఆలస్యముగావచ్చుట. పుండ్లు దుర్వాసనతో కూడి కుళ్ల నారంభించుట. సవాయిపుండ్లు చర్మము తినివేయుచున్నట్లగు పడుట. రేక లోతుగా బొవులుపడుట. పడకరాపడము వలుసి పుండ్లు.

జ్వరము:—బహిరంగమైన గాలిలోనికి వెడలినయెడల చలివచ్చుట

శరీరమంతయు చితుకగొట్టినట్లును, మేహవాతములోవలెను నొప్పులుగా నుండుట. శరీరమంతయు వెచ్చగా అరుచ్చకొనిపోయియుండుట. అప్పు డప్పుడు చలివచ్చుచుండుట. టైఫసుజ్వరముయొక్క పరిధమావస్థలో దీనినివాడినయెడల చెమటపట్టి జ్వరమునకుపశాంతి గలుగుట. చెమట దుర్వాసనగానుండుట. ఇదెఇన్ఫ్లూయింజా జ్వరముమీదకూడపనిజేయును.

రోగి మిక్కిలి నిస్త్రాణగాయుండుటవలన పండుకొనవలెననియుండు ట. వివిధఅవయవములలో శక్తిలేకపోవుట. రక్తముచెడిపోవుటవలనవచ్చు నిస్త్రాణ. స్రావములు, విడిచినయూపిరి దుర్వాసనగాయుండుట(సోరినం,) చితుకకొట్టినట్లు నొప్పులుగాయుండుట.

పోలికలు:—రూస్టాక్సు, యాసిడ్ మూర్, ఆర్సెనికంఆల్బం, బ్రియోనియా, ఎఖినేషియా, పైరోజీనియం, ఆర్నికా, జెల్సీమియం.

ఉద్రేకము:—కదలికవలన, ఆవిరివేడివలన, సాగమంచువలన, కుడి వైపునవంగినయెడల, నీరుతాగినపిమ్మట, బాధనుతలచుకొనుటవలన.

ఉపశమనము:—విశ్రాంతివలన, బహిరంగమైన గాలిలో.

మోతాదు:—టించరు మొదలు 30 పొటెన్సీ టైఫాయిడ్ జ్వర ములో 3-వ పొటెన్సీ వాడుటమంచిది.

---

## 42. బెల్లడోనా. BELLADONNA.

ఇది యాంటీసోరిక్ ఔషధము.

ఇది సూర్యరశ్మివలనను, గాలికెదురుగా నడచుటవలనను, తలవెం ట్రుకల కత్తిరింపునకు పిమ్మటను, తల తడియుటవలనను, నిలువజేయబడిన మాంసాహారములు తినినపిమ్మటను బాగుగా పనిచేయును.

♦ ఎర్రగా నిప్పుగనులున్నట్లువలెను, వెచ్చగను, పొంగరింపు గను, యుండుముఖచర్మ. ♦ తన్నెవ్వరో భయపెట్టుచున్నారనుకొని అట్టి వారినుండి తప్పుకొనుటకు పారిపోవలయునని భ్రమజెందుట ♦ ముందుకు

వంగినను, శబ్దము, కాంతి, చప్పుడు, జరుగ్రిమనుశబ్దమువలన ఉద్రేకించునట్టియు, వెనుకకువంగుటవలన ఉపశమించునట్టియు ఎక్కువతీవ్రమైన తలనొప్పి ♦ ముందుకువంగినను లేక వంగినపిదప లేచినను కండ్లు-చీకట్లు క్రమ్ముట, కండ్లు మిరుమిట్లుగొలుపుట మరియు ఎడమవైపునకు-వెనుకకు తూలి పడిపోవుట ♦ బహిష్టుకు బహిష్టుకుమధ్య రక్తస్రావములు. నిగనిగలాడుచుండు ఎర్రనిరక్తము రక్తాధిక్యతగల స్త్రీలలో వెడలుట ♦ వాడిపుష్టిగను, వడిగను తొందరగను కొట్టుకొనుట ♦ రాత్రినిద్రచెందినపిదప స్వరపేటికలో గిలిగింతలు పెట్టినట్లుండుటతోవచ్చు పొడిదగ్గు ♦ నిద్రలేమి ♦ ఎక్కువగా గాలితగులుటవలన వచ్చుజలుబు. ♦ రోగిరక్తాధిక్యతతోను, చురుకుగానుయుండుట.—యివి దీని ముఖ్యలక్షణములు.

ఇది నరములమండలమునకు సంబంధించిన రోగములమీద బాగుగా పనిచేయును ఇది కుడివైపు అవయవములమీద పనిచేయును. శ్వాసావయవరోగములమీదను, జ్వరము దీనిలోసంధి, పిల్లలజబ్బులు, కంటిరోగములు, యెఱ్ఱనిరక్తస్రావములు, గొంతుకరోగములు, వీటిమీద బాగుగా వుపయోగపడును. క్రొవ్వుపట్టి లావుగానుండువారికిగలుగు రోగములను మాన్పును (కాల్కేరియాకార్బ్). ఇది వెఱ్ఱికుక్క కాటువలని దోషమును మాన్పును. పిచ్చికుక్కకాటుకును వెఱ్ఱితనమునకును వాడనగును కురుపులు యెఱ్ఱగాను, నొప్పిగాను, వెచ్చగాను వుండినపుడు దీనిని వాడినయెడల చీముపట్టనీయకుండగా వాటిని హరింపజేయును. పసిపిల్లలకువచ్చు వేసవికాలపు జబ్బులమీద బాగుగా పనిచేయును.

మనస్సు:—మిక్కిలి కోపము. ప్రక్కనున్నవారిమీద వుమ్మివేయుట. వస్తువులను ముక్కలు ముక్కలుగా జేయుట. వికృతమగు సంధి-దీనిలో పడకగుడ్డలను పోగుజేయుచుండుట. మరియు వాటిని తోసివేయుచుండుట. ఎదుట పెద్దదయ్యములు, రాక్షసులు కనపడుచున్నవనుకొనుట. భయమువలన వీటిబారినుండి తప్పించుకొనుటకై పారిపోజూచుట. అదివరలో సంతోషముతోకూడియున్నరోగి అతిభయమును చెందుట.

తెలివితప్పియుండుట. ఎప్పుడును ఆడనట్టి మాటలాడుట. భయమువలన తప్పించుకొనుటకును, దాగియుండుటకునుకోర్కెగలిగియుండుట. సంధిలో బిగ్గరగాపాడుట, పండ్లు పటపటకొరుకుట.

తల:—తలతిరిప్పువలన యెడమవైపునకుగాని, వెనుకకుగాని పడిపోవుట. వేడిమితోకూడిన బాధలు. నుదురునిండుగాను, బరువుగాను వున్నట్లుతోచుట. స్రావములనాపుటవలనవచ్చు తలనొప్పులు. తలలో రక్తము యెక్కువగా ప్రవహించుటవలన నరములదోషముతోకూడిన తలనొప్పులు. తలనొప్పి ధ్వనులవలనను, కదలికవలనను, కండ్లుకదల్చుటవలనను, ముట్టుకొనుటవలనను, దగ్గినప్పుడును యెక్కువగుట. నుదిటిలోనొక్కుచున్నట్లుండు తలనొప్పులు. బహిరంగమైనగాలిలో వుద్రేకించుతలనొప్పులు. నొప్పి కలుగుచున్నప్పుడు యెక్కువగుటవలన కండ్లు మూసుకొనవలసి వచ్చుట. తలవెంట్రుకలు ముట్టుకొనుటవలన తలనొప్పి యెక్కువగుట. మెట్లుయెక్కుటవలనను, త్వరగానడచుటవలనను తలమీద పెద్దబరువు పెట్టినట్లు నొప్పిగావుండుట. నరములసంబంధమైన తలనొప్పి అప్పుడప్పుడు వచ్చుచుండుట. తలతిరిప్పువలన దృష్టి ఆనకపోవుట. ఒక కణతలోనుండి రెండవకణతలోనికి పొడుచుచున్నట్లు బాధగానుండుట. తలపునీరుపట్టుట.

కన్నులు:—కండ్లు వెలుపలకువచ్చుచు, మెరయుచు, పాపలు పెద్దవై తేరబారిచూచుచుండుట, కండ్లు పొడిగాను, బిఱ్ఱబిగిసి మంటగాను, వేడిగాను వెలుతురునుచూడలేకుండా యుండుట. వస్తువులు తలక్రిందుగా కనపడుట. ఒకప్పుడు ఒకవస్తువు రెండువస్తువులుగా కనపడుట. కంటియెదుట మంటలు, వెలుతురు కనపడుట. కండ్లవాపును, కండ్లు అంటుకొనుటను నీరుకారుటను మాన్పును.

చెవులు:—ధ్వనులను భరింపలేకపోవుట. చెవులలోహోరు, పోటు, స్రావము వెడలుట. కుట్టుచున్నట్లు బాధగానుండుట. చెవిప్రక్క మాంసగ్రంథులు వాచుట. చెవి యెఱ్ఱబడుట.

ముక్కు:—స్రావముతోరక్తముకలసి వెడలుట. వాసన అతిత్వరగా

తెలిసికొనగలుగుట. ముక్కు ఆర్చుకొనిపోయి, నుదురునొప్పిగానుండుట. పుండ్లగుట.

ముఖము:—పొంగరించి యెఱ్ఱగాను, వెచ్చగాను వుండుట. ముఖము మీది కండరములు కదలుచుండుట. పైపెదవి వాచుట. నోరు బిగపట్టుట వలన తెరచుట కష్టముగానుండుట. దౌడలు దగ్గరపడుట.

నోరు:—పొడిగా ఆర్చుకుపోయి దాహముగాయుండుట. నాలుక, అంగుడు యెఱ్ఱగాను, పొడిగాను యుండుట. పండ్లు పటపటకొరుకుచుండుట. నత్తిమాటలాడుట. నోటినుండి యెక్కువ నీరూరుచుండుట. మాంసగ్రంధులవాపు. ఇగుళ్లు వుబ్బుట, నొప్పిగానుండుట పిల్లలకు పండ్లువచ్చుకాలములో కంపముతోకూడిన ఫిట్లు (బాలపాపచిన్నె) వచ్చుట.

గొంతుక:—ఆర్చుకొనిపోవుట. ఎఱ్ఱగానుండుట. ముడుచుకొనిపోయినట్లుండుట. గుటకవేయుట కష్టముగానుండుట. గవదకాయలు వాచుట. గాలిబిళ్లలు కుడివైపు యెఱ్ఱగావాచి యెక్కువ బాధగానుండుట.

అన్నకోశము:—పుల్లనివస్తువులయందు కోరికయుండును కాని అవి హితవుగానుండకపోవుట. చల్లనినీళ్లు, రొట్టె, వెన్న వీటియందు కోర్కెగలిగి యుండుట. భోజనమునందును, పుష్టినిచ్చు ఆహారపానీయములందును, మాంసము, కదలిక, పాలు, ఘృని, వీటియందిష్టముండకపోవుట. ఆహారము తీసికొనినపిదపను, పానీయములు త్రాగినపిదపనుకడుపులో త్రిప్పుచున్నట్లుండుట. భోజనానంతరము నోటిలో కుళ్ళినవాసనగలుగుట. అజీర్ణపదార్థములను. పైత్యరసమును, వమనము చేసికొనుట. కడుపులో నొక్కుచున్నట్లును మంట, శూలతోనుండు బాధలు. రక్తవమనము. కాలేయము ముట్టుకొనుటకు బాధగాయుండుట.

పొత్తికడుపు:—ఉబ్బరింపు, వేడి, మంటగలుగుట. దిగువునకు నొక్కుచున్నట్లు బాధగాయుండుట. బాధవలన తాకుడు భరింపలేకుండుట. కోయుచున్నట్లు, పొడుచుచున్నట్లు, త్రిప్పుచున్నట్లుండు బాధలు, శూల.

మలము, మలాశయము:—మలద్వారము తెరచియున్నట్లు అవి

యత్నముగా విరేచనమగుట. మలము పల్చగా, ఆకుపచ్చని ఆమముతో తరుచుగా, రక్తముతో, తీవ్రగా, తెల్లని ముక్కలవంటి పదార్థముతో లేక జిగురుమట్టివలెను వెడలుట. మలాశయము వెలుపలకువచ్చుట (ఇగ్నీషియా, పోడోఫైలం). జిగటవిరేచనములు. రక్తముతోకూడిన మూలశంఖ

మూత్రావయవములు :—మూత్రములో ఫాస్ఫేట్సు వెడలుట. తరుచు మూత్రవిసర్జనము. కొద్దిగా మూత్రము వెడలుట. అప్రయత్నముగా మూత్రము వెడలుట(ఆర్నికా, కాష్టికం, నేట్రంమూరు, పల్సటిల్లా,రూస్టాక్స్). ఒకప్పుడు మూత్రము బంధించి చుక్కలుచుక్కలుగా వెడలుట.

పురుషావయవములు:—అండములు గట్టిపడి పైకి ఓగలాగుకు పోవుట. ప్రాస్టేటుగ్రంధినుండి స్రావము వెడలుట. సంభోగేచ్ఛలేకపోవుట. స్వప్నస్ఖలనములు. కుడివైపు అండమువాచి బాధగానుండుట.

స్త్రీఅవయవములు:—ప్రసవమునందు నొప్పులు తక్కువగా వచ్చుట, ఒకప్పుడు నొప్పులు ఆగిపోవుట, మావిపడకపోవుట. దుర్వాసనతో కూడిన స్రావము. ఋతురక్తముయెక్కువగా, యెఱ్ఱగా, మామూలుకన్న ముందుగా వెడలుట. ఋతురక్తమును, ప్రసవానంతరము మైలయును, దుర్వాసనతో, వెచ్చగా వెడలుట. ఋతుశూల. గర్భాశయ అవయవములు యోనినుండి దిగువకు చొరుచుకొనివచ్చునట్లుగా తోచుట. ఇట్లు నడచునపుడును, వంగినపుడును తోచుట. పుట్టవ్రణము బయలుదేరుట.

శ్వాసావయవములు:—విడిచివిడిచివచ్చు పొడిదగ్గు. ఇది గొంతుక బొంగురుతనముతోకూడియుండుట. దగ్గువలనఅర్ధరాత్రమైనపిమ్మట మెలకువ వచ్చుట. స్వరపేటికవాచుట, నొప్పిగాయుండుట. పిల్లికూతలు. దగ్గునపుడు చిక్కనిశ్లేష్మమువచ్చుచుండుట. జలుబుతోకూడినదగ్గు, రొంప. కోరింత దగ్గు ఛాతీలో శ్లేష్మమెక్కువగా చేరుటవలన శ్వాసకష్టముగానుండుట.

హృదయము, నాడి:—నాడి గట్టిగా, వేగముగా పుష్టిగా, ఒకప్పుడు నెమ్మదిగా పుష్టిగా, కొట్టుకొనుచుండుట. కణతలు కొట్టుకొనుచుండుట. స్వల్పపరిశ్రమవలన గుండెదడవచ్చుట. హృదయము పెద్దదైనట్లుతోచుట.

మెడ, నడుము:—మెడ వంగకపోవుట. మెడలోని మాంసగ్రంథులు వాచుట. మెడ విరుగునంతటి నొప్పిగాయుండుట. నడుమునొప్పి. చట్టలలోను, తొడలలోను నొప్పులు.

కాళ్ళు, చేతులు:—పొడుచుచున్నట్లుండు బాధలు. కీళ్ళసంధులలో యెఱ్ఱగాను, నిగనిగలాడుచు, వ్యాపించుచుండెడి బాధతోకూడిన వాపులు. మేహవాతనొప్పులు ఒకచోటనుండి మరియొకచోటికి మారుచుండుట. కాళ్లను, చేతులను కదల్చుచుండుట. చేతులు, పాదములు చల్లగానుండుట.

చర్మము:—క్వాయినాగాని, రసముగాని యెక్కువగా వాడుటవలన చర్మము కామెర్లరోగములోవలె పచ్చబడుట. చర్మము ఆరుచుకొనిపోయి వెచ్చగానుండుట. ఒకప్పుడు యెఱ్ఱగాను, మరియొకప్పుడు పాలిపోయియుండుట. పొంగులోవలె యెఱ్ఱనిదద్దురులేచుట. ముక్కుమీదను, బుగ్గలమీదను కురుపులులేచి చీముపట్టుట. కురుపులు, రాచకురుపులు, సెగ్గడ్డలమీదను వుపయోగపడును (ఆర్నికా, హిపారుసల్ఫు).

నిద్ర:—నిద్రలో తుళ్లిపడిలేచుట. గట్టిగామాట్లాడుట, మరియు మూలుగుట. తరుచు ఆవలింతలువచ్చుట. నిద్రమత్తులోనున్నను, నిద్రపట్టకపోవుట. బిడ్డ నిద్రలో అటూనిటూకదలుట, తన్నుట, దెబ్బలాడుట.

జ్వరము:—చమటపట్టకపోవుట. మానసికలక్షణములతో కూడిన సన్నిపాతజ్వరము. ఒకప్పుడు చలిగాను, ఒకప్పుడు వెచ్చగాను యుండుట. అవయవములు చల్లగానుండుట. దేహము ఆరుచుకుపోయి కాగుచున్నట్లు వేడిగాయుండుట, తలకుమాత్రమే చెమటపట్టుట. ఉష్ణము యెక్కువగాను, ముఖము యెఱ్ఱగాను వుండుట జ్వరము మధ్యాహ్నము 3 గంటలకువచ్చుట.

ఉద్రేకము:—సాయంకాలము 3 గంటలపిమ్మట, అర్ధరాత్రికి తరువాత, తాకుడువలన, కదలికవలన, ధ్వనివలన, గాలిమార్పులచేత, సూర్యకిరణములవేడివలన, తాగుచున్నప్పుడు.

ఉపశమనము:—విశ్రాంతివలన, నిబ్బరముగా నిలుచుట లేక కూర్చుండుటవలన, వెచ్చనిగదిలో,

సహచరులు:—కాల్కేరియా కార్బ్.

విరుగుళ్లు:—కేంఫరు, కాఫి, ఓపియం, ఎకోనైటు. హెపారుసల్ఫ హయాస్యామసు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 35 దినములు.

బాహ్యోపయోగములు:—ఇది యెఱ్ఱగా నిగనిగలాడుచుండు వాపులకు, గొంతురాయుటకు, దగ్గువలనకలిగిన గొంతునొప్పికి, మాంసగ్రంధులవాపులమీద, గాలిబిళ్లలు లేక గనదబిళ్లలకు, పొత్తికడుపునొప్పికి, వాపుతోకూడి చీముపట్టకుండాయున్న కురుపులకు, దీనిస్వచ్ఛమైన టించరురూపమున పట్టించవలెను. ఆయింటుమెంటుగాకూడ వాడవచ్చును.

---

## 43. బెల్లిసు పెరిన్నిసు. BELLIS PERENNIS.

ఇది మేహవాతనొప్పులు, ఇరుకునొప్పులు, బెణుకునొప్పులు, కండరములలోని నొప్పులు, వీటిమీద బాగుగా పనిచేయును. నడుములోను, చట్టలలోను కలుగునొప్పులను మాన్పును. శరీరమంతట చితుకకొట్టినట్లును అవయవములు విరిగిపోయినట్లును నొప్పులుగానుండుట (ఆర్నికా, యూపటోరియంపెర్ఫ, పైరోజీనియం).

శరీరములోని జీవకణసమూహములకు, లేక టిస్యూల (Tissues) కు దెబ్బతగిలినప్పుడును, శస్త్రచికిత్సానంతరమున కలుగు నొప్పులమీదను వుపయోగపడును. ఇది యెడమవైపు అవయవములరోగములమీదను, శరీరపరిశ్రమ యెక్కువగాచేసెడు ముసలివారికిని బాగుగా నుపయోగపడును. శరీరము వెచ్చగానున్నప్పుడు శీతలోపచారములవలనను, మంచుగడ్డకలసిన పానీయములు త్రాగుటవలనను వచ్చిన రోగములను మాన్పును. మరియు తెల్లవారఝామున మెలకువవచ్చినపిదప తిరిగి నిద్రపట్టకపోవుటను, శరీరముగాని, పొట్టగాని వెచ్చగానున్నప్పుడు ఆకస్మాత్తుగా తేమతోకూడిన శీతలోపచారములవలన కలిగినరోగములను ఇది మాన్పును

తల:—ముందరవైపు ముడుచుకొనిపోయినట్లుండుట. వయోవృద్ధులకువచ్చు తలనొప్పి. నలుగకొట్టినట్లుండుబాధలు.

పురుషావయవములు:—హస్తప్రయోగమువలని దోషములు.

స్త్రీఅవయవములు:—గర్భిణులలో దుష్టరక్తనాళములవాపులవలన కదలుట లేక నడచుట కష్టముగా నుండుట.

చర్మము:—శరీరమంతటను కురుపులువేయుచుండుట.

పరుండబోవునపుడు దీనిని వాడుటవలన నిద్రపట్టదు. కనుక దీనిని ఆపుడు వాడుటమంచిదికాదు.

మోతాదు:—2 మొదలు 30 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—దెబ్బలుతగిలినప్పుడును, ఎముకలు స్వస్థానమునుండి తప్పినప్పుడును లేక విరిగినప్పుడును అందవికారము కలుగచేయు పుట్టుమచ్చలను పోగొట్టుటకును దీనిని స్వచ్ఛమైన టించరురూపమున పైకి పట్టించవలెను.

---

## 44. బెర్బెరిసు యాక్విఫోలియా. BERBERIS AQUIFOLIUM.

ఇది చర్మరోగములమీదను, చీమునటువంటి స్రావములతోకూడిన రోగములమీదను, సవాయియొక్క ద్వితీయావస్థలోను, పైత్యాధిక్యము మీదను బాగుగా పనిచేయును. రోగికి వమనానుమానముతో తలతిరుగుచున్నట్లుండును కాని వమనమవకపోవుటయు తలకు ఇనుపబద్దీగట్టిగా చుట్టబెట్టినట్లు నొప్పిగావుండుటయు—దీని ముఖ్యలక్షణములు.

తల:—నరములనిస్త్రాణవలన అపస్మారలక్షణములు. అస్థిమితము. తలచిటుకకొట్టినట్లును, పైత్యమువలననునొప్పి. కురుపులు, పొక్కులువేయుట.

ముఖము:—చెమటకాయలు, మచ్చలు, మొటిమలు (పోత్రపుమొటిమలు) బయలుదేరుట. వీటివలన ముఖముయొక్క అందము పాడగుట,

ముఖము జిడ్డుగా నగుపడుట. చర్మము పచ్చబడుట. బుగ్గలు వేడివలన కందుట. ముఖము ముడుచుకొనిపోయినట్లగుపడుట. యుక్తవయస్కులకు కలుగు మొటిమలు మొదలగువాటినిమాన్పి ముఖమునకుకళకాంతులు తెచ్చును.

అన్నకోశము:—భోజనానంతరము పైత్యముచేసినవానివలె నోటి రుచి చెడుట. నాలుకమీద పూతగలుగుట. నాలుక పొక్కులెక్కుట. భోజనానంతరము అహారమునందు కోరిక లేకపోయినను తిరిగి ఆకలివేయుచుండుట. వమనానుమానముండుట.

పొత్తికడుపు:—ప్లీహములో నొప్పిగాను, బాధగాను, మంటగాను వుండుట. పెద్దపెద్దవిరేచనములగుట. పైత్యసంబంధమైన నీళ్లవిరేచనములు.

మూత్రావయవములు:—మూత్రము మామూలుకన్న యెక్కువ తక్కువలుగా అగుట. మూత్రనాళములో కుట్టుచున్నట్లుండు బాధలు.

చర్మము:—చర్మము ఆర్చుకొనిపోయి గరుకుగాను, పొక్కులతోను నిండియుండుట. తలమీదను, ముఖముమీదను, మెడమీదను చిన్నచిన్న పొక్కులు బయలుదేరుట. మంత్రపుపొక్కులు. మాంసగ్రంధులు గట్టిపడుట.

మోతాదు:—మదరుటించరు. (1 లగాయితు 5 చుక్కలసరకు ఒక మోతాదుగా వాడవచ్చును).

---

## 45. బెర్బెరిసు వల్గారిసు. BERBERIS VULGARIS.

ఇది ముఖ్యముగా పైత్యతత్వములకు బాగుగా పనిచేయును. బాధలు శరీరపరిశ్రమవలన యెక్కువగుట, మరియు నివి ఒకఅవయవమునుండి ఇంకొకఅవయవముమీదికి వ్యాపించుచుండుట.

రోగలక్షణములును మరియు బాధలయొక్క స్థానములును తరచు మారుచుండుట, అనగా ఒకసారి దాహముగానుండుట, మరియొకసారి దాహము లేకపోవుట, ఒకసారి యెక్కువ ఆకలిగానుండుట, మరియొకసారి ఆకలిలేకపోవుట, బాధలు ఒకసారి ఒకఅవయవమునందును, ఇంకొక

సారి మరియొకఅవయవమునందును కనిపించుచుండుటయు కలుగుట.

♦ ఒక మూత్రపిండమునందు కుట్టుచున్నట్లు చీల్చుచున్నట్లు త్రవ్వు చున్నట్లు తాళజాలనంత బాధ మరియు తీవ్రముగా కోయుచున్నట్లును కుట్టుచున్నట్లును యుండు బాధ మూత్రపిండములనుండి మూత్రకోశము మూత్రనాళములవరకును వ్యాపించుట. ♦ రేతోవాహికలలో పొడుచు చున్నట్లు లేక యీడ్చుచున్నట్లు యుండు బాధవృషణములలోనికి వ్యాపించుట. ♦ మూత్రమును విడుచునపుడు మక్కలలోనూ పిరుదులలోనూ నొప్పులు.—ఇవి దీని ముఖ్యలక్షణములు.

తల:—రోగి తలతిరిగి పడిపోవుట నుదుట నొప్పిగాయుండుట తలమీద టోపి బిగువుగానుండితలనంతటనునొక్కుచున్నట్లుండుట. ముఖము పాలిపోయి దవుడలు, కన్నులు, లోతునపడిజబ్బుపడినవానివలెనగుపడుట. లాలాజలము చిక్కగాను, జిగురుగాను కొద్దిగాను, నురగగాను వుండుట. నాలుక కాలినపుండువలె నొప్పిగావుండుట. నాలుకమీద పొక్కులు బయలు దేరుట.

అన్నకోశము:—అజీర్ణమువలన గుండెలలో మంటగానుండుట.

పొత్తికడుపు:—మూత్రపిండములలో కుట్టుచున్నట్లుండు నొప్పి కాలేయము, ప్లీహము, అన్నకోశము, గజ్జలు లోనికి వ్యాపించుచుండుట. గజ్జలలో దుష్టరక్తనాళములవాపును, మాంసగ్రంథులవాపును మాన్పును. కాలేయ సంబంధమైన రాళ్ళు బయలు దేరుట.

మలము, మలాశయము:—ఎల్లప్పుడును విరేచనమునకు తొందరపడుట. మలముజిగురుపట్టినవలెను, మంటతోను, ఆసనములోపోటుతోను వెడలుట. ఆసనములో చీల్చుచున్నట్లుండు బాధలు. భగందరమును మాన్పును.

మూత్రావయవములు:—మంటగానుండుట. మూత్రపిండములలో బుడగలువచ్చుచున్నట్లును, నొప్పిగానువుండుట. మూత్రమువిడుచునప్పుడు తొడలలోను, గజ్జలలోను నొప్పిగానుండుట

పురుషావయవములు:—వృషణములలో పైకిలాగుచున్నట్లు నొప్పి.

స్త్రీఅవయవములు:—సంభోగేచ్ఛ తక్కువగుట. సంభోగక్రియ యందు కోయుచున్నట్లు బాధలు. కుసుమ బూడిదరంగుగా వెడలుట.

నడుము, కాళ్ళు, చేతులు:—నడుము కొయ్యబారుట, ఒకప్పుడు నలుగగొట్టినట్లు బాధగానుండుట. భుజములలోను, చేతులలోను, కాళ్లలోను, చేతులయొక్కయు కాళ్లయొక్కయు వేళ్లలోను, కలుగు మేహవాతపు నొప్పులు, మేహవాతపువాపులు, నడుమునొప్పిని మాన్పును. నడుమునొప్పి నడుముచుట్టూప్రాకుచు తొడలలోనికిని, ఇతరఅవయవములలోనికిని పోడుచుటను మాన్పును.

చర్మము:—పల్చనిగద్దుర్లు, పొక్కులు, ఇవి దురదతోను, మంటతోను కూడియుండుట. చేతులు, ఆసనము, వీటియందు మంత్రపుపొక్కులు బయలుదేరుట.

జ్వరము:—నీళ్ళుజల్లినట్లుగా శరీరము చల్లగానుండుట.

ఉద్రేకము:—నిలుచుండుటవలన, కదలికవలన.

విరుగుళ్లు:—కేంఫరు, బెల్లడోనా.

మోతాదు:—1 మొదలు 200 పొటెన్సీ.

---

## 46. బ్లూమియా. BLUMEA ODORATA.

హిందూదేశపు ఔషధము. 15. సంస్కృతమున కుకుందరా యందురు.

ఇది గర్భాశయ రక్తస్రావములకును, జిగటవిరేచనములు రక్తవిరేచనములకును, రక్తమొలల (రక్తముస్రవించుటతోనుండు మూలశంఖ.)కును ముఖ్యముగా వాడదగినది. అకాల ప్రసవసంబంధమైన రక్తస్రావమును కట్టును. రక్తకుసుమమునకిది దివ్యౌషధము.

అరచుచున్నట్లు లేక బాకావూదుచున్నట్లుండు ధ్వనితో వచ్చు దగ్గును, గొంతుక బొంగురుతనమును మాన్పును.

మోతాదు:—1 మొదలు 3 పొటెన్సీ.

---

## 47. బోర్‌హావియా. BOERHAAVIA DIFFUSA.

హిందూదేశపు ఔషధము. 16. సంస్కృతమున దీనిని "పునర్నవా" యనియు, తెనుగునఅటికమామిడిఅనియు అంబటిమాటికూరఅనియుఅందురు.

ఇది మూత్రావయవములకును, కాలేయమునకును, సంబంధించి ద్వంద్వముగావచ్చు వ్యాధులమీద పనిచేయును.

శరీరము ఉబ్బుటతో మూత్రము కొలదిగా వెడలుట. గుండెదడ. కాలేయదోషములు.— దీని ముఖ్యలక్షణములు.

మెదడు, తల:—ముఖ్యముగా తల కుడిపైపున బద్దలగుచున్నట్లుండునొప్పి.

అన్నకోశము, పొత్తికడుపు:— పైత్యవమనములు. పొత్తికడుపునద్ద నొప్పి.

మూత్రావయవములు:—ముదరరంగుగను కొలదిగను మూత్రము వెడలుట.

శ్వాసావయవములు:—పొడిదగ్గు మరియు రొంప, జలుబు.

పోలికలు:—శాంగ్విసేరియా.

మోతాదు:—30 పొటెన్సీ.

---

## 48. బ్రియోనియా. BRYONIA.

ఇది మేహవాతతత్త్వములమీదను, పైత్యతత్త్వములమీదను, నల్లనిదేహచ్ఛాయగలిగిన దృఢశరీరులకును, ఆర్చుకొనిపోయి సన్నముగానుండి(న కృశించి) నరములసంబంధమైన రోగములతో బాధపడువారికిని పుష

రోగపడును. ఇది సన్నిపాతజ్వరముయొక్క ప్రారంభదశలో బాగుగా పనిచేయును. కుడివైపు అవయవములమీదవచ్చు రోగములమీద బాగుగా పనిచేయును. బహిష్టుకుబదులు ముక్కునుండిరక్తస్రావమువచ్చుట(ఫాస్ఫరసు). తాకుడువలనను, కదలికవలనను వుద్రేకించు కీళ్లవాతము లేక మహావాతపు నొప్పులు. చిన్నపిల్లలు యెత్తుకొనుటకిష్టపడక పోవుట.

స్రావములను మరియు చర్మముపైపొక్కులను దద్దుర్లను అణచిపెట్టుట వలనను, తిండిపోతుతనము వలనను, చలిగాలికిపిమ్మట వేయుగాడ్పుల దోషములవలనను, పులిసినరొట్టె మరియు బీరు తీసికొనుటవలనను, నిప్పువేడిమివలనను, కోపమువలనను, భయముజెందుటవలనను, ఆల్కహాలుత్రాగుటవలనను దెబ్బ తగులుటవలనను వచ్చు రోగలక్షణములమీద నిది ముఖ్యముగా వాడదగినది.

♦ పడకయందు రోగి లోతునకు దిగబడిపోవుచున్నట్లు అనుకొనుట. ♦ తనవ్యాపారమును గూర్చిన చింత లేక ఆతురత రాత్రియందెక్కువగుట. ♦ ఎక్కువ విరేచనబద్ధము, మలము కాలినట్లు గట్టిగ ఆర్చుకుపోయి వెడలుట. ఉబ్బుసంబంధమైన వాపులు పగలు ఎక్కువగను రాత్రియందు తక్కువగను యుండుట. ♦ ఛాతీలో గుచ్చుచున్నట్లుండు బాధవలన గాఢముగా ఊపిరి పీల్చుటకాని కదలుటగాని కష్టముగా నుండుట. ♦ కీళ్లు ఎర్రగా వాచి కొయ్యబారి కదలినచో కుట్టుచున్నట్లుండు బాధగలుగుట. ♦ రోగి తరచు చిరాకుగానూ కోపముజెందునట్లును యుండుట. ♦ చల్లని నీటిని త్రాగుటయందు తీవ్రమైనకోర్కె. ♦ నోరు ఆర్చుకుపోవుట. ♦ పెదవులు పొడిగా ఎండిపోయియుండుట. ♦ తన వ్యాపారమునుగూర్చి తెలివితప్పి మాటలాడుచుండుట. ఈలక్షణములు తెల్లవారగట్ల 3 గంటలకు ఎక్కువగుట. ♦ పడకలో లేచి కూర్చుండుటవలన వికారమువచ్చుట, సొమ్మసిల్లిపోవుట. ♦ మెడకండరములును వీపుయందలి కండరములును నలుగ గొట్టబడినట్లు నొప్పి. ♦ పెదవులు మొదలు ఆసనమువరకు (ఆహారనాళము) ఆర్చుకు పోవుట రోగలక్షణములు బాగుగా చమట పట్టినపిమ్మటను లేక అధికముగా

మూత్రము వెడలినపిమ్మటను ఉపశమించుటయు దీనిముఖ్యలక్షణములు.

మనస్సు:—చిరచిరలాడుచుండుట. మిక్కిలి కోపముగానుండుట. భవిష్యత్తునుగూర్చి యెక్కువ ఆతురతనుజెందుట. జీవనాధారముకష్టముగా తోచుట. సన్నిపాతజ్వరములో తనవ్యాపారమునుగూర్చి మాట్లాడుచుండుట రాత్రియందెక్కువగా నుండుట. కోరినవస్తువులు తెచ్చియిచ్చిన యెడల వాటిని తిరస్కరించుట. స్మృతితప్పుట.

తల:—తలతిప్పు. కనబడుచున్న వస్తువులన్నియు గుండ్రముగా తిరుగుచున్నవనుకొనుట. పడకనుండిగాని, కుర్చీనుండిగాని లేచిన తలతిరుగుట. నొప్పివలన తలబ్రద్దలై విడిపోవుచున్నట్లు బాధగాయుండుట. ఉదయముననే ప్రారంభించు తలనొప్పులు. కండ్లుతెరచుటవలనను, ముందరకువంగుటవలనను, కదలికవలనను, తలనొప్పి యెక్కువగుట.

చెవులు:—గర్జించుచున్నట్లుండు ధ్వనులు. కుడిచెవి వాపు, బాధ.

ముక్కు:—ఉదయమున రక్తస్రావమగుట. ముక్కుకొన వాచుట. ముక్కుమీద కురుపులు బయలుదేరుట.

ముఖము:—ఎఱ్ఱగా వెచ్చగాపొంగరించియుండుట. దాహముగొనుట.

నోరు:—నాలుకపై గోధుమరంగు, పసుపుపచ్చన, ఒకప్పుడు తెలుపురంగుగల పూత. నాలుక గరుకుగను, చీటలతోను వుండుట. పైపెదవి వాచి యెఱ్ఱగా, నొప్పిగా వుండుట. పంటినొప్పి చన్నీటివలన వుపశమించుచు వెచ్చని పదార్థములవలనవుద్రేకించుట. పెదవులు ఆర్చుకుపోయ చీటలుతీయుట. నోరార్చుకుపోవుటతో మాట సరిగారాకపోవుట.

గొంతుక:—ఆర్చుకుపోవుట. మ్రింగునపుడు కుట్టుచున్నట్లుబాధగావుండుట. చిక్కని ఆమము కాండ్రించుటతో సులభముగావెడలుట.

అన్నకోశము:—ఎక్కువఆకలి, యెక్కువదాహము. రుచి తెలియకపోవుట. భోజనానంతరము యెక్కిళ్లువచ్చుట. వేసవిలోకలుగు అజీర్ణబాధలు. ప్రక్కయెముకలసమీపమున పోట్లువచ్చుట, పొట్ట బరువుగా

నుండుట. భోజనానంతరము పసరు వమనమగుట. నాలుక చేదుగానుండుట.

హొత్తికడుపు:—కాలేయమువాచి బిగపట్టినట్లు నొప్పి. ప్రేగులు కుట్టుచున్నట్లును, మంటగాను యుండుట, ఇవి దగ్గుటవలనను, నొక్కుటవలనను ఊపిరిపీల్చుటవలనను యెక్కువగుట. అంత్రిగులలో గుడగుడలు.

మలము, మలాశయము:—తీరనివిరేచనబద్ధము. మలము లావుగాను, కాల్చినట్లుగాను ఆరిపోయి బహుకష్టముమీద వెడలుట. వెచ్చని గాడ్పులలో చల్లదనమునిచ్చు పానీయములు త్రాగినపిమ్మటవచ్చు నీళ్లవిరేచనములు. మలము యెక్కువ దుర్వాసనగా వెడలుట.

మూత్రము:—కొద్దిగా, గోధుమరంగుగా, ముదరరంగుగా లేక యెఱ్ఱగా, వెచ్చగా, కోయుచున్నట్లుండు బాధతోను మంటగను వెడలుట.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ యెక్కువగుట. అండములలో పోటుగానుండుట. కూర్చుండునపుడు కుట్టుచున్నట్లుండు బాధలు.

స్త్రీఅవయవములు:—గట్టిగా ఊపిరిపీల్చినపుడు అండాశయములో కుట్టుచున్నట్లుండుబాధలు. బహిష్టు అతిత్వరగాను, స్రావము విస్తారముగాను, ముదరరంగుగాను వెడలుట. ఒకప్పుడు ఋతువాగిపోయి ముక్కునుండి రక్తస్రావము, బ్రద్దలగుచున్నట్లుండు తలనొప్పి వచ్చుట. స్తనములు వెచ్చగాను, గట్టిగాను, బాధగాను వుండుట. బహిష్టులో స్తనములలో నొప్పిగానుండుట. పాలువచ్చుట ఆగిపోవుట లేక బహువెక్కువగా వచ్చుచుండుట. స్తనములమీద కురుపులు బయలుదేరుట.

శ్వాసావయవములు:—బహిరంగమైన గాలిలోనుండి వెచ్చనిగదిలోనికివచ్చుటవలన దగ్గువచ్చుట. పొడిదగ్గు రాత్రియందువచ్చుట, లేచి కూర్చొని దగ్గవలసివచ్చుట. భోజనానంతరమునను, పానీయములు త్రాగిన పిమ్మటను దగ్గుయెక్కువగుట. ఛాతీలో కుట్టుచున్నట్లుండుబాధలు. వీటివలన ఊపిరిపీల్చుట కష్టముగానుండుట. శ్లేష్మము తుప్పురంగుగా వెడలుట. రొమ్ముయొక్క వెనుకను బరువుగానుండుట. జలుబువలనవచ్చిన న్యూమోనియాలో బాగుగా పనిచేయును. స్వరపేటిక, శ్వాసనాళములలో నొప్పి

గాయుండుట. బొంగురుతనము బహిరంగమైన గాలిలో నెక్కువగుట.

హృదయము:—నొక్కుచుండునట్లుండు బాధలు. నాడివిపరీతముగా త్వరితముగా, వడిగా, గట్టిగా, పుష్టిగా కొట్టుకొనుచుండుట.

మెడ, నడుము:—కొయ్యబారి నొప్పిగాయుండుట. గాలిమార్పుల వలన నిటుల కలుగుచుండుట.

కాళ్ళు, చేతులు:—ఎడమకాలు, చేయి కదల్చుచుండుట. పాదములు వెచ్చగా వాచియుండుట. మోకాళ్ళు బిగపట్టి నొప్పిగాయుండుట. కీళ్ళు యెఱ్ఱగావాచి వెచ్చగాను, కుట్టుచున్నట్లును, చీల్చుచున్నట్లును, బాధగా నుండుట. కదలికవలన యీబాధ లెక్కువగుట.

చర్మము:—పసుపువర్ణముగా పాలిపోయి, వుబ్బి, వెచ్చగాను బాధ గానువుండుట. ఉబ్బు పగలుయెక్కువగుచు, రాత్రియందు తగ్గుచుండుట.

జ్వరము:—మన్యపుజ్వరము. అతిదాహము. శరీరము పొడిగాను, మంటగాను, వెచ్చగాను, లోపలరక్తముమఱుగుచున్నట్లును, ఉష్ణముగాను వుండుట. చెమట సులభముగాపట్టుట. ఇది పులిసినవాసనగాను, నూనె వలె జిడ్డుగాను యుండుట. సన్నిపాతజ్వరములో నరముల వుద్రేకమువల లన కలిగినలక్షణములమీద నిది బాగుగా పనిచేయును. నోరు చేదుగానుం డుట. ఒకప్పుడు చెమటపట్టకపోవుట. ఇది సన్నిపాతజ్వరముయొక్క ప్రథమదశలో బాగుగా పనిచేయును.

ఉద్రేకము:—వేడిమివలన, కదలికవలన, ఉదయమున, భుజించుట వలన, వేసవిలో, పరిశ్రమవలన, తాకుడువలన, రాత్రి 9 గంటలకు.

వుపశమనము:—బాధగానుండు వైపున పరుండుటవలన, నొక్కుట వలన, విశ్రాంతివలన, చల్లని పదార్థములవలన, స్థిమితముగవలన, కూర్చుండు టవలన, చీకటిగదిలో, మెట్లుదిగుటవలన.

సహచరులు:—రూస్టాక్సు, ఎల్యూమినా, కాలీకార్బ.

విరుగుళ్లు:—ఎకోనైట్, కెమోమిల్లా, నక్సువామికా, కేంఫరు,

యూసిడ్ మూరు, పల్సటిల్లా, ఇగ్నీషియా, రూస్టాక్సు, సెనీగా, క్లెమేటిస్.

మోతాదు:—2 మొదలు 200పొటెన్సీ. చిన్నపొటెన్సీలు మేహ వాతములమీదను, అజీర్ణములమీదను బాగుగా పనిచేయును. మధ్యపొటెన్సీలు, పెద్దపొటెన్సీలు శ్వాసావయవరోగములమీద బాగుగా పనిచేయును. దీనిగుణకాలపరిమితి 2 లేక 3 వారములు.

బాహ్యోపయోగములు:-వంగనిమెడకును, మేహవాత(రుమేటిజం) సంబంధమైన నొప్పులకును, నడుమునొప్పికి, కీళ్లలోనొప్పికి, వాపులకు, కండరములలోని నొప్పులకు, ఛాతీలోనివాపుకు, బాధకు, దీనిని స్వచ్ఛమైన టించరురూపమున పైకి పట్టించవలెను.

---

## 49. బొవిస్టా. BOVISTA.

ఇది చర్మరోగములమీదను, రక్తప్రసరణసంబంధమైన వ్యాధుల మీదను బాగుగా పనిచేయును.

కొద్దిపరిశ్రమవలనకూడ ముక్కునుండిగాని, స్త్రీమర్మావయవముల నుండిగాని రక్తస్రావమువచ్చుట, ఈస్రావము రాత్రియందుగాని, ఉదయమందుగాని యెక్కువగా నుండుట. చిన్నపిల్లలు నత్తిగామాట్లాడుట (స్ట్రెమోనియం). స్రావములుచిక్కగానుండుటయు దీనిముఖ్యలక్షణములు.

మనస్సు:—మెదడు పెద్దదైనట్లుగా తలచుట. చేతితోపట్టుకొనిన వస్తువు అప్రయత్నముగా క్రిందపడిపోవుట.

తల:—వెచ్చదనమువలన తలదురద హెచ్చగుట. నొప్పిపెట్టువరకును రోగి తలను గోకుచునేయుండుట. ముక్కునుండి తీగవంటి స్రావము. ఇగుళ్లనుండి రక్తముస్రవించుట. పెదవులు, దౌడలు వాచుట. ముఖముమీది మొటిమలు వేసవిలో యెక్కువగుట.

నోరు:—పండ్లనూడతీయుటతోపచ్చురక్తస్రావము(హెమామెలిస్.)

మూత్రావయవములు:—తరుచు మూత్రానుమానము, మూత్రము

పసుపుపచ్చగాను లేక సున్నపునీటివలెను వెడలుట. మధుమూత్రము.

స్త్రీ అవయవములు:—బహిష్టుకు ముందరను, బహిష్టులోను నీళ్ల విరేచనములగుట. ఋతువు త్వరగాను, స్రావమెక్కువగాను వుండుట. బహిష్టుకుబహిష్టుకుమధ్య ఋతుస్రావము వెడలుచుండుట.

పొత్తికడుపు:—శూలగానుండుట, మూత్రము యెఱ్ఱగానుండుట, యీలక్షణములు భోజనమువలన వుపశమించుట. బొడ్డుచుట్టూ నొప్పిగా వుండుట. ముసలివారిలో మాననటువంటి విరేచనములు, ఇవి రాత్రియందును, ఉదయమును యెక్కువగా నుండుట.

కాళ్లు, చేతులు:—కీళ్లసంధులలో బలముతక్కువగానుండుట. కాళ్లు చేతులు దురదగానుండుట. దెబ్బలుతగిలినపిదప కీళ్లసంధులలో నీరుపట్టుట

చర్మము:—మంత్రిపుపొక్కులు, వీటినుండి కొద్దిగా రసివెడలుచుండుట. ఆనికాయలలో పొడుచుచుండునట్లుండు బాధలు. వేడిమివలన శరీరము దురదగానుండుట. మోటపనిముట్లు, కత్తెరలు, చాకులు మొదలైనవి వుపయోగించుటవలన వేళ్లమీద లోతైన నొక్కులుపడుట.

విరుగుళ్లు:—కేంఫరు.

అనుచరులు:—సేపియా, రూస్టాక్సు, కాల్కకార్బ, ఎల్యూమినా. తారునలనిదోషములకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 50. కేక్టసు. CACTUS.

ప్రేమభంగము, తేమ, సూర్యరస్మి వీటివలని దోషములను లేక రోగములను యిది మాన్పును.

ఇనుహృదయరోగములమీదను బాగుగా పనిచేయును. అవయవములు ముడుచుకొనిపోయినట్లుండుట, హృదయము ఇనుపబద్దీతో బిగించి కట్టబడినట్లుండుట, వూపిరాడకపోవుట, యెడమచెయ్యి మొద్దుబారుట, శరీర

మంతయు కట్టివేయబడినట్లుండుట, పరిశ్రమవలన గుండెదడ యెక్కువగుట, స్రావములుగలుగుచుండుట — ఇవి దీనిముఖ్యలక్షణములు.

మనస్సు:— కంగారుగాను, విచారగ్రస్తముగాను, ఆతురతతోను, రోగము కుదరదను భయముగాను (ఆర్సెనికం ఆల్బం) వుండుట. బాధ కోర్వజాలక అరచుచుండుట. ఒంటరిగానుండగోరుట. చనిపోవుదునని భయము జెందియుండుట.

తల:— పెద్దబరువువలననొక్కుచున్నట్లునొప్పి. ఇదిమాట్లాడుటవల్ల, ధ్వనులవల్ల, వెలుతురువల్లను యెక్కువగుట. తలను మిషనులోపెట్టి బిగించి నొక్కుచున్నట్లు బాధగానుండుట. తలబ్రద్దలగునంతటి బాధలు (ఎకోనైటు, బెల్లడోనా, గ్లొనోయిన్, నేట్రం మూరు).

కన్నులు:— దృష్టిమాంద్యము. దూరపువస్తువులు బాగాఆనకపోవుట

ముక్కు:— రక్తమెక్కువగా కారుట. నీళ్లవంటిస్రావము వచ్చుట.

ముఖము:- ఎఱ్ఱనివాపు ఒకప్పుడుపాలిపోవుట. చల్లనిచెమటపట్టుట.

నోరు:— ఉదయమున దుర్వాసనగాయుండుట. నాలుక వూదారంగుగాయుండుట. పండ్లు గారపట్టుట.

అన్నకోశము:— అజీర్ణమువలన తలతిప్పు. ఉదయమున ప్రారంభించి దినమంతయు వుండుట. రక్తవమనమగుట. పులితేన్పులు. కడుపులోమంట, బరువు యుండుట. బొడ్డుచుట్టూ బాధగావుండుట.

మలము, మలాశయము:— మలము నల్లగాను, గట్టిగాను వెడలుట. మూలశంఖవాచి, బాధగాయుండుట. మలాశయమునుండి రక్తస్రావమగుట. భగందరము, దీనితోపాటు గుండెదడ గానుండుట.

మూత్రావయవములు:— రక్తమూత్రము. మానకుండా మూత్రము విసర్జించవలసివచ్చినట్లుతోచుట. మూత్రము మంటగా, చుక్కచుక్కలుగా పడుట. రాత్రిరుచు మూత్రానుమానము, మూత్రమెక్కువగానగుట.

స్త్రీఅవయవములు:— ఋతుశూలబాధకోర్వలేక రోగి పెద్దపెద్ద

కేకలువేయుట. ఋతువు త్వరితముగా, స్రావము తక్కువగా, నల్లగా తారువలె నగుట. పరుండినపుడు స్రావము వెడలదు (బొవిష్టా, కాష్టికం).

శ్వాసావయవములు:—మెల్లెక్కుచున్నప్పుడు వూపిరాడుటకష్టము శ్లేష్మమువలన ఛాతీలో గురగురలాడుచుండుట. సమముగా పండుకొనుట కష్టము. ఛాతీలో నొక్కుచున్నట్లు, ఇనుపబద్దీచే బిగించి కట్టబడినట్లు బాధగానుండుటవలన వూపిరిపీల్చుటకష్టము. అప్పుడప్పుడు వూపిరాడక పోవుటచే మూర్ఛిల్లుట, నుదుటచెమటపట్టుట, నాడిఆనకపోవుట, పరుండియుండుటవలన గుండెలు బరువుగానుండుట.

హృదయము, నాడి:—హృదయము ఇనుపబద్దీతో గట్టిగాకట్టబడి నట్లుండుటవలన ముడుచుకొనిపోయినట్లుతోచుట. ఎడమవైపు పరుండుట కష్టము. నాడి విడిచివిడిచికొట్టుకొనుచుండుట. నాడి నిస్త్రాణజెందుట. గుండెయెక్కువదడగాయుండుట (లెకెసిస్), దీనితో వికారము, స్మృతి తప్పుట, వూపిరాడకపోవుట, ఇట్లు నడచుటవలనను, రాత్రియందును,యెడమవైపుపరుండినపుడును, బహిష్టుకు ముందరను, పరిశ్రమవలనను గలుగుచుండుట. ప్రేమభంగమువలన వచ్చిన గుండెదడ. హృదయము ఒకప్పుడు నెమ్మదిగాను, మరియొకప్పుడు త్వరితముగాను కొట్టుకొనుచుండుట. హృదయము వాచుట. మేహవాతము. గాఢమైన ఆలోచనవలనను, గట్టిగా వూపిరిపీల్చుటవలనను, స్వల్పపరిశ్రమ వలననుగూడ గుండెదడవచ్చుట.

నడుము, కాళ్లు, చేతులు:—నడుముచల్లగాను, చేతులు మంచువలె యెక్కువ చల్లగాను వుండుట. భుజములలో మేహవాతనొప్పులు. విశ్రాంతిగానున్న పిదప కదలుటవలన నడుము వంగకపోవుట. కాళ్లు, చేతులు వుబ్బుట. ఎడమచెయ్యి మొద్దుబారుట, మేహవాతనొప్పులు.

నిద్ర:—అకారణమైన నిద్రలేమి. భయముతో, శృంగారముతో కూడిన కలలు.

జ్వరము:—ప్రతిరోజునను జ్వరము ఒకేగంటయందు వచ్చుట. నడుము, చేతులు చల్లగానుండుట, మన్యపుజ్వరములో చలి మధ్యాహ్నము

11 గంటలకు వచ్చుట. చల్లనిచెమట పట్టుట. అతివేదన, మంటతోకూడిన వేడి, ఆయాసము, స్మారకము తప్పుట. తీరనిదాహము.

ఉద్రేకము:—మధ్యాహ్నమందు, ఎడమ ప్రక్కన పరుండుటవలన, నడచుటవలన, మెట్లెక్కుటవలన; పగలు రాత్రి 11 గంటలవేళయందు.

ఉపశమనము:—విశ్రాంతివలన, బహిరంగమైనగాలిలో,నిద్రవలన.

విరుగుళ్లు:—కేంఫరు, ఎకోనైట్, చైనా, యూపటోరియం పెర్ఫ

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 51. కెలేడియం సెగ్. CALADIAM SEG.

ఇదిమర్మావయవరోగములమీదను, పుబ్బసపువ్యాధిమీదను, పుగాకు నుపయోగించుటవలన కలుగు దోషములమీదను పనిచేయును.

చెవులు:—ధ్వనులవలన వులికిపడుచుండి పడకనుండిలేచుచుండుట.

ముక్కు:—పడిశముపట్టుట, దిబ్బడవేయుట.

శ్వాసావయవములు:—ఉబ్బసములో శ్లేష్మము తెగిపడకపోవుట, ఇందువలన రోగి నిద్రపోవుటకు భయపడుట.

మూత్రావయవములు:—మూత్రకోశము నిండుగానున్నను మూత్రనుమానముండకపోవుట. మూత్రము దుర్వాసనగాను,.మడ్డితోను విడలుట.

పురుషావయవములు:—శుక్లనష్టమును, స్వప్నస్ఖలనమును, నపుంసకత్వమును, అవయవములు యొక్కువదురగదగానుండుటను మాన్పును. నిద్ర సరిగా పట్టకుండగనే లేపనముకలుగుట. మరియు మెలకువ వచ్చినవెంటనే లేపనము తగ్గిపోవుట. సంభోగేచ్ఛ యొక్కువగాకలిగినను అంగము మూడు చుకొనిపోవుట. అధికసంభోగమువలనవచ్చుబాధలు. జీర్ణించినసెగరోగము.

స్త్రీఅవయవములు:—ఎక్కువ దురదగాయుండుట. రాత్రియందు మర్మావయవములో విడిచివిడిచివచ్చు నొప్పులు. సంభోగేచ్ఛ యొక్కువ కలుగుట. క్రిమిదోషమువలన అనగా ఆసనమునుండి నులిపురుగులు లేక

క్రిములు మర్మావయవములోనికి ప్రవేశించి, గులపుట్టించుటవలన హస్తప్రయోగమునందును, సంభోగమునందును అధికమైన వాంఛగలుగుట.

చర్మము:—గరుకుగా, ఆర్చుకుపోవుట. ఎక్కువదురద.

జ్వరము:—సాయంకాలము చలితోవచ్చుట. దాహముండదు. చర్మము వెచ్చగాను, పొడిగాను వుండుట. సాయంకాలము చెమటపట్టుట. నిస్త్రాణగాయుండుట. ఆవలింతలువచ్చుట. నిద్రమత్తు. చమట తియ్యగానుండుటవలన ఈగలు ముసురుట.

పుగాకును వాడుటయందు ఇచ్ఛను లేక కోర్కెను మాన్పును.

సహచరులు:—యాసిడ్ నైట్రిక్.

విరుగుళ్లు:—కేప్సికం, కార్బోవెజ్, కేంఫర్, చెలుకురసము.

మెర్క్యూరియసునకిది విరుగుడు.

ఉద్రేకము:—వెచ్చదనము, కదలికవలన.

ఉపశమనము:—చమటవలన, కొలదినిద్రకుపిదప.

మోతాదు:—టించరు మొదలు 30 పొటెన్సీ. దీనిగుణకాల పరిమితి 6 మొదలు 8 వారములు.

---

## 52. కేలెండ్యులా. CALENDULA.

ఇది ముఖ్యముగా గాయములమీదను, పుండ్లమీదను, రక్తదోషములతో కూడినట్టియు, సులభముగా మానవట్టియు రాచపుండ్లు, నరుకులు, వ్రణములు మొదలైనవి మాన్పుటలో బాగుగా పనిచేయును. ఇట్టివాటికి దీనిని లోపలికి వాడుచు పైకి పట్టించవలెను. కేన్సరు లేక పుట్టవ్రణమును మాన్పుటకు అప్పుడప్పుడు దీనిని లోపలకు తీసికొనవలెను. ఇది లోపలకును, పైకినికూడ వుపయోగించతగిన మంచియౌషధము.

తల:—దిమ్ముగానుండుట. చీల్చుచున్నట్లుండు తలనొప్పి.

కన్నులు:—దెబ్బతగులుటవలన చీముపట్టుట.

చెవులు:—చెముడు. తేమప్రదేశములలో నివసించుటవలన చెముడుయెక్కువగుట. రైలులో ప్రయాణము చేయునప్పుడు దూరధ్వనులు బాగుగా వినిపించుట.

ముక్కు:—ఒక నాసికారంధ్రమునుండి నీళ్లుకారుచుండుట. ఒకప్పుడు ఆకుపచ్చని స్రావముండుట.

అన్నకోశము:—అజీర్ణమువలనగుండెలలోమంట. వమనానుమానము

మూత్రావయవములు:—తరుచు మూత్రము పాలిపోయినరంగుగా వెడలుట. ఒకప్పుడు వెచ్చగాను, మంటతోను వెడలుట.

స్త్రీఅవయవములు:—ఋతువు అణచిపెట్టబడుట. ఇందువలన దగ్గుబయలుదేరుట. గజ్జలలో లాగుచున్నట్లు నొప్పులుగాయుండుట.

శ్వాసావయవములు:—ఆకుపచ్చని స్రావముతోకూడిన దగ్గు. గొంతుక బొంగురుపోవుట.

కాళ్లు, చేతులు:—గజ్జలలో మాంసగ్రంధులువాచి ముట్టుకొనుటకు నొప్పగానుండుట. చేతులు బిగపట్టినట్లు గానుండుట.

చర్మము:—పసుపుపచ్చగానుండుట. పుండ్లనుండి తరుచు చీము వెడలుచుండుట. పుండ్లుమానినపుడు పుండ్లపంచలుగట్టిపడి యెత్తుగానగుట. పుండ్లనుండి యెక్కువగా రసివెడలుచున్నప్పుడు దీనిని వాడవలెను. తెగినచోట లేక నరుకబడినచోట చర్మము తిరిగి కలుసుకొనునట్లు చేయుటలోను, చీముపట్టకుండునట్లు జేయుటలోను, పుండ్లుమానినపిదప కురూపము గలుగచేయునట్టి మచ్చలు పడకుండచేయుటలోను చాలసహాయపడును.

జ్వరము:—సాయంకాలము శరీరము యెక్కువ వెచ్చగానుండుట, సాధారణముగా చల్లగానుండుట. జ్వరసంబంధమైన చలి చేతులలోను, కాళ్లలోను ఉదయమందు ప్రాకుచున్నట్లుండుట.

ఉద్రేకము:—తేమగాలిలో,

సహచరులు:—హీపారుసల్ఫ.

విరుగుళ్లు:—చెలిడోనియం, రియం, ఆర్నికా.

సరిపడనివి:—కేంఫరు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—చితికినపుండ్లు, పుండ్లు, వ్రణములు, రాచపుండ్లు, నరుకులు, శరీరము కాలుట, బొబ్బలెక్కుట, పుండ్లగుట; పుండ్లు, కురుపులు మొదలగువాటినుండి రక్తము స్రవించుచుండుట, కురుపులు, పుండ్లు మొదలగునవి బయలుదేరిన ప్రదేశములు కుళ్ళనారంభించుట, ఇట్టివాటిలో దీనిని స్వచ్ఛమైన టించరురూపమున తీసికొని 10 రెట్ల నీళ్లలోకలిపిగాని, 4 రెట్లకొబ్బరినూనె లేక గ్లిసరిన్‌లోకలిపిగాని లేక వేసిలైనులోకలిపిగాని పైకి వుపయోగించవలెను. దీని నుపయోగించుట వలన రక్తము వెడలుచున్నప్పుడు వెంటనే కట్టివేయును. చీముపట్టినప్రదేశమును శుభ్రపరచి పుండ్లు కురుపులు మొదలైనవాటిని మాన్పును.

---

## 53. కెలాట్రోపిస్. CALOTROPIS.

(హిందూదేశపు ఔషధము 17. జిల్లేడు.).

ముఖ్యముగా ఇది పాదరసము నెక్కువగా నుపయోగించిన సవాయి రోగులకును, ఏనుగుకాలు, బోదకాలు, కుష్టు, జిగటవిరేచనములు, క్షయ, న్యుమోనియాలచే బాధపడువారికిని మంచిఔషధము. శరీర మెండిపోవుచున్నను పొట్టకు క్రొవ్వు పట్టుచుండుటయు—దీనిముఖ్యలక్షణములు.

ముఖము:—దౌడలు మంటగానుండుట. పెదవులు, గొంతుక, ఆర్చుకొనిపోవుట. శ్వాస దుర్వాసనగానుండుట.

మూత్రావయవములు:—తరుచు మూత్రము వెడలుచుండుట. మూత్రముయెర్రగా, ముదరరంగుగా, యెక్కువవాసనగా, తేటగా వెడలుట.

ఛాతీ:—ఊపిరందకపోవుట. ఛాతీలో నొక్కుచున్నట్లుండుట.

మర్మావయవములు.—సవాయిరోగమును, గోళ్లుచివరదళిసరెక్కుటను, పిప్పిగోళ్లగుటను మాన్పును.

పోలికలు:—బెర్బెరిస్ యాక్విఫోలియా, హైడ్రోక్లోరైడ్.

మోతాదు:—టించరు 1 మొదలు 5 చుక్కలు.

---

## 54. కేంఫరు. CAMPHOR.

(హారతికర్పూరము).

ఇది కలరా వ్యాధిలోను, కలరాలోనవలె దేహము మంచువలె చల్లగానగుట, శవాకృతివచ్చుట, యెక్కువ నిస్త్రాణగలుగుట, నాడి నీరసము జెంది సన్నగిలుట, ఆకస్మాత్తుగా వమనములు, నీళ్లవిరేచనములువచ్చుట, పడిశముపట్టుట, రోగి విరామము లేక యుండుట.—వీటిమీద నిది బాగుగా పనిచేయును.

పడగొట్టుట, విసుగుదల, పొక్కులను దద్దుర్లను అణచిపెట్టుట, శీతగాలి, దెబ్బతగులుట—వీటివలనవచ్చిన లేక కలిగిన దోషములు లేక రోగగుణములనిదిమాన్పును.

మనస్సు:—ఆతురతగా యుండుట. దెబ్బలాడవలెనని లేక పేచీపెట్టవలెనని తోచుచుండుట. జ్ఞాపకశక్తి లేకపోవుట. తనబాధలనుగూర్చి ఆలోచించుచున్నప్పుడు బాధలు వుపశమించుట.

తల:—తలతిప్పు. విషపడిశముతోతలనొప్పి, తుమ్ములు, ముక్కునుండి చీమువంటి స్రావము కారుచుండుట. చల్లని చెమటపట్టుట నాలుక చల్లగా, లావుగా, వణకుగా యుండుట. కణతలలోపోట్లు. ముచ్చిలగుంటలో కొట్టుకొనుచున్నట్లునొప్పి నాడికి సంబంధించి యుండుట.

కన్నులు:—వాచి యెర్రపడుట, లోతునబడుట. పాపలుముడుచుకొనుట. దృష్టిమాంద్యత. ప్రతివస్తువు ప్రకాశమానముగా కనబడుట.

చెవులు:—కురుపులువేయుట, లోపలయెర్రగావాచిపోట్లువచ్చుట.

ముక్కు:—పడిశముపట్టుట, తుమ్ములువచ్చుట. వాతావరణమా ర్పులవలని రొంప, తలభాగము. ముక్కునుండిరక్తముస్రవించుట..

ముఖము:—పాలిపోవుట లేక యెక్కువ యెర్రబడుట. మంచువలె చల్లగాను నీలిరంగుగాను ముడుచుకొనిపోయి యుండుట. నుదుట చల్లని చమటపట్టుట. పైపెదవి యెత్తబడినట్లుండుట.

నోరు:—దుర్వాసనగా నుండుట. నోటినుండి నురగలువచ్చుట. పండ్లు కదలుటవలన బాధగానుండుట. ఒకచోటినుండి మరియొకచోటికి మారుచుండు పంటినొప్పి. గుటకవేయుట కష్టముగానుండుట. పొగచుట్ట యందు అసహ్యము కలుగుట; తీరని దాహము వేయుట.

అన్నకోశము:—వమనానుమానము. పైత్యరసమునుగాని రక్తమును గాని వమనము చేసుకొనుట. చల్లగానుండుట. అటుపిమ్మట మంటగానుం డుట. నొక్కుచున్నట్లు బాధగానుండుట.

పొత్తికడుపు:—నీళ్లవిరేచనములు వచ్చునట్లుగా పొట్టలోనొప్పి. రాత్రి కోయుచున్నట్లు శూలగాను నొప్పిగాను వుండుట. జలుబు విరేచ నములు. వేసవిలో వచ్చునీళ్లవిరేచనములు.

మలము, మలాశయము:— విరేచనబద్ధము. మలము యెక్కువ కష్ట ముతో వెడలుట. ఆసనము సన్నముగాను, యెక్కువ వాపుగాను, అపాన వాయువు వెడలినప్పుడు బాధగానువుండుట. కలరా విరేచనములు. విరే చనము నల్లగా వెడలుట. నీళ్లవిరేచనములు అప్రయత్నముగా వెడలుట. కలరావిరేచనములు వెడలునప్పుడు పిక్కలలో లాగుట, దేహము చల్లగా నుండుట. యెక్కువ నీరసముగాను, నాలుక, నోరు చల్లగాను వుండుట.

మూత్రావయవములు:—మూత్రము అణచిపెట్టబడుట. మూత్ర నాళము ముడుచుకొనిపోయినట్లుగా మూత్రము సన్ననిధారగా వెడలుట. మూత్రము పసుపుపచ్చగాను ఆకుపచ్చగాను రక్తముతోనుగూడి వెడలుట. మూత్రములో చిక్కని మడ్డివంటి పదార్థము వెడలుట.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ ఎక్కువగుట. ఒకప్పుడుసంభోగవాంఛ లేకపోవుట. నపుంసకత్వము. స్వప్నస్ఖలనములు. అండములుముడుచుకొనిపోయినట్లుగా వుండుట.

స్త్రీఅవయవములు:—బహిష్టుత్వరగాను ఋతుస్రావమెక్కువగాను వుండుట.

శ్వాసావయవములు:—వూపిరాడకుండ చేయునట్టిదగ్గు, వుబ్బసపుదగ్గు. శ్వాసచల్లగానుండుట. వూపిరిపీల్చునపుడెల్ల దగ్గు ప్రారంభించుచుండుట. గుండెలలో పొడుచుచున్నట్లు బాధలు.

నిద్ర:—పగలు నిద్రపోవలెనని యెక్కువగా కోర్కెయుండుట. కలలో గయ్యాములు మొగలగునవి వచ్చుట.

కాళ్ళు, చేతులు:—మేహవాతనొప్పులవలన భుజములను కదల్చుట కష్టముగా నుండుట. కీళ్లసంధులలో బ్రిద్దలగుచున్నట్లు చప్పుడు వినుపించుట. అవయవములు మొద్దుబారి తిమ్మిరలెక్కి చల్లగానుండుట. పిక్కలులాగుచుండుట కంపముతోగూడిన ఫిట్లు అతితీవ్రముగా వచ్చుచుండుట.

చర్మము:—నొప్పిగా నుండుటవలన ముట్టుకొనుట కష్టముగానుండుట. చర్మము నీలిరంగుగాను చల్లగాను పొడిగాను వుండుట. కప్పుకొనుట కిష్టముగా నుండకపోవుట.

జ్వరము:—నాడిబహుశీఘ్రముగాను చిన్నదిగాను వుండుట. దేహమంతయు మంచువలె చల్లగానుండుట. చల్లనిచెమటపోయుట. నాలుక చల్లగాను, పెద్దదైనణకుగాను వుండుట.

ఉద్రేకము:—రాత్రియందు, కదలికవలన, చల్లనిగాలిలోను.

వుపశమనము:—వెచ్చదనమువలన, తనరోగముగురించి తలచుచున్నప్పుడు.

దీనిని కాలీ సైట్రికం అను మందును ముందుగాని వెనుకగాని వాడరాదు.

సహచరులు:— కేంథారిస్.

విరుగుళ్లు:— యాంటింటార్టు, డల్కామారా, ఓపియం. ఫాస్ఫరసు.

ఇది వనమూలికల సంబంధమైన ఔషధములన్నిటికి విరుగుడుగా పని చేయును.

ముందువాడదగనిది:— నైట్రిం.

కేంథారిస్, కుప్రింమెట్, స్క్విల్లా—లకిదివిరుగుడు.

మోతాదు:— టించరు మొదలు 200 పొటెన్సీ. టించరును 1 చుక్క ఒక మోతాదుగా తరచుగా వాడవలయును. దీని గుణకాలపరిమితి 5 లగాయతు 15 నిమిషములు.

బాహ్యోపయోగములు:— చెమటపట్టుచున్నప్పుడు దీనిని వాడరాదు. కంపము లేక ఫిట్టుతోగూడిన వ్యాధులలో దీనిని కొంచము దూదిపై నిమదరుటించరు రూపమున వేసి వాసనచూపించినయెడల ఫిట్టుమాని తెలివి వచ్చును. అరకాళ్ళు, అరిచేతులు మిక్కిలి చల్లగానున్నప్పుడు దీనిని పట్టించినయెడల అవి తిరిగి వేడిగానగును. జలుబుచేసినపుడు దీనిని ముక్కుకు పట్టించవలెను. పిక్కలులాగుచున్నప్పుడును. తిమ్మిరెక్కినప్పుడును దీనిని పిక్కలకు మర్దనా చేయవలయును.

---

## 55. కెన్నబిస్ ఇండికా. CANNABIS INDICA,

(హిందూదేశపు ఔషధము 18. గంజాయి.)

ఇది నరముల సంబంధమైన రోగములమీదను, సెగరోగములమీదను బాగుగా పనిజేయును.

♦ రోగి యెప్పుడును తృప్తినొంది యుండుట, ♦ యేమియు బాధలు లేకున్నట్లుండుట, ♦ కాలముయొక్కయు విస్తీర్ణముయొక్కయు పరిమాణము నిజముగానున్నకన్న విస్తారము ఎక్కువగా యున్నట్లు తోచుట. ♦ మోకాళ్ళను పక్కగోళ్ళతో పట్టినట్లుండుటతో మోకాలు దిగువభాగమున

హితవుగానుండు ఒకవిధమైన స్పర్శయున్నట్లు తోచుట—ఇవి దీనిముఖ్య లక్షణములు.

మనస్సు:—ఎప్పుడును ఆలోచన చేయుచుండుట. పిచ్చియెత్తునను, భయముగా నుండుట. రోగి కరుగుచునే యుండుట. జ్ఞాపకశక్తి లేకపోవుట. ఎల్లప్పుడును సగముసగము మాట్లాడుచు మాట్లాడుచున్నహంశమును మరచిపోవుట. నవ్వును ఆపుకొనలేకపోవుట. పరాచకమాటలాడుచుండుట, ఒకమారు నవ్వు ఒకమారు కోపము ఒకమారు విచారము యిట్లు మనస్సు మార్చుకొనుచుండుట. తలతిరిప్పువలన గాలిలో యెగురుచున్నట్లుగా తలచుట. కాలక్షేప మవకపోవుట. కొలదిదూరమైనను చాలదూరముగా కనుపించుట. కొలదికాలమైనను యెక్కువ ఆలస్యమైనట్లు తోచుట.

తల:—తరుచు అప్రియత్నముగా తలయూగుచుండుట. కుడివైపున వచ్చు పార్శ్వపునొప్పి. పొట్టలో వాయువు యెక్కువగా జేరుటవలన తలనొప్పి వచ్చుట. ఇది ఊర్ధ్వముఖముగాగాని, అధోముఖముగాగాని వెడలిన పిమ్మట తలనొప్పి వుపశమించుట. తల వెనుకభాగమున బరువు, బాధ.

కన్నులు:—తీక్షణమైన దృష్టి. చదువుచున్నప్పుడు అక్షరములు కలుసుకున్నట్లుండుట. కన్నులు అదురుచుండుట, చికిలించుచుండుట.

చెవులు:—రెండుచెవులలోను పోట్లు. చెవులలో గింగురుమనుచున్నట్లును, నీళ్ళు సలసలకాగుచున్నట్లును పరాకుగానున్నప్పుడు పాడుచున్నట్లును ధ్వనులు వినపడుచుండుట. తెలివివచ్చినప్పుడివి మాయమగుట.

ముఖము:—నిదిరిమత్తుగాను నిస్త్రాణజెందినవానివలెను యుండుట. పెదవులు, నోరు, యెండిపోవుట, నిద్రలో పండ్లు పటపటకొరుకుట, లాలాజలము తెల్లగాను చిక్కగాను నురగగాను జిగురుగాను వుండుట. నత్తిమాట లాడుట. గొంతుక ఆర్చుకొనిపోవుట.

అన్నకోశము:—గుండెసమీపమున ఛాతీలో నొప్పిగానుండుట. నొక్కుటవలన యీనొప్పి వుపశమించుట. ఎడతెగని ఆకలి. కడుపు వుబ్బ

రించుట, ఇది త్రోణుఘ్నవచ్చినపిమ్మట తగ్గుట.

మలము, మలాశయము:—బంతిమీద కూర్చున్నట్లుగా తోచుట. పసుపుపచ్చని నీళ్ళవిరేచనములు బాధలేకుండగా వెడలుట.

మూత్రావయవములు:—మూత్రములో జిగురువంటి ఆమముకలసి వెడలుచుండుట. నవ్వినయెడల మూత్రపిండములలో నొప్పివచ్చుట. మూత్రానుమాన మెక్కువగాయున్నను మూత్రము ఒకచుక్కయైనను వెంటనే వెడలకపోవుట. కొంతసేపు కూర్చున్నపిదప మూత్రము చుక్కలు చుక్కలుగా వెడలుట. మూత్రము వెడల్చుటకు తినకవలసివచ్చుట.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ అమితమగుట. లేపనమువలన యెక్కువబాధగానుండుట. తెల్లని జిగురువంటిపదార్థము అంగమునుండి వెడలుట సంభోగానంతరము నడుములో నొప్పిగాయుండుట. సెగరోగములో పసుపుపచ్చగాను, తెల్లగాను, స్రావమెక్కువగా, బాధలేకుండా వెడలుచుండుట. శుక్లనష్టమును మాన్పును. సెగరోగములో అంగముముడుచుకుపోయి, లేక వంగి, బాధగానున్నప్పుడిది బాగుగా పనిచేయును.

స్త్రీఅవయవములు:—ఋతుస్రావము విస్తారముగాను, బాధతోను, ముదరరంగుగాను వెడలుట. మర్మావయవములలో నొక్కుచున్నట్లును, పొడుచుచున్నట్లును వుండుశూల అప్పుడప్పుడు వచ్చుచుండుట. మనస్సు స్థిమితముగా లేకపోవుట, నిద్రపట్టకపోవుట. మూత్రము విడుచునప్పుడు చీమువంటిపదార్థము వెడలుట. వంధ్యత్వమునుమాన్పును. ముట్టులో నడుము నొప్పివచ్చుట. ఋతుశూలయున్నప్పుడు సంభోగేచ్ఛగల్గుట.

శ్వాసావయవములు:—ఉబ్బసపుదగ్గులో శ్లేష్మము విస్తారముగా వెడలుట, ఊపిరాడకపోవుట, ఛాతీలోనొక్కుచున్నట్లుండుట.

హృదయము:—గుండెదడవలన మెలకువవచ్చుట. చీల్చుచున్నట్లుండు బాధతోపాటు నొక్కుచున్నట్లుండునొప్పి. నాడి బహుమందముగానుండుట (డిజిటాలిస్, ఎపోసైనం).

కాళ్ళు, చేతులు:—పాదములలోను, పిక్కలలోను నొప్పులుగానుం డుట. కాళ్లకు పక్షవాతమువచ్చుట. కొలదిమార్గము నడచినను అతినిస్త్రాణ జెందుట. భుజములలోను, వెన్నెముకలోను బాధవలన ముందుకు వంగవలసి వచ్చుట, మరియు నిబ్బరముగానుండి నడవలేకపోవుట.

నిద్ర:—నిద్రమత్తుగాయున్నను నిద్రరాకపోవుట. మానవటువంటిని, కారణములేనట్టి నిద్రలేమి. నిద్రలో శవములనుగూర్చియు, గాబోవుకష్ట ములనుగూర్చియు కలలువచ్చుట. నిద్రపట్టినవెంటనే స్ఖలనమగుట. పగలు పరుండవలయునని యుండుట, రోగి మాట్లాడుటనుగూడ కష్టముగానుండు నంత నిస్త్రాణజెందుట. ఇందుచేత పరుండినవెంటనే గాఢనిద్రజెందుట.

ఉద్రేకము:—ఉదయమున, కాఫీ, సారా, పుగాకు త్రాగుటవలన, కుడివైపు పరుండుటవలన.

ఉపశమనము:—పరిశుభ్రమైనగాలిలో, చల్లనినీటిలో, విశ్రాంతి వలన.

మోతాదు:—30, 200 పొటెన్సీలు.

## 56. కెన్నబిస్ సతీవా. CANNABIS SATIVA.

(గంజాయి).

♦తలమీదను, హృదయముమీదను, వేడినీళ్లు పోయబడుచున్నట్లును, చల్లనినీళ్లు తలమీదను, ఆసనమునుండియు, హృదయమునుండియు, పడు చున్నట్లును భావనయుండుట, ♦ సెగరోగముయొక్క ప్రథమావస్థలో మూత్రనాళసంబంధమైన కొలదిస్రావములు, మంటలు, చురుకులు, ♦ మూ త్రనాళమునుండి స్రావము చిక్కగను, పసుపుపచ్చగను వెడలుట, ♦ మూ త్రమువిడచునపుడును, ముఖ్యముగా మూత్రము విడిచినపిమ్మటను, మూ త్రనాళమునందు కుట్టుచున్నట్లు బాధగను, మంటగను, యుండుట. ♦ పొట్టయందు యేదియో సజీవముగానున్నట్లుభావన. " తల తెరువబడుచు

మూయబడుచు ఉన్నట్లుభావన. ఇది ధ్వనివలన ఉద్రేకముజెందుచుండుట.—ఇవిదీని ముఖ్యలక్షణములు.

తల:—బుద్ధినిలకడలేమి. కలగనుచున్నట్లు తోచుట. తలత్రిప్పు. త్రాగినవానివలెనుండుట. తలమీద నేదియోప్రాకుచున్నట్లును, చల్లనినీటి చుక్కలు పడుచున్నట్లునుతోచుట. నరములదోషమువల్లను, బ్రాంది మొదలగువాటిని, పొగాకును యెక్కువగా వుపయోగించుటవలనను, వచ్చిన కేటరాక్టు లేక అంతరకుసుమలనుమాన్పును. కాచబింబము పళసరెక్కి, తెల్లనై, దృష్టిలోపము కలుగుటనుమాన్పును. సెగవ్యాధికి సంబంధించిన కండ్ల కలకలు. ముక్కు రాగివలె యెఱ్ఱగానుండుట, వాచుట, ముక్కునుండి రక్తమువెడలుట. ముఖము యెఱ్ఱగాను, వెచ్చగాను వుండుట. నడుములో నొప్పివలన మాటరాకపోవుట.

అన్నకోశము:—పైత్యరసమును, పసరును, వమనముచేసుకొనుట.

పొత్తికడుపు:—కడుపు వుబ్బుట, నొప్పిగానుండుట.

మలము, మలాశయము:—నొక్కుచున్నట్లుండు నొప్పులతోకూడిన నీళ్ళవిరేచనములు. విరేచనబద్ధముగానుండి, మలము గట్టిగావెడలుట.

మూత్రావయవములు:—మూత్రము అతితొందరగా విడువవలయునని యుండుట. మూత్రకోశమునకు పక్షవాతమువచ్చినట్లువలె మూత్రము విడుచుట కష్టముగానుండుట. మూత్రనాళము ఆమమువలనను, చీమువలనను కప్పబడియుండుటచే మూత్రము సరిగా వెడలకపోవుట. మూత్రము తెల్లగాను, లేక యెఱ్ఱగాను, రక్తముతోను, చీముతోను కలసివెడలుట. మూత్రము ధారలుగా వెడలుట. ఒకప్పుడు బహుతక్కువగాను, చుక్క చుక్కలుగాను వెడలుట. మూత్రనాళములోమంట మూత్రము విడుచుటకు ముందును, వెనుకను యుండుట. మూత్రనాళములో వాపుగాను, బాధగాను యుండుటవలన ముట్టుకొనుట కష్టముగానుండుట. సెగరోగములో నీళ్లవలెను, పసుపుపచ్చగాను స్రావమువెడలుచుండుట. మూత్రము విడుచునప్పుడు మూత్రనాళముద్వారా సన్నని రాళ్లువెలువడుట,

సెగరోగముయొక్క ప్రథమావస్థలోను, రోగి యీవ్యాధివలన కాళ్ళు దూరముగానుంచి నడుమునప్పుడును బాగుగా పనిచేయును.

పురుషావయవములు:—అంగముచివర యొత్తునివాపు, నడచుచున్నప్పుడు అంగములో మంట, ప్రాస్టేటుగ్రంధివాచుట. లేపనమెక్కువగా యున్నప్పుడు బిగపట్టుచున్నట్లుండు బాధలు. ఒకప్పుడు సంభోగమందు అసహ్యము, మరియొకప్పుడు అధికమైనకోరిక, సెగరోగము ప్రథమావస్థలో వాపు, మంట, బాధ, మరియు ద్వితీయావస్థలో మూత్రము విడచునప్పుడు మంటగానుండుట, పసుపుపచ్చని, చిక్కని, స్రావము వెడలుచుండుట.

స్త్రీఅవయవములు:—ఋతుస్రావము విస్తారముగావెడలుట. పిట్టు, లేక కంపముతోవచ్చు గర్భస్రావము. వంధ్యత్వము. సెగరోగమువలన గాని, అతితరుచు సంభోగమువలనగాని, గర్భవిచ్ఛిత్తుకలుగునని భయము. గొడ్డురాండ్రలో అమితమైన సంభోగేచ్ఛగలుగుట.

శ్వాసావయవములు:—ఉబ్బసపువ్యాధిలో వూపిరాడకపోవుచున్నప్పుడు రోగి నిలుచుని శ్వాసపీల్చవలసివచ్చుట, ఛాతీలోబరువు, గురగుర, ఊపిరితీయుట కష్టముగాయుండుట. ఇది వుబ్బసముమీద బాగుగా పని చేయును. రక్తజీర, అకుపచ్చని ఆమముతోకూడిన దగ్గును మాన్పును.

నిద్ర:—భయంకరమైన కలలు, ఉదయమున యెక్కువ అలసట జెందినట్లుండుట, పగలు నిద్రలుత్తుగానుండుట. రాత్రియందు నిద్రలేమి.

కాళ్ళు, చేతులు:—మెట్లు యెక్కినచో పాదములునొప్పి. మోకాలుచిప్ప జారిపోవుట. చీల్చుచున్నట్లుండుబాధలు.

ఉద్రేకము:—పరుండుటవలన, మెట్లు యెక్కుటవలన.

విరుగుళ్లు:—కేంఫరు, మెర్క్యూరియసు, నిమ్మరసము.

మోతాదు:—30 మరియు 200 పొటెన్సీలు. దీనిగుణకాలపరిమితి 2 లేక 3 వారములు.

## 57. కేప్సికం. CAPSICUM·

(హిందూదేశపుఔషధము. 19. మిరపకాయ).

ఇది ముఖ్యముగా దుర్బలులకు, స్థూలశరీరులకు వచ్చురోగములమీద బాగుగాపనిచేయును. శరీరమందు కావలసినంత వేడివుండకపోవుటను మాన్పును. ఎడమనైపుఅవయవములకు వచ్చురోగములమీద నిది బాగుగా పనిచేయును. ఆమత్వచలలో మంటగానుండుట. ఈమంటలు ఆర్సెనికం అల్బమ్‌ను పోలియుండక, ఎఱ్ఱమిరపకాయలపొడుమును పట్టించినట్లుగా, లేక రాసినట్లుమంటగానుండును. మిరపకాయలను యెక్కువగా వాడుట వలనను, బీరును, కాఫీని, యెక్కువగా త్రాగుటవలనను, క్వయినాను యెక్కువగా వుపయోగించుటవలనను వచ్చినరోగములమీద బాగుగా పని చేయును. రోగి కాఫీని, చనిపోవుటను, లేక ఆత్మహత్య చేసుకొనుటను కోరుట. పరిశ్రమయందును, బహిరంగమైన గాలియందును ఆహారమందును అయిష్టతజెందుట. కాఫీత్రాగుటవలని రోగలక్షణములను, క్వైయినావల నగాని లేక క్వైనాను అవసరముగా వాడినపిదపగాని వచ్చినజ్వరలక్షణ ములను యిది మాన్పును

♦ దాహముతో చలి నడుమునందు ప్రారంభించుట. మరియు దాహము త్రాగినపిమ్మటచలి ఎక్కువగుట ♦ ప్రతిసారి యు విరేచనానంతరము దాహముజెందుట. మరియు ప్రతిసారియు దాహ ము తీసికొనినపిమ్మట చలియు వణకు వచ్చుట. ♦ మానసికముగను శారీరక ముగను మాంద్యత. గ్రహించుటయందు, జవాబుచెప్పుటయందు కదలిక యందు మరి అన్నిటియందును ఎక్కువమాంద్యత, ఇందువలన రోగి ఓంటరి గానుండినిద్రపోవుట ♦ సులభముగా కోపముజెందుట ♦ ఇంద్రియజ్ఞాన మెక్కువగా నుండుట. ♦ మొండిపట్టు, ఒకరు చెప్పినది తాను కాదను స్వభావము. ♦ అల్కహాలును, మంచునీటిని, ఎక్కువఘాటైన ఊరగాయ లను తినుటయందు కోర్కె. విద్యయందును, ఆలోచనయందును, పరిశ్రమ

యందును చల్లదనమునందును అసహ్యత—ఇవిదీని ముఖ్యలక్షణములు.

మనస్సు:—సులభముగా కోపమువచ్చుట. మత్తుగా నుండుట. ఒంటరిగానుండగోరుట. మిరపకాయలు యొక్క పతిన్నవారివలె అతికోపముగాను, చిరచిరగాను వుంండుట. సంధిలక్షణములు.

తల:—బ్రద్దలగునంతటి తలనొప్పి దగ్గినప్పుడును, తలను కదల్చినప్పుడును, నడుచునప్పుడును యెక్కువగుట. పొడుచుచున్నట్లు నొప్పిగా వుండుట. ఇవి విశ్రాంతివలన వుద్రేకించుట, కదలికవలన వుపశమించుట.

చెవులు:—చెవుల వెనుక నైపువాచి, బాధగానుండుట. చెవినుండి చీముకారుచుండుట, పోటు, మంట యుండుట.

గొంతుక:—మంటగానుండుట. గుటకవేయుటకునుంగును, వెనుకను యెక్కువబాధగానుండుట. దగ్గువపుడు యెక్కువ బాధగానుండుట. త్రాగుబోతులలోను, పొగత్రాగువారిలోను గొంతుక మెరుగురాయుట, నొప్పిగానుండుట, కొండనాలుక వాచి పొడుగగుట. మానటువంటి బొంగురుతనమును మాన్పును.

నోరు:—దుర్వాసనగాయుండుట, చిక్కనిఅశుముజేరుట, మంటతోకూడిన నీటిపొక్కులు బయలుదేరుట.

అన్నకోశము:—అజీర్ణమువలన గుండెలలోమంట. పొట్టవ్రేలాడుచున్నట్లుండుట. ఉద్రేకమునిచ్చు పదార్థములందుకోర్కె. ఎక్కువదాహమున్నను, పానీయములను త్రాగినచో కంపమువచ్చుట.

పొత్తికడుపు:—కాలేయము, ప్లీహము, వాపు, బాధ.

మలము, మలాశయము:—రక్తము, ఆమముతోకూడి, మలము, మంటతోను తీపుతోను పడేలుట, జిగటవిరేచనములు. విరేచనానంతరము దాహమువేయుట, రక్తస్రావముతోకూడిన మూలశంఖ, ఆసనము తీపు.

మూత్రావయవములు:—మూత్రము వెడలుట బహుకష్టముగానుండుట. మూత్రద్వారము యెక్కువ మంటగానుండుట. మూత్రము పరిమ

ములో చుక్కలుచుక్కలుగాను, తరువాత యెక్కువగాను, గొట్టములో నుండి వచ్చునట్లుగాను పడలుట. రక్తము స్రవించుట.

పురుషావయవములు.—అండములుచల్లగానుండుట. నపుంసకత్వము సెగరోగముయొక్క అఖరుదశలో నొక్కిలిమంట, వాపు, ప్రోస్టేటుగ్రంధిలో బాధగాయుండుట.

స్త్రీఅవయవములు:—ముట్టుడుగుకాలములోవచ్చు స్రావములు.ఇవి తలతిప్పుతో కూడియుండుట. ఎడమ అండాశమువద్ద గుచ్చుచున్నట్లుండు బాధలు.

శ్వాసావయవములు:—ఛాతీలో నొక్కుచున్నట్లుండు బాధలు, ఊపిరాడక పోవుట. రాత్రియందు పొడిదగ్గువలన బాధగానుండుట. ఒక్కసారిగా పెద్దఅగపుతో కూడి వచ్చుదగ్గు. దగ్గువలన శ్వాసకోశములనుండి దుర్వాసనగల వాయువు వెలువడుట. దగ్గువలన దూరముగానున్న అవయవములలో,అనగా చెవులు,మూత్రకోశము, మొదలగువాటిలో నొప్పివచ్చుట.

కాళ్ళు, చేతులు:—మోకాలు ముడిచినప్పుడు బాధగానుండుట, దగ్గినప్పుడు కాళ్ళలో బాధగానుండుట.

జ్వరము:—పానీయములు త్రాగినపిమ్మట కంపమువచ్చుట, చలి నడుములో ప్రారంభించుట. ఇది వెచ్చదనమువలన వుపశమించుట. చలి వచ్చుటకుముందు దాహముగా నుండుట. రోజువిడిచి రోజువచ్చు జ్వరములు. వేసవికాలములో వచ్చుజ్వరములు.

చర్మము:—గోకుటవలన దురద యెక్కువగుట, మంటగానుండుట, ముఖమువిూద దురదగాను, మంటగాను వుండెడు పొక్కులు బయలుదేరుట.

ఉద్రేకము:—ఆహారపానీయములను తీసికొనుటవలన, బహిరంగమైన గాలిలో, ఉదయమున.

వుపశమనము:—వేడివలన, అపానవాయువు వెడలినపిమ్మట, శరీర వ్యాయామమువలన.

విరుగుళ్లు:—సినా, కెలేడియం, కేంఫరు, లెకెసిస్, సల్ఫరు, చైనా, యాసిడిసల్ఫ.

చైనా, కెలేడియం, కాఫీ—లకు యిదివిరుగుడు.

మోతాదు:—3 మొదలు 30 వరకు. 3, 6 పొటెన్సీలు బాగుగా పనిచేసినట్లు కనబడుచున్నవి. ఆల్కహాలు నెక్కువగా త్రాగుటవలన వచ్చిన పరాకుమాటలకు మదరుటించరు రూపమున 1 డ్రాము, 1 మోతాదుగా పాలలోగాని, ఆరెంజిపీల్ టించరులోగాని కలిపి యివ్వవలెను. దీని గుణకాలపరిమితి 4 మొదలు 8 దినములు.

## 58. కార్డూసు. CARDUUS MARIANUS.

ఇది ముఖ్యముగా కాలేయముమీదను, సొత్తికడుపుకు సంబంధించిన రోగములమీదను, కామెర్లరోగములమీదను బాగుగా పనిచేయును. బీరు మొదలగు ఆల్కహాలు సంబంధమైన పానీయములను యెక్కువగా త్రాగుటవలన వచ్చినరోగములను, దుష్టరక్తనాళముల వాపులకును, వీటికి సంబంధించిన పుండ్లకును, గనులలో పనిచేయువారికి వుబ్బసముతో కలసివచ్చు ద్వందరోగములమీదను, కాలేయపుజబ్బునను సరించివచ్చు వుబ్బులమీదను మరియు మలబద్ధముమీదను, కాలేయము చెడుటవలనవచ్చిన విషపడిశము మీదను నిస్త్రాణ, రక్తస్రావములమీదను ఇది బాగుగా పనిచేయును.

మనస్సు:—నిరాశ జెందియుండుట. మరుపుజెందియుండుట.

తల:—కనురెప్పలు ముడుచుకొనిపోవునట్లుండుట. ముందుకు పడిపోవులాగున తలతిరుగుట. కండ్లు మంటగాను, నొక్కుచున్నట్లును వుండుట. ముక్కునుండి రక్తము స్రవించుట.

అన్నకోశము:—ప్లీహము సమీపమున పొట్టలో కుట్టుచున్నట్లు బాధలు. ఆకలి బహుకొద్దిగానుండుట, నాలుక బీటలుతీసియుండుట. తల త్రిప్పు, ఆకుపచ్చని ఆమముతోకూడిన వమనములగుట.

పొత్తికడుపు, మలాశయము:—మలము గట్టిగాను, వుండలవలెను.

కష్టముమీదను వెడలుట. ఒకప్పుడు నీళ్లవిరేచనములు. మలమునుపువచ్చు గా వెడలుట. కాలేయము గట్టిపడి చిన్నదగుట. కామెర్లరోగము. కాలేయములో రాళ్లుబయలుదేరుట, మరియు వీటివలన శూలవచ్చుచుండుట.

మూత్రము:—మబ్బుగా, బంగారపురంగుగా వెడలుట.

చర్మము:—రాత్రి పరుండినపిదప దురద. దుష్టరక్తనాళములకు సంబంధించిన పుండ్లు.

మోతాదు:—మదరుటించరు మొదలు 200 పొటెన్సీ.

---

## 59. కారికా. CARICA PAPAYA.

(హిందూదేశపు ఔషధము. 20. బొప్పాయి).

ప్లీహము కాలేయము దోషములకు సంబంధించివచ్చు అజీర్ణము, జ్వరము మున్నగు రోగములమీదనిది పనిచేయును—

పొత్తికడుపు, అన్నకోశము:—పాలను జీర్ణము చేసికొనలేకపోవుట. కాలేయము ప్లీహమువాచుట మరియు వీటికి సంబంధించియుండు జ్వరలక్షణములు. అజీర్ణము, నిస్త్రాణ.

మలము, మలాశయము:—ప్రతిదినమునను చాలసార్లు అజీర్ణవిరేచనములగుచుండుట.

ఉద్రేకము:—భోజనానంతరము.

పోలికలు:—కేప్సికం, బెల్లడోనా.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 60. కేసల్‌పినియా. CAESALPINIA BONDUCELLA.

(హిందూదేశపుఔషధము. 21. గచ్చకాయ).

ఇది పురాణజ్వరములకు, ముఖ్యముగాజీర్ణించిన మన్యపుజ్వరము...

వాడదగిన దివ్యౌషధము.

మనస్సు, తల:—హెచ్చరికలేమి, కనుబొమలవద్ద విపరీతమైన బాధలు జ్వరమునందు కలుగుట.

కన్నులు:—మండుచున్నట్లుండు బాధలు. లోతుకుపడుట.

ముక్కు:—వెచ్చనిఊపిరి. జ్వరములో ఊపిరి తొందరగాపీల్చుట.

పొత్తికడుపు:—గుడగుడలు. ప్లీహము పెద్దదగుట, గట్టిపడుట, తాకినయెడల బాధగానుండుట.

మలము, మలాశయము:—మలము పలుచగను, జిగటతో కలసియు వెడలుట. ఒక్కొక్కప్పుడు మలము గట్టిగను, కుంకుమపువ్వు రంగును పోలియు వెడలుట.

జ్వరము:—ఒకపద్ధతిగా నుండకపోవుట. జ్వరము ప్రతిసారియు 8 గంటలకన్న ఎక్కువసేపు ఉండకపోవుట. ఉదయమున జ్వరములో దాహము కలుగుట. మధ్యాహ్నము జ్వరములో దాహము కలుగకపోవుట. జ్వరము తగ్గినపిదప రోగికి పరిశ్రమయందయిష్టత కలుగుట మరియు ఎల్లప్పుడును పండుకొనవలయునని యుండుట.

చర్మము:—అర్చుకుపోయి మురికిగను, నల్లగను అగుట, దోమకాటువలెనుండు దద్దురుబయలుదేరుచు పోవుచుయుండుట.

మోతాదు:—1 మొదలు 3 పొటెన్సీ.

## 61. కాలోఫైలం. CAULOPHYLLUM.

ఇది స్త్రీలరోగములమీదను, ముఖ్యముగా స్త్రీమర్మావయవసంబంధమైన వ్యాధులమీదను బాగుగా పనిచేయును. గర్భవతులకును, పాలతల్లులకును, ప్రసవకాలమందును కలుగురోగలక్షణములమీద బాగుగా పని చేయును.

తల:—గర్భాశయవ్యాధికిని, నడుమునను సంబంధించినరోగముల ననుసరించియుండు తలనొప్పులు, మేహవాతసంబంధమైన తలనొప్పులు, పార్శ్వపునొప్పులు.

కన్నులు:—కండ్లలో నొక్కుచున్నట్లుండుట, విస్తారముగా నీళ్లు కారుచుండుట.

నోరు:—నాలుకమీద తెల్లనిపూత. నోరు వెచ్చగాను, పొడిగా ఆర్చుకొనిపోయియుండుట.

అన్నకోశము:—ఎక్కువనీటిని త్రాగగోరుట. తరుచు వమనము లగుచుండుట. గర్భాశయరోగముతోపాటు వచ్చునట్టి అజీర్ణవ్యాధి. తరుచు పుల్లని, లేక చేదైన ద్రవము త్రేనుపులు వచ్చుచుండుట.

మలము, మలాశయము:—విరేచనబద్ధము, రోజువిడిచి రోజువిరేచనమగుట. ఒకప్పుడు పెద్ద పెద్ద నీళ్ళవిరేచనములు బాధలేకుండగా అగుచుండుట. మలము తెల్లగాను, మెత్తగాను వెడలుట.

స్త్రీమర్మావయవములు:—ఋతుస్రావము, కుసుమ యెక్కువగా వెడలుటవలననిస్త్రాణవచ్చుట. గర్భాశయములో బలము తక్కువగానుండుటవలన ప్రతిసారియు గర్భస్రావమగుచుండుట (ఎలట్రిస్ ఫేరినోసా, హెలోనియాస్, పల్సటిల్లా, సెబీనా). గర్భాశయము వాచినట్లుండి కడుపు బరువుగాను, నిండుగాను వుండుట. బహిష్టుమామూలుకన్న త్వరగా వచ్చుట. బహిష్టు అణచిపెట్టబడుట. ఋతుశూల అప్పుడప్పుడువచ్చుచుండుట. స్రావము కొలదిగానగుట. అల్పవయస్కులలో కుసుమ విస్తారముగావెడలుట. నుదుట చిన్నచిన్నమచ్చలు బయలుదేరుట. ప్రసవవేదనలో నొప్పులు కొద్దికొద్దిగావచ్చుట, సరిగా రాకుండుట, గర్భాశయద్వారము సరిగా విస్తరించకపోవుట. (బెల్లడోనా, జెల్సిమియం, విరేట్రిం విరిడి) వలన ప్రసవము ఆలస్యమగుట. నొప్పులు సరిగా రాకపోవుటచేతను, ప్రసవము ఆలస్యము అగుటవలననువచ్చునిస్త్రాణ, దాహము, జ్వరచిహ్నములు వీటిమీదనిది బాగుగాపనిచేయును. గర్భస్రావమైనపిమ్మటగాని, ప్రసవ

ముకు పిమ్మట గాని వచ్చు రక్తస్రావములకును, గర్భాశయముయొక్క బల హీనతవలన చాలకాలమువరకు వెడలుచుండెడు మైల (Lochia) కును, ఒకప్పుడు యీమైల అణచిపెట్టబడినప్పుడును, యెక్కువ బాధలతో వచ్చిన ప్రసవముకు అనంతరమువచ్చిన నొప్పులను, బాధలను మాన్పుటకును బాగుగా ప్రయోగపడును. యుక్తవయస్సు వచ్చినవారిలో కలుగు అపస్మారము మొదలగు ఫిట్లుతో కూడిన రోగములను, దొంగనొప్పులను మాన్పును. ముట్లుడుగుకాలములోవచ్చు రోగములమీద బాగుగా పనిచేయును,

శ్వాసావయవములు:—గొంతుక బొంగురుపోవుట, శ్వాస తొందరగా తీసుకొనుచుండుట.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—మేహవాతమువలన మెడనొప్పి పట్టుట, నడుములో నొప్పులు మందముగానుండుట. తొడలలోను, మోకాళ్లలోను, చేతులలోను, చీలమండలలోను,పాదములలోను, బొటనవేళ్ల లోనులాగుచున్నట్లుండునొప్పులు.నొప్పులస్థానములుతరుచు మారుచుండుట. మణికట్టులోను, వేళ్లలోను లాగుచున్నట్లుండు బాధలు. వేళ్లువంగకపోవుట. నడుచునప్పుడు కీళ్లసంధులలో కరుక్కుమని శబ్దమగుచుండుట. వేళ్లయొక్క కీళ్లసంధులలో భరింపలేని నొప్పులను, వాపులను మాన్పును.

చర్మము:— బహిష్టుసంబంధమైన, లేక గర్భాశయసంబంధమైన రోగములవలన చర్మముయొక్క రంగుమారుట, లేక వివర్ణమగుట.

జ్వరము:—మేహవాతజ్వరము, శరీరము యెక్కువ వెచ్చదనము. సంధి, నరముల వుద్రేకము గలుగుట.

పోలికలు:—సిమిసిఫ్యూగా, బెల్లడోనా, వక్సువామికా, పల్సటిల్లా, సేపియా, లిలియంటిగ్, కెన్నబిస్ యిండికా.

దీనికి ముందుగాని, వెనుకగాని కాఫీ వాడరాదు.

ఉద్రేకము:—బహిరంగమైన గాలిలో, కాఫీవలన.

ఉపశమనము:—వాయువు బయటకు వెళ్ళినపిమ్మట.

మోతాదు:— 3 మొదలు 200 పొటెన్సీ.

---

## 62. కేస్కారా అమార్గా. CASCARA AMARGA.

ఇది సవాయిరోగముయొక్క అన్నిదశలలోను పనిచేయును. ఇది రక్తమును శుద్ధిపరచి, శరీరములోని సవాయి సంబంధమైన దోషమును పూర్తిగా తీసివేయును. శరీరమువిూద గొచ్చటనైనను గాని, మర్మావయవములవిూద గాని, బయలుదేరు సవాయి పొక్కులను, పుండ్లను నిర్మూలము చేయును. ఇది మూలికసంబంధమైన ఔషధమగుటచే దీనిని చాలకాలము వరకుగూడ శరీరముకు చెరుపుకలుగకుండగ వాడవచ్చును.

పోల్చదగినవి:—ఎకినేషియా అంగుస్టిఫోలియా. జకారాండా, బెర్బిరిస ఎాక్విఫోలియా.

మోతాదు:—టించరు. మోతాదుకు 10 చుక్కలు మదరుటించరు.

---

## 63. సీనోతస్. CEANOTHUS AMERICANUS.

ఇది ప్లీహముకు, కాలేయముకు సంబంధించిన రోగములవిూద పని చేయును. మన్యప్రాంతములలో నివసించువారికిని, మన్యపుజ్వరముచే బాధ పడువారికిని, కడుపులో బల్లపెరుగుటను మాన్పును. ఇది యెడమపైపు అవయవములవిూద బాగుగా పనిచేయును. ప్లీహము, కాలేయము రోగములతో బాధపడువారికి రక్తక్షీణతకలుగునపుడు చాలసహాయకారిగానుండును. ప్లీహము యథాస్థితికి వచ్చుటకు దీనిని చాల దినములు వాడవలయును.

ముఖము:—దౌడలును, చెవులును వెచ్చగానుండుట.

అన్నకోశము:—ఆకలిలేమి. ఫుల్లనివస్తుఫులయందుకోర్కె. యెక్కువ దాహము. యెక్కువ నీటిని త్రాగినయెడల జబ్బుచేయుట.

పొత్తికడుపు:—ప్లీహమువాచి పెద్దదగుట, గట్టిపడుట, యెడమవైపు యెక్కువ బాధగానుండుట, వూపిరాడకుండుట, ఎడమవైపు పరుండుట కష్టముగానుండుట. కాలేయములోను, నడుములోను నొప్పి. పొట్టనిండుగా, బరువుగా యుండుట. భోజనానంతరము పొట్ట దిగలాగుచున్నట్లుండుట.

మలాశయము:—నీళ్ళవిరేచనములు, జిగటవిరేచనములు. చప్పుడు చేయుచు, అపానవాయువు వెడలుచు, గోధుమరంగుగా విరేచనమగుట.

మూత్రావయవములు:—తరుచు మూత్రవిసర్జనము. మూత్రము అపుసచ్ఛగాను, నురగవలెను యుండుట. పైత్యరసము చక్కెరకలిసిపోవు చుండుట. మూత్రము యెక్కువ ఘాటుగానుండుట.

పురుషమర్మావయవములు:— సవాయిరోగముమీద పనిచేయును.

స్త్రీమర్మావయవములు:—బహిష్టు మామూలుకన్న పదిరోజులుముందరగాను, స్రావమెక్కువగాను వెడలుట. కుసుమ పసుపుపచ్చగాను, చిక్కగాను, విస్తారముగాను వెడలుట.

హృదయము:—ప్లీహము వాపుతోకూడిన గుండెదడ, ఆయాసము. కదలికయందయిష్టత. అతినిస్త్రాణగాయుండుట. నిలుచుండినను, నడచుచుండినను, నీరసముగాను, ఆయాసముగాను తోచుట. రోగి కృశించి, తూనికకు తగ్గుట.

జ్వరము:—ప్లీహము పెద్దదగుటతో కూడిన మన్యపుజ్వరము. సాయంకాలము వరుసగా 5, 6 సార్లు చలివచ్చుచుండుట. నడుముపొడుగున యెల్లప్పుడును చలిగానుండుట. ఆకలియుండకపోవుట.

మోతాదు:—మదరు టించరు. మోతాదుకు 2 లేక 3 చుక్కల చొప్పున వాడవలెను. పొటెన్సీలలో 30 వరకుకూడ వాడవచ్చును.

బాహ్యోపయోగములు;—ప్లీహము, కాలేయమువాచినపుడు దీనిని మదరుటించరు రూపమున వాపుగానున్నచోట పట్టించవలెను.

## 64. సిఫేలాండ్రా. CEPHALANDRA.

(హిందూదేశపు ఔషధము. 22. దొండతీగ).

ఇది మధుమూత్రమును, అతిమూత్రమును, రక్తదోషముతోకూడిన రాచకురుపులు మేహవ్రణములు మున్నగు ప్రాణాపాయకరమగు చర్మరోగములను, కామెర్లు ఉబ్బు మున్నగు దారుణవ్యాధులమీదను యమోఘముగా పని చేయును.

మనస్సు:—పరిశ్రమయందయిష్టత, బుద్ధిమాంద్యము.

తల:—మూత్రవిసర్జనానంతరము మొద్దుబారుట, యేమియూతోచకుండుట. నిస్త్రాణ. ఎండదెబ్బవలని తలనొప్పి.

ముఖము, కండ్లు:—మంటలుగా నుండుట. ముఖముఎర్రబడుట.

నోరు, గొంతుక:—ఆర్చుకపోవుట. అతిదాహము. మూత్రవిసర్జనానంతరము దాహము నెక్కువగా కోరుట.

అన్నకోశము, పొత్తికడుపు:—ఆకలిలేమి, పొట్టలోవాయువు జేరి ఉబ్బరించుట. కామెర్లదోషము—కాలేయము దుస్థితిజెందుట.

మూత్రావయవములు:—అతిమూత్రము. ప్రతిసారియు మూత్రము ఎడతెగకుండగ వెడలుట, మరియు దీనికిపిమ్మట అతినిస్త్రాణజెందుట. మధుమూత్రము.

మలము:—రక్తవిరేచనములు, జిగటవిరేచనములు, పసరు విరేచనములు—వీటితోసులినొప్పి వచ్చుచుండుట.

జ్వరము:—రక్తదోషముతోగూడిన జ్వరము. పురాణజ్వరములు.

రక్తదోషముతోగూడిన ప్రమాదకరమగు పలువిధములగు చర్మరోగములను, రక్తక్షీణతవలనగాని కాలేయదోషములతో ద్వంద్వముగగాని వచ్చినఉబ్బు (శరీరమునకు నీరుపట్టుట) నుమాన్పుటకో నిదిఅమోఘమైనది.

పోలికలు:— నేట్రింసల్ఫ, యాసిడ్ ఫాస్, సిలీషియం, రూసుటా గ్రోమేటికా, ఎఖినేషియా, కాల్కేరియాసిలికేటా.

మోతాదు:— 2 మొదలు 30 పొటెన్సీ.

## 65. కేమోమిల్లా. CHAMOMILLA.

ఇది సాధారణముగా నరములసంబంధమైన రోగములమీదను పిల్లలకు వచ్చునట్టి రోగములమీదను, ఉద్రేకము జెందినట్టివారికి వచ్చునట్టి రోగలక్షణములమీదను, పిల్లలకు పండ్లు వచ్చుకాలమునను, అజీర్ణమువలనను వచ్చురోగములమీదను బాగుగా పనిచేయును.

♦ ఒకబుగ్గ ఎర్రగను వెచ్చగను, రెండవది చల్లగను పాలిపోయియుండుట. ♦ చమటపట్టుచున్నప్పుడు, పరుండునపుడు, నిద్రించుటవలనను బాధలుపశమింపకపోవుట, మరియు నివి చమటపట్టినపిదపను, లేచిన పిట్మటను ఉపశమించుట. ♦ చమటలు పట్టుచున్నపుడు రోగలక్షణములు దేర్రికము జెందుట. ♦ అరికాళ్లు మంటలుగానుండుటచే రోగిపాదములను పడకకు బయటనుపుంచి పరుండుట. ♦ బిడ్డను ఎత్తుకొనిననే ఊరకుండుట. ♦ పిల్లలకుపండ్లువచ్చు కాలములో అన్నకోశమునందును లేక ఆంత్రములందును గలుగు అజీర్ణదోషములవలనను లేక క్రిమిదోషము వలనను జ్వరము నీళ్లవిరేచనములు కంపములతోగూడిన ఫీట్లు (బాలపాప చిన్నెవగైరా) వచ్చుట. ♦ ఇంద్రియజ్ఞానమెక్కువగా గల స్త్రీలలోను, పిల్లలలోనూ, ఉద్రేకము, విసుగుదల, బాధలు కలుగుట. ♦ చేదు రుచిగానుండు త్రేపులు; దాహము, శూల ఈలక్షణములతో గూడి ఆకుపచ్చని నీళ్లవిరేచనములగుట. ♦ బిడ్డ యేదోయొక వస్తువుకొరకు పోరుపెట్టి యేడ్చుచుండుట. కోరిన వస్తువులనుగాని, మరి యితరవస్తువులనుగాని యిచ్చినను వాటిని త్రోసివేసి యేడ్పును మానకుండుట. ♦ ఋతుశూల, అత్యధికమైన ప్రసవవేదన, ప్రసవమునందు నొప్పులు ఒకేరీతిగా రాకుండుట, గర్భాశయము యొక్క ముఖము సరిగా విస్తరించకపోవుట, ప్రసవానంతర నొప్పులు— ఇవి దీని ముఖ్యలక్షణములు.

బాధలు ఓర్వలేనంతగా వుండుట. బాధలనుమాన్పు ముఖ్యమైన ఔషధములలో నిదియొకటి. ఇది అపస్మారముచే బాధపడు స్త్రీలవ్యాధులమీద బాగుగా పనిచేయును. ఇది యెక్కువ ఆగ్రహముపలన వచ్చిన రోగములమీద బాగుగాపనిచేయును (ఎక్లోమ్సైటు, బ్రియోనియా, కోలోసింథిస్, ఇగ్నేషియా, లైకోపోడియం, నక్సువామికా, స్టాఫిశేగ్రియా).

మనస్సు:—వీడ్వవలయునని యుండుట. బిడ్డ యెత్తుకొని త్రిప్పవలరను యేడ్చుట. పిల్లలలో వెంకితనము. అస్థిమితము. ఆందోళన. వ్రాయునప్పుడును, మాట్లాడునప్పుడును మాటలుతడబడుట.

తల:—కంగారుగా నుండుట. కండ్లు నొప్పిగానుండుట. కాఫీత్రాగినమీదటవచ్చు తలనొప్పులు. తలకు వెచ్చని చెమటపట్టుట. తల తిరుగుటవలన రోగి పడిపోవుట. కండ్లు చికిలించుట. ఉదయమున కనుపాట్లులు వుబ్బుట. వేడిగాను, మంటగాను, యెఱ్ఱగాను వుండుట.

చెవులు:—గింగురుమనుచుండు ధ్వనులు. చెవిపోటు, వాపు, వెచ్చదనమువలన బాధకోర్వలేక పిచ్చియెత్తినవానివలె నుండుట. చెముడు.

ముక్కు:—పడిశమువలన నిద్రపట్టకపోవుట.

ముఖము:—వెచ్చనిపదార్థములను తినుటవలనను, వెచ్చనిపానీయములను, కాఫీని త్రాగుటవలనను పంటిపోటు యెక్కువగుట. పంటిపోటు చల్లదనమువలన వుపశమించుట. వుప్పిసండ్లసలువుడు మాన్పును.

అన్నకోశము:—రోగి చల్లనినీళ్లను పుల్లనిపానీయములందును కోర్కె జెందుట. సాయంకాలమున విపరీతమైన ఆకలిగానుండుట. మరియు ఆహారములు, వెచ్చనిపానీయములు, కాఫీ వీటియందు అయిష్టత. పొట్టలో వాయువు యెక్కువగాజేరుటవలని శూల. దుర్వాసనతోకూడిన త్రేణుపులు. పైత్యసంబంధమైన వమనములు. రుచి చేదు. గుండెలలో మంట. నల్లమందు యెక్కువగా వాడుటవలన వచ్చినవమనములు.

పొత్తికడుపు:—ముందరకు పొంగాడుట. అంత్రములలో వాయువు యెక్కువగా చేరుటవలన శూలవచ్చుట.

మలము, మలాశయము:—విరేచనము అరుపచ్చగాను, నీళ్లవలెను, వేడిగాను, దుర్వాసనతోను, కుళ్లిన గుడ్లవాసనతోను బాధలేకుండగను వెడలుట. పంటిపిల్లలకు పళ్లువచ్చుకాలములో వెడలునీళ్లవిరేచనములను, పసరువిరేచనములను కట్టును. ఆసనములోపల పుండ్లగుట. మూలశంఖ బాధగాను, మంటగాను రక్తస్రావముతోను వుండుట. ఆసనము ఒరియుట.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ యెక్కువగుట.

స్త్రీ అవయవములు:—పుండుపడినట్లుగా మంటగానుండుట. రక్తస్రావములు. ప్రసవవేదనలో నొప్పులు విడిచివిడిచి వచ్చుచుండుట, పైకి పాకుచున్నట్లుండుట, రోగి బాధకోర్వలేకయుండుట. ఋతుశూలను మాన్పును. కుసుమ మంటగాను, పసుపుపచ్చగాను వెడలుట. అవయవములు బిగపట్టియుండుట, ప్రసవానంతరమువచ్చు నొప్పులు మిక్కిలి బాధగానుండుట. మైల అణచిపెట్టబడి, నీళ్లవిరేచనములు, పంటినొప్పి, శూల, వచ్చుట. స్తనములుగట్టిగాను, ముట్టుకొనుటకునొప్పిగానువుండుట. చన్మొనలు బాధగాను, మంటగాను వుండుట. పాలురాకపోవుట, ఒకవేళ వచ్చినయెడల ముద్దలుగాను, రసితోనుకూడి వెడలుట. పాలజ్వరము. గర్భిణీ స్త్రీలలోగలుగు దొంగనొప్పులను మాన్పును.

శ్వాసావయవములు:—గొంతుకలో గిలిగింతలుపెట్టుచున్నట్లుండుటచేవచ్చుపొడిదగ్గు. ఛాతీలో బిగపట్టినట్లుండుట. బిడ్డయొక్క శ్వాసావయవములలో యెక్కువగా అమము చేరియుండుట.

వడుము, కాళ్లు, చేతులు:—నడుమునొప్పి, కంఠములోని కండరములు బిగపట్టినట్లుండుట. యెక్కువ బాధగానుండు మేహవాతనొప్పుల వలన రోగి పడకనుండిలేచి అటునిటు నడచుచుండుట. రాత్రియందు అరికాళ్లలో మంటలుగా యుండుట (సల్ఫరు).

నిద్ర:—నిద్రమత్తుగానుండునుగాని నిద్రపట్టకపోవుట. నిద్ర అస్థిమితముగా నుండుట. రోగి మూలుగుచుండుట, యేడ్చుచుండుట, దొర్లుచుండుట, మాట్లాడుచుండుట, ఒకప్పుడు పడకనుండి లేచుట.

జ్వరము:—అవయవములు ఒకప్పుడు వెచ్చగాను, ఒకప్పుడు చల్లగాను యుండుట. దేహమంతయు చల్లగానుండును కాని, ముఖము, కండ్లు ఊపిరి, వెచ్చగానుండుట. కప్పుకొనినచోట్ల ఎక్కువ చెమటపట్టుచుండుట.

ఉద్రేకము:—వేడివలన, పరున్నపుడు, బహిరంగమైన గాలిలో, రాత్రియందు, కోపమువలన. స్త్రీలకు బహిష్టులో, గర్భిణిలో, రోగమంకురించినభాగము కదల్చుటవలన.

ఉపశమనము:— చెమటపట్టిన పిమ్మట, లంఘనముండుటవలన, కదలికవలన.

సహచరులు:—మెగ్నీషియా కార్బ, బెల్లడోనా.

విరుగుళ్ళు:—కేంఫరు, పల్సటిల్లా, ఇగ్నేషియా, నక్సువామికా, బొరాక్సు, ఎకోనైట్, కాఫీ, కొలోసింథిస్, లెకెసిస్, ఎల్యూమినా, బ్రయోనియా, కోనియం.

కాఫీ, ఓపియం—లకిదివిరుగుడు.

సరిపడనివి:—జింకంమెట్.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

---

## 66. చేరాంతను. CHEIRANTHUS CHEIRI.

ఇది చెవియొక్కయు ముక్కుయొక్కయు, రోగములమీద బాగుగా పనిచేయును. చెవినుండి స్రావముచ్చినను యిది బయటికి వెలువడకపోవుట. యెడమవైపు చెవికి చెముడువచ్చుటను మాన్పును. 21-వ, సంవత్సరము దాటినపిదప జ్ఞానదంతములు (Wisdom Teeth) వచ్చుటతో కలుగు వుద్రేకమువలన, రాత్రియందు ముక్కుదిబ్బడ వేయుటను మాన్పును (కాల్కేరియాఫాసు). నదుములో నొప్పిని, పైత్యోద్రేకమును, అన్నకోశములో బాధను, యెక్కువగా పైత్యముచేసినవానివలె కనపడుటను, మాన్పును.

మోతాదు:—టించరు. మోతాదుకు 1 లేక 2 చుక్కలు.

---

## 67. చెలిడోనియం. CHELIDONIUM MAJUS.

ఇది కాలేయమునకు సంబంధించిన రోగములమీదను, పైత్యదోష ములమీదను బాగుగా పనిచేయును. సోమరితనమును మాన్పుటలోను, గాలిమార్పులవలన కలుగు రోగములమీదను బాగుగా పనిచేయును.

మనస్సు:—మనస్సు 2, 3 దినములవరకు మాత్రమే స్థిమితముగా నుండుట, అటుపిమ్మట వికలతనొందుట. రోగి స్థిమితముగాను, విచార గ్రస్తముగాను యుండుట. క్షమింపవీలులేని నేరమును, లేక పాపపుపనిని చేసితిననుకొనుట. ఎక్కువ మరపు. ఆలోచనచేసుకొనుట కష్టము.

తల.—బరువుగానుండుట. తలనొప్పి కుడివైపునవచ్చి చెవులవెను కకు వీపువరకు వ్యాపించుట. కుడివైపునవచ్చు పార్శ్వపునొప్పులు.

కన్నులు:—పసుపుపచ్చగా నుండుట.

ముఖము:—పసుపుపచ్చగానుండుట. ముక్కు, దౌడలు యెక్కువ పచ్చగానుండుట. నాలుక పసుపుపచ్చగానుండుట. నోటినుండి దుర్వా సనవెడలుచుండుట.

అన్నకోశము:—వెచ్చని ఆహారపానీయములందు యెక్కువ యిష్ట త. ఆకలిలేమి. ఎక్కిళ్లు, తరుచు త్రేణుపులు. కొరుకుచున్నట్లుండుబాధ. భోజనముచేయుటవలన వుపశమించుట.

పొత్తికడుపు:—కాలేయములోను, ప్లీహములోను కుట్టుచున్నట్లుం డుబాధలు, బొడ్డుసమీపమున శూలగానుండుట. కామెర్లరోగము, కడుపు ముందరకు వ్రేలాడుచుండుట. విరేచనము మందముగా అగుట. కాలేయ మునుండి బాధలు కుడిహంసఫలకములోనుంచి వెన్నెముకలోనికి పొడుచు చుండుట. కాలేయమువాచి పెద్దదై, పుండువలె బాధగానుండుట.

మూత్రావయవములు:—ఎక్కువగాను, నురగతోను, పసుపుపచ్చగాను వెడలుట. అతిమూత్రమును మాన్పును.

మలము, మలాశయము:—విరేచనము గట్టిగాను, గుండ్రనివుండలవలెను, ఒకప్పుడు మేకపెంటికలవలెను, పసుపుపచ్చగాను వెడలుట. మలము జిగురువలెను, జిగటమట్టిరంగుగాను వెడలుట. ఒకప్పుడు నీళ్ళవిరేచనములు, మరియొకప్పుడు మలబద్ధము యుండుట.

స్త్రీఅవయవములు:—బహిష్టు మిక్కిలి ఆలస్యముగానగుట, స్రావమెక్కువగాను, చాలరోజులవరకును, వెడలుచుండుట.

చర్మము:—వెచ్చగాను, దురదగాను, పసుపుపచ్చగాను, యెఱ్ఱని మొటిమలు, పొక్కులతోను కూడియుండుట.

శ్వాసావయవములు:—గట్టిగా వూపిరిపీల్చినయెడల నొప్పిగా నుండుట. ఊపిరాడకపోవుట. కోరింతదగ్గును మాన్పును. దగ్గు విడిచివిడిచి వచ్చుచుండుట. శ్లేష్మము చిన్నచిన్నముద్దలవలె పడుచుండుట. కాలేయరోగముతోకూడి వచ్చు న్యుమోనియాలో బాగుగా పనిచేయును.

కాళ్లు, చేతులు:—మణుగులలోను, తొడలలోను, మహావాతనొప్పులు. వ్రేళ్ళచివర మంచువలె చల్లగానుండుట.

ఉద్రేకము:—తాకుటవలన, కదలికవలన, తెల్లవారుఝామున 4 గంటలకు, కుడిప్రైవున, గాలిమార్పులవలన.

ఉపశమనము:—భోజనానంతరమున, నొక్కుటవలన.

లెడం—కు పిమ్మట నిది బాగుగా పనిచేయును.

సహచరులు:—లైకోపోడియం, బ్రియోనియా.

విరుగుళ్ళు:—ఎకోనైట్, కేంఫర్, కాఫీ, కెమోమిల్లా.

బ్రియోనియాకిది విరుగుడు.

మోతాదు:—మదరుటించరు మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాలపరిమితి 14 దినములకు ప్రైగా యుండును.

## 68. ఛిమఫిలా. CHIMAPHILA.

ఇది మూత్రపిండములయొక్కయు, మర్మావయవ మూత్రావయవములయొక్కయు రోగములమీద బాగుగాపనిచేయును.

తల:—ఎడమకణతలో నొప్పిగాయుండుట.

కన్నులు:—దీపమునుట్టూ పరిధి కనిపించుట, కనురెప్పలు దురదగానుండుట. ఎడమకంటిలో పొడుచుచున్నట్లును, మండుచున్నట్లును యుండుట, నీరు కారుట. అంతరకుసుమలు, లేక కేటరాక్టును మాన్పును.

ముఖము:—దౌడలు, ముఖము, యెక్కువ వెచ్చగానుండుట.

నోరు:—పండ్లపలువు భోజనానంతరమున, పరిశ్రమవలన యెక్కువగుట. దౌడలు బిగపట్టుటచే నోటిని తెరచియుంచి నిద్రపోవుట. పండ్లపలువు చన్నీటివలన వుపశమించుట. నాలుకపై పొక్కులు లేచుట.

మలము, మలాశయము:—మలము వెడలినపిమ్మట అంత్రములలో గోకుచున్నట్లు బాధగానుండుట. చీము, రక్తము పడుచుండుట. నీళ్లవిరేచనములు. ఎక్కువ మలబద్ధకుతోగూడిన మూలశంఖ.

మూత్రావయవములు:—మూత్రపిండముల సమీపమున నొప్పిగానుండుట. మూత్రము స్వల్పముగాను, చిక్కగాను, ముదరరంగుగాను, దుర్వాసనతోను, మడ్డిగాను వెడలుట. మూత్రము ధారలుగా వెడలుట, మరియు కోయుచున్నట్లు బాధగానుండుట. ఒకప్పుడు మూత్రము బంధింపబడుట. మూత్రములో చీము, రక్తముకలసి వెడలుటను మాన్పును. జీర్ణించిన సెగరోగమువలన శ్వేతధాతువు రక్తముకలసి మూత్రముతో వెడలుట. మధుమూత్రమును మాన్పును.

పురుషావయవములు:— అండములు గట్టిపడుట. సెగ, సవాయి రోగములు. ప్రాస్టేటుగ్రంధివాచి స్రావము వెడలుచుండుట.

స్త్రీఅవయవములు:—గర్భాశయము వెలుపలకువచ్చుట, స్తనములు అర్పుకొనిపోవుట, ఒకప్పుడు మిక్కిలి పెద్దవగుట, స్తనములలో కంతులు

బయలు దేరుట, పాలతల్లులలో పాలువిస్తారముగా వచ్చుట, ఒకప్పుడు అస లేరాకపోవుట, మర్మావయవములో యెక్కువ వెచ్చన.

చర్మము:—మాంసగ్రంధులవాపు, మానవటువంటిపుండ్లు.

నిద్ర:—తరుచు మూత్రానుమానములవలని నిద్రలేమి.

ఉద్రేకము:—తేమగాలిలో, చల్లని రాతిప్రదేశము మీద కూర్చుం డుటవలన, ఎడమపార్శ్వమందు.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 సాటెన్సీ.

---

## 69. చైనా. CHINA OR CINCHONA.

(హిందూదేశపు ఔషధము. 23. సింకోనా లేక క్వాయినా)

ఆల్కహాలు, టీ, పాదరసము—లవలన కలుగు రోగలక్షణములమీ దను, చలితోను, కోపములవలనను, జలుబును పడిశెమును అణచిపెట్టినపిమ్మ టను,హస్తప్రయోగమునను, పలువిధములగు స్రావములవలనను వచ్చురోగ లక్షణములమీద నిది పనిచేయును.

♦ పండ్లను తినినవెంటనే అజీర్ణవిరేచనములు అప్రయత్నముగా వెడలుట ♦ అజీర్ణదోషముతో గూడిన నీళ్ళవిరేచనములు. ♦ అతినిస్త్రాణ నుకలుగజేయునట్టి చమటలు రాత్రి విస్తారముగా పోయుట. ♦ముక్కునుం డియు యితరావయవములనుండియు ముద్దలుముద్దలుగా వెడలు రక్తస్రావ ములవలన రక్తవిహీనులకు అతినిస్త్రాణ, చెవులలో గింగురు మన్నగు లక్ష ణములువచ్చుట ♦ పాలతల్లులు స్తన్యము నిచ్చుటవల్లను, మూలశంఖనుండి రక్తస్రావమువల్లను, కుసుమచేబాధపడువారిలోనూ, లాలాజలమెక్కువ గాయూరుచుండు వారిలోనూ, హస్తప్రయోగాది దురభ్యాసముల వల ననూ, వీర్యస్ఖలనములవలననూ రాత్రియందు చమటలవలననూ యిట్టిపలు విధములగు స్రావములవలనకలుగు అతినిస్త్రాణ మన్నగు రోగలక్షణములు. ♦ పెద్దపెద్ద రక్తస్రావములకుపిదప అతిబాధకరమైన తలనొప్పివచ్చుట. బాధకరముగా నుండునట్లుగా పొట్టవిపరీతముగా పొంగరించుట ఇందువల

వరోగి ఉపశమనముకొరకు త్రేణుపులువచ్చుటను కోరుట మరియు త్రేణుపులువచ్చినను ఉపశమనము కలుగకపోవుట ♦ నీళ్లవలెపలుచగను నల్లగనుయుండు మలము బాధలేకుండగను ఎక్కువనిస్త్రాణగలుగజేయుచును వెడలుట. ♦ ముక్కముక్కలుగానుండు శ్లేష్మము వెడలుటతోవుండు దగ్గు పగటియందు లేక సాయంకాలమందు మాత్రమే వచ్చుచుండుట.

మనస్సు:—ఒంటరిగా నుండగోరుట. అధైర్యత. పరిశ్రమయంద యిష్టత. దురదృష్టవంతుడనని యనుకొనుట. ఎక్కువ ఆతురతగాను, నిరాశగాను యుండుట.

తల.—ఎక్కువగాస్రావములు వెడలినపిమ్మట వచ్చుతలనొప్పులు. అధికసంభోగానంతరముగాని, ముష్టిమైథునముపిమ్మటగాని, తలవెనుకభాగమందు యెక్కువగా నొప్పివచ్చుట, శిరస్సుబద్దలగునట్లు తోచునంతటి తలనొప్పి.తలనొప్పివలన మెదడు కెరటములవలె కొట్టుకొనుచున్నట్లుండుట. తలనొప్పి నొక్కుటవలనను, వెచ్చనిగదిలోను వుపశమించుట, బహిరంగమైనగాలిలో నిది వుద్రేకించుట, తాకుటవలనను, చల్లని గాలితగులుట వలనను వుద్రేకించు పార్శ్వపునొప్పులు.

కన్నులు:—కండ్లు పసుపువర్ణముగాను, దృష్టిమాంద్యముగానుయుండుట. రెప్పలమధ్య ఇసుకపోసినట్లుగా నొక్కుచున్నట్లుండుట, మరియు, వెచ్చగాను, యెఱ్ఱగాను, మంటగానుయుండుట, చదువునప్పుడు అక్షరములు కలిసిపోయినట్లు కనపడుట.

చెవులు:—గంటలుకొట్టుచున్నట్లు ధ్వనులు వినుపించుట ముట్టుకొనినయెడల నొప్పిగాయుండుట. సరిగా వినపడకపోవుట.

ముక్కు:—లేచినపుడు సులభముగారక్తము స్రవించుట. నీళ్లవంటి స్రావము, తుమ్ములు వచ్చుచుండుట.

ముఖము:—పొంగరించి, పాలిపోయి, కండ్లులోతునపడి, నీరసముగా కనపడుట.

నోరు:—పంటినొప్పి పండ్లను గట్టిగానొక్కి పట్టుటచేతను, వెచ్చదనమువలనను వుపశమించుట. బిడ్డ పాలుత్రాగుచున్నప్పుడు తల్లియొక్క

పండ్లసలుపుయెక్కువగుట. నాలుకపసుపుపచ్చగాను, తెల్లగాను, మురికివలెను పూతగలిగియుండుట. రసము యెక్కువగా వాడిన కొన్ని సంవత్సరములకు రాత్రింబగళ్లు లాలాజల మెక్కువగా వూరుచుండుట.

అన్నకోశము:—రోగి సారాయిని, పుల్లనివస్తువులను, పండ్లను, చల్లదనమునిచ్చు పదార్థములను, వేయించిన కాఫీగింజలను తినగోరుచుండుట. రొట్టె, ఆహారము, మాంసము, బీరు, వీటియందు అయిష్టము గలిగియుండుట. రుచి తియ్యగాను, పుల్లగాను, చేదుగాను, ఇట్లు మారుచుండుట. సాధారణముగా అన్నియును, పుగాకుసహితము చేదుగాయుండుట. జీర్ణము నెమ్మదిగాయగుట. అజీర్ణవమనములగుట. పాలు వికటించుట. కడుపు పొంగరింపు కదలికవలన వుపశమించుట.

పొత్తికడుపు:—ఉబ్బరింపుతో శూలవచ్చుట. కామెర్లు. కాలేయము, ప్లీహామువాచి ముట్టుకొనినయెడల నొప్పిగాయుండుట. అన్నకోశములోను, పొత్తికడుపులోను చల్లగానుండుట. దుర్వాసనతోగూడిన అపానవాయువు వెడలుట.

మలాశయము:—విరేచనము అజీర్ణముగాను, నురగతోను, పసుపుపచ్చగాను, బాధలేకుండగను, రాత్రియందును, భోజనాంతరమునను, వేసవిలోను, పాలు, పండ్లు, బీరు త్రాగుటవలనను వెడలుట. మలము మెత్తగానున్నను వెడలుట కష్టముగానుండుట. నీళ్లవిరేచనములవలన అతినిస్త్రాణగలుగుట. పల్చగాను, పసుపుపచ్చగాను, అప్రియత్నముగాను విరేచనములగుచుండుట. మూలశంఖునుండి రక్తముస్రవించుట. జిగటవిరేచనములు.

మూత్రావయవములు:—మూత్రము తరుచుగాను, కొద్దికొద్దిగాను, ముదరరంగుగాను వెడలుచుండుట. ఒకప్పుడు ఆకుపచ్చగాను, పసుపుపచ్చగాను, ఇటుకపొడివంటి మడ్డితోను వెడలుట. మూత్రము కొలదిసేపు నిలువగాయుండినయెడల పాలవలె తెల్లగానగుట.

పురుషావయవములు;— ఉద్రేకమువలనను శృంగారసంబంధమైన

ప్రవాహంతోను, తరుచు స్ఖలనములగుచుండుట. వీటివలన యెక్కువ నీరసము కలుగుచుండుట. అండములు వాచుట, బాధగానుండుట. స్వప్నస్ఖలనముల వలనను, హస్తప్రయోగమువలనను కలుగు నిస్త్రాణ మొదలగు లక్షణములు.

స్త్రీ అవయవములు:—ఋతువు మామూలుకన్న యెక్కువ ముందగావచ్చుట. స్రావ మెక్కువగాను, బాధతోను, నల్లనిముద్దలుగాను వెడలుట. సంభోగవాంఛ యెక్కువగానుండుట. రక్తకుసుమను కట్టును. చట్టిలో నొప్పిగాను, బాధగాను వుండుట. ప్రసవానంతరము మైల చాల దినములవరకు వెడలుచుండుట. ఇది ఒకప్పుడు దుర్వాసనగాను, ముద్దవలెను, చీమునవలెను వెడలుచుండుట. ప్రసవమునకు పూర్వము గాని, తరువాత గాని వచ్చు రక్తస్రావములను మాన్పును. మావి వెడలకుండగ రక్తస్రావమగుచున్నప్పుడు వుపయోగపడును.

శ్వాసావయవములు:—భోజనానంతము విడువనటువంటి దగ్గు, ఛాతీలో గురగురవచ్చుట. ఉక్కిరిబిక్కిరియగుట. గుండెలనుండికలుగు రక్తస్రావములను మాన్పును. ఉబ్బసపుదగ్గు. బాధలు తేమగాలిలో యెక్కువగుట. రోగి చనిపోవున్నవానివలెనగుపడుట. రాత్రియందు ఛాతీలోబరువుగా యుండుట. శ్వాస గట్టిగాపీల్చుట కష్టముగానుండుట. నిస్త్రాణతో కూడిన విషపడిశము.

హృదయము:—గుండెదడ. నాడి ఒకసారి చురుకుగాను, మరొకసారి మందముగాను కొట్టుకొనుచుండుట. రక్తక్షీణత, ఉబ్బు గలుగుట.

నడుము, కాళ్లు, చేతులు:—చాలసేపు వంగుటవలనగాని, బరువువలనగాని నడుములో నొప్పిగానుండుట. చితుకకొట్టినట్లుండు నడుము నొప్పులను మాన్పును. ఒకచెయ్యి చల్లగాను, ఒకటి వెచ్చగాను యుండుట. కుడిమోకాలువాచివెచ్చగాను, చీల్చుచున్నట్లు బాధగాను వుండుట. పాదములు మేహవాతమువలన వుబ్బుట. మూత్రపిండములలో గుచ్చుచున్నట్లుండు బాధలు కదలికవలనను, రాత్రియందును యెక్కువగుచుండుట. మానసిక పరిశ్రమయందయిష్టత. మేహవాతనొప్పులు, వాపులు,

చర్మము:—చల్లగాను, యెక్కువచెమటతోను యుండుట, నీరు పట్టుట (ఆర్సెనికం ఆల్బం, యాపిస్), మాంసగ్రంధులు గట్టిబడుట. ఒక చెయ్యి మంచునలెచల్లగాను, రెండవది వెచ్చగానుయుండుట. చర్మము యెఱ్ఱగావాచి మంటగాను, బాధగాను వుండుట తరుచుపురుపులు వేయుట.

నిద్ర:—ఎల్లప్పుడును నిద్రమత్తుగావుండుట. నిద్ర విశ్రాంతినివ్వక పోవుట. త్వరగా మెలకువవచ్చుట. భయంకరమైన కలలు. వీటివలన లేచు సరికి కంగారుగా నుండుట. కలలవలన కలిగిన భయము మెలకువవచ్చినను మానకుండుట. పిల్లలు నిద్రలో గుఱ్ఱుపెట్టుచుండుట.

జ్వరము:—రోగికి గుండెదడగాను, ఆతురతగాను, ఆకలిగానువుం డుట; అటుపిమ్మట చలివచ్చుట. పానీయములు త్రాగినపిమ్మట చలి యెక్కువగుట. చలివచ్చుటకుముందును, వెనుకను దాహము గొనుట. మధ్యాహ్నము ఒకమారు చలిగాను, ఒకమారువెచ్చగాను యుండుట. జ్వరము విడిచివిడిచివచ్చుచుండుట. ఒకప్పుడు వారమునకొకతూరివచ్చు చుండుట. ఇది మన్యపుజ్వరముల అన్నిదశలలోను పనిచేయును. రాత్రి యందు నిస్త్రాణను కలుగజేయునట్టి చెమటపట్టుచుండుట. కొలదిపరిశ్రమ వలనకూడ ఒక్కొక్కఅవయవమునకు చెమటపట్టుచుండుట. ముఖము వెచ్చ గాను, దేహము చల్లగాను యుండుట. చలిగానున్నప్పుడు తలనొప్పి, తల తిప్పు, దాహము లేమి యుండుట, వెచ్చగానున్నప్పుడు నోరు, పెదవులు ఆర్చుకుపోయి యుండుట, మంటగానుండుట, ముఖము యెఱ్ఱ బడుట, తలనొప్పి యుండుట. సన్నిపాతజ్వరములోరక్తము ఎక్కువగా పోవుటవలన వచ్చు నిస్త్రాణను కట్టును. కాలేయము ప్లీహము వీటియొక్క వాపుతోను, పులిత్రేణుపులతోను, వమనములతోను, ముఖము, చర్మము, పసుపుదనముతోను, యెక్కువనిస్త్రాణతోను, విడిచివిడిచివచ్చు దగ్గుతోను, అవయవములలో నొప్పులతోను, ఛాతీలో కుట్టుచున్నట్లుండుబాధతోను, వచ్చునట్టి పైత్యజ్వరమును మాన్పును.

ఉద్రేకము:—తాకుడువలన, యెక్కువగా గాలితగులుటవలన,

రోజువిడిచిరోజున, సాత్రిపములవలన, భోజనానంతరమున, రాత్రియందు చెమటపట్టినపిమ్మట, పండ్లు ఫలములు తినుటవలన, మాట్లాడుటవలన, అర్ధరాత్రిమున, నడచుటవలన.

ఉపశమనము:—గట్టిగా నొక్కుటవలన, బహిరంగమైనగాలిలో, తిరుండుటవలన, వెచ్చదనమువలన.

సహచరులు:—ఫెర్రం మెటాలికం, కాల్కేరియాకార్బ, కాల్కేరియాఫాసు.

విరుగుళ్లు:—ఆర్నికా, ఆర్సెనికంఆల్బం, నక్సువామికా, ఇపెకాక్, కాల్కేరియా కార్బ్, కార్బొవెజ్, పల్సటిల్లా, సేపియా, సల్ఫరు,విరేట్రం ఆల్బం, యాపిస్, బెల్లడోనా.

ఆర్సెనికంఆల్బం, కాల్కకార్బ్, కేమోమిల్లా, ఫెర్రంమెట్ కాఫీ, హెల్లిబోరస్, అయోడియం, మెర్క్యూరియస్, సల్ఫరు, విరేట్రం ఆల్బం—లకిదివిరుగుడు.

డిజిటాలిను, సెలీనియము—లకుపిమ్మట దీనిని వాడరాదు.

మోతాదు:—1 మొదలు 200 పొటెన్సీ. కామెర్లలో 6-వ పొటె బాగుగా పనిచేసినది. ప్లీహసంబంధమైన రోగములలో 200 పొటెన్సీ కు బాగుగా పనిచేయును. మన్యపుజ్వరములలో 3, 6, 12 పొటెన్సీలు ఉటమంచిది.

---

## 70. కయోనాంతసు. CHIONANTHUS VIRGINICA.

ఇది పలువిధములైన తలనొప్పులమీద బాగుగా పనిచేయును. పైత్రిణవలన వచ్చునట్టిన్ని, ఒకేవేళయందు గాని, ఒకేదినమున గాని వచ్చు యును; బహిష్టులోను, పైత్యమువలనను వచ్చునట్టియు తలనొప్పులను నొప్పను. ఇది ముఖ్యముగా కాలేయసంబంధమైన రోగములమీదను, లేయము వాచినప్పుడును, పనిచేయును. కాలేయము పెద్దదగుట, విరే

చనబద్ధము, మలము జిగురుమట్టిరంగును పోలియుండుట, కామెర్లు, ముదిరిన రంగుగానుండు మూత్రము వెడలుట, యీలక్షణముల నన్నిటిని యిది మాన్పును. కాలేయము నొప్పిగానుండుట. కాలేయము ప్లీహము ఎక్కువ బాధగా నుండుటను, మధుమూత్రమును మాన్పును. యిది పైత్యతత్వముల మీద బాగుగా పనిచేయును. బహిష్టు నణచిపెట్టుటవలన వచ్చు కామెర్ల రోగమును మాన్పును. పొత్తికడుపులో నొప్పి విడిచివిడిచి వచ్చుచుండుట.

మెదడు:—యేమి చేయుటకును తోచకుండుట.

తల:—కదలికవలనను దగ్గుటవలనను నడచుటవలనను తలనొప్పి వృద్ధికించుట. మరియు నిది పరుండుటవలనను నిశ్శబ్దముగానుండుటవలనను నొక్కుటవలనను వుపశమించుట. తల వెచ్చగాను, నొప్పలుగాను యుండుట. జ్వరముగా నున్నప్పుడు నిద్రలో చమటపట్టుట. తలతిప్పు, వమనము, కండ్లలో నొప్పులతోగూడిన తలనొప్పులను మాన్పును. కండ్లుపచ్చపడుట. ముఖము పసుపుపచ్చగా నుండుట.

నోరు:—యెక్కువ నీళ్ళూరుచుండుట, పొడిగానుండుట. నాలుక మీద దళసరిగా పసుపుపచ్చని పూతయుండుట.

అన్నకోశము:—ఆకలిలేకపోవుట. త్రేనుపులు, తలతిప్పు, వమనములువచ్చుట. "ఇదివరకెప్పుడును యింత బాధపడలేదు" అని అనుకొనుట. త్రేనుపులు చేదుగా నుండుట. వమనానంతరము యెక్కువ నిస్త్రాణగా యుండుట. చల్లని చెమటపట్టుట.

పొత్తికడుపు:—బొడ్డువద్ద పొడుచుచున్నట్లును, గోకుచున్నట్లును, బాధ. కాలేయమువాచి పెద్దదగుట, కాలేయమువద్దపోట్లు.

మలము, మలాశయము:—మలము బంకమట్టి రంగువలెను, మెత్తగాను; ఒకప్పుడుపసుపుపచ్చగాను, జిగురువలెనుయుండుట. పైత్యమువలన వచ్చుశూల. మాంసగ్రంధుల దోషములను మాన్పును.

మూత్రావయవములు:—ఒకప్పుడు మూత్రము నల్లగా నుండుట,

మూత్రమెక్కువగా వెడలుచుండుట. మూత్రములో చక్కెర, పైత్యరసము కలిసి వెడలుచుండుట. మూత్రము ముదరరంగుగా వెడలుట.

చర్మము:—పసుపుపచ్చగాను, ఒకప్పుడు ఆకుపచ్చగాను పాలిపోయి, దురదతోను, తేమతోను కూడియుండుట.

జ్వరము:—పైత్య జ్వరమును మాన్పును. జ్వరములో తలనొప్పి నడుమునొప్పి యుండుట. కంటిగుడ్డులో నొప్పిగా నుండుట. మధ్యాహ్నము 12 గంటలకు చలివచ్చుట, తల, బుగ్గలు, యెక్కువ వెచ్చగాను, పొడిగాను వుండుట. జ్వరమున్నప్పుడు నిద్రపట్టుట. మరియు చేతులకును తలకును యెక్కువ చెమటపట్టుట.

దీని లక్షణములు చాలవరకు చెలిడోనియమును పోలియున్నవి. ఇది చాలకాలము మన్యప్రాంతమున నివసించినచో వచ్చు కామెర్లను మాన్పును.

పోల్చదగినవి:—బ్రయోనియా, చైనా, సీనోసిస్, కార్డ్యూసు, పోడోఫైలం.

మోతాదు:—మదరు టించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 71. చినోపోడియం. CHENOPODIUM ANTHELMINTICUM.

మూర్ఛ రుద్రవాతము మున్నగు కంపములతోగూడిన రోగముల మీదను, నరములదోషములతో గూడిన బహువిధరోగములమీదను యిది బాగుగా పనిచేయును. ధ్వనివినుటకు సంబంధించిన నరములదోషముమీద పనిచేయును.

తల:—దృష్టిమందగించుట. తలతిప్పు, చెవులలోహోరు ఇవి నరములదోషములకు సంబంధించియుండుట. చెవులలో ఫిరంగులు పేలుచున్నట్లు ధ్వనులువినిపించుట. క్రమముగా చెముడువచ్చుట. గవదకాయలు (టాన్సిల్సు) పెరుగుట.

మూత్రావయవములు:—పసుపచ్చని మడ్డితోనుండు మూత్రము వెడలుట (చెలిడోనియం). అతిమూత్రము (రూస్ ఆరోమేటికా).

స్త్రీ అవయవములు:—బహిష్టు అణచిపెట్టబడి యిందుకు బదులుగా కుసుమవచ్చుట.

చర్మము:—కాలేయదోషములవలన చర్మము పసుపుపచ్చగానగుట

పోలికలు:—చెలిడోనియం, చైనా, ఓపియం.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 72. సిక్యూటా విరోసా. CICUTA VIROSA.

ఇది ముఖ్యముగా నరములకు సంబంధించిన రోగములమీద పని చేయును. ఫిట్లులేక కంపముతో గూడిన రోగములు — అపస్మారము, హిస్టీరియా, మూర్ఛ, బాలపాపచిన్నె మొదలగుఅనేకరకములరోగములు, ఇవివచ్చినప్పుడు రోగిఅవయవములను ముడుచుకొనుట లేక చాచుట, వెన్నె ముక, మెడ, వీటినివంచుట, మెగ్గలువేమూచున్నవానివలె స్మారకము తప్పి అవయవములను వంచుచు, విరుచుకొనుచు, ముడుచుకొనుచు, యుండుట, మూలుగుట, పెద్దపెద్దకేకలువేయుట, అరచుట, అవయవములు కంపించుట-ఇట్టిలక్షణములమీదనిది బాగుగాపనిచేయును. మరియునిది ధనుర్వాతము మీదను, మంత్రము మొదలగు చర్మరోగములమీదను బాగుగాపనిచేయును.

మనస్సు:— పిచ్చియెత్తినవానివలె నవ్వుట, నాట్యముచేయుట. వింతయైన వూహలుతోచుట, వీటితోబాటు శరీరము వెచ్చగా నుండుట, మరియు సారాయి మొదలగువాటియందు కోరికయుండుట. తనపేరుమరచి పోవుట. పరధ్యానముగా నుండుట. మనస్సు మొద్దుబారియుండుట. ప్రస్తుతము జరుగుచున్నవన్నియు పూర్వమెప్పుడో జరిగినట్లుగా తోచుట. మనస్సు నిలకడలేకపోవుట. ఎవ్వరియందును నమ్మకములేకపోవుట. తల మీద చర్మరోగమును అణచిపెట్టుటవలనగలుగు మానసికరోగములు.

తల:—మెడ త్రిప్పివేయబడినట్లుగా నుండుట. కండరములలో ముడుచుకొనుచున్నట్లును, నొక్కుచున్నట్లును, వుండుట. తలకు దెబ్బతగులుటవలనవచ్చు కంపముతో గూడిన రోగములు. తలమీద కురుపులలోనుండి వచ్చు చీము దళసరిగాను, పసుపుపచ్చగాను యుండుట, పక్కులు కట్టుట. తలకుసంబంధించిన లక్షణములు అపానవాయువు వెడలినపిమ్మట వుపశమించుట.

కన్నులు:—చదువుచున్నప్పుడు అక్షరములు మాయమైనట్లు కనిపించుట. పాపలు పెద్దవగుట. వస్తువులు మామూలుకన్న రెట్టింపు వురవగాను, నల్లగాను, వున్నట్లు కనబడుట. రాత్రులందు కండ్లుఅంటుకొనుట.

చెవులు:—కష్టముమీద వినిపించుట. రక్తస్రావమగుట. గుటక వేయునపుడు కుడిచెవిలో సతాలుమని పేలినట్లుండుట.

ముఖము:—పొక్కులు దగ్గరగాను, పసుపుపచ్చని రసి వెడలుచు, పక్కులు కట్టుచు, ముఖముమీదను, తలమీదను, నోటిచివళ్లను, గెడ్డముమీదను, మంటతోను, బాధతోను బయలుదేరుట. ముఖమెర్రగానుండుట.

నోరు:—పండ్లు కొరుకుచుండుట. నాలుకవాచుట, మాట సరిగా రాకపోవుట, మాట్లాడునపుడు తలకు వణుకువచ్చుట, నోటివద్ద నురగ, చొంగ, వచ్చుట; దౌడలు దగ్గరపడుట.

గొంతుక:—ఆర్చుకొనిపోయియుండుట. గుటకవేయుట కష్టముగా యుండుట. గొంతుక ముడుచుకొనిపోయినట్లు పూడిపోయినట్లుయుండుట. రొట్టెముక్కను మ్రింగినప్పుడు గుచ్చుకొనుటచే గొంతుకలోనొప్పి.

అన్నకోశము:—ఆకలిలేకపోవుట, నోరు ఆర్చుకుపోవుట. రాక్షసి బొగ్గును తినవలెనని కోరికగలిగియుండుట (ఎల్యూమినా, కాల్కేరియా కార్బ.) భోజనానంతరము శూల, కోయుచున్నట్లుబాధ, మగత వుండుట. విపరీతమైనఎక్కిళ్లు ధ్వనితోగూడివచ్చుట. దీనివలనరోగికియేడ్పువచ్చుట. రక్తవమనము. వుదయమునను భోజనము చేయుచున్నప్పుడును తలతిప్పుగా నుండుట. ఇది ఒకప్పుడు తలనొప్పితో కూడియుండుట.

పొత్తికడుపు:—కంపముతోకూడిన ఫిట్లు, దీనితోకూటయుండుట (పిల్లలలో, నులిపురుగులవలన యీలక్షణముగలిగినప్పుడు దీనినివాడవలయును). వాయువు యెక్కువగా జేరుటవలన యేమియు తోచకుండుట. బాధగాను, పొట్ట యెత్తుగాను, బరువుగాను, యుండుట. గురగురలాడుట.

మలాశయము:—మలబద్ధము. మలము పల్చగాను, అతితరుచుగాను, వెడలుచుండుట. ఆసనము దురదగా యుండుట. ఉదయమున ఆపుకోలేనంతటి మూత్రినుమానముతోపాటు వెడలు నీళ్లవిరేచనములు.

మూత్రావయవములు:—మూత్రము తరుచువెడలుచుండుట, ఒకప్పుడు వెడలకుండుట. మరియొకప్పుడు వడిగా, యెక్కువగా వెడలుట. మూత్రకోశమునకు పక్షవాతములోవలె మూత్రముప్రయత్నముగా వెడలుట.

పురుషావయవములు:—అండములు మీదికిలాగుట. శృంగారసంబంధమైన కలలులేకుండగనే స్ఖలనమగుట. శెగరోగమువలనమూత్రనాళము అప్పుడప్పుడు మూసుకొనిపోవుచుండుట.

స్త్రీఅవయవములు:—బహిష్టు మామూలుకన్న ఆలస్యమగుట. నడుములో దిగువను చీల్చుచున్నట్లుండు బాధలు బహిష్టులో కలుగుట.

శ్వాసావయవములు:—ఛాతీ బిగపట్టినట్లుండుటవలన వూపిరి తీసికొనుటకష్టముగానుండుట. గుండెలలో వెచ్చగాను మంటగాను వుండుట. వూపిరందకపోవుట. మాట బొంగురుగావచ్చుట. ఎక్కువసావముతో గూడినదగ్గు.

నడుము, కాళ్ళు, చేతులు:—నడుము ధనుస్సువలెవంగుట. మెడలోని కండరములలో నొక్కుచున్నట్లు లాగుచున్నట్లు వుండుబాధలు ఆగుచు వచ్చుచుండుట. వంగిన అవయవములు నిడుపుగా అవకపోవుట, నిడుపుగా అయినవి తిరిగి వంగకపోవుట. చేతులమీది దుష్టరక్తనాళములు వాచుట. వేళ్లలో చైతన్యశక్తి లేనట్లుండుట. చేతులు, కాళ్లు, వేళ్ళు, వీటిలో కంపము వచ్చుట. అవయవములుకొయ్యబారుట.

నిద్ర:—రాత్రియందు నిద్ర పట్టకపోవుట, యెక్కువ చెమట పట్టుట. నిద్రలోతరుచు మెలకువవచ్చుట. జ్ఞాపకము రాత్రి కలలువచ్చుట.

చర్మము:—శరీరమంతయు గురదగాను, మంటగాను, యుండుట. పసుపుపచ్చని రసితోగూడిన పొక్కులు, బయలుదేరుట.

జ్వరము:—నులిపురుగులవలనశూలతోను, కంపముతోను, జ్వరము వచ్చుట. నాడినీరసముగా నుండుట. శరీరము చల్లగానుండుటవలన రోగి వెచ్చదనమును కోరుట. రాత్రియందు పొట్టమీద చెమటపట్టుట.

ఉద్రేకము:—చుట్టపొగవలన, తాకుడువలన, అదురుపాటన, చల్లదనమువలన.

ఉపశమనము:—వెచ్చదనమువలన.

విరుగుళ్ళు:—ఆర్నికా, ఓపియం. మరియు ఆర్నికాకిది విరుగుడు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ దీని గుణకాలపరిమితి 5 మొదలు 6 వారములు.

---

## 73. సిమిసిఫ్యూగా. CIMICIFUGA.

ఇది నరములయొక్కయు, కండరములయొక్కయు, గర్భాశయము యొక్కయు, రోగములమీద బాగుగా పనిచేయును. నాడియందలిదుడుకును, వడినితగ్గించి బాధనుపశమనముకలిగించి, వుద్రేకమును తగ్గించును. ఆందోళనగా యున్నప్పుడును, బాధగా యున్నప్పుడును, యిది యెక్కువగా వుపయోగపడును. మేహవాత రోగములమీదను, గర్భాశయ రోగములమీదను బాగుగా పనిచేయును. శీతగాలివలన కలిగినబాధలకును, ముఖ్యముగా మేహవాతమునకును, యిదిబాగుగా పనిచేయును.

మనస్సు:—ఆత్మహత్య చేసుకొనవలయునని తోచుట. విడువకుండ మాటలాడదలచుట. ఒక హంశము గురించి మాట్లాడుచు పూర్తికాకుండగనే వేరొకహంశమునుగూర్చిమాట్లాడుట. సూతికను సంబంధించిన పిచ్చి.

తనకు పిచ్చియెత్తుచున్నదని తోచుట. ఏదియో అపాయము రానున్నదని కలగనుటచే మనస్సు దిగులుచెందియుండుట. సంధిలక్షణములు. పార్శ్వపు నొప్పి మానినపిమ్మటవచ్చు వెఱ్ఱితనము. ఎలుకలు, చుంచులు సమీపమున పాకుచున్నవనుకొనుట.

తల:—మానసిక పరిశ్రమవలనగాని, యెక్కువగా చదువుటవలనగాని, గర్భాశయరోగములతో గూడినట్టిగాని, తలనొప్పులనుమాన్పును. తలనొప్పి బహిరంగమైనగాలిలో వుపశమించుట. విద్యార్థులతలనొప్పులు. నిద్రలో తలయాడుచున్నట్లుగాతోచుట. సంభోగానంతరము తల బరువుగాను, మందముగాను వుండుట. నొప్పి ముచ్చిలగుంటలో బయలుదేర నడినెత్తిలోనికి పాకుచుండుట. తల పైభాగము యెగిరిపోవునట్లు తోచునంతటి తలనొప్పివచ్చుట.

కన్నులు:—గుడ్లలో పోట్లుగా నుండుట, యివి నొక్కుటవలన వుపశమించి, కదల్చుటవలన వుద్రేకించుట. బాధ కంటినుండి తలలోనికి పాకుట. వెలుతురుచూచుట కష్టముగా నుండుట.

ముఖము:—పాలిపోయి యుండుట. కండ్లు లోతునపడి, నీరసముగా కనుపించుట. తరుచు వెచ్చగానుండుట. పెదవులు ఆర్చుకొనిపోయి బీటలు తీసియుండుట. చెవులలో ధ్వనులు వినిపించుచుండుట. నోరు దుర్వాసనగా యుండుట. నాలుక, నోరు, వెచ్చగా ఆర్చుకుపోయి యుండుట. మెడనరము పట్టినట్లుండుట. గొంతుకనుండి ఆమము కాండ్రించినప్పుడు వెడలుట. గొంతుక వాపుగాను, బాధగాను యుండుట.

అన్నకోశము:—తలతిరిప్పు, వమనము, తలనొప్పి, కంపము, యివి స్త్రీలలో ఎక్కువగా కలుగుచుండుట. కొరుకుచున్నట్లు బాధగానుండుట. కడుపు లోతుకు పోవుచున్నట్లు వుండుట (సేపియా, సల్ఫరు.)

పొత్తికడుపు:—శూల అప్పుడప్పుడు వచ్చుచుండుట. ఇది వడముును వంచుటవలనను, విరేచనానంతరమునను వుపశమించుట. కండరములలో నొప్పిగానుండుట.

మలము:—ఒకప్పుడు విరేచనబద్ధము, మరియొకప్పుడు నీళ్ల విరేచనములు. తరుచుగాను, పల్చగాను, నల్లగాను, విరేచనమగుట.

మూత్రావయవములు:— మూత్రము విడువకుండా వెడలుచుండుట. మూత్రపిండములవద్దను, నడుములోను, నొక్కుచున్నట్లు నొప్పిగావుండుట.

స్త్రీఅవయవములు:—హిస్టీరియా లేక అపస్మారము. గర్భాశయములో మిక్కిలి బాధగానుండుట. ఋతువు యెక్కువత్వరగాను, స్రావమెక్కువగాను, నల్లగాను, గడ్డకట్టుచును, వెడలుచుండుట. మేహవాత సంబంధమైన ఋతుశూల యెక్కువబాధ కలుగజేయుట. బహిష్టులో అపస్మారము లేక హిస్టీరియాసంబంధమైన కంపము లేక ఫిట్టువచ్చుట, మానసికలక్షణము ఉద్రేకించుట. గర్భాశయములో బరువుగానుండుటతో గూడిన కుసుమ. శీతలమువలనను లేక మనోవికారమువలనను, బహిష్టు అణచిపెట్టబడినపుడును యిది పల్సటిల్లావలెనే పనిచేయును, అనగా బహిష్టును కలిగించును. బహిష్టును సంబంధించిన బహువిధరోగములకు దీనిని వాడవచ్చును. ముట్లుడుగుకాలములోను, ప్రేమభంగమువలనను, వచ్చు రోగములమీద పనిచేయును. బహిష్టుకు ముందుగా శూలతోగూడిననొప్పి. పల్సటిల్లా, సిమిసిఫ్యూగా, కాలోఫైలం, మొదలగుమందులకన్న మెగ్నీషియాఫాసు ఋతుశూలలో బాగుగా పనిచేయును. గాని మేహవాత రోగులలో గలుగు ఋతుశూలకు సిమిసిఫ్యూగా ముఖ్యౌషధముగా యెంచదగియున్నది. బహిష్టులో స్రావ మెంత యెక్కువగానుండునో బాధకూడ అంత హెచ్చుగానుండుట.

గర్భిణీ:— గర్భిణులలో కలుగు దొంగనొప్పులను, ప్రసవానంతరము గజ్జలలో నొప్పులు యెక్కువ బాధతోను తలతిప్పు వమనముతోను వచ్చుట. శీతలమువలనగాని మనోవికారమువలనగాని మైల అణచిపెట్టబడుట. సూతికసంబంధమైన మనోవికారము. ప్రసవవేదనలో ప్రథమమున వచ్చేడు వణకును, నరముల వుద్రేకమువలన కలుగు కంపములకును, గర్భకోశద్వారము గట్టిగా ముడుచుకొనిపోయినప్పుడు దీనిని వాడవచ్చును.

అండాశయముసు సంబంధించిన నరములలో లాగుచున్నట్లు బాధగానుం డుట. వమనములను లేక వేవిళ్ళను కట్టును. 3వ మాసమునవచ్చు గర్భస్రావమును కట్టును. ఆఖరునెలలో దీనిని వాడినయెడల, ప్రసవవేదనలో బాధలు తక్కువగా యుండును. అదివరలో జీవములేనట్టి శిశువులను కనినట్టి స్త్రీలకు దీని నిచ్చినయెడల, అట్టి వారికి సజీవులుగానుండునట్టిబిడ్డలే, కలిగెదరు. స్తనములలో మంటగానుండుట.

శ్వాసావయవములు:—మాట్లాడుటవలనను రాత్రియందును వుద్రేకించు పొడిదగ్గు. దీనిలో నరముల వుద్రేకము, కొలదిగా కండరములలో నొప్పి వుండునపు డిది బాగుగా పనిచేయును.

హృదయము:—హృదయములో నొప్పిగాను, దడగాను యుండుట. నాడి వక్రముగాను, నీరసముగాను, లేక, వడిగాను పుష్టిగాను వుండుట. కదలికవలన దడ యెక్కువగుట. హృదయమాగిపోయినట్లుగాను, వూపిరాడనట్లుగాను వుండుట.

మెడ, నడుము, కాళ్లుచేతులు:— మెడనరము పట్టుట, లేక నొప్పిగానుండుట. మెడలోను, నడుములోను, వుండునట్టి కండరములకు సంబంధించిన మేహవాతనొప్పులు. కీళ్లసంధులలో వెచ్చగాను, వాపుగాను యుండుట. నడుములో కరుక్కుమన్నట్లు శబ్దమగుట. చేతులకు చెమట పట్టుట. వ్రాయుచున్నప్పుడు వేళ్లు వణకుట.

నిద్ర:—కష్టములలో నున్నట్లు కలగనుట. అస్థిమితముతో కూడిన నిద్ర. యేమియు నిద్రపట్టకపోవుట. పిల్లలకు పండ్లువచ్చుకాలములో నరముల వుద్రేకమువలన నిద్ర పట్టకపోవుట. మాటలు, ధ్వనులు, వినపడుచుండుటవలన నిద్రపట్టనప్పుడు దీనిని వాడవలయును (కాఫీ).

ఉద్రేకము:—వుదయమున, చల్లదనమువలన, బహిష్టులో.

ఉపశమనము:— వెచ్చదనమువలన, ఆహారము తినినపిమ్మట.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

## 74. సినా. CINA.

ఇది ముఖ్యముగా పిల్లలరోగములమీద బాగుగా పనిచేయును. ఇది నులిపురుగు మొదలగు క్రిములు బయలుదేరుటను, క్రిమిదోషమును సంబంధించిన యితరరోగలక్షణములను మాన్పును. చిరచిరలాడుచుండుట, ఆకలి ఒకప్పుడు యెక్కువగాను, ఒకప్పుడు తక్కువగాను యుండుట, పండ్లు పటపటకొరుకుట. బాలపాపచిన్నె, స్పృహతోగాని స్పృహలేకపోవుటతోగాని వచ్చునట్టి అపస్మారము మొదలగు కంపములతోకూడిన వ్యాధులు. తాకుడుకును కదలికకును బిడ్డ యిష్టపడకపోవుట. అస్థిమితముగానుండుట. ముక్కు గోకుకొనుచుండుట. రాత్రియందును, నిద్రలోను, కెవ్వుమని కేకవేయుచుండుట. బిడ్డ దేనినో కోరుచుండునుగాని దేనినిచ్చినను త్రోసివేయుచుండుట. ముఖము వెచ్చగా పాలిపోయియుండుట. అప్రయత్నముగా మూత్రమును, పల్చని, తెల్లని, మలమును విడుచుట.

మనస్సు:—బిడ్డ ముట్టుకొనుటను, యెత్తుకొనుటను, యిష్టపడదు (కెమోమిల్లాలో యెత్తుకున్న బిడ్డను దింపుటకిష్టపడదు). యేదియోపాడు పని చేసితిననుకొనుట.

తల:— ఒకమారు తలనొప్పి, మరియొకమారు పొత్తికడుపులో బాధ; ఇవి, ముందరకు వంగుటవలన వుపశమించుట. కండ్లనెక్కువగా వుపయోగించువారిలో కలుగు తలనొప్పులు. తల తిప్పుచున్నట్లుండుట. ఇది పడకనుండి లేచునప్పుడు వుద్రేకించుట మరియు నడచుటవలన నిది వుపశమించుట.

ముఖము:—పాలిపోయి, జబ్బుచేసినవానివలె చూచుచుండుట. ముష్టిమైథునమువలన దృష్టిమందగించినపుడిది పనిచేయును. కండ్లనుండి నీళ్లుకారుచుండుట. ముఖముమీద చల్లని చెమటపట్టుట. నిద్రలో పండ్లు పటపటకొరుకుట. ఒకప్పుడు ముఖము వెచ్చగాను, యెర్రగాను వుండుట.

చెవులు:—సరిగా వినపడకపోవుట, ఎక్కువదురదచేగోకుచుండుట.

ముక్కు:—విపరీతమైన తుమ్ములు. రక్తము స్రవించువరకును వేళ్లతో ముక్కును పొడుచుచుండుట. ముక్కు యెక్కువదురదగానుండుట.

అన్నకోశము:—తీపివస్తువులను కోరుచుండుట. భోజనము చేసిన వెంటనే తిరిగి ఆకలిగొనుట. ఒకప్పుడు యెక్కువఆకలిగాను, మరియొకప్పుడు ఆకలిలేకుండగను యుండుట. వివిధమైన వస్తువులనుకోరుచుండుట. దాహముగానుండుట. ఆహారపానీయములు తీసికొనినపిదప, వమనములు, విరేచనములు, వెడలుట. ఆమమును విపరీతముగా వమనము చేసికొనుట. వమనములో పురుగులు (పాములు) పడుట.

పొత్తికడుపు:—క్రిమిదోషమువలన గ్రుచ్చుచున్నట్లును, పొడుచుచున్నట్లును, బాధగానుండుట. పిల్లలపొత్తికడుపులో వుబ్బరింపు.

మలము, మలాశయము:—ఆసనము దురదగానుండుట (ట్యూక్రియం). నులిపురుగులు లేక క్రిములు వెడలుచుండుట (సెబాడిల్లా, నెఫ్థలీన్ నేట్రింఫాసు). మలము తెల్లగాను, పల్చగాను వెడలుట. ఒకప్పుడు నల్లగాను, గట్టిగాను, వెడలుట.

మూత్రావయవములు: —రాత్రియందు అప్రియత్నముగా, పడకలో, మూత్రమువిడచుటరు మాన్పును. తరుచు మూత్రనుమానముండుట.

స్త్రీఅవయవములు:—రజస్వలకుపూర్వమే రక్తస్రావములు.

శ్వాసావయవములు:—హృదయమున యెక్కువగా దగ్గువచ్చుట. దగ్గువలన రొమ్ముకుకవద్ద బాధగానుండుట. బిడ్డదగ్గువచ్చునేమోయను భయముచేత మాట్లాడుటను కదలుటను మానుట (బ్రియోనియా). కోరింత దగ్గు; దీనిలో తెల్లని ఆనును స్వల్పముగా రక్తజీరతో వెలువడుట. పానీయములు త్రాగుటవలనను, బహిరంగమైనగాలిలో తిరుగుటతోను దగ్గు వచ్చుట. వూపిరాడుట కష్టముగా నుండుట.

కాళ్ళు, చేతులు:—బిడ్డలలో రాత్రియందువచ్చు బాలపాపచిన్నె మొదలగు కంపములతోగూడిన వ్యాధులమీద బాగుగాపనిచేయును. చేతు

లలో చీల్చుచున్నట్లు బాధలు. దిగువఅవయవములలో లాగుచున్నట్లు, ముడుచుకొనిపోవుచున్నట్లు బాధగానుండుట.

నిద్ర:—తరచు ఆవలింతలు వచ్చుచుండుట. పిల్లలలో రాత్రియందు స్థిమితములేకపోవుట, యేడ్చుచుండుట. శరీరములో వెచ్చదనము, బాధతోగూడిన నిద్రలేమిని మాన్పును. నిద్రలోపండ్లు కొరుకుచుండుట. కేకలువేయుచుండుట, మాటలాడుచుండుట.

జ్వరము:—చలికొద్దిగానుండుట. జ్వరమెక్కువగానున్నను, దీని దోషము నాలుకలో కనపడకపోవుట. యెక్కువఆకలి, శూల, చలి, దాహము, యుండుట. జ్వరములో ముఖముచల్లగాను, చేతులు వెచ్చగాను, వున్నప్పుడిది పనిచేయును. చేతులు, ముక్కు, నుదురు వీటికి చల్లని చెమట పట్టుట. సాయంకాలమువచ్చుచలి ఉష్ణోపచారముచేవుపశమించనప్పుడును, కంపమువచ్చినప్పుడు వమనము, యెక్కువగా ఆకలికలుగుచున్నప్పుడును, శరీరముచలిగాగాని వెచ్చగాగాని యున్నప్పుడుమాత్రమే యిది బాగుగా పనిచేయును. హృదయములో దుముకున్నప్పుడును పనిచేయును.

వుద్రేకము:—వుదయమున, సాయంకాలమున, తాకుటవలన, భోజనానంతరమున, బహిరంగమైన గాలిలోనడచుటవలన, వేసవిలో, సూర్యరశ్మివలన, క్రిమిదోషమువలన.

వుపశమనము:—కదలికవలన, బోర్లగిలిపరుండుటవలన.

విరుగుళ్లు:—కేంఫరు, కేప్సికం, ఇపెకాక్, మెర్క్యూరియసు.

మోతాదు:—3 మొదలు 1000 పొటెన్సీ. నరములసంబంధమైన వ్యాధులతో బాధపడు పిల్లలకు, 30, 200 పొటెన్సీలు బాగుగాపనిచేయును. క్రిమిదోషములమీద నిది ఒకప్పుడు పనిచేయనిచో సేన్టనైన్ (Santonine) 1x లగాయితు 3x వరకు పొడుమును జాగరూకతతో వాడినయెడల క్రిమిదోషము మానును.

---

## 75. సినరారియా. CINERARIA MARITIMA.

ఇది కండ్లలో బయలుదేరు కేటరాక్టు లేక అంతరకుసుమము అనబడు రోగమువలనకలుగు దృష్టిదోషమును లేక లోపమును మాన్పును. ఇది లోపలకును బయటకునుగూడ వుపయోగించవచ్చును. దీనిని బయటకు వాడుచున్నప్పుడు లోపలికి ఈ యౌషధమునుగాని, కాల్కేరియాఫ్లోరు, కాల్కేరియాఫాసు, కాస్టికం, కెన్నబిస్‌సతీవా, సెఫలీను, మొదలగు ఔషధములనుగాని, లోపలకువాడుటవలన చాలవుపయోగముగలదు. ఇది దెబ్బతగులుటవలనను, కాచబింబము కిరణాభేద్యమైన (Opaque) దిగా అయినప్పుడును, ముసలితనములోను, వచ్చు అంతరకుసుమలనిది మాన్పును.

మోతాదు:—6 వ పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—దీనిని అంతరకుసుమలు లేక కేటరాక్టు (Cataract and corneal opacities) కును మరియు కాచబింబము కిరాణాభేద్యమైనది (Opaque) గా నున్నప్పుడును, దీనినికంటిలో ఒక్కొక్కసారి, ఒక్కచుక్క చొప్పున, దినమునకు 4, 5 సారులు వేయవలయును. ఇట్లుచాలనెలలవరకు వేయుచుండినయెడల తిరిగిదృష్టి యథాస్థితికివచ్చును.

---

## 76. క్లెమేటిస్. CLEMATIS.

ఇది మేహవాతరోగులకు; సవాయివలనను, శెగరోగమువలనను, చర్మరోగములోను, బాధపడు రోగులకు, బాగుగా వుపయోగపడును. రోగి నిద్రమత్తుగా యుండుట. మాంసగ్రంధులు వాచుట, గట్టిపడుట, మూత్రము సరిగా వెడలకపోవుట, ఒకప్పుడు మూత్రము బంధింపబడుట, యెక్కువ నిస్త్రాణగలుగుట—ఇట్టి లక్షణములనిది మాన్పును.

తల:—కనుబొమలలో పొడుచుచున్నట్లు నొప్పులుగా యుండుట. తల వెనుకభాగమందు పొక్కులు బయలుదేరి, వీటినుండి చీమువెడలుచు,

పక్కలుకట్టుచు, దురదతోనుండుట. గోకుటచే బాధ వుపశమించుట.

కండ్లు:—వెచ్చగాను, వాపుగాను, యెర్రగాను, బాధగాను, యుండుట. తెల్లగుడ్లు పసుపుపచ్చగానుండుట. చదువునప్పుడు, చూచునప్పుడు, దృష్టి చలించుచునుండుట. కనుకొలికలలో ఒరుపును నొప్పును.

ముఖము:—పాలిపోయి, జబ్బుపడినవానివలె నగుపడుట. ముక్కుమీదను, గెడ్డముమీదను, రసితోకూడిన పొక్కులు బయలుదేరుట. పంటిపోటు పుగాకు నుపయోగించుటవలన యెక్కువగుట. పుప్పిపళ్లలో ఆహారము దూరుటవలన పంటిపోటు యెక్కువగుట. ఇది చన్నీటివలన వుపశమించుట (కాఫీ). రాత్రి సమముగా పరుండినయెడల పంటిపోటు యెక్కువగుట. మరియు యెక్కువ ఆతురత, నిరాశ, నిస్త్రాణ కలుగుట.

నోరు:—నాలుకమీదను గొంతుకలోను చిన్నచిన్న పుండ్లగుట. గొంతుకలోని మాంసగ్రంధులు వాచి, వాటినుండి చీము వెడలుట. నోరు, గొంతుక, వెచ్చగాను, మంటగాను, గరుసుగాను యుండుట.

అన్నకోశము, పొత్తికడుపు:—అన్నకోశములో వుబ్బరముగానుండుట. కాలేయములో కుట్లుచున్నట్లు బాధగానుండుట. గజ్జలలోని మాంసగ్రంధులు వాచుట, గట్టిపడుట.

మూత్రావయవములు:—మూత్ర మెక్కువగా చీముతోకలసి వెడలుట. ఒకప్పుడు మూత్రము తక్కువగా వెడలుట. మూత్ర విసర్జనలో ఆఖరున విపరీతమైన మంటగానుండుట. ఒకప్పుడు మూత్రము తక్కువగాను మూత్రనాళముచివర మంటతోను వెడలుట. మూత్రనాళము ముడుచుకొనిపోయినట్లుగా తోచుట. మూత్రము చుక్కచుక్కలుగా వెడలుట.

పురుషావయవములు:—దీనిని తరుణములో వాడినయెడల మూత్రద్వారము మూసికొనిపోవుటను ఆపుచేయును. శెగరోగము నణచిపెట్టుటవలన అండములు గట్టిపడుట, వాచుట, బాధగానుండుట, ఇట్టిఅవస్థలో పల్సటిల్లాను వాడుటవలన అండములవాపు సరిగా తగ్గనప్పుడు దీనిని వాడవలయును. మూత్రనాళములో కుట్లుచున్నట్లుండు బాధతోకూడియుండు

విపరీతమైన లేపనము: సంభోగములో స్ఖలనమగునపుడు మూత్రనాళము లో మంట. అండములలో, మీదికి లాగుచున్నట్లుండుట. రేతోవాహిక (Spermatic cord) వాచి, ముట్టుకొనిన బాధగానుండుట.

స్త్రీ అవయవములు:— స్తనములలోని మాంసగ్రంధులువాచుట, గట్టిపడుట. మర్మావయవములోను, స్తనములోను పుట్టపగ్గను లేక కేన్సరు బయలుదేరుట.

చర్మము:— ఎరగ్రాను, మంటతోను, బీటలతోను, పొక్కులతోను, యెక్కువదురదతోను, యుండుట. మాంసగ్రంధులు పెచ్చగాను, వాతోను బాధగానుయుండుట. దుష్టరక్తనాళసంబంధమైనపుండ్లనుమాన్పును.

వృద్ధికము:— రాత్రియందు, పడకవేడిమివలన, చన్నీటిచే కడుగుటవలన, అమావాస్యకు.

వుపశమనము:— బహిరంగమైన గాలిలో.

విరుగుళ్లు:— బ్రియోనియా, కేంఫరు.

మోతాదు:— 3 మొదలు 200 పొటెన్సీ.

---

## 77. కోకా. COCA.

ఇది పర్వతముల సమీపమున నివసించువారికి చాలవుపయోగకారిగానుండును. పర్వతములను యెక్కుటవలనవచ్చు గుండెదడ, వూపిరందకపోవుట, ఆతురత, నిద్రలేమి, మొదలగు లక్షములమీద నిది బాగుగాపనిచేయును. శరీరమానసిక పరిశ్రమలవలనవచ్చు రోగములను మాన్పును. అలవాటుపడినట్టి వృద్ధికమునిచ్చు పదార్థముల (బ్రాందీ, పుగాకు మొదలైనవి) కొరకు వాంఛగలిగియుండుట. శరీరవ్యాయామము చేయుచున్నప్పుడు వూపిరిచాలకపోవుట. ముసలివారిలోను, విస్తారముగా పుగాకు, విస్కీ, మొదలగువాటిని వుపయోగించువారిలోను, వూపిరి అందకపోవుట,

కంఠధ్వని గద్గదస్వరము పడుటను మాన్పును. ఇది వుపన్యాసమిచ్చువారికి, సంగీతముపాడువారికి ఎక్కువ వుపయుక్తమైనది.

తల:—పర్వతము నెక్కుటవలన తలతిరిగి, మూర్ఛ నొందుట. చెవులలో ధ్వనులువినిపించుచుండుట. వాలుకవ్రాతను మాన్పును. వుప్పిపండ్లగుటను ఆపుచేయును.

అన్నకోశము:—వుబ్బరించుట. తీపిపదార్థములనే కోరుట.

పురుషావయవములు:—నపుంసకత్వము (యాసిడ్ ఫాసు)ను, మధుమూత్రమును, శుక్లనష్టమును మాన్పును.

స్త్రీ అవయవములు:—బహిష్టులో, స్రావమువలన గాఢనిద్రనుండి మెలకువనొందుట. బహిష్టులోను, ప్రసవించినపిమ్మటను, సంభోగవాంఛ యెక్కువగా కలుగుట.

శ్వాసావయవములు:—గొంతుక బొంగురుపోవుట, శ్వాసాయవము నుండి రక్తస్రావమగుట. వుబ్బసవుదగ్గు విడిచివిడిచివచ్చుట.

వుద్రేకము:—యెత్తుయెక్కుటవలన.

వుపశమనము:—బ్రాందీ తాగుటవలన, స్వారిచేయుట.

విరుగుళ్లు:—జెల్సిమియం.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 78. కాక్యులసు. COCCULUS.

(హిందూదేశపు ఔషధము 24. కాకమారి-కాకిదొండ).

ఇది స్త్రీలయొక్కయు, పిల్లలయొక్కయు, రోగములమీదను, నిస్త్రాణను మాన్పుటలోను, బాగుగాపనిచేయును. నిస్త్రాణ యేకారణముచేత కలిగినను, యే అవయవములలో కలిగినను, దీనిని వాడవచ్చును. యెల్లప్పుడును పుస్తకములను చదువుచుండువారికిని, సున్నితమైన ఆడపిల్ల

లలో బహిష్టు రోగములు గలిగినప్పుడును, వ్యభిచారిణులకును, హస్తప్రయోగాది దురభ్యాసములకు లోనయినవారికిని, అధిక సంభోగముచేత శరీరస్థితి పాడైనవారికిని, యిది చాల వుపయోగపడును. బండిలో స్వారిచేయుట వలనను, బండిలోను, పడవలమీదను, రైలులోను, ప్రయాణము చేయుట వలనను, ఒకప్పుడు కదులుచున్న పడవను చూచుటవలనను, వచ్చుతలతిప్పు వమనములను, తలనొప్పిని కట్టును. త్రాగుబోతులలో కలుగు రోగలక్షణములు, ఆకలి లేకపోవుట, రుచిపాడగుట, కాలక్షేపము చాలత్వరితముగా నగుట (కాలక్షేపమవనపుడు కెన్నబిస్ ఇండికా, ఆర్జంటం నైట్రికం వుపయోగించవలెను). శరీరములో దారుఢ్యము తక్కువగానుండుటచేత సరిగా నిలుచుండుట బహుకష్టముగానుండుట. మరియు గట్టిగామాట్లాడుటకు కూడ శక్తి చాలకపోవుట. నిద్రలేమివలన వచ్చు రోగలక్షణములమీద నిది బాగుగా పనిచేయును.

మనస్సు:—ఇతరులయొక్క దేహారోగ్యమునుగురించి ఆతురత జెందుట. యెక్కువ విచారగ్రస్తముగా నుండుట. తొందరగా మాట్లాడుట, తానుచెప్పినది యితరులు కాదనుటను భరింపలేకపోవుట. ఆలోచనలలో మునిగిపోవుట.

తల:—ఖాళీగాయున్నట్లుతోచుట. నడినెత్తిని, తలవెనుకను, నొప్పిగాయుండుట. త్రాగినవానివలె తలతిప్పు, వమనానుమానము, పడకనుండి లేచునప్పుడు వుండుట, యిందువలన పరుండవలసివచ్చుట. ఆహారము తీసికొనుట వలనగాని పానీయములు త్రాగుటవలనగాని కంగారు, మైకము, యెక్కువగుట, వమనానుమానముతో గూడిన తలనొప్పి. తలనొప్పి బహిరంగమైన గాలిలోను, పరుండినపిమ్మటను యెక్కువగుట. తలనొప్పి విశ్రాంతివలనను, వెచ్చని గదిలోను, వుపశమించుట. మెడలోని కండరములలో బలము లేకపోవుట, తలకు కంపమువచ్చుట.

కండ్లు:—చితుకకొట్టినట్లుండు నొప్పివలన రాత్రియందు కండ్లు తెరచుట కష్టముగానుండుట. దృష్టిమాంద్యమును చూన్పును. కొలదిసేపు

చదివినపిమ్మట అక్షరములు అలుముకుపోయినట్లు కనపడుట.

చెవులు:—నీళ్లు పడిగాపారుచున్నట్లు ధ్వనివినిపించుట. కష్టము మీదగాని మాట వినపడకపోవుట.

ముక్కు:—ముక్కునుండి రక్తమువలెను చీముపలెను స్రావము వచ్చుట. వాసనసరిగా తెలియకపోవుట.

ముఖము:—యెఱ్ఱగాను, వెచ్చగాను, పొంగరించియుండుట.

నోరు:—ఆర్చుకొనిపోవుట. నాలుకమీద తెల్లని లేక పసుపుపచ్చని పూతయుండుట. దాహము లేకుండుట. ఆహారము నములుచున్నప్పుడు పుప్పి పండ్లలో నొప్పివచ్చుట. పండ్లుకదలుట. ఇగుళ్ళుబ్బుట. నాలుకకు పక్షవాతమువచ్చినట్లుండుట. నాలుకను చాపినయెడల నాలుక మొదట యెక్కువ బాధగాయుండుట.

అన్నకోశము:—చల్లని పానీయమును, బీరును, త్రాగగోరుట. అహారపానీయములందును, పుగాకుయందును. హితవులేమి, రుచిచేదుగాను పుల్లగాను ఒకప్పుడు కుళ్ళిన రుచిగాను, గంధకపురుచిగాను, యుండుట. ఆహారపు రుచి, వాసన, కిట్టకపోవుట. కడుపులో పొడుచుచున్నట్లును, బిగపట్టినట్లును, నులిమివేయుచున్నట్లును, నొప్పిగానుయుండుట. కడుపు ఖాళీగాయున్నట్లు తోచుట.

పొత్తికడుపు:—పొంగరింపు, వాయువు వెడలిననువుపశమనము లేకుండుట. మరియు దగ్గినయెడల బాధయెక్కువగుట. కండరములలో నీరసము గానుండుట, గిలక బయలుదేరునేమోయని తోచుట.

మలము, మలాశయము:—పగలు పచ్చని పసుపుపచ్చని నీళ్లవిరేచనములు అగుచుండుట. గట్టిగాను, వెలుపరించుటకు కష్టముగానుండు విరేచనము 2 దినములకొకసారిఅగుచుండుట. మలాశయము వెలుపలికి వచ్చుట.

పురుషావయవములు:—అండములు మురడగాను, నొప్పిగాను యుండుట. సంభోగేచ్ఛ యెక్కువగాకలుగుట.

స్త్రీఅవయవములు:—ఋతువు చాలముందర గాను, కూలిగాను, కడుపు వుబ్బరింపుతో వచ్చుట. ఛాతీలో ముడుచుకొనిపోవుచున్నట్లుండుబాధ. తలతిప్పు, వికారము, మూర్ఛజెందుట, ఈలక్షణములు బహిష్టు అశించిపెట్టబడుటతోపాటు యుండుట. ఋతుశూల, బహిష్టులో నున్నప్పుడు అతినిస్త్రాణ, యిందువలన నిలుచుండుటకును, మాట్లాడుటకు నుకూడ, అతిసీరసముగా నుండుట. ఋతుస్రావమునకు బదులుగా చీము, దుర్వాసనతోగూడి, కడుగునీళ్ళనుపోలి కుసుమవెడలుట.

శ్వాసావయవములు:—కంఠనాళము ముడుచుకొనిపోయినట్లుండుటవలన వూపిరిఅందకపోవుట. ఛాతీలో మంటగానుండుట, ఇది గొంతుక వరకు వ్యాపించుట. గుండెదడ.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—మెడలోని కండరములలోను, నరములలోను నీరసమువలన తలను సమముగాయెత్తియుంచుట కష్టముగా నుండుట. తలనుకదల్చునపుడు వెన్నెముక పైభాగమందు కరుక్కుమని శబ్దము వినిపించుట. నడుమునకు పక్షవాతములోవలె నొప్పిపట్టుట. మెడలో నొక్కుచున్నట్లు నొప్పిగాయుండుట. నడచుచున్నప్పుడు మోకాళ్లలో కరుక్కుమని శబ్దమువచ్చుట. దిగువ అవయవములలో నీరసముగా నుండుట. చేతులు ఒకసారి వెచ్చగాను మరొకసారి చల్లగాను వుండుట.

నిద్ర:—యెక్కువగా ఆవలింతలు వచ్చుచుండుట. రాత్రియంతయు మేలుకొనుట. ఆతురతవలనను, శరీరమునకు విరామము తక్కువగా నుండుటవలనను గలుగు నిద్రలేమి. రాత్రియంతయు భయంకరమైనట్టికలలు. దయ్యములు, భూతములు, వీటినిగురించి రాత్రియందు భయముకలుగుట. నిద్రలేమివలనవచ్చు రోగలక్షణములనన్నిటిని యిది మాన్పును.

చర్మము:—కట్టుకొనిన వస్త్రమును సాయంకాలము తీసివేసినచో యెక్కువ దురదగానుండుట. పుండ్లను ముట్టుకొనిన యెక్కువ బాధగా నుండుట. మాంసగ్రంథులలో కుట్టుచున్నట్లుండు బాధలు, వాపులు.

జ్వరము:—చలి. పొట్టలో వాయువుజేరుటవలనవచ్చు శూల,

తలతిరిప్పు, వికారము, దిగువఅవయవములు చల్లగానుండుట, తలవెచ్చ గానుండుటతో గూడిన జ్వరము. చెమట. శరీరము వెచ్చగానుండుట. ఒకమారు చలిగాను, ఒకమారు వెచ్చగానుయుండుట. సన్నిపాతములో గ్రహింపుశక్తి తక్కువగానున్నప్పుడు యిది బాగుగాపనిచేయును.

వృద్ధికను:—నిద్రవలన, పొగతాగుటవలన, తినుటవలన, బండిలో ప్రయాణము చేయుటవలన, బహిష్టులో, గర్భిణిలో, తాగుటవలన.

ఉపశమనము:— గోకుటవలన, కదలికవలన, జేర్లబడికూర్చుండుట వలన.

విరుగుళ్ళు:—కాఫీ, నక్సవామికా, కేంఫరు. ఇగ్నీషియా, కేమొమిల్లా, మెర్క్యూరియసు, కుప్రం మెట్.

దీనికిముందుగాని వెనుకగాని కాఫీనివాడరాదు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. 6, 12 పొటెన్సీలు బాగు గాపనిచేయుచున్నవి. డాక్టరు హానిమాన్ గారు 12 వ పొటెన్సీ మంచిదని వ్రాసిరి. దీనిగుణకాలపరిమితి 8—14 దినములు.

---

## 79. కాఫీ. COFFEA CRUDA.

(హిందూదేశపు ఔషధము. 25. కాఫీగింజలు).

ఇది పొడుగుగాను, సన్నముగాను, దేహచ్ఛాయనల్లగాను, గలవారి యొక్కయు, ముందుకువంగినదుచువారి యొక్కయు, రోగములమీద బాగుగాపనిచేయును. రోగి ఇంద్రియజ్ఞానము (చూచుట, వినుట, వాసన, రుచి, తాకుట మొదలైనవి) నుయెక్కువగాకలిగియుండుట. శారీరమానసిక పరిశ్రమ యెక్కువగాగలవారి తత్వములమీద బాగుగా పనిచేయును. రోగి వృద్ధికమువలన నిద్రలేకయుండుట. అస్థిమితముగానుండుట. నరములసం బంధమైన బాధలకోర్వలేక నిరాశజెందుట. ఆకస్మికముగావచ్చు సంతోష ము, హాశ్చర్యము, మనోవికారము, వలనగలుగు దుష్టలక్షణములనుమాన్పును.

మనస్సు:—ఇంద్రియజ్ఞాన మెక్కువగానుండుట. కులాసాగానుం డుట. చిరచిరలాడుచుండుట. సులభముగా ప్రదేశ్రకము జెందుట. యెక్కువ ఆలోచనలు తోచుచుండుటవలనను, మానసికోద్రేకమువలనను, మెలకువ జెందియుండుట. బాధవలన అటునిటు తిరుగుచుండుట (ఎకొనైట్). అపస్మారములో ఒకసారియేడ్చుట, మరియొకసారినవ్వుట,

తల:—తలతిరుగుచున్నట్లుండుట. వికారముగా నుండుట. దీనిని తలచినకొలది బాధయెక్కువగానుండుట. తలలో నేదియో గుండ్రముగా తిరుగుచున్నట్లుగా యుండుట. అప్పుడు చెవులలో మావనటువంటి ధ్వను లు వినిపించుచుండుట. యెక్కువబాధతోగూడిన తలనొప్పి, యిది కదలిక వలన హెచ్చగుట. తలలోనికి మేకునుదిగకొట్టినట్లు నొప్పిగావుండుట. మెదడును చీల్చివేసినట్లుండు తలనొప్పిని మాన్పును.

ముఖము:—పాలిపోయి, పొంగరించి, ఆతురతజెంది యుండుట. క్రొవ్వువత్తిదీపమును చూచుట కష్టముగానుండుట. దీపముచుట్టును పరిధి కనుపించుట. కండ్లయెదుట మబ్బుగానున్నట్లు తోచుట. చప్పుడు వినుట చాలకష్టముగా తోచుట. చెవులలో వివిధములైన ధ్వనులు వినిపించుట. ముఖము వెచ్చగాను దౌడలు యెర్రగాను యుండుట.

నోరు:—నోటిలో కుడిసైపుపంటిలోపోటు. అమితమైనబాధవలన మతిచెడినట్లుగానుండుట. అట్టిబాధలో చన్నీళ్లుతప్ప మరియేదిన్ని వుపశ మనమివ్వకపోవుట (క్లెమేటిస్). ఇట్టిబాధలు వచ్చినప్పుడు చన్నీటినిగాని మంచుగడ్డకలసిన నీటినిగాని నోటిలో పట్టివుంచినయెడల బాధ వెంటనే వుపశమించును. గాని ఆనీరు వేడియైనవెంటనే పంటినొప్పి తిరిగివచ్చుట (బిస్మత్, బ్రయోనియా, క్లెమేటిస్, నేట్రంసల్ఫ).

అన్నకోశము:—యెక్కువ ఆకలిగానుండుట.

పొత్తికడుపు:—పొడుచుచున్నట్లు బాధగానుండుట.

మలము, మలాశయము:—మూలశంఖవలన సిగనిగలాడుచుండు యె ర్రరక్తము ప్రతివుదయమున మలముతోపాటు వెడలుచుండుట.

మూత్రావయవములు:—మూత్రమువిడిచినపిమ్మట పాలవలె స్రావము కొద్దిగా వెడలుట.

పురుషావయవములు:—సంభోగశక్తి తక్కువగానుండుట. మర్మావయవములలో యెక్కువ దురదతోగూడి తెల్లవారుఝామున 3 గంటలకు స్ఖలనమగుట; దీనిపిమ్మట చలి, వణకువచ్చుట, బంకగానుండెడు చమట పోయుట.

స్త్రీ అవయవములు:—ఋతువు బహుత్వరగానగుట, స్రావము చాలదినములవరకును వుండుట. ఋతుశూలవున్నప్పుడు నల్లనిముద్దలవంటి స్రావము వెడలుచుండుట. మర్మావయవములో యెక్కువగుల గలుగుట, ప్రసవవేదన భరింపశక్యము కానట్లుండుట.

శ్వాసావయవములు:— ఉబ్బసపుదగ్గు, దీనిలో ఛాతీని నొక్కుచున్నట్లుండుట, వూపిరందకపోవుట. నీరసముగానుండు పిల్లలకు పొంగులో వచ్చు పొడిదగ్గును మాన్పును.

హృదయము:—గుండెదడ. చిరచిరలాడుట. యెక్కువ ఖులాసావలనను, హాశ్చర్యము నొందుటవలనను, నాడి వక్రముగా కొట్టుకొనుట. మూత్రము అణచిపెట్టబడుట, నాడి వడిగాను నిండుగాను వుండుట.

కాళ్లు, చేతులు:—వణకుచుండుట, నరముల సంబంధమైన బాధలు కదలికవలన వుద్రేకించుట, మరియు నొక్కుటవలన, లేక మర్దించుటవలన వుపశమించుట.

నిద్ర:—నిద్ర అసలేలేకుండుట. కలలలో ప్రియమిత్రులును, చనిపోయినవారును కనుపించుట.

జ్వరము:—చలి, కాలిబొటనవ్రేలినుండి, పైకి నడినెత్తివరకును యెగబ్రాకుట. యెక్కువ వెచ్చగా నుండుట. ఒకమారు చలిగాను, ఒకమారు వెచ్చగానుయుండుట. రెండురోజులకొకసారి వచ్చునట్టిజ్వరము.

ఇది బాధమాన్పుటలో ఎకొనైటు, కేమోమిల్లాలకన్న బాగుగా

పనిచేయును. నిదర్శలేమిని మాన్పును. పొక్కపునొప్పులమీద బాగుగా పనిచేయును. వేసవిలో ప్రయాణము చేయుటవలనకలుగు అలసటను మాన్పును. నీళ్ళవిరేచనములగుటను కట్టును. హిస్టీరియాలేక అపస్మారము చే బాధపడు స్త్రీలతలనొప్పులను మాన్పును.

వృద్ధిక్రమ:—సంతోషమువలన, వృద్ధిక్రమునిచ్చు పదార్థములవలన, గాఢమైన వాసనవలన, ధ్వనులవలన, బహిరంగమైన గాలియందు, రాత్రియందు.

వుపశమనము;—వెచ్చదనమువలన, పరుండుటవలన, మంచుగడ్డను గాని చన్నీటిని గాని నోటిలో వుంచుటవలన.

సహచరులు:—ఎకొనైట్.

విరుగుళ్లు:—నక్సువామికా, టభాకం, పల్సటిల్లా, ఇగ్నేషియా, మేర్క్యూరియస్, కేమోమిల్లా.

కోలొసింథిస్, నక్సువామికా, కేమోమిల్లా, సోరినం—లకిదివిరుగుడు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. నిదర్శలేమికి 200 పొటెన్సీ వాడనగును. దీని గుణకాలపరిమితి 1 లేక 2 దినములు.

---

## 80. కోల్చికం. COLCHICUM.

ఇది ముఖ్యముగా మేహవాత తత్వములమీదను, దృఢశరీరులకును, ముసలివారికిని, వచ్చురోగములమీదను పనిచేయును. బాధలు-చీల్చుచున్నట్లును, గుచ్చుచున్నట్లును వుండుటను యెక్కువగా మేలుకొనుటతో, చదువుటతో, చెమటనుఅణచిపెట్టుటతోవచ్చిన రోగలక్షణములనిది మాన్పును.

మనస్సు:—ఏవిషయములోను తృప్తిలేకపోవుట. జ్ఞాపకశక్తి తక్కువగానుండుట. విశ్రాంతియందు యెక్కువగా కోరికగలిగియుండుట. మానసికపరిశ్రమయందు యిష్టములేకయుండుట. పరధ్యానముగా నుండుట.

తల:—వడచినపిమ్మట కూర్చున్నప్పుడు తల దిమ్ముగానుండుట. తలనొప్పి రాత్రి భోజనానంతరమునను, వెచ్చదనమువలనను, స్థిమితముగా పరుపుమీద పరుండుటవలనను తగ్గుట. ముచ్చిలిగుంటలోను, నుదుటియందును నొప్పి మధ్యాహ్నమందును సాయంకాలమునను యెక్కువగుటను మాన్పును. బహిరంగమైన గాలిలో కండ్లనుండి నీరుకారుచుండుట, చీల్చుచున్నట్లు బాధగానుండుట. కండ్లలో పుప్పులు బయలుదేరుట.

చెవులు:—దురదగానుండుట. పొడుచుచున్నట్లు బాధగానుండుట, చీమువచ్చుచుండుట, ఆర్చుకొనిపోవుట, హోరుగానుండుట.

ముక్కు:—ముక్కుయెముకలో నొప్పిగానుండుట, సాయంకాలము ముక్కునుండి రక్తము స్రవించుట.

ముఖము:—బాధవలన యెక్కువ చిరచిరలాడుచుండుట (కేమోమిల్లా). జబ్బుచేసినవానివలెను, విచారగ్రస్తముగానున్నట్లును, బాధపడుచున్నట్లును, పాలిపోయి కనుపించుట.

నోరు:—వెచ్చగానుండుట. నాలుకమీద తెల్లనిపూత గలుగుట, లాలాజలమెక్కువగా వూరుట. నాలుక, గొంతుక ఆర్చుకొనిపోయి చురుక్కుమని నొప్పిగానుండుట. ఇగుళ్లలో బాధ, పండ్లుపోట్లుగా నుండుట.

గొంతుక:—వాచుట, బొంగురుపోవుట, గొంతుకలోను నోటిలోను ఆకుపచ్చని ఆమముజేరుట.

అన్నకోశము:—భోజనము, లేక, అన్నము, ముఖ్యముగా చేపలు, వీటియందెక్కువ అయిష్టత, వీటివాసనయైనను కిట్టకపోవుట. కదలికవలన తినిన ఆహారము, పైత్యరసము, ఆమము, వమనము చేసికొనుట. తినుటకు చాలవస్తువులను కోరినను వాటివాసన తగిలినయెడల వికారము, వమనము వచ్చుట. మంటగాను ఒకప్పుడు మంచువలె చల్లగాను యుండుట. కదలినపుడెల్ల వమనములగుచునే యుండుట.

పొత్తికడుపు:—జలోదరము. గాలిజేరుటవలన వుబ్బరించియుండుట. చీల్చుచున్నట్టు బాధతోనుండు శూలను మాన్పును.

మలాశయము;—విరేచనములు యెక్కువ బాధగాను, కొద్దిగాను, జిగటకలసి వెడలుచుండుట. శరదృతువులో వచ్చు జిగటవిరేచనములు. మలాశయము వెలుపలకువచ్చుట. విరేచనబద్ధము.

మూత్రావయవములు:—మూత్రము అణచిపెట్టబడుట లేక కొద్దిగాను, నల్లగాను, ఒకప్పుడు రక్తముతో కలసియు, సిరావలెను, గోధుమ వర్ణముగాను, చెడినరక్తము, శ్వేతధాతువు, చక్కెరతో పోవుచుండుట. స్వచ్ఛమైన మూత్రము యెక్కువగాను అతితొందరగాను వెడలుట.

శ్వాసావయవములు:—శ్వాసనాళములో గిలిగింతలు పెట్టుచున్నట్లుండుట. సప్తపథలో గిలిగింతలు పెట్టుచున్నట్లుండుటచే పొడిదగ్గువచ్చుట. రాత్రియందు దగ్గునప్పుడు అప్రయత్నముగా మూత్రము వెడలుట, వుదయమున గొంతుక బొంగురుపోవుట, శ్వాసతీసుకొనుట కష్టము.

స్త్రీఅవయవములు:—దురదగానుండుట, వాచుట, బహిష్టుకుపిమ్మట తొడలలో చల్లగానున్నట్లు తోచుట.

హృదయము:—హృదయము పైపొరలోవాపు, యెక్కువబాధ, నొక్కుచున్నట్లుండుట, వూపిరందకపోవుట. నాడినీరసించి సన్నగా ధారమువలెనుండుట. ఎక్కువ ఆతురతగానుండుట.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:— మెడలోని కండరములలో కలుగు మేహవాతనొప్పులు, నడుమునొప్పి, ఇవి విశ్రాంతివలనను నొక్కుట వలనను వుపశమించుట. వ్రేళ్లలోను, గుత్తెలలోను, చీలమండలలోను, మో కాళ్లలోను, మోచేతులలోను వచ్చు మేహవాతనొప్పులు. కీళ్లసంధులలో నొప్పులుగానుండుట, నొప్పులు తరుచు ఒక అవయవములోనుండి మరియొక అవయవములోనికి మారుచుండుట. అవయవములలో బాధలు వేసవిలో చీల్చుచున్నట్లుండుట, మరియు శీతకాలములో కుట్టుచున్నట్లుండుట. బాధలు రాత్రియందు యెక్కువగుట. కీళ్లసంధులువాచి వెచ్చగానుండుట. కాళ్లు, పాదములు వుబ్బి, చల్లగానుండుట, లేక నీరుపట్టుట.

నిద్ర:—పగలునిద్రమత్తుగానుండుట. నరములవుద్రేకము వలని నిద్రలేమి. తరుచునిద్రలో భయమువలన మెలకువజెందుట.

చర్మము:—మచ్చలు, దద్దురులు, ముఖ్యముగా ముఖముమీద బయలుదేరుట. వీపుమీద, ఛాతీమీద పొట్టమీద, యెగ్రిమచ్చలులేచుట.

జ్వరము:—చలి, చేతులలోను, కాళ్లలోను, వీపులోను, పాకు చున్నట్లుండుట. దాహము రాత్రియందు యెక్కువగానుండుట. ఒకప్పుడు వెచ్చదనము, ఒకప్పుడు చెమటయుండుట.

వుద్రేకము:—సూర్యాస్తమయము మొదలు సూర్యోదయమువరకు, కదలికవలన, నిద్రలేమివలన, సాయంకాలమునందు, ఆహారపువాసన తగులుటవలన, మానసికపరిశ్రమవలన.

వుపశమనము:—ముందరకువంగుటవలన, విశ్రాంతివలన, బహిరంగమైన గాలిలో.

విరుగుళ్ళు:—కేంఫరు, కాక్యులసు, నక్సువామికా, పల్సటిల్లా.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సి. దీని గుణకాలపరిమితి 3 లగాయతు 4 వారములు.

---

## 81. కొలిన్సోనియా. COLLINSONIA CANADENSIS.

పొత్తికడుపులోను, చట్టలోను, రక్తాధిక్యమగుటతో, మూలశంఖ, మలబద్ధము, బుతుశూల కలిగినప్పుడు దీనిని వాడవలయును. హృదయరోగమువలనవచ్చిన వుబ్బువ్యాధిమీద పనిచేయును. హృదయము వడిగాకొట్టుకొనుచున్నను నిస్త్రాణజెందియుండుటను, అజీర్ణము, మూలశంఖ వలనబాధపడురోగములలోవచ్చు గుండెదడనుమాన్పును. ఆసనమును సంబంధించిన రోగముల శస్త్రచికిత్సకుముందు దీనిని వాడుటవలన యెక్కువ వుపయోగమూకలుగును. దుష్టరక్తనాళములవాపుతోగూడిన రోగములమీద బాగుగా పనిచేయును.

తల.—నుదుట దిమ్ముతోఁగూడిన తలనొప్పి. ఇది మూలశంఖ వ్యాధిని అణిచిపెట్టుటవలన కలుగుట. నాలుకపై పసుపుపచ్చని పూతగలుగుట. రుచిచేదుగానుండుట (బ్రియోనియా, కొలోసింథిస్). మనస్సు విచారముతో నిండియుండుట.

ముఖము:—యెర్రబారి వెచ్చగానుండుట. పెదవులు మొద్దుబారియుండుట. నాలుకమీద తెల్లని పూతగలుగుట. ఆకలిలేమి. నోరుచేదు.

అన్నకోశము, పొత్తికడుపు:—తలత్రిప్పు, అన్నకోశములో పోట్లు. పొత్తికడుపులో వాయువు యెక్కువగా చేరుటవలని శూల.

ఆసనము:—మూలశంఖను సంబంధించి, తీపుతోఁగూడిన జిగటవిరేచనములు. ఒకప్పుడు నీళ్ళవిరేచనములు, మరియొకప్పుడు విరేచనబద్ధముయుండుట, మలము గట్టిగానుండుట, అపానవాయువు వెడలుటతోఁగూడిన విరేచనబద్ధము, చాలకాలమునుండి నిలువగాయున్న మూలశంఖ, ఇది యెక్కువబాధగానుండుట, దీనినుండి రక్తముస్రవించుచుండుట, వాడియైన పుడకలు, ఇసుక లేక చిన్నచిన్నరాళ్లు, ఆసనములో వున్నట్లుండుట(ఎస్కులస్‌హిప్). పిల్లలలో ఆంత్రముల నిస్సత్తువ వలనవచ్చు మలబద్ధమును మాన్పును. మలము అర్చుకుపోయి వెడలుట. ఆసనములోపోట్లుగాను, దురదగాను వుండుట (ట్యూక్రియంమారంవీరం, గతన్మియా).

పురుషావయవములు:—మూలశంఖ, మలబద్ధము మానుపరకును శుక్లనష్టము మానకుండుట.

స్త్రీ అవయవములు:—గర్భిణీస్త్రీలలో మర్మావయవములో దురదతోఁగూడిన మూలశంఖ, దీనివలన పరుండుట కష్టముగానుండుట. ఋతుశూల. మర్మావయవముకు చీమపట్టినట్లు దురదగానుండుట. గర్భాశయము వెలుపలికివచ్చుట. మర్మావయవము వాచి యెర్రగానుండుట, కూర్చొనుటవలన నొప్పిగానుండుట.

శ్వాసావయవములు:—పుపస్ఫాసము లిచ్చుటవలనవచ్చుదగ్గు, గొం

తుక బొంగురుతనము, స్వరపేటికలో నొప్పి. రక్తస్రావము, ఆసనములో ని బాధలతోగూడియుండు శ్వాసావయవ రోగములు.

హృదయము:—హృదయలక్షణములు వుపశమించినపిమ్మట యిది వరలో బాధనుకలుగజేసిన మూలశంఖ తిరిగి కనబడుట, లేక, అణచిపెట్ట బడిన బహిష్టు తిరిగి కలుగుట. కేక్టసు, డిజిటాలిసుమున్నగు యౌషధములు మూలశంఖతో ద్వందముగాయున్న హృదయరోగముమీద పనిచేయనపుడు, దీనిని వాడవలయును. ఒకప్పుడు ఛాతీలోనొప్పిగా నుండుట. మరియొక ప్పుడు బాధ హెచ్చుగానుండుట.

కొలోసింథిన్, నక్సువామికా, వీటివలన కుదర్చబడని శూలలు దీని వలన కుదర్చబడినవి.

వుద్రేకము:—మానసికోద్రేకమువలన (అర్జంటంనైట్రికం), చల్ల దనమువలన.

వుపశమనము:— వెచ్చదనమువలన, ఉదయమున.

పోల్చదగినవి:—ఎస్కులస్‌హిప్, ఎలోసు, కేమోమిల్లా, నక్సువా మికా, సల్ఫరు, హెమామెలిసు, నిగడియం ఆమెరికానం.

విరుగుళ్లు:—నక్సువామికా.

మోతాదు:—టించరు మొదలు 200 పొటెన్సీ. హృదయరోగముల మీద పెద్దపొటెన్సీలు బాగుగాపనిచేసినవి.

---

## 82. కోలోసింథిస్. COLOCYNTHIS.

(హిందూదేశపు ఔషధము. 26 చేదుపుచ్చ)

ఇది పొత్తికడుపు, తలకు, సంబంధించిన రోగములమీద బాగుగా పనిచేయును. శూలను మాన్పును. చిరచిరలాడుస్వభావముగలవారి రోగము లమీదను, బహిష్టులో యెక్కువస్రావము వెడలుచుండునట్టియు శరీరపరి

శ్రమ లేనట్టియు, స్త్రీల వ్యాధులమీదను, శరీరమునకు క్రొవ్వు పట్టుచున్నవారియొక్కయు, రోగములమీదను బాగుగా పనిచేయును. నొక్కుట వలనను వెచ్చదనమువలనను, శరీరమును మెలితిప్పుటవలనను నొప్పులు, బాధలు వుపశమించుట. మరియు నివి విశ్రాంతివలన యెక్కువగుట. బాధలు తెరలు తెరలుగా వచ్చుచుండుట, జిగటవిరేచనములు వెడలుట. బాధలు నొక్కుచున్నట్లుగాను, కోయుచున్నట్లుగాను, నులిమివేయుచున్నట్లుగాను, చితుకకొట్టినట్లుగాను, ముడుచుకొని పోవునట్లుగాను, ఇనుపబద్దీచే బిగించి కట్టబడినట్లుగాను వుండుటయు దీని ముఖ్యలక్షణములు.

మనస్సు:—ప్రశ్నించినయెడల కోపమువచ్చుట. అనాదరణము వలన కోపమునచ్చుట (బ్రియోనియా, కేమోమిల్లా, నక్సువామికా). మాట్లాడుటయందును స్నేహితులను చూచుటయందును అయిష్టత.

తల:—తలను యెడమవైపుకు త్రిప్పుటవలన తలతిప్పు వచ్చుట. మంటలుగాను, త్రివ్వుచున్నట్లును, చీల్చుచున్నట్లును నొప్పిగాయుండుట. వంగుటవలనను, వీపుమీద పరుండినప్పుడును, కనురెప్పలను కదల్చుటవలనను, నుదుటియందును నొప్పివచ్చుట. తల వెచ్చగా నుండుట.

కన్నులు:—మంటగాను, కోయుచున్నట్లు బాధగాను వుండుట. మేహవాతమువలన వచ్చు బాధలను మాన్పును.

ముఖము:—పొంగరించి ఎడమవైపు నొప్పిగానుండుట. నొక్కుట వలన బాధ వుపశమించుట (చైనా), మరియు నిది తాకుడువలనను, కదలికవలనను, వుశేకించుట. పార్శ్వపునొప్పి చలితోగూడియుండుట. అన్నకోశములో బాధ. పంటిపోటు. తలలోని బాధలకు సంబంధించుట.

చెవులు:—ప్రతిధ్వనులు వినపడుట. ఎడమచెవిలో బాధ.

ముక్కు:—పడిశెము పట్టుట. స్రావము బహిరంగమైన గాలిలో యెక్కువగుట.

నోరు.—నాలుక మీదపూత తెల్లగాను, పసుపుపచ్చగాను, నాలుక చివర చీల్చివేసినట్లు మంటగాను, యుండుట. వగుళ్లలో లాగుచున్నట్లు వుండు పంటినొప్పి.

అన్నకోశము:—రుచిచేదుగాను, తీసికొనినఆహారము, పానీయము, పీటెరుచులకు, సంబంధించియు యుండుట. వుబ్బరముగా నుండుట. భోజనానంతరము శూల వచ్చుట. రొట్టెను, బీరును తీసికొనవలెనని కోరిక యుండుట. నులినొప్పి రాత్రియందు త్రేణుపులు వచ్చిన పిమ్మట వుపశమించుట. పైత్యరసమును, తినినఆహారమును వమనము చేసికొనుట. ఒకే సారి వమనములు, విరేచనములు వుండునప్పుడిది వుపయోగపడును.

పొత్తికడుపు:—తిమ్మిరివాయువువలని బాధ నొక్కుటవలన ఎక్కువగుట. ఉబ్బరముగానుండి బాధగానుండుట. ప్రేగులను రాళ్లమధ్యనుంచి నులిమివేయుచున్నట్లుగా పొత్తికడుపులో నుండుట. గజ్జలలోని గిలకలో వలె బాధగా నుండుట నొక్కుటవలన యీబాధ వుపశమించుట. కాఫీని త్రాగుటవలనను, చుట్టత్రాగుటవలనను, అంత్రములలోని బాధలు వుపశమించుట. అవి తప్ప తక్కువ ఆహారపానీయములవలన బాధలు వుద్రేకము జెందుట. కోయుచున్నట్లు అపరిమితమైన బాధగానుండుటవలన రోగి తన శరీరమును నులిమివేసినరీతిని వంచుకొనుటవలనను, మరియు పొత్తికడుపును నొక్కుకొనుటవలనను వుపశమనము జెందుట. అంత్రములలో నలుగకొట్టినట్లు నొప్పిగా యుండుట. శూలతోపాటు పిక్కలలో తిమ్మిరిగాను, నొప్పిగాను, లాగుచున్నట్లును వుండుట. అంత్రములలో గురుగురుమని శబ్దము వినిపించుట, లేక ప్రేగులు అరచుట.

మలాశయము:—తరుచు విరేచనానుమానము. పల్చనివిరేచనములు జిగటోకూడి, ప్రతిసారియు ఆహారపానీయములు తీసికొనినపిదప, వెడలుచుండుట. మలము పల్చగాను, నురగగాను జిగురుగాను, దుర్వాసనతోను, రక్తముతోనుకలసి, తీపు, బాధతో వెడలుట. మూలశంఖ వాచి విరేచనముతో అపానవాయువు యెక్కువగా వెడలుట.

మూత్రావయవములు:— మూత్రము విడుచునప్పుడు పొత్తికడుపులో నొప్పిగాయుండుట. మూత్రము చిక్కగాను, గోధుమవర్ణముగాను, దుర్వాసనతోను, మడ్డివంటిపదార్థముతోనుకలసివెడలుట. తరుచు మూత్రనుమానమెక్కువగానుండినను మూత్రము కొద్దికొద్దిగా వెడలుట. విరేచనమగుచున్నప్పుడు మూత్రనాళములో యెక్కువమంటగానుండుట.

పురుషావయవములు:— నపుంసకత్వము. తరుచు వీర్యస్ఖలనములు. సంభోగేచ్ఛ కొలదిగాయుండుట.

స్త్రీఅవయవములు:— అండాశయములో పొడుచుచున్నట్లు బాధగానుండుట. కోపమువలనగాని అవమానమువలనగాని బహిష్టు అణచిపెట్టబడుట. గర్భిణులలో తరుచు శూలవచ్చుచుండుట. ప్రసవానంతరము మైలఅణచిపెట్టబడుటవలన శూలవచ్చుట:

శ్వాసావయవములు:— ఛాతీలో నొక్కుచున్నట్లుండుబాధ. స్వరపేటికలో గిలిగింతలు పెట్టుచున్నట్లుండుటవలనను చుట్టపొగ వలననువచ్చు పొడిదగ్గును మాన్పును. రాత్రివచ్చునట్టి వుబ్బసపుదగ్గు ఫిట్టు.

హృదయము:— కుట్టుచున్నట్లుండు బాధ. గుండెదడ, నాడిపుష్టిగా, గట్టిగా, లేక నెమ్మదిగా, నీరసముగా యుండుట.

మెడ, నడుము, కాళ్ళు, చేతులు:— మెడ బిగపట్టినట్లుండుట. నడుములోను, దిగువఅవయవములలోను, సాయంకాలమందు చితుకకొట్టినట్లు నొప్పులుగానుండుట. చట్టలలో తిమ్మిరగాను మొద్దుబారినట్లునునొప్పిగాను యుండుట. నొప్పిగానున్నవైపు పరుండుటవలన బాధ వుపశమించుట. కీళ్లసంధులలో నొప్పిగాను, బిగపట్టినట్లును వుండుట.

చర్మము:— సాయంకాలమునందును, పరుండినప్పుడును, యెక్కువదురద. దురదతగ్గినపిమ్మట చెమటపట్టుట, రాచకురుపులలో మంట విడువకుండగ యుండుట. చర్మము వెచ్చగా, పొడిగా యుండుట.

నిద్ర:— బాధవలని నిద్రలేమి. ఒకప్పుడు నిద్రలేకుండగను, మరి

యొకప్పుడు పరాకుమాటలాడుచు, కండ్లుతెరచి నిద్రించుట శృంగారసంబంధమైన కలలువచ్చుట.

జ్వరము:—శరీరములో చల్లగానుండుట. తెల్లవారుఝామున మూత్రపువాసనగా చెమటపట్టుట. శరీరము వెచ్చగా పొడిగాయుండుట.

వృద్ధికము:—కోపమువలన, నిబ్బరముగా కూర్చుండుటవలన, విశ్రాంతివలన, జున్నుతినుటవలన.

వుపశమనము:—శరీరమును వంచుటవలన, వెచ్చదనమువలన, గట్టిగానొక్కుటవలన, కాఫీత్రాగుటవలన, కదలికవలన.

విరుగుళ్ళు:—కేంఫరు, కాష్టికం, కేమోమిల్లా, కాఫీ, సల్ఫరు. కాష్టికమునకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. పార్శ్వపునొప్పులలో 3, 6 పొటెన్సీలు బాగుగాపనిచేయును. అన్నకోశము, పొత్తికడుపుకు సంబంధించిన రోగములమీద 30, 200 పోటెన్సీలు బాగుగాపని చేయును. దీని గుణకాలపరిమితి 30 లగాయతు 40 దినములు.

---

## 83. కోనియం. CONIUM.

ఇది యాంటీసోరిక్ ఔషధము. ఇది ముసలివారి (ఆడువారు, మగవారు—పెండ్లి అయినవారు, అవనివారి) కి వచ్చురోగములమీద బాగుగా పనిచేయును. ఇట్టివారికి దేహదారుఢ్యముతగ్గి, శరీరమానసిక దుర్బలత్వము, గుండెదడ, వణకు, పుట్టపగ్రిణములు, ఏముకలు పొడగుట, మాంసగ్రంధులు గట్టిపడుట, నిద్రలేమి, పక్షవాతము, కీళ్లువంగకపోవుట, మూత్రావయపరోగములు, మనోచంచలత్వము, జ్ఞాపకశక్తితగ్గిపోవుట మొదలగు పలువిధరోగములమీదను, అన్నకోశములోగాని, కాలేయములోగాని బయలుదేరు పుట్టపగ్రిణముమీదనుబాగుగా పనిచేయును.

మనస్సు:—నలుగురిలో మసలుటకయిష్టత. మరియు ఒంటరిగా

నుండుటకు భయము జెందుట. మగతగానుండుట. పరాకుమాటలాడుచుండుట. యేదైనవ్యాపారము చేయుటయందుకాని, చదువుటయందుకాని, అయిష్టత, ఇతరులు సమీపమునందుండుట, మాట్లాడుచుండుట, కిట్టకపోవుట. మాట్లాడినయెడల, సమీపముననున్న వారిని పట్టుకుతిట్టవలయునని యుండుట. అన్నివిషయములందును అశ్రద్ధ.

తల:—పరుండినపుడు, తలనుగాని కండ్లనుగాని, ప్రక్కకుతిప్పినప్పుడును, లేక, పరుండినపుడు ప్రక్కకుతిరిగినను, తలతిప్పవచ్చుట. ఇది తలనుకదల్చుటవలనను చప్పుడువలనను, సమీపముననున్నవారి సంభాషణ వినుటవలనను, యెడమపార్శ్వమునందును, యెక్కువగుట. మెడవద్ద నొప్పిగానుండుట. తలవెంట్రుకలూడిపోవుచుండుట. అజీర్ణవ్యాధితో నుండు పార్శ్వపునొప్పి. నుదిటిలో పొడుచుచున్నట్లు బాధగానుండుట. కనుబొమలలో నొక్కుచున్నట్లు నొప్పిగా వుండుట. మరియు నిది భోజనానంతరము యెక్కువగుట (జెల్సిమియం).

కన్నులు:—దృష్టిమాంద్యము. కనుపాపలు పెద్దవగుట. దూరముగా నున్న వస్తువులు త్వరగా ఆనకపోవుట. కాచబింబముపైని చిన్న చిన్న పుండ్లు, మచ్చలు బయలుదేరుట. కండ్లకలకలను అంతరకుసుములను మాన్పును.

చెవులు:—గింగురుమన్నట్లు ధ్వనులు. గులిమి, రక్తమువలె ఎర్రగా వెడలుట. చీదునపుడు చెవులు గళ్లుపడుట.

ముక్కు:—సులభముగా రక్తము, చీము, స్రవించుచుండుట. కాయలు (Polypi) బయలుదేరుట.

ముఖము:—పాలిపోయి, మట్టిరంగుగాను, పొంగరించి యుండుట. పెదవులు ఆర్చుకుపోయి మంటగాయుండుట.

నోరు:— నాలుకవాచి శోథిగాను గట్టిగాను యుండుట. వేడి పదార్థములు తినునప్పుడు పుప్పిపండ్లలో బాధగానుండుట.

గొంతుక:—లోపలివైపు దురదగాను, ముడుచుకొనిపోవునట్లును, వుండుట, అన్నకోశమునుండి గొంతుకలోనికి బంతివెడలుచున్నట్లుండుట.

అన్నకోశము:—రోగి, కాఫీని పుల్లనివస్తువులను వుప్పని ఆహారమును కోరుట. రుచి చేదుగానుండుట. ఆకలిమందముగా నుండుట. దుర్వాసనతోగూడిన పుల్లని త్రేనుపులు వచ్చుచుండుట. కాఫీ మడ్డివంటిపదార్థముతోగూడి, పుల్లనివమనమగుచుండుట. యెక్కువ వికారము, గుండెలలోమంట, ఇవి పరుండినపుడెక్కువగుట. బాధలు భోజనమువలన వుపశమించి భోజనమైన కొంతసేపటికి తిరిగి వుద్రేకము జెందుట.

పొత్తికడుపు:—కాలేయమువద్ద యెక్కువ నొప్పి. కామెర్లరోగము. కత్తితోపొడుచుచున్నట్లు బాధలు. అంత్రములలో గుడగుడలు.

మలము, మలాశయము:—తరుచు విరేచనానుమాన ముండుట. మలము కొద్దికొద్దిగా వెడలుచుండుట. మలబద్ధము, అజీర్ణ విరేచనములు, ఒకప్పుడివి పల్చగాను, బాధలేకుండగను, అప్రియత్నముగాను, నిద్రలో వెడలుచుండుట. విరేచనమైనపిమ్మట కంపముగాను, యెక్కువ నిస్త్రాణగాను వుండుట (విరేట్రింఆల్బమ్, ఆర్సెనికంఆల్బమ్). ఆసనములో పట్టుచున్నట్లుండుట.

మూత్రావయవములు:—మూత్రము పాలిపోయి, తెల్లగాను, తెల్లని మడ్డివంటి పదార్థముతోనుకలసి వెడలుట, మూత్రము విడుచుటకష్టముగానుండుట. మూత్రమువెడలుచు మధ్యమధ్య ఆగిపోవుచుండుట (క్లిమేటిస్). ముసలివారికి మూత్రము చుక్కలుచుక్కలుగా వెడలుట.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ యెక్కువగా నుండుట. సంభోగశక్తి తక్కువగా నుండుట. సంభోగవాంఛ నణచిపెట్టుటవలన వచ్చురోగలక్షణములు. వృషణములువాచి, గట్టిపడి, పెద్దవగుట. నపుంసకత్వము. సంభోగమునందు స్ఖలనము బహుసులభముగాను, త్వరగాను అగుట స్త్రీ కనపడినతోడనే స్ఖలనమగుట. అధికసంభోగము వలనవచ్చులక్షణములు. అండములకు దెబ్బతగులుటవలన వచ్చిన వాపు.

స్త్రీ అవయవములు;—నడుమునొప్పి, తెల్లని, చిక్కని, స్రావము తోగూడిన కుసుమ, ఋతువు అణచిపెట్టబడుట, లేక, ఆలస్యమగుట, గర్భాశయము, అండాశయము, స్తనములుగట్టిపడుట. మర్మావయవములో శూలముతో పొడుచుచున్నట్లుండు బాధలు. బహిష్టుకు ముందు స్తనములు వాచుట, బాధగానుండుట. వేవిళ్లనుమాన్పును. స్తనములలోని మాంసగ్రంథులు గట్టిపడుట, వాచుట, ఋతుశూల. చనొమ్రనలలో కుట్టుచున్నట్లు బాధగానుండుట. బహిష్టును అణచిపెట్టుటవలనగాని అధికసంభోగమువలన గాని వచ్చిన లక్షణములమీద నిది బాగుగా పనిచేయును. హిస్టీరియా లేక అపస్మారమును మాన్పును.

శ్వాసావయవములు:—సప్తపథలో నొక ఆర్చుకుపోయినస్థలము (Dry Spot) వుండుటవలన తరుచు పొడిదగ్గు వచ్చుచుండుట. రాత్రి యందుగాని పగటియందుగాని పరుండినవెంటనే పొడిదగ్గువచ్చుట. ఇందు వలన తోడుగుకొనిన దుష్టులు చాలా బరువుగా కనుపించుట. వూపిరిపీల్చి నపుడు ఛాతీలో కుడివైపున నొప్పి. కోరింతదగ్గును మాన్పును.

హృదయము:—పానీయములు త్రాగినపిమ్మట విపరీతముగా కొట్టుకొనుట. నాడి వక్రముగాను, యెగుడుదిగుడుగాను, కొట్టుకొనుట.

నడుము, కాళ్లు, చేతులు:—వెన్నెముకలోకుట్టుచున్నట్లు నొప్పిగా నుండుట. మణికట్టులోను మోకాళ్లలోను కదలినప్పుడు కరుక్కుమని శబ్దమగుట. అవయవములు కంపించుచుండుట. నడచునప్పుడు దిగువ అవయవములు యెక్కువ నొప్పిగానుండుట. పక్షవాతము మొదట దిగువ అవయవములు యెక్కువ నొప్పిగానుండుట. పక్షవాతము మొదట దిగువ అవయవములకును, అటుపిమ్మట పైఅవయవములకును వచ్చుట.

చర్మము:—యెక్కువ దురదగానుండుట. రక్తము, దుర్వాసనతో గూడిన స్రావము వెడలుచుండినట్టి నల్లని పుండ్లను మాన్పును. ఇట్టిపుండ్లు చర్మముమీద త్వరగా వ్యాపించుటనుమాన్పును. పుట్టవ్రణముకు సంబంధించినపుండ్లను మాన్పును. పుట్టవ్రణముకు మాన్పుటలోనిది అగ్రగణ్యమైనది.

నిద్ర:—ఆలస్యముగా నిద్రపోవుట. అర్ధరాత్రిమునకు పిమ్మటగాని నిద్రపట్టకపోవుట. బాధవలన నిద్రనుండి మెలకువవచ్చుట. నిద్రవలన అలసట తీరకపోవుట. భయంకరమైన కలలువచ్చుట.

జ్వరము:— చలి, వణకు, యివి ఉదయమునను సాయంకాలము 3 లగాయితు 5 గంటలవరకు యుండుట. చలివలన యెండవేడిమిని కోరుచుండుట. రాత్రింబవళ్ళు చెమటపట్టుచుండుట. కండ్లుమూసిన వెనుకను లేక నిద్రపట్టిన వెనుకను వెంటనే చెమటపట్టుట.

ఉద్రేకము:—రాత్రియందు పరుండుటవలన, పడకలో అటూనిటూ కదలుటవలన, బహిష్టులో, శరీరమానసికపరిశ్రమవలన, దీపపుకాంతివలన.

ఉపశమనము:—వుపవాసమువలన, చీకటిలో, కదలికవలన, నడచుటవలన, నొక్కుటవలన, ముందరకు వంగుటవలన.

విరుగుళ్లు:—కాఫీ, డల్కామారా, యాసిడ్ నైట్రిక్.

యాసిడు నైట్రికు-నకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 1000 పొటెన్సీ. పెద్దపొటెన్సీలు బాగుగా పనిచేయుచున్నవి. దీనిగుణకాల పరిమితి 30 మొదలు 35 దినములు.

---

## 84. కన్వల్లేరియా. CONVALLARIA MAJALIS.

ఇది హృదయరోగలక్షణములమీద బాగుగా పనిచేయును. హృదయమునకు బలమునిచ్చి యథాస్థితికి తీసికొనివచ్చును. గర్భాశయమువద్ద నొప్పి గుండెదడతో ద్వంద్వముగా యున్నప్పుడును; వుబ్బుట లేక నీరుపట్టుట, ఆయాసము వచ్చుట యివి హృదయరోగమునకు సంబంధించి యుండునప్పుడును యిది బాగుగాపనిచేయును. దీని లక్షణములు డిజిటాలిసు, క్రాటేగసు, లిలియంటిగ్రినం, ఎడోనిస్ వెర్నాలిస్—లను కొంతవరకు పోలియుండును. గుండెదడను, గుండెవక్రముగా కొట్టుకొనుటను, హృదయ

రోగముపలన మూత్రము తక్కువగా స్రవించుటను, పాదములు మొదలగు వాటికి నీరుపట్టుటను మాన్పును.

మనస్సు, తల:—సులభముగా విచారముకలుగుట, బుద్ధిమందముగా నుండుట. చిరచిరలాడుచుండుట. దిమ్ముగానుండు తలనొప్పి దగ్గుటవలనను మెల్లెక్కుటవలనను యెక్కువగుట. హిస్టీరియా లేక అపస్మార లక్షణములను మాన్పును. ఆలోచనశక్తి తక్కువగా నుండుట.

ముఖము:—ముక్కునుండి రక్తము స్రవించుట. ముఖము, పెదవులు, వీటిమీద చిన్నచిన్న తెల్లనిపొక్కులు బయలుదేరుట, అందువలన ముఖము గరుకుగాను, నొప్పిగాను వుండుట.

నోరు:—నాలుక చీల్చివేసినట్లు బాధ. నాలుక వెడల్పుగాను దళసరిగాను మకిలిరంగు పూతతోను వుండుట. నాలుక యెర్రగా వుండువలెను, మాంసపుముద్దవలెను వుండుట. నీళ్లు చేదుగానున్నట్లు తోచుట.

గొంతుక:—వూపిరి తీసుకొనునప్పుడు గొంతుకలో మంటగాను, నొప్పిగాను వుండుట. గొంతుకలో వెచ్చగానున్నట్లు తోచుట.

అన్నకోశము:—వేవిళ్లను మాన్పును.

పొత్తికడుపు:—గాఢముగా వూపిరితీసుకొనినపుడు పొత్తికడుపులో గుడగుడలాడుచుండుట. విపరీతమైన బాధగానుండు శూల త్వరగా వచ్చి నెమ్మదిగా పోవుట. కట్టుకొనినవదుస్తులు బిగువుగావున్నట్లుతోచుట.

మలము, మలాశయము:—ఆసనముఎక్కువ తీపుగానుండుట. మలాశయము గాలితో నిండినట్లువలె బాధగానుండినను యిట్టివాయువు బయటను వెడలినపిమ్మట బాధ వుపశమింపకపోవుట.

మూత్రావయవములు:— మూత్రకోశములో బాధగా నుండుట. మూత్రకోశమువాచి పెద్దదగుట. దుర్వాసనతోగూడిన మూత్రము కొద్దికొద్దిగాను, తరుచుగాను, వెడలుచుండుట.

స్త్రీ అవయవములు:—గర్భాశయమువద్ద యెక్కువ నొప్పి, బాధ,

గుండెదడతో సంబంధించియుండుట. మూత్రద్వారము చివరను, మలద్వారమందును దురదగానుండుట.

శ్వాసావయవములు:—వూపిరితిత్తులవాపు. నడుముమన్నచో ఆయాసముపచ్చుట, వూపిరిపీల్చునప్పుడు గొంతుకలో వేడిగానున్నట్లుతోచుట.

హృదయము:—ఒకమారు ఆగిపోయి తిరిగి కొట్టుకొనుచున్నట్లు తోచుట. కొలది పరిశ్రమవలనగూడ గుండె దడవచ్చుట. సిగరెట్లు కాల్చుటవలనవచ్చు హృదయరోగములను మాన్పును. హృదయములో పొడుచుచున్నట్లు బాధ, దడ (Angina Pectoris) ను మాన్పును. అతివేగముగాను వక్రముగాను కొట్టుకొనునాడిని యథాస్థితికి తీసుకొనివచ్చును. లక్షణములు పరుండినపిమ్మట వుపశమించుట.

నడుము, కాళ్లు, చేతులు:—నడుములో పోటుగాను బాధగాను వుండుట. బొటనవ్రేలిలోను, పిక్కలమండలలోను, గుత్తులలోను కాళ్లలోను నొప్పులుగానుండుట. చేతులు వణకుచుండుట. చితుకకొట్టినట్లు నడుములో నొప్పిగావుండుట.

జ్వరము:—నడుములోను, వెన్నెముకలోను చలివచ్చుట. అటుపిమ్మట కొద్దిగాజ్వరము, చెమట వచ్చుట. చలిగానున్నప్పుడు తలనొప్పి, దాహము, వుండుట. వూపిరాడుట కష్టముగా నుండుట.

చర్మము:—దోమలు కుట్టినట్లువలె దద్దురులు బయలుదేరుట; ఇవి యెక్కువదురద పెట్టుటవలన దుస్తులను తీసివేసినపిమ్మట చర్మము వూడి వచ్చువరకు రోగి యీదద్దురులను గోకుచునేయుండుట.

వృద్ధికము:—వెచ్చనిగదిలో.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ. టించరు మోతాదు 1 కి 5 చుక్కల చొప్పున 1 ఔన్సు నీళ్ళలో వేసి ఇవ్వవచ్చును.

## 85. కార్న్నసు. CORNUS ALTERNIFOLIA.

ఇది చర్మవ్యాధులమీదను నరములకు సంబంధించిన వ్యాధులమీదను బాగుగా పనిచేయును.

మెదడు, తల:—యేమిచేసినను లాభించదనితోచకపోవుట. నుదిటిలోనొప్పి దినమంతయు గట్టిగానొక్కుచున్నట్లుండుట. తుమ్ములువచ్చుట. ముక్కుదిబ్బడవేయుట. నుదిటిమీద తామరబయులుదేరుట. ముఖముమీదను మెడమీదను పొక్కులు బయలుదేరుట.

అన్నకోశము:—భోజనానంతరము బాధగానుండుట. కొలదిగంటలపిమ్మట వమనమై, బాధ వుపశమించి, పొట్టలో చెచ్చగానుండుట.

మలాశయము:—ప్రతి అరగంటకు, గంటకు నీళ్లవిరేచనమగుటతో నిస్త్రాణగలుగుట, ఒకప్పుడు కొలదిరోజులవరకు విరేచనమవకుండుట.

పురుషావయవములు:— సంభోగసంబంధమైన కలలు వచ్చుటవలన స్ఖలనమగుట.

ఛాతీ:— మంచుగడ్డచేత చల్లనిగాలిచేత నింపబడినట్లు చల్లగానుండుట.

చర్మము:—మంత్రిపుపొక్కులవంటి చర్మరోగముమీద బాగుగా పనిచేయును. ముఖముమీదను, గెడ్డముమీదను, మణికట్టుమీదను, చిన్నచిన్న పొక్కులు బయలుదేరుట. నుదుట తామర బయులుదేరుటను మాన్పును. ముడతలుపడుచోట బీటలుతీయుట, మరియు అచ్చటనుండి బంకవంటి పల్చని స్రావము వెడలుచుండుటను మాన్పును.

జ్వరము:—రోజువిడిచిరోజువచ్చుజ్వరము. మన్యపుజ్వరము.

నిద్ర:—వుద్రేకమునుగలిగించునట్టికలలు. గడియారములుగంటలను కొట్టుట వినుపించుచుండుట.

వుపశమనము:—బహిరంగమైనగాలిలో వడచినపిమ్మట, రాత్రి

భోజనానంతరమున.

మోతాదు:—మదరుటించరు. (మోతాదుకు 5 చుక్కలు).

---

## 86. క్రెటేగసు. CRATAEGUS OXYACANTHA.

ఇది హృదయమునకు సంబంధించిన రోగములమీద బాగుగాపని చేయును. నాడి నీరసముగాను, వడిగాను కొట్టుకొనుట, ఆయాసము, వుబ్బు, యీలక్షణము లన్నియు రక్తహీనతవలన కాని, హృదయ నాళ ములలో దోషమువలనను, హృదయము తనపనినిసరిగా నెరవేర్చ లేనప్పు డును గలుగుట. కొలది పరిశ్రమవలనకూడ హృదయములో శూలపట్టుట, మరియు హృదయమాగిపోవునను భయముగలుగుట డిజిటాలిసువలె నిది యేవిషయములోను హృదయమునకు చెరుపు కలుగజేయదు. హృదయము వక్రముగాకొట్టుకొనుట, హృదయరోగముతో బాధపడువారికి నిద్రపట్టక పోవుట, శరీరమునకు నీరుపట్టుట, లేక వుబ్బుకలుగుట, మూత్రమెక్కు వగా స్రవింపకపోవుట, మలాశయమునుండి రక్తము స్రవించుట, సన్ని పాతజ్వరములో హృదయము అకస్మాత్తుగా ఆగిపోవుట, కాళ్లు, చేతులు చల్లబడుట, ముఖము పాలిపోవుట, శ్వాస, నాడి వక్రముగా నుండుట, మేహవాతము వచ్చినపిమ్మట కలుగు హృదయరోగములు. రక్తనాళములు గట్టిపడి రక్తముసరిగా స్రవించకపోవుట, హృదయము క్రొవ్వుచేకప్పబడి యుండుట—యీలక్షణములమీద బాగుగా పని చేయును.

మనస్సు:—చిరచిరలాడుట. విచారగ్రస్తముగానుండుట. హృదయ ము వడిగాకొట్టుకొనుటవలన తొందరగాను, తొట్రుపాటుగాను, వుండుట. తలలో రక్తము యెక్కువగా జేరుటవలన మనస్సు కంగారుగానుండుట.

అన్నకోశము:—వికారముగానుండుట, అజీర్ణముగాను, నిస్త్రాణ గాను వుండుట, మరియు హృదయము ఆగిపోవుట.

మూత్రావయవములు:—చిన్నపిల్లల మధుమూత్రమును మాన్పును.

హృదయము:—హృదయము వాచుట, అలసటవలన వూపిరాడక పోవుట, నాడి యెక్కువగా కొట్టుకొనుట. హృదయములోని కండరములు పూర్తి బలముగానుండకపోవుట, హృదయధ్వని తక్కువగానుండుట, హృదయమునకు సిరసట్టుట లేక వుబ్బుట, బ్రాంది మొదలగునవి త్రాగుటవలనను, సుఖవ్యాధులవలనను, పెద్దదగుట. ఇది హృదయమునకు బలవర్ధకౌషధము (Heart Tonic) గా యెంచబడియున్నది.

చర్మము:—యెక్కువ చెమట. పొక్కులు, దద్దురులు లేచుట.

నిద్ర:—హృదయరోగమువలనకలుగు నిద్రలేమి.

ఉద్రేకము:—వెచ్చనిగదిలో.

వుపశమనము:—మంచి గాలిలో, నిశ్శబ్దమువలన, విశ్రాంతివలన.

పోలికలు:—క్రేటెగసు, స్ట్రొఫేన్తసు, డిజిటాలిసు, నజా.

మోతాదు:—టించరు మొదలు 30 పొటెన్సీ. టించరురూపమున బాగుగా పనిజేయుచున్నది. పనిపూర్తియగుటకు కొలదికాలము వాడవలసియుండును. త్వరలో గుణము కావలసినచో మోతాదుకు 10 లగాయితు 15 చుక్కలవరకు వాడవలెను. లేనిచో 3 లగాయితు 5 చుక్కలుచాలును.

---

## 87. క్రోకసు. CROCUS SATIVUS.

(హిందూదేశపు ఔషధము. 27. కుంకుమపువ్వు).

ఇది రక్తస్రావములమీదను, అపస్మారము లేక హిష్టీరియా మొదలగు నరముల దోషములకు సంబంధించియుండు వ్యాధులమీదను, కండరములుకదల్చుట, కండ్లు చికిలించుట, మొదలగు యీడ్పులతోకూడిన దీర్ఘరోగములమీదను బాగుగాపనిచేయును.

♦ అవయవములలో తిమ్మెరలుగానుండుట. రోగి తరుచు నవ్వుచుండుట, కోపమువలన దౌర్జన్యపుపనులు చేసినను పిమ్మట పశ్చాత్తాపపడుట.

♦ సజీవముగానున్న దేదియో పొట్టలో గంతులువేయుచున్నట్లు భావన. ♦ముద్దలుముద్దలు గాను, ముదరరంగుగాను కొలది కదలికవలనసహితము వుద్రేకించు గర్భాశయరక్తసా్రవము ౹ు.

మనస్సు:— అతికులాసాగానుండుట. రోగి ఆడుచు, పాడుచు, నవ్వుచు, యుండుట. అటుపిమ్మట కోపము తెచ్చుకొనుట. విషయములు అతిత్వరగా జ్ఞాపకము వచ్చుచుండుట. ఒకప్పుడు సంతోషముగాను, మరియొకప్పుడు విచారముగాను యుండుట.

తల:—తలనొప్పి ముట్టుడుగుకాలమునందు వచ్చుచుండుట. బహిష్టులో యెక్కువగుచుండు తలనొప్పులు. తలనుయెత్తినచో తలతిరుగుట.

కన్నులు:—చదువునప్పుడును,గదిలోనున్నప్పుడును, కన్నీళ్ళువచ్చుట. బహిరంగమైనగాలిలో కన్నీళ్ళురాకపోవుట. రాత్రికండ్లు అంటుకొనుట. కండ్లలో ఫుసులు, నీళ్లువున్నట్లు తోచుటవలన కండ్లను తుడుచుచుండుట. యెక్కువగా యేడ్చినట్లుగా కనపడుట. కండ్లయెదుట మబ్బుయున్నట్లుతోచుట. కనురెప్పలు బరువుగానుండుట. నరములలో లాగుచున్నట్లుండుటవలన, కండ్లలోను, తలలోను, నొప్పిగాయుండుట. కండ్లగుండా చల్లనిగాలి చొర్చుకొని పోవుచున్నట్లుండుట.

ముక్కు:—నల్లని, జిగటయైనరక్తము ఒక్కొక్కసారి ఒక్కొక్క నాసికారంధ్రమునుండి తీగెవలెను, ముద్దలుముద్దలుగాను, వెడలుచుండుట. ముక్కునుండి యిట్టిసా్రవము తీగెలవలె వ్రేలాడుచుండుట. నుదుట చల్లనిచెమట పట్టుట, మరియు, మూర్ఛజెందుట. తరుచుగాను విపరీతముగాను తుమ్ములు వచ్చుచుండుట.

నోరు:—పెదవులు నగుళ్ళతోను పుండ్లతోను యుండుట. నీళ్లెక్కువగా పూరుచుండుట. నాలుకలేముగాను, తెల్లనిపూతతోను, మొనజేరిన పొక్కులతోను, నిండియుండుట. కొండనాలుక వాచుటవలన గొంతుకకు బొంగురుతనము వచ్చుట.

అన్నకోశము:—సాయంకాలమున యెక్కువ దాహముగా నుండుట.

కొలదిగా భుజించినను, కడుపునిండుగా నుండుట. హృదయమున భోజనము చేయకపోయినను, త్రేణుపులు వచ్చుచుండుట. భోజనానంతరము గుండెలలో మంటవచ్చుట.

పొత్తికడుపు:—నిండుగానుండుట. భోజనము చేయకపోయినను, పొట్టయెత్తుగానుండుట. నీళ్లుతాగినపిమ్మట గిల్లుచున్నట్లుండుట. సజీవముగానుండున దేదియో యెడమునైపున తిరుగుచున్నట్లు వుండుట. యెక్కువ మలబద్ధము. చంటిపిల్లల మలబద్ధము. పొత్తికడుపులో బరువు.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ యెక్కువగా గలుగుట.

స్త్రీఅవయవములు:—తీగెవలె వెడలునట్టి నల్లనిరక్తస్రావముతో గూడిన గర్భస్రావము, ఋతుస్రావము ముదర రంగుగాను, జిగురుగాను, తరుచుగాను, విస్తారముగాను, ఒకప్పుడు నల్లగాను, ఆమమువంటి పదార్థముతో కలిసివెడలుచుండుట. గర్భాశయరక్త స్రావములు ముద్దలుగాను, పొడుగుగాను, తీగలవలెను వెడలుట ఎడమస్తనములో లాగుచున్నట్లు నొప్పిగా నుండుట (క్రోటనుటిగ్). అమావాస్య, పౌర్ణమి దినములలో రక్తస్రావముగలుగుట. కొలది కదలికవలనకూడ రక్తస్రావమగుట. 3 వ మాసమునవచ్చు గర్భస్రావముమీద పనిచేయును. ప్రసవానంతరస్రావములమీద బాగుగాపనిచేయును. కుడిస్తనములో నేదియో సజీవముగానున్నట్లుగా కదలుచుండుట. హిష్టీరియాలోను కొరియా అను జబ్బులోను రోగి యెక్కువకులాసాగాను పాడుచును ఆడుచును నుండుట. మధ్యమధ్య యెక్కువ విచారముగాను ఆగ్రహముగాను యుండుట.

శ్వాసావయవములు:—నురగవంటి స్రావము వెడలుచు, వూపిరాడనంతటిదగ్గు, పరుండిన ఇదియెక్కువగుట; మరియు శ్లేష్మము మూతకదారము ముక్కలవలె వెడలుచుండుట. శ్వాస దుర్వాసనగా యుండుట. అపస్మారరోగులకు కొండనాలుక పెద్దదైనట్లు తోచుట, శ్వాసపీల్చుటకష్టమగుట.

నడుము, కాళ్లు, చేతులు:—చల్లనినీళ్లుపోసినట్లువలె, నడుములో యెక్కువచల్లగానుండుట. కాళ్ళు చేతులు మంచువలె చల్లగానుండుట,

కండరములలో ముడుచుకొనిపోవుచుండుట, చట్టలలోను మోకాళ్లలోను, కరుక్కుమనుచుండుట, చీలమండలలోను, అరికాళ్ళలోను నొప్పి గాయముండుట. బొటనవేళ్ళు ఒరియుట. పిక్కలలో చితుకకొట్టినట్లు నొప్పులు.

చర్మము:—తిమ్మెరలుగాను, మంటలుగాను, పురుగులు పాకుచున్నట్లును, వుండుట. శరీరముయొక్క ఛాయ యెర్రగానగుట. ఒరుపులు మానపటువంటి పుండ్లలోబాధ సాధిముతో గూడియుండుట.

నిద్ర:—తరచుఆవలింతలు. నిద్రలో అరచుచుండుట, మరియు లేచుచుండుట. కలలు భయముగాను, సంతోషకరముగాను, వచ్చుచుండుట.

జ్వరము:—చెమట దిగువ అవయవములకు మాత్రమేపట్టుట. నాడి వడిగా కొట్టుకొనుచుండుట. చలి మధ్యాహ్నము ప్రారంభించి సాయంకాలమునకు యెక్కువగుట. చలితోను వెచ్చదనముతోను దాహముండుట.

వుద్రేకము:—పరుండుటవలన, వుపవాసమువలన, వేసవియందు, వెచ్చనిగదిలో, వుదయమందు, ఒకేవస్తువును విడువకుండగ చూచుటవలన.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో, ఆవలింతలవలన.

విరుగుళ్లు:—ఓపియం, బెల్లడోనా, ఎకోనైటు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 8 దినములకు పైగా యుండును.

---

## 88. క్రోటన్‌టిగ్. CROTON TIGLIUM.

(హిందూదేశపు ఔషధము. 28. జిల్లేడు)

ఇది మలాశయముకును, చర్మమునకును, సంబంధించియుండు రోగలక్షణములమీద బాగుగాపనిచేయును. పెద్దపెద్దనీళ్ల విరేచనములగుట (విరేట్రింఆల్బమ్), చర్మముమీద మంత్రమువంటి పొక్కులతోగూడిన చర్మరోగములు (రూస్టాక్సు), విరేచనము ఒక్కసారిగా వెడలుట (గేంబో

జియా), వేసవిలో వచ్చునీళ్ళవిరేచనములు—వీటిమీద నిది బాగుగా పని చేయును.

మెదడు, తల:—మానసిక శరీరపరిశ్రమలయందయిష్టత. వీధుల యందు తిరుగుటతప్ప యేపని చేయుటకును అయిష్టము. జ్ఞాపకశక్తిలేకుండుట. తాగినవానివలె తలదిమ్ముగాయుండుట. కనురెప్పలుదళసరెక్కుట, కండ్లనుండి యెక్కువగా నీరుకారుట. నుదుటియందు నొప్పి.

ముఖము:—పల్లగా పాలిపోయియుండుట. ఒకప్పుడు వెచ్చగాను, దౌడలు మంటగాను యుండుట.

నోరు:—పండ్లు తోముకొనునప్పుడు ఇగుళ్లనుండి రక్తముస్రవించుట. నోరువెచ్చగాను, మంటగాను, యుండుట. ఒకప్పుడు లాలాజల మూరుచుండుట.

అన్నకోశము:—ఎక్కిళ్లు. విస్తారముగా తలతిప్పు, దృష్టి చెదరుట యుండుట. తీసికొనినకాఫీ ఆమముతోగూడి వమనమగుట. కడుపు నిండుగానుండుట, బాపగానుండుట. ముట్టుకొనినయెడల నొప్పిగాయుండుట. ఒకప్పుడు ఖాళీగాయుండునట్లుగాను, ఖాళీగా అయినట్లును; తల తిప్పుతోను, వమనానుమానముగాను, యుండుట.

పొత్తికడుపు:—ప్లీహములో పొడుచుచున్నట్లునొప్పిగాయుండుట. బొడ్డువద్ద సాయంకాలమందు శూలగా నుండుట, బొడ్డుదిగువభాగమునందు పొంగరించి, నిండుగాను, బాధగాను యుండుట.

మలము, మలాశయము:—పెద్దపెద్ద నీళ్ళవిరేచనములగుట. నీళ్లవిరేచనములు అతితొందరగాను, ఆకస్మికముగాను, ఆంత్రములలో గురగురలాడుచు, అగుట. కొద్దిగా పానీయములను పుచ్చుకొనినను, భోజనము చేయుచున్నప్పుడునుకూడ విరేచనమగుట. విడువనటువంటి విరేచనానుమానము. ఆకస్మికముగా విరేచనములు జిగురుగాను, ఆకుపచ్చగాను, దుర్వాసనగాను, గొట్టములోనుండి వెలువడునట్లునుఅగుట. అపానవాయువుయెక్కువగా వెడలుట. వేసవిలో పిల్లలకువచ్చు విరేచనములు,

పురుషావయవములు:—మూత్రనాళములోపోటు. అంగము చివర యెర్రగాను, అంగములో బాధగాను యుండుట. మర్మావయవములు యెక్కువ దురదగానుండుట. అండములమీద చిన్న చిన్న పొక్కులు బయలు దేరుట. తరుచు లేపనముగలుగుచుండుట.

(స్త్రీ) అవయవములు:—బహిష్టులో స్రావము తక్కువగా నుండుట. ఒకప్పుడిట అణచి పెట్టబడి, సరుండినపిమ్మట ఆయాసముగాను, గుండె దడగాను, యుండుట, స్తనములలోనుండి ఛాతీలోనికి, వీపులోనికి, కుట్లు చున్నట్లుండుబాధ బిడ్డపాలుకుడుచునపుడు గలుగుట మర్మావయవముల లో యెక్కువ దురదగానుండుట.

శ్వాసావయవములు:—ఉబ్బసపుదగ్గువలన శ్వాసకష్టముగానుండుట.

మూత్రావయవములు:—రాత్రియందు మూత్రము నురగగాను, నారింజపండురంగుగాను వెడలుట. పగటియందు తెల్లని మడ్డితోను పాలి పోయినరంగుగాను మూత్రము వెడలుట.

కాళ్లు, చేతులు:—యెక్కువ నిస్త్రాణగానుండుట. సడిభుజములో నొప్పిగానుండుట. మోకాళ్లలో త్రిప్పుచున్నట్లుగాను, చీల్చుచున్నట్లును, బాధగానుండుట.

చర్మము:—యెక్కువ దురదగానుండుట. గోకినయెడల బాధగా నుండుట. ముఖముమీదను, మర్మావయవములలోను, రసితోకూడిన పొక్కులు బయలుదేరుట. ఇవి యెక్కువ మంటగాను, దురదగాను, యుండు ట. పొక్కులలోకుట్లుచున్నట్లును మండుచున్నట్లును బాధ.

వృద్ధికము:—వేసవిలో, తాకుడువలన, ఆహారపానీయములవలన, వుదయమున.

వుపశమనము:—నిద్రపట్టినపిదప.

విరుగుళ్ళు:—యాంటిమోనియంటార్టు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

## 89. క్యూఫియా. CUPHEA VISCOSISSIMA.

ఇది చంటిపిల్లలకు వచ్చు కలరావ్యాధిమీద బాగుగా పనిచేయును. అజీర్ణవమనములను, పుల్లని వమనములను, తరుచు ఆకుపచ్చని నీళ్ళవిరేచనములు పులిపినవాసనతో వెడలుటయున్నూ. ఆసనములో యెక్కువ తీపుగాను, బాధగాను వుండుట జ్వరము, అస్థిమితము, నిద్రలేమి యుండుట. విరేచనములతోపాటు వమనములగుచుండుట. త్రాగిన పాలను బిళ్లలవలె, కక్కుట, మలము జిగురుతోను, రక్తముతోను కలసివెడలుచుండుట. ఇది మామూలుగావచ్చు జలుబువిరేచనములమీద యేమియును పనిచేయదు. బిడ్డ విరేచనమైన పిమ్మట యెక్కువ నిస్త్రాణజెందుట. దీనిలక్షణములు కొంతవరకు ఎథూజాసైనాపియంను పోలియుండును.

మోతాదు:—మదరుటించరు. 5 లేక 6 ఔన్సులనీళ్లలో 5 చుక్కలుటించరును వేసి ప్రతిఅరగంటకును ఒక చెంచాడు యిచ్చుచుండవలయును.

---

## 90. సైనోడాన్. CYNODON DACTYLON.

(హిందూదేశపు ఔషధము. 28. తెలుగున గరికయనియు సంస్కృతమున "దూర్వ" అనియు అందురు)

ఇది మర్మావయవరోగములమీదను పలువిధములగు స్రావములమీదను బాగుగా పనిచేయును.

ముక్కు:—రక్తస్రావములు.

అన్నకోశము,అంత్రములు, పొత్తికడుపు:—రక్తవమనము,రక్తమొలలు, జిగటవిరేచనములు, రక్తవిరేచనములు. నీళ్లవిరేచనములు.

మర్మావయవములు:—సవాయిరోగము ద్వితీయావస్థ, జీర్ణించినసెగ. గర్భాశయరక్తస్రావములు. కుసుమ.

మూత్రావయవములు:— మూత్రము అణచిపెట్టబడుట, దీనితో

ద్వంద్వముగా యుండు ఉబ్బు.

పోలికలు:—ఎళిసేషియా, కేస్కారాఅమార్గా.

మోతాదు:—1—30 పొటెన్సీ.

## 91. డామియానా. DAMIANA.

ఇది మర్మావయవ రోగములమీదను, వాటికి నిస్త్రాణవలనవచ్చు రోగలక్షణముల (నపుంసకత్వము, నరముల నిస్త్రాణ, సంభోగశక్తి తగ్గుట, లేపనము తగ్గుట మొదలగునవి) మీదను బాగుగా పనిచేయును. ముసలివారిలో అప్రియత్నముగా మూత్రము వెడలుటను మాన్పును. ప్రాస్టేటు గ్రంధినుండి మానకుండావచ్చు స్రావమును మాన్పును. స్త్రీల స్తబ్ధత్వమును, స్త్రీ పురుషులలో సంభోగవాంఛ, సంభోగశక్తి, లేపనము మొదలగునవి లోపించుట లేక తగ్గియుండుటనుమాన్పును. పురుషులలో అధికసంభోగమువలనను, సెగ, సవాయి వ్యాధులవలనను, యెత్తునుండి పడుటవలన, వెన్నెముకకు దెబ్బతగులుటవలన వచ్చిన లక్షణములను, స్త్రీలలో ఋతువు అణచిపెట్టబడుట లేక స్రావము తక్కువగానగుటను; ఋతుశూలకు కుసుమవ్యాధికి సంబంధించియుండు లక్షణములను యిది మాన్పును. ఇది అలసటను పోగొట్టును. ఇది శారీరక పరిశ్రమవలనగాని, మానసిక పరిశ్రమవలనగాని, గలిగిన నిస్త్రాణను, స్త్రీ పురుషులలో కలిగెడు నపుంసకత్వము (యేకారణమువలన కలిగిన) ను మాన్పి, నరములకు అమితమైన సత్తువనిచ్చును. నిస్త్రాణజెందినవారిలో శుక్లనష్టమునుగూడ మాన్పును.

పోలికలు:—యొహింబినం, అవీనాసతీవా, శ్యాలిక్సునైగ్రా, సేబల్ సెర్యులేటా, యాసిడ్ ఫాస్, యాగ్నసుకేస్టసు.

మోతాదు:—మదరుటించరు. మోతాదుకు 3 లగాయితు 5 చుక్కలు.

## 92. డిజిటాలిసు. DIGITALIS.

హృదయరోగగుణములు యితరరోగములతో ద్వంద్వముగాయున్నప్పుడు

యిదిపనిచేయును. శరీరములోని బలము క్షీణించుట, సులభముగామూర్ఛిల్లుట, చర్మముచల్లగాను, శ్వాసక్రియగాను యుండుట, పుగాకుదోషము వలన కండ్లజబ్బులు వచ్చుట, కాలేయము పెద్దదగుట, వాచుటతో గూడిన కామెర్లరోగము, హృదయరోగము కామెర్లరోగము ద్వంద్వముగా నుండుట, మూర్ఛిల్లునపుడు చనిపోవుచున్నవానివలె నగుపడుట, ముఖము నీలివర్ణముగా నగుట. స్వల్పపరిశ్రమవలనగూడ గుండెదడవచ్చుట, హృదయమాగిపోవుట, ఈ లక్షణములమీద నిది బాగుగా పనిచేయును.

మనస్సు:—యెక్కువ ఆతురతగాను, భయముగాను వుండుట. సంగీతము వినుటవలన భయము యెక్కువగుట. జ్ఞాపకశక్తి తక్కువగానుండుట. నిరాశగాను, భయముతోను యుండుట.

తల:—కంగారుగా, బరువుగా, యుండుట. తలతిప్పు వణుకుతోను యుండుట. నుదిటిలోను, కనుబొమలలోను, కుట్టుచున్నట్లు బాధ.

కండ్లు:—ఉదయమున కండ్లు అంటుకొనుట. దృష్టిమబ్బుగాను, మందముగాను యుండుట. కండ్లయెదుట ఇంద్రధనస్సులోవలె రంగులు కనిపించుట. స్ఫటికాకారబింబము కిరణాభేద్యమైనదిగా నగుట.

చెవులు:—నీళ్ళు సలసలకాగుచున్నట్లుగా శబ్దము వినిపించుట.

ముఖము:—చనిపోవునున్నవానివలెను జబ్బుగాను పాలిపోయినట్లుగాను వుండుట. పెదవులు ఆర్చుకొనిపోవుట. పెదవులమీద పొక్కులు బయలుదేరుట.

నోరు:—తియ్యని లేక దుర్వాసనతో గూడిన లాలాజలమూరుచుండుట. నాలుక నీలిరంగుగానగుట, వాచుట, పుండుపడుట. గుటకవేయునప్పుడు బాధగానుండుట.

అన్నకోశము:—చేదుగానుండు ఆహారమును కోరుట. యెక్కువదాహముగానుండుట. తలత్రిప్పు వమనానంతరము వుపశమించకపోవుట. కడుపులోనొక్కుచున్నట్లు బాధగానుండుట.

పొత్తికడుపు:—కాలేయము వాచి, పెద్దదై, బాధగానుండుట. జలోదరము. వాయువు చేరుటవలనవచ్చు బాధలనుమాన్పును.

మలాశయము:—సుద్దవలెను, బూడిదరంగుగాను మలము వెడలు చుండుట జిగురువంటి ఆనుముతోగూడిన నీళ్లవిరేచనములు. అప్రియత్నముగా విరేచనమగుట. విరేచనమగుటకు ముందు చలివచ్చుట. కామెర్లరోగములో నీళ్లవిరేచనములగుట.

మూత్రావయవములు:—మూత్రము తక్కువగాను, చిక్కగాను, నల్లగాను, వెడలుట. మూత్రానుమానము గలిగినపుడు మూత్రము వెడలక పోవుట. మూత్రము వెడలిన పిమ్మట మూత్రకోశము నిండుగానున్నట్లు తోచుట. ప్రాస్టేటుగ్రంధి వాచుట.

శ్వాసావయవములు:—శ్వాసకష్టముగాను, నెమ్మదిగాను, వక్రముగాను వుండుట. శ్వాసావయవములకు నీరుపట్టుట. స్రావము రక్తజీరతో కూడియుండుట. లేక, రక్తము స్రవించుట. ఛాతీలో నీరసముగానుండుట. వూపిరందకపోవుటవలన గాఢముగా వూపిరిపీల్చవలెననితోచుట.

హృదయము:—హృదయములో బాధవలన, ముంజేతిలో నీరసముగా నుండునట్లుతోచుట. ఆకస్మాత్తుగా హృదయమాగిపోయినట్లును, ఆతురతగానున్నట్లును, భావనగలుగుట, గుండె అతితరుచుగాను, విడిచి విడిచియు, కొట్టుకొనుచుండుట. హృదయములో నీరసముగా నుండుట, పరుండినపిమ్మట లేచి కూర్చుండినయెడల నాడిలో నీరసము వచ్చుట. నాడి అతినెమ్మదిగా కొట్టుకొనుట. హృదయము వుబ్బుట.

మర్మావయవములు:—బుడ్డను మాన్పును. వృషణములు పెద్దవై నీటితో నింపబడిన బుడ్డవలెనగుట. శిశ్నాగ్రచర్మము వుబ్బి, మంటగానుండుట. స్త్రీలలో యెక్కువ సంభోగవాంఛ గలుగుట. మర్మావయవములు వుబ్బుట. జీర్ణించిన సెగను మాన్పును.

కాళ్లు, చేతులు:—పాదములు వుబ్బుట. అవయవములు చల్లగానుం

డుట. కీళ్లసంధులలో మేహవాతినొప్పిగలుగుట. తెల్లగా వాచుట. కండరములలో బలముతగ్గుట. రాత్రియందు వేళ్లిళ్లు పుబ్బుట.

చర్మము:—పసుపుపచ్చగానగుట. దురదగానుండుట. కనురెప్పలు, పెదవులు, నాలుక, గోళ్లు, వీటి సమీపముననున్న చర్మము నీలివర్ణముగా నగుట, నీరుపట్టుట, తెల్లగా వుబ్బుట, నొక్కినయెడల నొక్కులుపడుట, పాలిపోవుట.

జ్వరము:—ఆకస్మికముగా వెచ్చదనము వచ్చుచుండుట. దీని పిమ్మట యెక్కువ నిస్త్రాణగలుగుచుండుట. చలివచ్చినపిదప చెమటపట్టుట. రాత్రియందు చల్లని చెమటపట్టుట. లోపలచలిగాను, శరీరము వెచ్చగాను, ముఖము యెర్రగాను, వుండుట. ఒకచేయి వెచ్చగాను రెండవది చల్లగాను వుండుట.

వుద్రేకము:—నిబ్బరముగా కూర్చుండుటవలన, కదలికవలన, భోజనానంతరమున, సంగీతము వినుటవలన.

వుపశమనము:—కడుపు ఖాళీగా యున్నప్పుడు, బహిరంగమైన గాలిలో, నొక్కుటవలన, తరుచు మూత్రము విడుచుటవలన.

ఇది హృదయ రోగములతో గూడియుండు వుబ్బుమీదను, తల తిప్పుటను, క్షయ సంబంధమైన జ్వరముమీదను, హృదయముపై పోరవాపుగాను, బాధగానున్నప్పుడును, బాగుగా వుపయోగపడును.

దీనికి ముందుగాని వెనుకగాని చైనా వాడకూడదు.

విరుగుళ్లు:—కేంఫరు, యాపిస్, నక్సువామికా, ఓపియం.

మోతాదు:—3 మొదలు 30 వరకు. దీని గుణకాలపరిమితి 6 వారములకుపైగా యుండును.

---

## 93. డయాస్కోరియా. DIOSCOREA VILLOSA.

ఇది చాలరకముల బాధలను, ముఖ్యముగా శూలలను, మరియు

అన్నకోశము, పొత్తికడుపు, వీటికి కలుగు బాధతోగూడిన రోగములకును పనిజేయును. ముసలివారిలోను పిల్లలలోను జీర్ణశక్తి తక్కువగా నున్నప్పుడును, భోజనానంతరమునను యెక్కువ అపానవాయువు వెడలుచుండుట, యీలక్షణములు ముఖ్యముగా టీ తాగువారిలో కలుగునప్పుడును, శూల వలన విపరీతముగా బాధ పడువారికిని ఇది బాగుగాపనిచేయును. నోరు చుట్టుపు మాన్పుటలో అగ్రగణ్యమైనది.

మనస్సు:—వస్తువులకు మారుపేర్లుపెట్టుట. చిరచిరలాడుచుండుట. ఒంటరిగా నుండగోరుట.

తల:—నుదిటిలో దిమ్ముగానుండుట. నొక్కినయెడల దిమ్ముగా నుండుట వుపశమించుట. తలతిప్పుగా నుండుట.

కన్నులు:—దృష్టి మాంద్యముగా నుండుట. కండ్లుకలుగుట, మంటగానుండుట, రెప్పలు అంటుకొనుట, వెచ్చగానుండు కన్నీళ్లువచ్చుట.

చెవులు:—గులిమి వుండలవలె వెడలుచుండుట. చెవిపోటు.

ముక్కు:—తుమ్ములు ముక్కురంధ్రములలో గులతో గూడియుండుట. ఎడమనాసికారంధ్రమునుండి యెర్రనిరక్తము స్రవించుట. పైత్య జ్వరరోగులలో ముక్కునుండి తరుచుగా దుర్వాసన వచ్చుచుండుట.

ముఖము:—చినచిన్న మొటిమలు నల్లని మొలనతో బయలుదేరుట.

నోరు:—వుదయమున నాలుకపై గోధుమవర్ణముగల చిక్కనిపూత యుండుట. నోరుఆర్చుకొనిపోయి చేదుగాను, వుదయమున మెలకువ వచ్చుసరికి జిగురుగాను యుండుట. నిద్రలో లాలాజలము బయటకు వెడలుచుండుట.

గొంతుక:—గవదకాయలనుండి చెవులవరకు కట్టుచున్నట్లు బాధగా నుండుట. ముడుచుకొనిపోయినట్లుండుట. మంటగానుండుట.

అన్నకోశము:—నిబ్బరముగా నిలుచుండుటవలన పోడుచుచున్న

ట్లుండుబాధ వుపశమించుట. పుల్లని లేక చేదుగా తేన్పులు వచ్చుచుండుట. తేన్పులువచ్చినపిమ్మట బాధలు కొంతవరకు వుపశమించుట ఇందువలన కట్టుకొనిన బట్టను వదులుచేయవలసి వచ్చుట. తలనొప్పి భోజనమైనపిమ్మట వుద్రేకించుట.

పొత్తికడుపు:—బొడ్డువద్దశూల బయలుదేరి, అన్ని అవయవములలోకిని, కాళ్లలోనికిని, చేతులలోనికిని ప్రసరించుట. బాధలు ఆకస్మికముగా ఒకచోటనుండి మరియొకచోటకు మారుచుండుట. కడుపులో గుడగుడలాడుచు, యెక్కువగా అపానవాయువు వెడలుచుండుట. పొత్తికడుపులోను, చిన్నప్రేగులలోను గోకుచున్నట్లును కోయుచున్నట్లును బాధగానుండుట. నడుచుచున్నప్పుడు శూల వుపశమించుట. మరియు ముందరకువంగునపుడును, కాలేయమునుండియు బొంగ మీదకును కుడిచన్నొమ్మవరకును వ్యాపించుట. మలవిసర్జనకొరకు యెక్కువ తొందరగలుగుట. పొత్తికడుపు ముట్టుకొనిన నొప్పిగానుండుట.

మలము, మలాశయము:—ఆసనము దురద. మూలశంఖులో మొలలు పెద్దపెద్దకాయలవలెను, ఆసనములో యెక్కువబాధనుకలుగజేయుచుండుట. విరేచనానంతరము మలాశయము వెలుపలకువచ్చుట. నీళ్లవిరేచనమువలన, వుదయముననే పడకనుండి మలవిసర్జనకొరకు పరుగెత్తవలసివచ్చుట. మలము జిగురుగా, ముదరరంగుగా, దుర్వాసనతో, పసరికగా, వెడలుట.

మూత్రావయవములు:—మూత్రనాళమునుండి చిన్నచిన్న రాళ్ళు వెడలుటవలన, బాధతో గిజగిజలాడుచుండుట.

పురుషావయవములు:—అవయవములుచల్లగాను, వ్రేలబడియు నుండుట. మూత్రపిండములనుండి బాధలు అండములలోనికి పొడుచుచున్నట్లుండుట. నిద్రలో స్ఖలనమగుట; ఇది కొంతవరకు నపుంసకత్వముతోగూడియుండుట. తరుచు వుద్రేకమువలన లేపనముగలుగుచుండుట.

స్త్రీఅవయవములు:—ఋతుశూల. గర్భిణులలో దొంగనొప్పులు, ప్రసవానంతరనొప్పులు, శూలలు వచ్చుచుండుట.

శ్వాసావయవములు:—గొంతుకలో గిలిగింతలు పెట్టుచున్నట్లుండు టతో దగ్గువచ్చుట. రొమ్ముకవద్ద కట్టిపెట్టినట్లునొప్పిగా నుండుట. శ్వాసతీయునపుడు ఛాతీ పెద్దదిఅవనట్లుగా తోచుట.

హృదయము:—పొడుచుచున్నట్లుండుబాధతో వూపిరాడకపోవుట

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—నడుము నొప్పిగా నుండుట, ఇది వంగుటవలన యెక్కువగుట. మెడనరము పట్టుట. యెడమభుజములో నొప్పిగానుండుట. మోచేతులలో నములుచున్నట్లు బాధగానుండుట. మోకాళ్లలో బలములేకపోవుట, బాధగానుండుట, వణకుట, చీలమండ లలో బలముతగ్గుట, సులభముగా నొప్పిపెట్టుచుండుట.

చర్మము:—పుప్పిగోళ్లు, చిన్నచిన్న మొటిమలు నల్లనిమొనలతో బయలుదేరుట, గోరుచుట్టును మాన్పుటలో యిది అగ్రిగణ్యమైనది.

నిద్ర:—ఆలస్యముగాపట్టుట. త్వరగా మెలుకువ వచ్చుట.

వుద్రేకము:—సాయంకాలమందు, రాత్రియందు, పరుండినప్పుడు శరీరమును వంచుటవలన.

వుపశమనము:—నిబ్బరముగా నిలుచుండుటవలన, బహిరంగమైన గాలిలోతిరుగుటవలన, నొక్కుటవలన.

పోలికలు:-కొలొసింథిస్,నక్సువామికా, కేమోమిల్లా,బ్రయోనియా.

విరుగుళ్లు:—కేమోమిల్లా, కేంఫరు.

మోతాదు:—1 మొదలు 30 పొటెన్సీ.

---

## 94. డల్కమారా. DULCAMARA.

ఇది తేమగాలివలనను, వర్షకాలమందును, వచ్చునట్టి రోగములమీద బాగుగా పనిజేయును. వేసవికాలపు ఆఖరురోజులలో పగలు వెచ్చదనము వలనను, రాత్రి చల్లదనమువలనను, వచ్చు రోగములు; తేమగాలివలనను,

నీళ్లలో నానుటవలనను, తలతడియుటవలనను, వాతావరణమార్పులవలనను, తేమగానుండు ప్రదేశముల యందును ఇండ్లలోను నివసించుటవలనను వచ్చు రోగములు; అనగా జలుబు, రొంపపట్టుట, నీళ్లవిరేచనములు, మేహవాతనొప్పులు, పక్షవాతము, తలనొప్పి, వుబ్బు, చర్మవ్యాధులు, ఆమత్రచలనుండి గలుగు స్రావములు యెక్కువగుట, పైత్యజ్వరము మొదలగు పలువిధ వ్యాధులమీదను యిది బాగుగా పనిచేయును.

మనస్సు:—కంగారు. కోపములేకయే తిట్టవలెవసియు దెబ్బలాడవలెననియుతోచుట. రాత్రియందు బాధలెక్కువగుట, పరాకుమాటలు.

తల:—వుదయమున లేచుసరికి తలతిప్పు. తలమీద తామర. బట్టతల. మాటలాడుటవలన తలనొప్పి వుపశమించుట.

కండ్లు:—కనురెప్పలు దళసరెక్కుట, పసుపుపచ్చని, చిక్కని, స్రావమువచ్చుట. విస్తారముగా నీళ్లవంటి స్రావము బహిరంగమైన గాలిలో నున్నప్పుడు వెడలుచుండుట.

చెవులు:—చెవిపోటు. చెవిలోపొడుచుచున్నట్లు బాధగానుండుట.

ముక్కు:—రక్తస్రావమగుట. నొక్కుచున్నట్లుండుట, ముక్కునుండి నీళ్లుకారుచుండుట, ముక్కు దిబ్బడవేయుట, చలిగాలితగులుటవలననిది యెక్కువగుట. స్రావము చిక్కగాను, పసుపుపచ్చగాను, రక్తజీరతోను, వెడలుట. పసిపిల్లల రొంపను మాన్పును.

ముఖము:—పాలిపోయి యుండుట. బుగ్గలు కందుట, ముఖముమీది చర్మవ్యాధి పోయినపిమ్మట ముఖమునందు నొప్పిగలుగుట, ఇది వుబ్బసముతో కూడియుండుట.

నోరు:—జలుబువలన పండ్లనొప్పివచ్చుట. ఈనొప్పి నీళ్లవిరేచనములతోపాటు యున్నప్పుడు పనిచేయును. నాలుక, నోరు, ఆక్కుకుపోయి యుండుట. నాలుకవాచుటవలన మాట సరిగారాకపోవుట, చల్లగానుండుట, నాలుకకు పక్షవాతమువచ్చుట.

గొంతుక:—జలుబువలన గవదకాయలువాచుట. గొంతుక బొంగురు.

అన్నకోశము, పొత్తికడుపు:—అన్నహితవు లేకపోవుట. రుచి చేదుగానుండుట. చిక్కని, తెల్లని, ఆమమును వమనము చేసుకొనుట. అజీర్ణమువలన గుండెలలో మంటగానుండుట. చల్లనిపానీయములను కోరుచుండుట. వికారముగాను విరేచనానుమానముగాను యుండుట. బొడ్డువద్ద కోయుచున్నట్లు నొప్పిగాయుండుట. గజ్జలలోని మాంసగ్రంధులువాచుట. శైత్యమువలన పొత్తికడుపులో నొప్పిగాను, శూలగానుయుండుట.

మలము, మలాశయము:—విరేచనములు తెల్లగాను, నీళ్లవలెను, యుండుట. ఒకప్పుడు పసరికగాను, ఆమముతోను, పుల్లనివాసనతోను, తలతిప్పు, వికారముతోను, రాత్రియందును, చల్లనిగాలిలోను, వెడలుచుండుట. శైత్యమువలనను, తేమగాలివలనను జిగటవిరేచనములగుట. లాలాజలమెక్కువగా వూరుట, ఆసనము దురదగాను, మంటగాను యుండుట. శరీరము వెచ్చగానుండుట, దాహముగానుండుట.

మూత్రావయవములు:—చలివేయుచున్నప్పుడు యెక్కువగా మూత్రానుమానము గలుగుట. మూత్రము వెడలుచున్నప్పుడు బాధగానుండుట. మూత్రములో చీము, ఆమము కలసివెడలుట. నీళ్లలో నానుటవలన మూత్రము అణచిపెట్టబడుట.

పురుషావయవములు:—చిడుముపంటిచర్మరోగము. నపుంసకత్వము.

స్త్రీఅవయవములు:—దురదగాను, వెచ్చగాను, సంభోగమునందు కోరికగానుయుండుట. శైత్యమువలన ఋతుస్రావము, పాలు, ప్రసవానంతర స్రావము అణచిపెట్టబడుట. ఋతుశూల. మర్మావయవములమీదను, స్తనములమీదను, చిడుమువంటి చర్మరోగములు బయలుదేరుట.

శ్వాసావయవములు:—తేమగాలివలన వూపిరాడకయుండుట. ఆమము యెక్కువగాజేరుట. కంఠధ్వని బొంగురుపోవుట. శ్వాసావయవములపైని కప్పబడియున్న పొరలోవాపు. బాధతోగూడియున్న మేహవాత లక్షణములు, దీనిలో శ్లేష్మము చిక్కగానుండుట. ఛాతీలో నీరుపట్టుటవలని

బాధలు, తేమగాలిలో హెచ్చగుట. రక్తస్రావమగుట. యెక్కువ ఆమము వెడలుటతోగూడిన దగ్గు. ఆమముతో ఛాతీ నిండియుండుట, అందువలన కోరింతదగ్గు వుద్రేకము నొందుట.

హృదయము:—రాత్రియందు గుండె దడగా నుండుట.

కాళ్లు, చేతులు:—పక్షవాతము వచ్చుట. పాదములు మంచువలె చల్లగానుండుట. అరిచేతులకు చెమటపట్టుట. ఒకమారు మేహవాతనొప్పులు, మరియొకమారు నీళ్లవిరేచనములు గలుగుచుండుట. చర్మవ్యాధులు తగ్గినపిమ్మట మేహవాతలక్షణములు కనుపించుట.

చర్మము:—పుండ్లనుండి సులభముగా రక్తము స్రవించుట. ముఖమువిూదను, మర్మావయవములవిూదను, చేతులవిూదను, నీటిపొక్కులు బయలుదేరుట. నీరుపట్టుట లేక వుబ్బుట. తేమవలన మాంసగ్రంధులువాచి గట్టిపడుట. చర్మము పొడిగాను, వెచ్చగాను వుండుట.

జ్వరము:—శరీరము మంచువలె చల్లగాను, నొప్పులుగాను యుండుట. చర్మము వెచ్చగాను పొడిగాను మంటగాను యుండుట. చలిగాను దాహముగాను యుండుట. సాయంకాలమునందు నడుములో చలిగాయుండుట. దాహములేకుండగను, పరాకుమాటలాడుచును వుండుట.

వుద్రేకము:—రాత్రియందు, చల్లదనమువలన, తేమ వర్షమువలన, విశ్రాంతిగా నుండుటవలన, శీతోష్ణస్థితి చల్లదనములోనికి మారినపిమ్మట.

వుపశమనము:—కూర్చున్నచోటనుండి లేచినపిదప, కదలికవలన, వెచ్చదనమువలన, నడచుటవలన.

సహచరులు:—బెరీటాకార్బ.

విరుగుళ్లు:—కేంఫరు, ఇపెకాక్, కుప్రంమెట్, కాలీకార్బ, మెర్క్యూరియసు.

కుప్రంమెట్, మెర్క్యూరియసు—లకిది విరుగుడు.

బెల్లడోనా, లెకెసిసు—లను దీనికి ముందువెనుకలుగా వాడరాదు.

మోతాదు:—2 మొదలు 30 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 30 మొదలు 40 దినములు.

---

## 95. డ్రాసీరా. DROSERA.

ఇది శ్వాసావయవ రోగములమీదను, ముఖ్యముగా కోరింతదగ్గు మీదను పనిచేయును. ఇది కోరింతదగ్గుమీద పనిచేయు ఔషధములలో ప్రధానమైనదిగా, డాక్టరు హానిమాన్ గారివలనగూడ యెంచబడినది. క్షయ జాతిదగ్గుమీదను, దగ్గునపుడు అధికముగా స్రావము వెడలుట, తినిన ఆహారము వమనమగుట యున్నపుడును దీనిని వాడనగును. క్షయరోగమును సంబంధించియుండు మాంసగ్రంధుల దోషమును మాన్పును. చర్మరోగముల మీదను, ముఖ్యముగా పొంగులోను, బాగుగా పనిచేయును.

మనస్సు:—కులాసాగా లేకపోవుట. ఆతురతగాను, విచారగ్రస్తముగానుండుట. చదువునప్పుడు దృష్టి చలించుచుండుట. ఒకవిషయమును గూర్చిచదువుచు, మరియొక విషయమునుగూర్చి చదువగోరుచుండుట.

తల:—బహిరంగమైన గాలిలో నడుచుచున్నప్పుడు తలతిరిప్పు వచ్చుట, మరియు యెడమవైపుకు పడిపోవుచున్నట్లుండుట.

కండ్లు:—చదువుచున్నప్పుడు చూపుఆగిపోవుట. లేక, దృష్టికంగారుగానుండుట. అక్షరములు పాలిపోయినట్లగుట. పాపలుచిన్నవగుట.

చెవులు:—బాజావాయించుచున్నట్లు వినబడుట.

ముక్కు:—సాయంకాలము రక్తస్రావమగుట. చీదినపుడు రక్తము వచ్చుట, ఆర్చుకుపోయివుండుట, పడిశెముపట్టుట, తుమ్ములు వచ్చుట.

ముఖము:—ఎర్రగాను, వెచ్చగాను, పొంగరించియుండుట, మరియు చేతులు చల్లగానుండుట, పెదవులు ఆర్చుకుపోయి, బీటలుతీసి, యుండుట.

నోరు:—నాలుక మధ్యను బాధలేనట్టి కొద్దివాపు. పల్చనిలాలాజల ముయెక్కువగా వూరుట.

గొంతుక:—గరుకుగాను పొడిగాను వుండి, దగ్గును కలుగజేయుట.

అన్నకోశము:—తరుచు ఎక్కిళ్లువచ్చుట. క్రొవ్వుతోకూడిన ఆహారమును తినినపిమ్మట వికారమువచ్చుట. ఇది అర్ధరాత్రిమొదలు వుదయమువరకు యుండుట. పైత్యరసమును లేక పసరును వమనము చేసుకొనుట.

పొత్తికడుపు;—పుల్లనిఆహారముతిననచోకడుపులోపోట్లువచ్చుట.

మలము:—తెల్లగాను, పల్చగాను, ఆమముతోగూడి వెడలుట. విరేచనమైనపిమ్మట తిరిగి విరేచనానుమానము కలుగుట.

మూత్రావయవములు:—మూత్రము కొద్దికొద్దిగాను, లేక, చుక్కలుచుక్కలుగాను, తరుచుగాను వెడలుచుండుట. ఒకప్పుడు మూత్రమధికముగా వెడలుచుండుట.

స్త్రీఅవయవములు:—ఋతువు అణచిపెట్టబడుట. కుసుమ వెడలుచున్నప్పుడు ప్రసవవేదనలోవలె, యెక్కువబాధగానుండుట.

శ్వాసావయవములు:—వూపిరి పీల్చుచున్నప్పుడు స్వరపేటికలో చితుకకొట్టినట్లు నొప్పిగావుండుట. గొంతుక బొంగురుగానుండుట. గద్గద స్వరమువచ్చుట. నడుచుచున్నప్పుడు ఆయాసముండకపోవుట. ఛాతీయొక్కయు గొంతుకయొక్కయు రోగలక్షణములు మాట్లాడుటవలన వుద్రేకించుట. దగ్గు విడవకుండా (ఫిట్టువెంటడి ఫిట్టు) వచ్చుటవలన వూపిరి పీల్చుటకు సావకాశముండకపోవుట. యుక్తవయస్కులకు రాత్రియందు వచ్చు క్షయజాతిదగ్గులో రక్తములేక చీముతోగూడిన స్రావము వెడలుచుండుట, ఒకప్పుడు స్రావము పసుపుపచ్చగా వెడలుట, దీనితోపాటు కంఠధ్వని కంచుకంఠమునుండి వచ్చునట్లుగానుండుట. దగ్గునప్పుడును, వూపిరి పీల్చునప్పుడును ఛాతీలోని కండరములలో సూదులతో కుట్టుచున్నట్లు బాధగానుండుట. స్వరపేటికలో పురుగు ప్రాకుచున్నట్లుండుట

వలన దగ్గువచ్చుట. రాత్రియందును,సాయంకాలమందు పరుండినవెనుకను, తెల్లవారుఝామున రెండుగంటలకు మెలకువతోను దగ్గువచ్చుట. విడిచి విడిచివచ్చు పొడిదగ్గువలన వమనానుమానము గలుగుట. కోరింతదగ్గును మాన్పుటలో నిది అగ్రిగణ్యమైనది. పచ్చదనమువలనను పానీయములు త్రాగినపిమ్మటను, పాడుటవలనను, నవ్వుటవలనను, పరుండినపిమ్మటను, యేడ్చుటవలనను,అర్ధరాత్రిముకు పిమ్మటనుదగ్గు వుద్రేకము జెందుట. వుబ్బసపు దగ్గును మాన్పును.

కాళ్లు, చేతులు:— కీళ్లసంధులు, కాళ్లు, కొయ్యబారినట్లుండుట. అవయవములన్నిటికి కుంటితనము వచ్చినట్లుండుట. పరుపుయొక్క-వగట్టిగా నున్నట్లుతోచుట. రాత్రియందు చేతిలోని యెముకలలో నొప్పిగా నుండుట, ఇవి పగటియందు కదలికవలన వుపశమించుట. కీళ్లసంధులలో నొప్పిగాయుండుట. కాళ్లకుచల్లని చెమటపట్టుట.

చర్మము:—కట్టుకొనిన దుస్తులు తీసివేయుచున్నప్పుడు దురదగా నుండుట. గట్టిగాగోకుటవలన చర్మము పైపొర వెంటనే వూడిపోవుట.

జ్వరము:—లోపల చలిగానుండుట. ముఖము వెచ్చగానుండుట, చేతులు చల్లగానుండుట. దాహముండకపోవుట, వెచ్చగాను తలనొప్పిగాను, దగ్గు విడిచివిడిచి వచ్చుచును యుండుట.

వుద్రేకము:—అర్ధరాత్రిమునకు పిమ్మట, పరుండినపుడు, త్రాగుట వలన, నవ్వుటవలన, పాడుటవలన, పడక వేడిమివలన.

వుపశమనము:—ముందరకు వంగుటవలన, చేతులమీద తలనుంచుకొని విశ్రమించుటవలన, తాకుడువలన.

సహచరులు:—నక్సవామికా.

విరుగుళ్లు:—కేంఫరు.

మోతాదు:—1 మొదలు 30 పొటెన్సీ. 12,30 పొటెన్సీలు బాగుగా పనిజేయును. కోరింతదగ్గులో 1, 2, 3 పొటెన్సీలు వాడుట మంచిది.

డాక్టరు హానిమాన్ గారు 30 వ పొటెన్సీ బాగుగా పని చేసినట్లు వ్రాసియున్నారు. ఈయౌషధమును వాడుము, మధ్యమధ్య సల్ఫరుగాని, విరేట్రిం ఆల్బముగాని (Intercurrent గా) కొంతవఱ్ఱలో వాడుట మంచిదిఅని డాక్టరు లుట్జుగారి అభిప్రాయము. దీని గుణకాలపరిమితి 2,3 వారములు.

---

## 96. డ్రోన్. DRONE

(హిందూదేశపు ఔషధము—23—తుమ్మి)

ఇది రక్తదోషములను, కాలేయదోషములను మాన్పును. పాముకాటును, తేలుకాటును మాన్పుటలో నిది అమోఘమైనది. పాముకాటుకు ప్రతి 15 లేక 20 నిముషములకొకసారి మోతాదు 1కి 10 లగాయతు 15 చుక్కల మదరుటించరును రోగి స్వస్థతజెందువరకును వాడవలయునని డాక్టరు సారత్ చంద్రఘోషుగారి యభిప్రాయము. తేలుకాటుకు కూడ పైకిని లోపలికిని కొలదిపరిమాణముగల మోతాదులుగా వాడుట వలన ఉపయోగము గలుగుచున్నది.

కాలేయముకు ప్లీహముకు సంబంధించిన కామెర్లరోగము మున్నగు అనేకవిధములగు దోషములకు ఇది పనిచేయును. రక్తవిరేచనములనిది కట్టును. ప్లీహమువాచుట లేక గట్టిపడుటను మాన్పును. స్త్రీలలో బహిష్టు ఆగిపోవుటను మాన్పును. రక్తదోషముతోగూడిన మన్యపుజ్వరములమీద నిది బాగుగా పనిచేయును.

పోలికలు:—ఎఖునేషియా, లెడం, నేట్రిం మూరు.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 97. డోలికాస్. DOLICHOS.

(హిందూదేశపు ఔషధము. 30 పెద్దదూలగొండిచెట్టు).

ఇది కుడివైపు అవయవములకువచ్చు రోగములు కాలేయము, చర్మ

ముకు సంబంధించియున్న రోగలక్షణములతో ద్వంద్వముగా యున్నపుడు వాడదగిన ముఖ్యౌషధము. దద్దుర్లు పొక్కులు లేకపోయినను భరింపశక్యము గాని దురదగలుగుట దీనిముఖ్యలక్షణము.

కన్నులు:—పచ్చబడుట.

నోరు, గొంతుక:—పై వైపుయిగుళ్లలో బాధలు. వీటివలని నిద్ర లేమి. పిల్లలకు పండ్లువచ్చుకాలములో యిగుళ్ళబాధలు. ఇగుళ్లవాపులు. గొంతునొప్పివలన గుటకవేయుటకష్టముగానుండుట.

పొత్తికడుపు, మలము:—క్రిమిదోషము. పొత్తికడుపు పొంగరించి యుండుట. మరియు దీనితో విరేచనబద్ధము ద్వంద్వముగాయుండుట. కాలేయమువాచుట. కామెర్లరోగము. గర్భిణుల విరేచనబద్ధము.పాదముకు తేమ తగులుటవలనవచ్చుశూల. మంటతోగూడినమూలశంఖ.

శ్వాసావయవములు:—పరుండిన కొలదిసేపటివరకును అతిబాధకరమైనదగ్గు, దగ్గుటతో ఊపిరందకుండుట.

చర్మము:—అపరిమితమైనదురద. ఇందువలనరాత్రియందు నిదుర పట్టకపోవుట. కామెర్లదోషమువలన పసుపుపచ్చగానగుట. పొక్కులు దురద చిమచిమతోగూడిన చర్మరోగము.

ఉద్రేకము:—రాత్రియందు, గోకుటవలన, కుడివైపున.

విరుగుళ్ళు:—ఎకోనైట్.

పోలికలు:— యాసిడ్ నైట్రిక్, బెల్లడోనా, హెపారుసల్ఫు రూస్టాక్సు.

మోతాదు:— 6 మొదలు 30 పొటెన్సీ.

---

## 98. ఎఖినేషియా. ECHINACEA ANGUSTIFOLIA.

ఇది అన్నివిధములైన రక్తదోషములమీదను బాగుగాపనిచేయును. సన్నిపాతజ్వరములో విరేచనములకు, రక్తదోషముతోగూడిన జ్వరము

లకు, సూతికజ్వరమును, టీకాలవలని దోషమును, కురుపులు, పుండ్లు, రాచ వ్రణములు, పుట్టవ్రణము, విషపురుగులు (తేళ్లు మొదలైనవి) కుట్టుట, విష జంతువుల కాట్లకు, శెగ, సవాయి రోగములకు, పాముకాట్లకు, శరీరము నందలి పుండ్లు కుళ్లినప్పుడును లేక దుర్వాసనతోకూడి యున్నప్పుడును, క్రిమిక వాపును బాధకు లేక ఎపెండిసైటీసు (Appendicitis) కు, మేహవాతదోషములకు, మూలశంఖకును, రక్తదోషముతోగూడిన అన్ని బాపతుల రోగములకు దీనిని వాడవచ్చును.

మెదడు:—మనోవ్యాధి. యేమిచేయుటకును తోచకపోవుట.

తల:—నుదిటిలోను నడినెత్తిలోను నొప్పి. తలతిప్పు.

కండ్లు:—చదువునపుడు నొప్పిగా యుండుట. నిద్రమత్తు.

చెవులు:—కుడిచెవిలో పోటుగానుండుట.

ముక్కు:—దిబ్బడవేయుట. కుడిపైపునాసికారంధ్రము ఒరియుట, దీనినుండి స్రావముతో రక్తము వెడలుచుండుట.

ముఖము:—పాలిపోవుట, పొంగరించుట, తలనొప్పిగా యుండుట.

నోరు:—వుదయమున నాలుకపై తెల్లని పూతయుండుట. నోటి లో చిక్కని, తెల్లని, ఆమనుచేరుచుండుట. యెక్కువగా లాలాజలము వూరుచుండుట. ఇగుళ్లనుండి రక్తముస్రవించుట. పెదవులు పగులుట. గవదకాయలు (టాన్సిల్సు) వూదారంగుగాను లేక నల్లగాను యుండుట. గొంతుక పుండ్లుపడుట.

అన్నకోశము:—ఆకలిలేమి. చల్లనినీటియందు కోరికగాయుండుట. పుల్లనితేన్పులు వచ్చుచుండుట. అజీర్ణమువలన ఛాతీలోమంటగానుండు ట. తలతిప్పు కలుగుచుండినయెడల వుపశమించుట.

పొత్తికడుపు:—పొడుచుచున్నట్లుండు శూల, ఆకస్మికముగావచ్చు చును పోవుచును యుండుట,

.. మలము, మలాశయము:— ప్రేగులలో నములుచున్నట్లు బాధగా నుండుట. దుర్వాసనతోఁగూడిన అపానవాయువు వెడలుట లేక పసుపు పచ్చని నీళ్ళవిరేచనములగుట; వీటివలన బహునిస్త్రాణ గలుగుట. జిగట విరేచనములు, పిల్లలలోవచ్చు కలరా విరేచనములకు పనిచేయును.

మూత్రావయవములు:— మూత్రము కొలదిగాను, తరచుగాను, అప్రయత్నముగాను, శ్వేతధాతువులతో కలసి వెడలుచుండుట. మూత్రము విడుచునప్పుడు నెప్పిగాను మంటగాను యుండుట.

మర్మావయవములు:— వృషణములుమీదికి లాగుకొని పోవుచున్నట్లు నొప్పిగాయుండుట. ప్రసవానంతరము వచ్చు రోగలక్షణములు రక్తదోషముతో గూడియున్నప్పుడిది పనిచేయును. స్రావములణచిపెట్టబడుట, పొట్టపొంగరించుట. దుర్వాసనతోను, ఒరుపును గలుగజేయునట్టియు, కుసుమరోగమును మాన్పును. స్త్రీపురుషుల సెగ, సవాయి, వ్యాధులలోను, వీటికి సంబంధించియుండు యితరరోగ లక్షణములమీదను బాగుగాపని చేయును. దీనిని కొలదినెలలపాటు సేవించినయెడల సవాయి రోగము పూర్తిగా నాశనమగును. సవాయిపుండ్లు చితికిన బిళ్లలు, మొదలగువాటిలో దీనిని పైకి వుపయోగించవలయును. సెగరోగములో దీనిని లోపలికి వాడుచు మర్మావయవములోనికి పిచికారీ చేయుటకూడ మంచిది.

శ్వాసావయవములు:— స్వరపేటికలో గిలిగింతలు పెట్టుచున్నట్లుండుట. కంఠధ్వనిపాడగుట. ఛాతీలో నొప్పిగానుండుట.

హృదయము:— ఒకసారిగట్టిగా మరియొకసారినెమ్మదిగాను కొట్టుకొనుట.

కాళ్లు, చేతులు:— బహు నీరసముగాను, పోట్లుగాను యుండుట. చేతులు చల్లగానుండుట. గుత్తులలోను వేళ్లలోను చట్టలలోను మోకాళ్లలోను నొప్పులుగానుండుట. మేహవాతనొప్పులు, వాపులు, బాధలు.

చర్మము:— దురదగాను మంటగాను పొడిగాను యుండుట. చిన్న చిన్న యెఱ్ఱనిపొక్కులు బయలుదేరుట. కురుపులును, రాచకురుపులును అతి

తరచుగా బయలు దేరుచుండుట. కాల్పులవలని పుండ్లనుమాన్పును. కురుపులు చితికి పుండ్లుపడినపిమ్మటను, యిట్టిపుండ్లుగల ప్రదేశము కుళ్ల నారంభించి నప్పుడును బాగుగాపనిచేయును. తేళ్లుమొదలగు విషజాతి పురుగులుకుట్టి నను పాములు, పిచ్చికుక్కలయొక్క కాట్లను, విషసంబంధమైన ముళ్లు, చేపయెముకలు, మొదలగునవి గుచ్చుకొనినప్పుడును దీనిని వాడవలయును. మశూచికముతోకూడ నిది బాగుగా నుపయోగపడును. అన్నివిధముల చర్మ వ్యాధులకు బాగుగా పనిచేయును.

వృద్ధికరము:—సాయంకాలమునందు, శరీరపరిశ్రమ, తేమగాలి వలన

వుపశమనము:—విశ్రాంతివలన, పరుండుటవలన.

పోల్చదగినవి:—బాప్టీషియా, కాలీఫాసు.

మోతాదు:—మదరుటించరు. మోతాదుకు 5 లగాయితు 15 చుక్కల వరకు ఒక్కొక్క మోతాదుగా, దినమునకు 2 లగాయితు 4 మోతాదుల వరకును, మోతాదు పరిమాణమును మోతాదుల సంఖ్యయు అవసరము వెంబ డిని హెచ్చించుట, తగ్గించుట యివ్వవచ్చును.

బాహ్యోపయోగములు:—దీనిని పుండ్లకు, మూలశంఖకును, సవా యిపుండ్లకును, చితికిన రాచపుండ్లకును, తేళ్లు కుట్టినచోటను, పాము కరచినచోటను పైకిపట్టించవలెను. పాముకరిచినచోటను ఇంజక్షనుగా కూడ వాడవచ్చును. సెగవ్యాధిలో మూత్రనాళములోనికి దీనిని పిచ్చి కారీ చేయవచ్చును. ఇట్లు పైకి వుపయోగించునప్పుడు నీలు వెంబడిని నీళ్లలోను, కొబ్బరినూనెలోను, గ్లిసరిన్‌లోను, వేసలైనులోను కలిపి దీనిని వాడవచ్చును. గొంతుకలోని పుండ్లకు దీనిని నీళ్లలోకలిపి పుక్కి లించి వుమియవలెను.

---

## 99. ఇలయస్ గ్వీన్. ELAEIS GUIN

చర్మము గట్టిపడుట, మొద్దుబారుట, ఏనుగు చర్మమువలెనగుట, గరుకుదేరుట, చర్మముమీద చిన్నచిన్నపొక్కులు బయలుదేరుట. చర్మము

యెక్కువ దురదగానుండుట; యిందువలన నిద్ర పట్టకపోవుట, చర్మమువాచుట లేక వుబ్బుట, యిట్టిలక్షణములతోగూడిన కుష్టు, బోదకాలు మొదలగు కఠినమైన చర్మవ్యాధులమీద నిది బాగుగాపనిచేయును. ఇట్టివ్యాధులలో చర్మమును నొక్కినను, గిల్లినను నొప్పివుండదు.

తల:—కులాసాగాను, అవిధేయతగానుండుట. కండ్లువాచుట, తదేకదృష్టితో నుండుట. నాలుకమంటగానుండుట. నోటినుండి దుర్వాసన వచ్చుట. గుటక వేయునప్పుడు బాధగానుండుట.

అన్నకోశము:—దుర్వాసనతోగూడిన త్రేణుపులువచ్చుట.

పొత్తికడుపు:—చల్లనిపానీయమువలన శూలవచ్చుట.

మలము:—మలము నల్లగానుండుట. తరుమనీళ్ళవిరేచనములగుట.

శ్వాసావయవమును:—ఛాతీలో పొడుచుచున్నట్లు బాధగానుండుట. వూపిరి సరిగా అందకపోవుట.

కాళ్లు. చేతులు:—ఎడమచేయి వాచుట. రోగికి కాళ్ళలో సత్తువ తక్కువగానుండుటవలన కూర్చునియుండుట. పిక్కలు లాగుచుండుట. అరికాళ్లలో నొప్పిగానుండుట.

చర్మము:—వాపుగా, గరుకుగా, దురదగా బాధగావుండుట. కుష్టు బోదకాలు మొదలగు కఠినరోగములమీద బాగుగాపనిచేయును.

పోల్చదగినవి:— హైడ్రొకోటయిల్, ఎనకార్డియమ్.

మోతాదు:—మదరుటించరు మోతాదుకు 1 లేక 2 చుక్కలు,

## 100. ఎంబీలియా. EMBELIA RIBES.

(హిందూదేశపుఔషధము. 31. వాయువిళంగాలు).

ఇది క్రిమిదోషముతో సంబంధించియుండు పలువిధములగు రోగలక్షణములమీద బాగుగాపనిచేయును. కావున పిల్లలకు వాడతగిన ముఖ్యౌ

పథములలో నిదియొకటి. క్రిమిదోషముతో ద్వంద్వముగాయుండు అజీర్ణము, పొట్టఉబ్బరింపు నీళ్లవిరేచనములు. వీటిమీదనిది ముఖ్యముగా పనిచేయును. మూత్రము భరింపశక్యముగాని దుర్వాసనగను, రక్తమువలె ఎర్రనిరంగుగ నుండుటయు దీని ప్రధానలక్షణములు. బిడ్డరాత్రియందు ఉలికిపడుట, కేకలువేయుట, ముక్కును ఆసనమును గోకుకొనుచుండుట. పొట్టఉబ్బరింపు. అజీర్ణవిరేచనములు మున్నగు లక్షణములు దీని ఉపయోగమును సూచించును. సినా, శాంటనైన్ మున్నగు క్రిమిదోషహరముల యొక్కపనికంటె దీని ఉపయోగమెక్కువది.

పోలికలు:—నేట్రింఫాస్, సినా, ట్యూక్రియం, శాంటనైన్, స్పైజీలియా, కాల్కేరియాకార్బ.

మోతాదు:—1 మొదలు 6 పొటెన్సీ.

---

## 101. ఎపిఫిగస్. EPIPHEGUS.

యెక్కువగా ఆలసటవలనను, నిస్త్రాణమీదను, ముఖ్యముగా స్త్రీలకును, వచ్చు తలనొప్పిమీద బాగుగా పనిచేయును. బాధ యెడమకనుబొమవద్ద యెక్కువగా నుండుట. శరీరమానసిక పరిశ్రమ మామూలుకన్న యెక్కువగా కలిగినప్పుడు (యెక్కువగా తిరుగుటవలన, నడచుటవలన, ఆలోచన చేయుటవలన) తలనొప్పులువచ్చుట దీనిముఖ్యలక్షణము.

తల:—కనుబొమలలో, లోపలకు పొడుచుచున్నట్లు నొప్పిగావుండుట. తరుచు వుమ్మివేయవలయునని యుండుట. తలనొప్పివచ్చుటకు ముందు ఆకలిగా నుండుట.

అన్నకోశము:—అజీర్ణముగాను, వికారముగాను వుండుట.

హృదయము:—గుండెదడవలన నిస్త్రాణ జెందుట.

వుద్రేకము:—బహిరంగమైన గాలిలో.

వుపశమనము:—విశ్రాంతివలన.

మోతాదు:—1 మొదలు 30 పొటెన్సీ.

---

## 102. ఇక్వీసిటం. EQUISETUM HYEMALE

ఇది మూత్రకోశసంబంధమైన రోగములమీద బాగుగాపని చేయును. మూత్రము బహుకష్టముమీద వెడలుట, పరుండినప్పుడు మూత్రమప్రయత్నముగా వెడలుట, తరుచు మూత్రానుమానము గలుగుట, మూత్రపుసంచిలో బాధగానుండుట, ఇట్టిలక్షణములమీద నిది బాగుగా పనిచేయును.

అన్నకోశము:—విస్తారము ఆకలిగా నుండుట.

పొత్తికడుపు:—వ్రేలాడుచున్నట్లుండుట. దిగువభాగములందును, మూత్రకోశమునందును బాధతో తరుచు మూత్రము విడువవలయునని యుండినను, మూత్రము విడిచినపిమ్మట బాధ తగ్గకపోవుట.

మూత్రావయవములు:—తరుచు మూత్రానుమానము గలుగుట. మూత్రము విడిచినపిమ్మట యెక్కువ బాధగానుండుట. మూత్రము చుక్కలు చుక్కలుగా పడుట. మూత్రము వెడలుచున్నప్పుడు మూత్రనాళములో మంటగాను, కోయుచున్నట్లు బాధగాను యుండుట. పిల్లలు రాత్రియందు పక్కలో అప్రయత్నముగా మూత్రము విడుచుచుండుట. ముసలి ఆడువారిలో అప్రయత్నముగా మలమూత్రవిసర్జన కలుగుటను మాన్పును. గర్భిణీలోను, ప్రసవానంతరమునను బాధతో మూత్రము వెడలుటను మరియు మూత్రావరోధముగలుగుటను మాన్పును. మూత్రములో శ్వేతధాతువు, ఆమముకలసి వెడలుట, కుడిమూత్రపిండములో బాధవచ్చి పొత్తికడుపులోనికి ప్రాకుటవలన మూత్రానుమానము తొందరగా కలుగుచుండుట. నడుములో కుడివైపున బాధగానుండుట.

వుద్రేకము:—కుడివైపున, కదలికవలన, నొక్కుటవలన, తాకుడువలన కూర్చుండుటవలన.

వుపశమనము:—మధ్యాహ్నమందు, పరుండుటవలన.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ. టించరును మోతాదుకు 3, 4 చుక్కలుగాని వేడినీళ్లలోవేసి యిచ్చినయెడల మూత్రకోశనాళమునందు బాధతగ్గి మూత్రకోశమునందు జేరియున్న రాళ్లు వెలువడును. మరియును ప్లూరసీయొక్కయు, వుబ్బుయొక్కయు లక్షణములనుగూడ వుపశమింపజేయును.

---

## 103. యూకలిప్టసు. EUCALYPTUS GLOBULUS.

(హిందూదేశపు ఔషధము. 32. యూకలిప్టసు.)

ఇది శ్వాసావయవముల యొక్కయు, జీర్ణకోశము యొక్కయు, మూత్రావయవముల యొక్కయు, ప్రేగులయొక్కయు రోగములమీద బాగుగాపనిచేయును. స్రావములను వెడల్చుట, చెమటను పట్టించుటలో బాగుగాపనిచేయును. సన్నిపాతము, విషపడిశెము, మన్యపు జ్వరము, వుబ్బసము, కుసుమ, మేహవాతము, వీటిపలువిధలక్షణములమీద బాగుగా పనిచేయును.

తల:—భారముగానుండుట. జలుబు చేయుట.

ముక్కు:—దిబ్బడవేయుట. నీళ్లవంటి స్రావము వెడలుట. దుర్వాసనతోగూడిన చీమువంటి స్రావము వెడలుట.

గొంతుక:—మంటగానుండుట. లాలాజల మెక్కువగా వూరుచుండుట. శ్లేష్మముతో నిండియున్నట్లు తోచుట. గవదకాయలు పెద్దవై పుండ్లుపడుట, గొంతుకవాచుట, యెరబ్రడుట.

అన్నకోశము:—దుర్వాసనతోగూడిన వాయువు వెడలుట. నెమ్మదిగా జీర్ణమగుట. బాధ భోజనానంతరము వుపశమించుట. రక్తవమనము, లేక పుల్లని పదార్థములను వమనము చేసుకొనుటతో ప్రాణాపాయమును గలుగజేయునట్టి కఠినవ్యాధి ప్రవేశించుట.

పొత్తికడుపు, మలము, మలాశయము:—సన్నిపాతజ్వరములోవచ్చు నీళ్లవిరేచనములు. మలము పల్చగాను, నీళ్లవలెను, శూలతోను, వెడలుట. ఆసనములో కొచ్చదనము, తీపుతో గూడిన జిగటవిరేచనములు. పేగులలో నొప్పులుగాను, బాధలుగాను వుండుటవలన నీళ్లవిరేచనములువచ్చు సూచనలుగలుగుట. ఇది నీళ్ళవిరేచనములను రక్తవిరేచనములను కట్టును.

మూత్రావయవములు:—మూత్రపిండములవాపు, బాధతోగూడిన పిషపడిశెము. మూత్రములో రక్తముకలసి వెడలుట. వెగరోగములో ఒకప్పుడు మూత్రముసరిగా వెడలుచుండుట, ఒకప్పుడు మూత్రనాళము కప్పబడుట. మూత్రములో చీము, ఆమమువంటి పదార్థము కలసి పోవుచుండుట. మూత్రము వెడలునప్పుడు మంటగాను తీపుగానుయుండుట. ఒకప్పుడు మూత్రమెక్కువగాను, అప్రయత్నముగాను వెడలుట.

పురుషావయవములు:—జీర్ణించినసెగ. నూతనముగా వచ్చిన సవాయిపుండ్లు. సంభోగవాంఛయెక్కువగుట.

స్త్రీఅవయవములు:—దుర్వాసనగా స్రావముగల కుసుమ.

శ్వాసావయవములు:—వుబ్బసపుదగ్గులో వూపిరాడకుండుట, గుండెదడ యెక్కువగా నుండుట, శ్లేష్మమెక్కువగా వెడలుట, తెల్లని చిక్కని ఆమము స్రవించుట. ముసలివారికివచ్చు బ్రాంకైటిసు మొదలగు శ్లేష్మజాతి జబ్బులమీద బాగుగా పనిచేయును. ఇట్టివాటిలోనిది శ్లేష్మమును వెలువరించి దగ్గునుమాన్పును. ఎముకలలో బలము తక్కువగానున్న పిల్లలకు వచ్చు కోరింతదగ్గును మాన్పును. ఛాతీకి నీరుపట్టుట, లేక వుబ్బుట.

కాళ్లు, చేతులు:—మేహవాతపు నొప్పులు రాత్రియందును, పడకలోను, బరువును మోయుటవలనను ప్రదేశ్రకము జెందుట. అవయవములు కొంకర్లుబారుట, విసుగునలజెందునట్లును, నీరసముగాను యుండుట. ఇందువలన ముడుచుట, చాచుట యందిష్టముండకపోవుట.

చర్మము:—దుర్వాసనగను, మానకుండగనువుండుపుండ్లు. దురదతోనుండు పొక్కులతోగూడిన చర్మరోగములు. మాంసగ్రంథులువాచుట.

జ్వరము:— వృష్ణము అధికముగుట. మానవటువంటి సాధారణ జ్వరముమీదను, సన్నిపాతజ్వరముమీదను పనిచేయును. జ్వరమున్నప్పుడు స్రావములు దుర్వాసనతోను, వృష్ణము హెచ్చుగాను యుండుట. నాడి వడిగానున్నను నీరసముగా నుండుట.

మోతాదు:— మదరుటించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 104. యూపటోరియంపెర్ఫ్. EUPATORIUM PERF.

ఇది యెముకలలోను, కండరములలోను, చితుకకొట్టినట్లు బాధలు లేక నొప్పులతో గూడిన విషపడిశెము లేక ఇన్ఫ్లూయింజాజ్వరము, మలేరియా లేక మన్యపుజ్వరము, మొదలగు రోగములమీద బాగుగా పనిచేయును. ఇది తేమప్రదేశములలోను, నదులఒడ్డుననున్న గ్రామములలోను నివసించువారికిని, యెముకలలో నొప్పులతోవచ్చు రోగములమీదను, బాగుగా పనిచేయును. త్రాగుడువలనను, మత్తునిచ్చునట్టిపదార్థములను తినుటవలనను, పాడైనతత్వములమీద బాగుగా పనిచేయును.

తల:— తలతిప్పుగానుండుట, ఇందువలన యెడమవైపునకు పడిపోవుచున్నట్లుతోచుట, మరియు పైత్యరసమును వమనము చేసుకొనుట. నడినెత్తిలోను, తలవెనుకను, నొప్పిగాయుండుట, మరియు, కనుగ్రుడ్డులో యెక్కువబాధగాయుండుట. నియమిత కాలములలో యెక్కువ తలనొప్పివచ్చుచుండుట. ప్రతి 3వ లేక 7వ రోజునను తలనొప్పివచ్చుట.

కన్నులు:— తేరబారి చూచుట. గ్రుడ్డులో నొప్పిగా యుండుట. పచ్చగానుండుట. వెలుతురును చూడలేకపోవుట.

ముక్కు:— నీళ్ళవంటిస్రావముతో, ఎక్కువవెచ్చగాను, తుమ్ములతోను యుండుట.

ముఖము:— జ్వరమువలనపొంగరించి, నిగనిగలాడుచుండుట.

నోరు:— పెదవులుపగులుట, నాలుకపై గోధుమవర్ణముపూత,

అన్నకోశము:—చల్లని నీటిని దాగిగోరుట. పానీయములు త్రాగి నవెంటనే వమనమగుట. ఎక్కిళ్లను మాన్పును.

మలము, మలాశయము:—తరుచు పసరువిరేచనములు వెడలుచుం డుట. ఆసనములో వెచ్చగానుండుట. ఒకప్పుడు కాలేయములో నొప్పి తో విరేచనబద్ధముండుట.

మూత్రావయవములు:—మూత్రము కొద్దికొద్దిగాను, ఒకప్పుడు చుక్కలు చుక్కలుగాను, శ్వేతధాతువుతోకలసి పోవుచుండుట.

శ్వాసావయవములు:—ఛాతీలో నొప్పితోను, వెచ్చదనముతోను, కూడియుండు దగ్గు; దీనితోపాటు ముఖము పొంగరించి యుండుట. మన్య పు జ్వరమును అణచిపెట్టుటవలన క్షయదగ్గు వచ్చుట. ఛాతీలోనొప్పి వూపి రితీయుటవలన యెక్కువగుట. నిలుచుండినప్పుడు, కూర్చున్నప్పుడు, పడు కొనినప్పుడు, శరీరమువంచినయెడల యెక్కువ నొప్పిగాయుండుట.

కాళ్లు, చేతులు:—నడినెత్తిలోను, మెడలోను, చితుకకొట్టినట్లు నొప్పిగాయుండుట, నలుగకొట్టినట్లు నడుములో నొప్పిగాయుండుట. జ్వరమున్నప్పుడు నడుములో వణుకువచ్చుట. చేతులలోను గుత్తులలోను నొప్పులుగా నుండుట, నీరుపట్టుట లేక వాచుట.

నిద్ర:—తరుచు ఆవలింతలువచ్చుట. అస్థిమితమువలననిద్రలేమి. మన్యపుజ్వరములో భయంకరమైన కలలువచ్చుట.

జ్వరము:—మన్యపు జ్వరము. రాత్రియందును వుదయమునను చలిగాయుండుట. కదలుటవలనవణుకు, వికారమువచ్చుట, మరియు నడు ములోను, అవయవములలోను పోట్లు, నొప్పులువచ్చుట. చలి వుదయమున ప్రారంభించి యెక్కువ బాధ, వణుకు, నీరసముతోను వుండుట. చెమట పట్టకపోవుట. చలితగ్గినపిమ్మట పైత్యరసమును వమనము చేసుకొనుట.

వుద్రేకము:—నియమితకాలములలో, 3 వ రోజున, 7వ రోజున, ఏడమవ్వపున,

వుపశమనము:—సంభాషణవలన.

మోతాదు:—1 మొదలు 30 పొటెన్సీ.

---

## 105. యూఫేృషియా. EUPHRASIA.

ఇది కండ్లరోగములమీద బాగుగాపనిచేయును. పడుటవలనను మోటపనిముట్లు తగులుటవలననుకలిగిన దెబ్బలకును(అర్నికా),కండ్లయొక్కయు, ముక్కుయొక్కయు ఆమత్వచలనుండి కలుగు స్రావములకును దీనిని వాడవచ్చును.

తల:—దెబ్బ తగిలినట్లుగా కంగారుగానుండుట, కండ్లు చెదరుట. తల బ్రద్దలైనట్లు నొప్పిగానుండుట. పడిశెముతోగూడిన తలనొప్పి, దీనిలో ముక్కునుండియు కంటినుండియు యెక్కువ స్రావము వెడలుట.

కన్నులు:—కండ్లనుండి యెల్లప్పుడును నీళ్లు కారుచుండుట. కండ్లనుండి వగరైనట్టియు, ముక్కునుండి మృదువైనట్టియు, స్రావము వెడలుచుండుట. స్రావము ఒకప్పుడు చిక్కగాను, ఒరుపును కలుగజేయుచు వెడలుచుండుట. కనురెప్పలు వుబ్బుటను, మంటగానుండుటను మాన్పును. కాచబింబముపైని బంకవలెనుండు ఆమను జేరుటయు దీనిని తీసివేయుటకు కండ్లను చికిలింపవలసివచ్చుటయు గలుగుచుండుట. నొక్కుచున్నట్లుబాధగావుండుట. దృష్టి ఆనకపోవుట. కండ్లుదుగదగాను, యెర్రగాను, వాపుగాను యుండుట. కండ్లకలకనుమాన్పును. వెలుతురు చూడలేకపోవుటను, కండ్లలోనిపువ్వులను, పుండ్లను మాన్పును.

ముక్కు:—విపరీతమైనదగ్గు, విస్తారము స్రావమువుండుట.ముక్కునుండిరక్తస్రావమగుట. పగలు యెక్కువగా స్రావము వెడలుట. రాత్రియందు ముక్కు దిబ్బడవేయుట.

ముఖము:—దౌడలు యెర్రగాను, వెచ్చగాను వుండుట.

అన్నకోశము:—సుర్వ్యాసనగానుండు ఆమశయము కాండించుటవల ని వమనము. పొగ త్రాగుటవలన వికారము, రుచి చేదువచ్చుట.

మలము, మలాశయము:—జిగటవిరేచనములు, మలబద్ధము మలాశయము నెలుపలకు వచ్చుట.

శ్వాసావయవములు:—పగలు కోరింతదగ్గువచ్చుట. దీనితోపాటు కండ్లనుండి నీళ్లుకారుచుండుట. బహిరంగమైనగాలిలో నడుచుచున్నప్పుడు తరుచు ఆవలింతలువచ్చుచుండుట. విషపడిశెము. శ్వాసకష్టముగానుండుట. కూర్చున్నప్పుడుగూడ వూపిరాడక బాధగానుండుట.

చర్మము:—పొంగుయొక్క ప్రథమావస్థలో కండ్లకుసంబంధించిన రోగలక్షణములమీద బాగుగా పనిచేయును.

నిద్ర:—పగలు నిద్రమత్తుగానుండుట. నడచుచున్నప్పుడు ఆవలింతలువచ్చుట. నిద్రలో భయంకరమైన కలలు గనుచు, తరుచు మెలకువ వచ్చుచు, భయమువలన పడకనుండి లేచుచుయుండుట.

వుద్రేకము:—సాయంకాలమునందు, ఇంటిలోపల, వెచ్చదనము వలన, కాంతివలన.

వుపశమనము:—కాఫీత్రాగుటవలన, చీకటిలో, బహిరంగమైన గాలిలో.

విరుగుళ్లు:—కేంఫరు, పల్సటిల్లా.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 3 మొదలు 4 వారములు.

బాహ్యోపయోగములు:—దీనిని స్వచ్ఛమైన మదరు టించరు రూపమున తీసికొని, ఔన్సు గోరువెచ్చని నీళ్లకు 10 మొదలు 15 చుక్కలవరకు కలిపి దినమునకు 2 సారులు కండ్లను కడిగిన యెడల లేక కండ్లలో పోసినయెడల కండ్లు అంటుకొనుట, పుసికట్టుట, నీరుకారుట, కండ్ల వాపులు, కండ్లయెరుపులు, కలకలు, కండ్లలోని పువ్వులు మానును.

## 106. ఫికస్ రెలిజియోసా. FICUS RELIGIOSA.

(హిందూదేశపు ఔషధము, **33.** రావిచెట్టు).

ఇది బహువిధ రక్తస్రావములను కట్టును. ఋతుస్రావ మెక్కువగా అగుచున్నప్పుడును, బహిష్టుబహిష్టుమధ్య రక్తస్రావమగుచున్నప్పుడును, రక్తవమనములగునప్పుడును, మూత్రములో రక్తముకలసి పోవునప్పుడును, రక్తవిరేచనములకును, సన్నిపాతజ్వరములోవచ్చు రక్తస్రావమునకును, ముక్కునుండియు మూలశంఖనుండియు రక్తస్రావమగునప్పుడును దీనిని వాడవచ్చును.

మనస్సు, తల:—కంగారుగా నుండుట. వికారముగాను కొద్దిగా తలనొప్పిగాను వుండుట. దృష్టి మందగించుట. ముఖము పచ్చగా పాలిపోయినట్లుగుపడుట.

శ్వాసావయవములు:—శ్వాస కష్టముగా నుండుట. దగ్గునప్పుడు శ్లేష్మముతోగూడి రక్తముపడుట.

బహునిస్త్రాణగాను, అస్థిమితముగాను యుండుటను మాన్పును. ఇది అన్నివిధములైన రక్తస్రావములమీదను బాగుగా పనిచేయును.

పోల్చదగినవి:—ఎకాలిఫా, ఇపెకాక్, మిల్లిఫోలియం, జిరానియం.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 107. ఫ్రాన్సిస్కియా. FRANCISCEA UNIFLORA.

ఇది పవాయివ్యాధిమీదను మహావాతవ్యాధిమీదను బాగుగా పని చేయును మహావాతసంబంధమైన రోగములు లేక లక్షణములు నూతనముగా వచ్చినను లేక చాలకాలమునుండి నిలువగాయున్నను, మరియు సెగ, పవాయి, యిట్టిరోగములకు సంబంధించియున్నను, బాగుగా పనిచేయును. తలకు బద్దీని చుట్టబెట్టినట్లు నొప్పిగాయుండుట. నడినెత్తిని, మెడలోను,

వెన్నెముకలోను, గుచ్చుచున్నట్లును, పోడుచుచున్నట్లును నొప్పిగా యుండుట; మరియు విస్తారముగా చెమటపట్టుట. కండరములు కొయ్యబారినట్లుండి వంగకుండుట. కాళ్ల లోను, చీలమండలలోను, మేహవాత నొప్పులువచ్చుటను మాన్పును. మూత్రములో యూరిక్ యాసిడ్ (Uric Acid) యెక్కువగాకలిసి యుండినపు డిది పనిచేయును.

మోతాదు:—మదరు టించరు. మోతాదుకు 2-10 చుక్కలు.

---

## 108 ఫ్రాక్సినసు. FRAXINUS AMERICANUS.

ఇది స్త్రీమర్మావయవరోగములమీద బాగుగా పనిచేయును. గర్భాశయములో కంతులు బయలుదేరుట, గర్భాశయము వాచుట, గర్భాశయములో టగలాగుచున్నట్లు బాధగాతోచుట, గర్భాశయము వెలుపలకు వచ్చుట, ప్రసవానంతరము గర్భాశయము యథాస్థితికి రాకుండుట, మరియు నిది బాధగాను, బరువుగాను, వుండుటనుమాన్పును.

తల:—జ్వరము వచ్చినపిదప వికారము తలనొప్పి వచ్చుట. పెదవులపైని జ్వరసంబంధమైన చిన్నచిన్న పుండ్లు బయలుదేరుట. ఎక్కువ అస్థిమితముగా నుండుట.

పొత్తికడుపు:—ఎడమగజ్జలో వాపుగాను బాధగాను యుండుట.

మలము:—మలబద్ధముగా నుండుట.

మూత్రము:—కొద్దిగాను గోధుమవర్ణముగాను వెడలుట.

స్త్రీఅవయవములు:—ఋతుశూల. ఒరుపును కలుగజేయునట్టి నీళ్లవంటి స్రావముతోగూడిన కుసుమ. గర్భస్రావమును ఆపుచేయును.

కాళ్లు, చేతులు:—పాదములలో తిమ్మెరలు వచ్చుచుండుట. ఇవి జ్వరముతగ్గినపిమ్మట కలుగునపుడిది పనిచేయును.

నిద్ర:—సగము రాత్రివరకు మెలకువగానుండుట. అటుపిమ్మట యింటిలో దొంగలుపడినట్లును, వారిని పారదోలినట్లును అటుపిమ్మట

పోలీసువారికి కబురుచేసినట్లును కలగని, కల ముగిసినవెంటనే మెలకువ జెందుట. ఇట్టి కలలవలన శ్వాస పడిగా పీల్చుట, భయముజెందుట.

మోతాదు.—సుదరుటించరు. మోతాదుకు 5-15 చుక్కలు.

---

## 109. ఫ్యూకస్. FUCUS VESICULOSUS.

శరీరమునందు క్రొవ్వు పెరుగుట, అజీర్ణము, మలబద్ధము, గండమాల రోగము, క్రొవ్వుపట్టిన శరీరము గలవారిలో థైరాయిడు గ్రంధి (Thyroid gland), పెద్దదగుట—వీటిమీదనిది బాగుగా పనిచేయును. దీనిని వుపయోగించుటవలన శీర్ణము చాలత్వరగానగును. మరియును వాయువు తరుచుగా వెడలుటను, పొట్టవుబ్బరింపును, క్రొవ్వునుమాన్పును.

అన్నకోశము:—త్వరితముగా జీర్ణమగుచుండుటవలన భోజనము కొరకు అతితొందరగా నుండుట, అజీర్ణము, కడుపులో బరువు, బాధ, మొదలగులక్షణములు కలుగనేరవు. పొట్టలోని క్రొవ్వును హరించివేయును.

పోల్చదగినవి:—ఫైటోలక్కా, అయోడియం.

మోతాదు:—మదరుటించరు. మోతాదుకు 5 మొదలు 20 చుక్కలు

---

## 110. గేంబోజియా. GAMBOGIA.

ఇది జీర్ణావయవ మండలమునకు సంబంధించిన వ్యాధులమీద బాగుగాపనిచేయును. నీళ్ళవిరేచనములమీద బాగుగా పనిచేయును. విరేచనముల కొరకు అతితొందర కలుగుట, విరేచనము ఒక్కసారిగా వెడలుట, విరేచనమైన పిమ్మట రోగికి చాల వుపశమనము కలుగుట. ముసలివారిలో నీళ్ళవిరేచనములగుచుండుట—ఇవి దీనిముఖ్యలక్షణములు.

తల:—భారముగాను, తిరుగుచున్నట్లును, నిద్రమత్తుగాను యుండుట. కండ్లు మంటగాను, దురదగాను యుండుట. కనురెప్పలు అంటు

కొనుట. తుమ్ములు వచ్చుచుండుట. చెవులలో పోటు యున్నట్లు బాధ.

అన్నకోశము, పొత్తికడుపు:—భోజనానంతరము బాధగా నుండుట. నొప్పిగాను, వాపుగాను వుండుట. ఎక్కువదాహముగా నుండుట. వమనములు విరేచనములు వెడలుచు స్మృతితప్పి పడిపోవుచుండుట. భోజనమునందసహ్యాత కలుగుట. పొత్తికడుపు వుబ్బరింపు, బొడ్డువద్ద కుట్టుచున్నట్లు బాధ. కాలేయములో మండుచున్నట్లు బాధగానుండుట.

మలము, మలాశయము:—పేగులలో గుడగుడలాడుచుండుట. జిగటవిరేచనములు. ఆకుపచ్చని నీళ్లవిరేచనములు ఒక్కసారిగాను, వడిగాను, వెడలుచుండుట. విరేచనానంతరము ఆసనములో మంటగాను, తీపుగాను యుండుట. వేసవిలోవచ్చు నీళ్లవిరేచనములు.

స్త్రీఅవయవములు:— బహిష్టు త్వరగాను, సొవ మెక్కువ గాను ఆగుట. తెల్లకుసుమ.

వుద్రేకము:—సాయంకాలమునందు, రాత్రియందు.

వుపశమనము:—బహిరంగమైనగాలిలో, కదలికవలన, నిబ్బరముగా కూర్చుండుటవలన.

విరుగుళ్లు:—కేంఫరు, కాఫీ, ఓపియం.

పోలికలు:—క్రోటనుటిగ్, ఏలోస్, పోడోఫైలం.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 111. గాల్థీరియా. GAULTHERIA.

ముఖముకు, అన్నకోశముకు, అండాశయముకు, గర్భాశయముకు, మరియు బహిష్టుకు సంబంధించినట్టి నరములలోని నొప్పులు, లేక పార్శ్వపునొప్పులు, సయాటికా, వాపుతోగూడిన మేహవాతలక్షణములు—వీటిమీద నిది బాగుగా పనిచేయును,

తల:—తలను ముఖమును వచ్చు పార్శ్వపునొప్పులు.

అన్నకోశము:—మానని వమనములు, ఆపుకోలేనట్టి ఆకలి. అజీర్ణముగా యున్నను ఆకలికలుగుట. త్రాగిననీళ్లుసహితము వమనమగుట.

మోతాదు:—1 మొదలు 30 పొటెన్సీ.

---

## 112. జెల్సీమియం. GELSEMIUM.

ఇది పిల్లలయొక్కయు, యువకులయొక్కయు, ముఖ్యముగా నరముల నిస్త్రాణ లేక అపస్మార సంబంధమైనతత్వములుగల స్త్రీలరోగముల మీదను బాగుగా పనిచేయును. శరీరములోని కండరములు సడలుట, నిస్త్రాణ జెందుట, ఇందువలన అవయములను కదల్చుట కష్టముగా యుండుట. రోగి సులభముగా ప్రుదేకము జెందుచు,చిరచిరలాడుచు యుండుట. హస్తప్రయోగాది దురభ్యాసములకులోనైన స్త్రీపురుషుల నరముల సంబంధమైన వ్యాధులు (కాలీఫాసు), భయము, ఆవేశము పుట్టించు వార్తలవలనను ఆకస్మికముగా కలుగు మనోవికారమువలనను వచ్చు లక్షణములు (ఇగ్నేషియా), చుట్టలుత్రాగుచేయువారిలో వచ్చు గుండెదడ, నపుంసకత్వము, నరములదోషములు—వీటినిమాన్పును.

మనస్సు:—చనిపోవుదునను భయము (ఆర్సెనికం ఆల్బం).ఎక్కువ అస్థైర్యమును జెందుట. ఒంటరిగాను, స్థిమితముగాను వుండగోరుట. నెమ్మదిగానుండు మనుష్యులైనను దగ్గరగానుండుట కిష్టపడకపోవుట. మరియు వారితో మాటలాడుటకయిష్టత. మనస్సు నిలకడలేమి. ఎక్కువగా మూత్రము విడిచినపిదపకొంతవరకు వుపశాంతిని జెందుట. ఒకప్పుడతికులాసాగా నుండుట, వెంటనే యిది విచారములోనికి మారుట.

తల:—త్రాగినవానివలె తలతిరుగుట, తలలోను, కనురెప్పలలోను, భారముగాను, చితుకకొట్టినట్లునుయుండుట, నొక్కుటవలనను, తలయెత్తుగాయుంచి పరుండుటవలను వుపశమించుట తలగడపైని తలనుంచిపరుండు

కొనవలెననియుండుట. తలనొప్పి ప్రాతఃకాలభోజనానంతరము తలవెనుక నై పునవచ్చుట. ఇదికదలికవలనను ముందరకు వంగుటవలనను యెక్కువగుట. తలకు ఇనుపబద్దీనిగట్టిగా చుట్టబెట్టినట్లు నొప్పిగాయుండుట నొప్పి కనుబొమలలో బయలుదేరి, చెవులలోనికిని, ముక్కులోనికిని ప్రాకుట.

కన్నులు:—కనురెప్పలలో భారముగానుండుటచే మూతలుపడుట. కండ్లను తెరచి యుంచుట కష్టముగా నుండుట. వెలుతురుచూచుట కష్టముగా నుండుట. చితుకకొట్టినట్లు కండ్లలో నొప్పిగాయుండుట. కనుపాపలు పెద్దవగుట. దృష్టి కంగారుగా నుండుట. దృష్టి మందముగాను తలతిరిప్పగాను వుండుట. కండ్లయెదుట మబ్బునై చినట్లుండుట. చూపు 2 చూపులుగా ఆనుట. ఇందువలన వీధిలో తను యేవై పునున్నదియు తెలియకపోవుట. ఒకపాప పెద్దదగుట, మరియొకపాప చిన్నదగుట.

చెవులు:—అకస్మాత్తుగా చెముడువచ్చుట, ధ్వనులు వినబడుట. స్రావము, బాధ గలుగుట. క్వయినా నెక్కువగా వాడుటవలని చెముడు.

ముక్కు:— ఉదయమున తుమ్ములు ఆగిఆగి వచ్చుచుండుట. ఒరుపును గలుగజేయునట్టి నీళ్ళవంటి స్రావము వెడలుట. కుడి నాసికా రంధ్రము దిబ్బడవేయుట, ముక్కుమాటలు వచ్చుట. గాలిమార్పులవలన సులభముగా జలుబుచేయునట్టి తత్వములమీద బాగుగా పనిచేయును.

ముఖము:—బరువుగాను వెచ్చగాను కందబారి స్మృతితప్పినవాని వలె యుండుట. నరములబాధలను లేక పార్శ్వపునొప్పిని మాన్పును. కండరములు ముడుచుకుపోవుట లేక కొయ్యబారుట. కండరములలో దోషమువలన దిగువదౌడ మీదకును క్రిందకును మామూలుగా ఆడకపోవుట.

నోరు:—నాలుక మొద్దుబారుట. నాలుకపై చిక్కనిపూతగలుగుట. నాలుకకు వణకువచ్చుట. శీతలమువలనగాని నరముల దోషమువలనగాని వచ్చు పంటిపోటు. పిల్లలకు పండ్లువచ్చుకాలములో పిల్లలు వ్యాగ్రముగా నుండుట, అకస్మాత్తుగా కెవ్వున కేకవేయుచు నిద్రనుండి మేలుకువచ్చిం

దుట. ముఖము కందుట. నోటినుండి దుర్వాసన. నోటిలోమంట. గొంతుక లోనికిని, జీర్ణకోశములోనికిని వ్యాపించుట.

గొంతుక:—వెచ్చని ఆహారమును గుటకవేయుట కష్టముగానుం డుట. గొంతుకలో వుండపెట్టినట్లు తోచుట. గుటకవేయుట కష్టము. గొంతుక బొంగురుపోవుట. గుటకవేయుటవలన చెవిలో నొప్పివచ్చుట.

అన్నకోశము:— కుళ్లినట్లుండు రుచి. దాహములేమి. యెక్కిళ్లు సాయంకాలమున యెక్కువగుట. తేపులు వచ్చుచుండుట.

పొత్తికడుపు:—పైపైపున మూడుచుకొనిపోవుచున్నట్లుండు బాధ వలన యేడ్పువచ్చుట. వాయువు యెక్కువగా జేరుటవలన గుడగుడలాడు చుండుట. అప్పుడప్పుడు శూలవచ్చుచు, నీళ్లవిరేచనములగుట.

మలము, మలాశయము:—మలము పసుపుపచ్చగాను, ఆకుపచ్చ గాను, మట్టిరంగుగాను వుండుట. మెత్తగానుండు మలమును గూడ వెలు వరించుట బహుకష్టముగానుండుట. మలాశయములోని కండరములలో బలహీనతగలుగుటవలన సవి సరిగా పనిచేయకపోవుట. మనోవికారమువల నను భయమువలనను విచారమువలనను నీళ్లవిరేచనము(గుట.

మూత్రావయవములు:— మూత్రమెక్కువగాను, నీళ్లవలెను, తేట గాను, చలితోను, మూత్రకోశములో కంపముతోను వెడలుట. మూత్ర ధార ఆగిఆగి వచ్చుచుండుట.

పురుషావయవములు:—అంగము ముడుచుకొనిపోయి చల్లగానుం డుట. లేపనము లేకయే స్ఖలనమగుట. మూత్రవిసర్జనలో కూడ స్ఖలనమగుట. శృంగారసంబంధమైన కోరికవలన స్ఖలనమగుట. శెగరోగముయొక్క ప్రథ మావస్థలో స్రావము, బాధ, కొలదిగా నున్నప్పుడును, నెప్పదన మెక్కు వగానున్నప్పుడును పనిజేయును.

స్త్రీఅవయవములు:—పొడుచుచున్నట్లుండు బుఱుశూల. ప్రసవ ములో నొప్పులు కొద్దికొద్దిగా వచ్చుట లేక అసలే రాకపోవుట, దొంగ

నొప్పులు. గర్భాశయము బరువుగానున్నట్లు తోచుట. ఋతువు అణచి పెట్టబడుట, కంపముతో గూడిన రోగమువచ్చుట.

శ్వాసావయవములు:—శ్వాస నెమ్మదిగాను నిస్త్రాణగానువచ్చుట. వూపిరాగిపోవునట్లుగా తోచుట. ఛాతీలో నొప్పి. నీళ్లవంటి స్రావముతో గూడిన పొడిదగ్గు.

హృదయము:—వక్రముగాను, దడగాను కొట్టుకొనుట. కదలక పోయినయెడల తనహృదయము ఆగిపోవునని తోచుట. నాడి వడిగాను, నీరసముగాను, సన్నముగాను కొట్టుకొనుట; కదలికవలన పుష్టిజెందుట.

నడుము, కాళ్లు, చేతులు:—నడుములో బరువుగానుండు నొప్పి, అపస్మార సంబంధమైన కంపములు. స్వల్పపరిశ్రమవలనగూడ దిగువ అవయవములకు అలసటవచ్చుట. వాతగాండ్ర వేళ్లలో నరముల సంబంధమైన బాధలు. అన్నిఅవయవములలోను నీరసము, వణకు గలుగుట.

చర్మము:—వెచ్చగా, పొడిగా, దురదగా, దద్దురులతోయుండుట. పొంగులోవలె ముఖముమీదదద్దురులు బయలుదేరుట. ముఖముకందుట.

నిద్ర:—బాగుగా నిద్రపట్టకపోవుట. నిద్రవచ్చినవెంటనే పరాకు మాటలాడుచుండుట. అలసటవలన గలుగు నిద్రలేమి. ఆవలింతలువచ్చుట. నరముల వుద్రేకమువలని నిద్రలేమి (కాఫి).

జ్వరము:—వణకువలన యితరులు తనను పట్టుకొనవలసివచ్చుట. నాడి నెమ్మదిగాను, నిండుగాను వుండుట. మన్యపుజ్వరములో కండరములలో నొప్పులువచ్చుట, నిస్త్రాణగలుగుట. విపరీతమైన తలనొప్పికి కంపములకు పనిచేయును. పైత్యజ్వరములలో నిద్రమత్తు, బుద్ధిమాంద్యము, దాహము లేకపోవుట వున్నప్పుడిది పనిచేయును. పిల్లలలో దద్దుగుపొక్కులతోగూడిన జ్వరము; ఈదద్దురు బయలుదేరునప్పుడు కంపములు, వణకువచ్చుట, అటుపిమ్మట వెచ్చదనమును, తరువాత చెమటయు వచ్చుటతోనుండు జ్వరములలో యిది బాగుగా పనిజేయును.

ఉద్రేకము:—సూర్యరశ్మివలన, గ్యాసులైటుకాంతివలన, మెట్లెక్కుటవలన, పొగత్రాగుటవలన, మాట్లాడుటవలన.

ఉపశమనము;—ముందుకు వంగుటవలన, మూత్రమెక్కువగా వెడలుటవలన, బహిరంగమైన గాలిలో, మానకుండా కదలుచుండుటవలన, వుద్రేకమునిచ్చు పదార్థమువలన, కండ్లు మూసుకొనుటవలన.

విరుగుళ్లు:—చైనా, కాఫీ, డిజిటాలిసు, ఓపియం, నేట్రంమూరు.

మోతాదు:—1 మొదలు 200 పొటెన్సీ. పెద్దపొటెన్సీలలో గూడ బాగుగా పనిచేయును. దీని గుణకాలపరిమితి 30 దినములు.

---

## 113. జిరానియం మేక్. GERANIUM MACULATUM.

రక్తస్రావములను కట్టుటలో యిది అగ్రగణ్యమైనది. రక్తస్రావములు వూపిరితిత్తులనుండిగాని, ముక్కునుండిగాని, అన్నకోశమునుండిగాని మరియేయితర అవయవమునుండికాని గలిగినప్పుడు దీనిని వాడవగును. మానవటువంటి నీళ్లవిరేచనములు, కుసుమసంబంధమైన స్రావములు, జిగటవిరేచనములు, వేసవిలోవచ్చు విరేచనములు (Summer complaint), తలనొప్పులు—వీటిమీాద బాగుగా పనిచేయును.

తల:—మానవటువంటి తలనొప్పి, తల దిమ్ముగా నుండుట; ఇవి కండ్లుమూసుకొని పరుండినపిమ్మట వుపశమించుట.

నోరు:—నాలుక చివర మంటగానుండుట. నోరు ఆర్చుకొనిపోవుట.

అన్నకోశము:—పుండును మాన్పును.

మలము, మలాశయము:—తరుచు విరేచనానుమానముగలిగినను విరేచనముపకపోవుట. దుర్వాసగానుండు ఆమముతోగూడిన నీళ్లవిరేచనములు. మలబద్ధము. మలాశయమువెలుపలకువచ్చుట, మూలశంఖ—వీటిలో దీనిని బాహ్యోపయోగముచేయుచు లోపలకుగూడ పుచ్చుకొనవలయును.

స్త్రీ అవయవములు:—ఋతుస్రావము యెక్కువగా వెడలుట. ప్రసవానంతర స్రావము. బహిష్టుకుబహిష్టుకు మధ్యగలుగు గర్భాశయస్రావములను, కుసుమను మాన్పును-పీటికి యీ ఔషధమును మర్మాయవముల లోనికి పిచికారీ చేయుటకుకూడ మంచిది.

మోతాదు:—మపరుటించరు. సాధారణముగా మోతాదు 1కి 10 చుక్కలు చొప్పున వాడవచ్చును. అవుసరమునుబట్టిని, అపాయస్థితిలోను, మోతాదుకు 30 లగాయితు 60 చుక్కలవరకు వాడవచ్చును.

---

## 114. జిన్సెంగు. GINSENG.

నడుమునొప్పి, మేహవాతనొప్పులు, సయాటికా, ఎక్కిళ్లు, చర్మరోగములు—వీటిమీద నిది బాగుగా పనిచేయును. రాత్రియందు చట్టలోనుండి బొటనవ్రేలివరకు త్రెవ్వుచున్నట్లును, లాగుచున్నట్లును వుండు నరములసంబంధమైన బాధలను మాన్పును. ఇది కుడివైపు అవయవముల మీద బాగుగా పనిచేయును.

గొంతుక:—నల్లనిశరీరులలో గవదకాయలు వాచుట, పెద్దవగుట.

పురుషావయవములు:—ఎక్కువ పుద్రేకము జెందుట. రాత్రియందు లేపన మెక్కువగా నుండుట. వ్యవహారసంబంధమైన పనులలో మునిగియున్నప్పుడు లేపనము యెక్కువగాగలుగుట. అండములలో చితుకగొట్టినట్లు బాధగానుండుట. స్ఖలనానంతరము మేహవాతనొప్పులువచ్చుట.

మెడ, నడుము:—మెడ, నడుము, కొయ్యబారుట, మెడలో బరువుగా నుండుట. నడుములోను వెన్నెముకలోను చల్లగానుండుట. నడుము దిగువనను తొడలలోను చితుకగొట్టినట్లు నొప్పులుగా యుండుట.

కాళ్లు, చేతులు:—నడచుచున్నప్పుడు కీళ్లసంధులలో కరుకుమనుట. చేతులువాచినట్లును చర్మము బిగపట్టినట్లును భావన. కీళ్లసంధులలో కొయ్యబారినట్లును, ముడుచుకొనిపోయినట్లును బరువుగాను యుండుట.

చర్మము:—మెడమీద ఛాతీమీద దురదగల మొటిమలు లేచుట.

ఉద్రేకము:—రాత్రియందు, బహిరంగమైన గాలిలో.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ. మదరుటించరు మోతాదుకు ఒక చుక్క.

---

## 115. హెమామెలిసు. HAMAMELIS.

ఇది ముఖ్యముగా దుష్టరక్తనాళముల వాపులను; మూలశంఖునుండి గాని, ముక్కు, ఊపిరితిత్తులు, గర్భాశయము, మూత్రకోశములు—వీటి నుండి గలుగు రక్తస్రావములను మాన్పును. దెబ్బలు తగిలినచోట్లనుండియు మోటపనిమూట్లవలనను, ఆయుధములవలనను, చీల్చుకుపోయిన, లేక, తెగిన ప్రదేశమునుండి కలుగు రక్తస్రావములను కట్టి,నొప్పిని,వాపును, బాధను మాన్పును (ఆర్నికా); ఇట్టివాటిలో దీనిని పైకిని లోపలకును వాడవలెను. దెబ్బలవలని బాధలు నిలువగా యున్నప్పుడు లేక మాననపుడు దీనిని వాడవలయును (కోనియం).

మనస్సు:—మందమతిగాను, విచారముగాను యుండుట. ఇతరులు తనకు తగిన మర్యాద చూపవలెననుకొనుట. చిరచిరలాడుచుండుట.

తల:—నుదుటియెముక మొద్దుబారినట్లుతోచుట. పగలు తల నిండుగా మందముగాయుండుట. తలనొప్పి స్థలనానంతరమునచ్చుట. ఒక కనుబొమనుండి రెండవకనుబొమవరకు అడ్డముగా గడియవేసినట్లు భావన.

కండ్లు:—దెబ్బతగులుటతో కండ్లువాచుట, బాధగానుండుట, రక్తముస్రవించుట. కంటిలోపలగలుగు రక్తస్రావములను త్వరలో హరించును. కండ్లుబాధగాను, నీరసముగాను, రక్తము జిమ్మినట్లునుయుండుట.

చెవులు:—ఝుంకారము చేయుచున్నట్లుండు ధ్వని. ముక్కునుండి రక్తస్రావమైనపిదప కుడిచెవినుండి రక్తస్రావముగలుగుట, ఇట్లు జరిగిన పిదప తలలో భారముతగ్గుట.

ముక్కు:—వాసన సులభముగా తెలియుట. ముక్కునుండి దుర్వాసనవచ్చుట. ముక్కు దిబ్బడవేయుట. గడ్డకట్టినట్టి రక్తము స్రవించుట.

ముఖము:—కుడిదౌడమంటగా నుండుట. కండరములు బిగపట్టినట్లు బాధగానుండుట. పెదవులార్చుకుపోయి బీటలుతీసి బాధగానుండుట.

నోరు:—పంటిసలుపువలని నిద్రలేమి. బాధలు వెచ్చనిగదిలో వుద్రేకము జెందుట. ఇగుళ్లు వాపుగాను, బాధగాను, రక్తస్రావముతోను యుండుట. పండ్లను వూడతీయించుకొనినపిదప గలుగు రక్తస్రావములను కట్టును నాలుకపంచలమీద నీటిపొక్కులు బయలుదేరుట.

గొంతుక:—దగ్గినప్పుడు కొండనాలుకలో కుట్టుచున్నట్లు బాధగానుండుట. గొంతుక బొంగురుగానుండుట. కుడిపైపుగవదకాయలో వాపు.

అన్నకోశము:—భోజనానంతరము త్రేణుపులువచ్చుట, నల్లనిరక్తము స్రవించుట. భోజనానంతరము వికారము, వమనానుమానముగలుగుట. వమనము ఆపుకొనుటకు కదలకుండగ పడుకొనవలసివచ్చుట.

పొత్తికడుపు:—వుబ్బరింపు పొత్తికడుపులోను,బొడ్డుచద్దనుమంటగానుండుట. దిగువభాగమునందు మంటగానుండుట. భోజనానంతరము 2 గంటల వరకు నొక్కుచున్నట్లును, లాగుచున్నట్లును నొప్పిగాయుండుట.

మలము, మలాశయము:—మలము గట్టిగాను,జిగటతోను వెడలుట రక్తవిరేచనములను కట్టును. ఆసనమునుండి రక్తము స్రవించుటనుమాన్పును. తొరువలెనుండు నల్లనిరక్తము సన్నిపాతజ్వరములో వెడలుచుండునప్పుడిది పనిచేయును. మూలశంఖ మంటగాను, తీవుగాను; సులభముగాను విస్తారముగాను వెడలునట్టి రక్తస్రావముతోను వుండుట. ఆసనము దురద.

మూత్రావయవములు:—మూత్రానుమాన మెక్కువగాయుండుట. మూత్రము స్వచ్ఛముగాను, విస్తారముగాను వెడలుచుండుట. ఒకప్పుడిది కొలదిగాను, ముదరరంగుగాను వెడలుట. మూత్రపిండముల వాపును రక్తముతోగూడి మూత్రము వెడలుటను మాన్పును. మూత్రద్వారము మంట

గాను, వెచ్చగాను వుండుట.

పురుషావయవములు:—అండములలోని నరములు లాగుచున్నట్లుండుట. బాధలు రేతోవాపింకలగుండా అండములలోనికి పాకుచుండుట. వృషణములవాపు, బాధ, నొప్పిని మాన్పును. వృషణములలో దుష్టరక్తనాళముల వాపువలన బాధగానుండుట.

స్త్రీ అవయవములు:—నడుములో నొప్పితోగూడిన గర్భాశయ స్రావములు. ఋతురక్తము నల్లగాను, విస్తారముగాను, కడుపునొప్పితోను వెడలుట. బహిష్టునబహిష్టునమధ్య గలుగు స్రావములను మాన్పును. విస్తారముగా వెడలునట్టి కుసుమను, మూలశంఖను, రక్తక్షీణతను మాన్పును.

శ్వాసావయవములు:—శ్లేష్మముతో రక్తజీరవుండుట. ఛాతీ బిగపట్టినట్లుండుటవలన శ్వాస కష్టముగాను, పండుకొనుటకు వీలులేకుండగను యుండుట. గిలిగింతలు పెట్టుచున్నట్లుండుటవలన దగ్గువచ్చుట.

హృదయము:—గుండెదడను మాన్పును.

నడుము, కాళ్లు, చేతులు:— నడుములోనొప్పి పాదములవరకు వ్యాపించుట. చేతులలోను, కాళ్లలోను, అలసినట్లును, నీరసముగాను, యుండుట. కీళ్లసంధులలోను, కండరములలోను నొప్పిగాయుండుట. దుష్టరక్తనాళములవాపును మాన్పును.

చర్మము:—ఒరుపులు నీలిరంగుగానుండుట. దుష్టరక్తనాళసంబంధమైన వాపులు, పుండ్లు, దెబ్బలవలనివాపులు, వెచ్చదనము, బాధలు.

నిద్ర:— రాత్రియందు అస్థిమితమైననిద్ర. వుదయముననిద్రవచ్చుట.

జ్వరము:—పరుండునప్పుడు చలిగానుండుట. జ్వరమువచ్చునను భయముగలుగుట. రాత్రియందు జ్వరముగానున్నప్పుడు చేతులు వెచ్చగాను, కండ్లుమూసుకొనినపిదప కనురెప్పలలో మంటగాను యుండుట. రాత్రియందు పరుండినపిదప బాగుగా చమటలు పోయుట. నాడి పుష్టిగాను, చురుకుగాను యుండుట.

జ్వరములలో రక్తస్రావసూచనలు గలిగినప్పుడును, మసూచికము లోను పొంగుతోను గలుగు రక్తస్రావములకును, ప్రసవానంతర రక్తస్రావములకును గర్భస్రావమైన పిమ్మట స్త్రీకడుపులో గలుగు నొప్పికి (పైకి వుపయోగించవలయును) ని, రక్తమొలలకును (పైకిని, లోపలకును వాడవలెను) ఇది బాగుగా పనిచేయును.

వుద్రేకము:—వెచ్చని గాలిలో, తేమగాలిలో, పరుండుటవలన, మధ్యాహ్నమందు.

వుపశమనము:—సాయంకాలమందు, బహిరంగప్రదేశమునందు.

సహచరులు:—ఫెరంమెటాలికం.

విరుగుళ్లు:—అర్నికా, పల్సటిల్లా, కేంఫరు, చైనా.

మోతాదు:—మదరుటించరు మొదలు 200 పొటెన్సీ.మదరుటించరు, 1, 2, 3, పొటెన్సీలు బాగుగా పనిచేయుచున్నవి. అవసరమువెంబడిని దీనిని పైకికూడ వుపయోగించవచ్చును.

బాహ్యోపయోగములు:— శరీరము కాలినపుడును, నలుగ కొట్టబడినపుడును; ఇలుకునొప్పులు లేక బెణుకునొప్పులు, పుండ్లు, గాయములు, ఒరుపులు, విషజాతి పురుగులయొక్క కాట్లు, చన్మొనలలో బాధ, దుష్టరక్తనాళముల వాపులతోగూడిన స్తనములబాధలకును, కాళ్ల మీది దుష్టరక్తనాళసంబంధమైనపుండ్లు, కురుపులు, రాచకురుపులు, మేహవాతనొప్పులు, వాపులు, రక్తస్రావము, వాపుతోగూడిన మూలశంఖ, ఋతుశూలతోగూడియుండు గర్భాశయరక్తస్రావములు — వీటికి దీనిని పైకి వుపయోగించవచ్చును. దీనిని స్వచ్ఛమైన టించరుగూపమునగాని లేక పీనికి సమానమైన పరిమాణముగల గ్లిసరిన్ లేక కొబ్బరినూనెలోకలిపిగాని వేసిలైనులో కలిపిగాని, 10 రెట్లనీళ్లలో కలిపిగాని, వీలువెంబడిని పైకి వుపయోగింపవలయును.

## 116. హెలియాంతసు. HELIANTHUS.

ప్లీహముకు సంబంధించినరోగములయందిది బాగుగా పనిచేయును. నిలువగాయున్న మన్యపుజ్వరములను మాన్పును.

ముక్కు:—పడిశెముపట్టుట. నీళ్లవంటి స్రావము వచ్చుట, రక్తస్రావమగుట, పక్కులుకట్టుట.

నోరు:—వెచ్చగా నుండుట, నమలుటకష్టముగా నుండుట, ఆర్చుకుపోవుట.

గొంతుక:—పొడిగాను, కొంచ్యబారి యుండుట. సప్తపధలో ఆర్చుకుపోయినట్లుండుట.

అన్నకోశము:—దాహముగాను, వికారముగాను యుండుట; వమనానంతరము యీలక్షణములుపశమించుట.

పొత్తికడుపు:—ప్లీహమువాచుట. బాధగానుండుట.

మలము, మలాశయము:—మలము నల్లగా వెడలుట (లెప్టాండ్రా). ప్రతిరెండనరోజునను గట్టిగాను నల్లగాను వెడలుచుండుట. మూలశంఖ.

కాళ్లు, చేతులు:—ఎడమ మోకాలిలో వచ్చు మేహవాతనొప్పి.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—గాయములకు దీనిని 10 రెట్లనీళ్ళలోగాని 4 రెట్ల కొబ్బరినూనెలోగాని కలిపి పట్టించవలయును. ఇది ఆర్నికా, కేలెండ్యులా వలెనే దబ్బలవలని వాపులను, పుండ్లను మాన్పును.

---

## 117. హెల్లిబోరస్. HELLEBORUS.

నిస్త్రాణగాను చిక్కిపోయి చర్మరోగములచే బాధపడు పిల్లలరోగములకును, మానసికరోగములచే బాధపడువారికిని యిది బాగుగా పని

చేయును. ఇందిన్రియజ్ఞానము (చూచుట, వినుట, రుచి) బహుతక్కువగా నుండుట. కండరములు నీరసస్థితిలో నుండుట. ఇందువలన తుదకు పక్షవాతము వచ్చుట; శరీరమునకును, ముఖ్యముగా తలకును నీరుపట్టుట. సాయంకాలము 4 గంటలు మొదలు 8 గంటలవరకును రోగోద్రేకము గలుగుట (లైకోపోడియం) యు దీని ముఖ్యలక్షణము

మనస్సు:—కంగారుగానుండుట. ఒట్టు పెట్టుకొనుచుండుట, నిరాశగాను, స్థిమితముగాను, విచారగ్రస్తముగాను యుండుట. ఇతరులు తనను పలుకరించుటకయిష్టత. నెమ్మదిగా సమాధానము చెప్పుట. మతిభ్రమచెందినట్లుండుట. పెదవులను గుడ్డలను పిచ్చివానివలె గిల్లుచుండుట.

తల:—నుదురు ముడతలుపడియుండుట. మత్తుమకలుగజేయునట్టి తలనొప్పి. తలను నొక్కుచును, తలగడలోనికి గుచ్చుచునుయుండుట. వమనానంతరము తలనొప్పి తగ్గుట. దినమంతయు తలను యిటూనటూ త్రిప్పుచుండుట. తలకు నీరుపట్టుట.

కండ్లు:—రాత్రియందు దృష్టిఆనకపోవుట. మెల్లకన్ను. పాపలు పెద్దవగుట, కండ్లు లోతునబడుట.

చెవులు:—పోడుచుచున్నట్లు బాధను, చెవులలోహోరును మాన్పును.

ముక్కు:—ఆర్చుకుపోయి వుండుట. వాసనసరిగా తెలియకపోవుట, ముక్కును నలుపుచుండుట.

ముఖము:—పాలిపోయి చల్లని చెమటతోనుండుట. యెడమవైపు పార్శ్వపునొప్పి వచ్చుట. దౌడలు నొప్పిగానుండుటవలన నమలుట కష్టము.

నోరు:—రాత్రియందు పంటిసలుపువచ్చుట; ఇది చల్లదనమువలనను, వెచ్చదనమువలనను వుద్రేకము జెందుట. నాలుక మొద్దుబారుట, వాచుట, వుదయమున ఆర్చుకుపోయి తెల్లని పూతగలుగుట. దుర్వాసనగా నుండుట. చల్లని నీటిని యెక్కువ ఆశగాను ఆతురతతోను త్రాగుట.

అన్నకోశము:—ఆకలియున్నను భోజనముచేయునపుడు రుచి తెలియకపోవుట. కడుపులోమంట, నడచునప్పుడు దగ్గునప్పుడు అన్నకోశములో బాధ. పైత్యరసమును వమనము చేసుకొనుట.

పొత్తికడుపు:—నీటితో నింపబడినట్లు చప్పుడగుచుండుట. వుబ్బరించి, ముట్టుకొనుటకు బాధగానుండుట. కుడిపైపు గజ్జలో గిలక బయలుదేరునట్లుగా పోట్లుగానుండుట.

మలము, మలాశయము:—మలము జిగురుగాను తెల్లని ఆమము పలెను, అప్రియత్నముగాను, వెడలునపుడు పనిచేయును. విరేచనానంతరము ఆసనమువద్ద మంటగాను, బాధగాను యుండుట. పొత్తికడుపులో నొప్పికిని వికారముతోగూడిన నీళ్లవిరేచనములకును బాగుగా పనిచేయును.

మూత్రావయవములు:—మూత్రము కొద్దిగాను, ముదర రంగుగాను, కాఫీపొడుమువంటి మడ్డితోను వెడలుట, తరుచు మూత్రవమానము గలుగుట. బిడ్డకు మూత్రము బంధించుట.

పురుషావయవములు:—సంభోగవాంఛతగ్గుట. మర్మావయవము బిగువుతగ్గుట.

స్త్రీ అవయవములు:—ఋతువు అణచిపెట్టబడుట. ప్రేమభంగము వలనను, తేమలో నానుటవలనను, శరీరము తడియుటవలనను, బహిష్టు సరిగాలేకుండుట, లేక ఆగిపోవుట. యుక్తవయస్కురాండ్రలో బహిష్టు ఆగిపోయినపిమ్మట తిరిగి బహిష్టు కలుగకుండుట.

శ్వాసావయవములు:—శ్వాస సరిగా నుండకపోవుట. ఛాతీ ముడుచుకొనిపోయినట్లుండుట. ఛాతీకి నీరుపట్టుట. రాత్రిదగ్గు యెక్కువవచ్చుట.

కాళ్లు, చేతులు:—అప్రియత్నముగా ఒకకాలు, ఒకచేయి కదలుచుండుట. అవయవములు బాధగాను, బరువుగానుయుండుట. తొడలలో బిగపట్టినట్లుగా నుండుట. చేతులలోను, వ్రేళ్ళయొక్క కీళ్లసంధులలోను చీల్చుచున్నట్లును, పొడుచుచున్నట్లును బాధగా నుండుట.

చర్మము:—వెంటుృకలు, గోళ్లు వూడిపోవుచుండుట. నీరుపట్టుట. పాలిపోయియుండుట, చిన్న చిన్న యెరృనిపొక్కులు లేచుట.

నిదృ:—కండ్లు సగము తెరచియుంచి నిదృపోవుట. కంగారుతోను ఆతురతతోయుండు కలలువచ్చుట. నిదృ పట్టకపోవుటవలన పక్కలో అటునిటు కదలుచుండుట.

జ్వరము:—నాడి సన్నముగాను నెమ్మదిగాను కొట్టుకొనుచుండుట. దేహమంతయును ముఖ్యముగా కాళ్లును, చేతులునుచల్లగానుండుట. శరీరమునకును, ముఖ్యముగా కాళ్లు చేతులకును కంపమువచ్చుట. సాయంకాలమున పరుండినపిమ్మట శరీరమునందు మంటలతోకూడిన వెచ్చదనము. ఇది ముఖ్యముగా తలలో యెక్కువగానుండుట. దాహములేమి. తెల్లవారుఝామున చెమటపట్టుట. చలివెనుక వెచ్చదనము, శూల వచ్చుట.

వుదేృకము:— సాయంకాలము 4 లగాయితు 8 గంటలవరకును ఒకప్పుడు రాతృయంతయు; శరీరమును కప్పుకొనకపోవుట వలన.

వుపశమనము:—మానసిక పరిశృమవలన.

విరుగుళ్లు:—కేంఫర, చైనా.

మోతాదు:— 3 మొదలు 30 పొటెన్సీ.

---

## 118. హెలోనియాస్. HELONIAS DIOICA.

ఇది స్త్రీ మర్మావయవరోగములమీద బాగుగా పనిచేయును. నిస్త్రాణజెందినట్లు భావనయుండుట, తోృటికలోను, కటిపృదేశమందును, లాగుచున్నట్లును, బరువుగాను యుండుట, బడలికగాను,విచారమువలనను మనసు పాడగుట, బాధలనుగురించి తలచుకొనునప్పుడు బాధలెక్కువగునట్లు కనిపించుట—ఇవి దీని ముఖ్యలక్షణములు. శరీరవ్యాయామము లేకపోవుట, విశేషభోగముల ననుభవించుటవలనను కలుగు దుర్బలత్వము; శరీర మానసిక పరిశృను లెక్కువగుటవలన శరీరతత్వము పాడగుట, మర్మావ

యవములలో బలముతగ్గుటవలన గర్భాశయము వెలుపలకువచ్చుట, అధిక పరిశ్రమవలన కండరములలో మంటగాను, నొప్పులుగాను యుండుట; అలసటవలన నిద్రకైందనుండుట; మధుమూత్రము, అతిమూత్రము—వీటి యన్నిటిమీదనిది బాగుగా పనిచేయును.

మనస్సు:—విచారగ్రస్తముగా నుండుట. ఆలోచన చేయునపుడును, పనిచేయుచున్నప్పుడును లక్షణములుపశమించుట. ఒంటరిగా నుండ గోరుట. తాను చెప్పినది యితరులు కాదనుటనుసహింపలేకుండుట, మరియు యితరుల సలహాపుచ్చుకొనుటయందు యిష్టముండకపోవుట.

తల:—నడినెత్తి మంటగానుండుట. తలనొప్పి మానసిక పరిశ్రమ వలన వుపశమించుట.

ముఖము:—పాలిపోయి, మట్టిరంగును పోలియుండుట. బాధపడు చున్నట్లు కనుపించుట

నోరు:—మధుమూత్రముచే బాధపడువారిలో నాలుక తెల్లగా నుండుట. గర్భిణీ స్త్రీలలోను, పిల్లలకు పండ్లువచ్చుకాలములోను, నోటి నుండి లాలాజలమూరుచుండుట.

అన్నకోశము:—ఆకలి లేమి, తేన్పులు వచ్చుచుండుట, ఆహారము రుచింపకపోవుట, పైత్యముగానుండుట, పగలు నిద్ర మత్తుగాయుండుట, కడుపులో మంటగానుండుట, వెన్నెముకలోమంటగాను, పోట్లుగాను యుండుట. కడుపులో బాధగానుండుట. మరియు శరీరముపుబ్బుట.

పొత్తికడుపు:— నీళ్లవిరేచనములు వచ్చునట్లుగా కదలికతోను, గుడగుడలాడుచును యుండుట. అప్పుడప్పుడు శూల వచ్చుచుండుట.

మలము:—వుదయమున పసుపుపచ్చగాను, పల్చగాను వెడలుట, సాయంత్రము ముద్దలుముద్దలుగా వెడలుట.

మూత్రావయవములు:—మూత్రపిండములలో బాధగానుండుట. దీనితో మూత్రములో శ్వేతధాతువు కలసిపోవుచుండుట. మూత్రము

మానము తరచుగాను, తొందరగాను యుండుట. మధుమూత్రమును, అతి మూత్రమును మాన్పును. మూత్రములో ఫాస్ఫేట్సు పోవుచుండుట.

పురుషావయవములు:—సంభోగవాంఛ, సంభోగశక్తి యెక్కువగుట. తరుచు అసాధారణమైన లేపనము గలుగుట. నపుంసకత్వము.

స్త్రీఅవయవములు:—బహిష్టు చాలముందరగా నగుట. స్రావము విస్తారముగా వెడలుట-ఇవి రక్తస్రావములవలననిస్త్రాణ జెందినస్త్రీలలోగలుగు నపుడుపనిచేయును. స్తనములువాచుట, చనోమొనలు నొప్పిగాను,బాధగాను యుండుట. ఋతుస్రావము నల్లగాను, ముద్దవలెను, దుర్వాసనతోను యుండుట. సంభోగేచ్ఛ, శక్తితగ్గుట. గర్భాశయమునుండి స్రావము విస్తారముగా గలుగుట. గర్భాశయము వెలుపలకు వచ్చుట. యెక్కువరక్త క్షీణతతో కూడిన కుసుమ. ఒకప్పుడు ఋతుస్రావము తక్కువగా నగుట. యెక్కువ నిస్త్రాణవలనను, మర్మావయవములో బలము తగ్గుటవలనను, గర్భాశయము వెలుపలకు వచ్చునపుడును, గర్భస్రావసూచనలు గలుగు నప్పుడును యిది పనిచేయును. తరుచుగాను, లేక మామూలుగాను గర్భ స్రావములగుచుండుటను మాన్పును. గర్భిణులకు మూత్రములో శ్వేతధాతువు కలిసి పోవుచుండుట. మూత్రపిండములలో మంటగానుండుట. గర్భాశయ వ్యాధులతోకూడియుండు తలనొప్పి. మర్మావయవమువాచి, యెర్రగాను, వెచ్చగాను, యెక్కువదురదగాను యుండుట.

హృదయము:—దడగా నుండుట.

ఛాతీ:—ముందరవైపు, మరలో పెట్టినొక్కి వేసినట్లునొప్పివచ్చుట.

నడుము, కాళ్లు, చేతులు:—కూర్చున్నప్పుడు పాదములు మొద్దుబారినట్లగుట. కుడిచట్టలో నొప్పులు కదలికవలన యెక్కువగుట, పాదములు మొద్దుబారుట—ఇవి కదలిక వలన వుపశమించుట. చల్లనిగాలిపిక్కలలోనుండి పైకి యెగపాకుచున్నట్లు భావనయుండుట.

నిద్ర:—నిద్రమత్తు, భారగింపు .పగలు నిద్రమత్తుగానుండుట

జ్వరము:—గదిలోనున్నప్పుడు కదలికవలన శరీరము వెచ్చనగుట.

వుద్రేకము:—కదలికవలన, తాకుడువలన.

వుపశమనము:—మానసిక పరిశ్రమవలన.

పోలికలు:—ఎంటిమ్రస్ ఫేరరోసా, లిలియంటిగ్రినం, పల్సటిల్లా, సినీషియో, స్టేనం మెటాలికం.

విరుగుళ్లు:—లిలియంటిగ్రినం.

మోతాదు:—టించరు మొదలు 30 పొటెన్సీ. టించరును మోతాదు 1కి 3 లగాయితు 5 చుక్కలవరకు వాడవచ్చును.

---

## 119. హైడ్రాస్టిసు. HYDRASTIS CANADENSIS·

చిక్కని, పసుపుపచ్చని తీగవంటి స్రావము శరీరమునందెచ్చటి (గొంతుక, అన్నకోశము, గర్భాశయము మూత్రనాళము, ఆమత్వచలనుండి) యైనను వెడలునపుడు దీనిని వాడనగును. ఇదిముసలివారి యొక్కయు, సులభముగా అలసిపోవునట్టివారియొక్కయు, నిస్త్రాణజెందినవారి యొక్కయు రోగములమీద బాగుగా పనిచేయును. మలబద్ధమును, అజీర్ణమును మాన్పును. మశూచికములో దీనిని పైకిని లోపలకును వాడవచ్చును. పుట్టపణము పుండుపడకుండగ, బాధతోనుండు స్థితిలో యిది బాగుగా పని చేయును. మశూచికములో దీనిని వాడినయెడల వుద్రతమును తగ్గించి జాగ్రత్తగా రోగమును మాన్పును.

మనస్సు:— మరుపుగానుండుట. చదువుచున్నట్టియు, మాట్లాడుచున్నట్టియు హంశము జ్ఞాపకము లేకపోవుట. చనిపోవుట నిశ్చయమని తలంచి, చావును కోరుచుండుట.

తల:—నడినెత్తిమీదను, నరములలోను నొప్పిగాయుండుట.

కన్నులు:—జలుబుతోగూడిన కండ్లకలక. దీనిలో చిక్కని స్రావ

ము వెడలుట, నీళ్లుకారుట, కనురెప్పలు అంటుకొనుట, వాచుట, కాచ బింబము కిరణాభేద్యముగానగుట.

చెవులు:—మిషనులు చప్పుడు చేయునట్లు ధ్వనివినబడుట. చిక్కని దుర్వాసనతో గూడిన స్రావము వెడలుట.

ముక్కు:—చిక్కని తెల్లని ఆమము వెడలుట, నుదిటిలోనొప్పిగా నుండుట. నీళ్లవంటి స్రావము ఒరుపును గలుగజేయుచు వెడలుట. తరచు చీదవలసి వచ్చుట.

నోరు:—మిరియపు రుచిగా నుండుట. నాలుక వాచి తెల్లనిపూత గలుగుట. రసప్రయోగమువలని దుర్గుణములు.

గొంతుక:—చిక్కని పసుపుపచ్చని ముద్దవంటిఆమము వెడలుచుం డుట. కంఠము పుండగుట. కొండనాలుక నొప్పిగానుండుట, పొడుగగుట. రస సంబంధమైన పుండ్లు బయలుదేరుట.

అన్నకోశము:—రుచిచేదు. కాయకూరలు, రొట్టె వికటించుట. కడు పులోని పుండును పుట్టవ్రణమును పూన్పును. పులితేన్పులు, అజీర్ణము.

పొత్తికడుపు:—కాలేయము మందముగాను, బాధగానుయుండుట. కామెర్లరోగము. లాగుచున్నట్లుండు నొప్పి యెడమగజ్జలోనుంచి కోయు చున్నట్లుండు భావనతో కుడి వృషణములోనికి వ్యాపించుట.

మలము, మలాశయము:—మలాశయము వెలుపలకు వచ్చుట. ఆసన ములో పుండ్లగుట. తీరని విరేచనబద్ధము, మూలశంఖ, ఆసనములో ముడు చుకొనిపోయినట్లు బాధగా నుండుట.

మూత్రావయవములు:—మూత్రము చెడిపోయిన వాసనతో నుం డుట. మూత్రము ఒకప్పుడు విస్తారముగాను, ఒకప్పుడు అప్రియత్నము గాను వెడలుట, మరియొకప్పుడు అణచిపెట్టబడుట. మూత్రములో ఆమ ముకలసి, తీగవలె పోవుచుండుట.

పురుషావయవములు:—జీర్ణించిన సెగ, దీనిలో స్రావమొకప్పుడు

తెల్లగాను, ఒకప్పుడు పసుపుపచ్చగాను, చిక్కగాను, తీగవలెను వెడలు చుండుట. శుక్లనష్టము వలన వచ్చు నిస్త్రాణను మాన్పును.

స్త్రీ అవయవములు:—అధికముగా సంభోగేచ్ఛ గలుగుట. స్తనములలో కంతులు బయలుదేరుట. చన్మొనలు ముడుచుకొని పోయినట్లుండుట. కుసుమ చిక్కగాను, తెల్లగాను, ఒకప్పుడు పసుపుపచ్చగాను, ముద్దగాను వెడలుట. మర్మావయవములలో బయలుదేరు పుట్టపుణ్ణుల మీద పనిచేయును. గర్భాశయము వెలుపలకు వచ్చుట. మర్మావయవములలో పుండ్లు పడుట. ముట్లుడుగు కాలమందు అవయవములో దురద. కుసుమ సంబంధమైన స్రావము యెక్కువగా వెడలుట.

శ్వాసావయవములు:—నీరసముగా నుండు ముసలివారిలో వచ్చు బ్రాంకైటిసు, దీనిలో శ్లేష్మము ముద్దగాను, పసుపుపచ్చగాను వెడలుట. ఎడమవైపు పరుండినపుడు వూపిరాడకపోవుట.

హృదయము:—గుండె దడగానుండుట. తెలివితప్పి పడిపోవుట. వుదయమున గుండెదడ చాలసేపటివరకు యుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—దిగువభాగమందు కొయ్యబారినట్లును, బరువుగాను యుండుట. కూర్చున్న చోటినుంచి లేచినపుడు చేతులను అసరా చేసుకొనవలసివచ్చుట. మేహవాతనొప్పులమీద బాగుగా పని చేయును. నడచుటవలన నొప్పులు వుపశమించుట.

జ్వరము:—వుదయమునను, సాయంకాలమునను, చలివచ్చుట. నాడి మందముగా నుండుట. అప్పుడప్పుడు శరీరము వెచ్చగా నుండుట. అజీర్ణ, పైత్య, సన్నిపాతజ్వరములమీద పనిచేయును. అజీర్ణము, కామెర్ల రోగము, నిస్త్రాణతో నుండు జ్వరలక్షణములమీద బాగుగా పనిచేయును యెక్కువగా చమటలు పోయుట.

చర్మము:—మశూచికములోవలె పొక్కులు బయలు దేరుట. పుండ్లను మాన్పును. పుట్టపుణ్ణ సంబంధమైన పుండ్లమీద దీనిని వాడ వచ్చును

వుద్రేకము:—రాత్రియందు, కదలికవలన.

వుపశమనము:—విశ్రాంతివలన, నొక్కుటవలన.

విరుగుళ్లు:—సల్ఫరు.—మెర్క్యూరియసునకిది విరుగుడు.

మోతాదు:—మదరుటించరు మొదలు 200 పొటెన్సీ. విరేచన బద్ధము మాన్పుటకు ప్రాతఃకాలభోజనమునకుముందు 5 చుక్కల మదరు టించరును 1 మోతాదుగా తీసికొనినపుడిది బాగుగా పనిచేయుచున్నది.

బాహ్యప్రయోగములు:—కొరుకుకు, సవాయిపుండ్లకు, కుసుమ వ్యాధికి, సెగరోగమునకు; పుట్టవ్రణమును పంటిరోగములకు, చన్మొనల బీటలకు, చెవిరోగములకు కంటిరోగములకు, నాసికారోగములకు, దీనిని 10 రెట్లు నీళ్లలోగాని, 4 రెట్లు కొబ్బరినూనె లేక గ్లిసరిన్‌లో కలిపిగాని, వేసిలైనులోకలిపిగాని, వీలువెంబడిని పైకి వుపయోగింపవచ్చును. పుండ్లు దీనిలోషనుతో కడుగుట మంచిది. కుసుమకు సెగకు దీని లోషనును అవయవములలోనికి పిచికారీ చేయవచ్చును.

---

## 120. హైడ్రోకోటైల్. HYDROCOTYLE.

(హిందూదేశపు ఔషధము. 34. సరస్వతీమొక్క)

ఇది కుష్టురోగముమీదను, కుష్టువంటి ఇతరచర్మరోగములమీదను, గర్భాశయములోని పుండ్లమీదను, మర్మావయవములలోని పుట్టవ్రణముమీదను బాగుగా పనిచేయును. చర్మముదళసరెక్కుట, ముడతలుపడుట, పొరలుపొరలుగా వూడిపోవుట వున్నపుడిది పనిచేయును. సవాయి సంబంధమైన లక్షణములమీదను, బోదకాలుకును, ప్రాస్టేటుగ్రంధి పెద్దదగుట లేక వాపుకును, గర్భాశయములో బరువుగా నుండునపుడును దీనిని వాడవచ్చును.

ముఖము:—త్రాగిన వానివలె నగుపడుట. ఎడమచెంప యెముక లోనొప్పిగానుండుట.

నోరు:—లాలాజల మెక్కువగా వూరుట. రుచిలేమి. రుచిచేదు.

పురుషావయవములు:—రేతోవాహికలలో లాగుచున్నట్లు బాధగా నుండుట. నపుంసకత్వము. సంభోగమందిష్టము లేకుండుట.

స్త్రీఅవయవములు:—మర్మావయవము వాచుట, యెర్రగాను వెచ్చగాను యుండుట, పైపైపున దురదగా నుండుట, కుసుమలో స్రావమెక్కువగా వెడలుట.

చర్మము:—నడుముమీదను, కాళ్లమీదను, చేతులమీదను, అరికాళ్లలోను అరిచేతులమీదను; బాధ, వాపు, యెర్రదనముతో గూడిన చర్మరోగము బయలుదేరుట. అచ్చటచ్చట గుండ్రని మచ్చలు బయలుదేరుట; యీమచ్చలయొక్క వంచలు కొంచెము దళసరిగాను లేక యెత్తుగాను యుండుట. చెమట విస్తారముగా పట్టుట. అరికాళ్లలో విస్తారము దురదగానుండుట. సవాయి లక్షణముల మీద బాగుగా పనిచేయును. మొటిమలను మాన్పును. బోదకాలు అప్పుడప్పుడు హెచ్చుచు తగ్గుచు యుండుట, వేడివలన హెచ్చగు చుండుట, అప్పుడప్పుడు గజ్జలలో బిళ్లకట్టుట లేక మాంసగ్రంథులు వాచుట. జ్వరము వచ్చుట. కుష్ఠువ్యాధిలో పుండుపడనట్టి కేసులలో యిది బాగుగా పనిచేయును. తెల్లని లేక రాగిరంగు మచ్చలు బయలుదేరుట. శ్వేతకుష్ఠుము లేక బొల్లిని మాన్పును.

పోలికలు:--ఇలయున్గ్విన్, మిరిస్టికాసెబిఫెరా, కోనియం, ఆర్సెనికం ఆల్బం, ఎనకార్డియం, కెలాట్రోపిస్, సైలీషియా.

మోతాదు,—మదరుటించరు మొదలు 200 పొటెన్సీ.

---

## 121. హయోస్యామసు. HYOSYAMUS.

(హిందూదేశపు ఔషధము. 35. కురాసానివాము)

ఇది నరముల సంబంధమైన రోగములమీద బాగుగా పనిచేయును. రోగి చిరచిర లాడుచుండుట, మఱియు అపస్మారగము లేక హిస్టీరియా చేత

బాధపడుచుండుట, చిన్నపిల్లలలో క్రిమిదోషమువలన (సినా) గలుగు చిరచిర, భయము, కంపముతో గూడిన ఫిట్లు, ప్రసవవేదనలోను, ప్రసవించిన పిమ్మటను, భోజనానంతరమునను, పిల్లలలో దమనములతోను అకస్మాత్తుగా కేకవేయుటతోను, కంపముతోనువచ్చు ఫిట్లు—వీటిమీదఇది బాగుగాపని చేయును.

మనస్సు:—యెక్కువ అనుమానముతో నుండుట. తెలివితక్కువగాను, అసూయతగాను, శృంగారసంబంధమైన చిత్తభ్రమతోను, సిగ్గువిడచివిస్తారముగా సూట్లాడుచును వుండుట. యెదుటివారు యేమనుకొనెదరో యని సంకోచింపక శరీరముమీది బట్టలను విప్పివేయుట. ప్రతివిషయమునందును, యెక్కువగానవ్వుచు కులాసాగా నుండుట మరియు పారిపోవ జూచుచుండుట. సరిగా సమాధానము చెప్పచు, వెంటనే మగత జెందుట. తెలివిసంధి. ప్రేమభంగమువలనవచ్చు మూర్ఛ.

తల:—కంగారుగా, వికారముగా, మత్తుగానుండుట. మెదడు కదలుచున్నట్లు తోచుట. మెదడుకు దెబ్బతగిలినట్లుగా తలలో నొప్పివచ్చుట. తలకు నీరుపట్టుట. చల్లని పొడిగాలివలన జలుబు, తల భారముపచ్చుట.

కన్నులు:—తేరిబారి చూచుట, కండ్లు యెర్రబడుట, కనుపాపలు పెద్దవగుట, దృష్టి మబ్బుగా నుండుట, వస్తువులు నిప్పువలె యెర్రగాను పెద్దవిగాను కనబడుట, ఒకప్పుడు చిన్నవిగా కనబడుట.

చెవులు:—ఝుంకారము చేయుచున్నట్లు పాడుచున్నట్లు గంటలు వాయించుచున్నట్లు ధ్వనులువినబడుట. మాటసరిగా వినబడకపోవుట.

ముక్కు:—వాసనసరిగా తెలియకపోవుట, రక్తము స్రవించుట, నాసికారంధ్రములు పొగపారినట్లుండుట.

ముఖము:—ఎర్రగా కందబారి యుండుట. ఒకప్పుడు చల్లగా, పాలిపోయి యుండుట, నీలివర్ణముగా నుండుట, దౌడలు దగ్గర బడుట.

నోరు:—నాలుకకు పక్షవాతమువచ్చుటచే మాటసరిగా రాకుం

డుట, నాలుక జాపుటయు వెనుకకుతీయుటయు చాలకష్టముగా నుండుట. నోటివద్ద నురగలు వచ్చుట.

గొంతుక:—ఆర్చుకుపోయి కట్టుకున్నట్లుండుట. ముడుచుకుపోయి నట్లుండుట, పానీయములు త్రాగుట కష్టముగా నుండుట. కొండనాలుక పొడుగగుట.

అన్నకోశము:—కుళ్లిన రుచితోనుండుట. అహారపానీయములను, రక్తమును వమనము చేసుకొనుట, కంపమువచ్చుట, యెక్కువదాహముగా నుండుట. నీళ్లను కొద్దికొద్దిగా త్రాగుచుండుట.

పొత్తికడుపు:— పొట్టబద్దలగునట్లు శూలవచ్చుట. పొత్తికడుపు వ్రేలాడుట, నొప్పిగానుండుట, వుబ్బరముగా నుండుట.

మలము, మలాశయము:— మలాశయమునకును, మలాశయ ద్వారమునందలి కండరములకును పక్షవాతము వచ్చుట. రాత్రియందును మూత్ర విసర్జనయందును అప్రయత్నముగా విరేచనమగుట. తరచు విరేచనానుమానముగలిగి మలముస్వల్పముగా వెడలుచుండుట. మలబద్ధముతోనుండు అపస్మారము. బాగనుగలుగజేయనటువంటి నీళ్ల విరేచనములు. మూలశంఖ నుండి రక్తము యెక్కువగా స్రవించుట.

మూత్రావయవములు:—మూత్రకోశమునకు పక్షవాతము వచ్చుట. మూత్రముఆపివేయబడుట. తరుచుగాను, కొద్దిగాను కష్టముమీదను, అప్రయత్నముగాను మూత్రము వెడలుచుండుట.

పురుషావయవములు:— సంభోగేచ్ఛ, శృంగారచేష్టలు, యెక్కువగా నుండుట. నపుంసకత్వము. రోగి సిగ్గువిడచి యెదుట నుండువారిని లెక్కచేయక కట్టుకొనిన వస్త్రములను విప్పివేయుచుండుట.

స్త్రీఅవయవములు:— గర్భస్రావమైనపిమ్మటకలుగు రక్తస్రావము మీద పనిచేయును. బహిష్టుకుముందర అపస్మారచిహ్నములు కలుగుట; పీటిలోగట్టిగానవ్వుట, విస్తారము చెమటపోయుట, వికారముగాయుండుట.

బహిష్టులో కాళ్లు, చేతులు కంపించుట. ప్రసవానంతర స్రావము (మైల) అణచి పెట్టబడుట.

శ్వాసావయవములు:—రాత్రియందు పొడిదగ్గు విడచివిడచి వచ్చుచు పరుండినయెడల వుద్రేకించుట. ఛాతీలో పుడినైపున కుట్టుచున్నట్లు బాధగానుండుట. దగ్గువచ్చినప్పుడు కూర్చొనినయెడల దగ్గువుపశమించుట. శ్వాసావయవమునుండి రక్తము స్రవించుట.

హృదయము:—నాడి చురుకుగాను, నిండుగాను వుండుట, ఒకప్పుడువడిగాను విడిచివిడిచి కొట్టుచునుయుండుట. నాడి నీరసముగాను, వక్రముగాను వుండుట.

కాళ్లు, చేతులు:—అవయవములు కంపించుట. చేతులు, కాళ్ళు తరచుగా కదల్చుచుండుట. నడచుటవలనను మెల్లెక్కుటవలనను బొటన వేళ్లురెండును ముడుచుకొనిపోవుట, పక్కగుడ్డలను పొగుచేయుట. ఫిట్లుతోకూడిన రోగములు. పిక్కలులాగుట. పిల్లలు నిద్రలో యేడ్చుట.

చర్మము:—కురుపులు మానుచు వేయుచు యుండుట. పెద్ద పెద్ద పొక్కులుచట్టలనుండిమోకాళ్ళవరకుఅలుముకొనిపోయినట్లుబయలు దేరుట.

నిద్ర:—నిద్రపట్టకపోవుట. భయమువలన వులికిపడుచుండుట. కంపములతో గూడియుండు గాఢనిద్ర.

జ్వరము:—దినమువిడచిదినము, మధ్యాహ్నము 11 గంటలకు, చలి వచ్చుచుండుట. చలి కాళ్లలో ప్రారంభించి పైకి యెగబ్రాకుట. ఒకమాటుచలిగాను, ఒకమాటు వెచ్చగాను యుండుట. చెమట చల్లగాను, వుల్లని వాసనతోను, నీరసమును గలుగజేయుచు, నిద్రయందు పట్టుట.

వుద్రేకము:—రాత్రియందు, బహిష్టులో, మానసిక పరిశ్రమవలన, భోజనానంతరమున, పరుండినపుడు.

వుపశమనము:—వంగుటవలన, నిర్భరముగా కూర్చుండుటవలన.

పోలికలు:—బెల్లడోనా, స్ట్రెమోనియం, కాలీఫాసు.

విరుగుళ్లు:—బెల్లడోనా, కేంఫర్, చైనా, స్ట్రెమోనియం, ఓపియం.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. డాక్టరు హానిమాన్ గారు 12 వ పొటెన్సీని బాగుగా సిఫారసు చేసిరి. పెద్దపొటెన్సీలు మూర్ఛ, పక్షవాతము, నీళ్లవిరేచనములు మొదలగువాటిలో బాగుగా పని చేయును.

---

## 122. హైపెరికం. HYPERICUM.

వేళ్లు, కాలిబొట్టనవేళ్లు, గోళ్లు, వీటికి సంబంధించియుండు నరములకుగలిగిన గాయములమీద నిది బాగుగాపనిచేయును. వ్రేళ్లునలిగినపుడు దీనినివాడవలెను. విపరీతముగా బాధగానుండుటయు బాధలు దెబ్బతగిలిన చోటనుండి పైకి వ్యాపించుచుండుటయు దీనిముఖ్యలక్షణములు. ఆసనమును సంబంధించిన రోగములమీదను, మూలశంఖమీదను ఇది బాగుగా పని చేయును. జంతువులయొక్క కాట్లకును (లెడం), గుర్రపువాతము, ధనుర్వాతము, నరముల దోషములకును, దీనిని వాడవచ్చును. దీనిని సకాలములో వాడినయెడల, గుర్రపువాతములోవలె పండ్లు గిట్టకరచుకుపోవుటను రానీయదు. శస్త్రచికిత్సానంతరము దీనిని వాడినయెడల శస్త్రచికిత్సవలని బాధలను మాన్పుటలోనిది మార్ఫియా (Morphia) కంటె బాగుగా పని చేయును. రోగి మగతగానుండుటను, దెబ్బతగిలినచోట యెక్కువ తీపుగాను బాధగాను యుండుటను మాన్పును.

మనస్సు:—వ్రాయుచున్నప్పుడు పొరబాటు పడుచుండుట, మరియు కొన్ని అక్షరములను పొరబాటున వ్రాయుటమానివేయుట. టీ, త్రాగినవానివలె మానసికోద్రేకము కలుగుట. జ్ఞాపకశక్తి తక్కువగానుండుట, దెబ్బలు తగిలినపిమ్మట యెక్కువ నిస్త్రాణజెందుట.

తల:—యెక్కువ భారముగాను కంగారుగాను వికారముతోను యుండుట. మంచుగడ్డవలె చల్లగానుండు చేతితో ముట్టుకొనినట్లుతోచుట. తల పొడవుగాయున్నట్లు భావనగలుగుట. కండ్లలోను చెవులలోను బాధ

గానుండుట. తలవెంట్రుక లూడిపోవుట, పంటిలో లాగుచున్నట్లు చీల్చు చున్నట్లు బాధగానుండుట. ముఖమునకు వచ్చు పార్శ్వపు నొప్పి; లాగు చున్నట్లును, చీల్చుచున్నట్లును బాధగలుగుట.

అన్నకోశము:—వైను (wine)ను త్రాగగోరుట. దాహముగాను వికారముగాను యుండుట. నాలుక మొదట తెల్లని పూతయుండుట. కడుపులో వుండపెట్టినట్లుండుట (బ్రియోనియా, యాబిస్ నైగ్రా).

మలము, మలాశయము:—పసుపుపచ్చగాను,ఆకుపచ్చగాను, పల్చగాను వుండునట్టి మలము సాయంకాలమునగాని, వుదయమునగాని వెడలుచుండుట. వుదయమున లేచుసరికి విరేచనముకొరకు తొందరగానుండుట. మూలశంఖ నొప్పిగాను రక్తముతోను సున్నితముగాను యుండుట.

స్త్రీఅవయవములు:—కుసుమ. బహిష్టు ఆలస్యముగానగుట. శస్త్రసహాయమువలన ప్రసవించిన పిమ్మటనువచ్చు నొప్పులను మాన్పును.

మెడ, నడుము:—మెడలో నొప్పిగా యుండుట. త్రికాస్థిపైని నొక్కుచున్నట్లు బరువుగానుండుట, పడుటవలన తొ్రిటికకు దెబ్బతగిలి, నొప్పి వెన్నెముకవెంబడి పైకిని దిగువ అవయవములలోనికిని వ్యాపించుట.

కాళ్లు, చేతులు:—భుజములలో పొడుచుచున్నట్లు బాధగానుండుట. పిక్కలు లాగుచుండుట. కాలి బొట్టన వేళ్లులోను, వేళ్లలోను, ముఖ్యముగా వీటి చివళ్లలోను నొప్పులుగానుండుట. చేతులలోను పాదములలోను పురుగులు పాకుచున్నట్లుండుట. నరముల సంబంధమైన బాధ, మంట, తిమ్మిరి, మొద్దుబారుట గలుగుట. కీళ్ళసంధులలోనలుగ గొట్టినట్లు నొప్పిగాయుండుట. అవయవములు కొయ్యబారుట.

శ్వాసావయవములు:—పొగమంచుతోగూడిన గాలివలన వుబ్బసము వుద్రేకమునెందుట; మరియు విస్తారముగా చెమట పోయుటవలన నిది వుపశమించుట. కోరింతదగ్గు సాయంకాలము 6 గంటలు మొదలు రాత్రి 10 గంటలవరకు వుద్రేకమునెందుట.

చర్మము:—చేతులమీదచిమచిమలాడుచునుండు పొక్కులుబయలు దేరుట. తలమీద యెక్కువగా చెమటపట్టుట, ఇది వుదయమునను నిద్రిను పిదపను యెక్కువగానుండుట. దెబ్బతగిలినచోటనుండి యెక్కువగారక్త స్రావము గలుగుటవలన నిస్త్రాణవచ్చుట.

వుద్రేకము:—చల్లదనము వలన, తేమవలన, పొగమంచులో, మూయబడిన గదిలో, బహిరంగమైన గాలిలో, తాకుడువలన.

వుపశమనము:—తలను వెనుకకు వంచుటవలన.

పోలికలు:—లిడం, ఆర్నికా, కాలెండ్యులా, రూటా.

విరుగుళ్లు:—ఆర్సెనికం ఆల్బమ్, కేమోమిల్లా, సల్ఫరు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ. మేకులు మున్నగునవి గుచ్చుకొనినయెడల దీనిని 200 పొటెన్సీలో వాడినచో ధనుర్వాతము రాకుండగ నాపుజేయవచ్చును.

బాహ్యోపయోగములు :—వాడియైన ఆయుధములవలని దెబ్బలకును, మేకులు, సూదులు, ముండ్లు మొదలగునవి గృచ్చుకొనుట వలన కలిగిన పుండ్లకును, అవయవములు నలుగకొట్టబడిన చోటను, దీనిని స్వచ్ఛమైన టించరురూపమున తీసికొని దానికి 10 రెట్లు గోరువెచ్చనినీళ్లలో కలిపి పైకి వుపయోగించవలయును.

---

## 123. హైగ్రోఫిలా. HYGROPHILA.

(హిందూదేశపు ఔషధము. 36. నీరుగొబ్బి)

ఇది ముఖ్యముగా చర్మరోగములమీదను మర్మావయవముల దోషముల మీదను బాగుగా పనిచేయును.

మర్మావయవములు:—సెగవ్యాధి. స్త్రీలలో కుసుమ రోగము. నపుంసకత్వము.

చర్మము:—చర్మముపై చిన్న చిన్న ఎర్రనిపొక్కులు బయలు

దేరుట (యాపిను). చర్మరోగములు నెచ్చదనమునలన నుద్రేకమును చల్ల దనమువలన ఉపశమనమును జెందుట. రక్తదోషముతోగూడిన పుండ్లు.

జ్వరము:—మన్యపుజ్వరము: జ్వరము వుదయమున వచ్చుచుండుట. జ్వరముతో దాహము చలి లేకపోవుట. జ్వరతీవ్రత ఎక్కువగుచున్నకొలది చర్మముపై పొక్కులు దురద, బయలుదేరుట.

నిద్ర:—శరీరమునందలి వేడిమివలనను, చర్మరోగములవలనను గలుగు నిద్రలేమి.

ఉద్రేకము:—వేడిమివలన.

పోలికలు:—ఎఫినేషియా, ప్యాసిఫ్లోరా యినాకార్నేటా, ఎల టిరిస్ ఫెరనోసా.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ

---

## 124. ఇగ్నేషియా. IGNATIA.

ఇది స్త్రీలలోకలుగు హిస్టీరియా లేక అపస్మారవ్యాధిమీద బాగుగా పనిచేయును. ఇది ఇంద్రియజ్ఞాన మెక్కువగా గలిగినట్టిన్ని, సులభముగా వుద్రేకము జెందునట్టిన్ని, నల్లని దేహచ్ఛాయ గలిగినట్టిన్ని, చురుకుగా గ్రహించునట్టిన్ని, స్త్రీలయొక్క రోగములమీద బాగుగా పనిచేయును. శారీరమానసిక పరిస్థితులు తరుచుమారుచుండుట దీని ముఖ్యలక్షణము. నరముల నిస్త్రాణచే బాధపడువారిలో కాఫీత్రాగుటవలన లక్షణములుద్రేకించుటను, శ్రమవలనను, విచారమువలననువచ్చు రోగలక్షణములను, పుగాకుయొక్క స్పర్శను భరింపలేకుండుటను, వమనములతో ఎక్కిళ్లు వచ్చుటను, ఇవి మాన్పును.

మనస్సు:—ఒంటరిగా నుండగోరుట. మనోభావములను తరుచు మార్చుకొనుచుండుట. కంగారుగాను, విచారగ్రస్తముగాను, కన్నీళ్లను విడల్చుచును వుండుట. చేయరాని నేరమును చేసినట్లు ఆతురత జెంది

యుండుట. జ్ఞాపకశక్తి తగ్గుట. మనోవ్యాధివలనను, విచారమునణచిపెట్టుకొనుట వలనను, రోగి కృశించిపోవుట. ప్రేమించిన లేక ప్రీతితోనున్న మనుష్యులనుగాని వస్తువులనుగాని పోగొట్టుకొనినపిదప గలుగు అధికమైన విచారమును మాన్పును. ప్రేమ భంగమువలన వచ్చు బాధలను మాన్పును. భయమువలనవచ్చు అపస్మారవ్యాధి మీదను, "కొరియా" రోగము కండరములలో వణకుతో గూడియున్నప్పుడును ఇది పనిచేయును. ఇది పలు విధములైన మానసికరోగములమీద బాగుగా పని చేయును.

తల:—కోపమువలనను, విచారమువలనను, వచ్చు తలదిమ్ము పుగాకును వాసన చూచుటవలనను, పొగచుట్టను త్రాగుటవలనను, ఎక్కువగుట. తలలో ఒకప్రక్కనుండి మేకును బయటకుదిగగొట్టినట్లునొప్పిగా యుండుట.

కన్నులు:—మంటగాను, నీళ్లు నెసలుచును యుండుట. కండ్లను, కనురెప్పలను కంపములోవలె కదల్చుచుండుట.

ముఖము:—ముఖముయొక్కయు పెదవులయొక్కయు కండరములలో యీడ్పువచ్చుట. విశ్రాంతిగానున్నప్పుడు ముఖముయొక్క ఛాయ మారుట.

నోరు:—రుచి పుల్లగానుండుట. లాలాజలముతో నిండియుండుట. పంటిపోటు పొగత్రాగినపిమ్మటను, కాఫీత్రాగినపిమ్మటను, వృద్ధికము జెందుట.

గొంతుక:—గొంతుకలో వుండ పెట్టినట్లుగా వుండుట. చిన్నచిన్న పుండ్లు పడుట. గవదకాయలు వాచి యెగ్రపడి బాధగాను చిన్నచిన్న పుండ్లతోను వుండుట.

అన్నకోశము:—చల్లనిఆహారమును, పాలను, కేబేజి, నీరుల్లి, రొట్టె వెన్న; యిటువంటి అజీర్ణ పదార్థములను తినగోరుట. సాధారణపు భోజనమునందయిష్టత. రుచి పుల్లగానుండుట. పుల్లని త్రేణుపులు వచ్చుట. గాఢముగా వూపిరిపీల్చుటవలన నీరసముతగ్గుట. ఎక్కిళ్లను మాన్పును.

పొత్తికడుపు:—పేగులలో గుడగుడ లాడుచుండుట. శూల, సమలుచున్నట్లు నొప్పియుండుట. పుబ్బరముగా నుండుట.

మలము, మలాశయము:—కొలదిగా తినుటవలనగూడ, మలాశయము వెలుపలకు వచ్చుట. క్రిమిదోషములోవలె పురుగులు పాకుచున్నట్లును, దురదగాను, యుండుట. మలముతరుచుగాను, అప్రయత్నముగాను అపానవాయువుతోను వెడలుట. భయమువలనవచ్చు నీళ్ల విరేచనములు.

మూత్రావయవములు:—తరుచుగాను విస్తారముగాను, నీళ్లవంటి మూత్రము వెడలుట (యాసిడ్ ఫాసు).

పురుషావయవములు:—అంగము ముడుచుకొనిపోయి చిన్నదియగుట. సాయంకాలమున యెక్కువ దురద. సంభోగేచ్ఛ లేకపోవుట.

స్త్రీఅవయవములు:—ఋతుశూల ప్రసవవేదనలోవలె బాధగా నుండుట. మరియు, చీమువలెను, ఒరుపునుకలుగజేయునట్టి కుసుమ వెడలుచుండుట. ప్రతి 10 లేక 15 రోజులకు బహిష్టగుట. ఋతుస్రావము నల్లగాను కుళ్లిన వాసనతోను ముద్దలుముద్దలుగాను వెడలుట, ఒకప్పుడు స్రావము బహుతక్కువగా వెడలుట. విచారమువలనఋతువుఅణచి పెట్టబడుట. ఒరుపును కలుగజేయునట్టి చీమువంటి కుసుమ గర్భాశయములో నొక్కుచున్నట్లుండు బాధతో వెడలుట. హిస్టీరియా లేక అపస్మారమునకిది ప్రధానౌషధము. విచారమువలనను, మానసిక లక్షణముల నణచిపెట్టుటవలనను వచ్చిన హిస్టీరియా మీద బాగుగా పనిచేయును

శ్వాసావయవములు:— దగ్గినకొలదిదగ్గవలయునని యుండుట, గాఢముగా వూపిరితీసుకొనవలయునని కోరిక యుండుట.

హృదయము:— రాత్రియందును, వుదయమునను, పరుండినపుడును, గుండెదడవచ్చుట. నాడిసాధారణముగా గట్టిగాను, నిండుగాను, వడిగాను కొట్టుకొను చుండుట.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—భుజములోను, చట్టలలోను,

మోకాళ్లలోను, నలుగకొట్టినట్లును, యెముకలు తమతమ స్థానములనుతప్పి నట్లువలె నొప్పిగాను యుండుట. మెడలోబిగపట్టినట్లు నొప్పిగానుండుట. మెడవద్దనున్న మాంసగ్రంథులు వాపుతోను, బాధలేకుండగను యుండుట.

చర్మము:—దురదగా, దద్దురుతో యుండుట. నోటిచుట్టును, స్త్రీ మర్మావయవద్వారము చుట్టును పుండ్లగుట. పుండ్లుబయలు దేరుట.

నిద్ర:—విచారము వలనను, ఆతురతవలనను, దురద వలనను, బాధకరముగానుండు కలల వలనను నిద్రపట్టకపోవుట.

జ్వరము:—చలితో కంపించుచుండుట. ముఖము యెర్రనగుట. మధ్యాహ్నమందు శరీరము వెచ్చగా నుండుట శరీరములోపల వెచ్చగా నుండకపోవుట. పైత్యజ్వరము.

వుద్రేకము:—వురయమున, కాఫీవలన, పుగాకువలన, కదలికవలన, బహిరంగమైనగాలిలో, భోజనానంతరమున, విచారమువలన, మనోవి కారమువలన.

వుపశమనము:—నొక్కుటవలన, వెచ్చదనమువలన, భోజనము చేయుచున్నప్పుడు, నడచునప్పుడు.

సహచరులు:—నేట్రిం మూరు.

పోల్చదగినవి:—కాలీ ఫాసు.

విరుగుళ్ళు:—పల్సటిల్లా, కేమోమిల్లా, ఆర్నికా, కాఫీ, కాక్యులను, కేంఫరు, నక్సవామికా.

దీనికి ముందుగాని వెనుకగాని కాఫి, టబాకము—లనువాడరాదు.

జింకం మెట్, కాఫీ, కేమోమిల్లా, బ్రాందీ, పల్సటిల్లా, పుగాకు—లకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 1000 పొటెన్సీ. పెద్దపొటెన్సీలలో అప స్మారము, నరముల బలహీనత, మొదలగువ్యాధులలో బాగుగాపనిచేయును దీని గుణకాలపరిమితి 5 లగాయతు 9 దినములు.

## 125. ఇపెకాక్. IPECACUANHA.

వికారము లేక తలతిప్పు, వమనానుమానముతో గూడిన అన్నిరోగములమీదను ఇది బాగుగాపనిచేయును. చక్కెరతో చేయబడిన గొట్టెదినుసులు మొదలగు అజీర్ణ ఆహారములను తినినపిమ్మటవచ్చు వమనానుమానము మొదలగు లక్షణములుగలుగుటను మాన్పును. మలము ఆకుపచ్చగాను, నురగతోను, శూలతోను, వికారముగా నుండుటతోను, వెడలుటను, గర్భాశయ రక్తస్రావములు, వీటితోనుండు ఆయాసము, వికారమునుమాన్పును. మన్యపుజ్వరములో ఇది క్వయినాకన్న బాగుగా పనిచేయును.

మనస్సు:—చిరచిరలాడుచుండుట. ప్రతివిషయమునందును ద్వేషభావముతో యుండుట.

తల:—ఎముకలలో చితుక కొట్టినట్లుండు నొప్పి పండ్లలోనికిని, నాలుకవరకును వ్యాపించుట.

కండ్లు:—వాచి యెర్రగాను వెచ్చగాను వుండుట. నీళ్లుకారుచుండుట. కదులుచున్న వస్తువులను చూచినయెడల వికారమువచ్చుట.

ముక్కు:—వాసన తెలియక పోవుట, తుమ్ములు వచ్చుచుండుట. రక్తస్రావమగుట.

ముఖము:—పసుపుపచ్చగా పాలిపోయి వుండుట. కండ్లు లోతునపడుట, ముఖము పొంగరించుట.

నోరు:—లాలాజలమును తరుచుగా మ్రింగివేయుచుండుట. నాలుక తెల్లగాను పరిశుభ్రముగాను, ఆరిపోయి యుండుట.

గొంతుక:—గుటకవేయుట కష్టముగా నుండుట.

అన్నకోశము:—తరుచు వికారము. వమనములు వెడలుచుండుట. మరియు ముఖము పాలిపోయి, పైత్యరసమును, రక్తమును, తినిన ఆహారమును, వమనముచేసుకొనుట. ఎక్కిళ్లను కట్టును. పొట్ట వ్రేలాడుచున్నట్లుండుట. అజీర్ణము చేయుచుండుట.

పొత్తికడుపు:—కోయుచున్నట్లును, బిగపట్టుచున్నట్లును బొడ్డు వద్ద నొప్పిగాయుండుట. కదలికవలన ఒకవైపునుండి మరియొక వైపునకు కోయుచున్నట్లుండు బాధలు వ్యాపించుట.

మలము, మలాశయము:—వేసవికాలపు నీళ్ల విరేచనములమీద నిది బాగుగా పనిచేయును. పిల్లల కలరా వ్యాధియొక్క ప్రథమావస్థ.

మూత్రావయవములు:—మూత్రముకొద్దిగాను, యెర్రగాను, పొత్తికడుపులోను మూత్రనాళములోను కోయుచున్నట్లు బాధతోను, రక్తముతోను వెడలుట; యీ లక్షణములు గజ్జిని అణచి పెట్టుటవలన వచ్చుట.

స్త్రీఅవయవములు:—బహిష్టు చాల ముందరగాను స్రావమెక్కువగాను యుండుట. బొడ్డువద్దనుండి గర్భాశయములోనికి వ్యాపించునట్టి నొప్పిని మాన్పును. వేవిళ్లనుకట్టును. గర్భాశయ రక్తస్రావములు.

శ్వాసావయవములు:—ఇది వుబ్బసమునకు ప్రధానౌషధము. జలుబువలన తుమ్ములు వచ్చుట. నీళ్లవంటి స్రావము వెడలుట. ఘూపిరాడనంతటి దగ్గు. ఛాతీ శ్లేష్మముతో నిండినట్లుండినను దగ్గినప్పుడు శ్లేష్మము వెడలక పోవుట. కోరింతదగ్గు; దీనిలో ముక్కునుండియు, నోటినుండియు, రక్తము స్రవించుట. శ్వాసావయవముల నుండివచ్చు రక్తస్రావములను, బొంగురుతనమును మాన్పును.

నడుము, కాళ్ళు, చేతులు:—దేహము కొయ్యబారుట, చేతులు కొట్టుకొనుట. ఒకచెయ్యి వెచ్చగాను రెండవది చల్లగాను యుండుట.

జ్వరము:—మన్యపు జ్వరముమీద బాగుగా పనిచేయును. క్వయినాను వాడిన పిమ్మట దీనిని వాడినయెడల క్వయినాయొక్క దుర్గుణములను తీసివేయును. కొద్దిగా వెచ్చగాను, వికారముగాను, వమనములతోను యుండుట. అపథ్యదోషమువలన జ్వరము తిరిగి వచ్చుచుండుట.

నిద్ర:—కండ్లను సగము తెరచియుంచి నిద్రపోవుట, నిద్రలో గురుపట్టుచుండుట, మూలుగుచుండుట. నిద్రలేమివలన వచ్చు వికారము,

చర్మము:—పాలిపోయియుండుట. దురదగా నుండుట. చిన్న చిన్న యెర్రని పొక్కులు బయలుదేరుట. వమనముగువరకు గోకుచునే యుండుట.

ఉద్రేకము:—వమనమువలన, దగ్గుటవలన, శీతకాలములో, పరుండుటవలన, క్వయినా నెక్కువగా వాడుటవలన, కదలికవలన.

ఉపశమనము:— నొక్కుటవలన, కండ్లను మూసుకొనుటవలన, విశ్రాంతివలన.

పోలికలు:—ప్లేటాఓరియంటాలిస్, మిర్టసు చికేన్, స్ట్రేటంసల్ఫు.

సహచరులు:—ఆర్నికా, కుప్రింమెట్.

విరుగుళ్లు:—ఆర్సెనికం ఆల్బమ్, చైనా, టబాకం, కేంఫరు, ఆర్నికా, నక్సువామికా.

కుప్రింమెట్, ఎల్యూమినా, ఆర్నికా, ఆర్సెనికం ఆల్బం, చైనా, డల్కమారా, ఫెర్రింమెట్, ఓపియం, టబాకం, యాంటింటార్టు—లకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాల పరిమితి 12 లగాయతు 24 గంటలు.

---

## 126. ఐరిస్ వెర్సికలర్. IRIS VERSICOLOR.

థైరాయిడు గ్రంధి, వృక్వకము, లాలాజలగ్రంధులు, ఆంత్రముల లోని మాంసగ్రంధులు, అన్నకోశము, ప్రేగులు, వీటిలోని ఆమత్వచలు—వీటికి గలుగునట్టి రోగములమీద ఇది బాగుగా పనిచేయును. పైత్యరసము నిది యెక్కువగా వెలువరించును. మానసటువంటి తలనొప్పులకును కలరా వ్యాధికిని దీనిని వాడవచ్చును.

తల:—వికారముతో నుండు నుదుటినొప్పి. తలనొప్పి విశ్రాంతివలన యెక్కువగుట, తలమీద పొక్కులు బయలుదేరుట,

చెవులు:—గింగురుమనుచున్నట్లు, గర్జించుచున్నట్లు ధ్వనులువినపడుట. చెవి బాధతోగూడిన వికారమును, ధ్వనులువినుపించుటను మాన్పును.

గొంతుక:—గొంతుక వెచ్చగాను, మంటగాను, యెక్కువ లాలాజలముతోను వుండుట. గండమాలరోగమును మాన్పును. నోరు, నాలుక, కాలినట్లుండుట.

అన్నకోశము:—ఆహారనాళము పొడుగునను మంటగానుండుట. వమనము పుల్లగాను రక్తముతోను కలసి వెడలుట. ఆకలి తక్కువగానుండుట.

పొత్తికడుపు, మలము, మలాశయము:—కాలేయములో నొప్పిగాను పొత్తికడుపు వుబ్బరముగాను శూలగానుయుండుట. విరేచనముపల్చగా నీళ్లవలెను, ఆసనమువద్ద మంటతోను వెడలుట. రాత్రియందు బాధతో వెడలు పసరువిరేచనములు. విరేచనబద్ధమును మాన్పును, దీనికి 30 పొటెన్సీలో వాడవలయును.

స్త్రీఅవయవములు:—కుసుమకును, వేనీళ్లకును వాడవచ్చును.

కాళ్లు, చేతులు:—నొప్పులు ఒకచోటనుండి మరియొకచోటికిమారుచుండుట. శిగసంబంధమైన మేహావాతనొప్పులు. సయాటికా.

చర్మము:— అజీర్ణదోషములతో గూడియుండు చర్మరోగములు. మంత్రివుపొక్కులలో రాత్రియందు దురదవచ్చుట. ముఖముమీదను తలమీదను రసితోగూడిన పొక్కులు బయలుదేరుట.

ఉద్రేకము:—సాయంకాలమందు, రాత్రియందు, విశ్రమించుటవలన.

ఉపశమనము:—కదలుచుండుటవలన.

విరుగుళ్లు:—నక్సువామికా.

మోతాదు:— 3 మొదలు 200 పొటెన్సీ. పెద్దపెద్ద పొటెన్సీలలో నిది బాగుగా పనిచేయుచున్నది.

## 127. జకారాండా. JACARANDA.

ఇది సవాయిరోగముమీద బాగుగాపనిచేయును. సవాయిపుండ్లను, గర్భిణీస్త్రీల వేవిళ్లను, మేహవాతరోగమును మాన్పును.

తల:—జ్ఞాపకశక్తి లేకపోవుట. చదువుట కష్టముగాను, కండ్లు యెర్రగాను, బాధగాను నీరుకారుచునుయుండుట. కండ్లలో యిసుకపోసినట్లుగాయుండుట. దృష్టిమాంద్యము. సవాయిలక్షణములతోగూడినట్లుండు కండ్లకలక.

గొంతుక:—చదువునపుడు, నవ్వునప్పుడు స్వరపేటికలో మంటగాను, బాధగాను యుండుట, సప్తపథలో చిన్నపొక్కులు బయలుదేరుట.

మూత్రావయవములు:—మూత్రమెక్కువగావెడలుట. అంగములో నొప్పిగాయుండుట. మూత్రనాళము మంటగాను, వాపుగాను,యెర్రగాను వుండుట, మరియు దీనినుండి పసుపుపచ్చని స్రావము వచ్చుచుండుట.

పురుషావయవములు:—సవాయిపుండ్లు. శిశ్నాగ్రచర్మము వాచి బాధగానుండుట, మరియు దీనిమీదను, బొగడమీదను, దురదతో గూడిన పొక్కులు బయలుదేరుట. ఇది సెగవ్యాధిమీదకూడ బాగుగా పనిచేయును. అంగములో వెచ్చగాను బాధగాను యుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—సెగ సవాయివ్యాధుల సంబంధమైన మేహవాతనొప్పులు మరియు వాపులమీద బాగుగా పనిచేయును. చేతులమీద దురదపొక్కులు, మొటిమలు. నడుములో నీరసముగానుండుట.

విరుగుళ్ళు:—మెర్క్యూరియసు.

మోతాదు:—మదరుటించరు మొదలు 3 పొటెన్సీ. మదరుటించరులో మోతాదుకు 5 చుక్కలు చొప్పున వాడినపుడిది బాగుగాపనిచేసినది.

## 128. జొనోసియా. JONOSIA.

(హిందూదేశపు ఔషధము. 37. అశోకవృక్షము.)

ఇది స్త్రీమర్మావయవరోగములమీద బాగుగా పనిచేయును. ఇది ముఖ్యముగా బహిష్టుకుబహిష్టుకు మధ్యగలుగు స్రావములను, బహిష్టు సరిగానుండకపోవుట లేక ఆపివేయబడుటను మాన్పును.

తల:—తలకు రక్తమెక్కువగా జేరుట వలనవచ్చు నొప్పి, ఇది బహిరంగమైన గాలిలో ఉపశమించు చుండుట.

ముక్కు:—నీళ్లవంటి స్రావము విస్తారముగా వెడలుచుండుట. వాసన తెలియకపోవుట.

అన్నకోశము, పొత్తికడుపు, మలాశయము:—పుల్లని వస్తువులను తియ్యని వస్తువులను తినగోరుచుండుట, ఎక్కువదాహముగాను, వికారముగాను వుండుట. తీరని వివేచనబద్ధముచే బాధపడుచుండుట. మూలశంఖ.

స్త్రీఅవయవములు:—ఋతువు ఆలస్యముగాను, ఒకప్పుడు ముందరగాను, స్రావము యెక్కువతక్కువలుగాను అగుచుండుట. ఋతుశూలను, ఋతువు అణచిపెట్టబడుటను, ఋతుస్రావము వెడలుటకు ముందు అండములలో గలుగునొప్పిని మాన్పును. ఋతుస్రావము లేక యెర్రని రక్తస్రావము వెడలుచుండుట, మూత్రకోశమునందు చిరచిరగానుండుట, కుసుమవ్యాధి—వీటిమీదనిది బాగుగా పనిచేయును.

నిద్ర:—తరచు మెలకువ వచ్చుచుండుట. ప్రయాణము చేయుచున్నట్లు కలగను చుండుట.

మోతాదు:—మదరుటించరు. మోతాదుకు 3 చుక్కల చొప్పున వాడుట మంచిది.

---

## 129 జస్టీషియా. JUSTICIA.

(హిందూదేశపు ఔషధము. 38. అడ్డసరము).

ఇది శ్వాసావయవరోగములమీద బాగుగా పనిచేయును. జలుబుతోవచ్చు జబ్బులు, దగ్గు, శ్వాసనాళముల వాపులు, బ్రాంకైటీసు, న్యుమోనియా, ముక్కునుంచి నీళ్లవంటి స్రావమువచ్చుట, శ్లేష్మములోను వుమ్మిలోను రక్తజీర వుండుట, కోరింతదగ్గు, క్షయదగ్గు, వుబ్బసము—వీటిమీద బాగుగా పనిచేయును. రక్తములోని దోషములతో గూడిన సెగ, కుష్టు మొదలగు వ్యాధులమీదకూడ ఇది బాగుగా పనిచేయును. రోగి దగ్గుచే బాధపడుచున్నప్పుడు క్షయరోగచిహ్నములు కనుపించినయెడల దీనిని ముఖ్యముగా వాడవలయును.

తల:—వెచ్చగాను, నిండుగాను, బరువుగాను, చిరచిరలాడుచును యుండుట. ముక్కునుండి నీళ్లవంటి స్రావము, తుమ్ములు, వీటితోపాటు కన్నీళ్లు వెడలుచుండుట. రుచి, వాసన తెలియకపోవుట. స్రావముతో గూడిన దగ్గువచ్చుట.

గొంతుక:—గుటక వేయునపుడు నొప్పిగా యుండుట. గొంతుక, నోరు, ఆర్చుకుపోయి యుండుట.

శ్వాసావయవములు:—రొమ్ముముకలోను ఛాతీలోను నొప్పిసిగలు గజేయుచు వచ్చునట్టిపొడిదగ్గు. దగ్గులు, తుమ్ములు ఒకేసారివచ్చినప్పుడిది పనిచేయును. వుబ్బసపుదగ్గు వెచ్చని గదిలోను, తలుపులు మూయబడిన గదిలోను, వుద్రేకించునప్పుడు దీనిని వాడనగును. కోరింతదగ్గుమీద బాగుగాపనిచేయును. దగ్గునప్పుడు వూపిరందకపోవుట, దగ్గు విడిచివిడిచి వచ్చుచుండుట. మరియు దగ్గువలన వూపిరిపీల్చుటకు అభ్యంతరము కలుగుచుండుట. స్వరపేటికలో బాధగాను, గొంతుక బొంగురుగాను యుండుట.

పోలికలు:—ఏల్లియంసేపా, బ్రియోనియా, యూఫ్రేషియా, కుప్రం మెట్.

మోతాదు:—మదరు టించరు మొదలు 200 పొటెన్సీ. చిన్నపొటెన్సీలు బాగుగా పనిచేయుచున్నను, కడుజాగరూకతతో వాడవలయును.

---

## 130. కాల్మియా. KALMIA LATIFOLIA.

ఇది మేహవాత తత్వములమీదను హృదయదోషములమీదను నరముల దోషములమీదను పనిచేయునట్టి యొకగొప్ప ఔషధము. ఇది ఎడమపైపు అవయవములనువచ్చు మేహవాతము మున్నగుదోషములమీద బాగుగాపనిచేయును.

మనస్సు:—కోపము, చిరచిర. పరుండినపుడు మెదడు తనపనిని సరిగా చేయుట, మరియు జ్ఞాపకశక్తి బాగుగాయుండుట. ఆతురతగాను; గుండెదడుతోను యుండుట.

తల:—తలనొప్పి, వికారము, దృష్టిచెడుట, విసుగుదల, కాళ్లు, చేతులలో నొప్పులు ఇవి ముందువంగినప్పుడు వచ్చుచుండుట. మరియు నిబ్బరముగా కూర్చున్నప్పుడుపశమించుట. ప్రతిసాయంత్రమునను, రాత్రియందును పార్శ్వపునొప్పి వచ్చుచుండుట. తలదిమ్ము నుదిటిలోను, నడినెత్తిని భారముగానుయుండుట. నరముల సంబంధమైన బాధలు ఆగిఆగి వచ్చుచుండుట.

కన్నులు:—నిబ్బరముగాకూర్చున్నను, నిలుచున్నను దృష్టిఆనకపోవుట. కండ్లనుకదల్చినపుడు కండ్లుకొయ్యబారినట్లును, లాగుచున్నట్లును బాధగానుండుట.

చెవులు:—కుడిచెవిలోను, వెనుకపైపునను కుట్టుచున్నట్లునొప్పి

ముక్కు:—నీళ్లుకారుచుండుట. వాసన సులభముగా తెలియుట.

ముఖము:—చీల్చుచున్నట్లుబాధ. తలనొప్పివలన ముఖముకందబారుట. ముఖచర్య ఆతురతనుసూచించుట. దవుడలు వేసవిలో గరుకుదేరుట. పెదవులు పగులుట.

నోరు:—రుచి చేదుగానుండుటయు, వికారమును భోజనము చేసిన పిమ్మట వుపశమించుట. భోజనానంతరము లాలాజలగ్రింధులలో జిల పుట్టుట.

అన్నకోశము:—పైత్యదోషములు, వికారము, తలనొప్పి, పమనాను మానము.

పొత్తికడుపు:— వాయువుచేరి, బాధగలుగుట. కాలేయముపద్దనొప్పి.

మలము, మలాశయము:—నిగనిగలాడుచు పలుచగా మలము వెడలు చుండుట. ఆసనము నొక్కుకుపోయినట్లు బాధ.

మూత్రావయవములు:—మూత్రములో శ్వేతధాతువు కలసిపోవుట. నడుములో పొడుచుచున్నట్టుండు బాధతో మూత్రము తరుచుగా వెడలు చుండుట.

పురుషావయవములు:—సంభోగకోర్కె లేకున్నను తరుచు గాఢ మైన లేపనము గలుగుచుండుట. వుదయమున కుడివృషణమునందును మధ్యా హ్నము ఎడమవృషణమునందును బాధ వచ్చుచుండుట.

స్త్రీఅవయవములు:—బహిష్టు మామూలుకన్న ముందుగను ఋతు శూలతోను వచ్చుచుండుట. బహిష్టు దినములలో శరీరమందంతటను నొప్పు లుగలుగుట. బహిష్టు అణచిపెట్టబడుటతో శరీరమంతటను నరములసంబం ధమైన బాధలు గలుగుట. పసుపుపచ్చని స్రావముతోనుండు కుసుమ బహిష్టుకు ఒక వారము పిమ్మట కనుపించుట.

శ్వాసావయవములు:—గొంతుకను నొక్కివేసినట్లునొప్పి. దుర్వాస నగను, వుప్పగను, బూడిదవర్ణముగానుండు శ్లేష్మము వెడలుట. ఆతురత తో శ్వాసను పడిగాపీల్చుట.

హృదయము:—గుండెదడ. ముందుకు వంగినచో నిదివుద్రేకించుట. నిస్త్రాణగను నెమ్మదిగను యుండునాడి (ఎపోసైనం, డిజిటాలిసు). పుగా కునెక్కుడుగా నుపయోగించుటవలని హృదయదోషములు. బాధలవలన

వూపిరిపీల్చుట కష్టముగానుండుట.

కాళ్ళు, చేతులు:—కాళ్లలోను చేతులలోను బాధలు యితరరోగ లక్షణములతో ద్వంద్వముగా యుండుట.

నరములమండలము:—నరముల సంబంధమైన బాధలు దిగువనై పు వకు వ్యాపించుటయు దీనితో అవయవములు మొద్దుబారు చుండుటయు గలుగుచుండుట. పక్షవాతము వచ్చునేమోయనునట్లు భావన గలుగుచుండుట.

చర్మము:—పొడిగానుండుట. బిగపట్టినట్లుండుట. చిడుమువంటి చర్మరోగము బయలుదేరుట. అచ్చటచ్చట చర్మముయెఱ్ఱగావాచి బాధ గానుండుట.

నిద్ర:—నిద్రపట్టకుండుట. వుదయమున చాలనుండరగా మెలకువ జెందుట.

జ్వరము:—విడువకుండగ అనుదినమును జ్వరము వచ్చుచుండుట. దీనితో పొట్టవుబ్బరించుట ద్వంద్వముగాయుండుట. చల్లని చమటపట్టుట. వడుము పొడుగునను చలిపారుచున్నట్లుండుట. శరీరము వెచ్చగను మం టలుగాను యుండుట.

వుద్రేకము:—ముందుకు వంగుటవలన, దిగువనై పునకు చూచుట వలన, కదలికవలన, బహిరంగమైనగాలిలో.

వుపశమనము:—చల్లదనము వలన.

పోలికలు:—పల్సటిల్లా, స్పైజీలియా, లెడం, రూస్టాక్స్.

విరుగుళ్లు:—ఎకోనైటు, బెల్లడోనా.

సహచరులు:—యూసిడు బెంజోయిక్.

వస్సవామికా, స్పైజీలియా, థైరాయిడినం—లకు పిమ్మటయిది బాగుగా పనిచేయును.

మోతాదు:— 3 మొదలు 30 పొటెన్సీ. చిన్నపొటెన్సీలలో నిది

హృదయము ఎక్కువగా కొట్టుకొనునట్లు చేయును మరియు పెద్దపొటెన్సీలలో హృదయవేగమును తగ్గించును.

## 131. లుఫ్ఫా. LUFFA.

(హిందూదేశపు ఔషధము. 39. చేతిబీర లేక వెర్రిబీర)

ఇది జీర్ణావయవ రోగములమీద బాగుగా పనిచేయును. నీళ్లవిరేచనములను వమనములను కట్టును. మూత్రమును జారీచేయును. దేహమునకు బలమునిచ్చును.

ఆంత్రములు:—విరేచనములు నీళ్ళవలెను, ఆమను కలసియు, లేక గంజినీళ్లవలెను, బాధ లేకుండగను, ఒక్కొక్కప్పుడు మూత్రమణచిపెట్టుట ద్వంద్వముగానూ యుండుట, మరియు యిట్టి విరేచనములతో పాటు వమనములు ఒకేసారి లేక అప్పుటప్పుట పసరికగాగాని లేక నీళ్ళవలెగాని వెడలుట.

మోతాదు:—1 మొదలు 30 పొటెన్సీ.

## 132. లెడం. LEDUM.

ఇది మేహవాత తత్వములకును, తాగుడువలన చెడిపోయిన తత్వములకును పనిచేయును. మేహవాతసంబంధమైన నొప్పులు లేక బాధలు పాదములలో ప్రారంభించి పైఅవయవములలోనికి వ్యాపించుటను, విషజాతిపురుగులు కుట్టినపుడు లేక కరచినప్పుడు (తేలుకాటు వగైరాలకు)ను, రోగికి శరీరమునందు వుండవలసినంత వెచ్చదనము లేకపోయినను పడకవేడిమిని భరింపలేకున్నపుడును వాడిగానుండు మొనగల ఆయుధముల వలన [మేకులు (హైపెరికం)] గాయముపడిన ప్రదేశమందును లేక జంతువులు (తేళ్లు, ఎలుకలు, ముఖ్యముగా దోమలు) కరచిన ప్రదేశమందు చల్లగానుండిన యెడలను, గాయము తగిలిన ప్రదేశమునందలి కండరములు

కంపముతో నుండు గురగ్రిపువాతము మీదను —దీనిని ముఖ్యముగావాడ వగును.

మనస్సు:—తనపాటివారియెడల అసహ్యత జెందుట. ఒంటరిగా నుండగోరుట. అతికోపముగానుండుట.

తల:—నడచుచున్నప్పుడు వికారముగానుండి, ఒకవైపునకు పడి పోవునట్లు సూచన గలుగుట. ముక్కునుండి రక్తము స్రవించుట.

కన్నులు:— నలుగగొట్టబడుటవలని గాయములు. మేహవాతసంబంధమైన అంతరకుసుమలు. కనుపాపలు పెద్దవగుట. దృష్టికంగారుగానుండుట. కండ్లనుండి దుర్వాసనతో గూడినరసివచ్చుట.

ముక్కు:—ముక్కునుండి పాలిపోయినట్లుండు రక్తము స్రవించుట.

ముఖము:—నుదురుమీదను, దౌడలమీదను, ఎర్రని పొక్కులు, మొటిమలు బయలుదేరుట. వీటిని ముట్టుకొనినయెడల ముండ్లుగుచ్చుకొనినట్లు బాధగా నుండుట.

అన్నకోశము:—కొలదిగా భోజనముచేసినను అన్నకోశము బరువుగాతోచుట.

పొత్తికడుపు, మలము, మలాశయము:—నమలుచున్నట్లు బాధగా నుండుట. జిగట విరేచనములోవలె నులినొప్పి వచ్చుచుండుట. తరుచు అపానవాయువు వెడలు చుండుట. విరేచనబద్ధము, రక్తవిరేచనములు, మంటతో గూడిన మూలశంఖ, ఆసనములో పుండ్లు.

శ్వాసావయవములు:—దగ్గినప్పుడు రక్తజీరతో నుండు కళ్లిపడుట, వూపిరాడకపోవుట. కోరింతదగ్గువలె నుండుదగ్గు విడిచిడిచి వచ్చుచుండుట. వుదయమున, రాత్రి, విడిచివిడిచి వచ్చుదగ్గు. కోరింతదగ్గు.

కాళ్ళు, చేతులు:—మేహవాత నొప్పులు పాదములలోను, కాలుపొడుగునను, కీళ్లసంధులలోను వచ్చుచుండుట. భుజములో నొక్కుచున్నట్లుండునొప్పి కదలికవలన వుద్రేకము జెందుట, చీలమండలు వాచుట.

అరికాళ్లలో బాధవలన నడచుటకు శక్యముకాకుండుట. చీలమండలలో సులభముగా బెణుకు చుండుట. పాదములనుండి మోకాళ్లవరకు వాచుట.

చర్మము:—తల మీదను, ముఖము మీదను, పొక్కులు బయలు దేరుట. పాదములు, చీలమండలు దురదగా నుండుట. గోకినయెడల బాధ యెక్కువగుట. గాయములు తగిలిన ప్రదేశము నల్లబడి, యిట్లు చాలకాలము వరకు యుండుట. రాచవ్రణములు.

జ్వరము:—శరీరము చల్లగాను, వాతముగాను వుండుట. చల్లని నీళ్లు జల్లినట్లుండుట. ముఖము మాత్రము వెచ్చగా నుండుట.

వుద్రేకము:—రాత్రియందు, పడక వేడిమివలన.

వుపశమనము:—చల్లదనము వలన, చల్లని నీటిలో కాళ్ళను వుంచుట వలన.

విరుగుళ్లు:—కేంఫరు

చైనా, ఆల్కహాలు, తేనెటీగలు కుట్టుటవలని దోషము-లకిదివిరుగుడు.

పోలికలు:—రుటా, హెమామెలిసు, బెల్లిసు, ఆర్నికా, హైపెరికం, ఎకినేషియా, నేట్రంయూగ.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాల పరిమితి 3 మొదలు 4 వారములు.

---

## 133. లెమ్నా మైనర్. LEMNA MINOR.

ఇది నాసికారోగములమీద బాగుగా పనిచేయును. ముక్కురంధ్రములలో చిన్నచిన్న కాయలు (Polypi) బయలుదేరుట, ముక్కుపైభాగము వాచుట, ముక్కు దిబ్బడవేయుట, ముక్కునుండి తరుచు స్రావము వెడలుచుండుట.—నీటినిది మాన్పును.

ముక్కు:—వర్ష కాలములో నాసికారోగములు ఉద్రేకము జెందుట.

వాసన తెలియకుండుట, ఒకప్పుడు దుర్వాసనగాయుండుట. అదివరలో పువ్వులయొక్క గాఢమైన వాసనను భరింపలేని రోగి యిప్పుడు భరింపగలుగుట. ముక్కు పైభాగము వాచుట, ముక్కునుండి చెవులవరకు సన్నని తాడుకట్టి లాగినట్లునొప్పిగా నుండుట. అరుచిపోయినట్లుండుట.

నోరు:—ఉదయమున లేచుసరికి దుర్వాసనగా యుండుట. సప్తపథ, స్వరపేటిక, అరుచిపోయి యుండుట.

శ్వాసాపయవములు:—పగ్గ కాలములో వచ్చునట్టి వుబ్బసము.

పోలికలు:—కల్కేరియా, ట్యూక్రియంమారం వీరం, నేట్రం సల్ఫ, కాల్కేరియా కార్బ, ఎస్కులసుహిప్.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 134. లెప్టాండ్రా. LEPTANDRA.

విరేచనము తారువలె నల్లగానగుటనుమానుకొను. మన్దపు జ్వరలక్షణములు, కామెర్ల రోగము, పైత్యసంబంధమైన తలనొప్పి మొదలగు కాలేయరోగములమీద నిది బాగుగా పనిచేయును.

తల:—నుదిటిలోనొప్పి, వికారము, మగత, విచారము.

అన్నకోశము, పొత్తికడుపు:—తెల్లవారు ఝామున 5 గంటలకు మెలకువవచ్చి ఆకలిగా నుండుట. వుదయమున తినిన ఆహారము పులియుట వలన 10 గంటలకు ఫుల్లని త్రేనుపులు వచ్చుచుండుట. నాలుకమీద పసుపుపచ్చరి పూతయుండుట. విరేచనానుమానము గలుగుచుండుట. కాలేయములో నొప్పి బయలుదేరి వెన్నెముకవరకు వ్యాపించుట.

మలము, మలాశయము:—మలము నల్లగాను, దుర్వాసనతోను, బొడ్డుపద్ద నొప్పితోను, విస్తారముగాను వెడలుచుండుట. రక్తము వెడలునట్టి మూలశంఖ. సన్నిపాతజ్వరములో మలము తారువలె నల్లగానుండుట. ఆస

వమునుండి రక్తముస్రవించుట. మూలశంఖ. మలాశయము వెలుపలకు వచ్చుట. కామెర్లరోగములో మట్టిరంగుగా విరేచనమగుట.

స్త్రీఅవయవములు:—ఋతువు అణచిపెట్టబడుట. కాలేయరోగము. చర్మము వేసవిలోవలె పేలుట.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 135. లెస్పిడెజా. LESPIDEZA.

ఛాతీకి నీరుపట్టుట; మూత్రపిండముల వాపు, బాధ, మూత్రములో శ్వేతధాతువు కలసి పోవుచుండుట. (Bright's Disease)—వీటిమీద నిది బాగుగా పనిచేయును.

మోతాదు:—మదరుటించరు. మోతాదుకు 1 చుక్క.

---

## 136. లయాట్రిస్ స్పైకేటా. LIATRIS SPICATA.

ఇది కాలేయము, ప్లీహము వీటియొక్క వాపుతోనుండు వుబ్బుల మీదను, మూత్రపిండముల వాపులమీదను, బాగుగా పని చేయును. వుబ్బులో మూత్రము అణచి పెట్టబడుట దీనిముఖ్యలక్షణము. శరీరమునకు నీరుపట్టుట లేక మెరుగుచూపుట లేక వుబ్బుట; ఈ లక్షణము హృదయముయొక్కయు లేక మూత్రపిండములయొక్కయు రోగములకు సంబంధించి యుండునపుడిది బాగుగా పనిచేయును. నడుము దిగువను బాధతో అతి తొందరగా వచ్చునట్టి నీళ్లవిరేచనములమీద బాగుగా పనిచేయును. శూలను మాన్పును. దీనిని వాడుటవలన వెంటనే మూత్రము విస్తారముగా కాడలును. మాననటువంటి గాయములకును, పుండ్లకును దీనిని పైకి పట్టించవచ్చును.

మోతాదు:—మదరు టించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 137. లిలియం టిగ్. LILIUM TIG.

ఇది రొండమువైపు అవయవములమీదను, గర్భాశయరోగములమీదను బాగుగా పనిచేయును. గర్భాశయములో దిగలాగుచున్నట్లు బాధగా నుండుట (సేపియా) యు; ఛాతీ, అన్నకోశము, హృదయము మొదలగు అవయవములన్నిటిలోను మర్మావయవము వైపును దిగలాగుచున్నట్లు బాధగా యుండుటయు దీని ముఖ్యలక్షణములు.

మనస్సు:—శరీరములో నేదియోకుదరనటువంటి జబ్బురానున్నదని భీతిని జెందుచుండుట. ఎప్పుడును యేడ్వవలెనని రయుండుట. తిట్టవలయుననియు, కొట్టవలయుననియు, శృంగారసంబంధమైన ఆలోచన చేయవలయుననియు వుండుట. మాట్లాడునప్పుడు తప్పులు వచ్చుచుండుట. పొరబాటుగా మాట్లాడుచుండుట.

తల:—వెచ్చగాను, భారముగాను, మందముగాను వుండుట. గర్భాశయరోగములవలనవచ్చు తలనొప్పిని మాన్పును.

కండ్లు:—వికారపుమాపు. దృష్టిమాంద్యము. కండ్లలోను రెప్పలలోను వేడివలన దృష్టిచెదరుట.

అన్నకోశము:—ఉబ్బరింపుగాను, వికారముగాను, బరువుగాను వుండుట. ఆకలిగా నుండుట. మాంసమందు కోర్కెతో నుండుట.

పొత్తికడుపు:—ఉబ్బరముగాను, బాధగాను, వ్రేలాడుచునుయుండుట, వణకుచున్నట్లు భావనయుండుట. దిగువకును, వెనుకకునులాగుచున్నట్లుండుట.

మలము, మలాశయము:—ఆసనములో నొక్కుచున్నట్లుండు బాధవలన తరుచు విరేచనానుమానము గలుగుచుండుట. తెల్లవారగట్ల విరేచనముకొరకు తొందరగానుండుట. జిగట, రక్తముతోనుండు విరేచనములు, వీటితో ఆసనములో తీపుగా వుండుట.

మూత్రావయవములు:—తరుచు మూత్రానుమానము. మూత్రము కొద్దిగాను, వెచ్చగాను, పాలవలెను వెడలుట.

పురుషావయవములు:—అండములువాచి బాధగానుండుట. ఉదయమున నొప్పిగాను, బరువుగాను యుండుట. సంభోగమువలన నిస్త్రాణ గలుగుట.

స్త్రీఅవయవములు:—ఋతువు మామూలుకన్న ముందరగాను, స్రావముకొలదిగాను, ముదరరంగుగాను, ముద్దలుముద్దలుగాను, దుర్వాసనతోను, కదలుచున్నప్పుడు మాత్రమే వెడలుచుండుట, మరియును విశ్రాంతిగానున్నప్పుడు స్రావము వెడలకుండుట (సేపియా, బెల్లడోనా). గర్భాశయములో రక్తమెక్కువగా జేరుటవలన బరువుగా నుండుట. గర్భాశయము వెలుపలకు వచ్చుట; మరియు నిది ముందరకు తిరుగుట. అండాశయములోను, తొడలు దిగువవరకును నొప్పిగానుండుట. ఒరుపును కలుగజేయునట్టి గోధుమరంగు కుసుమ. గర్భాశయమువద్ద వుబ్బరించినట్లుగా యుండుట.

శ్వాసావయవములు:—ఛాతీలోనొక్కుచున్నట్లు బాధగా నుండుట. వూపిరి గాఢముగా తీసికొనవలెనని యుండుట. సాయంకాలమందు పొడిదగ్గు యెక్కువగా వచ్చుచు బహిరంగమైన గాలిలో వుపశమించుట.

హృదయము:—మరలోపెట్టినొక్కుచున్నట్లును, లేక ఇనుపబద్దీతో గట్టిగా చుట్టబెట్టినట్లును భావన యుండుట(కేక్టసు). నాడి వక్రముగాను, దుడుకుగాను వుండుట. గుండెదడను, బాధను మాన్పును.

కాళ్లు, చేతులు:—ఎత్తుపల్లముగానుండు నేలమీద నడచుట కష్టముగా నుండుట. కుడిచేతిలోను, చట్టలోను కాళ్లలోను చీలమండలలోను, నొప్పి. అరిచేతులలోను అరికాళ్లలోను మంటలుగానుండుట.

నిద్ర:—విశ్రాంతి నివ్వనటువంటి నిద్ర.

చర్మము:—దురదగాను, మంటగాను, తిమ్మెరగాను వుండుట.

జ్వరము:—సాయంకాలమందు యెక్కువ వెచ్చగాను ఆయాసము గాను యుండుట.

వృద్ధికము:—వెచ్చని గదిలో, సాయంకాలమందు, రాత్రియందు.

వుపశమనము:—స్వచ్ఛమైన గాలిలో.

పోలికలు:—కేక్టసు, సేపియా, ప్లాటినా, హెలోనియాస్.

విరుగుళ్లు:—హెలోనియాస్, నక్సువామికా, పల్సటిల్లా.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 138. లోబీలియా ఇన్‌ఫ్లేటా. LOBELIA INFLATA.

ఇది శ్వాసావయవము, అన్నకోశము, హృదయము—వీటికి సంబంధించిన రోగములమీద బాగుగాపనిచేయును. పుగాకును, తేయాకు (టీ)ని యెక్కువగా వాడువారికి వచ్చు రోగలక్షణములమీదను, వుబ్బసపువ్యాధి మీదను బాగుగాపనిచేయును. వుబ్బసపువ్యాధి జఠరలక్షణములతో ద్వంద్వముగా యున్నప్పుడును ఇది బాగుగా పనిచేయును.

తల:—వికారము, వమనము—ఇవి అజీర్ణమువలన గలుగునప్పుడును, పుగాకు నుపయోగించుటవలన వచ్చునప్పుడును పనిచేయును.

చెవులు:—స్రావములనుగాని, మంత్రిము పొక్కులవంటి చర్మరోగమునుగాని, అణచిపెట్టుట వలనవచ్చు చెముడునుమాన్పును.

అన్నకోశము:—వుబ్బరముగాను, పులితేన్పులతోను, ఆయాసముగాను వుండుట. అజీర్ణమువలన ఛాతీలోమంటగా నుండుట. వికారము, వమనములు వేవిళ్లను మాన్పును. లాలాజల మెక్కువగా వూరుచుండుట, మరియు యెక్కువ ఆకలిగానుండుట. పుగాకురుచినిగాని వాసననుగాని భరింప లేకుండుట.

ఛాతీ:—ఛాతీ ముడుచుకొని పోవుటవలన వూపి రాడకపోవుట. హృదయము ఆగిపోవునట్లు భావన గలుగుట, వుబ్బసపుదగ్గు; ఇది నీరసము

తోను, శరీరమంతటను కుట్టుచున్నట్లుండు బాధతోను, జఠర లక్షణముల తోను, నిస్త్రాణతోను వుండుట. వూపిరాడకపోవుటవలన ప్రాణముపోవు నని తోచుట.

హృదయము:—శరీర పరిశ్రమవలన లక్షణము లుద్రేకము జెందుట. నాడి నిస్త్రాణగా నుండుట.

మూత్రము:—ఎర్రగాను, ఎర్రనిమడ్డితోను వెడలుట.

ఉద్రేకము:—పుగాకువలన, మధ్యాహ్నమందు, కదలికవలన, చల్ల దనమువలన.

ఉపశమనము:—వడిగా నడచుటవలన, సాయంకాలమందు, వెచ్చ దనమువలన.

విరుగుళ్ళు:—ఇపెకాక్.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 139. లైకోపోడియం. LYCOPODIUM.

అధికమైన తెలివితేటలు గలిగియున్నను శారీరకముగా నిస్త్రాణ జెందినవారి కిది బాగుగా పనిచేయును. ఇట్టివారికి శరీరముయొక్క పై భాగము అర్చుకునిపోయి దిగువభాగముకు వాపు, నీరుపట్టుట గలుగును, శ్వాసావయవములు, అన్నకోశము, పాత్తికడుపు, మలాశయము—వీటికి సంబంధించియుండు రోగములవలన బాధపడుచు వుండుటను మాన్పును. ఇదిముఖ్యముగా చిన్నపిల్లలయొక్కయు ముసలివారియొక్కయు రోగము లమీదను, దీర్ఘరోగములమీదను బాగుగా పనిచేయును.

మనస్సు:—మగవారిని చూచి భయముజెందుట, ఒంటరిగా నుండ గోరుట, ఒంటరిగా నుండుటను వెరచుట—ఇట్టి లక్షణములు పిల్లలలో కలిగినప్పుడు దీనిని వాడనగును. దినమంతయు యేడ్చుచుండుట, ఏడ్పును మానజాలకపోవుట, తనశక్తియందు తనకే నమ్మకములేకపోవుట, తాను

వ్రాసినది తిరిగి చదువలేకపోవుట. జ్ఞాపకశక్తి తగ్గుట.

తల:—తలవెంట్రుకలు చాల త్వరగా నెరియుట. ఉదయమున లేచుసరికి వికారము వచ్చుటవలన వెనుకకును ముందరకును తూలుచుండుట. దగ్గువలన కనుబొమలవద్దను, ఛాతీలోను చితుకకొట్టినట్లు నొప్పిగా వుండుట. పొత్తికడుపుకు సంబంధించిన రోగములు వచ్చినపిమ్మట తలవెంట్రుకలు వూడిపోవుట. ప్రసవించినపిమ్మట తల దురదగాను, మంటగాను, తలవెంట్రుకలు వూడిపోవుచును వుండుట.

కన్నులు:—పగటియందును రాత్రియందును గూడ వెలుతురును చూడలేకపోవుట. కనురెప్పలమీదకాయలను కనురెప్పల యెరద్రనమును వాపును, పుండ్లను మాన్పును. చూచుచున్న వస్తువు సగము మాత్రమే కనబడుట. ఆర్చుకుపోయినట్లుండుట. రాత్రియందు కండ్లంటుకొనుట.

చెవులు:—హోరుగా నుండుట. చీము వెడలుచుండుట. ప్రతి శబ్దమునను ఒకవిధమైన ప్రతిధ్వని వినబడుచుండుట. చెముడు.

ముక్కు:—దిబ్బడవేయుట. నీళ్లవంటి స్రావము యెక్కువగా వెడలుచుండుట. ఒరుపును గలుగుజేయుచు, స్రావము వెడలుచుండుట. నాసికారంధ్రములు పుండ్లగుట.

ముఖము:—సన్నిపాత జ్వరములో అడుగుదౌడ వ్రేలబడుట, లేక పడిపోవుట. ముఖము పొంగరించుట. పాలిపోయి పసుపుపచ్చగా మట్టి రంగును పోలియుండుట.

నోరు:—పండ్లసలుపు. దీనితోనుండు దౌడలోవాపు వుష్ణోపచారమువలన తగ్గుట. దాహములేకుండుట. నాలుక, నోరు ఆర్చుకొని పోవుట. నోటినుండి దుర్వాసన వచ్చుట.

గొంతుక:—ఆహారము తీసికొనినపుడు వుక్కిరిబిక్కిరియై ముక్కునుండి వెలువడుట. స్వరపేటికలో క్షయసంబంధమైనపుండ్లుబయలు దేరుట. గొంతుక ఆర్చుకొని పోవుట. గవదకాయలు వాచుట. చీము పట్టుట

పుండ్లు పడుట.

అన్నకోశము:—ఎక్కువ ఆకలిగా నుండుట. తినిన కొలది యింకను తినగోరుచుండుట. ఎక్కువ ఆకలిగానున్నను, కొలది ఆహారమువలన పొట్ట నిండుట. రుచి పుల్లగాను చేదుగాను ఉండుట. ఆకలి లేకపోవుట. తినిన ఆహారము వికటించు చుండుట, లేక వమనమగుచుండుట. ఆహారము తీసికొనినపిదప అన్నకోశములో బరువుగాను, రుచి చేదుగాను ఉండుట. జీర్ణశక్తి కొలదిగానుండుట. భోజనానంతరము కడుపు పొంగరించుట.

పొత్తికడుపు:—ఉబ్బరముగానుండుట. యెడమవైపున యెక్కువ గుడగుడలాడుచుండుట. వాయువు బంధింపబడుటవలన పోట్లువచ్చుట. నొక్కుటకు నొప్పిగానుండుట. ఊపిరి పీల్చునప్పుడు కాలేయమువద్ద నొప్పిగానుండుట. కుడివైపు గిలకకు పనిచేయును; పిల్లల కేసులలో ఇది బాగుగా పనిచేసినది. జీర్ణసంబంధమైన రోగములవలన వుబ్బుట లేక నీరు పట్టుట. తాగుడువలన వచ్చు జలోదరమువిూద పనిచేయును.

మలము, మలాశయము:—మలము గట్టిగానుండుట. మలబద్ధము, మలాశయద్వారము ముడుచుకొనిపోవుటవలన విరేచనమవక పోవుట. విరేచనమైనపిమ్మట, యింకను వెడలవలసిన మలము దిగబడిపోయినట్లు తోచుట, లేక ఆసనములో యెక్కువబాధగా నుండుట. మలముపాలిపోయిన రంగుగాను, దుర్వాసనగాను, ముద్దలుముద్దలువలెను, పసుపుపచ్చగాను లేక యెఱ్ఱగాను, పల్చగాను వెడలుట. మూలశంఖ మొలలుముట్టుకొనినయెడల నొప్పిగాను, పోట్లుగాను యుండుట.

మూత్రావయవములు:—మూత్రముకొలదిగాను, యెఱ్ఱగాను శ్వేతధాతువుతోకలసి చుక్కలు చుక్కలుగాను, బాధతోను, యెఱ్ఱనియిటుకపొడివంటి మడ్డితోను వెడలుచుండుట. మూత్రకోశములో సన్నని రాళ్లు బయలుదేరుట, మూత్రములో రక్తముకలసి పోవుచుండుట. నడుమునొప్పి మూత్రవిసర్జనమునకు పిమ్మట ఉపశమించుట. మూత్రకోశము వాపు, బాధ. మూత్రము ఆపివేయబడుట.

పురుషావయవములు:—నపుంసకత్వము. లేపనశక్తి లేకపోవుట. అంగము చిన్నదై చల్లగానుండుట. స్ఖలనము త్వరితముగానగుట. ప్రాస్టేటు గ్రంధి వాచి పెద్దదగుట. యుక్తవయస్కులలో అధిక సంభోగమువలనను, హస్త ప్రయోగాది దురభ్యాసము వలనను వచ్చు నపుంసకత్వమును మాన్పును. ముసలివారిలో సంభోగవాంఛ యెక్కువగానున్నను, లేపనము సరిగానుండకపోవుట. కౌగిలింతలో నిద్రజెందుట. అతిత్వరితముగా స్ఖలనమగుట.

స్త్రీఅవయవములు:—అవయవము ఆరుచుకొనిపోవుట. సంభోగమునందును, తరువాతను, మంటగా నుండుట. గర్భము దాల్చినవారిలో పింగము తలక్రిందులయినట్లుండుట. విరేచనమగునపుడు మర్మావయవము నుండి రక్తస్రావము కలుగుట. రక్తకుసుమ. ఒకప్పుడు కుసుమ సంబంధమైన స్రావము తెల్లగా పాలవలె నుండుట.

శ్వాసావయవములు:— రాత్రింబగళ్లు తలలోను, అన్నకోశములోను, బాధను కలుగజేయుచు వచ్చేడు పొడిదగ్గును మాన్పును. శ్లేష్మము చిక్కగాను, పసుపుపచ్చగాను, చీమువలెను, రక్తజీరతోను, ఘృదియమున వుప్పని రుచితోను, వెడలుచుండుట. న్యుమోనియాలో తుప్పురంగుగానుండు శ్లేష్మము విస్తారముగా బయలుదేరుచుండునపుడిది పనిచేయును. వూపిరితిత్తులకు పక్షవాతము వచ్చుట. ఛాతీకి నీరుపట్టుట. క్షయరోగము; దీనిలో చీమువంటి స్రావము వెడలుచుండుట. సాయంత్రము 4 గంటలు లగాయతు 8 గంటలవరకును, దినము విడిచి దినమునను, పరిశ్రమువలనను, నిబ్బరముగా కూర్చుండుట వలనను, ముందరకు వంగుటవలనను, వెనుకకు పరుండుటవలనను, దగ్గు యెక్కువగుట. పిల్లలయొక్క ఛాతీలో ఆమము యెక్కువగా జేరినప్పుడిది పనిచేయును.

హృదయము:—హృదయముపైపొర నీరుపట్టుట, లేక వాచుట. రక్త ప్రసరణము ఆగిపోయినట్లు తోచుట. గుండెలోదడగాను, వణకుగాను యుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—రెక్కగూళ్ళు రెండిటిమధ్యను నిప్పుల

వద్ద నున్నట్లువలె మంటగా నుండుట. భుజములలోను, మోచేతులలోను, చీల్చుచున్నట్లు బాధగానుండుట. ఒకపాదము వెచ్చగాను, రెండవదిచల్లగాను యుండుట. పాదములకు చెమట పట్టుట. జీర్ణించిన మేహవాతరోగమువలన కీళ్లసంధులలో సుద్దవంటి పదార్థము జేరినట్లుండుట. బాధగా వున్నవైపున పరుండలేకపోవుట. రాత్రిపరున్నపిమ్మట పిక్కలలోను, కాలిబొట్టన వేళ్లలోను, లాగుచున్నట్లు బాధగా నుండుట.

జ్వరము:—సాయంత్రము 3, 4 గంటలమధ్య చలివచ్చుట. అటుపిమ్మట చెమటపట్టుట. శరీరము మంచువలె చల్లగానుండుట. మంచుమీద పరుండినట్లు భావన యుండుట. చలితగ్గినపిమ్మట తిరిగి చలివచ్చుచుండుట. మన్యపు జ్వరముచే చెడిపోయిన తత్వములమీద బాగుగా పనిచేయును. సాయంకాలమున వుడుకు తగులుచుండుట. బుగ్గలు యెర్రబారుట. వెచ్చదనము వలన కప్పుకొనిన వస్త్రము తీసివేయవలయునని యుండుట. చెమట నీరుల్లివాసన వేయుట.

నిద్ర:—పగలునిద్రమత్తుగా నుండుట. ప్రమాదములను గూర్చిన కలలు వచ్చుచుండుట. నిద్రలో నవ్వుచును యేడ్చుచును వుండుట.

చర్మము:—ఎక్కువ దురదగానుండుట. మూత్రాశయము, జఠరాశయము, మలాశయ సంబంధమైన వ్యాధులతో ద్వంద్వముగానుండు మంత్రపుపొక్కులవంటి పొక్కులతోగూడిన చర్మరోగము. సులభముగా రక్తము స్రవించు చుండుట. చర్మము పొలుసరేకుట, గట్టిపడుట, వుబ్బుట, దుర్వాసనతో గూడిన స్రావములు వచ్చుచుండుట.

వృద్ధికము:—మధ్యాహ్నమున, సాయంకాలము 4 గంటలు మొదలు 8 గంటలవరకు, కొలదిగాఆహారముతీసికొనినపిమ్మట, బహిష్టుకుముందు.

వుపశమనము:—చల్లదనము వలన, బట్టను వదులు చేసుకొనిన పిమ్మట.

సహచరులు:—అయోడియం, కాలీఅయోడ్, చెలిడోనియం, కాల్కేరియా అయోడ్, సల్ఫర్ అయోడ్, లెకసిస్.

విరుగుళ్లు:—కేంఫరు, పల్సెటిల్లా, కాఫీ, కాష్టికం, ఎకోనైట్, కేమోమిల్లా, గ్రాఫైటిస్, నక్సువామికా.

చైనా, కేంఫరు, కాఫి—వీటికి లైకోపోడియం విరుగుడు.

కాల్కేరియాకార్బు, లెకెసిస్—లకుపిమ్మట నిది బాగుగా పని చేయును.

మోతాదు:—3 మొదలు 1000 పొటెన్సీ. యింతకు పైపొటెన్సీల లోగూడ దీనిని వాడనగును. ఇది పెద్ద పొటెన్సీలలోనే బాగుగాపనిచేయు ను. దీనిగుణకాలపరిమితి 40 మొదలు 50 దినములు.

---

## 140. మేటికో. MATICO.

ఇది మర్మావయవరోగముల మీదను, శ్వాసావయవ రోగములమీ దను బాగుగా పనిచేయును.

మర్మావయవములు:—స్రావముతో గూడిన సెగరోగము. నూతన ముగా వచ్చినట్టిగాని నిలువగా యున్నట్టిగాని సెగరోగమును మాన్పును.

శ్వాసావయవములు:—రక్తస్రావములను కట్టును. వర్షఋతువులో వచ్చునట్టి పొడిదగ్గును మాన్పును.

మోతాదు:—మదరుటించరు. మోతాదుకు 2 చుక్కలు.

బాహ్యోపయోగములు:—దీనిని 5 రెట్లు నీళ్లలోకలిపి పైకిపట్టించి నయెడల రక్తస్రావములు కట్టును.

---

## 141. మెలిలోటస్. MELILOTUS.

ఇది వాపులమీదను, రక్తస్రావములమీదను బాగుగా పనిచేయును. పిల్లలలోవచ్చు బాలపాపచిన్నె, తలకు దెబ్బతగులుట వలనవచ్చు మూర్ఛ మీదను పనిచేయును, బాధతోను, నిస్త్రాణతోను వున్న రోగములమీద

బాగుగా పనిచేయును. కలలను స్ఖలనములను మాన్పును.

మనస్సు:—పరధ్యానముతో నుండుట. ప్రతివాడును తనవైపు చూచుచున్నాడనుకొనుటవలన గట్టిగా మాట్లాడుటకు భయపడుట. పరుగెత్తి యితరులకు కనబడకుండగ పోవలయునని తోచుట.

తల:—తలనొప్పితో వికారము, డోకు యుండుట. కండ్లు బరువుగానుండుట. దృష్టి చెదరుటవలన వుపశమనముకొరకు కండ్లుమూసుకొనవలెనని తోచుట. ముక్కునుండి రక్తము స్రవించుట వలనను, ఋతుస్రావము వెడలుట వలనను, తలనొప్పి మానుట.

ముక్కు:—దిబ్బడవేయుట, అర్సుకొనిపోవుట; ఇందువలన శ్వాసను నోటితో పీల్చవలసి వచ్చుట.

ముఖము:—ఎర్రగా కందబారి యుండుట (బెల్లడోనా).

మలము:—కష్టముమీదను, బాధతోను, విరేచనమగుట. విరేచనబద్ధమును మాన్పును. మలము యెక్కుగా కూడినపిమ్మటగాని విరేచనానుమానము కలుగకపోవుట (బ్రియోనియా, ఎల్యూమినా). ఆసనము ముడుకొనిపోయినట్లును, బాధతోను యుండుట.

స్త్రీ అవయవములు:—అండాశయములో నరముల సంబంధమైన బాధను, ఋతుశూలను మాన్పును. ఋతుస్రావము తక్కువగాను, దినము విడిచి దినమును, అగుచును, కట్టుచును; వికారముతోను, దిగలాగుచున్నట్లుండు నొప్పితోను వచ్చుట.

శ్వాసావయవములు:—గట్టిగా నడచుటవలన వూపిరి తిరగకపోవుట. రక్తస్రావమగుట. ఛాతీలో బరువుగానుండుట. గొంతుకలో గిలిగింతలు పెట్టుచున్నట్లుండుటవలన దగ్గువచ్చుట.

కాళ్లు, చేతులు:—మోకాలిలో నొప్పివలన కాలుచాచుకొనవలెనని యుండకపోవుట. కీళ్లలో నొప్పిగాను, మోకాళ్లలో తిమ్మెరలుగాను యుండుట, చర్మము, అవయవములు చల్లగానుండుట.

వృద్ధికము:—కాలమార్పువలన, తుపానులో, కదలికవలన, సాయంకాలము 4 గంటలకు.

ఉపశమనము:—మూత్రము వెడలినపిమ్మట, పరుండినపిమ్మట.

పోలికలు:—ఆమిల్ నైట్రోసు, బెల్లడోనా, గ్లోనోయినం.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. దీనిని టించరురూపమున వాసనచూపించుటవలన గూడ రోగలక్షణము లుపశమించును.

---

## 142. మెజీరియం. MEZEREUM.

శ్లేష్మతత్వములమీదను, చర్మవ్యాధులమీదను ఇది బాగుగా పని చేయును.

మనస్సు:—ప్రతివారిని దూషించుటయందును, దెబ్బలాడుటయందును యిష్టముగా యుండుట. జ్ఞాపకశక్తి తక్కువగా యుండుట. నెమ్మదిగా గ్రహించుట. చేసిన ఆలోచనలను మరచిపోవుచుండుట.

తల:—మాటలాడుటవలన తలనొప్పివచ్చుట. కుడివైపున మత్తును కలుగజేయునట్టి తలనొప్పి. రాత్రియందు ముఖము, కండ్లు; వీటికి సంబంధించిన నరములలో బాధలు చెవులలోనికి వ్యాపించుచుండుట; వెచ్చదనమువలన యీబాధలు వుపశమించుట. తలమీద మంగ్రపు పొక్కులవంటి చర్మరోగము యెక్కువ దురదతో నుండుట.

ముక్కు:—తుమ్ములు, నీళ్లవంటి స్రావము వచ్చుచుండుట. ఒరియుట. సవాయి మరియు రసదోషములతో గూడిన ముక్కు సంబంధమైన (ఎముకలు పుచ్చుట, కంతులు బయలుదేరుట మొదలగు) రోగములమీద బాగుగాపని చేయును.

ముఖము:—పాలిపోయి, మట్టిరంగుగా యుండుట. ఓడ్డతన ముఖమును బరుకుచుండుట, ఇందువలన ముఖమంతయు రక్తముజిమ్మినట్లగుట.

ముఖము యెఱ్ఱగానుండుట, నోటిచుట్టూ దద్దురులు లేక పొక్కులు బయలుదేరుట. ముక్కునుండి నీళ్లవంటి స్రావము వెడలుచుండుట.

అన్నకోశము:—నోటిలో నీళ్లూరుచుండుట. అన్నకోశము పుండగుటవలన మంటగా నుండుట.

మలము, మలాశయము:—మలము ఆకుపచ్చగా వెడలుట, మలాశయము వెలుపలకు వచ్చుట.

మూత్రము:—వెచ్చగా రక్తముతో కలసి వెడలుట, మూత్రము వెడలినపిమ్మట కొలదిగా రక్తపుచుక్కలు పడుట.

పురుషావయవములు:—అండములు వాచుట, పెద్దవగుట. సంభోగేచ్ఛ యెక్కువగా నుండుట. రక్తసెగ.

స్త్రీ అవయవములు:—శ్వేతధాతువునుపోలి, ఒరుపునుగలుగజేయుచు వెడలునట్టికుసుమ. బహిష్టు ముందరగాను, స్రావమెక్కువగానుఅగుట.

చర్మము:—మంత్రపుపొక్కులను, మాననటువంటి దురదను, తామరను మాన్పును. పుండ్లలో దురదగాను, మంటగాను యుండుట. పొడుగుపాటి లేక పెద్దయెముకలవద్ద బాధ, వాపు గలుగుట. పొక్కులు పుండ్లుపడి వీటినుండి చిక్కని చీము వెడలు చుండుట.

ఇది ఎముకల బాధలన్నిటిలోను, జనేవరి ఫిబ్రవరి మాసములలో సర్వత్రవ్యాపించునట్టి రోగముల(Epidemics) మీదను పనిచేయును.

వృద్ధికము:—చల్లని గాలిలో, రాత్రియందు, సాయంకాలము మొదలు అర్ధరాత్రము వరకు, వెచ్చని ఆహారము వలన, కదలికవలన.

ఉపశమనము:—బహిరంగమైన గాలిలో.

విరుగుళ్లు:—కాలీఅయోడ్, మెర్క్యూరియాసు, నక్సువామికా, బ్రియోనియా, రూస్టాక్సు, కేంఫరు, కాల్కేరియాకార్బ.

మెర్క్యూరియసు,యాసిడునైట్రికు,ఫాస్ఫరసు—లకిదివిరుగుడు.

మోతాదు:—6 మొదలు 30 వరకు. దీనిగుణకాలపరిమితి 45 లగాయతు 50 దినములు.

## 143. మిల్లిఫోలియం. MILLEFOLIUM.

పలువిధములైన రక్తస్రావములమీద ఇది బాగుగా పని చేయును. స్రవించునట్టి రక్తముయొక్క ప్రకాశమానముగా యుండునపుడును, గాయములు, పుండ్లు (హెమామెలిసు, ఆర్నికా); మూత్రావయవములు, మర్మావయవములు, వూపిరితిత్తులు, జీర్ణకోశము, ఆసనము, ముక్కు—వీటినుండి గలుగురక్తస్రావములకును, బరువుల నెత్తుటవలనను, యెత్తుప్రదేశములనుండి పడుటవలనను (ఆర్నికా) గలుగు దోషములకును, శరీరమందు పుష్టము విడువకుండా యెక్కువగా నున్నప్పుడును దీనిని వాడవలయును.

తల:—నెమ్మదిగా కదులుటవలన వికారము వచ్చుట.

ముక్కు:—రక్తస్రావములను కట్టును. ముక్కుదిబ్బడ వేయుట.

మలాశయము:—ఆంత్రములనుండియు, మూలశంఖయుండి రక్తము స్రవించుచుండుట. మూత్రము రక్తముతోగూడి వెడలుట.

పురుషావయవములు:—శుక్లనష్టముకు, నూతనముగా వచ్చినట్టిగాని నిలువగాయున్నట్టికాని శెగవ్యాధిని మాన్పును.

స్త్రీ అవయవములు:—గర్భాశయమునుండియును బహిష్టుకు బహిష్టుకు మధ్యను గలుగు రక్తస్రావములను కట్టును. బహిష్టులో స్రావ మెక్కువగా నుండుట. నీరసమువలన చిన్నపిల్లలలో వచ్చు కుసుమను మాన్పును (కాల్కేరియా ఫాసు). వంధ్యత్వము, దీనితో అధికముగానుండు ఋతుస్రావము. ప్రసవానంతరము మైలవిస్తారముగా వెడలుట; ఒకప్పుడు యిది అణచిపెట్టబడుట, దీనితో యెక్కువగా జ్వరము వచ్చుట, స్తన్యము అణచిపెట్టబడుట, కంపముతోగూడిన ఫిట్సువచ్చుట, అవయవములలో విపరీతమైనబాధ బయలుదేరుట. బహిష్టు అణచిపెట్టుటతోవచ్చు మూర్ఛరోగము. ప్రసవానంతరముగాని, గర్భస్రావమైన పిమ్మటగాని, స్రావములు బాధలేకుండగ వెడలుట.

శ్వాసావయవములు:—క్షయరోగులలో గలుగు రక్తస్రావములు,

దగ్గునప్పుడు రక్తముతోగూడిన స్రావముపచ్చుట. ఋతువు అణచిపెట్ట బడుటవలన వచ్చు దగ్గును మాన్పును. గుండెదడను మాన్పును.

వృద్ధికము:—మెక్కువ పరిశ్రమవలన, సుందరకు వంగుటవలన, కాఫీవలన.

పోలికలు:—ఎకాలిఫాఇండికా, ఇపెకాక్, ఫికస్ రెలిజియోసా, జిరానియం మేక్యులేటం, హెమామెలిస్.

విరుగుళ్లు:—ఆరం మేక్యులేటం.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 144. మిరిస్టికా. MYRISTICA SEBIFERA.

ఇది చర్మరోగములమీదను, ముఖ్యముగా భగందరము, రాచవ్రణములు, గోరుచుట్టు, గాలిబిళ్ల-ఈ—వీటిమీద బాగుగా పనిచేయును. శస్త్రప్రయోగము అవసరములేకయే కురుపులు మొదలగువాటిని పక్వమునకు తీసికొనివచ్చి చీముసు త్వరగా వెలువరించగల శక్తి దీనికి గలదు. ఈవిషయములో నిది హెపార్సల్ఫ, సైలీషియా మొదలగు మందులకన్న అతి త్వరితముగా పనిచేయును.

ముఖము:—మెక్కువ యెర్రగా నుండుట.

నోరు:—నాలుక తెల్లగా బీటలుతీసి యుండుట. నోరు, గవదకాయలు వాచుటవలన ఆహారము తీసికొనుట చాల కష్టముగా నుండుట. రుచి చేదుగానుండుట.

చేతులు, కాళ్లు:—చేతులు పరిశ్రమవలన అలసిపోయి, మొద్దుబారుట లేక కొయ్యబారుట.

మోతాదు:—మదరుటించరు మొదలు 200 పొటెన్సీ.

---

## 145 మిర్టసు ఛికేన్. MYRTUS CHEKAN.

ఇది శ్వాసావయవ రోగములమీద బాగుగా పనిచేయును.

నిలవగాయున్న బ్రాంకైటీసులో గాని యితర శ్వాసావయవరోగములలో గాని వీటిలో పసుపుపచ్చగాను, వెలువరించుటకు కష్టముగాను యుండునట్టి చిక్కని శ్లేష్మము నెడలుచుండునప్పుడును ఇది పనిచేయును.

శ్లేష్మము వెలువరించుటకు శక్తిచాలనట్టి ముసలివారికిది చాల వుపయోగకారిగా నుండును.

మోతాదు:—మదరుటించరు. (మోతాదుకు 1 చుక్కచొప్పున 1 ఔన్సు నీళ్లలో కలిపి దినమునకు 3 మోతాదులను వాడవచ్చును).

---

## 146. నిగండియం. NEGUNDIUM AMERICANUM.

ఇది మూలశంఖను పనిచేయునట్టి ఒక ముఖ్యమైన ఔషధము. నూతనముగా వచ్చినట్టిగాని, నిలువగాయున్నట్టిగాని మూలశంఖను మాన్పును. ఓర్వలేనంతబాధను, ఆసనము మూలశంఖవలన వాపుగాయుండుటను, మొలలలో కుట్టుచున్నట్లు పొడుచుచున్నట్లుండు బాధలను, మంటగానుండుటను మాన్పును.

పోలికలు:—ఎస్కులసుహిప్, హెమమెలిసు, ఏలోసు, కాలిన్సోనియా, నక్సువామికా, సల్ఫరు.

మోతాదు:—మదరుటించరు. (మోతాదుకు 10 చుక్కలవంతున దినమునకు 3 మోతాదులు).

---

## 147. నక్సు మోస్కేటా. NUX MOSCHATA,

(హిందూదేశపు ఔషధము. 40. జాజికాయ)

ఇది జీర్ణావయవ మర్మావయవ రోగములమీదను, నరములకు సంబంధమైన బాధతోయుండు స్త్రీలయొక్కయు, పిల్లలయొక్కయు రోగముల

మీదను బాగుగా పనిచేయును. రోగియొక్క చర్మము వెచ్చగానుండుట, ఇట్టివారి కెప్పుడో గాని చెమటపట్టకుండుట, ముసలితనములోవచ్చు నిస్త్రాణ, ముసలివారియొక్క అజీర్ణదోషము రోగములచే బాధపడుచున్నప్పుడు నివర్తిమత్తుగా యుండుట—వీటికిది అమోఘముగా పనిచేయును.

మనస్సు:—జ్ఞాపకశక్తి యుండకపోవుట. చదువుచున్నప్పుడును వ్రాయుచున్నప్పుడును విషయములను మరచిపోవుచుండుట. ఒకనిముష మున నవ్వుచును, రెండవనిముషమున యేడ్చుచును యుండుట. త్రాగిన వానివలె యేమిచేయుటకును తోచకుండుట.

తల:—బహిరంగమైన గాలిలో నడచుటవలన వికారముగాను, బరువుగాను యుండుట. మామూలుకన్న కొలది ఆహారమును, యెక్కువగా తీసికొనుటవలన కూడ తలనొప్పివచ్చుట. తల పెద్దదైనట్లు భావన నిద్ర మత్తుతో యుండుట. బద్దలగుచున్నట్లుండు తలనొప్పి తలను గట్టిగా నొక్కుటవలన వుపశమనము జెందుట.

కన్నులు:—ఎదుటి వస్తువులు దూరముగా నున్నట్లును, పెద్దవిగాను కనుపించుట. ఒకప్పుడివి మాయమగునట్లు తోచుట. కండ్లనుండి యెక్కువగా నీళ్లుకారుచుండుట. మంటగాను బాధగాను యుండుట.

చెవులు:—దూరపుమాటలు, ధ్వనులు బాగుగా వినబడుట. ధ్వనులు వినబడుట; దిబ్బడవేయుట.

ముక్కు:—నల్లనిరక్తస్రావము. పొడిగానుండుట, దిబ్బడవేయుట.

ముఖము:—పాలిపోయినట్లుండుట. వెచ్చగాను, బుగ్గలు యెర్రగాను వుండుట.

నోరు:—ఆర్చుకుపోయి వుండుట. దాహముగా నుండకపోవుట. గర్భిణుల పండ్లనసలువును మాన్పును. దుర్వాసన వచ్చుట. నాలుకపై తెల్లనిపూత.

గొంతుక:—ఆర్చుకొనిపోవుట. గరుకుగా నుండుట. పక్షవాత ములోవలె గుటక వేయుట కష్టముగా నుండుట.

అన్నకోశము:—ఎక్కువగా వాయువు చేరుట. వుబ్బరించుట. ఎక్కిళ్ళు వచ్చుచుండుట. అజీర్ణము చేయు పిండివంటలు మొదలగువాటి యెడల కోర్కెగలిగియుండుట. భోజనానంతరము పులితేన్పులు వచ్చుట. ఆహారపానీయములను పుచ్చుకొనినపిదపలక్షణములు వుద్రేకించుట.

పొత్తికడుపు, మలాశయము:—పొత్తికడుపు పొంగరించి వేన్రులాడుచుండుట. మలము మెత్తగానున్నను తినికినపిమ్మట గూడ సరిగా వెడలకపోవుట. మలాశయము సరిగా పని చేయకుండుట. మలము వెడలుచున్నప్పుడును, విరేచనానంతరమునను రోగి తెలివితప్పి పడిపోవుట.

పురుషావయవములు:—సంభోగేచ్ఛనశించుట. సంభోగశక్తి తక్కువగా నుండుట. శృంగారసంబంధమైన ఆలోచనవలన గూడ లేపనము గలుగకపోవుట. ప్రొస్టేటుగ్రంధినుండి స్రావము వెడలుచుండుట.

స్త్రీఅవయవములు:—బహిష్టు చాలదినములవరకును; చిక్కనిముదరరంగుగానుండు స్రావము వెడలుచు నుండుట. విరేచనమగుచున్నప్పుడు మడ్డివంటి లేక రక్తమువంటి కుసుమసంబంధమైన స్రావము వెడలుచుండుట. బహిష్టు అణచిపెట్టబడుటవలన నిద్రమత్తుగాను తరుచు సొమ్మసిల్లుచును వుండుట (కాలీమూరు). ఋతువు ముందరగాను వెనుకగాను మరియు స్రావము యెక్కువగాను తక్కువగాను—యిట్లుమారుచు అగుచుండుట. గర్భస్రావసూచనలు గలుగుట. బహిష్టుకుబదులుగా కుసుమ వెడలుచుండుట. బహిష్టుకు బహిష్టుకు మధ్య రక్తస్రావములు గలుగుట. హిస్టీరియా లేక అపస్మారములో క్షణమాత్రము తెలివితప్పి పడిపోవుట. హృదయములో నొక్కుచున్నట్లుండుట, వూపిరాడకుండుట, పొత్తికడుపు వుబ్బరింపు, నోరు ఆర్చుకొనిపోవుట గలుగుట. గర్భిణులగు శరీరము కొయ్యబారుటతో వచ్చు హిస్టీరియామీద బాగుగా పని చేయును. సముద్రయానమువలని (Sea sickness) వికారము, మొదలగు లక్షణములు.

శ్వాసావయవములు:—గాలికెదురుగా నడచుటవలన గొంతుక బొంగురుతనము వచ్చుట (హెపారుసల్ఫు). పక్క వేడిమివలనవచ్చు దగ్గు.

ఊపిరందకపోవుట. హిస్టీరియాతో సంబంధించియుండు వుబ్బసము.

హృదయము, నాడి:—గుండె దడగానుండుట. నాడి విడిచివిడిచి కొట్టుకొనుచుండుట. హృదయమున నేదియో గట్టిగా పట్టుకొని నొక్కుచున్నట్లు భావనగలుగుట. భయము, విచారములోవలె హృదయములో వణకుగలుగుట.

నడుము, కాళ్లు, చేతులు:—నడుములో నొక్కుచున్నట్లు నొప్పిగాయుండుట. అవయవములలో లాగుచున్నట్లు నొప్పిగానుండుట. తేమగాలి వలన మేహవాతనొప్పులు వచ్చుట. ఈనొప్పులు వెచ్చదనము నిచ్చునట్టి పొడిగానుండు దుస్తులవలన ఉపశమించుట. కుడిచట్టలోనుండి మోకాలిలోనికి వ్యాపించునొప్పి కదలికవలనను, మెట్లెక్కుటవలనను ఉద్రేకము జెందుట. బండిలో ప్రయాణము చేయుటవలన నడుములోనొప్పి ఉద్రేకము జెందుట.

నిద్ర:—రోగమువలన మగత, నిద్రమత్తు వచ్చుట. రోగములచే బాధపడుచున్నను మత్తుగానుండుట.

జ్వరము:—వణకు యెడమచేతిలో ప్రారంభించుట. దాహము, చెమట ఉండకపోవుట. చర్మము, నోరు, గొంతుక, నాలుక, పెదవులు, ముక్కు, కండ్లు—అన్నియు ఆర్చుకొనిపోయి ఉండుట.

ఉద్రేకము:—చల్లని తేమగాలిలో, చల్లనిఆహారమువలన, చన్నీటితో కడుగుటతో, బాధగానుండుపైపున పరుండుటవలన, కదలికవలన.

ఉపశమనము:—వెచ్చదనమువలన, పొడిగాలిలో, వెచ్చనిగదిలో.

విరుగుళ్లు:—కేంఫరు, జల్సీమియం, నక్సువామికా, లారోసిరేసస్.

ఆర్సెనికం ఆల్బం, రోడోడెండ్రాను, లారోసిరేసస్—ల కిది విరుగుడు.

మోతాదు:—1 మొదలు 30 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 6 మొదలు 8 దినములు.

## 148. నక్సువామికా. NUX VOMICA.

(హిందూదేశపు ఔషధము. 41. ముషిణిగింజలు).

పల్చనిశరీరము, కోపగ్రస్త, అసూయత, చిరచిరలాడుట, నల్లని వెంట్రుకలు, పైత్యతత్వము, దెబ్బలాటయందును ద్వేషమందును యిష్టము, నరములనిస్త్రాణ, కరగారు లేక అస్థిమితము ఈలక్షణములతో నుండువారలకిది బాగుగా పనిచేయును.

పల్చని శరీరము, నరముల నిస్త్రాణ, చిరచిరలాడు స్వభావముగల జారులకు వచ్చు అజీర్ణముకు, మూలశంఖకును పనిచేయును. విస్తారముగా గాఢమైన మందులను వాడుటవలన దేహాతత్వములు చెడిపోయినవారికిని, అతిశరముగా విరేచనముల కౌషధము పుచ్చుకొనినపిమ్మట వచ్చు లక్షణములకును దీనిని వాడవచ్చును. రోగి అతిమరుకుగా నుండుట, ఎక్కువమానసిక పరిశ్రమ చేయుట, ఒకప్పుడు పరిశ్రమలేకయే యుండుట, అధికము గాచదువుట, వ్యాపారమువలని కష్టసుఖములకు లోనై వుండుట: తరుచు శరీరపరిశ్రమ తక్కువగా నుండుటవలన కాఫీ మొదలగు వుద్రేకమునిచ్చు పదార్థములు అవసరముగాతోచుట, ఇట్లు క్రమముగా నల్లమందు, తాగుడు, వ్యభిచారము మొదలగువాటిలోనికి దిగుటవలన తత్వము చెడిపోయి; అజీర్ణము, మలబద్ధము, నరములసంబంధమైన పక్షవాతము, మరియు అపస్మారము, కంపముతోగూడిన వ్యాధులు బయలుదేరుట, కోపముచెందుట, కాఫీని, ఆల్కహోలును తాగుట; వ్యభిచారము, హస్తప్రయోగము, అధిక సంభోగము, గాయములు—యీలక్షణములు ఈయౌషధముయొక్క వుపయోగమును సూచించును.

దీనిని రాత్రియందు వాడుటవలన యెక్కువగుణముగలుగును. ఇట్లే సత్ఫురును వుదయమున వాడుటవలన యెక్కువగుణము గలుగును.

మనస్సు:—అతికోపముతో నుండుట. తప్పులుపట్టుచును, తిట్టుచును యుండుట. ధ్వనులను వాసనలను, కాంతిని సహింపలేకపోవుట.

ఆలోచనశక్తి వుండకపోవుటచే విద్యావ్యాపకము చేయలేకపోవుట. త్రాగుడువలని రోగలక్షణములు. గొణుగుకొనుటతోగూడిన సంధి.

తల:—తలతిర్పువలన తెలివితప్పుట. ఉదయమునను, మానసికపరిశ్రమవలనను; పుగాకు, ఆల్కహాలు, కాఫీ—వీటివలనను, బహిరంగమైన గాలిలోను, మత్తుగానున్నట్లు తోచుట. సూర్యరశ్మి తగులుటవలన తలనొప్పివచ్చుట (గ్లొనోయినం, నేట్రంకార్బ్). నొప్పివచ్చుటవలన గోడనుగాని మరియేవస్తువునుగాని వుపశమనముకొరకు నుదుటితో నొక్కుట. భోజనానంతరము వికారము, పుల్లని వమనము, తల బద్దలగునట్లుండు భావనతో తలనొప్పి వచ్చుట. తలకు సంబంధించిన లక్షణములు మానసిక పరిశ్రమవలనను, బహిరంగమైన గాలిలో వ్యాయామము చేయుటవలనను, భోజనానంతరమునను, వైనును కాఫీని త్రాగుటవలనను వుద్రేకము జెందుట, మరియు నివి వెచ్చనిగదిలోను స్థిమితముగా కూర్చుండుటవలనను లేక పరుండుటవలనను వుపశమించుట.

కండ్లు:—వెలుతురును చూడలేకపోవుట, రక్తము స్రవించుట. కండ్లయెదుట చుక్కలు, మెరుపుతీగలు కనబడుట. వుప్పుజల్లినట్లువలె కండ్లు మండుట లేక చిమచిమలాడుట. విషపదార్థముల నుపయోగించుట వలన దృష్టినాడి సన్నగిలుట లేక ఎండిపోవుట. కండ్లువాచుట, యెర్రబడుట, బాధగానుండుట.

చెవులు:—అర్చుకొనిపోయి మూసినట్లుగా నుండుట. దురదగాను హోరుగాను యుండుట.

ముక్కు:—రొంపయొక్క ప్రథమావస్థలో బాగుగాపనిచేయును. పగలు నీటివంటి స్రావము వెడలుచుండుట. రాత్రి ముక్కు దిబ్బడ వేయుట. రాత్రియందును, వుదయమునను భోజనానంతరమునను అర్చుకొనిపోయినట్లుండుట. ముక్కులోను, గొంతుకలోను గోకుచున్నట్లును, పురుగులు ప్రాకుచున్నట్లును వుండుట. ఉదయమున లేచుసరికి తుమ్ములు వచ్చుచుండుట.

ముఖము:—దౌడలు ముడుచుకొనిపోవుట లేక డగ్గబడుట. ఒక బుగ్గ యెఱ్ఱగాను, రెండవది పాలిపోయియుండుట. బ్రాంది మొదలగు వాటిని యెక్కువగా వుపయోగించువారి ముఖముమీద బయలుదేరు పొక్కులు, మొటిమలు. నరములసంబంధమైన బాధలు, అప్పుడప్పుడు వచ్చుచుండుట. నోరు, కండ్లు, ముక్కు; వీటిచుట్టూ పసుపుపచ్చగానుండుట.

నోరు:—నాలుక నల్లగాను, బీటలుతీసియు యుండుట. చల్లదనము వలన వచ్చు పంటిసలుపు; ఇది వెచ్చదనమువలన వుపశమించుట. ఇగుళ్లు వాచి తెల్లగాను, రక్తస్రావముతోను యుండుట. ఉదయమున తీసికొనిన ఆహారము, పానీయములు, సరియైన రుచిగానున్నను నోటియందుమాత్రము రుచిపాడగుట.రక్తముతోగూడినలాలాజలము. దుర్వాసనగానుండుపుండ్లు.

గొంతుక:—గరుకుగా నుండుట. కొండనాలుక వాచుట. కుట్టుచున్నట్లు బాధగానుండుట. గుటకవేయునపుడు బాధలు చెవిలోనికి వ్యాపించుట. దుర్వాసనతో నుండు చిన్నచిన్న పుండ్లు బయలుదేరుట.

అన్నకోశము:—వుదయమునను, భోజనానంతరమునను వికారముగాను, రుచి పుల్లగాను వుండుట. కడుపులో బరువుగాను, బాధగాను వుండుట. క్రొవ్వు పదార్థములను తినుటయందు యెక్కువ యిష్టముగా యుండుట(పల్సటిల్లాలో క్రొవ్వుపదార్థములయందు అయిష్టతయుండును). ఆహారమునందయిష్టతతో గూడిన ఆకలి. భోజనానంతరము కొంతసేపటివరకు కడుపులో రాయిపెట్టినట్లు బరువుగా యుండుట. తీసికొనిన పానీయములను, పైత్యరసమును వమనము చేసుకొనుట. నడుముచుట్టూ బట్ట బిగువుగా నుండుటను భరింపలేకపోవుట. వేవిళ్లను మాన్పును. యెక్కువగా భోజనము చేయుటవలనను, అజీర్ణపదార్థములను భుజించుటవలనను, ఔషధములను విశేషముగాను అతితరచుగాను వాడుటవలనను, శారీర పరిశ్రమ లేకపోవుటవలనను, జారత్వమువలనను, అన్నకోశము పాడగుటను మాన్పును. వుబ్బరింపుగాను శూలగాను వుండుట.

పొత్తికడుపు:—కాలేయము వాచుట. దీనిలో పోట్లు పొడుచు

చున్నట్లుండుట. పసిపిల్లలకు బొడ్డువద్ద బయలుదేరు గిలకను మాన్పును. కామెర్ల రోగము, కాలేయ సంబంధమైన రాళ్ళు బయలుదేరుట. శూల, వుబ్బరము, వెచ్చనగుట, కోయుచున్నట్లు నములుచున్నట్లు బాధ—వీటిని మాన్పును. వృషణములలో బంధింపబడిన (Strangulated Hernia) గిలక (ఓపియం).

మలము, మలాశయము:—తరచుగా విరేచనానుమానము గలుగుచుండుట. విరేచనము తృప్తికరముగా వెడలకపోవుట. మలము కొద్దిగా వెడలి తక్కినది మిగిలిపోయినట్లు తోచుట. విరేచనానంతరమునను, భోజనానంతరమునను, మానసిక పరిశ్రమవలనను, ఆసనమునందు నొక్కుచున్నట్లు మూలశంఖ సంబంధమైన బాధవచ్చుట. మానని విరేచనబద్ధము. ఒకప్పుడు నీళ్లవిరేచనములు. విరేచనముతో నిగనిగలాడుచుండు యెర్రని రక్తము వెడలుట. ఆసనము ముడుచుకొనిపోయినట్లుండుట. జిగట విరేచనములు; వీటిలో విరేచనానంతరము కొలది వుపశమనము కలుగుట. ఆసనములో బాధ. తారువలె నల్లగా వెడలు విరేచనములతో రక్తజీరవుండుట. కామెర్ల రోగముతో నుండు నీళ్లవిరేచనములు. బాధగాను, దురదగానువుండు మూలశంఖ. విరేచనానుమానమే గలుగనటువంటి రోగులకిది పనిచేయదు.

మూత్రావయవములు:—మూత్రకోశవాళమునందును, మూత్రవాళమందును మంటతోను, చీల్చుచున్నట్లుండు బాధతోను, చుక్కలుచుక్కలుగాను, మూత్రము వెడలుట. మూత్రములో రక్తముకలసిపోవుచుండుట. మూత్రావయవములో శూల. మూత్రము తెల్లగాను, లేక పాలిపోయిన వర్ణముగాను, చీముతోను, యెర్రగాను, ఇటుకపొడివంటి లేక పసుపుపచ్చని మడ్డితోను, వుదయముననను, ఆలోచనలు చేయుచున్నప్పుడును వెడలుచుండుట.

పురుషావయవములు:—సంభోగవాంఛ సులభముగా గలుగుట. అజీర్ణము నిచ్చునట్టియు, మత్తునిచ్చునట్టియు, పదార్థములను తినుటవలనవచ్చు స్ఖలనములు. అధిక సంభోగమువలన గలుగు దుష్టలక్షణములు. అందము

లలో ముడుచుకొని పోవుచున్నట్లు బాధ, యెర్రనివాపు, స్వప్నస్ఖలనములు, నడుమునొప్పి, వెన్నెముకలో మంట, నిస్త్రాణ, చిరచిరయుండుట. ముష్టిమైధునమువలని దోషములు. నపుంసకత్వము. బుడ్డ.

స్త్రీ అవయవములు:—బహిష్టు అతిత్వరగాను, చాలదినములవరకును అగుట. బహిష్టు సరిగా అవకపోవుట, ఋతురక్తము నల్లగా వెడలుచుండుట. రోగి సొమ్మసిల్లుచుండుట. గర్భాశయము వెలుపలకు వచ్చుట. తరుచు విరేచనానుమానముతోను, త్రికాస్థిలో బాధతోను వుండు ఋతుశూల. ప్రసవవేదనలో బాధలు కొలదిగావచ్చుచు, ఆసనములోనికి వ్యాపించుచు యుండుట. గర్భాశయము వెలుపలకువచ్చుట. సంభోగేచ్ఛ యెక్కువగా నుండుట. బహిష్టుకు బహిష్టుకు మధ్య స్రావము వెడలుచున్నప్పుడు విరేచనానుమానము ఎక్కువగా గలుగుచుండుట.

శ్వాసావయవములు:—ఉదయమునగాని, భోజనానంతరమునగాని, కడుపు నిండుగా నుండుటతో వచ్చునట్టి వుబ్బసపుదగ్గు. ఛాతీలో చీల్చుచున్నట్లు బాధతోనుండు దగ్గు. వూపిరందకపోవుట. ఒకప్పుడు శ్లేష్మముతో రక్తము వెడలుట. అర్ధరాత్రినుండి వుదయమునువరకును, రాత్రి పరుండిన పిమ్మటను, తెల్లవారగట్లను విడువకుండా వచ్చునట్టి పొడిదగ్గు. గొంతుక బొంగురుపోవుట. వూపిరందకపోవుట.

హృదయము:—భోజనానంతరమునను, పరుండినపిమ్మటను, కాఫీ త్రాగినపిమ్మటను, విడువకుండా చదువుటవలనను గుండెదడ వచ్చుట. తలపైపుకు బాధగానుండునట్టి అదురు, గుండెదడతో వికారము, నరముల సంబంధమైన బాధలు గలుగుట.

నడుము, కాళ్లు, చేతులు:—నడుము నొప్పిగా నుండుట. వెన్నెముకలో తెల్లవారగట్ల మంటగా నుండుట. కూర్చుండుట కష్టముగా నుండుట. కాళ్లు మొద్దుబారుట, పక్షవాతము వచ్చినట్లుండుట. పిక్కలలోను, అరికాళ్లలోను, తిమ్మెరలువచ్చుట. అధికపరిశ్రమవలనగాని, నీళ్లలో నానుటవలనగాని పక్షవాతలక్షణములు గలుగుట, నడుచుచున్నప్పుడు

మోకాలులలో కరుక్కుమనుట.

చర్మము:— శరీరమంతయు, ముఖ్యముగా ముఖము మండు చున్నట్లు వెచ్చగానుండుట. పైత్యమువలన పసుపుపచ్చగా నుండుట. దురదతోను, మంటతోను వుండు యెర్రని మొటిమలు, పొక్కులు.

నిద్ర:— తెల్లవారగట్ల 3 గంటలు మొదలు నిద్రపట్టకుండుట. భోజనానంతరమునను, సాయంకాలమందును నిద్రమత్తుగా యుండుట. కొలది సేపు నిద్రించినపిమ్మట రోగము వుపశమనము జెందుట.

జ్వరము:—శరీరముపై కప్పుకొనిన బట్టను తీసివేసినయెడల చలి వచ్చినను, కప్పుకొనుటనుమాత్రము యిష్టపడకుండుట. శరీరము వెచ్చగా నుండుట. చలిగానుండుటవలన జ్వరముయొక్క అన్నిదశలలోను, కప్పుకొనవలసివచ్చుట. ఉష్ణోపచారములవలన చలితగ్గకపోవుట. కదలికవలనను, పానీయములను త్రాగుటవలనను; చలి, వణకు వుద్రేకము జెందుట. అజీర్ణముతోయుండు మన్యపుజ్వరము. అర్ధరాత్రమునకు పిమ్మట చమటపట్టుట.

ఇది విరేచనబద్ధమును మాన్పును. దీనిని రాత్రి పరుండబోవునపుడు వాడుచుండినయెడల విరేచనబద్ధమే గాక సాధారణముగా వచ్చు అజీర్ణము, పైత్యము, వికారము, వమనములు, నిస్త్రాణ, నిద్రలేమి, మొదలగు అనేకరోగములు మానును.

ఉద్రేకము:—మానసికపరిశ్రమవలన, వుదయమున, భోజనానంతరమున, నిషాపదార్థములవలన, వుద్రేకమునిచ్చు పదార్థములవలన, వెచ్చని గాలిలో, తాకుడువలన, చల్లదనమువలన.

ఉపశమనము:—కొలదిసేద్రకు పిమ్మట, సాయంకాలమున, విశ్రాంతివలన, తేమగాలివలన, గట్టిగా కొక్కుటవలన.

సహచరులు:—సల్ఫరు, సేపియా, డ్రొసీరా.

దీనికి ముందుగాని వెనుకగాని జింకంమెట్ ను వాడరాదు.

విరుగుళ్లు:—కేంఫరు, కాఫీ, ఆర్సెనికం అల్బమ్, క్యాకులస్, పల్స

టిల్లా, కేమోమిల్లా, ఇగ్నీషియా, బెల్లడోనా, ఎకోనైటు, వైను.

ఆల్కహాలు సంబంధమైన పానీయములకును, నిషా కేక మత్తుపదార్థములకు, విరేచనసాధనౌషధములకు, కాఫీకి, గాఢమైన ఔషధములకును —ఇది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 1000 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 10 మొదలు 12 దినములు.

---

## 149. నింఫియా. NYMPHEA ODORATA.

స్త్రీ మర్మావయవ రోగములమీద నిది బాగుగా పనిచేయును. స్త్రీలలో యెక్కువ సంభోగేచ్ఛ గలుగుట, గర్భాశయమునందు పుట్టువ్రణము బయలుదేరుట, గర్భాశయము వెలుపలకు వచ్చుట, వాచుట, బాధగా నుండుట—ఈలక్షణములమీద నిది బాగుగా పనిచేయును. రోగి బహు నిస్త్రాణగాను, పరిశ్రమ చేయలేనట్టి స్థితిలోను యుండుటను మాన్పును.

ముక్కు:—ఎడతెగని నీళ్లవంటి స్రావము.

మలము, మలాశయము:—వుదయమున 7 గంటలకు ఒకసారియు, 11 గంటలకు ఒకసారియు విరేచనములగుట. మధ్యాహ్నము 1—30 నిమిషములకు కొద్దిబాధతో పల్చని విరేచనమగుట. అంత్రములలో బాధతోను, దుర్వాసనతోను, అపానవాయువు వెడలుట. నీళ్లవిరేచనములు.

మూత్రము:—యెక్కువగా, ఒకప్పుడప్రయత్నముగా, వెడలుట.

స్త్రీ అవయవములు:—ఒరుపునుగలుగజేయునట్టి కుసుమ. దీనికి లోపలికిని, పైకిని (పిచకారీగాను) వాడవచ్చును. ఆమత్వచల దోషమును మాన్పును. మర్మావయవద్వారము వాచుట, బాధగానుండుట. పైలక్షణము లకు దీనిని బాహ్యోపయోగము చేయుటకూడ శ్రేష్ఠము.

పదును:—కొబ్బిగాను, నీరసముగాను యుండుట.

నిద్ర—శృంగార సంబంధమైన కలలు వచ్చుట.

మోతాదు:—మదరు టించరు. (మోతాదుకు 1 చుక్క).

---

## 150. ఒయినాంతి క్రోకేటా. OENANTHE CROCATA.

మూర్ఛ లేక అపస్మారము లేక హిస్టీరియా మొదలగు ఫిట్సు లేక కంపముతో గూడిన నరములసంబంధమైన రోగములమీద నిది బాగుగా పనిచేయును. ఇట్టిరోగములు తలకు దెబ్బతగులుటవలనగాని బహిష్టును అణచిపెట్టుటవలనగాని మరియెట్టి యితర కారణములవలన గలిగినను; నూతనముగా వచ్చినను, లేక చాలకాలమువరకు నిలవగా యున్నను ఇది పని చేయును. ఇదిసుఖ్హపువాతముమీద కూడ పనిచేయును.

తల:—అకస్మాత్తుగా స్మృతి తప్పుట, విపరీతమైనపరాకుమాటలు, మగత వచ్చుట. ముఖముమీది కండరములు కంపించుట. పాపలు పెద్దవగుట. దౌడలు దగ్గర బడుట. నోటినుండి నురగలువచ్చుట. వెంట్రుకలూడి పోవుట. వికారముగా నుండుట. రుద్రివాతలక్షణములు. ముఖముమీద యెర్రని మచ్చలు బయలుదేరుట.

స్త్రీ అవయవములు:—ప్రసవానంతరమున వచ్చుకంపముతో గూడిన రోగలక్షణములు. అపస్మార చిహ్నములు బహిష్టులోను, గర్భిణిలోను వృద్ధికము జెందుట.

శ్వాసావయవములు:—నురగవంటి స్రావముతో వచ్చు దగ్గు. శ్వాస సరిగా నుండకపోవుట. శ్వాస గురుగురుపెట్టుచు వచ్చుచుండుట.

చర్మము:—ముఖముమీదను, ఛాతీమీదను, పొత్తికడుపుమీదను ఘోరని మచ్చలు, దద్దురులు బయలుదేరుట.

కాళ్లు, చేతులు:—కంపించుట, చల్లగా నుండుట, మొద్దుబారుట.

వృద్ధికము:—నీటివలన.

మోతాదు:—మదరు టించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 151 ఓపియం. OPIUM.

(హిందూదేశపు ఔషధము 42. నల్లమందు).

పళ్ళని తలనెంట్రుకలు, వేర్లాడుచుండునట్టి కండరములు, ముడతలు పడినట్టి చర్మము, మగత వీటితోనుండుముసలివారికిని, పిల్లలకునువచ్చు రోగములమీద నిది బాగుగా పనిచేయును. రోగిస్మృతితప్పి మగతగానులేక నిద్రమత్తుగాను యుండుట, ఏయౌషధమును వాడినను సాధారణముగా పనిచేయకపోవుట, బాధయేమియు పడుచున్నట్లు కనపడకపోవుట, గుర్రు పట్టుచున్నట్లు ధ్వనితో వూపిరి పీల్చుచుండుట. చెమటలు పట్టుచుండుట, లక్షణములు వెచ్చదనమువలన తిరిగి కనుపించుచుండుట లేక యెక్కువగుచుండుట, భయమువలన వచ్చు రోగములు—వీటిమీదనిది బాగుగా పని చేయును.

మనస్సు:—రుద్రవాతములోవలె స్మృతితప్పియుండుట. భయము జెందినవానివలెను, వెర్రివానివలెను, కనపడుట. చనిపోవుదునను భయముతోనుండుట. పరాకుమాట లాడుచుండుట.

తల:—బరువుగాను, మందముగాను వికారముగాను వుండుట.

కండ్లు:—పాపలు చిన్నవగుట. కనుగ్రుడ్లు గాజువాటివలెను, కదలకుండగను, ముందరకు చొచ్చుకువచ్చినట్లును వుండుట. కండ్లు యెర్రగా, మంటగా, వెచ్చగా, అర్చుకుపోయి, సగముమాత్రమే మూయబడియుండుట.

చెవులు:—గడియారపు గంటలును, కోడికూతయు, దూరమునుండి వినబడుచుండుటచే నిద్రపట్టకపోవుట,

ముఖము:—పొంగరించి, యెర్రగాను, వాపుగాను, వెచ్చగాను, పాలిపోయి ఒకొక్కప్పుడు మట్టిరంగుగాను, కండ్లు లోతునబడినట్లును అగు పడుట.

నోరు:—పొడిగానుండుట. లాలాజలముతక్కువగానుండుట. రక్తమును పుమియుచుండుట. నాలుక పూదారంగుగాను, నల్లగాను, ఒకప్పుడు తెల్లగాను, పసుపుపచ్చని పూతతోను యుండుట.

అన్నకోశము, పొత్తికడుపు:—ఆకలి యుండకపోవుట. వమనము లగుట; ఇవి మొదట తినినఆహారముతో కలసియు, తరువాత మలమువలె వాసన వేయునట్టి పదార్థముతో కలసియు వెడలుట. ఎక్కువ దాహముగా నుండుట. బొడ్డువద్దను, గజ్జలలోను, బయలుదేరు గిలక; దీనివలన మలము వెడలుట బంధింపబడుట, దీని సంబంధమైనవమనమగుట. పొత్తికడుపులో కోయుచున్నట్లుండుట. జీర్ణావయవములు తమపనిని సరిగా నెరవేర్చక పోవుట.

మలము, మలాశయము:—శూలగా నున్నప్పుడు ఆసనము ముడుచుకొని పోవుచుండుటవలన అపానవాయువు కష్టముమీద వెడలుచుండుట. మగతతోను, నల్లగాను దుర్వాసనతోనుండు నీళ్లవిరేచనములు అప్రియత్నముగాను, మంటతోను వెడలుట. గురుపెట్టుచున్నట్లుండు ధ్వనితో వచ్చు కంపముతో గూడిన పిల్లల కలరావ్యాధిలో బాగుగా పనిచేయును. మలముగట్టిగాను, నల్లగాను, వుండలవలెను, బహుకష్టమునిూదను వెడలుట. కలరా వ్యాధిలోను, సన్నిపాత లక్షణములలోను, కేంఫరును విస్తారముగా వాడినపిమ్మటను యిదిపనిచేయును. ముసలివారవిరేచనబద్ధమునుమాన్పును.

మూత్రావయవములు:—భయము వలన మూత్రము అప్రియత్నముగా వెడలుట లేక అణచిపెట్టబడుట. మూత్రము కొలదిగాను, యెర్రగాను; ముదిరిన గోధుమ వర్ణముగాను యుండుట.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ తగ్గుట. నపుంసకత్వము. ఒకప్పుడు సంభోగేచ్ఛ యెక్కువగుట, తరుచు లేపనము గలుగుట. స్ఖలన

మగుట.

స్త్రీ అవయవములు:—ప్రసవములో నొప్పులు అకస్మాత్తుగా ఆగి పోవుట, శరీరము కంపించుట, మగత జెందుట. గర్భస్రావసూచనలు గలుగుట. భయమువలన మైల అణచి పెట్టబడుట. భయమువలన బహిష్టు అణచి పెట్టబడుట.

శ్వాసావయవములు:—నోరు తెరచి గురుపెట్టుచు, వూపిరి పీల్చుచుండుట. వూపిరితిత్తులకు పక్షవాతము వచ్చినట్లు విడిచివిడిచి వూపిరి తీయుచుండుట. దగ్గువలన శరీరమంతయు. చెమటలు పట్టుట.

కాళ్లు, చేతులు:—అప్పుడప్పుడు అవయవములు మొద్దుబారుట, కంపము జెందుట. బాధలేనట్టి పక్షవాతము. అవయవములు చల్లబడుట.

జ్వరము:—కప్పుకొనిన బట్టను తోసివేయ గోరుట. పరుపు యెక్కువ వెచ్చగానున్నట్లుతోచుట. నుదిటిమీదను, తలమీదను చల్లని చెమట పట్టుచుండుట. సన్నిపాత లక్షణములు. చెమటతో మునిగియున్నను శరీరమంతయు యెక్కువమంటగా నుండుట. ముఖము యెర్రగాను, మగతతోను, గురుపెట్టుచును యుండుట.

వుద్రేకము:—నిద్రలోను తరువాతను; చెమటవలన, గర్భిణీలో.

వుపశమనము:—విడవకుండా నడచుటవలన, బహిరంగమైన గాలిలో, వమనానంతరము.

విరుగుళ్లు:—బెల్లడోనా, ఇపెకాక్, నక్సువామికా, ప్యాసిఫ్లోరా యిన్కార్నేటా, కాఫీ, కేంఫర్.

నల్లమందు అలవాటును మాన్పుటకు అవీనాసతీవానుగాని బెర్బెరిసు వల్గారిసునుగాని వాడవచ్చును.

పోతాదు:—6 మొదలు 1000 పొటెన్సీ.

## 152. ఒరిగానం. ORIGANUM.

(హిందూదేశపు ఔషధము. 43. మరువము.)

స్త్రీపురుషుల మర్మావయవములకు అపుకోనజాలనంత వుద్రేకము కలుగుటవలన వచ్చు లక్షణములమీద నిది బాగుగా పనిచేయును. ఆపుకోనజాలని సంభోగేచ్ఛను, హస్తప్రయోగాది దురభ్యాసములనుమాన్పును:

మనస్సు:—ఒకప్పుడు విచారముగాను, వెంటనేసంతోషకరముగాను వుండుట. పెండ్లిసంబంధమైనకోర్కెలు స్త్రీలలో గలుగుట. శృంగార సంబంధమైన ఆలోచనలును, సంభోగసంబంధమైన వుద్రేకమునుగలుగుట.

పురుషావయవములు:— రాత్రియందు స్ఖలనములగుచుండుట.

స్త్రీ అవయవములు:—ఎక్కువ సంభోగేచ్ఛ గలుగుట. ఒకప్పుడు కోర్కె తీరకపోవుటవలన ఆత్మహత్య చేసుకొనవలెనని యుక్తవయస్కురాండ్రలో గలుగుట, లేక హస్తప్రయోగాది దురభ్యాసములకు లోనగుట. సాధారణముగా ప్రతిసినునందును హస్తప్రయోగమును మానకుండుట; మరియు యిష్టమైన పురుషుని చూచినయెడల యీదురభ్యాసము తప్పకపోవుట. ఈదురభ్యాసమువలన మనస్సు పిచ్చియెత్తినట్లు లేక మొద్దుబారినట్లు అగుట. కుసుమ, వంధ్యత్వము, హిస్టీరియా లేక అపస్మారము. శరీర వ్యాయామము చేయు బుద్ధిగలిగి పరుగెత్త నారంభించుట.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. టించరురూపమున గూడ మోతాదుకు $\frac{1}{2}$ లేక 1 చుక్కను దినమునకు మోతాదుచొప్పున వాడినపుడు బాగుగా పనిచేసినది.

---

## 153. ఆక్సీడెండ్రాన్. OXYDENDRON.

జలోదరమును, వుబ్బును మాన్పును. మూత్రము బంధింపబడుట, మూత్రముతో చిన్నచిన్న రాళ్లు వెడలుచుండుట, మూత్రకోశద్వారమువద్ద

చిరచిరగానుండుట, శరీరము పుబ్బుటవలన వూపిరిపీల్చుట కష్టముగా నుండుట, స్త్రీరోగులలో బహిష్టు అణచిపెట్టబడుట, కూర్చున్నప్పుడు గాని పరున్నప్పుడుగాని వూపిరిపీల్చుట కష్టముగానుండుట—యీలక్షణములమీద నిది బాగుగా పనిచేయును. ఒక కేసులో "ఎపోసైనం" యొక్క పని చాలనపుడు యిది బాగుగా పనిచేసినది.

మోతాదు:—మదరుటించరు. మోతాదు 1 కి 5 లగాయతు 10 చుక్కలు.

---

## 154. ఓల్డెన్ లేండియా. OLDENLANDIA.

(హిందూదేశపు ఔషధము. 45. పర్పాటకము. బంగాళీలో దీనిని ఖేట్ పాపార్రి అందురు.)

ఇది పైత్యదోషములమీదను జ్వరలక్షణములమీదను పనిచేయును.

అన్నకోశము, మలాశయము:—పైత్యవమనము. పైత్యదోషముతో గూడిన విరేచనములు.

జ్వరము:—తలనొప్పి, దాహము, చలి, శరీరమంతయును మంటలతో గూడిన జ్వరము. జ్వరము రోజువిడిచి రోజు ఉద్రేకముజెందుట. జ్వరము సాధారణముగా ఉదయముననే వచ్చుచుండుట.

మోతాదు:—1 మొదలు 30 పొటెన్సీ.

---

## 155. పాసిఫ్లోరా. PASSIFLORA INCARNATA.

నిద్రలేమి, నరముల సంబంధమైన బాధలు, దౌడలుదగ్గరబడుట, కంపములు, పరాకుమాటలు, కొరియాజబ్బు, మరియు అస్థిమితముతో గూడిన రోగలక్షణములు—ఇట్టివాటిమీదనిది బాగుగాపనిచేయును. మానసిక పరిశ్రమవలనగాని, తలనొప్పితోను తలనొప్పి లేకుండగనుగాని వచ్చు

నట్టి నిద్రలేమికిని; జ్వరము, న్యుమోనియా, ప్లూరసీ మొదలగు వాపు, బాధ, వెచ్చదనముతో గూడిన రోగములలోను, పార్శ్వపునొప్పులవలనను, తాగుడువలనను, దెబ్బలు తగులుట వలనగాని యితరబాధల వలవగాని నిద్రపట్టకపోవునపుడును యిది బాగుగా వుపయోగపడును. విడిచివిడిచి వచ్చు దగ్గులమీదను నొక్కుచున్నట్లుండు బాధలమీదను, ఇది బాగుగా పనిచేయును. భ్రమతోగూడిన రోగలక్షణములను, నిస్త్రాణ జెందియుండు టను మాన్పును. అపస్మార వ్యాధిలో దీనిని ఒయినాంతి క్రోకేటాయను మందుతో మార్చుచు వాడవలయును.

స్త్రీఅవయవములు:—హిస్టీరియా లేక అపస్మారము మీదను ప్రస వానంతర కంపముల మీదను ఋతుశూలమీదను బాగుగా పనిచేయును.

శ్వాసావయవములు:—కోరింతదగ్గును మాన్పును. వుబ్బసముయొక్క వుదృతమును తగ్గించును.

నరముల లక్షణములు:—నల్లమందు అలవాటువలని నరముల దోష ములను మాన్పును. పిల్లలలో కంపములతోవచ్చు బాలపాపచిన్నెయనబడు రోగమును, పార్శ్వపు నొప్పులను మాన్పును. పిల్లలకు పండ్లువచ్చు కాల ములోగలుగు నరముల సంబంధమైన దోషములు—జ్వరము, కంపములు, మరియు క్రిమి సంబంధమైన జ్వర లక్షణములమీదను పనిచేయును.

నిద్ర:—నిస్త్రాణవలన అస్థిమితముగాను, మెలకువగాను యుండుట. మానసిక రోగములతో బాధపడు వారికిని, అధిక పరిశ్రమగల వారికిని, చిన్నపిల్లలకును, ముసలివారికిని గలుగు నిద్రలేమిని మాన్పును. రాత్రి యందు వచ్చుదగ్గును వుపశమింప జేయును.

మోతాదు:—మదరుటించరు. పెద్దవారికి మోతాదు 1కి 20 చుక్క లు లగాయితు 60 చుక్కల వరకు దినమునకు 3, 4 మోతాదులను యివ్వ వచ్చును.

## 156. ఫేజియోలస్. PHASEOLUS NANA.

ఇది హృదయ రోగములకును, మధుమూత్రముకును వాడవచ్చును. హృదయములోని నీరసమును, దడను, నీరుపట్టుటను, నాడివక్రముగా కొట్టుకొనుటను మాన్పును. హృదయములో పోటును, హృదయము విడిచి విడిచి కొట్టుకొనుటను మాన్పును.

మనస్సు, తల:—హృదయము సరిగా కొట్టుకొనక పోవుటవలన భయము జెందుట. మెదడు నిండుగానుండుటతోవచ్చు నుదుటినొప్పి, యిది కదలికవలనను, పరిశ్రమవలనను వుద్రేకము జెందునపుడు పనిచేయును.

ఛాతీ:—శ్వాస నెమ్మదిగాను యీడ్పులతోను, యుండుట. ఛాతీకి నీరుపట్టుట. గుండెలలో దడగా నుండుట. హృదయ సమీపమున బాధగా నుండుట.

మూత్రావయవములు:—మూత్రములో రక్తము, చిన్న చిన్న రాళ్లు, ఇసుక పొడివంటి పదార్థము వెడలుచుండుట.

హృదయము:—మణికట్టువద్ద నాడి వడిగాను, సన్నముగాను వుండుట. హృదయరోగముయొక్క ఆఖరు అవస్థలోను, నాడియొక్క క్షీణ దశలోను వాడవచ్చును. మరణము సమీపించునట్లు భయముతోచునంతటి గుండెదడ.

పోల్చదగినవి:—క్రెటేగను, లెకెసిస్, కేక్టసు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 157. ఫైటోలక్కా. PHYTOLACCA.

ఇది మేహవాత తత్వములమీదను, సవాయి వ్యాధిమీదను, రస దోషములకును బాగుగా పనిచేయును. రోగి శరీరములోని క్రొవ్వుకరిగి పోయి, రక్తక్షీణతగలిగి, దేహము శుష్కించి పోవుటను శరీరముులోనొప్పి

గాను, పోట్లుగాను, అస్థినితముగాను. నిస్త్రాణగాను వుండుటను మాంస గ్రంధుల వాపు, బాధ, వెచ్చదనమును, ఎముకలలో సవాయిసంబంధమైన నొప్పులను, గవదకాయల వాపులను మాన్పును.

మనస్సు:—జీవితమునందసహ్యత జెందుట. చనిపోవుదునని నిశ్చయము చేసికొని కంగారుతో నుండుట. సిగ్గును విడిచి వేయుట.

తల:—లేచుటతోనే వికారము వచ్చుట. వికారముతో దృష్టిమందముగా నుండుట. పార్శ్వపు నొప్పులు. వర్షము కురియుచున్నప్పుడు మేహవాత సంబంధమైన నొప్పివచ్చుట.

కండ్లు:—మంటగా నుండుట. కనురెప్పలలో ఇసుక పోసినట్లు బాధగా నుండుట: వెచ్చని కన్నీళ్లు వెడలు చుండుట.

చెవులు:— ధ్వని వినబడకుండగ యేదియో అడ్డు పడినట్లుండుట. గుటక వేయునప్పుడు పొడుచుచున్నట్లు నొప్పిగా యుండుట.

ముక్కు:—ఒకవైపునుండి స్రావము వచ్చుట. రెండవవైపుదిబ్బడ వేసినట్లుండుట. ఒరుపును కలుగజేయునట్టి స్రావము వెడలుచుండుట.

ముఖము:—నీలి రంగుగాను, బాధపడుచున్నట్లును లేక పసుపు పచ్చగాను లేక పాలిపోయినట్లును, చావు ముఖమువలెనుకనబడుట. గుల్లఫువాతము వచ్చుట.

నోరు:—పిల్లలకు పండ్లు సకాలములోను, సులభముగాను రాకుండుట; వీరికి పండ్లు కొరకవలెనని యుండుట. నాలుక చివర నిప్పువలె యెర్రగానుండుట. లాలాజల మెక్కువగా వెడలుట. నోరార్చుకుపోవుట.

గొంతుక:—కుడివైపు యెక్కువనొప్పిగాయుండుట. గవదకాయలువాచి, పెద్దవై, నీలి రంగుగా నుండుట; పుండ్లు పడుట, గొంతుకలో ముండ్లగుత్తి యున్నట్లు భావనతో బాధగాయుండుట. సవాయిదోషములు. యెక్కువ వెచ్చగా నుండుట. బాధ నాలుక మొదటినుండి చెవిలోనికి వ్యాపించుట. గాలిబిళ్లలు. కొండనాలుక వాచుట, పొడుగగుట,

అన్నకోశము:—రుచి లోపాపు రుచిగా నుండుట. చిక్కని రక్తమును, ఆమమును వమనము చేసుకొనుట, దీనితో ఓకరింపు, బాధ. చని పోయినగాని బాధ నివారణ కాదనిలోచుట. బొడ్డువద్ద శూలవచ్చుట.

మలము, మలాశయము:—వుదయమున నీళ్లవిరేచనములగుట. రక్తమొలలు. ఆసనములో పుండ్లు పడుట.

మూత్రము:—సుద్దవంటి మడ్డి జేరుట. శ్వేతధాతువు కలసిపోవు చుండుట. మూత్రి మెక్కువగాగాని తక్కువగాగాని యెర్రిగా, ముదర రంగుగా వెడలుట.

పురుషావయవములు:—అండములువాచుట, బాధగానుండుట. నూతనముగా వచ్చినట్టిగాని, నిలువగా యున్నట్టిగాని శెగవ్యాధి, సవాయి బిళ్లలు, పుండ్లు—వీటిని మాన్పును.

స్త్రీ అవయవములు:— స్తనములు గట్టిగా నుండుట, వాచుట. బాధగా నుండుట. స్తనములలో కంతులు బయలుదేరుట. చంకలలోని మాంసగ్రంథులు పెద్దవగుట. స్తనమువిూది పుట్టవ్రణమును మాన్పును. బిడ్డ పాలు త్రాగునపుడు బాధలు చన్మొనలనుండి శరీరమంతకును వ్యాపించుట. చన్మొనలు పగులుట, చిన్నపుండ్లు పడుట. ఋతుస్రావము తరుచుగాను, యెక్కువగాను వెడలుచుండుట. కుడి అండాశయములో లాగుచున్నట్లు బాధగా నుండుట.

శ్వాసావయవములు:—శ్వాసతీయుట కష్టముగా నుండుట. బొంగురుతనము. పొడిదగ్గు రాత్రి యెక్కువగానుండుట. చిక్కని స్రావము వెడలుచుండుట.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—మెడలోని కుడివైపు మాంసగ్రంథులు గట్టిపడుట. మెడకొయ్యబారుట. వుదయమున నడుము కొయ్యబారుట. నడుములో పొడుచుచున్నట్లు నొప్పిగా యుండుట. విద్యుచ్ఛక్తి అదురులోవలె ఒకచోటినుండి మరియొకచోటకు మారుచుండు బాధలు,

నొప్పులు. కీలమండలలో నొప్పిగా యుండుట. పాదములు వుబ్బుట. బొటనవేళ్లలో సరముల సంబంధమైన బాధలు.

చర్మము:—కురుపులు బయలుదేరు సూచనలు గలుగు నపుడును, పుండ్లనుండి రసికారుచుండు నపుడును వాడవచ్చును. దురదగా నుండుట. సవాయి సంబంధమైన పొక్కులు, పుండ్లు, వాపులు, మాంసగ్రంథులు గట్టి పడుట, బిళ్లలు, వులిపిరికాయలు, పుట్టుమచ్చలు బయలుదేరుట.

నిద్ర:—తరుచు ఆవలింతలు, మగతయుండుట. బాధలవలన పరుండుటకును, నిద్రపోవుటకును శక్యముకాకుండుట.

జ్వరము:—ఒకప్పుడు యెక్కువవెచ్చదనము, ఒకప్పుడు యెక్కువ చలి, నిస్త్రాణ యుండుట.

వుద్రేకము:—వుదయమున, వర్ష కాలములో, రాత్రియందు.

వుపశమనము:—వెచ్చదనమువలనను, పొడిగాలిలో, విశ్రాంతివలన.

దీనికి ముందుగాని వెనుకగాని "మెర్క్యూరియసు" ను వాడరాదు.

విరుగుళ్లు:—బెల్లడోనా, మెజీరియం, ఇగ్నేషియా, పాలు, వుప్పు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—దీనిని స్వచ్ఛమైన మదరుటించరు రూపమున తీసికొని దానికి 10 రెట్లు నీళ్లు కలిపి, చెవులవద్ద యున్నట్టిన్ని గొంతుకలో వున్నట్టిన్ని, స్తనములలో యున్నట్టిన్ని, మాంసగ్రంథులు వాచి, పెద్దవై, మంటలుగా యున్నప్పుడు పైకి పట్టించవలయును. ఇట్లే చనొమ్రనల నొప్పులకు, తామరకు, చిడుముకు, పుట్టవ్రణముకు, వుపయోగ పరుప వచ్చును.

పైఔషధమునకుసంబంధించిన పైటోలక్కా డికాండాఫోలియా అనబడు ఔషధమును టించరు రూపమునగాని ఆయింటుమెంటు రూపమునగాని ఎపిథీలియోమా (Epithelioma) అనబడు పుట్టవ్రణమును

బోలియుండు చర్మరోగమును పైకి పట్టించినయెడల కొలది వారములలో అది పూర్తిగా మానును.

---

## 158. ప్లాంటాగో. PLANTAGO MAJOR.

చెవిపోటు, పంటిపోటు, అపరియత్నముగామూత్రము వెడలుట, పండ్లు చెడిపోవుట లేక పుప్పిపండ్లు అగుట, చెవిలోవాపు, బాధబయలు దేరుట, చెవికిని పండ్లకును మధ్యప్రదేశములో బాధలు వచ్చుచుండుట, పండ్లనుండి చీము, దుర్వాసనవచ్చుట—వీటినన్నిటినిఇది మాన్పును. దీనిని వాడుటవలన పొగాకుయందు అయిష్టము కలుగును.

చెవులు:—వచ్చుచు, మానుచు వుండునట్టి చెవిపోటు. బాధ ఒక చెవినుండి రెండవచెవిలోనికి వ్యాపించు చుండుట. చెవిపోటుతోనుండు పంటిసలుపు.

నోరు:—పంటినొప్పివలన పండ్లనుముట్టుకొనుటకు వీలులేకుండుట. దౌడలు వాచుట. లాలాజలము యెక్కువగా వూరుచుండుట. తాకుడువలనను, చల్లనిగాలిలోను పంటిసలుపు వుద్రేకించుట. భోజనముచేయుచున్నప్పుడు పంటిసలుపు వుపశమించుట.

మలము, మలాశయము:—మలవిసర్జనకొరకు యెన్నిసారులు ప్రయత్నించినను మలము వెడలకపోవుట. మూలశంఖ బాధవలన నిలుచుండుట కష్టముగా నుండుట.

మూత్రావయవములు:—మూత్రము విస్తారముగాను, రాత్రియందు నిద్రలోను, వెడలును (రూస్ఆరోమేటికా, కాష్టికం).

మోతాదు:—టించరు మొదలు 30 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—పుప్పిపండ్లబాధకును. చెవిపోటుకును. రక్తదోషములలోనుండునట్టి మానని వ్రణములువంటి పుండ్లు, తీపుతోనుండు అ:

నము, మొటిమలు, పాముకాట్లు—వీటికి దీనిని స్వచ్ఛమైన టించరు రూపమునగాని, టించరుకు 4 రెట్లు నీళ్లనుగాని లేక 2 రెట్లు కొబ్బరి నూనెనుగాని కలిపి వీలువెంబడిని పైకి పట్టించవచ్చును.

---

## 159. పోడోఫైలం PODOPHYLLUM.

పైత్య తత్వములమీద నిది బాగుగా పనిచేయును. కాలేయము, ఆంత్రిములు, ఆసనము, జీర్ణకోశము—వీటికి సంబంధించియుండు రోగములమీదను, కుడివైపు అవయవములయొక్క రోగములమీదను బాగుగా పనిచేయును. గర్భాశయము నెలుపలకు వచ్చుటను, పిల్లలకు పండ్లువచ్చు కాలమందును, భోజనానంతరమునను, స్నానము చేయుచున్నప్పుడును నీళ్లవిరేచనములు అగుటను మాన్పును.

మనస్సు:—విచారగ్రస్తముగా నుండుట. జీవనము రోతల విసుగు జెందుట. పుల్లని పండ్లను తినుటవలని సంధిలక్షణములు, అతి వాగుడు వచ్చుట.

తల:—తలతిర్పుచే ముందరకు పడుచున్నట్లుండుట. నిద్రిలో బిడ్డయొక్క తలకు చెమటపట్టుచుండుట. తలబరువుతోగూడిన తలనొప్పి, ఇది వుదయమున నెక్కువగా యుండుట. దీనితో ముఖములో వెచ్చదనము, రుచిచేదు, ఒక్కొక్కసారి విరేచనములు యుండుట. పైత్యదోషముతోగూడిన తలనొప్పి.

కన్నులు:—కాచకోంబముపై పుండ్లుపడుట. కండ్లకలకల వలని బాధలు వుదయమున యెక్కువగా నుండుట.

ముక్కు:—చిన్నచిన్న పొక్కులు బయలుదేరినొప్పిగాయుండుట.

ముఖము:—వెచ్చగాను, బుగ్గలు పొంగరించి యుండుట.

నోరు:—పండ్లువచ్చుకాలములో పిల్లలు రాత్రియందు పండ్లుకొరుకుట. దుర్వాసన వచ్చుట. నాలుకపైని తెల్లని, చిక్కనిపూత గలుగుట.

నాలుకపై పండ్లయొక్క గుర్తులు లేక నొక్కులు పడుట.

గొంతుక:—గండమాలరోగము. సత్తపక పాడిగా నుండుట. గుటక వేయుట కష్టముగా నుండుట. గొంతుకలో శ్లేష్మము యెక్కువగా జేరి గురగురలాడుచుండుట.

అన్నకోశము:—రుచి యేమియు తెలియకపోవుట, తీసికొనిన ఆహారము పులిసి పులితేన్పులు వచ్చుచుండుట, గుండెలలో మంటగా నుండుట, వికారముగానుండుట, వమనములు వెడలుచుండుట. తలభారముగానుండుట.

పొత్తికడుపు:—వెచ్చగాను, ఖాళీగాను, వుబ్బరింపుగాను యుండుట. నీరసముగానుండుట, బోర్లగిల పరుండుటవలన సుఖముగాతోచుట, కాలేయసమీపమున బాధగానుండుట; ఇది మర్దనమువలన వుపశమించుట. వాయువు పేగులలో యెక్కువగాజేరి గురగుర లాడుచుండుట. కాలేయ సంబంధమైన రాళ్లవలనవచ్చు శూల.

మలము, మలాశయము:—కలరావ్యాధిమీద బాగుగాపనిచేయును. మలము ఆకుపచ్చగాను, నీళ్ళవలెను, విస్తారముగాను, దుర్వాసనతోను, గొట్టములోనుంచి వచ్చుచున్నట్లు వేగముగాను వెడలుట, మల విసర్జనకు ముందుగాగాని మలము వెడలుచున్నప్పుడుగాని మలాశయము వెలుపలకు వచ్చుట. ఒకసారి విరేచనబద్ధము, ఒకసారి నీళ్లవిరేచనములు. మాననటువంటి నీళ్లవిరేచనములు వుదయముునను పిల్లలకు పండ్లు వచ్చునప్పుడును, వెచ్చగాను, బుగ్గలు నిగనిగ లాడుచును, వేసవిలో పుల్లని పండ్లను తినుట వలనను వెడలుచుండుట. బయటకువచ్చు మూలశంఖకు, రానట్టిమూలశంఖకుకూడ పనిచేయును. మట్టిరంగుగాను, గట్టిగాను, ఆరుచుకొనిపోయి వెడలు విరేచనములను మాన్పును.

మూత్రావయవములు:—రాత్రియందుతరముగా మూత్రము వెడలుచుండుట. మూత్రమప్రయత్నముగా వెడలుట, ఒకప్పుడు బంధింపబడుట. అతిమూత్రమును, మధుమూత్రమును మాన్పును.

పురుషావయవములు:—ఒక మారువృషణములు, మరియొక మారుకండ్లు వాచుట, యెఱ్ఱబడుట, బాధగా నుండుట.

స్త్రీఅవయవములు:—బరువు నెత్తుట వలనను, శారీర పరిశ్రమ వలనను, గర్భిణీస్త్రీలలోను, ముఖ్యముగా ప్రసవానంతరమునను, గర్భాశయము వెలుపలకు వచ్చుట. గర్భాశయములోను, కుడి అండాశయములోను, బాధగానుండుట; వీటితో ఆంత్రములలో ధ్వనులు వుండుట. చిక్కని ఆమమువంటి కుసుమ.

శ్వాసావయవములు:—వూపిరందక పోవుట. కోరింతదగ్గు, పొడి దగ్గు—యివి విరేచనబద్ధముతోను, అగ్నిమాంద్యముతోను వుండుట.

హృదయము:—దడగా నుండుట. హృదయము గొంతుకలోనికి యెగబ్రాకు చున్నట్లుండుట.

కాళ్లు, చేతులు:—భుజములమధ్యను, కుడిఅంసఫలకము క్రిందను, గజ్జలలోను, నడుములోను, నొప్పిగా నుండుట. ఎడమవైపు పక్షవాతము వచ్చినట్లుండుట.

చర్మము:—గరుకుగాను, మర్మావయవమువద్ద దురదగాను, పొక్కులతోను యుండుట. కామెర్లరోగములోవలె పసుపుపచ్చగా నగుట.

నిద్ర:—గాఢనిద్ర. లేచుసరికి అలసటగా యుండుట. పూర్వాహ్నమందు నిద్రపట్టుట.

జ్వరము:—వుదయమున 7 గంటలకు కడుపులోను, మోకాళ్లలోను, చీలమండలలోను, గుత్తులలోను, బాధతోవచ్చుచలి, విస్తారముగా చెమట పట్టుచుండుట. పైత్యజ్వరమును మాన్పును.

వుద్రేకము:—వుదయమున, వేసవిలో, పండ్లు వచ్చుకాలములో.

వుపశమనము:—సాయంకాలమున,

సహచరులు:—వుప్పు.

విరుగుళ్లు:— నక్సువామికా, కొలోసింథిస్, యాసిడ్ లేక్టిక్, లెప్టాండ్రా.

మోతాదు:—3 మొదలు 1000 పొటెన్సీ. పెద్దపొటెన్సీలు కలరా లో బాగుగా పనిచేయుచున్నవి.

---

## 160. పల్సెటిల్లా. PULSATILLA.

ముఖ్యముగా స్త్రీల రోగములమీద నిది బాగుగా పనిచేయును. నీలిరంగుకండ్లు, పాలిపోయిన ముఖము, సులభముగా నవ్వుట లేక కన్నీళ్లు తెచ్చుకొనుట, యెక్కువ విశ్వాసముతోను, నెమ్మదిగాను, పిరికితనము గాను, నెమ్మదియైన స్వభావముతోను యుండునట్టి స్త్రీల వ్యాధులమీద బాగుగా పనిచేయును. లోహ సంబధమైన సిద్ధౌషధములు లేక టానిక్కు (Tonic) వాడిన పిమ్మటను, పొంగుకు సరియైన చికిత్సచేయబడని కేసులకును దీనిని వాడనగును. లక్షణములు తరచు మారుచుండుట, యుక్త వయస్సు వచ్చుకాలములో స్త్రీలకువచ్చు అనారోగ్యములును, రోగి యెత్తుగానుండు తలగడమీద తలనుంచుకొని, చేతులను తలపైనిడికొని పరుండుటయు, అజీర్ణదోషములును దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—సులభముగా యేడ్పువచ్చుట. సాయంకాలమందు ఒంటరిగా నుండుట వలనను, చీకటిలోను, దయ్యమునుగూర్చియు భయము జెందుట. సులభముగా అధైర్యము జెందుట. ఒకప్పుడతి ఖులాసాగాను, మరియొకప్పుడు అతిబాధతోను యుండుట. తెలివితక్కువగానుండుట.

తల:—పార్శ్వపునొప్పి కుడికనుబొమవద్ద ప్రారంభించి, ఒరుపును గలుగజేయు కన్నీళ్లతో నుండుట. అధికపరిశ్రమవలన తలనొప్పివచ్చుట. పోడుచేమన్నట్లుండు బాధలు ఒకచోటినుండి మరియొకచోటికి మారుచుండుట.

కన్నులు:—చిక్కని పసుపుపచ్చని స్రావము విస్తారముగావెడలుచుండుట. దురదగాను, మంటగాను యుండుట. కనురెప్పలు వాచుట, అంటుకొనుట, కనురెప్పల వంచలలో చిన్నచిన్న పొక్కులు బయలుదేరుట.

కండ్లకలకలు; వీటిలో పసుపుపచ్చని చిక్కని స్రావము వెడలుచుండుట. బహిరంగమైన గాలిలో కన్నీళ్లు విస్తారముగా వెడలుట. రోగసంబంధమైన కండ్లజబ్బులు.

చెవులు:—లోపలనుండి యేదియో బయటకు చొర్చుకొనివచ్చినట్లు బాధగానుండుట. దిబ్బడవేయుట. దూరమునకుండి ధ్వనులు వినిపించినట్లుండుట. చిక్కని, దుర్వాసనగానుండు ఆమము, చీము వెడలుచుండుట.

ముక్కు:—కుడి నాసికారంధ్రము కప్పబడినట్లుండుట. నీళ్లవంటి స్రావము వెడలుచుండుట. వాసన తెలియకపోవుట. సాయంకాలమున దిబ్బడవేయుట. ఉదయమున పసుపుపచ్చని ఆమము విస్తారముగా వెడలుట. మానవటువంటి రొంపలోవలె, దుర్వాసనవచ్చుట, ఎముకలలోనొప్పులు.

నోరు:—ఆర్చుకుపోయి, దాహములేకుండగనుండుట. అడుగు పెదవి మధ్యను పగులుట. దుర్వాసనవచ్చుట (మెర్క్యూరియస్, ఆరంమెట్). చన్నీటివలన పంటిసలుపు వుపశమించుట (కాఫీ). ఆర్చుకుపోయిన పెదవులను తరుచు తడిచేయుటకు నాకుచుండుట ఆహారము, ముఖ్యముగారొట్టె చేదుగావుండుట. రుచి, చేదుగాను, వుప్పగాను, కుళ్లినట్లును, పైత్యపురుచిగాను, కొవ్వు రుచిగాను మారుచుండుట. రుచి తెలియకపోవుట బలవర్ధకౌషధముల (Tonics) ను కోరుచుండుట. తియ్యని లాలాజల మూరుచుండుట. పంటిసలుపు సాయంకాలమందును, రాత్రియందును, పడకవేడిమివలనను, భోజనము చేయుచున్నప్పుడును, పండ్లను కుట్టుచున్నప్పుడును వుద్రేకము జెందుట.

గొంతుక:—గుటకవేయునపుడు మంటగాను, బాధగానుయుండుట.

అన్నకోశము:—ఆహారమేదియు రుచింపకపోవుట. యేరోగముతోను దాహముండకపోవుట. ఆహారము యెక్కువ వుప్పని రుచితో నుండుట. భోజనానంతరము తినిన ఆహారపు రుచితోగూడిన త్రేణుపులు వచ్చుచుండుట. పొగత్రాగునపుడు యెక్కిళ్లు వచ్చుట. దాహము తరుచు

గా నుండకపోవుట. దాహముగా నున్నప్పుడు కొద్దికొద్దిగాను, అతి తరచుగాను, నీళ్లను త్రాగుట. ఇందువలన వమనానుమానము గలుగుట. ఆహారపానీయములవలన వికారము వచ్చుట బహిష్టులోను, బహిష్టు నణచిపెట్టుటవలనను లేక గర్భిణీలోను, హృదయమునను వికారము వచ్చుట. పైత్యసంబంధమైన పదార్థమును వమనము చేసికొనుట. క్రొవ్వు పదార్థములు, ఐస్‌క్రీమ్, పండ్లు,—వీటిని తినుటవలన జీర్ణశక్తి పాడగుట, పొట్ట ఉబ్బరించుట, కొరుకుచున్నట్లు బాధగా నుండుట.

పొత్తికడుపు:—ఉబ్బరించి గుడగుడలాడుచు, బాధగా నుండుట. రాయిపెట్టినట్లు బరువుగా నుండుట.

మలము, మలాశయము:—గుడగుడ లాడుచు నీళ్ల విరేచనములు రాత్రియందు యెక్కువగా వెడలుట. విరేచనములు ఒక్కొక్కమారు ఒక్కొక్కరకముగా వెడలుట. కలరారోగులలో వచ్చు జిగట విరేచనములను మాన్పును. బయటకురానట్టి మూలశంఖ, దీనివలన బాధలు బహిష్టులో యెక్కువగా నుండుట. దురదతో నుండు మూలశంఖ, విరేచనములో రక్తము, జిగట వెడలుచుండుట. అజీర్ణ విరేచనములు. యెక్కువ విరేచనబద్ధము.

మూత్రావయవములు:—పరుండినప్పుడు మూత్రానుమాన మెక్కువగా కలుగుట. రాత్రియందు దగ్గుచున్నప్పుడును లేక అపానవాయువు వెడలుచున్నప్పుడును మూత్రము అప్రయత్నముగా వెడలుట. మూత్రవిసర్జనానంతరము మూత్రకోశములో నొక్కుచున్నట్లు బాధగా నుండుట.

పురుషావయవములు:—హృదయమున లేపనము యెక్కువగా యుండుట. అధిక సంభోగమువలన వచ్చు తలనొప్పిని, అవయవములలో భారమును మాన్పును. వృషణములు వాచుట, బాధగానుండుట, ఇది శగ వ్యాధి నణచి పెట్టుట వలనను, చలి వలనను దెబ్బతగులుట వలనను గలిగినప్పుడు పనిచేయును. సెగలో చిక్కని, పసుపుపచ్చని లేక పసుపుపచ్చన ఆకుపచ్చన మిశ్రమవర్ణముగా నుండు స్రావము వెడలుచుండుట. కుడివృష

ణము వాచుట.

స్త్రీ అవయవములు:—మర్మావయవ ద్వారములో మంటగా నుండుట. గర్భాశయము ముట్టుకొనిన యెడలను, సంభోగమునందును నొప్పిగా యుండుట. గర్భాశయము వెలుపలకు వచ్చుట. ఋతువు చాల ఆలస్యముగాను, స్రావము తక్కువగాను, కొలదికాలమువరకును, చిక్కగాను, ముద్దలుముద్దలుగాను, విడిచివిడిచియు వెడలుచుండుట. కుసుమ ఒరుపును కలుగజేయుచును, మంటగాను, తెల్లని మీగడవలెను వెడలుట. గర్భస్రావసూచనలు గలుగుట. ప్రసవవేదనలో నొప్పులు కొలదిగాను, ఆగుచును వచ్చుచును, సొమ్మసిల్లజేయుచును, యెక్కువగాలికొరకు కోరికను పుట్టించుచు వచ్చుచుండుట. మావి వెడలకపోవుట. ప్రసవానంతర స్రావము మావి వెడలనపుడు గలుగుట ప్రసవానంతరనొప్పులు చాలకాలమువరకును లేక యెక్కువ బాధతోను యుండుట. స్తనములు వాచుట. స్తన్యము ఒక్కసారిగా ఆగిపోవుట. మైల పాలవలె తెల్లగా వెడలుట. బహిష్టులోను తరువాతను వెడలు నీళ్ళవిరేచనములను మాన్పును.

శ్వాసావయవములు:—సాయంత్రమునను, రాత్రియందును, పరుండినపిమ్మటను, పొడిదగ్గువచ్చుట, ఇది కూర్చుండినయెడల వుపశమించుట, మరల పరుండినయెడల నిది వుద్రేకముజెందుట. ఛాతీలోనొక్కుచున్నట్లు నొప్పిగాయుండుట. స్రావము చిక్కగాను, చేదుగాను, ఆకుపచ్చగాను, విస్తారముగాను వెడలుట. ఎడమవైపు పరుండినయెడల గుండెదడ, వూపిరందకపోవుట, ఆతురత గలుగుట. గంధకపు ఆవిరివలన వచ్చునట్లుగానుండు వుబ్బసపుదగ్గు రాత్రియందు వచ్చుట.

హృదయము:—విచారముతోను, దృష్టిమాంద్యముతోను, అవయవములలో కంపముతోను, కోపముతోను, భయము లేక సంతోషముతోను, బహిష్టుదోషముతోను, భోజనానంతరమునను, నాడి మందముతోను, రక్తక్షీణతతోను, వచ్చు గుండెదడను మాన్పును. సాయంకాలమందు నాడి నిస్త్రాణగాను, వడిగాను ఉండుట. ఉదయమున మందముగాను, నాడి అతి సన్నముగాను వుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—పెడలోను నడుములోను భుజముల మధ్యను పొడుచుచున్నట్లు బాధగానుండుట. చీల్చుచున్నట్లును, లాగుచున్నట్లును వుండు బాధలు; ఇవి ఒకచోటినుండి మరియొకచోటికి మారుచును, రాత్రియందును, వెచ్చదనమువలనను, వుద్రేకించుచును; అవయవములపైని కప్పుకొనకుండుటచే వుపశమించుచును వుండుట. మోకాలు వాచి బాధలేకుండగ నుండుట. ఒకప్పుడు చీల్చుచున్నట్లును, లాగుచున్నట్లును బాధగానుండుట. సాయంకాలమున మడమలో పొడుచుచున్నట్లు బాధగానుండుట.

చర్మము:—మంటగాను, కొరుకుచున్నట్లును, దురదగాను అచ్చటచ్చట నుండుట; ఇది పడక వేడిమి వలనను, సాయంకాలమునను, అర్ధరాత్రిమునకు పూర్వమునను, గోకుట వలనను, నడకవలనవచ్చు వేడిమితోను వుద్రేకము జెందుట. పొంగులో బాగుగా పనిచేయును. యుక్తవయస్సులోవచ్చు పోత్రిపు మొటిమలు, దుష్టరక్తనాళముల వాపులు.

నిద్ర:—సాయంకాలమునను, మధ్యాహ్నమందును, ఆపుకొనలేనంత నిద్రవచ్చుట. భయమువలన నిద్రిలో తరుచు మెలకువ వచ్చుచుండుట. తరుచు అపలింతలు వచ్చుచుండుట. కంగారుతోను, భయముతోను, ఆతురతతోను వుండు కలలు వచ్చుట.

జ్వరము:—వెచ్చనిగదిలోకూడ చలివేయుచుండుట. చలి. వణకు. పురుగులు పాకుచున్నట్లుండుట. వేడినీళ్లు జల్లినట్లుగా భావనయుండుట. జ్వరములేనప్పుడు తలనొప్పి, అంబవిరేచనములు, వికారము, ఆకలి లేకపోవుట యుండుట. ప్లీహము వాచుట. ముఖమునందు ఒకవైపు వెచ్చగాను, ఒకవైపు చల్లగాను యుండుట.

ఉద్రేకము:—మధ్యాహ్నమందు, సాయంకాలమందు, నడచుటవలన, దగ్గుటవలన, యెడమవైపున పరుండుటవలన, కొవ్వుపదార్థములను తినుటవలన, తలను పల్లముగానుంచి పరుండుటవలన, గర్భిణీలో, వెచ్చని గదిలో.

ఉపశమనము:—బహిరంగమైన గాలిలో, చల్లదనమువలన, కుడి వైపున పరుండుటవలన, నొక్కుటవలన.

పోలికలు:— కాలీసల్ఫ్, సల్ఫరు, కాలీబైక్రోమికం.

సహచరులు:—కాలీమూరు, సైలీషియా, లైకోపోడియం, పల్సటిల్లా, యాసిడుసల్ఫ్.

విరుగుళ్లు:— కాఫీ, కెమోమిల్లా, ఇగ్నేషియా, నక్సువామికా, బెల్లడోనా.

చైనా, ఫెరమ్‌మెట్, సల్ఫరు, యాసిడుసల్ఫ్, కుప్రమ్‌మెట్, మెర్క్యూరియసు, కాఫీ, కెమోమిల్లా, బెల్లడోనా, కోల్చికం, లైకోపోడియం, ప్లాటినా, స్ట్రామోనియం, సెబాడిల్లా, యాంటిం‌టార్టులకిదివిరుగుడు.

మోతాదు:—3 మొదలు 1,000 పొటెన్సీ. దీనిగుణకాలపరిమితి 3 మొదలు 14 దినములు.

---

## 161. క్వెబ్రాఖో. QUEBRACHO.

ఇది పుప్పుసమునీాదను, తుమ్ములు, రొంపతోగూడిన జ్వరము మీాదను బాగుగా పనిచేయును. వూపిరాడక పోవుట. రాత్రియందు పుప్పుసము యెక్కువగుట. పరుండినయెడల లక్షణములు పుద్రేకము జెందుట లేక నిద్ర పట్టకపోవుట. పరిశ్రమవలన వూపిరాడనంతటి దగ్గు వచ్చుట. ముఖము నీలిరంగుగా నగుట. డిజిటాలిసు హృదయముమీాద యెట్లు పని చేయునో ఆట్లే యిది శ్వాసావయవములమీాద అంతబాగుగా పనిచేయును. హృదయ రోగమువలన శ్వాస కష్టముగా నుండుటను మాన్పును.

మోతాదు:—3 పొటెన్సీ.

---

## 162. క్వెర్కస్—స్పిరిటస్ గ్లాండియం క్వెర్కస్.

## QUERCUS—SPIRITUS GLANDIUM QUERCUS.

బ్రాందీ, విస్కీ, సారా మొదలగునవి త్రాగుట అలవాటుపడిన వారికి వీటియందుగల అలవాటును తగ్గించుటలోను, క్రమముగా మానునట్లు చేయుటలోను యిది అగ్రగణ్యమైనది. ఇది త్రాగుటవలని దోషమును మాన్పును. వికారము, చెముడు, ప్లీహము వాచుట లేక వుబ్బుట, కాలేయ సంబంధమైన రోగములు, పొట్ట వుబ్బరముతోనుండు మన్యపుజ్వర లక్షణములు, మేహవాత లక్షణములు—వీటిమీద నిది బాగుగా పనిచేయును.

ముఖము:—కందబారుట.

అన్నకోశము:—దిగువభాగమందు కొరుకుచున్నట్లుండు బాధ.

పొత్తికడుపు:—కాలేయము, ప్లీహము వాచి బాధగా నుండుట.

మలము, మలాశయము:—తరుచువిరేచనములగుచుండుట. త్రాగుబోతులలో భగందరమును మాన్పును.

హృదయము:—దడదడగాను, వక్రముగాను కొట్టుకొనుట.

కాళ్ళు, చేతులు:—చేతులు వణకుచుండుట. కాళ్లలోని దుష్టరక్తనాళములు వాచుట.

మోతాదు:—మదరుటించరు, మోతాదుకు 10 చుక్కలు చొప్పున దినమునకు 2, 3 సారులు తీసికొన వచ్చును.

---

## 163. రానన్క్యులస్. RANUNCULUS BULBOSUS.

ఆల్కహాలు సంబంధమైన పానీయములను త్రాగుటవలని దోషములకును, విడిచివిడిచివచ్చు యెక్కిళ్లకును, సంధిలక్షణములకును, కండరములకును చర్మమునకును సంబంధించిన రోగములకును, ఛాతీకి నీరుపట్టినపుడును, సయాటికాకును దీనిని వాడవచ్చును.

తల:—నుదిటిలో నొక్కుచున్నట్లు బాధగానుండుట. నడినెత్తిలో పురుగులు పాకుచున్నట్లు భావనయుండుట.

కండ్లు:—పగటియందు కండ్లు ఆనకపోవుట. కండ్లయెదుట మబ్బుగా యుండుట. పొగలోనున్నట్లువలె కండ్లలో నొప్పిగాను మంటగాను వుండుట. కుడికంటిలోని నొప్పి నడమచున్నప్పుడునునిలుచుండినప్పుడును వుపశమించుట. కండ్లనుండి నీళ్లు కారుచుండుట. వెలుతురును చూచుట కష్టముగా నుండుట.

చెవులు:—సాయంకాలమునందు పోట్లు వచ్చుచుండుట.

ముక్కు:—రక్తము కారుచుండుట. గదిలోనున్నప్పుడు బాధతోను, ఒరుపుతోను, దిబ్బడవేయుట. తుమ్ములు వచ్చుచుండుట, మంటగాను, వాపుగాను యుండుట.

పొత్తికడుపు:—నొక్కుటవలన యెక్కువ నొప్పిగాయుండుట.

ఛాతీ:—బహిరంగమైన గాలిలో నడచునప్పుడు చలిగానుండుట. ఛాతీలోను, భుజములమధ్యను కుట్టుచున్నట్లు బాధగానుండుట; ఈబాధ కదలుటవలనను, వూపిరిపీల్చుటవలనను వుద్రేకముచెందుట. రొమ్ముముకలోను, ప్రక్కయెముకలలోను, ఎముకలమధ్య ప్రదేశమునందును నొక్కుచున్నట్లును, చితుకకొట్టినట్లును పలువిధములగు బాధలు బయలుదేరుట. వేడివలనను, శీతగాలివలనను, వచ్చు ప్లూరసీకి వాడవచ్చును (ఎకోనైట్, ఆర్నికా).

చర్మము:—అరిచేతులలో దురద, నీటిపొక్కులవంటివి బయలుదేరుట. ఆనికాయలవలన బాధ యెక్కువగా నుండుట. ఎక్కువమంటగాను, దురదగాను వుండుట; యీలక్షణములు తాకుడువలన యెక్కువగుట. వూదారంగుగానుండు నీటిపొక్కులు బయలుదేరుట.

వుద్రేకము:—బహిరంగమైనగాలిలో, తాకుడువలన, వాతావరణమార్పులవలన, తేమవలన, తుపానువలన, సాయంకాలమున.

పోలికలు:—ఎకొనైట్, ఆర్నికా, బ్రియోనియా, మెజీరియం. దీనికి ముందు వెనుకలను సల్ఫరును, స్టాఫిసేగ్రియాను వాడరాదు.

విరుగుళ్ళు:—బ్రియోనియా, కేంఫర్, రూస్టాక్స, పల్సటిల్లా, కేమోమిల్లా, కొలోసింథిస్, నక్సువామికా.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. దీనిగుణకాల పరిమితి 4 మొదలు 6 వారములు.

---

## 164. రటన్హియా. RATANHIA.

శ్వాసావయవములకు, ఆసనముకు సంబంధించిన రోగములమీద నిది బాగుగా పనిచేయును. ఎక్కిళ్లను కట్టును. క్రిమిదోషములను మాన్పును.

తల:—విరేచనానంతరమునను, తలను ముందరకువంచి కూర్చుండి నప్పుడును, బ్రద్దలగుచున్నట్లుండు తలనొప్పి వచ్చుట. గోకుటవలన వుపశమింపని దురద.

ముక్కు:—ముక్కులో దురదగా నుండుట. ముక్కుచివర వచ్చు దురద ముక్కును నలుపుటవలన వుపశమించుట. దిబ్బడవేయుట.

అన్నకోశము:—విపరీతమైన ఎక్కిళ్లవలన కడుపులో బాధ గలుగుట, భోజనానంతరమున యెక్కిళ్లు చాలసేపటివరకు వచ్చుచుండుట. చాకుతో కోయుచున్నట్లుండు బాధలు.

ఆసనము:—గాజుపెంకులతో నిండియున్నట్లు పోట్లుగా నుండుట. ముడుచుకొనిపోయినట్లుండుట. వేడిగాను, అర్చుకొనిపోయినట్లును, కత్తితో పొడుచుచున్నట్లును బాధగా యుండుట. విరేచనమైన కొలదిగంటల వరకు మంటగాను, పోట్లుగాను యుండుట. యెక్కువగా తినికినగాని మలము వెడలకపోవుట. మరియు, మూలశంఖ మొలలు బయటకువచ్చుట. ఆసనము పుండ్లుపడి, నిప్పువలె మంటగా నుండుట. బాధలు చన్నీటివలన వుపశమించుట. దుర్వాసనతోనుండు నీళ్లవిరేచనములు. నులిపురుగులు

వెడలుట. ఆసనము దురదగానుండుట.

పోల్చదగినవి:—సినా, ట్యూక్రియం, క్రోటన్ టిగ్లినం, ఎస్క్యులస్.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 165. రియం. RHEUM.

పిల్లల రోగములమీద నిది బాగుగా పనిచేయును. పిల్లలకు పండ్లు వచ్చుకాలములో గలుగు రోగలక్షణములు, చంటిపిల్లల నీళ్లవిరేచనములు, ప్రసవించినపిమ్మట స్త్రీలలో కలుగు నీళ్లవిరేచనములు—వీటిమీద నిది బాగుగా పనిచేయును. బిడ్డ పుల్లనివాసనతో నుండుటయు, సక్రమమునకురాని పండ్లను తినుటవలనవచ్చు దోషములును దీని వుపయోగమును సూచించును.

నోరు:—పిల్లలకు పండ్లు బహుబాధతో వచ్చుట. పండ్లు వచ్చునప్పుడు పిల్లలు అపరిమితముతోను చిరచిరలాడుచును, పుల్లనివాసనతో నుండు నీళ్లవిరేచనములతోను యుండుట.

మలము, మలాశయము:—విరేచనానుమానము భోజనమైనవెంటనే గలుగుట. విరేచనము పులిసిన వాసనతోను, పల్చగాను, ఆకుపచ్చగాను, ఆసనము యొగ్రిబడుచు వెడలుట. పక్షవాతరోగములోవచ్చు నీళ్లవిరేచనములను కట్టును. రక్తవిరేచనములైన పిమ్మట చీము లేక జిగట వెడలుచున్నప్పుడు బాగుగా పనిచేయును. పొట్ట డోలువలె వుబ్బరముగా నుండుట. విరేచనమగుటకు ముందు తినకవలసివచ్చుట. విరేచనమగుచుండునప్పుడు కంపములు వచ్చుట. విరేచనానంతరము పొత్తికడుపులో శూల, కోయుచున్నట్లు బాధ వచ్చుట, బిడ్డను యెన్నిసార్లు నీళ్లుపోసినను లేక కడిగినను పుల్లనివాసనతో యుండుట.

స్త్రీ అవయవములు:— గర్భస్రావమైన పిమ్మట మూత్రావయవ సంబంధమైన వ్యాధులు బయలుదేరుట. స్తన్యము పసుపుపచ్చగాను, చేదు

గాను యుండుట. అందువలన బిడ్డ అట్టిపాలను త్రాగుట కిష్టపడకుండుట. ప్రసవానంతర విరేచనములను కట్టును.

వృద్ధికము:—భోజనానంతరమున, కదలికవలన.

సహచరులు:—మెగ్నిషియాకార్బ.

విరుగుళ్లు:—కేమోమిల్లా, కేంఫరు, కొలోసింథిస్, నక్సువామికా, పల్సటిల్లా, మెర్క్యూరియసు.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. దీనిగుణకాల పరిమితి 2, 3 దినములు.

---

## 166. రూస్ ఆరోమేటికా. RHUS AROMATICA.

ఇది మూత్రావయవ రోగములమీద బాగుగా పనిచేయును. ఇది అతిమూత్రమును, మూత్రము మానకుండగను చుక్కలు చుక్కలుగాను వెడలుటను, మూత్రములో రక్తముకలసి వెడలుటను, మూత్రకోశములో వాపు, బాధతో మూత్రము కష్టముమీద వెడలుటనుమాన్పును. గర్భాశయ రక్తస్రావములు. మూత్రములో శ్వేతధాతువు కలసిపోవుచుండుట. పిల్లలలోగాని పెద్దవారిలో గాని మూత్రము రాత్రియందు గాని పగటియందుగాని అప్రయత్నముగా వెడలుట. చిన్నపిల్లలలో మూత్రము విడచునప్పుడు గాని అంతకుముందుగాని యెక్కువబాధ కలుగుచుండుట. తాగతమ్య సాంద్రత (Specific Gravity) తక్కువగానుండునట్టి మూత్రము విస్తారముగా వెడలుచుండునట్టి అతిమూత్రము లేక డయాబిటిస్ (Diabetes Insipidus) ను మాన్పును.

మోతాదు—మదరుటించరు. మోతాదుకు5లగాయితు 10చుక్కలు.

---

## 167. రూస్టాక్సు—RHUS TOX.

ఇది మేహవాత తత్వములమీద పని చేయును. శరీరమంతయు నలగ కొట్టినట్లు నొప్పిగా యుండుట, అవయవములలో అస్థిమితముగా నుండుట, రోగగుణములు కదలిక వలన వుపశమించుట—ఇవి దీనిముఖ్యలక్షణములు. ముఖ్యముగా యెడమునైపున వచ్చు రోగములమీద పని చేయును. యెక్కువ శారీర పరిశ్రమవలనను, బరువు వస్తువులను యెత్తుటవలనను, చెమట పట్టుచున్నప్పుడు నీళ్లలో నానుట వలనను, రక్తదోషముతోను, వచ్చు రోగములమీదను ఇది వాడదగినది. శరీరముమీద యెఱ్ఱని దద్దురులు పొక్కులు బయలుదేరి మంటగాను, దురదగాను వుండుటను మాన్పును.

మనస్సు:—జన్మసార్థకమునకు వచ్చుటవలన విచారములు కలుగ కుండగనే చనిపోవలయునని కోరుట. ఆత్మహత్యచేసుకొన వలయుననియు లేక దేనిలోనైన మునగవలయుననియు యుండుట. ఆతురతగాను, అస్థిమితముగాను యుండుట. భయముతోను, తొందరగాను, సులభముగా విసుగుజెందుచును యుండుట. మొన్న మొన్న జరిగినసంగతులనే మరచిపోవుట. సంధిలో నెమ్మదిగా గొణుగుకొను చుండుట.

తల:—నడినెత్తి యెక్కువ నొప్పిగా యుండుట. తలబరువుగా నుండుట. లేచుటవలన వికారము వచ్చుట. నీటిపొక్కులను మాన్పును. పడకనుండి లేచునపుడు బద్ధకముగాను, త్రాగిన వానివలె మత్తుగాను, తూలుచును యుండుట.

కండ్లు:—కండ్లు, కనురెప్పలు వాచుట, యెర్రబడుట. రాత్రిల యందు అంటుకొనుట. కండ్లు తెరచినయెడల వెచ్చని కన్నీళ్ళు మంటతో వచ్చుట.

చెవులు:—చీము, రక్తము వచ్చుట.

ముక్కు:—తుమ్ములు విస్తారముగా వచ్చుచుండుట. చిక్కని పసుపుపచ్చని ఆమము, లేక దుర్వాసనతోనుండు ఆకుపచ్చని చీము వెడలుట.

షుందరకు వంగినప్పుడును, యెక్కువ పరిశ్రమ వలనను చిక్కని రక్తము స్రవించుచుండుట. వాసన తెలియకపోవుట.

ముఖము:——నిప్పవలె యెఱ్ఱగాను, లేక పాలిపోయి ముడతలుపడి యుండుట.

నోరు:——నాలుక అచ్చుకుపోయి యెఱ్ఱగా బీటలుతీసి యుండుట. నాలుకచివర త్రికోణాకారముగా యెఱ్ఱగా నుండుట. నిద్రయందు లాలాజలము రక్తమునుబోలి వెలువడుట. పండ్లు కదలు చుండుట.

గొంతుక:——అచ్చుకొనిపోవుట. మాంసగ్రంధులు, కంఠమువాచుట గుటక వేయుట కష్టముగా నుండుట.

అన్నకోశము:——రుచిచేదుగానుండుట. భోజనానంతరము మత్తుగా యుండుట. పాలయందు కోర్కెగలిగియుండుట. రాయిపెట్టినట్లు బరువుగానుండుట. యెక్కువ దాహముతో నుండుట.

పొత్తికడుపు:——గజ్జలలోని మాంసగ్రంధులు వాచుట. బోర్లగిల పరుండినపుడు బాధలు వుపశమించుట, భోజనానంతరము పొట్ట వ్రేలాడు చున్నట్లుండుట.

మలము, మలాశయము:——పైకి కనబడనటువంటి మూలశంఖ; ఇది విరేచనానంతరము బయటకు చొచ్చుకొని వచ్చుచున్నట్లుండుట. మలము నీళ్లవలెను, ఆమముతోను, రక్తముతోను, యెక్కువతీపు, వికారముతోను వెడలుట. జిగట విరేచనములు. ఆసనముపద్ద పుండ్లగుట.

మూత్రావయవములు:——మూత్రము వెడలునపుడు యెక్కువ తీపుగానుండుట. మూత్రము వెచ్చగాను, తెల్లని మడ్డివలెను వెడలుట. మూత్రపిండములు వాచుట. విశ్రాంతిగా నున్నప్పుడును, నిద్రలోను మూత్రము అప్రయత్నముగా వెడలుట.

పురుషావయవములు:——వృషణములు యెక్కువ దురదగానుండుట. వాచుట, దళసరెక్కుట. హృదయమున సంభోగేచ్ఛ గలుగుట. శిశ్నాగ్ర చర్మము వాచుట.

స్త్రీ అవయవములు:—ఋతువు ముందరగాను, స్రావ మెక్కువగాను, చాలదినములవరకును వుండుట. ప్రసవానంతర స్రావము లేక మైల పల్చగాను, దుర్వాసనగాను కొద్దికొద్దిగాను చాలదినముల వరకును వెడలు చుండుట. అధికమైన శారీర పరిశ్రమవలన గర్భస్రావసూచనలు గలుగుట.

శ్వాసావయవములు:—అధిక పరిశ్రమవలనను, గాలిగొట్టము వూదుటవలనను, రక్తము స్రవించుట. అర్ధరాత్రిము మొదలు వుదయము వరకును మాననటువంటి పొడిదగ్గు. రొమ్ముకలలో నొప్పులతో వచ్చు విషపడిశము. వుపన్యాసముల నిచ్చుటవలన గొంతుక బొంగురుపోవుట. ముసలివారి దగ్గులమీద బాగుగా పనిచేయును. వీరికి మెలకువ వచ్చినప్పుడు అఘము ముక్కలుముక్కలుగా వెడలుచు దగ్గువచ్చుట.

హృదయము:—అధిక పరిశ్రమవలన వాచుట, పెద్దవగుట. స్థిమితముగా కూర్చున్నప్పుడు వణుకు, గుండెదడ వచ్చుట. గుచ్చుచున్నట్లు బాధగా నుండుట. నాడివడిగాను, నిస్త్రాణగాను, వక్రముగాను యెడమ చేతిలో తిమ్మిరతోను వుండుట.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—మెడకొయ్యబారుట. నడుములో చితుక కొట్టినట్లు నొప్పిగా యుండుట, మరియు కొయ్యబారుట. యీ లక్షణములు గట్టిప్రదేశమునందు పరుండుట వలనను, కదలికవలనను వుపశమించుట, మరియు స్థిమితముగా కూర్చుండుటవలన వుద్రేకము జెందుట. కీళ్లసంధులు వాచుట, వెచ్చగా నుండుట, బాధగా నుండుట. మేహవాత సంబంధమైన బాధలు మెడలోనికి, గజ్జలలోనికిని, అవయవములలోనికిని ప్రాకుచుండుట. అవయవములు కొయ్యబారి పక్షవాతము వచ్చినట్లగుట. పాదములలో తిమ్మిరలు వచ్చుట.

చర్మము:—యెర్రగా వాచి దురదగా నుండుట. నీటిపొక్కులు, రాచపుండ్లు, మంత్రపుపొక్కులు బయలుదేరుట. మాంసగ్రంథులు వాచుట. మంటతో గూడిన చర్మరోగములు.

నిద్ర:—అర్ధరాత్రమునకుముందుగా నిద్ర పట్టకుండుట. నిద్రలే

మివలనను, అస్థిమితమువలనను అటునిటు కదలుచుండుట. నిద్రిపట్టిన వెంటనే వ్యవహార సంబంధమైన కలలు వచ్చుట.

జ్వరము:—మేహవాత జ్వరము మీద బాగుగా పనిచేయును. యెక్కువ ఎణకు, బాధలు, చెమటలు యుండుట. సాయంకాలమున నీళ్ల విరేచనములతో జ్వరము వచ్చుట. చలిగా నుండుట. చలికిముందు పొడి దగ్గు, ఆవలింతలు వచ్చుట.

వుద్రేకము:—బహిరంగమైన గాలిలో, నిద్రిలో, చల్లదనమువలన, రాత్రియందు, వానకురిసిన పిమ్మట, కుడివైపు పరుండుట వలన.

వుపశమనము:—వెచ్చదనము వలన, వెచ్చని గాలిలో, కదలికవలన.

సహచరులు:— బ్రియోనియా, కాల్కేరియాఫ్లొరు, బొవిష్టా, ఫైటోలక్కా.

విరుగుళ్లు:—ఎనకార్డియం, బెల్లడోనా, కేంఫరు, కాఫీ, లెకిసిస్, గ్రాఫైటిసు, బ్రియోనియా, క్రోటనుటిగ్, సల్ఫరు.

బ్రియోనియా, రానన్కులసు, రోడోడెండ్రాను, యాంటింటార్టు లకిది విరుగుడు.

దీనికి ముందుగాని వెనుకగాని యాపిసును వాడరాదు.

మోతాదు:—3 మొదలు 1000 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 3 మొదలు 6 వారములు.

బాహ్యోపయోగములు:—కీళ్లలోని నొప్పులు వాపులు, నడుములోనినొప్పి, గుత్తెలలోని ఖుణుకునొప్పులు, కండరములలోని నొప్పులకును, మేహవాత సంబంధమైన అన్ని బాపతుల నొప్పులకును, వాపులకును దీనిని స్వచ్ఛమైన మదరుటించరు రూపమున పైకిపట్టించవలెను.

---

## 168. రిసినస్. RICINUS COMMUNIS.

(హిందూదేశపు ఔషధము. 44. ఆముదపుచెట్టు).

ఇది పాలతల్లుల స్తన్యమును వృద్ధిచేయుటలో అగ్రగణ్యమైనది. ఇది అన్నకోశముయొక్కయు, ఆంత్రములయొక్కయు రోగముల మీద కూడ బాగుగా పనిచేయును.

తల:—తలత్రిప్పుగానుండుట. తల వెనుకభాగమునందు నొప్పిగా యుండుట. నిండుగానున్నట్లుండుట.

చెవులు:—ఝుంకారము చేయుచున్నట్లు ధ్వనిగా యుండుట.

నోరు:—నాలుక ఆర్చుకుపోయి తెల్లనిపూతతో యుండుట.

ముఖము:—పాలిపోయి ముడుచుకొనిపోయినట్లుండుట.

అన్నకోశము:—యెక్కువదాహముగాను, మంటగాను యుండుట. ఆకలి లేకపోవుట లేక మందగించుట. వికారము, వమనములు, కలరాలోవలె గొంతుకలో మంటతోనుండు వమనములు, పులితేన్పులు.

పొత్తికడుపు:—వుబ్బరింపుతోనుండు శూల. పొత్తికడుపువ్రేలాడుచున్నట్లుండుట, గురగురలాడుచుండుట, ప్రేగులలో వడివేయుచున్నట్లుండుట. నీళ్లవిరేచనములగునపుడువచ్చు కాళ్లతీత.

మలము, మలాశయము:—విపరీతమైన వమనములు, నీళ్ళవిరేచనములు, రక్తవిరేచనములు. విరేచనములు బాధలేకుండగా వెడలుట. కాళ్లలోను చేతులలోను లాగుచున్నట్లుండు బాధలు. బియ్యపుకడుగు నీళ్లవలెనుండు విరేచనములు.

మూత్రావయవములు:—మూత్రము తక్కువగా వెడలుచుండుట. లేక వెడలుట మానుట.

స్త్రీఅవయవములు:—ఋతువు చాలముందరగాను, స్రావమెక్కువగాను అగుట. తెల్లకుసుమ. స్తనములు, చంకలలోని మాంసగ్రంధులు వాచుట. పాలతల్లులయొక్క స్తన్యమును వృద్ధిచేయును.

జ్వరము:—చెమట యెక్కువగా పట్టుచుండుట. చలితోను, విరేచనములతోను యుండుట.

పోలికలు:— స్తన్యమును వృద్ధిచేయుటలో అల్ఫాల్ఫా, కాల్కేరియా ఫాసు కూడ ఆలోచించ దగినది.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. 3వ పొటెన్సీలో బాగుగా పని చేసినది.

---

## 169 రూమెక్సు. RUMEX CRISPUS

క్షయరోగముమీదను, చర్మరోగములమీదను ఆమత్వాశల దోషముల మీదను ఇది బాగుగా పనిచేయును.

ముక్కు:—ఆరుచుకుపోవుట. మానవటువంటి పొడిదగ్గువలన నిద్ర పట్టకపోవుట. పల్చగాను, నురగతోను, నీళ్ళవలెను యుండు స్రావము యెక్కువగా వెడలుచుండుట. ఈస్రావము తీగవలెను, చిక్కగానుకూడ వెడలుచుండుట. స్వరపేటిక, కంఠనాళము గరుకుగాను, బాధగాను యుండుట.

అన్నకోశము:—నాలుకచివర నొప్పిగా యుండుట. నాలుక పూతతో యుండుట. నిలుచగాయున్న అజీర్ణవ్యాధి. కడుపులోను, ఛాతీలోను పోట్లు వచ్చుచుండుట; ఇవి గొంతుకలోనికి వ్యాపించుచు మాట్లాడుటవలనగాని, కదలికవలనగాని హెచ్చగుట. తాగుడు హెచ్చగుట వలనవచ్చు కామెర్లరోగము. ఎడమరొమ్ముదిగువను భోజనానంతరము నొప్పిగా నుండుట; వుబ్బరముగా నుండుట.

మలము, మలాశయము:—మూలశంఖ. ఆసనములో పుల్లముక్కను వుంచినట్లు భావనతో యుండుట. ఆసనము దురదగా నుండుట. పల్చగా నీళ్ళవలెను, గోధుమ వర్ణము గాను, దగ్గుతోను, వెడలునట్టి విరేచనములు. క్షయరోగముయొక్క ఆఖరు అవస్థలో బాగుగా పనిచేయును.

శ్వాసావయవములు:—గొంతుక దిగువభాగమున గిలిగింతలు పెట్టు చున్నట్లుండుటచే దగ్గు వచ్చుట; చల్లని గాలివలన నిది వుద్రేకము జెందుట. మరియు శరీరము నంతటిని కప్పుకొనుట వలన యిది వుపశమించుట.

చర్మము:—దిగువ అవయవములు విపరీతమైన దురదతో నుండుట, ఇది వస్త్రములను తీసివేసిన పిమ్మటకు లేక బహిరంగమైన గాలిలోను ఘెక్కువగా నుండుట.

వుద్రేకము:—సాయంకాలమున, చల్లని గాలి పీల్చుటవలన, ఛాతీకి యెడమ వైపున.

పోల్చదగినవి:—బెల్లడోనా, కాస్టికం, డ్రాసీరా, ఫాస్ఫరను.

విరుగుళ్లు:—బెల్లడోనా, కేంఫర్, కోనియం, హయాస్యామస్, లెకెసిస్, ఫాస్ఫరస్.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

---

## 170. రూటా. RUTA GRAVEOLENS.

(హిందూదేశపు ఔషధము. 45. సదాపమొక్క).

యెముకల లోపలి వైపుకును, ఉపాస్థికిని, కంటికిని, గర్భాశయము కును, సంబంధించిన రోగములమీద నిది బాగుగా పనిచేయును. కండ్ల నెక్కువగా వుపయోగించుటవలనవచ్చు రోగములు, శరీరమంతయు చితుక కొట్టినట్లు నొప్పిగా యుండుట, కముకు దెబ్బలు (ఆర్నికాకు తరువాత వుపయోగపడును), దెబ్బతగులుట వలనవచ్చు కుంటితనము, కామెర్లరోగ ము, యెముకలు నలుగకొట్టబడుట వలన గలుగు లక్షణములు, యెక్కువ విచారము, నిస్త్రాణ గలుగుట—వీటిని మాన్పును.

తల:—త్రాగినవారిలో తలకు మేకును కొట్టినట్లు బాధగానుండుట. ముక్కునుండి రక్తము స్రవించుట.

కన్నులు:—కండ్లనెక్కువగా వుపయోగించిన పిమ్మట తలనొప్పి వచ్చుట. కుట్టుపని చేయువారికిని సన్నని అచ్చుఅక్షరములను చదువువారికిని కండ్లు యెర్రగాను, వెచ్చగాను, బాధగాను యుండుట (నేట్రంమూరు, ఆర్జంటం నైట్రికం). చదువుట, తదేకదృష్టిగా చూచుట కష్టముగా నుండుట. విడువకుండా చదువుటవలన విసుగువచ్చుట. కనుబొమలపైని యెక్కువనొప్పిగా యుండుట. దృష్టికంగారుగా నుండుట. దూరమున నుండు వస్తువులు మబ్బుగా నున్నట్లు కనబడుట. బహిరంగమైన గాలిలో నీళ్లు కారుచుండుట, క్రొవ్వువత్తిదీపము యెదుట చదువుటవలన కండ్లు మంటగానుండుట.

అన్నకోశము:—అజీర్ణ సంబంధమైన శూల.

మూత్రావయవములు:—మూత్రము విడిచిన పిమ్మట మూత్రాశయమందు నొక్కుచున్నట్లు బాధగానుండుట. మూత్రకోశము నిండుగా నున్నట్లుండుటవలన తరుచు మూత్రానుమానము గలుగుట.

ఆసనము:—ప్రతి విరేచనముతోను మలాశయము వెలుపలకు వచ్చుట. కూర్చుండినపుడు ఆసనములో పొడుచుచున్నట్లును, చీల్చుచున్నట్లును బాధగా నుండుట. విరేచనము బహుకష్టముమీదను, తినుకుటవలనను మాత్రమే వెడలుట. ఒకప్పుడు విరేచన బద్ధముగా నుండుట. మరియొకప్పుడు నురగ, ఆమము, రక్తముతోను కూడిన విరేచనమగుట. దిగువ ఆంత్రములలో పుట్టవ్రణము బయలుదేరుట.

శ్వాసావయవములు:—దగ్గుతో చిక్కని పసుపుపచ్చని స్రావము విస్తారముగా వెడలుట. ఛాతీలో నీరసముగాను, బిగపట్టినట్లును వుండుట.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—మెడ, నడుము, తొడలు; వీటిలో నొప్పులుగా యుండుట. వుదయమున లేచుటకుముందు నడుమునొప్పి యెక్కువగుట. కుర్చీలోనుండి లేచినప్పుడు కాళ్లు తేలిపోవుచును, చట్టలలోను, తొడలలోను, నీరసముగాను యుండుట (ఫాస్ఫరసు, కోనియం). వ్రేళ్లు ముడుచుకొనిపోవుట. చేతులలోను, గుత్తులలోను నొప్పిగా యుం

డుట, కొయ్యబారుట. కాళ్లను చాచుటవలన తొడలలో నొప్పి. కాళ్ళ యొక్కయు, చీలమండలయొక్కయు యెముకలలో నొప్పులు.

వృద్ధికము:—పరుండుట వలన, చల్లదనమువలన, తేమగాలి వలన.

సహచరులు:—కాల్కేరియా ఫాసు.

విరుగుళ్లు:—కేంఫరు.

మెర్క్యూరియసునకిది విరుగుడు.

పోలికలు:—ఫైటోలక్కా, సైలీషియా, ఆర్నికా, రూస్టాక్సు.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—నడచుటవలనను, స్వారిచేయుటవలనను నొప్పిగలిగిన అవయవములకును, పడకరాపడమువలని పుండ్లకును, అధికముగా చదువువారికి లేక కుట్టుపనిచేయువారికిని వచ్చునట్టి కండ్ల నొప్పులను, యెరుపులను, వేడిని మాన్పుటకును, చేతియొక్కయు, కాళ్లయొక్కయు జోళ్లసంబంధమైనట్టియు పుండ్లకును, దీనిని ఔన్సు నీళ్లకు 10 లేక 15 చుక్కల స్వచ్ఛమైన టించరును కలిపి లోషనును తయారుచేసి పైకి వుపయోగించవచ్చును.

---

## 171. సెబాడిల్లా. SABADILLA.

ముక్కుయొక్క ఆమత్వచల దోషములు, కన్నీళ్లకుసంబంధించియుండు మాంసగ్రంధుల దోషములు, పిల్లలలో నీళ్లవిరేచనములు, క్రిమిదోషము-వీటిమీదనిది బాగుగా పనిచేయును. జలుబుమీద వచ్చిన రోగలక్షణములనిది మాన్పును.

మనస్సు:—తనకు జబ్బుగా నున్నదనియు, అవయవములు ముడుచుకొనిపోయినట్లును; కడుపులో వాయువు జేరుటవలన వుబ్బరించుటచే తాను గర్భవతి నైతిననియు, లేక తనకు పుట్టవ్రణము వేసినదనియు అనుకొనుట,

తల:—కూర్చున్న పిదప లేచినచో వికారము, తలనొప్పివచ్చుట. వస్తువులన్నియు తిరుగుచున్నట్లగపడుట. ఆలోచనలవలని తలనొప్పి, నిద్ర లేమి.

కన్నులు:—కనురెప్పలు యెఱ్ఱగాను, మంటగాను యుండుట. నీళ్లుకారుచుండుట. బహిరంగమైనగాలిలో వ్యాయామము చేయుటవలనను కాంతితోనుండు వస్తువులను చూచుటవలనను, దగ్గుటవలనను, ఆవలింతలు వలనను, అవయవములలోవచ్చు బాధల వలనను కన్నీళ్లు వచ్చుచుండుట. దృష్టిమాంద్యము.

చెవులు:—చెవుడు. గిలిగింతలు పెట్టుచున్నట్లుండుట.

ముక్కు:—నీళ్లు కారుచుండుట, అప్పుడప్పుడు తుమ్ములు వచ్చుచుండుట, ముందర వైపు యెక్కువబాధగాను, కండ్లు యెఱ్ఱబడి నీళ్ళుకారుచును వుండుట.

ముఖము:—పైను తాగినపిమ్మట నిప్పులవలె యెఱ్ఱగాను, వెచ్చగాను యుండుట.

గొంతుక:—ఎడమవైపున నొప్పిగా యుండుట. వెచ్చని ఆహార పానీయములవలన లక్షణములుపశమించుట. అరుచికొనిపోయి యుండుట.

నోరు:—పండ్లు పుచ్చుట. పంటిపోటు. వెచ్చని పదార్థములను నోట పెట్టుట కష్టముగా నుండుట. నోరు ఆరుచుకు పోవుట, దాహము లేకపోవుట, తియ్యని లాలాజలము వూరుట.

అన్నకోశము:—పొడిదగ్గు, ఆయాసముతోనుండు శూల. తియ్యని ఆహార పదార్థములను కోరుచుండుట. వెచ్చని పదార్థములను తినగోరుట.

పొత్తికడుపు:—క్రిమిదోషములోవలె శూలవచ్చుట.

మలము, మలాశయము:—విరేచనబద్ధము. విరేచనముకొరకు తొందరగా నుండుట. క్రిమిదోషములోవలె ఆసనముదురదగా నుండుట. గోకిన పిమ్మట మంటగా నుండుట. ఒకమారు ఆసనము, యింకొకమారు ముక్కు

లేక చెవి దురదగానుండుట. నులిపురుగులు, యేలికపాములు తుట్టలు తుట్టలుగా వెలువడుట.

మూత్రావయవములు:—సాయంకాలమున యెక్కువ తీపుతోను, అధికమైన మూత్రానుమానముతోను వుండుట. మూత్రము తక్కువగా వెడలుట. మూత్రము చిక్కగాను, కలిసిపోయిన బాడిసీళ్లవలెను వెడలుట.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ తగ్గుట.

స్త్రీ అవయవములు:—క్రిమిదోషమువలన గలుగు అధికమైన సంభోగేచ్ఛ. ఋతువు ఆలస్యముగాను, స్రావము వచ్చుచును అగుచును యుండుట.

శ్వాసావయవములు:—వూపిరి వెచ్చగా నుండుట, పరుండిన వెంటనే దగ్గు ప్రారంభించుట, ఛాతీలో పొడుచుచున్నట్లుండు బాధతోను స్రావముతోను దగ్గు వచ్చుట.

నడుము, కాళ్ళు, చేతులు:—నడుములో యెడమవైపు కుట్టుచున్నట్లుండు బాధలు. కాలి బొట్టనవేలి గోరుక్రింద వాపుగాను, బాధగాను వుండుట. చేతులుకంపించుట. రాత్రియందు పిక్కలలోచీల్చుచున్నట్లును, లాగుచున్నట్లును బాధగా యుండుట. పాదములు బరువుగా నుండుట.

చర్మము:—కాగితమువలె ఆర్చుకుపోయి యుండుట. యెర్రని చాతికలు, మచ్చలు, చుక్కలు, చలిగాలి వీచుచున్నప్పుడు బయలుదేరుట.

నిద్ర:—పగలు నిద్రపోవలయునని యుండుట. నిద్రమత్తువలన అవయవములను చాచుచు, ఆవలింతలతో నుండుట. యెక్కువఆలోచనవలనను, ఆతురతతో గూడిన కలల వలనను నిద్ర పట్టకుండుట.

జ్వరము:—ఎక్కువ చలిగాను, దాహములేకయును, యుండుట. ముఖము, తల వెచ్చగాను, చేతులు, కాళ్ళు మంచువలె చల్లగాను, చలితోను వుండుట. కంపము వచ్చినప్పుడు కన్నీళ్లు వెడలుచుండుట.

వుద్రేకము:—చల్లదనము వలన, చల్లనిపానీయము వలన, పౌర్ణమికి,

వుపశమనము:—వెచ్చని ఆహారపానీయముల వలన, కప్పుకొనుట వలన.

సహచరులు:—సేపియా.

విరుగుళ్ళు:—పల్సటిల్లా, లైకోపోడియం, కోనియం, లెకెసిస్, కేంఫరు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాలపరిమితి 3 మొదలు 4 వారములు.

---

## 172. సేబల్ సెర్యులేటా—సా పాల్ మెట్టో.

## SABAL SERRULATA—SAW PAL METTO.

మర్మావయవ, మూత్రావయవ సంబంధమైన వ్యాధులమీద నిది బాగుగా పనిచేయును. ప్రాస్టేటుగ్రంధి వాచుట, మూత్రము బహుకష్టముమీద వెడలుట, స్తనములలోని మాంసగ్రంధులు చిన్నవిగా నుండుట. పురుషులలో సంభోగశక్తి తగ్గుట, మూత్రము వెడలునట్టి భగందరము బయలుదేరుట; మూత్రనాళమునుండి పసుపుపచ్చని నీళ్లవంటి స్రావము వెడలుచుండుట, దీనితో సంభోగశక్తితగ్గుచుండుట; ఒకప్పుడు వృషణములు వాచుట, పెద్దవగుట, బాధగానుడుట లేక అండములు యెండిపోవుట లేక యిగుర్చుకుపోవుట; యౌవనవయస్కులలో హస్తప్రయోగాది దురభ్యాసముల వలనను లేక అధిక సంభోగమువలనను వచ్చు నపుంసకత్వము, సంభోగేచ్ఛ లేకపోవుట, సంభోగమందు అయిష్టము జెందుట, నరముల నిస్త్రాణచేత బాధపడుట—ఈలక్షణములమీద నిది బాగుగాపనిచేయును. వృద్ధులలో ప్రాస్టేటుగ్రంధివాచి బాధగా నుండుటను, ప్రాస్టేటుగ్రంధి నుండి స్రావము వెడలుచుండుటను, నిద్రాభంగమును కలుగజేయుచు పలుమారు మూత్రము వెడలుచుండుటను మాన్పును. కొన్ని కేసులలో మూత్రము వెడలకపోవునపుడు కడ్డీ (Catheter) సహాయమున మూత్రము వెలువరింప

బడవలసివచ్చుట. ఇట్టి కేసులలో నిది బాగుగా పనిచేయును. శుక్లనష్టములో దీనిని ఆవీనాసతీవాతో మార్పుచు యిచ్చుటకూడ మంచిది. స్త్రీపురుషుల లో నపుంసకత్వమును మాన్పుటకు దీనిని క్యాలిక్సుసై గార్తో మార్పుచు యిచ్చుట మంచిది.

మూత్రావయవములు:—జీర్ణించిన శెగ. మూత్రకోశము వాపు, బాధ, మూత్రము బంధింపబడుట, ప్రాస్టేటుగ్రంధి వాచుట.

పురుషావయవములు:—సంభోగమందు స్ఖలనమగుచున్నప్పుడు బాధగా నుండుట. మర్మావయవము చల్లగానుండుట.

స్త్రీఅవయవములు:—అండాశయము బాధగాను, వాపుగానుయుండుట. స్తనములు ముడుచుకొని పోయినట్లగుట. నరముల నిస్త్రాణచే బాధపడుచుండుట. సంభోగేచ్ఛ అణచిపెట్టబడుట. స్తనములలోని మాంసగ్రంధులు యెండిపోయి స్తన్యము తక్కువగా వచ్చుట. స్తనములలో బాధగా నుండుట.

మోతాదు:—మదరు టించరు మొదలు 30 పొటెన్సీ. మదరుటించరుకు మోతాదు 5 లగాయితు 15 చుక్కలు.

---

## 173. సేఖరం ఆఫ్. SACCHARAM OFF.

(హిందూదేశపు ఔషధము. 47. చెరుకుబెల్లము).

పులియగొట్టుట, అంత్రములలో నులిపురుగులు, యేటిగపాములు వుత్పత్తియగుట; ఆపనము దురద, దృష్టిమాంద్యము, తెల్లని మడ్డివంటిపదార్థము వెడలుటతో నుండు అతిమూత్రము, కాచబింబము కిరణాభేద్యమగుట, ఎముకలలో నొప్పులు, కీళ్లు వంగకుండుట, నిద్రలేమి, మలబద్ధము, కాళ్లు తేలిపోవుట (తూలుట), అజీర్ణము, ఉబ్బురోగము మున్నగు రోగలక్షణములమీద నిది వుపయోగింప బడతగినదిగా యెంచబడినది. పోత పాలు (డబ్బాపాలు మున్నగునవి) తాగునట్టి బిడ్డలకువచ్చు రోగ

ములు అట్టిపాంలో చేర్చబడిన వంచదాగవలనగలిగినట్లు ఎంచబడుచున్నవి. ఆమవాతములేక మేహవాతము మరియు మధుమేహముతో బాధపడు రోగులు దీనిని ఆహారముగా వుపయోగింపరాదు. స్త్రీలయొక్కయు, బిడ్డలయొక్కయు దీర్ఘవ్యాధులు చాలవరకు బెల్లమును విస్తారము వాడుటవలన గలిగినట్లు డాక్టరు హెరింగ్ గారి అభిప్రాయమని డాక్టరు బోరిక్ గారు సూచించిరి. బెల్లమును మితముగా వాడినచో హృదయముయొక్క కండరములకును శరీరమునకును పుష్టినిచ్చునవనియు, రోగులు కృషిక్కించిపోవుట. రక్తవిహీనత, నిస్త్రాణజెందుట, మున్నగువాటిని మాన్పి, శరీరమునకు బలమును, శక్తిని ఎక్కువ తూనికనుయిచ్చుచు బలవర్ధకౌషధముగా పనిచేయునని డాక్టరు బోరిక్ గారు సూచించిరి. బెల్లముకలసిన పిండివంటలు మున్నగునవి మితముగా భుజించిన యెడల మంచిబలము చేకూరుననుసంగతి మనదేశీయులందరకు విశదమే.

డాక్టరు బర్నెట్టుమున్నగు పాశ్చాత్యహోమియోపతీ వైద్యులయభిప్రాయముల ననుసరించి, విస్తారము వుప్పుగాని, విస్తారము బెల్లముగాని తినువారలకు దృష్టిమాంద్యము, అంతరకుసుములుకూడ రావచ్చునని స్పష్టమైనది. ఈయౌషధము యీదిగువను తెలుపబడిన లక్షణములనుగూడ మాన్పదగినదిగా యెంచబడినది.

మనస్సు:—తెలివితక్కువతనము. మాట్లాడుట కిష్టములేకపోవుట. చిరచిర. తీవ్రతతోగూడిన విపరీతమైన స్వభావము. పైత్యతత్వము. స్త్రీలలో వినయము లేక అణకువస్వభావ మెక్కువగుట. మూలుగుట, ఏడ్చుట, కోపముజెందుట.

తల:—అజీర్ణముతోగూడిన వికారము, తలతిప్పు, మైకమెత్తుట, తలవెంట్రుకలు త్వరితముగా ఎదుగుట. ప్రతివారము, ఒకేదినమున వచ్చుచుండు తలనొప్పులు. చలితోద్వంద్వముగాయుండు తలనొప్పి.

కన్నులు:—అంతరకుసుమలు. దృష్టిమాంద్యము. కండ్లకలకలు. కండ్లు వుబ్బుట లేక వాచుటతో మూసుకుపోవుట.

చెవులు:—చెవులనుండి చీముకారుట.

ముక్కు:—తుమ్ములు వచ్చుట. నీళ్ళుకారుట

ముఖము:—పాలిపోయి, పొంగరించి చావుముఖమువలె కనబడుట. నీరుపట్టుట. ముఖవైఖరి మార్పుజెందుట.

నోరు:—నాలుక పగులుట. నాలుకను బిరుసుగాచేయునంతటి దట్టమైన తెల్లనిపూత. పిల్లలలో, నోటినుండి నీళ్లూరుట.

గొంతుక:—పుండ్లుపడుట.

అన్నకోశము:—జ్వరములో, మానని ఆకలి. తీవ్రమైన వికారము వమనావమానము. తెల్లని చిక్కని ఆమమును వమనముచేసుకొనుట. అజీర్ణము. పులిసినలక్షణములు—ఛాతీలోమంట, పులితేన్పులు, పుల్లని వమనములు. పొట్టవుబ్బరింపు. రక్తవమనములు.

పొత్తికడుపు:—కాలేయము ప్లీహము వాచుట, పెద్దవగుట. పిల్లల పొత్తికడుపు గట్టిగానుండుట.

మలము, మలాశయము:—ఆసనము దురద, వాపు, బాధతోగూడిన మూలశంఖ. మలబద్ధము. వకసారి మలబద్ధము, వకసారి జిగటతోగూడిన పలుచని విరేచనములు విరేచనములు, నీళ్లవలెను రక్తముతోను, లేక జిగటరక్తముతోగూడియు, లేక నిస్త్రాణను గలుగజేయుచు వెడలుట.

మూత్రావయవములు:—అంసఫలకముకుదిగువగా,మూత్రపిండముల నుండి భుజములలోనికి మంటతోగూడిన పోట్లుపొడుచుట. మూత్రమెక్కువగాను, తెల్లనిమడ్డితోకలిసియు, గాఢమైనవాసనగాను వెడలుట. కొందరిలో మూత్రము తక్కువగా వెడలుట.

పురుషావయవములు:—తరుచుగాను అప్రియత్నముగాను స్ఖలనమగుచుండుట. సంభోగకోర్కె హెచ్చుట. అండకోశముఎక్కువగావాచుట.

స్త్రీఅవయవములు:—కుసుమ అణచిపెట్టబడుటవలన దోషములు. ఋతుస్రావము తక్కువగా వెడలుట. ఋతురక్తము పాలిపోయిన రంగుగానుండుట.

శ్వాసావయవములు:—పసుపుపచ్చగను వుప్పగను శ్లేష్మము వెడలుట. పొడిదగ్గు. పిల్లలలోదగ్గు, శ్వాసకష్టముగా నుండుట. శ్వాసావయవమునందలి కండరములు రొయుండుట లేక చిన్నవగుట. ఛాతీలో కుడివైపున కుట్టుచున్నట్లు బాధ. ఛాతీలోని కండరములు రొయుండిపోవుట.

హృదయము:—ఆమవాతనొప్పులు, వక్రిమైనట్టి లేక నిస్త్రాణజెందిన నాడి.

కాళ్ళు చేతులు:—తిమ్మెర్లు, చేతులు, తొడలు చిక్కిపోవుట. ముంజేతులకు, దిగువఅవయవములకు నీరుపట్టుట. దిగువఅవయవములకు, పక్షపాతములోవలె ఎక్కువైన నిస్త్రాణ. పిక్కలులాగుట, దిగువఅవయవములు రాళ్లవలె గట్టిపడుట.

చర్మము:—ఆర్చుకుపోవుట. చమటనణచిపెట్టుటవలని దోషములు. గోరుచుట్టు, చర్మముపై పొలిపోయిన లేక యెర్రమచ్చలు బయలుదేరుట.

నిద్ర:—నిద్రనుండి ఉలికిపడిలేచుట. నిద్రలేమి.

జ్వరము:—వుదయము 10 గంటలులగాయితు సాయంకాలము వరకు చలి. విచారగ్రస్తముగానుండుట. జ్వరము తగ్గినపిదపవచ్చు తలనొప్పి. అమితఆకలి,క్షయరోగము.వకసారిచలి, వకసారిఅతిచమట.జలుబు.తలమీదను, మెడమీదను, భుజములమీదను, చమటలుపట్టుట. పాలీజ్వరము. దినమువిడిచి దినము లేక రెండు దినములు విడచి మూడవదినము లేక; మూడుదినములు విడచి నాల్గవదినము ఇట్లు వక పద్ధతిలేకుండగ వచ్చుచుండుట. వకసారి చలి, వకసారి చెమటలుపోయుట. చలి నడుములో ప్రారంభించి, క్రిందకు వ్యాపించి, ఎక్కువ తలనొప్పి, వమనానుమానము గలుగుట. జ్వరము వుపశమించిన తలనొప్పి, వెర్రిఆకలి వేయుట.

పోల్చదగిన యితరమందులు లక్షణములు:—పాలపంచదార అనబడు "సుగర్ ఆఫ్ మిల్కు"-ఎక్కువగా మూత్రము వెడలుట, మంచుగడ్డతో చేయబడిన సూదులుగుచ్చుచున్నట్లువలెబాధ, శారీరకమైననిస్త్రాణ,

అంత్రములు దుస్థితి చెందుట, మలబద్ధము; కాల్కేరియాకార్బ—పిల్లలకు దొడ్డికాళ్లుపడుట, పులియగొట్టుట, శరీరమునందు క్రొవ్వు ఎక్కువగా పెరుగుట; అర్జెంటంనైట్రికం, సల్ఫరు,—తీపివస్తువులను కోరుట; సైలీషియా లేక సిలికా—దొడ్డికాళ్ళుపడుట, అర్జెంటంనైట్రికం-మధుమూత్రము, చీలమండలు వుబ్బుట; శాంటాలినం—మూత్రపిండములలో బాధ.

వుద్రేకము:—వుదయమున, క్రోధమువలన.

వుపశమనము:—నిబ్బరముగా కూర్చుండుటవలన ఆయాసము వుపశమించుట.

మోతాదు:—30 పొటెన్సీయున్ను, ఇంతకు పైపొటెన్సీలును.

---

## 174. సెబీనా. SABINA.

నిలువగాయున్న స్త్రీలరోగములు, మేహవాతనొప్పులు, 3 వ నెలలో గర్భస్రావసూచనలు, గర్భాశయ రక్తస్రావములు—వీటిమీద నిది బాగుగా పనిచేయును.

మనస్సు:—సంగీతమును భరింపలేకపోవుట. సంగీతమువలన నరములకు వుద్రేకము గలుగుట (గ్రాఫైటిసు, నేట్రంకార్బ, యాసిడ్ ఫాస్, సేపియా, తూజా). జ్ఞాపకశక్తి తగ్గుట. అజాగ్రతగానుండుట.

తల:— తలకును, ముఖమునకును, రక్తపరిసరణ మెక్కువగా నుండుట. వమలుచున్నప్పుడువచ్చు పంటినొప్పి. ఋతువు అణచిపెట్టబడుటవలనవచ్చు వికారము. బిగ్గలగు చున్నట్లుండెడి తలనొప్పి, యిది ఆకస్మికముగావచ్చి నెమ్మదిమీద తగ్గుట.

కన్నులు:— వెచ్చగాను, మంటగాను, మబ్బుగాను వుండుట.

చెవులు:—వినపడకపోవుట, కుట్టుచున్నట్లుండుట.

నోరు:—అర్చుచుపోయి దుర్వాసనతో నుండుట. యెర్రని లేక

తెల్లని లాలాజలముపూరుట. మాట్లాడుటవలన నిది నురగగా నగుట.

అన్నకోశము:—అజీర్ణమువలన గుండెలలో మంట, రుచి చేదుగా నుండుట. "లెమనేడ్" యందు కోరికతోనుండుట.

పొత్తికడుపు:—ముడుచుకొని పోవుచున్నట్లు బాధగా నుండుట. వుబ్బరించియుండుట. దిగలాగుచున్నట్లుండుట. సజీవముగా నున్న దేదియో కదలుచున్నట్లు భావనయుండుట.

మలము, మలాశయము:—మూలశంఖునుండి విస్తారముగా నిగనిగలాడుచుండు యెర్రని రక్తము స్రవించుట. నడుములోనుండి మర్మావయవములోనికి వ్యాపించునట్టి బాధలు. మలాశయము నిండుగానున్నట్లును విరేచనబద్ధముగాను యుండుట.

మూత్రావయవములు:—మూత్రపిండములలో మంటగాను. బాధగానువుండుట. రక్తముతోగూడిన మూత్రము వెడలుట. యెక్కువ మూత్రానుమానము గలుగుట. మూత్రద్వారము వాపు. మూత్రకోశము వాపువలన బాధలు శరీరమంతటను వ్యాపించుట.

పురుషావయవములు:—వాపు, బాధ, చీమువంటి స్రావముతో గూడిన శగ. శిశ్నాగ్రచర్మము బాధగాను, వెనుకకు తీయుటకు కష్టముగాను వుండుట. సంభోగేచ్ఛ యెక్కువగుట.

స్త్రీఅవయవములు:—ఋతుస్రావ మెక్కువగాను, నిగనిగలాడుచును వెడలుట. బహిష్టుకు బహిష్టుకుమధ్య స్రావము గలుగుచుండుట. గర్భస్రావ సూచనలు గలుగుట. ఒరుపును గలుగజేయుచు దుర్వాసనతో నుండు కుసుమ బహిష్టుకుపిమ్మట గలుగుట. మావి వెలువరింపబడకపోవుట. ప్రసవానంతర నొప్పులు యెక్కువగా వచ్చుట. గర్భస్రావము గలిగిన వెంటనే ఎడతెగని ఋతుస్రావము గలుగుట. గర్భాశయము, అండాశయము వాచుట, బాధగానుండుట. ముద్దలుముద్దలుగా వెడలునట్టి స్రావముకదలికవలన వుద్రేకము జెందుట. గర్భాశయము నిస్సత్తువగా నుండుట.

**నడుము, కాళ్ళు, చేతులు:**—నడుములో పక్షవాతములోవలెబాధ

గానుండుట. తొడలలో ముందర వైపు చితుకకొట్టినట్లుండు నొప్పులు. కీళ్లలో మేహవాతనొప్పులు; యివి వెచ్చని గదిలో వుద్రేకము జెందుట. మేహవాత వాపులు యెగ్రగా నిగనిగలాడుచుండుట.

చర్మము:—వులిపిరికాయలు లేక చమటకాయలు బయలుదేరుట. యెక్కువదురద మంటతోనుండు వులిపిరికాయలు. బాధగానుండు ప్రదేశము తాకుటవలన మంటగా నుండుట.

వుద్రేకము:—కదలికవలన, వెచ్చదనమువలన, వెచ్చనిగాలిలో.

వుపశమనము:—పరిశుభ్రమైన చల్లనిగాలిలో వుపశమించును.

సహచరులు:—తూజా.

విరుగుళ్ళు:—పల్సటిల్లా.

పోలికలు:—మిల్లిఫోలియం, ఇపెకాక్, క్రోకస్.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీనిని వులిపిరికాయలకు స్వచ్ఛమైన టించరు రూపమున పైకి పట్టించిన నవి మానును. దీనిగుణ కాల పరిమితి 3 లేక 4 వారములు.

---

## 175. శ్యాలిక్సు నైగ్రా. SALIX NIGRA.

స్వప్నస్ఖలనములను మాన్పుటలో నిది అగ్రగణ్యమైనది. సంభోగ సంబంధమైన వుద్రేకము అధికముగా నుండుట, నపుంసకత్వము, శుక్లనష్టము, ముష్టిమైధునము; శగరోగముయొక్క ప్రథమావస్థ, దీనితోనుండు అధికమైనసంభోగేచ్ఛ; స్త్రీలలోహిస్టీరియాలేక అపస్మారగము, మరియు అధికమైన సంభోగేచ్ఛగలుగుట, నరముల నిస్త్రాణగలుగుట—వీటిమీద నిది బాగుగా పనిచేయును. యెల్లప్పుడును శృంగార సంబంధమైన ఆలోచనలు, కలలు వచ్చుచుండుటను ఇట్టి విషయములవలన శరీరము, మనస్సు పాడగుటను, ఒకప్పుడు పిచ్చి యెత్తుటనుకూడ నిది మాన్పును. దీనిని వా

డుటవలన నరముల వుద్రేకము, స్ఖలనములు తగ్గి, శారీరమానసిక బలము వృద్ధిపొంది, ఆరోగ్యము కలుగును.

స్త్రీ అవయవములు:—బహిష్టులో నరముల వుద్రేకము యెక్కువగుట. అండాశయములో నొప్పిగా యుండుట. ఋతుశూల. బహిష్టుకు బహిష్టుకు మధ్య స్రావములు గలుగుట. కుసుమ.

నపుంసకత్వమునకు దీనిని అవినాసతీవాతోను, సీబల్ సెర్యులేటాతోను మార్చుచు యిచ్చుటవలన మంచి గుణము గలుగును.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ. మదరుటించరును మోతాదుకు 10 లగాయతు, 15 చుక్కలువరకు వాడవచ్చును.

---

## 176. శాంబూకస్. SAMBUCUS.

శ్వాసాయువ రోగములమీదను, పుబ్బులమీదను, చెమటతో నుండు యితర రోగలక్షణములమీదను యిది బాగుగా పనిచేయును. అదివరలో పుష్టిగానుండువారు అకస్మికముగా క్షీణించుట (అయోడియం, ట్యూబరూక్యులినం) ను మాన్పును.

మనస్సు:—కండ్లు మూసికొనినపుడు ప్రతిమలు కనబడుట. భయకంపితముగా నుండుట. ఊపిరాడకపోవుటతోనుండు భయము.

ముఖము:—రగ్గుటవలన నీలిరంగుగా నగుచుండుట. ఎఱ్ఱబారి మంటగాను, పొక్కులతోయుండు దౌడలు. ముఖము వెచ్చగాను, చెమటతోను యుండుట.

పొత్తికడుపు:—వికారముతోను, వుబ్బరింపుతోను యుండుశూల.

మలము, మలాశయము:—నీళ్లవలెను, ఆమముతోను తరుచు విరేచనములగుచుండుట.

మూత్రావయవములు:—మూత్రము నిస్సారముగా వెడలుట. చర్మము ఆర్చుకుపోయి వెచ్చగానుండుట. మూత్రము తరుచుగాను, కొద్దికొద్దిగాను వెడలుట.

శ్వాసావయవములు:—శ్వాస ఆడకపోవుట. వికారముగానుండుట. అర్ధరాత్రియున వూపిరి ఆడకుండ వచ్చునట్టి దగ్గువలన యేడ్పువచ్చుట. పిల్లలకు ముక్కు దిబ్బడవేయుట, అరుచుకొని పోయినట్లుండుట. ముక్కు దిబ్బడవేయుటవలన స్తన్యమును బిడ్డ విడువకుండ త్రాగుట కష్టముగా నుండుట. వూపిరాడకపోవుటవలన బిడ్డ ఆకస్మికముగా లేచి కూర్చుండుట. మరియు బిడ్డ నీలివర్ణముగా నగుట. వూపిరి విడచుట కష్టముగా నుండుట. దగ్గువలన వుక్కిరిబిక్కిరియగుట. బిడ్డ వూపిరిని తీసికొనగలిగినను విడుచుటకు కష్టపడుట.

కాళ్లు, చేతులు:—చేతులు నీలిరంగుగా నగుట. పాదములు, మీగాలు (Instep) ఇవి నీరుపట్టుట లేక వుబ్బుట. పాదములు మంచువలె చల్లగానుండుట. రాత్రియందు నిస్త్రాణనుగలుగజేయునట్టి చెమటలుపట్టుట.

చర్మము:—నిద్రలో చర్మము వెచ్చగా నుండుట. పొంగరించుట లేక వాచుట. శరీరమున కంతటికిని నీరుపట్టుట లేక వుబ్బుట. మెలకువ వచ్చుసరికి చెమటతో నుండుట.

జ్వరము:—కప్పుకొనిన బట్టనుతీసివేయుటకు భయపడుట. తెల్లవారగట్ల శరీరమందంతటకు విస్తారముగా చెమటలు పోయుట. జ్వరము వచ్చుటకుముందు బాధకరముగా నుండు పొడిదగ్గు వచ్చుట.

వుద్రేకము:—నిద్రవలన, విశ్రాంతివలన, పండ్లను తినుటవలన.

వుపశమనము:—పడకమీద కూర్చున్నప్పుడు, కదలికవలన.

విరుగుళ్లు:—ఆర్సెనికంఆల్బమ్, కేంఫర్.

"ఆర్సెనికం ఆల్బము" ను యెక్కువగా వాడుటవలన వచ్చు రోగముల నిది మాన్పును.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 3 లేక 4 వారములు.

---

## 177. శాంగ్వినేరియా. SANGUINARIA.

కుడివైపు అవయవములకువచ్చు రోగములమీదను, ఆమత్వచల యొక్క దోషములమీదను యిది బాగుగా పనిచేయును. ఉదయమునప్రారంభించి, దినమంతయును, సాయంకాలమువరకును హెచ్చుచు, సాయంకాలమున తగ్గునట్టియు, తల బ్రిద్దలగుచున్నట్లుండునట్టియు, కండ్లు వెలుపలకు తోయబడుచున్నట్లుండునట్టియు, నిద్రవలన వుపశమించునట్టియు, తలనొప్పికియిది బాగుగా పనిచేయును. అరిచేతులలోను, అరికాళ్ళలోను మంటలు, శరీరమునకు తరుచు వెచ్చని తగులుచుండుట, ఛాతీకి, తలకు రక్తమెక్కువగా జేరుచుండుట, ముట్లుడుగు కాలమందు వచ్చు రోగలక్షణములు, మంటలు గాయున్నట్లు భావన గలుగుచుండుట, పిషపడిశెముకు సంబంధించిన దగ్గు, క్షయరోగ లక్షణములు. శ్వాసావయవములనుండి వెడలునట్టి స్రావము ఆకస్మికముగా కట్టిపోయి నీళ్ళవిరేచనములగుట, శరీర మందంతటను మంటగానుండుట—ఇవి దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—కోపముగా నుండుట. వమనము అగుటకు ముందు ఆతురత, భయముగలుగుట.

తల:—ఎండవలన కుడిపార్శ్వమున నొప్పివచ్చుట. నియమితకాలములందు వచ్చు తలనొప్పులు. పరుండుటవలనను, నిద్రవలనను తలనొప్పి వుపశమించుట. ముట్లుడుగుకాలమందును ప్రతి 2వ దినమునను తలనొప్పి వచ్చుట, కండ్లు మంటగా నుండుట. ముచ్చిలగుంటలో మెరపుతీగవలె వచ్చు తలనొప్పి.

ముఖము:—పొంగరించుట. పార్శ్వపునొప్పివలని బాధలు పైదౌడ నుండి అన్నివైపులకును వ్యాపించుట. దౌడలు ఎఱ్ఱగాను, మంటగాను యుండుట. క్షయసంబంధమైన పొంగరింపు.

ముక్కు:—దుర్వాసనతో నుండు పసుపుపచ్చని స్రావము. కాయలు (Polypi) బయలుదేరుట. పడిశెము మానినపిదప నీళ్లవిరేచనములు వచ్చుట.

చెవులు:—మ్రంటగానుండుట. ధ్వనులు వినపడుట. చెవిపోటుతో తలనొప్పి వచ్చుట. కాయలు (Polypi) బయలుదేరుట.

గొంతుక:—కుడివైపు యెక్కువగా వాచుట, ఆరుచుకు పోవుట.

అన్నకోశము:—వెన్నయందయిష్టత, ఎక్కువ దాహము, వికారము, వమనములు, మంట. పైత్యరసమును వుమియుచుండుట.

పొత్తికడుపు:—కాలేయమువద్ద వాపుగానుండుట. పల్చగాను వడిగాను వెడలునట్టి పైత్యసంబంధమైన విరేచనములు. మలాశయములో పుట్టువ్రణము బయలుదేరుట.

పురుషావయవములు:—వరుసగా 2 రాత్రిలయందు స్ఖలనములగుట; దీనివలన రోగి సౌఖ్యమును జెందుట. నిలువగాన్న సెగరోగము. సవాయివ్యాధి.

స్త్రీఅవయవములు:—దుర్వాసనగాను, ఒరుపును గలుగజేయుచు వెడలునట్టి కుసుమ. ఋతుస్రావము యెక్కువగాను, దుర్వాసనగాను వెడలుట. స్తనములలో నొప్పిగాను, తీపుగాను వుండుట. ఋతువుఆగిచిపెట్టబడుట. బహిష్టుకు బహిష్టుకు మధ్య స్రావము గలుగుచుండుట, ఋతుశూల వచ్చుచుండుట. ముట్లుడుగుకాలమందు వచ్చు రోగలక్షణములు.

శ్వాసావయవములు:—అజీర్ణదోషముతో గూడిన దగ్గు; ఇది త్రేణుపులు వచ్చినపిమ్మట వుపశమించుట, జలుబుచేయుటవలన దగ్గు వచ్చుచుండుట, అజీర్ణముతో ద్వంద్వముగానుండు వుబ్బసము (నక్సువామికా).

కాళ్లు, చేతులు:—కుడిభుజములోను, ఎడమచట్టలోను ముచ్చిలిగుంటలోను వచ్చు మేహవాతనొప్పులు. అరిచేతులలోను, అరికాళ్లలోను మంటలుగా నుండుట. కుడివైపుఅవయవములలో వచ్చు నరముల సంబంధమైనబాధలు తాకుడువలన వుపశమించునప్పుడిది పనిచేయును.

ఉద్రేకము:—కుడివైపున, కదలికవలన, తాకుడువలన,

ఉపశమనము:—ప్రొద్దుని ఆహారపదార్థములను తినుటవలన, నిద్ర వలన, చీకటిలో.

సహచరులు:—యూంటిమోనియం టార్టారికం.

నల్లమందు, రూస్టాక్సు—వీటిదోషములకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.



## 178 సార్సపరిల్లా. SARSAPARILLA.

(హిందూదేశపు ఔషధము. 48. పాలసుగంధి)

సుఖరోగములవలన రోగి క్షీణించిపోవుట, మూత్రసంబంధమైన కడుపునొప్పి, టీకాలవలనను లేక వేసవిలోను వచ్చు కురుపులు లేక మంత్రిపుపొక్కులు, చర్మము ముడతలు పడుట, సవాయిరోగము వలనను, అణచిపెట్టబడిన శగరోగము వలనను, రసదోషముల వలనను వచ్చు తలనొప్పులు, యెముకలలోని నొప్పులు; చిన్నపిల్లలు ముదిరిన ముఖముతోను, పుబ్బిన పొట్టతోను, పొడిగాను వాపుగానుయుండు చర్మముతోను యుండుట, రసదోషమువలనగాని, సవాయిసంబంధమైనట్టిగాని పుండ్లు బయలుదేరుట—వీటిమీద నిది బాగుగా పనిచేయును.

మనస్సు:—సులభముగా కోపమువచ్చుట. విచారముగా నుండుట.

తల:—బాధవలన రోగి కుంగిపోవుట. ముచ్చిలగుంటనుండి బాధలు కండ్లలోనికి వ్యాపించుట. ముఖముమీదను, పైపెదవిమీదను పొక్కులు బయలుదేరుట. తలమీద తేమతోనుండు పొక్కులు బయలుదేరుట.

నోరు:—నాలుకపై తెల్లనిపూత, చొంగకారుచుండుట. లాలాజలమెక్కువగా వూరుచుండుట, దాహము లేకపోవుట. దుర్వాసన

అన్నకోశము:—ప్రొద్దుని వమనము, ముడుచుకొనిపోవు నట్లుండు

నొప్పి. రొట్టెను తినినపిమ్మట వెచ్చగాను, మంటగాను యుండుట (బ్రియోనియా, పల్సటిల్లా).

పొత్తికడుపు:—గుడగుడలాడుచుండుట, శూల, నడుములోనొప్పి ఒకేసారి యుండుట. వాయువు యెక్కువగా జేరుట. పిల్లల కలరావ్యాధిలో నిది బాగుగా పనిచేయును.

మలము, మలాశయము.—విరేచనముకొరకు యెక్కువ తొందర పడినను, మలము కొద్దిగాను, గట్టిగాను వెడలుట. యెక్కువ విరేచన బద్ధముతోను, తరుచు మూత్రానుమానముతోను యుండుట. రక్తవిరేచనములు. విరేచమగునప్పుడు సొమ్మసిల్లుట.

మూత్రావయవములు:— మూత్రము కొద్దిగాను, ఆమముతోను, రక్తముతోను, యిసుకవంటి పదార్థముతోను, చిన్నచిన్న రాళ్లతోను వెడలుట. కూర్చున్నప్పుడు మూత్రము చుక్కలు చుక్కలుగా వెడలుట. మూత్రకోశము బాధగాను, వాపుగానుయుండుట. మూత్రము విడచుటకు ముందును, మూత్రమువిడచునప్పుడును బిడ్డయేడ్చుట. బిడ్డయొక్క పక్క గుడ్డలో మూత్రము సంబంధమైన ఇటుకపొడివంటి పదార్థము కనబడుట. బిడ్డయొక్క మూత్రనాళములోపోటు, మూత్రము చుక్కలుచుక్కలుగా పడుట. కుడిమూత్రపిండమునుండి బాధ దిగువకు వ్యాపించుట.

పురుషావయవములు:—రక్తము, వీర్యముస్ఖలనమగుట. మర్మావయవములు యెక్కువ దుర్గంధముతో నుండుట. దురదతో గూడిన చర్మరోగము బయలుదేరుట. సవాయి సంబంధమైన పుండ్లు, మరియు ఎముకలలో నొప్పులు.

స్త్రీ అవయవములు:—చన్మొనలు చిన్నవగుట, ముడుచుకు పోవుట, బహిష్టుకుముందు నుదిటిమీద దురదతోనుండు నీటిపొక్కులు బయలుదేరుట లేక కుడితొడలో తేమతోనుండు పొక్కులు బయలుదేరుట. ఋతువు ఆలస్యముగాను, స్రావము తక్కువగాను అగుట.

కాళ్ళు, చేతులు:—చీల్చుచున్నట్లుండు పక్షవాత సంబంధమైన

బాధలు. కాళ్లు చేతులు వణకుట. వేళ్ల పక్కలను, బొటనవేళ్లలోను మంటలు బయలుదేరుట వేళ్లచివర పుండ్లు పడుట. మేహవాతనొప్పులు, ఎముకల సంబంధమైన నొప్పులు వుద్రేకము జెందుట. శగవ్యాధివలనవచ్చు మేహవాత నొప్పులు.

చర్మము:—క్షీణత్వమువలన ముడతలుపడిఆర్చుకుపోయియుండుట. పొక్కులతోను, పుండ్లతోను నిండియుండుట. బహిరంగమైన గాలిలో దురదతోనుండు యెర్రని దద్దుర్లుబయలుదేరుట. చేతులయొక్కయు, పాదములయొక్కయు చర్మము బీటలుదీయుట. చర్మముగట్టిపడుట. లేక దళసరెక్కుట. వేసవికాలపు చర్మరోగములు.

వుద్రేకము:—రాత్రియందలి తేమగాలిలో, మూత్రవిసర్జనానంతరమున, బహిష్టుకు ముందర.

సహచరులు:—మెర్క్యూరియసు, సేపియా.

పోలికలు:—బెర్బెరిసువల్గారిసు, లైకోపోడియం, నేట్రంమూరు, పెట్రోలియం, సర్యురస్ సెర్నూస్.

విరుగుళ్లు:—బెల్లడోనా, మెర్క్యూరియసు.

మోతాదు:— 3 మొదలు 200 పొటెన్సీ.

---

## 179. సర్యురస్ సెర్నూస్. SAURURUS CERNUUS.

మూత్రకోశములోను, మూత్రనాళములోను వాపు, బాధ, చిరచిరగానుండుట. మూత్రము చుక్కలు చుక్కలుగా వెడలుట. ప్రొస్టేటుగ్రంధి వాచుటను, బాధగా నుండుటను మాన్పును.

మోతాదు:—మదరుటించరు. మోతాదుకు 10 చుక్కలు.

## 180. సెకేలే. SECALE CORNUTUM.

పల్చగాను, నిస్త్రాణతోను, చిరచిరలాడుచు, పాలిపోయిన ముఖము తోనుండు వృద్ధులయొక్కయు, ముఖ్యముగా స్త్రీలయొక్కయు రోగముల మీదనిది బాగుగాపనిచేయును. 3 వమాసమునందు వచ్చునట్టి గర్భస్రావ మును ఆపుచేయును. త్వరితముగా ప్రసవమగునట్లు చేయును. గర్భస్రావ లక్షణముల విషయములో, వైబర్నంఆఫ్యులసు, యాపిసు, కాలీకార్బ, క్రోకసు, సెబీనా, తూజా, సేపియా—వీటియొక్క లక్షణములనుగూడ యోచించుట మంచిది.

మనస్సు:—ఇంద్రియజ్ఞానము తక్కువ. భయముతోనుండుట.

తల:—తలవెంట్రుకలూడిపోవుట, వికారము,తలనొప్పి,మాంద్యము.

కన్నులు:—లోతునపడి, దృష్టిమాంద్యముతో నుండుట. ప్రారంభ దశలో నున్నట్టిగాని, వృద్ధాప్యములో వచ్చునట్టిగాని, అంతరకుసుమలకు, ముఖ్యముగా నివి స్త్రీలలో గలిగినప్పుడు ఇది పనిచేయును.

చెవులు:—చెముడు. చెవులలో హోరు.

ముక్కు:—నల్లని రక్తము కారుచుండుట. తుమ్ములు.

ముఖము:—పాలిపోయి ముడుచుకుపోయినట్లుండుట. కంపములు ముఖములో ప్రారంభించి శరీరమంతటకును వ్యాపించుట. చిన్నదియగుట. చావుముఖమువలె నగుట.

నోరు:—నాలుక తెల్లనిపూతతోను, ఆర్చుకొనిపోయి బీటలతోను, మంటలుగాను, మొద్దుబారియు యుండుట. లాలాజల మెక్కువగా వూరు చుండుట. దుర్వాసన వచ్చుచుండుట. నాలుకకు పక్షవాతము వచ్చినట్లు మాటసరిగా రాకుండుట.

గొంతుక:—ఆర్చుకుపోయినుంటగాను, దాహముగాను యుండుట.

అన్నకోశము:—విపరీతమైన ఆకలి, తీరనిదాహము,పైత్యరసమును వమనము చేసుకొనుట, రక్తస్రావమగుట, బరువుగా నుండుట.

పొత్తికడుపు:—రాయి పెట్టినట్లు బరువుగా నుండుట. మంటగాను, బాధగాను, పొంగరింపుతోను యుండుట. కాలేయము వాచుట, బాధగా నుండుట, కుళ్లనారంభించుట. కంపములతో నుండు శూల.

మూత్రావయవములు:—మూత్రకోశమునకు పక్షవాతము వచ్చుట. మూత్రము నిలువగాయున్నను, మూత్రానుమానము, కలిగినను మూత్రము మాత్రము వెడలకపోవుట. వయోవృద్ధులలో అప్రయత్నముగా మూత్రము వెడలుట. మూత్రకోశమునుండి రక్తము స్రవించుట.

మలము, మలాశయము:—మలము కంపములతోను, శరీరమందు చల్లదనముతోను, కలరాలోవలెను, ఆకుపచ్చగాను, జిగురుగాను, దుర్వాసనతోను, రక్తముతోను బహునిస్త్రాణను కలుగజేయుచును వెడలుట. విరేచనము అప్రయత్నముగా నగుట.

పురుషావయవములు:—సంభోగానంతరము పలుమారు లేపనముగలుగుచుండుట. అధికసంభోగమువలనవచ్చు గుండెదడ. నిస్త్రాణనుగలుగజేయు సంతతి సంభోగమువలన జ్ఞాపకశక్తి పాడగుట. నపుంసకత్వము.

స్త్రీఅవయవములు:—గర్భాశయ రక్తస్రావములు (ఎలటిరిసుఫేరినోసా, చైనా, హెలోనియాసు, సార్సపరిల్లా) కదలికవలన వుద్రేకము జెందుట. 3 వ నెలలో గర్భస్రావ సూచనలుగలుగుట (వైబర్నంఆప్యులస్, క్రోకసు, సెబీనా). ప్రసవానంతరము మైల సరిగా వెడలక పోవుట. మావి పడకపోవుట. గర్భస్రావమునకు పిమ్మట గర్భాశయము సరిగా ముడుచు కొనకపోవుట, మరియు దుర్వాసనతోనుండు చిక్కనిస్రావము వెడలుట. ప్రసవవేదనలో దిగలాగుచున్నట్లు బాధలెక్కువగా యుండుట. నొప్పులు కొలది కొలదిగాను, మానుచు, వచ్చుచునుయుండుట. మరియు రోగిసొమ్మసిల్లి పోవుట. ప్రసవానంతరము మూత్రము వెడలకపోవుట. ప్రసవానంతరమునవచ్చు కంపములను మాన్పును.

శ్వాసావయవములు:— కంఠధ్వని తెలియనట్లును, నత్తిమాట్లాడు చున్నట్లును యుండుట. తరుచు యీడ్పులు వచ్చుచుండుట. వూపిరిపీల్చు

టికు రెక్కవయత్నము చేయుటవలన రక్తస్రావముగలుగుట, యెక్కిళ్లు.

హృదయము:—గుండెదడ. నాడిచురుకుగాను, చిన్నదిగాను విడిచి విడిచి కొట్టుచును యుండుట.

కాళ్లు, చేతులు:—పిక్కలు లాగుచుండుట. అవయవములు మొద్దుబారుట. కంపములు వచ్చుచుండుట. అవయవములు మొద్దుబారి పురుగులు ప్రాకుచున్నట్లుండుట. చేతులు, పాదములు మంటలుగాయుండుట.

చర్మము:—ముడుచుకొనిపోయి, మొద్దుబారియుండుట. పొడిగాను, నల్లబడుచు, కుళ్ల నారంభించుట. తాకుటకుచల్లగానున్నను కప్పుకొనుటను భరింపలేకుండుట. వేడిని ఓర్చుకొనలేకుండుట.

జ్వరము:— చలి; చర్మము చమటగాను, చల్లగానువుండుట.విస్తారము దాహముతోనుండుట. లోపలిఅవయవములువెచ్చగానుండుట. మన్యపుజ్వరముయొక్క 3 దశలమీదను బాగుగా పనిచేయును.

ఉద్రేకము:—వెచ్చదనమువలన, వెచ్చదనమునిచ్చు దుస్తులను ధరించుటవలన, బహిష్టులో.

ఉపశమనము:—చల్లగాలిలో, చల్లదనమువలన, కప్పుకొనిన వస్త్రములను తీసివేయుటవలన, మర్దనమువలన.

విరుగుళ్లు:—కేంఫరు, ఓపియం, స్పాంజియా.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. చిన్నపొటెన్సీలు గర్భాశయము ముడుచుకొనునట్లు చేయుటకును, సుఖప్రసవమునకును, మావిని వెలువరించుటకును రక్తస్రావమును కట్టుటకును బాగుగా ఉపయోగపడును. దీని గుణకాలపరిమితి 2 లేక 3 వారములు.

---

## 181. సెనీగా. SENEGA.

ఇది శ్వాసావయవములయొక్క అమిత్వేచలదోషములమీదను కంటికి వచ్చు పక్షవాతసంబంధమైన రోగలక్షణములమీదను పనిచేయును. ఉఛ్వాస

రోగములో కళ్లి చిక్కగావుండి తెగిపడకుండ వున్నప్పుడును, ఆయాస మెక్కువగా వున్నప్పుడు దీనిని వాడవలయును.

మనస్సు:—దెబ్బలాగవలయునని వుండుట.

తల:—భారముగాను, దృష్టిమాంద్యముతోను వుండుట. నుదిటిలో బిగ్గిదలగుచున్నట్లు నొప్పిగా యుండుట.

కన్నులు:—వస్తువులు నీడలోయున్నట్లు కనబడుట. ఆర్చుకొనిపోయు, కనుగుంటలకంటె గుడ్లు పెద్దవైనట్లుతోచుట. కనురెప్పల వాపులు. కనురెప్పల చివర్లలో కాయలులేకకురుపులు బయలుదేరుట. కాచబింబము కిరణాభేద్యముగా నగుట. ఒకవస్తువు రెండుగా కనబడుట.

ముక్కు:—ఆర్చుకుపోవుట. నీళ్లవంటి స్రావము, తుమ్ములువచ్చుచుండుట. ముక్కుశోణములు మంటగానుండుట.

ముఖము:—ఎడమవైపున పక్షవాతమువచ్చుట, వెచ్చగానుండుట.

గొంతుక:—మంటగాను, గరుకుగానువుండుట. జలుబువలనవాచుట. మాటబొంగురుగానచ్చుట. ఆమత్వచలు ఒరిసినట్లుండుట.

మూత్రావయవములు:—మూత్రము అతితక్కువగాను, ఆమముతోను, ఆమత్వచల ముక్కలతోను కలిసివెడలుట. మూత్రవిసర్జనకు ముందును వెనుకను మంటగాయుండుట.

శ్వాసావయవములు:—ఛాతీలో గురగురలాడుచుండుట (యాంటిం టార్టు). దగ్గువచ్చివచ్చి తుమ్ములలోనికి మారుట. ముసలివారిలో చిక్కగాను, విస్తారముగాను యుండు శ్లేష్మము లేక ఆమము వెలువరించుటకు కష్టముగాయుండుట. చాతీకి నీరుపట్టుట. నిలువుగాయున్న వుబ్బసపు దగ్గుచే బాధపడువారికి ఛాతీనిండుగా నున్నట్లుండుటతో వచ్చు ఫిట్టుమీదపని చేయును.

చర్మము:—విషజంతువుల కాట్లకును లేక కోపముతోనున్న జంతువులకాట్లకును వాడవచ్చును.

ఛాతీ:— మెట్లెక్కునప్పుడును, వడిగా నడచుటవలనను, వూపిరందక పోవుట లేక ఆయాసమువచ్చుట. దగ్గుటవలనను, వూపిరిపీల్చుటవలనను ఛాతీలో పొడుచుచున్నట్లు బాధవచ్చుట.

వుద్రేకము:—బహిరంగమైన గాలిలో నడచుటవలన, విశ్రాంతివలన.

వుపశమనము:— చెమటపట్టుటవలన, వెనుకకు తలనువంచుటవలన.

విరుగుళ్లు:—బ్రియోనియా, బెల్లడోనా, ఆర్నికా, కేంఫరు.

మోతాదు:—మదరు టించరు మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాల పరిమితి నాలుగు వారములకుపైగా యుండును.

---

## 182. సాలిడాగో. SOLIDAGO VIRGA AUREA.

మూత్రావయవ రోగములమీదను, శ్వాసావయవ రోగములమీదను, క్షయవ్యాధిమీదను ఇది బాగుగా పనిచేయును. మూత్రపిండములలో బాధ, మూత్రము యెక్కువ బాధతో వెడలుచుండుట, మూత్రపిండములలో నొప్పిగా యుండుట, క్షయరోగములో అతితరచుగా జలుబుచేయుచుండుట, నిస్త్రాణవచ్చుచుండుట. వీటిమీదనిది ముఖ్యముగాపనిచేయును.

ముక్కు:—చిరచిరను కలుగజేయునట్టి ఆమను వెడలుచుండుట, తుమ్ములు వచ్చుచుండుట.

మూత్రావయవములు:—మూత్రము కొలదిగాను, గోధుమ ఎర్రని మిశ్రమవర్ణముగాను, చిక్కని మడ్డితోను, సన్నని రాళ్ళు వెడలుచును, చుక్కలుచుక్కలుగాను అగుచుండుట. మూత్రములో శ్వేతధాతువు, రక్తము, ఆమము, ఫాస్ఫేట్సు కలసివెడలుచుండుట. మూత్రపిండములలోని బాధలు పొత్తికడుపులోనికిని, మూత్రకోశములోనికిని వ్యాపించుచుండుట. మూత్రము స్వచ్ఛముగానున్నను దుర్వాసనతో యుండుట.

పురుషావయవములు:—ప్రొస్టేటుగ్రంథి వాపువలన మూత్రపు ధారకు అభ్యంతరము గలుగుట.

స్త్రీ అవయవములు:—గర్భాశయము వాచుట.

శ్వాసావయవములు:—బ్రాంకైటిసు. దీనిలో దగ్గుతో చీమునంటి స్రావము రక్తజీరతో వెడలుచుండుట. శ్వాస ఆగకుండుట ఆయాసముగా నుండుట. రాత్రియందు మాత్రము కొద్దికొద్దిగా అగుటతో వుండు నట్టి వుబ్బసపు దగ్గు.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ. ఇది మదరుటించరులో మోతాదుకు 5 చుక్కలు చొప్పున యిచ్చినప్పుడు బాగుగా పని చేసినది.

---

## 183. స్పైజీలియా—SPIGELIA.

రక్తక్షీణతతోను, నిస్త్రాణతోను, మేహవాత తత్వముతోను యుండు రోగులకు ఇది బాగుగా పనిచేయును. పిల్లల క్రిమిరోగలక్షణములు, రోగి సన్నని మొనగల వస్తువులను (మేకులు మొదలగునవి) జూచి భయపడుట (స్పైలేషియా); శరీరమును తాకుటకు బాధగా నుండుట; హృదయ రోగములు, పార్శ్వపునొప్పులు లేక నరములసంబంధమైన బాధలు; బిడ్డ బొడ్డువద్ద యెక్కువ బాధతోనున్నట్లు కనబడుట—ముఖ్యముగా వీటినిది మాన్పును.

మనస్సు:—పరిశ్రమయందయిష్టము. అస్థిమితము, ఆతురత. విచార గ్రస్తముగాను, ఆత్మహత్య చేసుకొనవలెనను భావముతోను యుండుట.

తల:—తలతిప్పు, తలపైవైపున బద్దలైపోయినట్లు తోచుట. నియమిత కాలములలోవచ్చు తలనొప్పులు. నడినెత్తిని ముట్టుకొనినయెడల నొప్పివచ్చుట. తలకు బద్దీని చుట్టపెట్టినట్లు బాధగా నుండుట (కేక్టసు, జెల్సీమియం).

కన్నులు:—కండ్లలోను, కండ్లచుట్టును, యెక్కువ బాధగానుండుట. నరములు లాగుచున్నట్లుండుట. కనుబొమలు కాకి ఘూకవలె పెద్దనిగా

నున్నట్లు తోచుట. కనురెప్పలువాచుట, బాధగానుండుట, పుండ్లుపడుట. కండ్లను చికిలించవలెనని యుండుట.

చెవులు:—దిబ్బడవేయుట. పోట్లుగానుండుట. చీముకారుచుండుట.

ముక్కు:—మాననటువంటిరొంప. దుర్వాసనగానుండు స్రావము.

ముఖము:—పొంగరించి ముడుచుకొనిపోయి వుండుట. యెడమ వైపున బాధ చీల్చుచున్నట్లును, పొడుచుచున్నట్లును, కండ్లలోకిని, క్రింది దౌడయెముకలోనికిని, పండ్లలోనికిని, వ్యాపించుచుండుట; మరియు నివి నియమితకాలములయందును అనగా వుదయము మొదలు సూర్యాస్తమయము వరకును వుండుట. మధ్యాహ్నమందును, కదలిక లేక చప్పుడువలనను వుద్రేకించుచును, కన్నీళ్లు వెడలుచును యుండుట.

నోరు:—సాయంకాలమునందును, పొగత్రాగినపిమ్మటను, చన్నీటి వలనను, చల్లని గాలివలనను, భోజనానంతరమునను వుద్రేకించు పంటి పోటును మాన్పును. నాలుకబీటలుతీసి పసుపుపచ్చని పూతతో యుండుట.

అన్నకోశము:—రాయి పెట్టినట్లు బరువుగానుండుట. సూదులతో కుట్టుచున్నట్లు లేక గుచ్చుచున్నట్లు బాధగా నుండుట.

పొత్తికడుపు:—బొడ్డువద్ద కోయుచున్నట్లు బాధగా నుండుట. అంత్రములు ముడుచుకొనిపోయినట్లువలెను, నమలుచున్నట్లును బాధగాను వూపిరితీయుట కష్టముగాను, ఆతురతగాను యుండుట.

మలము, మలాశయము:—ఆసనమువద్ద దురదగాను, పురుగులు పాకుచున్నట్లును వుండుట. క్రిమిదోషమును మాన్పును.

పురుషావయవములు:—శృంగార సంబంధమైన ఆలోచనలతో లేపనము యెక్కువగా నుండుట.

శ్వాసావయవములు:—బాధలు కోయుచున్నట్లు, చీల్చుచున్న ట్లు ఎడమవైపు చన్మొనకు దిగువున గలుగుట, ఇవి అంసఫలకము సమీప మునకును కుడిచేతిలోనికిని వ్యాపించుచుండుట. మరియును వూపిరిని గట్టి

గాపీల్చునప్పుడు నొప్పి యెక్కువగు చుండుట. ఛాతీకి నిరుపట్టుట.

హృదయము, నాడి:—కుట్టుచున్నట్లుండునొప్పి; దీనితో ఆతురత, వూపిరాడకపోవుట యుండుట. నాడి కెరటములు కొట్టుకొనుచున్నట్లువలె యుండుట. దడ విపరీతముగాను, ముందరకు వంగుటవలన వుద్రేకము జెందుట, యెక్కువ జ్వరముతోను కుట్టుచున్నట్లుండు బాధలతోను వుండుట. నాడివక్రముగా, పుష్టిగా, నెమ్మదిగా, వణకుచున్నట్లునుండుట.

కాళ్లు, చేతులు:—పైఅవయవములలో వణకువచ్చుట. నడచుట వలన అవయవములకు వచ్చు బాధలమీద పనిచేయును.

చర్మము:—పాలిపోయి, ముడతలుపడి, పసుపుపచ్చగానుండుట.

నిద్ర:—పగటియందును, వుదయమునకూడ నిద్రవచ్చుట.

జ్వరము:—కదలికవలన చలివచ్చుట. భుజములను కదల్చుటవలన చేతులకు బంకగానుండు చెమటపట్టుట.

ఉద్రేకము:—కదలికవలన, ధ్వనివలన, తాకుడువలన, వుదయమున, కుడివైపున, వుదయము 11 గంటలు లగాయితు 12 గంటలవరకు.

వుపశమనము:—సాయంకాలము 3, 4 గంటలకు, నడచుటవలన, మర్దనము వలన.

విరుగుళ్లు:—కేంఫరు, ఆరంమెటాలికం, పల్సటిల్లా, కాక్యులను.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాలపరిమితి 3 లేక 4 వారములు.

---

## 184. స్టాఫిసేగ్రియా. STAPHYSAGRIA.

వుద్రేకముతోనుండు నరముల దోషములకును, మర్మావయవ మూత్రావయవరోగములకును, చర్మరోగములకును, అధిక సంభోగమువలన గాని, హస్తప్రయోగాది దురభ్యాసములవలన గాని వచ్చు మానసికరోగములకును,

పండ్లనూడతీసినపిదప వచ్చు నరముల సంబంధమైన బాధలకును ఇది బాగు గా పనిచేయును.

మనస్సు:—ఇతరులు తన్నుగూర్చి చెప్పునది సహింపలేకుండుట. ఒంటరిగా నుండగోరుట. ఎల్లప్పుడును దాంపత్య విషయములు జ్ఞాపకము వచ్చుచుండుట. బిడ్డ చాలరకముల వస్తువులకొరకుయేడ్చినపుడు దేని నిచ్చి నను తోసివేయుచుండుట.

తల:—సామ్మసిల్ల జేయునట్టి తలనొప్పి; ఇది ఆవలింతలతో మానుట. చెవులపైని, చెవులవెనుకను, దురదతోనుండునట్టి పొక్కులుబయలుదేరుట. నుదిటిలో సీసముతో చేయబడిన ఉండయున్నట్లు బరువుగాయుండుట.

కన్నులు:—వెచ్చగానుండుట. కనురెప్పలపై కాయలు (Styes) అప్పటప్పట వచ్చుచుండుట. కండ్లలోతునపడుట, కాచబింబము గాయ ముపడుట.

చెవులు:—రసదోషమువలన వచ్చు చెవుడు; ఇది గవదకాయలు వాచుటవలన వచ్చినట్లుతోచుట.

గొంతుక:—గుటక వేయుచున్నప్పుడు కుట్టుచున్నట్లుండు బాధలు చెవిలోనికి వ్యాపించుట.

నోరు:—బహిష్టులో వచ్చు పంటిపోటు. భోజనానంతరము నిద్ర మత్తుగా యుండుట పండ్లు కదలుట, ఇగుళ్లనుంచి చీముచెడలుట, నోరు దుర్వాసనగానుండుట (ప్లాంటాగో).పండ్లునల్లబడి ముక్కలుముక్కలుగా విడిపోవుచుండుట. మాంసగ్రంథులు వాచుట.

అన్నకోశము:—ఉద్రేకమునిచ్చు పదార్థములను కోరుచుండుట. ముఖ్యముగా పుగాకును కోరుట. కడుపు నిండుగానున్నను ఆకలిగా నున్నట్లు తోచుట. పొట్టకు శస్త్రచికిత్స చేసినపిమ్మటవచ్చు వికారమును మాన్పును. పుల్లని ఆహారమును తీసికొనినపిదప చేదుగా త్రేన్పులువచ్చుట.

పొత్తికడుపు, మలాశయము:—కోపముతో వచ్చు శూల. చల్లని

నీళ్లని త్రాగిన పిదప తీపుతోవచ్చు నీళ్లవిరేచనములు. విరేచనబద్ధము. ప్రొస్టేటుగ్రంధి పెద్దదగుట. మూలశంఖ.

**మూత్రావయవములు:**— ప్రసవించిన స్త్రీలలో మూత్రముబంధింపబడుట లేక చుక్కలుచుక్కలుగా వెడలుట. మూత్రకోశనాళముగుండా మూత్రము కొలదిగా వెడలుచూ యున్నట్లు భావన గలుగుట. మూత్రము విడిచిన పిమ్మట మూత్రానుమానము, బాధగలుగుచుండుట.

**పురుషావయవములు:**— తరుచు హస్తప్రయోగము చేయుచుండుట. ఇందువలన అంగము సడలి, ముడుచుకుపోయి వక్రముగా నగుట. మరియు దాంపత్య విషయములనుగూర్చి ఆలోచించుచుండుట. తప్పుపని చేసినవానివలెను, కండ్లు లోతునపడి, నిస్త్రాణగాను, తరుచు స్ఖలనములగుచును యుండుట. నడుమునొప్పి, నిస్త్రాణ, నగముల నీరసము— ఇవి శుక్లనష్టముతో ద్వంద్వముగా నుండునపుడిది బాగుగా పనిచేయును. సంభోగానంతరము వూపెరాడకపోవుట. అవయవముపై పొక్కులు, పుండ్లు బయలు దేరుట. సవాయిరోగముయొక్క ద్వితీయావస్థలో పనిచేయును.

**స్త్రీఅవయవములు:**— పెండ్లియైన యుక్తవయస్కురాండ్రలో తరుచు మూత్రానుమానము గలుగుచుండుట. అవయవములు బాధతో నుండుట. కుసుమ. గర్భాశయము వెలుపలకు వచ్చుట. చట్టలలో నొప్పిగా యుండుట. గర్భిణీస్త్రీలలో వేవిళ్లను మాన్పును.

**శ్వాసావయవములు:**— శీతకాలములోవచ్చు కూ్రపు అనబడు కింక వాయువుకు సంబంధించియుండు దగ్గును మాన్పును.

**మెడ, నడుము, కాళ్ళు, చేతులు:**— మెడకొయ్యబారుట. పరుండుటకు వీలులేకుండగ భుజములలో నొప్పిపట్టుట. నడుమునొప్పి. పిక్కలు లాగుచుండుట. చితుకకొట్టినట్లు నొప్పులుగాయుండుట. కీళ్ళు వంగక పోవుట.

**చర్మము:**— తల, చెవులు, ముఖము, మరి యితరచోట్లయందును

మంత్రపు పొక్కులు, వరిసరిగా పక్కులుకట్టుట, దురదతోనుండు చర్మరోగము బయలుదేరుట.

ఉద్రేకము:—కోపమువలన, విచారమువలన, ముష్టిమైథునము వలన, అధిక సంభోగమువలన, పుగాకువలన.

వుపశమనము;—ప్రాతఃకాల భోజనానంతరమున, వెచ్చదనమువలన, రాత్రియందు విశ్రమించుటవలన.

దీనికి ముందరగాని వెనుకగాని రానన్క్యులస్ బల్బోసస్ ను వాడరాదు.

సహచరులు:—కాష్టికం, కోలోసింథస్.

విరుగుళ్లు:—కేంఫరు.

మెర్క్యూరియసు, తూజా—లకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 3 లేక 4 వారములు.

బాహ్యోపయోగములు:—వాడియైనకత్తులు లేక చాకులు లేక గాజుముక్కలవలనగాని తెగుటవలన గలిగిన పుండ్లు సులభముగా మాన నప్పుడు దీనిని 40 లేక 60 చుక్కలు స్వచ్ఛమైన టించరురూపమున తీసికొని 20 ఔన్సుల నీళ్లలో కలిపి దూదినిముంచి కట్టుటవలన పుండు వెంటనే మానును. మరియు పుండునుండి వెడలు రక్తస్రావముకూడ కట్టి పోవును. దీనితోపాటు లోపలికి యీ ఔషధమునే పొటెన్సీరూపమున తీసికొనుట కూడ మంచిది.

---

## 185. స్టెల్లేరియా మీడియా. STELLARIA MEDIA.

ఇది మేహవాత రోగములమీద బాగుగా పనిచేయును. మేహవాత నొప్పులు ప్రతిఅవయవములోను వచ్చుచుండుట, కీళ్లు వంగకపోవుట, బా

ధలు తరచు ఒకచోటనుండి మరియొకచోటికి మారుచుండుట, నిలువగా యున్న మేహవాతలక్షణములు,—వీటివిది ముఖ్యముగామాన్పును.

పొత్తికడుపు, మలము:—కాలేయము పెద్దదగుట, వాచుట. పొడుచుచున్నట్లు బాధ. ఒకప్పుడు విరేచనబద్ధము, మరియొకప్పుడు నీళ్లవిరేచనములు యుండుట.

కాళ్లు, చేతులు:—చితుకకొట్టినట్లు నొప్పులుగాయుండుట. పిక్కలలోను, యితరఅవయవములలోను వచ్చు మేహవాతనొప్పులు.

వుద్రేకము:—వుదయమున, వెచ్చదనమువలన, పుగాకువలన.

వుపశమనము:—సాయంకాలమందు, చల్లనిగాలిలో, కదలికవలన.

మోతాదు:—2,3 పొటెన్సీలు. దీనిని మదరుటించరు రూపమున పైకికూడ వుపయోగించుటవలన త్వరలో గుణముకలుగును.

---

## 186. స్ట్రెమోనియం. STRAMONIUM.

(హిందూదేశపు ఔషధము. 49. ఉమ్మెత్త.)

ఇది రక్తాధిక్యతతోనుండు యువకులకు (ఎకోనైట్, బెల్లడోనా) ను, ముఖ్యముగా కొరియా జబ్బుతో బాధపడు పిల్లలకును, వెర్రివారికిని, జ్వరములోవచ్చు సంధికిని వాడవచ్చును. నత్తిమాటలాడుటను మాన్పుటలో ఎక్కువగా వుపయోగపడును.

మనస్సు:— ఒంటరిగా నుండుట లేక చీకటిలో నుండుటను యిష్టపడకపోవుట. వెలుతురులో నుండవలయుననియు, సహవాసముతో నుండ వలయుననియు కోరుట. మతసంబంధమైన పిచ్చి. దయ్యములు కనబడుట, ధ్వనులేవియో వినపడుచుండుట, దయ్యములతో మాట్లాడుట-ఇవి నిజముగా జరుగుచున్నట్లు తోచుట. యెక్కువ భక్తితోను, యేకాగ్రచిత్తముతోను, బ్రతిమాలుచును, విధువకుండగ మాట్లాడుచును యుండుట,

తల:—తలగడనుండి తరుచుగా తలనుదొత్తుచుండుట. నుదిటిలోను కనుబొమలలోను వుదయమున నొప్పివచ్చి ఒంటిగంటవరకు హెచ్చుచునుండుట. ముందరకు, యెడమ వైపునకు, వికారమువలన తూలుచుండుట.

కన్నులు:—తేరబారి చూచుట. దృష్టి మందగించుట. చీకటిగా నున్నట్టుండుట వలన దీపమును తెమ్మనుట. చిన్నవస్తువులు పెద్దవిగా కనబడుట. అవయవములు వాచినట్లు తోచుట. వస్తువులన్నియు నల్లగా కనబడుట.

ముఖము:—యెర్రగాను, వెచ్చగాను వుండుట. బుగ్గలు కందబారియుండుట. రక్తము జిమ్మినట్లును, ముడుచుకొని పోయినట్లును యుండుట. భయకంపముతో నుండుట.

నోరు:—కంపమువలన గుటకవేయుట కష్టముగా నుండుట, నత్తి మాటలాడుట.

అన్నకోశము:—విపరీతమైన దాహము. ఆమమును, ఆకుపచ్చని పైత్యరసమును వమనము చేసుకొనుట. ఆహారము గడ్డివలెరుచిలేకయుండుట.

మలము, మలాశయము:—మలమూత్రములు వెడలకుండుట. విరేచనబద్ధము. ఆసనము తీపుగా నుండుట.

మూత్రావయవములు:—మూత్రమణచి పెట్టబడుట.

పురుషావయవములు:—శృంగార సంబంధమైన ప్రస్తావన లేక బూతుమాటలాడుచుండుట. వృషణములు వాచుట. చేతులనెప్పుడును మర్మావయవముల వద్దనే యుంచుట.

స్త్రీఅవయవములు:—బహిష్టుకు బహిష్టుకు మధ్య స్రావము గలుగుట. రోగి పాడుచును, ప్రార్థనలు చేయుచును యుండుట. సూతిక సంబంధమైన పిచ్చి; దీనితో విస్తారముగా చెమటలు పట్టుచుండుట. ప్రసవానంతర కంపములు,

కాళ్లు, చేతులు:—పైఅవయవములలోను, దూరము దూరముగా నున్న కండరములలోను కంపనములు వచ్చుచుండుట. "కొరియా" జబ్బులో నొప్పుచున్నట్లుండుబాధ, కంపములు తరుచుగామారుచు వచ్చుచుండుట. ఎడమచట్టలో నొప్పి.

చర్మము:—యెఱ్ఱగా నిగనిగలాడు చుండుట.

నిద్ర:—భయమువలన మెలకువజెందుట. మరియు కెవ్వుమని కేకలు వేయుచుండుట. యెక్కువ గుర్రతోనుండు నిద్ర. నిద్రమత్తుగానుండినను నిద్రరాకుండుట (బెల్లడోనా).

జ్వరము:—చెమట పట్టినపిమ్మట వుపశమింపని జ్వరము. శరీరమంతయు వెచ్చగానుండుట. ముఖము కందబారి చెమటపట్టుట.

వుద్రేకము:—చీకటిగదిలో, ఒంటరిగానుండునప్పుడు, కాంతితో నుండువస్తువులు చూచినపిమ్మట, నిద్రపోయినపిదప, గుటకవేసినపిమ్మట.

వుపశమనము:—సహవాసమువలన, వెచ్చదనమువలన, యెక్కువకాంతిగానుండు వెలుతురు వలన.

విరుగుళ్లు:—బెల్లడోనా, కేంఫరు, నక్సువామికా, హయాశ్యామసు, పల్సటిల్లా.

ప్లంబంమెట్ న కిది విరుగుడు.

దీనికి ముందరగాని వెనుకగాని కాఫీనివాడరాదు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాలపరిమితి 12 లగాయతు 24 గంటలు.

---

## 187. స్ట్రోఫేన్తసు. STROPHANTHUS.

ఇది హృదయరోగములమీదపనిచేయును. హృదయము అతివేగముగా కొట్టుకొనుటనుతగ్గించి, నీరుపట్టుటనుమాన్పి, హృదయమునకు బలమునిచ్చును. హృదయరోగముతో బాధపడువారికి వుబ్బులక్షణములు గలిగినపుడిది

పని చేయును (డిజిటాలిసు). దీనిని వుపయోగించుటవలన మూత్రమువిస్తారముగా వెలువరింపబడును. ఇదివృద్ధుల రోగములకుబాగుగా పని చేయును. పొగచుట్టను త్రాగువారియొక్క హృదయములో గలుగు చిరచిరకును, చాలకాలమునుండి వుద్రేకము నిచ్చు పదార్థములను వుపయోగించువారికి వచ్చు రోగలక్షణములమీదను పని చేయును. కొద్విప్పపట్టుట, హృదయవేదన,దడ, వూపిరాడకపోవుట—వీటితో నుండు రక్తక్షీణతమీదపని చేయును.

మనస్సు:—చిరచిరగా నుండుట.

తల:—ముసలివారికివచ్చు వికారము, కణతలలో నొప్పివలన ఒక వస్తువు రెండుగాకనపడుట. దృష్టిపాడగుట.

కన్నులు:—కండ్లు ప్రకాశమానముగానుండుట,పాపలు పెద్దవగుచు చిన్నవగుచు నుండుట.

అన్నకోశము:—ఆల్కాహోలుయందయిష్టముతో గూడిన వికారము. ఆహారమునందసహ్యత గలుగుట. భోజనానంతరము వుక్కిరి బిక్కిరియై వమనమగుట.

మూత్రావయవములు:—మూత్రము కొంచెముగా శ్వేతధాతువుతో కలసి వెడలు చుండుట.

స్త్రీఅవయవములు:—గర్భాశయమునకు రక్తమెక్కువగా జేరుట, మరియు బరువుగానుండుట, యెక్కువగా రక్తస్రావమగుట. ముట్లుడుగు కాలములో చట్టలలోను, తొడలలోను పోట్లువచ్చుచుండుట.

శ్వాసావయవములు:—యెత్తుప్రదేశము యెక్కుటవలన ఆయాసము వచ్చుట. వూపిరితిత్తులు వాచుట, నీరుపట్టుట. హృదయదోషముతోనుండు వుబ్బసపు దగ్గు.

హృదయము:—కండరముల దోషమువలనను,నిస్త్రాణవలనను హృదయము వడిగాను, నిస్త్రాణగాను, వక్రముగాను కొట్టుకొనుచుండుట.

కాళ్లు, చేతులు:—వుబ్బుట, నీరు పట్టుట.

పోలికలు:—డిజిటాలిసు, ఎపోసైనం, క్రిటేగసు, కేక్టసు.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ.

## 188. స్ట్రిచ్నినం. STRYCHNINUM.

దీనిని కండరముల కంపములకు, అవయవములలో నొక్కుచున్నట్లుండు బాధలకు, ధనుర్వాతమునకు, గుర్రపువాతమును వాడవచ్చును.

మనస్సు:—యెవరో తనకొరకు వచ్చుచున్నట్లు కేకలు వేయుట. జ్ఞాపకశక్తి యుండకపోవుట. చిరచిర లాడుచుండుట.

తల:—వికారమువలన ముందరకుపడిపోవుచున్నట్లుండుట. నడినెత్తిని, మెడమీదను దురద బయలుదేరుట.

కండ్లు:—వెచ్చగాను, బాధగాను, చొచ్చుకు ముందరకువచ్చినట్లును, రెప్పవేయక చూచుచుండునట్లును యుండుట. కండ్లయెదుట అగ్నికణములు కనిపించుట.

చెవులు:— మంటగాను, దురదగాను, హోరుతోను వుండుట. సూక్ష్మముగా వినిపించుట.

ముఖము:—పాలిపోయి, ఆతురతగానుండుట. దౌడలు కదల్చలేకుండుట.

గొంతుక:—అర్చుకుపోయి, ముడుచుకొనియుండుట. గొంతుకలో వుండ వున్నట్లుండుట. గుటకవేయుట కష్టముగానుండుట.

అన్నకోశము:—మానసటువంటి వమనములు, వికారము, వేవిళ్లు.

పొత్తికడుపు:—కండరములలో చురుక్కుమనుచుండు నొప్పులు. అంత్రములలో నులిమివేయుచున్నట్లుండు నొప్పి.

మలము, మలాశయము:—పణకువచ్చినప్పుడు మలము అప్రయత్నముగా వెడలుచుండుట. తీరని విరేచన బద్ధము.

స్త్రీ అవయవములు:—సంభోగవాంఛ (ప్లాటినా, కేంథారిసు, కేంఫరు, ఫాస్ఫరసు). శరీరమును తాకుటవలన కామోద్రేకము కలుగుట.

శ్వాసావయవములు:—స్వరపేటికవద్దనున్న కండరములయీడ్పులు. ఆయాసము వచ్చుట. విషపడిశెము మానిన పిమ్మట వచ్చు దగ్గు.

మెడ, నడుము, కాళ్ళు, చేతులు:—మెడలోని కండరములు, నడుము కొయ్యబారుట. వెన్నెముక దిగువను మంచువలె చల్లగానున్నట్లుతోచుట. అవయవములు, కీళ్లసంధులు కొయ్యబారుట లేక వంగకపోవుట. మేహవాత సంబంధమైన నొప్పులు, బాధలు. నొక్కుచున్నట్లుండు బాధలు.

జ్వరము:—వెన్నెముక దిగువను చలివచ్చుచుండుట. తలమీదను ఛాతీమీదను చెమటలు కాలువలు కట్టినట్లుండుట. పాదములు చల్లగా నుండుట.

చర్మము:—శరీరమంతయు మురడగా నుండుట.

వృద్రేకము:—వ్రనయముక, తాపడు వలన, ధ్వని వలన, కదలిక వలన, భోజనమైన పిమ్మట.

ఉపశమనము:—వెల్లగిల పరుండుటవలన.

పోలికలు:—సిక్యూటా విరోసా, ఆర్నికా.

విరుగుళ్ళు:—యూకలిప్టస్.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 189. సింఫోరికార్పస్ రేసిమోసా.

## SYMPHORICARPUS RACEMOSA.

గర్భిణీస్త్రీలకు వచ్చు వమనములను లేక వేవిళ్లను ఇది కట్టును. అజీర్ణమును, ఒకమారు ఆకలిగా నుండుటను ఒకమారు లేకపోవుటను, వికారమును, రుచిచేదుగానుండుటను, త్రేనుపులను మాన్పును. విరేచబద్ధ

మును, బహిష్టులోవచ్చు వికారమును మాన్పును. వికారము లేక వమనానుమానము కదలికవలన వృద్ధికము జెందుటను, భోజనమునందయిష్టతను మాన్పును. వెల్లగిల పరుండుటవలన లక్షణములుపశమించుట దీని వుపయోగమును సూచించును.

మోతాదు:—2 మొదలు 200 పొటెన్సీ.

---

## 190. సింఫైటం. SYMPHYTUM.

అన్నకోశములోని, ఆంత్రములలోని పుండ్లను మాన్పుటకును, కీళ్ల సంధులకు సంబంధించిన రోగములకును, యెముకలు విరిగినప్పుడు తిరిగి కలుసుకొనునట్లు జేయుటకును, శస్త్రచికిత్సలో తీసివేయగా మిగిలిన అవయవమువద్దయున్న నరములలో గలుగు చిరచిరకును దీనిని వాడవచ్చును.

తల:—బాధలు నడినెత్తిలోను నుదిటిలోను తలవెనుకను, ఒక చోటినుండి మరియొకచోటికి మారుచును యుండుట. దెబ్బతగులుట వలన వచ్చు కంటిరోగములకు దీనికన్న బాగుగా పనిచేయుమందు వేరొకటిలేదు.

పురుషావయవములు:—అండములలో బాధ, వాపువలన నడచుట కష్టముగా నుండుట. అధిక సంభోగమువలనవచ్చు శుక్లనష్టము, నడుము నొప్పి.

స్త్రీఅవయవములు:—ఋతువు ఆగిపోవుట. ముందరకు వంగుటవలన తలలోను, నుదిటిలోను నొప్పివచ్చుట. స్తనములు నొప్పిగా యుండుట. కుసుమ రోగము.

పోలికలు:—ఆర్నికా, కాల్కేరియా ఫాసు.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—ఎముకలు విరిగినప్పుడును, ఎముకల జాయింట్లలో నొప్పికిని, దీనిని స్వచ్ఛమైన మదరుటించరు రూపమున

తీసికొని 5 రెట్లు నీళ్లలోకలిపి గుడ్డను తడిపి పైని కట్టవచ్చును. ఎముకపై చర్మముకు కూడా దెబ్బతగిలి చీము పట్టినయెడల యీమందు వుపయోగ పడదు.

---

## 191. సిజీజియం జాంబోలేనం. SYZYGIUM JAMBOLANUM

(హిందూదేశపు ఔషధము. 50. నేరేడుపిక్కలు).

ఇది మధుమూత్రము (Diabetes Mellitus) ను మాన్పును. ఛాతీలోను, వీపుమీదను పేలుచున్నట్లును, గుచ్చుచున్నట్లును వెచ్చగాను యుండుట, చిన్నచిన్న ఎర్రనిపొక్కులు బయలుదేరి దురదగా నుండుట, ఎక్కువ దాహముగా నుండుట, నిస్త్రాణ. శరీరము శుష్కించుట, తార తమ్య సాంద్రత యెక్కువగా నుండునట్టి మూత్రము విస్తారముగా వెడలు చుండుట, శరీరముమీద బయలుదేరునట్టి పుండ్లు యెన్నాళ్లకును మానకుం డుట, మధుమూత్రవ్యాధికి సంబంధించియుండు పుండ్లు, రాచకురుపులు బయలుదేరుట—ఈరోగలక్షణములమీద నిది బాగుగా పనిచేయును.

మోతాదు:—మదరుటించరు. మోతాదుకు 5 లగాయితు 10 చుక్కలు.

---

## 192. స్వెర్టియా ఛిరాటా. SWERTIA CHIRATA.

(హిందూదేశపు ఔషధము. 51. నేలవేము.)

ఇది కాలేయము ప్లీహము దోషించుటతో వచ్చు పలువిధరోగలక్ష ణముల మీదను, మన్యపుజ్వరలక్షణములమీదను బాగుగా పనిచేయును—

తల, మనస్సు:—బుద్ధిమాంద్యము, ఎల్లప్పుడును పరుండి యుండ వలయునని కోర్కె. కనుబొమలలో కొలదిగానొప్పి ప్రారంభించి క్రమ ముగా తలయంతటకు వ్యాపించుట,

కండ్లు, చెవులు:—కండ్లుమంటలు, చెవులలో బుస్సలు కొట్టుచున్నట్లుండు ధ్వనులు వినపడుట.

గొంతుక, నోరు:—ఉదయమున రుచిచేదు. నోరు దుర్వాసన, నాలుక బరువు. నాలుకమధ్య పసుపుపచ్చని చిక్కని పూతగలుగుట, గొంతుకనొప్పి వెచ్చనిపానీయములవలన ఉపశమించుట.

శ్వాసావయవములు:—విడువని పొడిదగ్గు.

పొత్తికడుపు:—వాయువుజేరి పొంగరించుట. కాలేయము ప్లీహము వాచి బాధగానుండుట.

మూత్రము:—ముదిరిన ఎర్రరంగుగా, మంటతో వెడలుట.

పురుషావయవములు:—అంగము నిస్త్రాణజెందుట. అప్పటప్పట రేతస్ఖలనములు.

కాళ్ళు, చేతులు:—నొప్పులు. నీరసము.

జ్వరము:—మన్యపుజ్వరలక్షణములు. అజీర్ణదోషములు, పైత్యదోషములతో గూడిన జ్వరలక్షణములు, శరీరము చల్లగాయుండుట. దాహమునందు కోర్కె కలుగకపోవుట. జ్వరము లక్షణములు మానువరకు శరీరము మంటలుగా యుండుట.

చర్మము:—పైత్యదోషముతో గూడిన చర్మరోగము. కుష్టు.

మోతాదు:—1 మొదలు 12 పొటెన్సీ.

---

## 193. సర్రాసీనియా. SARRACENIA PURPUREA.

ఇది మశూచికములోను, మానసటువంటి తలనొప్పులకును వాడదగిన దివ్యౌషధము. దీనిని సకాలమున వాడినయెడల వేరియోలినం, వేక్సినినం మున్నగువాటివలెనే మశూచికము రాకుండగజేయును. ఒకవేళ మశూచికమువచ్చినను రోగమును తేలికగామాన్పును. మరియు, చర్మముపై

గుంటలుపడకుండజేయును. ఒకగర్భవతికి మశూచికము రాగా, ఈ యౌషధము వాడబడి, ఆమెతిరిగి స్వస్థత సక్రమముగ జెందినపిమ్మట కొన్నాళ్ళకు బిడ్డను కనెననియు బిడ్డశరీరముపై చాలచోట్ల యెఱ్ఱనిమచ్చలు కానవచ్చెననియు, ఇవి తల్లియొక్క మశూచికమువలన గల్గినట్లు దాఖలాగా తెలుంచదగిన హింశమనియు డాక్టరు క్లార్కుగారి నిఘంటువునుండి తెలియుచున్నది. ఈ యౌషధమును వాడుటవలన మశూచికమువలని దోషములు గలుగకున్నట్లు ఎన్నియోకేసులను గూర్చి వారువ్రాసిరి.

మనస్సు:—కంగారుగా నుండుట. నిలకడలేమి. తలబరువుగా తోచుట.

తల:—తల మరియు తక్కినశరీరమంతయు వెచ్చన. నుదురునొప్పి.

కన్నులు:—ఒకవస్తువు రెండుగాకనబడుట. కండ్లు వాచినట్లుండుట. బాధగానుండుట. కండ్లు నిస్త్రాణజెందుట. దృష్టిమాంద్యము. కనురెప్పలు వాపులు, బాధలు. కండ్లయెదుట నల్లనివస్తువులుకనిపించుచుండుట.

చెవులు:—విపరీతమైన పోటువలన మతిపోవునట్లుండుట.

ముక్కు:— దుర్వాసన. ఆకుపచ్చని, పసుపుపచ్చని, లేక రక్తమిశ్రితమై దుర్వాసనగానుండు స్రావము.

ముఖము:—పొంగరించుట. వెచ్చన.

నోరు:—నోరు, నాలుక ఆర్చుకుపోయి పొడిగానుండుట. రాత్రివరుండినపుడు పంటిపోటువచ్చుట, ఇది చల్లగాలివలన వుద్రేకించుట.

అన్నకోశము:—భోజనముచేయుచున్నప్పుడు నిద్రమత్తుగానుండుట. ఎల్లప్పుడును (భోజనము చేసినపిమ్మట సహితము) ఎక్కువఆకలిగానుండుట. బాధకరముగాను తీవ్రముగాను వమనములగుట.

మూత్రావయవములు:—మూత్రకోశము నిండిపోయి మూత్రమునాపుకొనుటకు వీలులేకుండుటవలన మూత్రము వెలువడుట, మూత్రములో ఫాస్ఫేట్సు కలసి వెళ్లుట.

స్త్రీ అవయవములు:—పాలకరెను, నీళ్ళవలె పలుచగాను నెడలు కుసుమ. గర్భాశయమునందు బాధలు ఆగిఆగి వచ్చుచుండుట. గర్భాశయము కంతులతోనిండియున్నట్లు వాపుగాను బాధగాను యుండుట. గర్భాశయ రక్తస్రావములు.

కాళ్లు, చేతులు:—నీరసముగానుండుట. మోకాళ్లనొప్పులు. భుజములమధ్య నిస్త్రాణగా యుండుట.

చర్మము:—మశూచికమును పారదోలును. పొక్కులు బయలు దేరుటను ఆపుచేయును.

వృద్ధికము:—అర్ధరాత్రిమున, సాయంకాలమున 3 గంటలకు, వుదయమున, పరుండిలేచినపుడు, నడచునప్పుడు, ఎక్కువగాలిలో.

వుపశమనము:—పరిశుభ్రమైన గాలిలో.

విరుగుళ్లు:—పోడోఫైలం.

పోలికలు:—యాంటింటార్టు, మెర్క్యూరియసు, వేక్సినినం, వేరిరోలినం, మెలాండ్రినం.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

## 194. టెరిబింతినా. TEREBINTHINA.

ఆమత్వచలనుండి రక్తము స్రవించుటతోనుండు రోగలక్షణముల మీదను, మూత్రావయవరోగములమీదను, చర్మరోగములమీదను, ముఖ్యముగా పాదములమీద బయలుదేరు నీటిపొక్కులు చితుకకుండా యున్నప్పుడును యిది పనిచేయును.

మనస్సు:—ఎక్కువగా చిరచిరలాడుచుండుట. పిచ్చితనము.

తల:—వికారముగా నుండుటవలన దృష్టితగ్గిపోవుట, ఆలోచన తోచకుండుట. బద్దీని మట్టపెట్టినట్లుండు నొప్పి.

కన్నులు:—కుడికంటిలో నరములసంబంధమైన బాధలు. తాగుడువలన వచ్చు దృష్టిమాంద్యము.

చెవులు:—తన కంఠధ్వని తనకే అస్వాభావికముగా నుండుట. చెవి పోటు.

నోరు:—దుర్వాసనవచ్చుట. గొంతుకలో వుక్కిరిబిక్కిరియైనట్లుండుట. నాలుక ఆర్చుకుపోయి నిగనిగలాడుచు, యెఱ్ఱని పుంతువలెను, చివర మంటగాను వుండుట (నక్సుమోస్కేటా, కాలీబైక్రోమికం, బెల్లడోనా, ఆర్జెంటం నైట్రికం).

అన్నకోశము:—దీని పైభాగము వెచ్చగానుండుట. వికారము, వమనములు.

పొత్తికడుపు, మలము, మలాశయము:—పొత్తికడుపు పెద్దదై యుంగరకు వ్రేలాడుట. ఎఱ్ఱగాను, దుర్వాసనతోను, రక్తముతోను వెడలునట్టి నీళ్లవిరేచనములు. విరేచనము వెడలుటకు ముందు వాయువువలన వచ్చు నొప్పి; ఇది విరేచనానంతరము వుపశమించుట. క్రిమిదోషము. జలోదరము. విరేచనానంతరము సొమ్మసిల్లిపోవుట. అంత్రములనుండి రక్తము స్రవించుట, అంత్రములు పుండ్లుపడుట.

మూత్రావయవములు:—మూత్రము కొలదిగా వెడలుట లేక అణచిపెట్టబడుట. మూత్రములో రక్తముకలసి చుక్కలు చుక్కలుగా వెడలుట. బాధతోగూడిన లేపనము. శగవ్యాధి (కేంధారిసు). తరుణవ్యాధులువచ్చిన పిమ్మట మూత్రపిండములువాపు, బాధ, తీపుగా నుండుట.

పురుషావయవములు:—నూతనముగా వచ్చినట్టిగాని జీర్ణించినట్టిగాని శగవ్యాధి, బురదవలెనుండు మూత్రము; దీనిలో పసుపుపచ్చని ఆమమువంటి పదార్థము అడుగునకు మడ్డివలె చేరుట. శుక్లనష్టము.

స్త్రీఅవయవములు:—అండాశయము వాచుట. గర్భస్రావము. గర్భిణీలో నరములసంబంధమైనబాధలు. గర్భాశయములో మంట, వాపు. బహిష్టుకు బహిష్టుకు మధ్య గర్భాశయములో మంటతోగూడినస్రావములు

శ్వాసావయవములు:—వూపిరిపీల్చుట కష్టముగానుండుట. వూపిరితిత్తులు పెద్దవగుట; వీటినుండి రక్తము స్రవించుట. శ్లేష్మము రక్తజీరతో వెడలుట.

హృదయము:—నాడి దారమువలె సన్నముగాను, చురుకుగాను వుండుట.

నడుము, కాళ్ళు, చేతులు:—అండాశయముపద్ద మంటతోనుండు బాధలు. కుడిఅండాశయములోలాగుచున్నట్లుండునొప్పి. అవయవములలో తిమ్మెర్లు, బరువు. అవయవములు వుబ్బుట లేక నీరుపట్టుట.

చర్మము:— మొటిమలు, దురదతోను, చీముతోను వుండుపొక్కులు నీటిపొక్కులు బయలుదేరుట. తడిగాను, వెచ్చగాను యుండుట.

నిద్ర:—మత్తుగాను, కలలతోను వుండుట.

జ్వరము:—సన్నిపాతములో కడుపు పొంగరించి యుండుట. రక్తస్రావములు. మగత. సంధిలక్షణములు, వెచ్చగాను, యెక్కువదాహము తోను, నాలుక ఆర్చుకొనిపోవుచు, చల్లగాను, జిగురువలెనుండు చెమటతోనుండుట. యెక్కువ నిస్త్రాణ.

వుద్రేకము: —తాకుడువలన, కూర్చుండుటవలన, అర్ధరాత్రిమున 1 లగాయితు 3 గంటలవరకు, తేమగానుండుచోట కాపురముండుట వలన.

వుపశమనము:—కుడిపైని పునను తిరుగుటవలన, ముందుకువంగుటవలన, కదలికవలన.

పోలికలు:—ఎల్యూమెన్, సెకేలే, కేంథారిసు,యాసిడ్ నైట్రిక్.

విరుగుళ్లు:— ఫాస్ఫరసు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

## 195. ట్యూక్రియం. TEUCRIUM MARUM VERUM.

ముక్కును ఆసనమునకును సంబంధించిన రోగములమీద నిది పని చేయును. ముక్కునుండి మాననటువంటియు, నిలువగా యున్నట్టియుస్రావమును, దుర్వాసనతోనుండు పెద్ద పెద్ద పక్కులుకట్టుచున్నప్పుడునుదీనిని వాడవలెను. ముక్కు సంబంధించిన ఇంద్రియజ్ఞానము తక్కువ గానుండుటను మాన్పును.

ముక్కు:—ఆమము వెడలుటతోనుండు కాయలు(Polypi)బయలు దేరుట. ముక్కులో పురుగులు పాకుచున్నట్లు భావనయుండుట, కన్నీళ్లు కారుచుండుట. తుమ్ములు వచ్చుట. ముక్కుదిబ్బడవేయుట.

అన్నకోశము:—మిగుల ఆకుసచ్చరంగు గానుండు పదార్థమును వమనము చేసుకొనుట. తరుచు యెక్కిళ్లు, నడుమునొప్పి వచ్చు చుండుట.

మలాశయము:—ఆసనములో దురదగా నుండుట. రాత్రిపరుండిన పిమ్మట చిరచిర గానుండుట. క్రిమిదోషమువలన గాత్రియందు అస్థిమితము జెందుట. విరేచనానంతరము పురుగులు పాకుచున్నట్లుండుట.

పోలికలు:—సినా, ఎస్కులస్ హిప్, నేట్రం ఫాసు.

మోతాదు:—2 మొదలు 30 పొటెన్సీ.

---

## 196. టెర్మినాలియా అర్జునా. TERMINALIA ARJUNA.

(హిందూ దేశపు ఔషధము. 52. ఎగ్రిమద్ది.)

మనస్సు, తల:—మనస్సు నిస్త్రాణ జెందుట. తలదిమ్మవచ్చుట.

హృదయము:—గుండెదడ, గుండెలోపోట్లు. నాడి వక్రముగా కొట్టుకొనుచుండుట. కదలికవలన గుండెదడవచ్చుట.

మూత్రావయవములు:—మూత్రము కొలదిగను చుక్కచుక్కలు గను వెడలుచుండుట.

మోతాదు:—1 మొదలు 6 పొటెన్సీ.

---

## 197. టెర్మినాలియా ఛెబ్యులా. TERMINALIA CHEBULA.

(హిందూదేశపు ఔషధము. 53. కరక్కాయ.

దీనిని బంగాళీలో "హరితకీ" యందురు.)

విరేచనబద్ధము, మూలశంఖ, జిగటవిరేచనములు, నీళ్ల విరేచనములు, వుబ్బు, చర్మరోగములు—వీటిమీదనిది ముఖ్యముగా పనిచేయును.

తల, మనస్సు:—నిర్లక్ష్యస్వభావము. తలతిప్పు వికారము మానకుండగ యుండుట. తలతిప్పు ఎండవేడిమివలనను గట్టిగా నొక్కుట వలనను, కదలికవలనను ఉద్రేకముజెందుట. చల్లదనమువల్ల నుపశమించుట.

నోరు:—చల్లనినీటిని త్రాగగోరుట. నోరు దుర్వాసన. నాలుక గరుకుగను, బాఫగను యుండుట. ఇగుళ్లువుబ్బుట. నాలుకచివర గోధుమ రంగుపూత.

అన్నకోశము:—వింపు గాయుండుట, పొట్టపొంగరించి యుండుట. గుడగుడలు.

మొలనడుము, కాళ్లుచేతులు:—నిబ్బరముగా కూర్చొనినచో నడుము నొప్పి వుద్రేకించుట మరియు, పరున్నప్పుడును నిద్రలోను వుపశమించుట. కాలేయముకద్ద నొప్పి నొక్కినచో వుపశమించుట. కుడిభుజములోనొప్పి.

మలము:—మలవిసర్జనయందిచ్ఛ కలిగినను విరేచనము జారీగా కాకుండుట. నీళ్లవిరేచనములలో జిగురుకలసి వెడలుచుండుట.

మూత్రావయవములు:—తరుచు మూత్రము తక్కువగాను రాత్రి యందు యెక్కువసార్లును వెడలుచుండుట.

వృద్ధికము:—తీక్షణమైన సూర్యకిరణములవలన, కదలికతో, గట్టిగా నొక్కుటతో, పరితాంపర వలన.

ఉపశమనము:—చన్నీటి స్నానమువలన, సాయంకాలమున, చల్లని పొడిగాలిలో, భోజనము చేయుచున్నపుడు, నిద్రలో, కండ్లుమూసుకొనుటవలన.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 198. త్లాస్పి బర్సా పేస్టోరిసు.

## THLASPI BURSA PASTORIS.

మూత్రమునందు యూరిక్ యాసిడ్ (Uric Acid) విస్తారముగా వెడలుటను, రక్తస్రావముగలుగకుండగను అపుజేయును. గర్భాశయవ్యాధి ననుచికెట్టుటవలని రోగలక్షణములను మాన్పును. కాళ్లు పీకుట, ముద్దలు ముద్దలుగా రక్తము వెడలుట, ఇవి గర్భాశయవ్యాధిలో గలిగినపుడు పని చేయును. గర్భిణిలో శ్వేతధాతువు మూత్రములో కలిసిపోవుటను మూత్రకోశములో చిరచిరను జలోదరమును మాన్పును.

తల:—ముఖము, కన్నులు పొంగరించుట. నాలుకపై తెల్లనిపూత. ముక్కునుండి తరచురక్తస్రావముగుచుండుట. పెదవులు, నాలుకపగులుట. లేచుటవలన వికారము వృద్ధికము జెందుట. ముక్కుసంబంధమైన శస్త్రచికిత్స చేయుచున్నప్పుడుకలుగు రక్తస్రావములు.

స్త్రీఅవయవములు:—బహిష్టుకు బహిష్టుకు మధ్య స్రావము గలుగుచుండుట. బహిష్టు అతితరముగాను, స్రావము యెక్కువగాను అగుట. గర్భాశయమునందు శూలతో వచ్చు రక్తస్రావము. లేచినప్పుడు గర్భములో నెక్కువతీపుగా నుండుట. రక్తకుసుమ బహిష్టుకు ముందరను, వెనుకను, దుర్వాసనతోను, స్రావము బట్టను తగిలినచోట పోనటువంటి కరుద్రను కలుగజేయునును వెడలుచుండుట.

మూత్రావయవములు:—తరుచు మూత్రానుమానము గలుగుచుం

డుట. తారతమ్యసాంద్రత యెక్కువగా నుండునట్టి మూత్రము ఫాస్ఫేట్సు తోకలసి వెడలుచుండుట. మూత్రము ఆగిఆగి వెడలుచుండుట, లేక చుక్కలు చుక్కలుగా వెడలుచుండుట. మూత్రములోరక్తము, ఇటుక పొడివంటి పదార్థము చిన్నచిన్న రాళ్లు వెడలుచుండుట. శగవ్యాధిలో మూత్రము ధారలుకట్టి పడుట. ముసలివారిలోను, ముఖ్యముగా ముసలి స్త్రీలలోను, అప్రయత్నముగా మూత్రము వెడలుట. తరుచు మూత్రను మానము కలుగకుండ చేయును. మూత్రములో కలిసి వెడలునట్టి రాళ్లను కరిగించివేయును. మరియు దీనిని వాడుటవలన ఇటుకపొడివంటి పదార్థము బయలుదేర నేరదు. పైనిచెప్పబడ్డ చిన్నరాళ్లవలన గలుగు రక్తస్రావమును లేక మూత్రములో రక్తముకలసి వెడలుటను మాన్పును. మరియు మలములో జిగటతోపాటు రక్తముకలసి వెడలుటను మాన్పును. దీనిని వాడుటవలన మూత్రము యెక్కువగా వెడలి పొత్తికడుపుయొక్క వుబ్బుకును లేక జలోదరమునకును వుపశమనము గలుగును.

మోతాదు:—మగరుటించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 199. తూజా. THUJA OCCIDENTALIS.

ఇది స్థూలశరీరులకు, నల్లని దేహచ్ఛాయ, నల్లని వెంట్రుకలు, అనారోగ్యముగా నుండు చర్మముగలవారి తత్వములమీద బాగుగా పని చేయును. టీకాలవలని దోషముల (యాంటిటార్టు, సైలీషియా)కును, అణచి పెట్టబడినటువంటి లేక సరియైన చికిత్స చేయబడనటువంటి శగవ్యాధి (గనోరియం) కిని వాడవచ్చును. డాక్టరు హానిమన్ గారువ్రాసినట్లు సల్ఫరు "సోరా" కును మెర్క్యూరియసు "సవాయి" కిని యెట్లుపనిచేయునో యిది "సైకొసిస్" కు నట్లే పనిచేయును. ఇది చర్మము, రక్తము, జీర్ణకోశ నాళము, మూత్రపిండములు, మెదడు—వీటికి సంబంధించిన రోగముల మీద బాగుగా పనిచేయును. సూక్ష్మక్రిములవలని రోగముల (శగ, టీకాలవలని దోషములు వగైరా) మీద బాగుగా పనిచేయును. వులిపిరి కాయలను మాన్పును.

మనస్సు:—తాను పరాయిపురుషుని ప్రక్కను వున్నట్లు లేక శరీరమునుండి ఆత్మ వేరుచేయబడినట్లును, తాను గాజుతో తయారుచేయబడినట్లును, పొత్తికడుపులో సజీవముగానున్న జంతువు మెదలుచున్నట్లును నిశ్చయముగా తోచుట. ప్రసవానంతరమున విచారమువచ్చుట. సంగీతము వలన విచారము, కంపములు వచ్చుట.

తల:—ఉదయమున తలనొప్పివచ్చుట. కనుబొమలలో పొడుచుచున్నట్లు నొప్పిగాయుండుట. వెంట్రుకలు బిరుసెక్కుట, అర్చుకుపోయి పట్లగుట, నునుపు లేక కాంతి తగ్గుట, వూడిపోవుట. నడినెత్తిని, కనుబొమలలోను పురుగులు పాకుచున్నట్లుండుట. కండ్లను మూసికొనినప్పుడు వికారము, తలతిప్పవచ్చుట; మరియు కండ్లను తెరచుటవలన యిది వుపశమించుట. మేకుకొట్టినట్లు నొప్పిగానుండుట (కాఫీ, ఇగ్నేషియా). టీ వలనవచ్చు పార్శ్వపునొప్పి. తెల్లగా,పొరలుపొరలుగా చుండ్రురేగుట.

కండ్లు:—కనీనికాపటలము వాపు, బాధ. రాత్రియందు కనురెప్పలుఅంటుకొనుట, అర్చుకుపోవుట. కనురెప్పలచివర కాయలు బయలుదేరుట. బహిరంగమైన గాలిలో మంటగాను, చీల్చుచున్నట్లు బాధగాను వుండుట. పొరలు పెద్దవగుట. వెలుతురును చూడలేకపోవుట. తలిదండ్రులవలన, సవాయి రోగములకు సంబంధించి పిల్లలకు కండ్లకలకలు గలుగుట.

చెవులు:—చెవిపోటుయొక్క బాధ గొంతుకలోనికి, గొంతుకలోనుండి చెవిలోనికి మారుచుండుట. చీము నీళ్లవలెపల్చగాను, కుళ్లినమాంసపువాసనతోను వెడలుట. కాయలు (Polypi) బయలుదేరుట.

ముక్కు:—విడువనటువంటి స్రావము ముదిరిన అనుపచ్చరంగుగాను, రక్తము, చీముతోను వెడలుట. చీదుటవలన పండ్లనొప్పివచ్చుట. పుండుపడుట, అర్చుకొనిపోవుట. బాధను కలుగచేయు పక్కులుకట్టుట.

ముఖము:—వెచ్చగాను, మంటగాను వుండుట. పరుండనివైపు చెమట పట్టుట.

నోరు:—పండ్లు పసుపుపచ్చగాను, బాధగాను యుండుట. నాలుకపై మంటగానుండు నీటిపొక్కులు, పుండ్లు బయలుదేరుట, వాచుట, చొంగకారుచుండుట. పండ్లు చెడిపోవుట.

గొంతుక:—చిక్కటితెమడను గట్టిగా కాండ్రించినగాని వెడలకపోవుట. పొడిగాను గరుకుగాను వుండుట. లాలాజలమును గుటకవేయుట కష్టముగానుండుట. గవదకాయలు వాచుట.

అన్నకోశము:—ఆకలిపూర్తిగా నశించుట. మాంసమునందును, బంగాళాదుంపలయందును అయిష్టత. నీరుల్లిపాయలను తినలేకపోవుట. భోజనానంతరము వుబ్బరించుట. టీ వలనవచ్చు అజీర్ణము.

పొత్తికడుపు:—గజ్జలలోని మాంసగ్రంథులు వాచుట. గుడగుడలాడుచుండుట, శూలవచ్చుట.

మలము, మలాశయము:—మలాశయము పుండ్లుపడుట. విరేచనబద్ధము. ఆసనములోపోటు. మూలశంఖవాచుట. మలము ఒక్కసారిగావెడలుట. ఆసనమువద్ద పెద్దపెద్ద కాయలవలె బయలుదేరుట. భగందరము.

మూత్రావయవములు:—మూత్రనాళములో మంటగాను, దురదగాను యుండుట. మూత్రము వెడలినపిదప మూత్రపుచుక్కలు మూత్రనాళముగుండా వెడలుచున్నట్లుతోచుట. మూత్రకోశమునకు మూత్రమును వెలువరించుశక్తితగ్గుట. మూత్రపిండములువాచి బాధగా నుండుట.

పురుషావయవములు:—శిశ్నాగ్రచర్మము వాచుట; లోపలివైపున యెఱ్ఱని పొక్కులుబయలుదేరుట. శిశ్నముపైని దురద, మంట. రక్తస్రావము. కుట్టుచున్నట్లుబాధగానుండు సవాయిపొక్కులు బయలుదేరుట. నూతనముగా వచ్చినట్టిగాని. నిలువగాయున్నట్టిగాని లేక అణచిపెట్టబడినట్టిగాని శగరోగమును, శగరోగమువలని మేహవాత నొప్పులనుమాన్పును. ప్రొస్టేటుగ్రంథినుండి స్రావము వెడలుటను, నపుంసకత్వమును, రాత్రియందు బాధతోనుండునట్టి అధిక లేపనమునుమాన్పును. కోడిజుట్టుసవాయినిమాన్పును.

స్త్రీ అవయవములు:—ఆకుపచ్చని చిక్కనికుసుమ విస్తారముగా వెడలుట. ప్రతిబహిష్టులోను రొయిడనుఅండాశయము వాచిబాధగానుండుట. బహిష్టులో స్రావము కొలదిగాను, ఆగుచు ఆగుచు వెడలుట. కాయలు (Polypi) బయలుదేరుట. స్రావములు దుర్వాసనతోను, సులభముగాను అగుట. మూడవ మాసమున గర్భస్రావమగుట.

శ్వాసావయవములు:—పిల్లలవుబ్బసముమీద పనిచేయును (నేట్రిం సల్ఫ). చల్లనిపానీయమువలన ఛాతీలో కుట్టుచున్నట్లుగను బాధలుయెక్కువగుట. వెచ్చదనమువలన వచ్చు దగ్గు.

హృదయము:—గుండెదడ, ఇది నియమిత కాలములయందును, కదలుచున్నప్పుడును, విశ్రాంతితో నున్నప్పుడును కూడ వచ్చుచుండుట. రక్తముపొంగుచున్నట్లుండుట, యెక్కువ దడగానుండుట. నాడినిండుగాను, వడిగాను, సాయంకాలమున వుండుట.

నడుము, కాళ్ళు, చేతులు:—నడుము వంగుట. నడుమునువంచి నిలుచుండుట. పూసరపొట్టుతో నుండుట. తిమ్మెరతోనుండు మేహవాత నొప్పులు. పుప్పిగోళ్లగుట. వేళ్లచివళ్ళు వాచుట, యెర్రపడుట. చైతన్యము లేనట్లుండుట. నడచుచున్నప్పుడు అవయవములు కర్రతోగాని గాజుతో గాని చేయబడుటవలన సులభముగా బ్రద్దలైపోవునని తోచుట.

చర్మము:—అచ్చటచ్చట గోధుమరంగు మచ్చలు బయలుదేరుట. కాయలు, పుండ్లు, రాచకురుపులు మొదలగు బహువిధ చర్మరోగములు బయలుదేరుట. మర్మావయవములు, మూత్రావయవములు, ఆసనము— వీటిమీద పుండ్లు బయలుదేరుట. చెమట తియ్యని లేక గాఢమైన వాసనగా యుండుట. మశూచికములో పొక్కులు పెద్దవియైనప్పుడు పనిచేయును. మాంసగ్రంధులువాచుట, చేతులమీద గోధుమరంగుమచ్చలు బయలుదేరుట.

నిద్ర:—నిద్రలేమి. ఎడమవైపు పరుండినపుడు ఆతురతతోనుండు కలలువచ్చుట. బాధకలుగజేయునట్టి లేపనముతో శృంగారమైన కలలు,

జ్వరము:—పగటియందు అప్పుడప్పుడు చలి వచ్చుచుండుట. లోపల చలిగాను, పైకి వెచ్చగాను, యెక్కువదాహముగాను యుండుట. కప్పుకొనిన ప్రదేశములు పొడిగాను వెచ్చగాను యుండుట చెమటలు ఒకప్పుడు జిడ్డుగాను, ఒకప్పుడు దుర్వాసనగాను లేక తేనెవలె తియ్యని వాసనగాను వుండుట.

ఉద్రేకము:—ఉదయమున, పూర్వాహ్ణమందు, విశ్రాంతివలన, తొందరవలన, ప్రాతఃకాల భోజనానంతరమున.

ఉపశమనము:—బహిరంగమైనగాలిలో, వెచ్చదనమువలన, కదలికవలన, మర్దనమువలన.

సహచరులు:—సబీనా, ఆర్సనికం ఆల్బమ్, నేట్రిసల్ఫ, సైలీషియా

విరుగుళ్లు:—మెర్క్యూరియస్, కేంఫర్, కోల్చికం, కేమోమిల్లా, పల్సటిల్లా, సల్ఫర్, కాక్యులసు.

అయోడియం, మెర్క్యురియసు, నస్సవామికా, సల్ఫరు—లకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 1000 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 3 వారములు.

బాహ్యోపయోగములు:—మెత్తగానుండి, పొడుగుగా వ్రేలాడుచుండునట్టిగాని, మొనతేరియుండునట్టిగాని కాయలకును లేక వులిపిరికాయలకును, పుండ్లకు చుట్టూ బయలుదేరునట్టి గరుకుగానుండు చిన్న చిన్న పొక్కులకును, శగవ్యాధితో వచ్చునట్టి మేహవాత సంబంధమైన కీళ్లనొప్పులకును, మొటిమలకును దీనిని స్వచ్ఛమైన మదరుటించరు దూదమున పైకి పట్టించవలెను.

## 200. ట్రైకోశాంథిస్. TRICHOSANTHES DIOICA.

(హిందూదేశపు ఔషధము. 54. సంస్కృతమున పటోలయనియు తెనుగున చేతిపొట్ల అనియు అందురు.)

ఇది కాలేయము, ప్లీహమును సంబంధించిన దోషములతో యితర రోగలక్షణములు ద్వంద్వముగా యున్నపుడు ముఖ్యముగా వాడదగినది.

మనస్సు, తల:—నిరాశ జెందుచుండుట. పరున్నపుడు తలదిమ్ము వచ్చుట. జ్వరములో తలనొప్పి, తలకు చమటలుపట్టుట. కండ్లుపచ్చబడుట. ఈలక్షణము కాలేయము ప్లీహమువాచిన జీర్ణజ్వరరోగులలో గలుగుట.

నోరు, గొంతుక:—అరుచికుపోవుట. దాహముగా నుండుట. జిగురుగానుండు లాలాజలము వూరుట. గొంతుకనొప్పి. వికారము, త్రేణుపులు, వమనానుమానమును గలుగుచుండుట. రక్తవమనము.

పొత్తికడుపు:—ఖాళీగాయున్నట్లు భావన. గుడగుడలు. కాలేయము ప్లీహమువాచుటతో దగ్గినను, తుమ్మినను, కదలినను నొప్పిగానుండుట.

మలాశయము:—ఆకుపచ్చని పసుపుపచ్చని మిశ్రమవర్ణముగా పైత్యదోషముతో గూడిన విరేచనములు. రక్తవిరేచనములు.

మూత్రావయవములు.—నీళ్లవిరేచనములు వమనములు అగుటతో ద్వంద్వముగా మూత్రము అణచిపెట్టబడుట లేక బంధింబడుట.

జ్వరము:—జీర్ణించిన మన్యపుజ్వరము. జ్వరము మధ్యాహ్నము సుమారు 11 గంటలకు చలితోవచ్చుట. పురాణజ్వరము.

రోగి ఎక్కువ నిస్త్రాణజెందుట మరియు శరీరమంతయు మంటలుగానుండుటయు దీనిముఖ్యలక్షణములు.

పోలికలు:—పోడోఫైలం, ఇపెకాక్.

మోతాదు:— 3 మొదలు 30 పొటెన్సీ.

---

## 201. ట్రేడ్‌స్కాంటియా. TRADESCANTIA.

ఇది ముఖ్యముగా సెగరోగమును మాన్పుటలోను వృషణముల వాపును బాధను మాన్పుటలోను వాడనగును.

తల:—వికారము, తలతిప్పు.

మలాశయము:—నీళ్లవిరేచనము లగుట.

మూత్రావయవములు:—మూత్రము విడుచుట శ్రమకరముగానుండుట, మూత్రనాళమునుండి తెల్లని స్రావము వెడలుట, మూత్రప్రధార పలుచగా నుండుట. మూత్రము పులిసిన వాసనగాను బూడిదరంగు మడ్డితోను, పసుపుపచ్చగాను విస్తారముగాను వెడలుట.

పురుషావయవములు:—వృషణములు ఎఱ్ఱగావాచి, వెచ్చగాను, బాధగాను యుండుట. యిట్టి దోషములు సెగరోగము నణచి పెట్టుటవలన గలుగుట.

శ్వాసావయవములు:— వూపిరికొరకు పెనుగులాడునట్లుండుట. వూపిరిఅందకపోవుట. శ్వాసతీయుట కష్టముగా నుండుట. ఛాతీలో ఎడమనైపు నొప్పిగాయుండుట.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 202. ట్రైఫోలియం రిపెన్సు. TRIFOLIUM REPENS.

గాలిబిళ్లలను మాన్పుటలోనిది అమోఘమైనది. నోటిలో విస్తారము లాలాజలము వూరుచుండుటను, గాలిబిళ్లలను, వీటితో సాధారణముగా నుండు యితరలక్షణములను మాన్పును.

లాలాజలగ్రంథులు వాచుటను, బాధగానుండుటను, గట్టిపడుటను, నోటిలోను గొంతుకలోను రక్తపురుచిగానుండుటను హృదయము ఆగి పోవునేమోయను భయమును ఇదిమాన్పును.

పోలికలు:—ఫైటొలక్కా, మెర్క్యూరియసు.

వుద్రేకము:—పరుండినప్పుడు.

మోతాదు:—1 మొదలు 12 పొటెన్సీ.

---

## 203. టినోస్పోరా. TINOSPORA.

(హిందూదేశపు ఔషధము. 55. తిప్పతీగ.)

బంగాళీలో "గులాంఛా" యందురు.

కాలేయదోషములు, మన్యపుజ్వరము, ఆమవాతదోషములు, నిస్త్రాణ, కష్టు, చర్మరోగములు, సెగ పున్నగు మూత్రావయవ మర్మావయవరోగములు—వీటిమీదనిది బాగుగా పనిచేయును.

అన్నకోశము:—పైత్యవమనము.

పొత్తికడుపు:—కాలేయము, ప్లీహమువోషించుట లేక వాచుట మరియు కామెర్లువచ్చుట. కళ్లుపచ్చబడుట, ఆకలి మందగించుట.

మూత్రావయవములు:—మూత్రము అతితరుమగను కొలది కొలదిగను, మంటతోను, చీమువంటి స్రావముతో కలసియు వెడలుట.

మర్మావయవములు:—సెగరోగముయొక్క అన్నిదశలలోను మరియు, సవాయివ్యాధియొక్క ద్వితీయావస్థలోను యిది బాగుగాపనిచేయును. వీర్యస్ఖలనముల వలని నీరసమునుమాన్పును.

హృదయము:—గుండెదడనుమాన్పును. రేతస్ఖలనముల వలని గుండె నీరసము.

జ్వరము:—నూతనముగా వచ్చినట్టిగాని, జీర్ణించినట్టిగాని మన్యపుజ్వరమును ఇది మాన్పును. అపరాహ్ణమందు చలితోజ్వరము తగులుచుండుట. పైత్యవమనము, దాహము, తలనొప్పి.

మోతాదు:—3 మొదలు 12 పొటెన్సీ.

---

## 204. లెతిరస్ సెటైవస్. LATHYRUS SATIVUS.

(హిందూదేశ పురౌషధము. 56. లంకలు అనబడు ఏనుగు పెసలు).

వికారము, వమనములు, బుద్ధిమాంద్యము, పాడుచున్నట్లుధ్వనులు చెవిలో వినబడుచుండుట, తెలివితక్కువతనము, మున్నగు లక్షణములు దీనిగింజలు తినినవారిలో కలుగుటచే అవే లక్షణములు, రోగులలో కనుపించినయెడల వాటెనిది మాన్పునదిగా సూచింపబడినది. మరియు నిది చంటిపిల్లలకువచ్చు పక్షవాతముమీదను, పలువిధములగు నరములయొక్కయు, వెన్నెముకయొక్కయు రోగలక్షణములమీదను బాగుగా పని చేయును.

మన్సు:—విచారగ్రస్తముగను, తోచకయు, తీరని భయముతోను యుండుట, నిలుచున్నప్పుడు కండ్లు మూసుకొన్నచో వికారమువచ్చుట.

నోరు:—నాలుకచివర మంటగాయుండునట్టి బాధలు, వీటితో నాలుక, పెదవులు మొద్దుబారి, బాధకరముగా యుండుట.

అన్నకోశము:—అజీర్ణముతో కడుపులో బరువుగాయుండుట, ఛాతీవద్దమంట, వికారము, వమనానుమానము, రక్తవమనము.

పొత్తికడుపు:—శూల.

మలము, మలాశయము:—జిగట విరేచనములు, ప్రేగులలో వడిగా నొక్కుచున్నట్లు వుండుటతో వెడలు నీళ్ళవిరేచనములు. విరేచనబద్ధము.

మూత్రావయవములు:—మూత్రము అప్రియత్నముగా వెడలుట. మూత్రకోశముపై నొక్కుచున్నట్లుండు బాగకలిగిన వెంటనే మూత్రవిసర్జనచేయనియెడల మూత్రము అప్రియత్నముగాను, వడిగాను వెడలుట.

పురుషావయవములు:— అప్పుడప్పుడు లేపనముకలిగి స్ఖలనము లగుచుండుట. నపుంసకత్వము.

నడుము, కాళ్ళు, చేతులు:—నడుమునొప్పి, యిందువలన కదల లేకుండుట. తాకుడువలన వుద్రేకము జెందునట్టి నడుమునొప్పి. యేదైన

పనిని జేయుపని యత్నించినపుడు భుజములు కంపములు జెందుట. వేళ్ళచివళ్ళు మొద్దుబారుట, నిబ్బరముగ నిలుచుండలేకపోవుట. కాళ్ళవంగకుండుట. నడుచుచుండునపుడు మోకాళ్ళు తగులుచుండుట. చల్లదనమువలన తిమ్మిరవచ్చుట. మేహవాతదోషముతో కూడినపక్షవాతము. చీలమండలు, మోకాళ్ళు కొయ్యబారుట. నడుచునపుడు కాలిబొటనవేళ్ళు నేలకుబాగుగ తగులుట, మరియు, మడమ నేలకు తగలకుండుట. కాళ్ళు నీలివర్ణముగాను నల్లగాను, మంటగాను, లేక చల్లగాను వాపుతోను యుండుట. కాళ్లకు, మోకాళ్లకు పక్షవాతము వచ్చుట.

ప్రకోపకము:—తాకుడువలన, చల్లని తేమగాలిలో.

ఉపశమనము:—పరుండుటవలన, కప్పుకొన్నవస్త్రములు తీసివేయుటతో.

పోలికలు:—సెకేలే, జెల్సిమియమ్, పిక్రిక్ యాసిడ్, డల్కామారా, నక్సువామికా, లైకోపోడియమ్, కోనియమ్, రూస్టాక్స.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 205. స్టిగ్మేటా మెయిడిస్ STIGMATA MAYDIS.

(హిందూదేశపు ఔషధము. 57. మొక్కజొన్న).

మూత్రనాళము, మూత్రకోశము, మూత్రవాహికలు—వీటికి సంబంధించిన ప్రకోపకమును మాన్పుటలోనూ, హృదయమునకు సంబంధింపనట్టి మూత్రదోషములకును ముఖ్యముగా మూత్రావరోధమునకును, కొన్నికొన్ని కేసులలో మూత్రదోషములతో హృదయదోషముద్వంద్వముగాయుండినను, శరీరమునందు ఉబ్బువ్యాధి జనించినను, జీర్ణించిన మన్యపుజ్వరముకును మూత్రములో శ్వేతధాతువుపోవునప్పుడును, జీర్ణించిన సెగవ్యాధికిని ఇది అమోఘముగా పని చేయును.

ప్రాస్టేటుగ్రంధికి సంబంధించినవాపు బాధతో మూత్రవిసర్జన కష్టముగానుండుట, ఇది జీర్ణించిన సెగతో ద్వంద్వముగాయుండుట యున్నపుడుకూడ నిది యుపయోగకరముగా నుండును.

పోలికలు:—సేబల్ సెర్యులేటా, స్టాఫిసేగ్రియా.

మోతాదు:—3 మొదలు 30 పాటెన్సీ.

---

## 206. ట్రిబ్యులస్ టెరెస్ట్రిస్. TRIBULUS TERRISTRIS.

(హిందూదేశపు ఔషధము. 58. పల్లేరు).

దీనికి ఇక్షుగంధమనికూడ పేరు. ఇది ముఖ్యముగా మూత్రావయవ మర్మావయవ రోగములమీద బాగుగా పనిచేయును.

మూత్రావయవములు:—మూత్రము బాధతో వెడలుటను, మూత్రావయవములలో రాళ్ళుబయలుదేరుటను, ప్రాస్టేటుగ్రంధివాపు బాధతో నుండుటను, ఇవి సెగరోగముచే బాధపడువారిలోగలుగుటను, బాధలు అంగములోనికివ్యాపించుటనుయిందుతో మలమూత్రాదుల విసర్జనయందు అధికమైనబాధలుగలుగుటను, మూత్రమణచి పెట్టబడుటను, రక్తమూత్రమును. అప్రయత్నముగా మూత్రమును విడచుటను మాన్పును.

మర్మావయవములు:—మర్మావయవములు సడలుట, వీర్యమునందలి బలము తగ్గుట, స్ఖలనములు త్వరితముగా నగుట. సంభోగశక్తి తగ్గిపోవుట లేక నశించుట. హస్తప్రయోగము వలని దోషములు. అధిక సంభోగము వలని (ముఖ్యముగా వయోవృద్ధులలో) సమస్త దోషములను మాన్పును.

పోలికలు:—యువాయుర్సీ, బుఖు.

మోతాదు:—మదరుటించరు మొదలు 3 పాటెన్సీ.

---

## 207. పైపరు నైగ్రమ్. PIPER NIGRUM.

(హిందూదేశపు ఔషధము. 39. నల్లమిరియము).

తల నిండుగాను భారముగాను యుండు నొప్పివచ్చుట, శరీర మునందచ్చటచ్చట మంటలుగా యున్నట్లు భావన, కనుబొమలవద్దను, ముఖముయొక్కయు ముక్కుయొక్కయు ఎముకలవద్దను నొక్కుచున్నట్లుండు నొప్పి, గర్భాశయము ముడుచుకుపోవుట, మరియు దీనిలోని కేదియో ప్రవేశింపనున్నట్లు భావనగలుగుట, గుండ్రని ఆకృతిగల అన్యపదార్థము అన్న కోశములోనికి ఎగయుచున్నట్లు భావనగలుగుటయు దీనిముఖ్యలక్షణములు.

మనస్సు:—మనోనిశ్చలతతో నుండలేకపోవుట, చప్పుడువినినచో మనోచాంచల్యము గలుగుట. పొగరుమోతుతనము, తరుమ అతి ఖులాసాగా యుండుట, తనకు విషముపెట్టుదురను భీతినొందుట. విచారము గలుగుట. ప్రేమసంబంధమయిన మనోచాంచల్యము గలుగుట.

తల:—కనుబొమలలోను, ముక్కుయెముక, ముఖముయెముకల లోను, నొక్కుచున్నట్లుండు బాధ. మెదడు ఖాళీగాయున్నట్లు తోచుట. వాతావరణ మార్పులవలన తలయందంతటను నరముల సంబంధమైన బాధ గలుగుట. నడినెత్తి బ్రద్దలగునట్లు తోచునంతటి విపరీతమైన తలనొప్పి. తలయందు రక్తమెక్కువగా జేరుటతో గలుగు బాధ.

కండ్లు:—కనుగ్రుడ్లు బ్రద్దలగుచున్నట్లుండు నొప్పి. కండ్లువాచుట, ఎర్రబడుట, మంటలుగా నుండుట. కనురెప్పలు పుండ్లుపడుట. దృష్టిమాంద్యము, వికారము, వీటితో తలనొప్పి వమనములు యుండుట.

చెవులు:—గూడుపోయునట్టి పుండ్లు బయలుదేరుట.

ముక్కు:—నాసికారంధ్రములు ఆర్చుకుపోయి మంటలుగా నుండుట. ముక్కు దిబ్బడవేయుట. నీళ్ళవంటిస్రావము వెడలుచుండుట. తరచుగా తుమ్ములు, రక్తస్రావము గలుగుట, దురద.

ముఖము:—ఎర్రబారి మంటలుగా నుండుట. లాగుచున్నట్లు లేక పీకుచున్నట్లుండు నరములసంబంధమైన బాధలు. పెదవులపై మంత్రపుపొక్కులవంటి చర్మరోగము బయలుదేరుట. దౌడలు దగ్గరబడుట. పెదవులు పొడిగా బీటలుతీసి యుండుట.

నోరు:—పన్ను గుల్లబారుట (చెడిపోవుట). వెచ్చదనమునలనను, సాయంకాలమున నువుద్రేకించు పంటిసలుపు. నాలుకమధ్యను తెల్లనిపూత గలుగుట. గొంతుక, నోరు, అర్చుకుపోయి మంటగానుండుట. అంగుడు, నాలుక కాలినట్లువలె అర్చుకుపోయి వెచ్చగా నుండుట. నాలుకచివర చిన్నచిన్న పొక్కులు బయలుదేరుట.

గొంతుక:—బాధగాను, మంటగాను, గరుకుగాను యుండునట్లు భావనతో యుండుట. గవదకాయలలో మంటతోగూడిన బాధగలుగుట. ఆమ మెక్కువగా జేరుచుండుటవలన అతితరచుగా కాండ్రించి వుమియవలసి వచ్చుచుండుట. గొంతుక యొక్క యినుపగొట్టమువలె గట్టిగాయున్నట్లు భావన గలుగుట. గొంతుక కండరములకు పక్షవాతము వచ్చుటచే అరచుటకుమాత్రమే వీలుగానుండుట మరియు వాటిని కదల్చుటకు మాత్రము వీలులేకుండుట.

అన్నకోశము:—అతిదాహము, నిండుగాయున్నట్లు భావన. ఉబ్బరింపు. అతిఆయాసముతోగూడిన వమనము. అర్చుకుపోయినట్లును వెచ్చగాను యున్నట్లు భావన. బాధగానుండుట. లాగుచున్నట్లును, ముడుచుకుపోవుచున్నట్లును యుండునొప్పి—దీనితో అపక్వాహారమును లేక అజీర్ణపదార్థములయందును కోరిక కలుగుట.

పొత్తికడుపు:—కంతి బయలుదేరినట్లువలె కాలేయమునందు పొడుచుచున్నట్లును మండుచున్నట్లును యుండుబాధ. ఉబ్బరము, బరువు,శూల, నొక్కుచున్నట్లుండు బాగవలన అంత్రములు బద్దలగువట్లు భావనగలుగుట. గురుగురుమను ధ్వనులు గలుగుట. అంత్రములలోవాపు. దీనితో విస్తారము దాహముగానుండుట. పొట్టలో క్రొవ్వుపెరుగు సూచనలు.

మలము, మలాశయము:—మలాశయద్వారమందు వాపు, బాధ, మంట—యీ బాధవలన మలవిసర్జనకొరకు ప్రయత్నింప భయముకలుగుట. మలాశయము పుండ్లుపడుట. ఎడతెగని విరేచనబద్ధము. దీనికిపిమ్మటఅప్రయత్నముగాపలుచని మలము వెడలుచుండుట. పెద్ద పెద్దమూలశంఖుమొలలు.

మూత్రావయవములు:—మూత్రనాళమునందును మూత్రకోశమునందును మంటగానుండుట. మూత్రవిసర్జన బాధకరముగా నుండుట. దుర్వాసనగానుండు ఆకుపచ్చని స్రావము కడుగునీళ్లవలెను, గోధుమరంగుగాను, రక్తముతోకలసియు తియ్యని పంచదారవంటి పదార్థముతోను (మధుమూత్రము), రక్తముతోకలసియు, ఇసుక కలసియు మూత్రముతో వెడలుట. మూత్రకోశము నిండుగను, వాపుగానూ, తరుచు మూత్రవిసర్జనానుమానముతోనూ యున్ననూ మూత్రము జారీగా వెడలకుండుట.

పురుషావయవములు:—అధిక లేపనము. బొగడలో మండుచున్నట్లు గ్రుచ్చుచున్నట్లు యుండు బాధలు.

స్త్రీఅవయవములు:—అండాశయము, గర్భాశయమునందు గ్రుచ్చుచున్నట్లును, పొడుచుచున్నట్లును బాధగాను, వాపుగానుయుండుట. గర్భాశయము మంటగాను, నొప్పులు విస్తరించుచున్నట్లుగాను యుండుట. గర్భాశయమునందు మంటలుగాను, దిగలాగుచున్నట్లును యుండు బాధలు. ఋతుశూల. నల్లని ఋతురక్తము స్రవించుట. పలువిధములగు ఋతుదోషములు.

శ్వాసావయవములు:—స్వరశ్లేటిక పుండుపడుట. సాయంకాలమునను, పరుండుటకు ముందుగను విపరీతమైన దగ్గువచ్చుట. కంఠస్వరము హీనముగాను, గరుకుగాను, అస్పష్టముగాను యుండుట. అప్పుడప్పుడు వూపిరితీయుట కష్టముగానుండుట. దగ్గు ఎక్కువగా వచ్చినపుడు రక్తమునుగూడ వుమియుచుండుట. దగ్గు వచ్చినపుడెల్ల చీల్చుకు పోవునట్లుగాను, రక్తము వుమియనున్నట్లుగాను తోచుట. ఛాతీలో వెచ్చగాను, మంటగాను యుండుట. స్త్రీలలో స్తన్యము ఎక్కువగా యుండుట.

హృదయము:—తరచుగా గుండెదడ వచ్చుచుండుట. హృదయము చుట్టూ నీరుయున్నట్లు భావన.

నడుము, కాళ్ళు, చేతులు:—కీళ్ళు వాచి, వెచ్చగాను, ఎర్రగాను, బాధగాను యుండుట. మూత్రపిండములలోను కటిప్రదేశము నందును మంటగాను, ముడుచుకుపోవుచున్నట్లును యుండుట.

చర్మము:—ముఖముపై పెద్దపెద్ద పొక్కులు బయలుదేరి అవి మానినపిదప మచ్చలుపడుట. పెదవులపై మంత్రమువంటి పొక్కులు బయలుదేరుట, చర్మము అతిమృదువుగా లేక సున్నితముగా యుండుట. గోకుటవలనను, వెచ్చదనమువలనను కదలికవలనను, దురద ఎక్కువగుట.

నిద్ర:—ఆపుకోనలేనంత నిద్రమత్తుతోనుండుట. బద్ధకము తీరనటువంటినిద్ర. నిద్రలోయున్నపుడు భయము మున్నగు లక్షణములతో గుండె మరియు ఛాతీ బరువెక్కుట. రాత్రి నిద్రమెలకువ వచ్చినపిదప తిరిగి నిద్రపట్టకుండుట.

జ్వరము:—నుదురు, వెచ్చగాను తలభారముగాను, వికారముగాను యుండుట. ఎక్కువ వెచ్చదనము, చల్లని చెమట శరీరమునందంతటను పట్టుచుండుట. చర్మము చల్లగాను పొడిగాను యుండుట. ఒకప్పుడు వెచ్చగాను, ఆర్చుకుపోయి గరుకుగాను యుండుట. చెమటవలన చర్మము తినివేయబడునట్లుగా కనబడుట.

సాధారణలక్షణములు:—ఎముకలు పెళుసుగానుండుట. బంధించప్పుడు వినబడుటతో చెవులు గళ్లుపడుట, మరియు కంపమువచ్చుట. ధనుర్వాతములోవలె అవయవములు కొయ్యబారుట, కంపించుట.

ఉద్రేకము:— కదలికవలన, తేమగాలిలో, సాయంకాలమున, శీతోష్ణస్థితియందలి మార్పులవలన.

పోలికలు:—క్యూబెబా, పైపరు మెతిస్టికం లేక కావాకావా.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

## 208. సిన్నమోనం. CINNAMONUM.

(హిందూదేశపు ఔషధము. 60. లవంగపట్ట లేక దాల్చినిచెక్క.)

ఇది ముఖ్యముగా రక్తస్రావములమీద బాగుగా పనిచేయునదిగ రియించబడినది. కదలికవలన వుద్రేకించునట్టియు, స్వచ్ఛమైనట్టియు నిగ నిగలాడుచుండు యెఱ్ఱని రక్తస్రావములకు దీనిని వాడవచ్చును. అంత్రము లనుండిగాని, నోటినుండిగాని, ముక్కునుండిగాని, అగునట్టి రక్తస్రావము లను, ముఖ్యముగా ప్రసవానంతర రక్తస్రావము (Post Partum Haemorrhage) ను యిది మాన్పును. యెముకలలోను కండరముల లోను గలుగు నొప్పులకును స్రావములవలన వచ్చు నీరసమును మాన్పుటకు ను దీనిని వాడవచ్చును. తేపులు, వికారము, లేక వమనములు వచ్చిన పిదప వుపశమించునట్టియు, స్త్రీల అపస్మారసంబంధమైనట్టియు కంప ములను ఇది మాన్పును.

అన్నకోశము:—ప్యారిచేయుచున్నపుడు వికారము లేక వమనాను మానము గలుగుట; ఆంబవమనము.

పొత్తికడుపు:—ఉబ్బరింపు.

మలము, మలాశయము:—పులియగొట్టుట, పానీయములను తీసుకొ నుటవలన వుద్రేకించునట్టి నీళ్ళవిరేచనములు. అపానవాయువు వెడలు చుండుట. మలము వుండలవలె గట్టిగా వెడలుట. నిలువగాయున్న విరేచన బద్ధము.

స్త్రీ అవయవములు:—బరువు నెత్తుటవలనను లేక ప్రసవించిన పిదపను, గలుగు రక్తస్రావములు. నిద్రమత్తుగానుండుట. బహిష్టుకు బహి ష్టుకు మధ్య గలుగుచుండు రక్తస్రావములు. గర్భిణీలోను ప్రసవానంతర మునను, గలుగు రక్తస్రావములు. దిగలాగుచున్నట్లు నొప్పిగా నుండుట. మాట్లాడుటవలన గలుగు నిస్త్రాణతో వచ్చు అపస్మారలక్షణములు లేక కంపములు.

విరుగుళ్లు:—ఎకొనైటు.

ఓపియము అనుమందునకిది విరుగుడు.

పోలికలు:—ఇపెకాక్, సైలీషియా, ట్రిల్లియం.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 209. టబాకం. TABACUM.

(పొగాకు)

పలువిధములగు హృద్రోగములకును, నరములదోషములకును, కలరా వ్యాధికి నిరోధకౌషధముగను ఇది పనిచేయును. రోగి మత్తుజెందుట, చని పోవనున్న వానివలెనగుపడుట, తలతిర్పు, వమనములు, శరీరము మంచు గడ్డవలె చల్లగానుండుట, మరియు, చమటలుపోయుట, నాడి ఆగి ఆగి కొట్టుకొనుచుండుట—ఇవి దీనిముఖ్యలక్షణములు. ఎంజీనాపెక్టోరిసు అన బడు హృదయరోగమున కిది సిద్ధౌషధము వంటిది.

మనస్సు:—ఆందోళనగనుతీరని విచారములో మునిగియుండుట. మాట్లాడుట కిష్టముండకపోవుట. ఎక్కువ దురదృష్టతకలిగినట్లు తోచు చుండుట. నిరాశగలుగుట, తృప్తిజెందకుండుట, జ్ఞాపకశక్తినశించుట. పిరికితనము గలుగుట.

తల:—కన్నులుతెరువగనె వికారము వచ్చుట. వికారము, వమన ములు, అప్పటప్పట వచ్చుచుండుట. నరముల దోషమునకుచెందిన చెము డువచ్చుట బద్దితోకట్టినట్లు బిగువుగా తోచుట (కేక్టసు).

కన్నులు:—దృష్టిమాంద్యము. దృష్టికి తెరఅడ్డువైచినట్లుండుట.

ముఖము:—పాలిపోయి, నీలివర్ణముగాఅయి, ముడుచుకుపోయి, చల్లనిచమటతోనిండి యుండుట (విరేట్రింఆల్బం, ఆర్సెనికంఆల్బం).

గొంతుక:—పొగవ్యాసకులలో గొంతుక బొంగురుతనము,

అన్నకోశము:—ఎడతెగని వికారము, వమనానుమానము. సముద్రయానమువలని దోషములు. పుగాకుపొగను భరింపలేకుండుట వేవిళ్లు.

పొత్తికడుపు:—బంధింపబడినగిలక. బాధతోకూడిన పొంగరింపు.

మలము. మలాశయము:—ఆంత్రములలో వాయువుచేరుట. మానని విరేచన బద్ధము. ఒకప్పుడు విపరీతముగా నీళ్లవిరేచనము లగుట. మలాశయము వెలుపలకు వచ్చుట. మలాశయద్వారమునకు పక్షవాతము వచ్చుట. ఆసనము తీపు.

మూత్రావయవములు:—మూత్రవాహికగుండా బాధ ఎడమవైపునవచ్చుట.

పురుషావయవములు:— నపుంసకత్వము. ప్రాస్టేటు గ్రంధినుండి స్రావమువచ్చుచుండుట. తరుచు స్ఖలనము గలుగుట. అవయవము సడలిపోవుట. సంభోగేచ్ఛ లేకుండుట, మరియు స్ఖలనమే గలుగకుండుట.

స్త్రీ అవయవములు:— బహిష్టునుపిదప చిక్కగా నీళ్లవలె వెడలు కుసుమ. గర్భిణీలో పంటినలుపు. వేవిళ్లు.

హృదయము:—ఎడమవైపున పరున్నచో గుండెదడవచ్చుట. హృదయదోషముతో అకస్మాత్తుగా సొమ్మసిల్లి పోవుచుండుట. నాడీవక్రముగను నీరసముగను యుండుట.

శ్వాసావయవములు:—ఎక్కిళ్లకు పిదప దగ్గువచ్చుట. పొడిదగ్గు వచ్చుచుండుటతో చన్నీళ్లుత్రాగుటకు కోర్కెగలుగుట (కాస్టికం, ఫాస్ఫరను).

కాళ్లు, చేతులు:—మంచువలె చల్లగానుండుట, వణకుట. పక్షవాతమువచ్చుట.

నిద్ర:—సాయంకాల భోజనానంతరము వెంటనే నిద్రజెందుట. స్మారకము తెలియని నిద్ర. భయముతో నిద్రనుండి మెలకువజెందుట.

జ్వరము:—చలితో చల్లని చమటలుపట్టుట. నాడి ఒకరకముగా నుండక పోవుట. రాత్రిచమటలు పట్టుట.

విరుగుళ్లు:—వినిగార్, కేంఫరు, కాఫీ, ఆర్సెనికంఆల్బం, నక్సువామికా, ఇగ్నేషియా, ఫాస్ఫరసు, పల్సటిల్లా, స్పైజీలియా, క్లెమేటిసు, లైకోపోడియం, సేపియా.

స్ట్రెమోనియం, సిక్యూటావిరోసా—లకిదివిరుగుడు.

వృద్ధికము:—నొక్కుటవలన, పరుండుటవలన, కదలికవలన, రాత్రియందు.

వుపశమనము:—యేడ్చుటవలన, వమనమువలన, నడచుటవలన.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 210. యుర్టికా యూరెన్సు. URTICA URENS.

కాల్పులు, దురదలు మంటలతోకూడిన పలువిధ చర్మరోగములు, మేహవాతదోషము నిలువగాయుండుటతో చిన్నచిన్న కీళ్లు వంగకపోవుట, ప్లీహదోషములు, స్తన్యదోషములు—వీటిమీద నిది ముఖ్యముగాపనిచేయును.

తల:—నిండుగాను, నొప్పిగాను యుండుట. వికారము, తలతిర్పు వచ్చుట తలపై చిన్నచిన్న పొక్కులు బయలుదేరుచు, అణగి పోవుచు యుండుట. కుడిపైపున తలనొప్పివచ్చుట (శాంగ్వినేరియా).

అన్నకోశము, పొత్తికడుపు:—చర్మరోగముల నణచిపెట్టుటవలని వమనములు. గొంతుక మంటతోకూడిన వికారము. పొత్తికడుపులో వుదయమున 10 గంటలకు పరున్నప్పుడు నొప్పిగా యుండుట. పేగులు నీళ్లతో నిండియున్నట్లు గలగల శబ్దమగుట. కాలేయమునకు సంబంధించిన కంతి బయలుదేరుట,

మలము, మలాశయము:—వుదయమున విరేచనముసలేకాకుండుట. విరేచనమునందు జిగట విస్తారముగా వెడలుట. జిగటవిరేచనములు చాల దినములవరకు వెడలుచునే యుండుట.

పురుషావయవములు:—వృషణముల దురదవలని నిద్రలేమి, బాధ వచ్చుట. వృషణములవాపు.

స్త్రీఅవయవములు:— స్తన్యము తక్కువగానుండుట. కుసుమ వగరు వాసనగను ఒరుపును గలుగజేయుచు స్రవించుట. గర్భాశయ రక్తస్రావములు. స్తనములువాచుట.

కాళ్ళు, చేతులు:—కీలమండలలోను, గుత్తులలోను మేహవాత సంబంధమైన నొప్పులు.

చర్మము:—మచ్చలు యెత్తుగా బయలుదేరుట. మచ్చలమధ్య తెల్లగాను, చుట్టూ ఎర్రగాను యుండుట. దురదగానుండు మచ్చలు. కాల్పులు, బొబ్బలు, వీటివలని పలువిధములయిన మంటలు, బాధలు. ఆటలమ్మ.

నిద్ర:—చదువుచున్నప్పుడు నిద్రమత్తుగా యుండుట.

జ్వరము:— మేహవాతజ్వరము. ఉష్ణజ్వరము. రాత్రియందు పరున్నప్పుడు జ్వరము వచ్చుట.

ప్రకోపకము:—శీత గాలిలో, తేమ గాలిలో, నీళ్లవలన, తాకుడువలన, పరున్నచో.

యూపిసు—నకిదివిరుగుడు.

పోలికలు:—నేట్రింమూరు, యాసిడ్ యూరిక్, సీనోతసు, యూపిసు, మెడ్యూసా.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—కాల్పులకు, బొబ్బలకు, దీనిని స్వచ్ఛమైన మదరుటించరు రూపమునగాని సమభాగముగా మంచినీళ్ళలో కలిపి, లోషనుగాచేసి దానితోగాని దూదినిగాని గుడ్డనుగాని తడిపి పైకివేయవచ్చును. దీనిని పైకివాడునపుడు ఇదే మందును పొటెన్సీరూపమున కడుపులోనికి కూడ వాడవలయును.

## 211. యుస్టిలాగో. USTILAGO.

స్త్రీ పురుషుల మర్మావయవ రోగములమీదనిది బాగుగా పని చేయును.

గర్భాశయద్వారము సరిగా ముడుచుకొనక పోవుట, గర్భాశయము నిస్త్రాణజెందుట, ముట్టుడుగు కాలమునందు శరీరమునందచ్చటచ్చట వాపులు బయలుదేరుట, గర్భాశయ రక్తస్రావములు, బట్టతలయగుట— వీటిమీద నిది ముఖ్యముగా పనిచేయును.

మనస్సు, తల:—అస్థిమితముగాను, చిరచిరగాను యుండుట, బహిష్టు దోషములవలని తలనొప్పి. వీర్యస్ఖలనములవలని మానసిక దౌర్బల్యము. తలనిండుగా యున్నట్లుండుట.

ముఖము, కన్నులు:—కండ్లయెదుట మక్కలు ఆడుచున్నట్లుండుట కండ్లు నిస్త్రాణజెందుట, ముఖము మంటలుగా యుండుట.

అన్నకోశము, పొత్తికడుపు:—కొలది ఆకలి. రాత్రియందు దాహముగొనుట. పులితేన్పులు. బొడ్డువద్ద కోయుచున్నట్లుండు నొప్పి.

పురుషావయవములు:—హస్తప్రయోగము చేయుటను మానజాలక పోవుట. శృంగారసంబంధమయిన ఆలోచనలతోను కోర్కెలతోను శుక్లనష్టము ద్వంద్వముగానుండుట. ముష్టిమైథునాపేక్షతోవచ్చు స్ఖలనములు. లేపనము నశించుట. వృషణములలో నొప్పిగనుండుట.

స్త్రీఅవయవములు:—ఎడమ అండాశయము వాపు, బాధ. అండాశయములందు మంటలు. ఋతువు అణచిపెట్టబడుట. ఋతుస్రావము కట్టిపోయినను తిరుగ త్వరలోనే స్రవింప నారంభించుట. ప్రసవమునందు నొప్పులు కొలదిగావచ్చుట. గర్భాశయము స్వస్థానముతప్పి, అడ్డముతిరుగుట, పెద్దదగుట. బహిష్టుకుబదులుగా ముక్కునుండియు, ఇతరఅవయవములనుండియు రక్తస్రావములగుట.

జ్వరము:—రాత్రియందు చర్మముపొడిగాను, వెచ్చగాను యుం

డుట. చమటలు విస్తారముగాపోయుట. గుండెదడవచ్చుట.

నడుము, కాళ్లు, చేతులు:—కంపములువచ్చుట, కండరములు విస్తారిణజెందుట. నీళ్లు సలసలమరుగుచున్నట్లు నడుముపొడుగునను యుండుట.

చర్మము:—చిన్న చిన్న కురుపులు బయలుదేరుట. రాగిరంగుమచ్చలు బయలు దేరుట. మంత్రిపుష్కలు అర్చుకుపోయి పొడిగానుండుట.

ఉద్రేకము:—నొక్కుటవలన, తాకుటవలన, నడుచుటతో.

పోలికలు:—లిలియంటిగ్, కాలోఫైలం, హెమ్ మెలిసు, బొవిస్టా, మిల్లిఫోలియం.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 212. యువాయుర్సి. UVA URSI.

ముఖ్యముగా నిది మూత్రావయవ రోగములమీద పనిచేయును.

ఆమముతోగూడి మూత్రము వెడలుట, రక్తమూత్రము, మూత్రవరోధము—ఇవి దీని ముఖ్యలక్షణములు.

మూత్రకోశమునందు బాధతో తరుచు మూత్రానుమానము గలుగుచుండుట. మూత్రకోశమునందు మంటగను, చీల్చుచున్నట్లు బాధగను యుండుట. ఆకుపచ్చగానుండు మూత్రము అప్రయత్నముగా వెడలుట.

వుపశమనము:—వెల్లగిల పరుండుటవలన.

పోలికలు:—గార్డియా.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ.

---

## 213. విరేట్రం ఆల్బమ్. VERATRUM ALBUM.

చిన్నపిల్లలకును, ముసలివారికిని, వాతశరీరులకును, వరముల దోషములతో బాధపడు యువకులకును వచ్చు రోగములమీద నిది బాగుగా వుపయోగపడును. చైతన్యశక్తితగ్గుట, నాడి నీరసించుట, రొమ్ముక్రోవ విస్తారించి, ముఖముమీద చల్లని చెమటపట్టుటతో నుండు రోగలక్షణములు, నీళ్ళవిరేచనములు, వమనములు, కాళ్లలోను, చేతులలోను లాగుచున్నట్లుండు బాధలు గలుగుట, విపరీతమైన వికారము, వమనములగుట—దీని ముఖ్యలక్షణములు. కలరా వ్యాధిలో ముఖ్యముగా ప్రథమ ద్వితీయావస్థలలో ఇది బాగుగా పనిచేయును.

మనస్సు:—నిజము నెప్పుడును చెప్పనేరకపోవుట. దురదృష్టము రానున్నదని అపభ్రమపడుట. సూతిక సంబంధమైన పిచ్చితనము. సన్నిపాత లక్షణములు.

తల:—ఆకుపచ్చని ఆమము కలసి వెడలునట్టి వమనముతోనుండు తలనొప్పి. నడినెత్తిమీద మంచుగడ్డయున్నట్లు చల్లగానుండుట, నుదుట చల్లని చెమటపట్టుట. ముడుచుకొనిపోయినట్లుండుట.

కండ్లు:—ఎర్రబారుట, నీళ్లు కారుచుండుట, కాంతి తగ్గుట. కనురెప్పలు ఆర్చుకుపోవుట, బరువుగానుండుట.

ముక్కు:—రాత్రి నిద్రయందు కుడి నాసికారంధ్రమునుండి రక్తము స్రవించుచుండుట. పొడుగుగానగుట.

ముఖము:—చల్లగాను, పాలిపోయి వుండుట, బుగ్గలు నొక్కుకుపోవుట. దౌడలు దగ్గరపడుట. బుగ్గలు వెచ్చగాను, మంటగాను యుండుట.

నోరు:—నాలుక పాలిపోయి చల్లగానుండుట. పండ్లు సీసముచే నింపబడినట్లు బరువుగాను, పోటుగాను వుండుట. వుప్పని లాలాజల మూరుచుండుట.

గొంతుక:—ఆర్చుకుపోయినట్లుండుట, ఈ లక్షణము పానీయములు

తాగుటవలన వుపశమించక పోవుట.

అన్నకోశము:—రుచి చేదుగా నుండుట. బాధలు అన్నకోశము పైభాగమున బయలుదేరి, పైనైపునకును, యిరుపక్కలకును వీపులోనికిని వ్యాపించుచు క్రమముగా తగ్గుట మరియు చలిచే కంపమువచ్చుట. ఆకలి యెక్కువగా నుండుట. చన్నీటికై కోరుచుండినను దీనిని తీసికొనినవెంటనే వమనము చేసుకొనుట. స్వల్పకదలికవలనను లేక పానీయములను తాగుటవలనను వుద్రేకమునొందునట్టి వికారము, వమనములు. పండ్లను, చల్లనిపదార్థములను, పానీయములను, మంచుగడ్డను, వుప్పును కోరుట. విరేచనానంతరము యెక్కువ నిస్త్రాణనొందుట.

పొత్తికడుపు:—మంటగా నుండుట. ప్లీహము వాచుట. గిలక ముందరకు చొచ్చుకువచ్చినట్లు భావనకలుగుట.

మలము, మలాశయము:—అలసి పోవువరకును తినుకుట. చల్లని చెమటపట్టుటతో నుండు పెద్దపెద్ద విరేచనములు. వడిగాను, నీళ్లవలెను, విస్తారముగాను, బాధతోను వెడలునట్టి నీళ్లవిరేచనములు. వీటివలన యెక్కువ నిస్త్రాణగలుగుట. విరేచనములతో వమనములు వెడలుచుండునట్టి కలరా వ్యాధిలోనిది బాగుగాపనిచేయును. కలరావ్యాధిలో దీనిని కేంఫరు, ఆర్సెనికంఆల్బమ్, కార్బోవెజ్, యాసిడ్ హైడ్రోసయానికం—వీటిలక్షణములనుగూడ ఆలోచించి వాడుటమంచిది.

మూత్రము:—అణచిపెట్టబడుట. చుక్కలు చుక్కలుగా పడుట. ఆకుపచ్చగాను, అప్రయత్నముగాను వెడలుట.

పురుషావయవములు:—శిశ్నాగ్రచర్మము ఒరియుట. వృషణములలో లాగుచున్నట్లు బాధగానుండుట.

స్త్రీఅవయవములు:—ఋతువు ముందరగాను, స్రావమెక్కువగాను, నిస్త్రాణను గలుగజేయుచును వెడలుట. ఋతుశూల. దీనితోశరీరములో చల్లదనము, నీళ్లవిరేచనములు, చల్లనిచెమట యుండుట. కొలదిపరి

శ్రిమవలన కూడ సొమ్మసిల్లుట. బహిష్టుసమయందు సంభోగ సంబంధమైన భ్రమగలుగుట.

శ్వాసావయవయములు:—చల్లటినీటిని త్రాగుటవలన దగ్గువచ్చుట. దగ్గునప్పుడు మూత్రము వెడలుట. ఛాతీలో శ్లేష్మసంబంధమైనగురగురలు. ముసలివారిలో నిలువగాయున్న బ్రాంకైటిసుమీద పనిచేయును. చల్లని గాలిలోనుండి వెచ్చనిగదిలోనికి వెడలుటవలనవచ్చు దగ్గు (బ్రయొానియా).

హృదయము:—ఆతురతతో నుండు దడ. నాడి నిస్త్రాణగాను,వక్రముగాను యుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—కోరింతదగ్గుచే బాధపడు పిల్లల మెడలోని నీరసమువలన వారు మెడను నిలపలేకపోవుట. పిక్కలలోలాగుచుండుట. కాళ్లు, చేతులు మంచుపలె చల్లగానుండుట. తొడలలోను, వీపులోను, చితుకకొట్టినట్లు బాధగానుండుట.

చర్మము;—నీలివర్ణముగాను, చల్లగాను, మర్వాసనతో యుండు చెమటతోను, చైతన్యములేనట్లు చల్లగాను వుండుట. కాళ్లయొక్కయు, చేతులయొక్కయు, చర్మము ముడతలు పడుట.

నిద్ర:—యెక్కువ నిద్రమత్తు, ఆవలింతలు.

జ్వరము:—శరీరమంతటను, ముఖ్యముగా నుదిటియందును చల్లని చెమటపట్టుట. పైనిచల్లగాను, లోపలవెచ్చగాను యుండుట. యెక్కువ దాహము. శరీరము చల్లదనముతోను, చలితోనుయుండుట; మరియు చలి తలనుండి బొటనవేళ్లవరకును పాకుట.

వృద్ధికము:—పానీయములు త్రాగినపిమ్మట, మలవిసర్జనకు ముందు వెనుకలుగ, నిద్రించిన పిమ్మట, కదలికవలన, బహిష్టుకు ముందుగ, బహిష్టులో.

వుపశమనము:—నడచుటవలన, నొక్కుట వలన, వెచ్చదనమువలన.

విరుగుళ్ళు:—ఎకోనైట్, కాఫీ, కెంఫరు, చైనా.

ఆర్సెనికంఆల్బం, చైనా, కుప్రింమెట్, ఫెర్రింమెట్, ఓపియం, టబాకం—లకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 5 లగాయితు 8 దినములు.

---

## 214. విరేట్రిం విరిడీ. VERATRUM VIRIDE.

రక్తాధిక్యతగలవారికి వచ్చు రోగలక్షణములమీదను, మేహవాత దోషములమీదను రక్తదోషములతో గూడిన జ్వరములు మున్నగు రోగముల మీదను బాగుగా పనిచేయును.

ఎండ వేడిమివలనను; బహిష్టును, ప్రసవానంతరస్రావమును అణచిపెట్టుటవలనను వచ్చిన రోగలక్షణములమీద బాగుగా పనిచేయును.

మనస్సు, తల:—మగతగను, పరాకుమాట లాడుచునుయుండుట. తలకురక్తమెక్కువగా చేరుట. తల మొద్దుబారుట. తలనొప్పి. తల వెచ్చగను కండ్లు యెఱ్ఱగను అగుట. వికారము, తల త్రిప్పువచ్చుట.

ముఖము, కన్నులు:—కందబారుట. త్రాగినవాని ముఖమువలె నగుట. కంటిపాపలు పెద్దవగుట. ఒక వస్తువు రెండువస్తువులుగా కనబడుట.

ముక్కు, నోరు:—తుమ్ములు, జలుబువచ్చుట. ముక్కునుండి నీళ్ళవంటి స్రావము. నాలుకపై తెల్లని లేక పసుపుపచ్చని పూత. లాలాజల మెక్కువగా వూరుట.

అన్నకోశము:—దాహముగా నుండుట. వెచ్చని పానీయమువలన నులిమివేయుచున్నట్లుండు నొప్పి యెక్కువగుట. ఆహారము యిముడక పోవుట. అజీర్ణము. మంటలుగా నుండుట. తీవ్రముగా ఎక్కిళ్ళువచ్చుట.

పొత్తికడుపు:—బొడ్డువద్ద ఎక్కువనొప్పిగా నుండుట. గురగుర శబ్దముగుచుండుట.

మలాశయము:—ఆసనమువద్ద పురుగులు ప్రాకుచున్నట్లుండుట.

మూత్రావయవములు:—మూత్రము విడచునపుడు మూత్రనాళమునందు చిమచిమ లాడుట. మూత్రము కొద్దిగాను, స్వచ్ఛముగాను లేక నుబ్బురంగుగాను, కొలది మడ్డితోను వెడలుట.

పురుషావయవములు:—ఎడమ వృషణములో బాధగానుండుట.

స్త్రీఅవయవములు:—గర్భాశయ ద్వారము గట్టిగా ముడుచుకుపోవుట (జల్సిమియం, బెల్లడోనా). గర్భాశయము నొప్పిగాయుండుట. మెదడు నిండుగా నున్నట్లుండుటతోను, వికారము, వమనములతోను యుండునట్టి ఋతుశూలల. ఋతువు అణచిపెట్టబడుటతో తలకు ఎక్కువ రక్తముజేరుట, తల నొప్పివచ్చుట (బెల్లడోనా).

హృదయము:—నాడి నిస్త్రాణగాను, నెమ్మదిగాను, విడిచివిడిచియు, పలువిధములుగా కొట్టుకొనుచుండుట. నాడి చురుకు, నీరసము (డిజిటాలిసు, టబాకం).

చేతులు, కాళ్ళు:—మెడవెనుకను, భుజములలోను నొప్పులు, బాధలు. మేహవాత నొప్పులు.

చర్మము:—దురద. వెచ్చని చమట పట్టుచుండుట.

జ్వరము:—వుదయమున తగ్గుచు, సాయంకాలమున హెచ్చుచుయుండుట.

వుద్రేకము:—వుదయమున, సాయంకాలమున, కదలిక వలన.

వుపశమనము:—ముందుకు వంగుటవలన, పరుండుటవలన, మర్దనము వలన, నొక్కుటవలన.

విరుగుళ్లు:—వేడికాఫీ.

ప్రచ్ఛిన్నం:—న కిదివిరుగుడు.

పోలికలు:—జల్సిమియం, బెల్లడోనా, ఫెర్రంఫాసు, బాప్టీషియా, ఎకోనైటు, స్ట్రెమోనియం, హయాస్యామసు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 215. వెర్బేస్కం. VERBASCUM—MULLEIN.

ఇది చెవియొక్కయు మూత్రావయవముల యొక్కయు, నరముల యొక్కయు, రోగములమీద బాగుగా పనిచేయును. చెవిపోటును చెవి నుండి చీము వెడలుట మొదలగు చెవి సంబంధమైన రోగములన్నిటి మీదను బాగుగా పనిచేయును.

చెవులు:—గళ్ళుపడుట. స్రావము వెడలుచుండుట, ఆర్చుకుపోయి పొరలు పొరలుగానుండు పదార్థము వెడలుచుండుట—ఈ లక్షణములకు దీనిని చెవిలోగూడ దిగువను చెప్పబడిన రీతిని వేయవలెను. దీనితో చేయబడిన ముల్లీన్ ఆయిలు వలన చెవిపోటు వెంటనేమానును.

పొత్తికడుపు, ఆసనము:—బొడ్డువద్ద యెక్కువ బాధగా నుండుట. విరేచనముగట్టిగానగుట. బాధగానువాపుగానుయుండునట్టి మూలశంఖ.

మూత్రావయవములు:—మూత్రము యెల్లప్పుడును చుక్కలుగా వెడలుచుండుట. మూత్రమప్రియత్నముగా వెడలు చుండుట. మూత్రము మంటతో వెడలుట.

నిద్ర:—భోజనము చేసినవెంటనే నిద్రపోవలయునని యుండుట. నిద్ర కొలదిగా మాత్రమే పట్టుట. నిద్రలో యుద్ధములు, శవములు కనిపించుట.

వృద్రేకము:—వాతావరణమార్పులవలన, మాట్లాడుటవలన, తుమ్ముటవలన.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. దీనిగుణకాలపరిమితి 4 లగాయితు 8 దినములు,

బాహ్యోపయోగములు:—దీనిని స్వచ్ఛమైన మదరుటించరులో తీసి కొని 4 రెట్లు కొబ్బరినూనె లేక గ్లిసరిన్ లో కలిపి చెవిరోగములన్నిటికిని వాడవచ్చును ఇట్లే యీ ఔషధముతో తయారుచేయబడిన ముల్లీన్ ఆయిల్ అనబడు స్పెషల్ ఔషధమును వృషణముల వాపులకు, మూత్రపిండముల వాపులకు గులాబీరంగుగానుండు పుట్టపరిణమునకును ముఖ్యముగా చెవిపోటును చెవినుండివచ్చు చీమును కట్టుటకు, గుగులివిని వెలుపరించుటకును, చెవుడు మొదలగు యితరములైన చెవి రోగములన్నిటికిని వాడవచ్చును.

---

## 216. వైబర్నం ఆప్యులను. VIBURNUM OPULUS.

ముఖ్యముగా ఋతుశూల, గర్భస్రావము, దొంగనొప్పులు—వీటి మీద నిది బాగుగా పనిచేయును. బాధలు పీకుచున్నట్లును, నొక్కుచున్నట్లును పొడుచుచున్నట్లు యుండుటనుమాన్పును. గర్భస్రావము కలుగకుండ జేయును. ఋతుశూలను మాన్పును.

తల:—కంగారుగా నుండుట. మానసిక పరిశ్రమయం దిష్టముండక పోవుట. చిరచిరలాడు చుండుట. వికారమువలన ముందరకు పడిపోవుచు న్నట్లుండుట. కణతలలో యెక్కువ బాధగా నుండుట. కనుగ్రుడ్లలో నొప్పులుగా యుండుట. తుమ్ములు. ముక్కునుండి నీళ్లవంటి స్రావము వచ్చుట. పెదవులు ఆర్చుకుపోవుట.

అన్నకోశము:—భోజనానంతరము వికారముగానుండుట తగ్గుట. ఆకలియుండకపోవుట.

పొత్తికడుపు:—ఆకస్మికముగా వచ్చి, నొక్కుచున్నట్లును, పీకుచున్నట్లును, పొడుచుచున్నట్లును వుండు బాధలు. బొడ్డువద్ద యెక్కువ నొప్పిగానుండుట.

మలము, మలాశయము:— ఒకసారి నీళ్లవిరేచనములు, మరియొక సారి విరేచనబద్ధము యుండుట. మలము యెక్కువగాను, గట్టిగాను, ఆస

నములో కోయుచున్నట్లుండు బాధతోను, తీపుతోను వెడలుట.

మూత్రావయవములు:—దగ్గువలనను, నడుచునప్పుడును మూత్రము ఆపుకొనుట కష్టముగా నుండుట. తరుచు మూత్రానుమానము గలుగు చుండుట.

పురుషావయవములు:—స్వప్నము లేకుండగనే స్ఖలనమగుట.

స్త్రీ అవయవములు:—తెల్లగాను, చిక్కగాను, విస్తారముగాను వెడలునట్టి కుసుమ; ఇది బహిష్టుకు పిమ్మట పసుపుపచ్చగాను, పల్చగాను వెడలుట. ఋతువు చాల ఆలస్యముగాను, స్రావము కొలదిగాను మరియు కొలది గంటలవరకు మాత్రమే గలుగుట. స్రావము దుర్వాసనగా నుండుట. నొక్కుచున్నట్లు లేక పీకుచున్నట్లును ఘుంపు నొప్పులు తొడలోనికి నడుములోనికి వ్యాపించుచుండుట (బెల్లడోనా). విడిచివిడిచి వచ్చుచు ఆమత్వచల దోషముతోనుండు ఋతుశూల (బొరాక్సు). ఒరుపును గలుగ జేయునట్టి కుసుమ. కూర్చుంచుటను ప్రయత్నించుటవలన సొమ్మసిల్లిపోవుట. గర్భస్రావము తరుచుగా ప్రథమ నెలలలో గలుగుచుండుట; ఇందువలన వంధ్యత్వము వచ్చుట. గర్భస్రావము రాకుండ జేయుటకును, అకాలప్రసవ వేదనకును, గర్భము దాల్చినది మొదలు ప్రతి 2 లేక 3 రోజులకును, దీనిని ఒకమోతాదు యిచ్చుచుండుట మంచిది.

కాళ్ళు, చేతులు:—కొయ్యబారి యుండుట. మెడ నొప్పిగాయుండుట. నడుము బద్దలగునట్లు తోచుట. కాళ్ళు నీరసముగాను, భారముగాను యుండుట.

ఉద్రేకము:—బాధతోనుండువైపున పరుండుటవలన, వెచ్చని గదిలో, సాయంకాలమందు, రాత్రియందు.

ఉపశమనము:—బహిరంగమైన గాలిలో, విశ్రాంతివలన.

మోతాదు:—మదరుటించరు మొదలు 30 పొటెన్సీ. ఇది మదరు టించరు రూపమున బాగుగా పనిచేయుచున్నది. టించరు మోతాదుకు 5 చుక్కలు.

---

## 217. వైబర్నం ప్రూనిఫోలియం.

## VIBURNUM PRUNIFOLIUM.

ఇది ముఖ్యముగా ఋతుశూలను, గర్భాశయ రక్తస్రావములను వేవిళ్లను, అలవాటుగావచ్చు గర్భస్రావమును, గర్భస్రావమగుటను లేక యందువిషయమైన సూచనలు గలుగుటను, గురధ్రిపువాతమును, నాలుక మీద బయలుదేరు పుట్టవ్రణమును, ప్రసవానంతరనొప్పులను, మాననటు వంటి యెక్కిళ్లను, ప్రసవానంతర స్రావము విడువకుండా అగుటను మాన్పును.

మోతాదు:—మదరుటించరు. మోతాదుకు 3 చుక్కలు.

---

## 218. విస్కం ఆల్బమ్. VISCUM ALBUM.

సుఖ, శీఘ్ర, ప్రసవము గావించుటకు సాధారణముగా వాడబడుచున్న మందిదియే. ఇది మేహవాత లక్షణములమీదను, నరముల దోషములమీదను, ముఖ్యముగా సయాటికా మీదను పనిచేయును. ఉబ్బసము, చీల్చుచున్నట్లుండు మేహవాత బాధలు, కొరియా రోగము, అపస్మారము, మావి వెడలకుండుట, ప్రసవవేదనలో నొప్పులు వడిగా రాకుండుట, లేక ఆగి కగి నెమ్మదిగా వచ్చుచుండుట—యీ లక్షణములమీద యిది బాగుగా పని చేయును.

తల:—మాననటువంటి తలనొప్పి, వికారము, జలుబు వలన వచ్చు చెముడు.

పొత్తికడుపు:—ఆహారనాళమంతటికి పక్షవాతము వచ్చినట్లుండుట.

మలము, మలాశయము:—మానని విరేచనబద్ధము.

మూత్రావయవములు:—తరుచుగాను, విస్తారముగాను, పాలిపోయిన రంగుగాను మూత్రము వెడలుచుండుట.

పురుషావయవములు:—శృంగార సంబంధమైన కలలువచ్చుట. స్ఖలనములగుట. సంభోగమునందు గుండె దడిగాకొట్టుకొనుట.

స్త్రీఅవయవములు:—బహిష్టుకు బహిష్టుకు మధ్య నిగనిగలాడుచును, ఒకప్పుడు ముద్దలు ముద్దలుగాను, ముదర రంగుగాను, తలనొప్పితోను, నుదిటిలో పోట్లుతోను, కాళ్లలోను చేతులలోను తిమ్మెరలతోను, స్రావము వెడలుట. ముట్లుడుగు కాలముతో వచ్చు రోగలక్షణములు (లెకెసిస్, సల్ఫర్). మావి రాగలకుండుట (సెకేలే, పల్సటిల్లా). యెడమ అండాశయము వాపు, బాధ. ప్రసవవేదనలో నొప్పులను వేగముగాను, వరుసగాను వచ్చునట్లు చేయుటలోను అతి శీఘ్రముగాను బహుసులువుగాను ప్రసవించునట్లు చేయుటలోను ఇది సహాయపడును.

శ్వాసావయవములు:—కోరింతదగ్గు. ఎడమవైపు పరుండినపుడు వూపిరాడకపోవుట. పుప్పుసపుదగ్గు మేహవాత లక్షణములతో గూడియుండుట.

హృదయము:—బరువుగాను, నొక్కుచున్నట్లు నొప్పిగాను, పడివేయుచున్నట్లు బాధగాను యుండుట.

కాళ్ళు, చేతులు:—మోకాలు, చీలమండలు; వీటిలోని నొప్పులు భుజము, మోచేయి; వీటిలోనుండు నొప్పులతో మారుచు వచ్చుచుండుట. పాదములనుండి తలవరకును భగ్గున మండినట్లుండుట, కాళ్ళు, చేతులు పుబ్బుట, దురదగా నుండుట.

ఉద్రేకము:—శీతకాలములో, చల్లదనము వలన, పడకలో, కదలిక వలన, ఎడమవైపు పరుండుటవలన.

విరుగుళ్ళు:—కేంఫరు, చైనా.

పోలికలు:—సెకేలే.

మోతాదు:—మదరుటించరు మొదలు 3 పొటెన్సీ. మదరుటించరును

మోతాదు 1 చుక్క చొప్పున ప్రసవవేదనలో యిచ్చినప్పుడు అతి శీఘ్రముగాను, సులభముగాను ప్రసవింప జేసినది.

---

## 219. రైటియా. WRIGHTIA.

(హిందూదేశపు ఔషధము. 61. అంకుడు కొడిశ. హిందీలోనూ బంగాళీలోనూ కుర్చీయందురు).

ఇది గ్రహణి విరేచనములమీద అమోఘముగా పనిచేయును. ప్రత్యేకము జిగటగాని రక్తమిశ్రితముగ గాని వెడలు విరేచనములు నూతనముగావచ్చినను లేక నిలువగ యున్నను దీనిని వాడనగును. గ్రహణితో నుండు పొట్టలో నులినొప్పి, ఆకలిలేమి, పొట్టబరువు, జ్వరలక్షణములు, ఆతురత, ఇట్టి పలువిధలక్షణములను గూడ మాన్పును.

పోలికలు:— మెర్క్యూరియస్, మెర్క్యుకర్, మెగ్నిషియాఫాస్, కాలీమూరు, కొలోసింథిస్.

మోతాదు:—1 మొదలు 30 పొటెన్సీ.

---

## 220. జాంతోజైలం. XANTHOXYLUM.

ఇది నరముల యొక్కయు, ఆమత్వచల యొక్కయు దోషముల మీద పనిచేయును. ఋతుశూలలను అంతే మొందించును. విస్తారముగా తినుటవలనగాని, ద్రవపదార్థములను యెక్కువగా తీసికొనుట వలనగాని వచ్చు అజీర్ణమును మాన్పును. ప్రసవ సంబంధమైన లక్షణములకు దీనితోపాటు కకేలే, పల్సటిల్లా, విస్కాంఆల్బమ్, కాఫీ, కేమోమిల్లా, వైబర్నం ఆప్యులను, కాలోఫైలం, ఆర్నికా— వీటి లక్షణములను గూడ ఆలోచించి యిచ్చుట మంచిది.

మనస్సు:—విచారగ్రస్థముగాను, భయముతోను, జంకుతోను యుండుట.

తల:—నడినెత్తి బరువుగాను. బాధగాను వుండుట. నిండుగా నున్నట్లుండుట. ముచ్చిలగుంటలో నొప్పి. నుదిటిలో బరువు, ముక్కుపైని నొక్కుచున్నట్లుండు బాధ. తలను చీల్చినట్లు భావన, చెవులలో గింగురు మనుచున్నట్లుండు ధ్వనులు—వీటిని మాన్పును.

ముఖము:—పొంగరించుట. క్రింది దౌడలోని నరముల దోషముల వలని బాధలు. నోరు, గొంతుక ఆర్చుకు పోవుట. సప్తపథ వాచుట. బాధగా నుండుట.

పొత్తికడుపు:—వాసన లేనట్టివిన్నీ, తీపుతోను, వుబ్బరముతోను వుండునట్టి జిగట విరేచనములు. నమలుచున్నట్లుండు బాధతో వచ్చు నీళ్లవిరేచనములు.

స్త్రీ అవయవములు:—ఋతుశూల. అండాశయములో బాధలు. ఋతుస్రావము తక్కువగా వెడలుట. 5 నెలల వరకు ఋతువు అణచి పెట్టబడుట. కాళ్ళు, ముఖము వుబ్బుట, నిస్త్రాణ జెందుట. హిస్టీరియా లేక అపస్మార లక్షణములు ప్రవేశించుట. పాలిపోవుట. విరేచనబద్ధము. మూత్రము కొలదిగాను, తరుచుగాను ముదరరంగుగాను వెడలుట, రోగి త్వరలో చనిపోవుదునని భయము జెందుట. నరముల దోషములతోను పార్శ్వపు నొప్పులతోను, నడుముతోను, కాళ్లపొడుగునను నొప్పులతోను వచ్చునట్టి ఋతుశూల. ఋతుస్రావము చిక్కగాను, నల్లగాను వెడలుట. బహిష్టులో స్రవించునట్టి కుసుమ. ప్రసవానంతర నొప్పులు (కేమోమిల్లా, కుప్రంమెట్, ఆర్నికా).

శ్వాసావయవములు:—బొంగురుతనము. శ్వాస గాఢముగా తీసి కొనవలెనని తీరని కోరిక. ఛాతీలో బరువు. పొడిదగ్గు రాత్రింబగళ్లువచ్చు చుండుట.

కాళ్లు, చేతులు:—వెన్నెముక సంబంధమైన రోగలక్షణములతో యెడమవైపున పక్షవాతము వచ్చుట. యెడమప్రక్కనను ముఖ్యముగా చేతి ళ్లోను వచ్చు తిమ్మిరలు,

నిద్ర:— విశ్రాంతి లేకుండగను, కష్టముమీదను నిద్రపట్టుట. దొంగురుచున్నట్లు కలలు వచ్చుట. నిస్త్రాణచే బాధపడువారి నిద్రలేమి.

జ్వరము:—సన్నిపాతజ్వరము వచ్చినపుడు అవసానకాలపు దశలో నిది బాగుగా పనిచేయును.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 221. యుక్కా. YUCCA.

పైత్యసంబంధమైనట్టి లేక కాలేయసంబంధమైనట్టి దోషములతో తలనొప్పి ద్వంద్వముగా నుండుటయు, రోగి చిరచిరగాను నిరాశగాను యుండుటయు, ఈయౌషధముయొక్క వుపయోగమును సూచించును. నోరు అరుచిగానుండుట, పైత్యరసముతోగూడిన నీళ్లవిరేచనములు వెడలుట, ఎక్కువగా అపానవాయువు వెడలుట, నుదురు నొప్పిగాను కంద బారియు యుండుట, నాలుకపైపసుపుపచ్చని పూత—ఇవన్నియు దీని ప్రధానలక్షణములు.

మనస్సు, తల:—చదువుటయందయిష్టత. చదివినదేదియుజ్ఞాపకముండకపోవుట. శిరస్సు పైభాగము ఎగిరిపోవునట్లు తోచునంతటి తలనొప్పి.

ముఖము, కన్నులు:—పసుపుపచ్చగా పాలిపోవుట. అంకిళ్లనొప్పులు. కండ్లు వెచ్చగా, ఎఱ్ఱగానగుట.

చెవులు:—ధ్వనిని భరింపలేకుండుట.

నోరు:—దుర్వాసన, నాలుకపైపంటిగుర్తులగపడుట. పుల్లని(గుడ్లరుచి.

గొంతుక:—ఏదియో అడ్డుపడినట్లు భావనగలుగుట.

అన్నకోశము:—ఆకలి ఎక్కువతక్కువలుగా నుండుట.

పొత్తికడుపు:—కాలేయమువద్ద నొప్పిగానుండుట. పొంగరించుట.

మూత్రావయవములు:—తఱచు మూత్రము వెడలుచుండుట, మూ

త్రిము మంటతో వెడలుట. మూత్రిము విస్తారముగాను, ఎక్కువ తార తమ్యసాంద్రితతోను వెడలుట.

పురుషావయవములు:—సెగరోగము (కెన్నబిస్ సతీవా). రాత్రియంతయు లేసనము కలుగుట మరియు స్ఖలనము లేకుండుట. పూర్వాహ్ణమందు మనసు శృంగారసంబంధమైన వూహలలో మునుగుటచే చదువు తోచకుండుట.

హృదయము:—వక్రిముగా కొట్టుకొనుట, నాడిసరిగా లేకుండుట.

జ్వరము:—సాయంకాలమున ముఖమునకు చమటలుపట్టుట. ముఖము వెచ్చగాను, జ్వరపీడితునివలెను యుండుట.

వుద్రేకము:—చప్పుడువలన.

వుపశమనము:—ముందుకు వంగుటవలన.

పోలికలు:— బ్రియోనియా, మెర్క్యూరియసు, లిలియంటిగ్, పోడోఫైలం.

విరుగుళ్లు:—కాక్యులసు.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 222. జింజిబర్—GINGIBER.

(హిందూదేశపు ఔషధము. 62. శొంఠి మరియు అల్లము.)

ముక్కుయొక్కయు వూపిరితిత్తులయొక్కయు ఆమత్వచలు దోషించుట, ముక్కునుండి దుర్వాసన మరియు స్రావములు, పొట్టవుబ్బరింపు, పొట్ట పక్కసారిగా లోపలకు నొక్కుకొనిపోయినట్లువలె బాధ, విరేచన బద్ధము, నీళ్ళవిరేచనములు, ఆసనమునందు చిరచిర, జఠరకోశ దోషముతో పుట్టిన వుబ్బసము, మరియు జీర్ణావయవములందలి నిస్త్రాణ, మర్మావయవ సంబంధమైన నిస్త్రాణ, శ్వాసావయవదోషములు, మూత్రిపిండములు పని చేయకుండుట—వీటికిది ముఖ్యముగా వాడదగినది.

మాతృపిండ రోగములచే బాధపడువారికిని చిన్నపిల్లలకును, అల్లము, శొంఠిని ఆహారాదికములలో ఎక్కువగావాడరాదని డాక్టరు ఫారింగ్టనుగారి యుద్దేశ్యము.

తల పెద్దదైనట్లు, తల ఖాళీగాను కంగారుగాను యున్నట్లు: ముందుకు వంగినచో తలలోని కోశములు నుదిటిలోనికిని ముక్కు మొదటిలోనికిని నొక్కివేయబడినట్లును, గొంతుకకడ్డుపడిన పదార్థమును మ్రింగివేయవలసినట్లును, కంటిలో యిసుకపడినట్లును, తల నొక్కివేయబడినట్లును, వీపుదిగువను కొట్టబడినట్లును, కడుపులో రాయి వున్నట్లును, సొమ్మసిల్లబోవునట్లును, భావనలు గలుగుట దీని ప్రత్యేకలక్షణములు.

మనస్సు:—ఖులాసాగా యుండుట. చురుకైన మేధాశక్తి. జ్ఞాపకశక్తి లేకపోవుట, తగ్గుట. సాయంకాలమునను, బహిష్టులోను, చిరచిరగానుండుట. మానసిక దుర్బలత్వము.

తల:—నుదిటిలో లాగుచున్నట్లు నొక్కుచున్నట్లు నొప్పులు. లాగుచున్నట్లు, నొక్కుచున్నట్లుండు తలనొప్పితో కుడికన్ను బయటకు త్రోసివేయబడుచున్నట్లుండుట. తలచుట్టూనొప్పి, తలను లోపలివైపును నొక్కివేయుచున్నట్లు నొప్పి తేమగానుండు చల్లనిగాలిలో నడుచుచున్నప్పుడు గలుగుట. నరముల దోషముతోనుండు తలనొప్పి. తలకు ముఖ్యముగా కనుబొమలవద్ద రక్తాధిక్యతతోవచ్చు నొప్పి, బాధ, నడినెత్తిదురద. ఎడమకన్ను పైభాగమున నొప్పి.

కన్నులు:—వెలుతురుచూచిన కుట్టుచున్నట్లు బాధవచ్చుట. దృష్టి మందగించుట. కాంచబింబము (Cornea) మబ్బుగానగుట. కండ్లు మంటలుగాను చిమచిమలాడుచును యుండుట.

ముక్కు:—ముక్కుశోణములు ఆర్చుకుపోయి పొడిగాను, దిబ్బడగాను యుండుట. తీరని దురద. ఎర్రని పొక్కులు. ముక్కునుండి దుర్వాసన. నీళ్ళవంటి స్రావము, తుమ్ములు—బహిరంగమైన గాలిలో యీలక్షణము లెక్కువగుట. ఒకప్పుడు చిక్కని స్రావము వెడలుట.

ముఖము:—వెచ్చగను, యెఱ్ఱగను కందబారియుండుట. నిస్త్రాణ జెందినట్లగపడుట. ముఖము, పెదవులు, పొడిగానుండుట.

నోరు, పళ్లు, గొంతుక:—పండ్ల మొదళ్లలో నొక్కుచున్నట్లు, లాగుచున్నట్లువుండు బాధవలన పండ్లుతాకిన బాధవచ్చుట. వుదయముననే లేచుసరికి నోటిలో నీళ్ళూరుట, రుచి పాడుగానుండుట. జఠరరోగముతో నున్నట్లువలె నోటి వూపిరియొక్క దుర్వాసన ఆమెకే వేయుచుండుట. ముక్కుశోణములు ఎండిపోవుటతోను, గొంతుకకేదియో అడ్డుపడినట్లు, గొంతుక అర్చుకుపోయి, గుటకవేయుటకు కష్టముగానుండుట. ఆమము విస్తారముగా వూరుట.

అన్నకోశము:—రొట్టెని తినినపిమ్మట తలనొప్పివచ్చుట. నోరు పొడిగా అర్చుకుపోవుట. అతిదాహము. త్రేణుపులు. నీళ్లవిరేచనములు. పులియగొట్టుట (కాల్కేరియాకార్బ, రొబీనియా). అజీర్ణము. తాగుబోతులు ఆమమును వమనము జేసికొనుట. వికారము మరియు తలతిప్పు. కడుపు రాతివలె బరువుగానుండుట.

పొత్తికడుపు:—ప్లీహములో కుట్టుచున్నట్లు బాధ. కుడిప్రైపునొకచోట విపరీతమైన బాధ. క్రిమికసమీపమున పొడుచుచున్నట్లు బాధ. మేహవాతరోగులలో పొట్ట వుబ్బరింపు, శూల. నిలుచున్నప్పుడు పొట్టలోని అవయవములుముడుచుకుపోవుచున్నట్లుండుబాధకు వెనువెంటనే విరేచనానుమానము గల్గుట.

మలము, మలాశయము:—చెడిపోయిన నీటిని త్రాగుటవలని నీళ్లవిరేచనములు. పొట్టవుబ్బరింపు, కోయుచున్నట్లు బాధలు, ఆసనద్వారమువద్ద కండరము బిగువుతగ్గిపోవుట. అంత్రములనుండి ఆమము చాలకాలమువరకు పడలుచునే యుండుట మూలశంఖ మొలలు వెచ్చగను బాధగను పోటుగను వుండుట (ఏలోసు). గర్భిణీలో ఆసనము వెచ్చగను, తీపుగను బాధగనుయుండుట. విరేచన బద్ధము. వుదయమున నీళ్లవిరేచనములకు పిమ్మట వికారముగా నుండుట. ఆసనము యెఱ్ఱగను, వెచ్చగను, బాధ

గను వాపుతోను, దురదగాను, మంటగానుయుండుట.

మూత్రావయవములు:—మూత్రము అణచిపెట్టబడుట (స్ట్రెమోనియం, లైకోపోడియం, పల్సటిల్లా). మూత్రము ఎక్కువగా వూరుట. మూత్రము ముదరరంగుగాను, చిక్కగను, బురదగిటివలెను, ముదిరిన గోధుమవర్ణముగాను, వెడలుట. టైఫసుజ్వరమున పిమ్మట మూత్రము అణచిపెట్టబడుట. మూత్రనాళముచివర మంట. మూత్రము విడచునపుడు మూత్రపిండములలో బాధ తరుచు మూత్రానుమానముతో ద్వంద్వముగా నుండుట.

పురుషావయవములు:—సంభోగవాంఛ హెచ్చగుట. బాధకరముగా నుండెడు లేపనము. రాత్రియందు స్ఖలనములు. మర్మావయవముచివర చల్లదనము మరియు దురద.

స్త్రీ అవయవములు:— ఋతువు చాలాముందరగాను, స్రావ మెక్కువగాను అగుట. చిరచిరనుగలుగజేయు ఋతుస్రావము. ఋతు రక్తము ముదరరంగుగాను, ముద్దముద్దలుగాను వెడలుట.

శ్వాసావయవములు:—స్వరపేటిక దిగువను చిరచిరగానుండుటతో గురగురలాడుచుండు శ్లేష్మముతో గూడినదగ్గు. ఛాతీలో కుట్టుచున్నట్లుండుబాధలు. ఛాతీ యెడమభాగమునను హృదయసమీపమునను బాధ. తేమతో వుద్రేకించు వుబ్బసపుదగ్గు. స్వరపేటికలో గిలిగింతలు పెట్టుచున్నట్లుండుటతోవచ్చుదగ్గు, ఇది పొడిగాను,వుబ్బసముకు సంబంధించియు యుండుట. శ్వాస కష్టముగానుండుట. వుదయమున శ్లేష్మ మెక్కువగా వెడలుట. వుబ్బసపుదగ్గు రాత్రియందును తెల్లవారుజామునను వచ్చుట. శ్వాస కష్టముగానుండుటచే రోగి పడకలోలేచి కూర్చొనవలసివచ్చుట తప్ప, దగ్గు ఎంతతీవ్రతజెందినను ఎక్కువ ఆతురత పొందనవసరముండక పోవుట. గొంతుక బొంగురుతనము.

మెడ, సడుము, కాళ్లు, చేతులు:—మెడ వెనుకనైపు కొయ్యబారుట, దీనితో తలనొప్పి, వికారము. దేనినైనను జేర్లబడి కూర్చొనిన రోగ

లక్షణములు దేృకమునెందుట. నీరసమువలనవలె నడుమునొప్పి వచ్చుట. నిలుచున్నందువలన, లేక నడుచుటవలన చితుకకొట్టినట్లువలె నడుము దిగువ కుంటితనము వచ్చుట. అవయవములు మొద్దుబారినట్లును, కుంటితనముగాను, తిమ్మెరలుగను, భారముగనుయుండుట. మహావాతనొప్పులు. కీళ్లసంధులు, కొయ్యబారినట్లును, కుంటితనము వచ్చినట్లును, నీరసముగాను యుండుట. పాదములు పుబ్బుట, బాధగానుండుట. అరిచేతులలోను అరికాళ్లలోను తిమ్మెరలు.

నిద్ర:—నిస్త్రాణగాను, నిద్రమత్తుగాను యుండుట. స్పృహ లేకుండుట. నిద్రలేమి. దీనివలన తెల్లవారగట్ల 3 గంటలకు మెలకువజెందుట మరియు వుదయమున ఆలస్యముగా నిద్రజెందుట.

జ్వరము:—చలి దిగువ అవయవములలో ప్రారంభించి పైకి ఎగబ్రాకుట. సాయంకాలమున చలివచ్చుట. బహిరంగగాలిలో చలితోయున్నను, పూర్ణమయిన తెలివితోయుండుట. చలియు వెచ్చదనమునూ ఒకే సారి యుండుట.

వుద్రేకము:—రొట్టెను తరుబూజాపండ్లను తినుటవల్ల, తాకుడు వలన, పరుండుటవలన, కదలికవలన, లేచుటవలన, చలిగాలిలో, సాయంత్రమున, రాత్రియందున.

వుపశమనము:—కూర్చున్నప్పుడు, నిలుచున్నప్పుడు, కప్పుకొనిన బట్టను తీసివేసినపిదప.

పోలికలు:—యాబిసునైగ్రా, సల్ఫరు, బెల్లడోనా, కలేడియంసెగ్.

విరుగుళ్లు:—నక్సువామికా.

మోతాదు:—3 ఉగాయతు 200 పొటెన్సీ.

# హోమియోపతీమెటీరియామెడికా.

# Homœopathic Materia Medica.



## Section 2. Animal Kingdom.

## ద్వితీయాశ్వాసము : పశుపక్ష్యాదివర్గము.



## (i) INSECTS. పురుగులు—కీటకములు.



### 223. యాపిసు. APIS MELLIFICA.

(తేనెటీగ).

నిదర్రిమత్తు, ఉబ్బుతోగూడిన వాపులు, దాహము లేక పోవుట, వేడిమి భరించలేకపోవుట, ముళ్లతో గ్రుచ్చుచున్నట్లుండు బాధలు, సాయం కాలము 4 గంటలు లగాయతు 6 గంటలవరకు రోగోద్రేకము కలుగుట, చితుకకొట్టినట్లు బాధలు—యివి దీనిముఖ్యలక్షణములు. విచారము, ఆగ్ర హము, భయము, విసుగుదల, ఓర్వలేకపోవుట, దుర్వార్తలు వినుట, చర్మ రోగములు అణచిపెట్టబడుట, వీటివలన కలిగిన రోగములమీదనిది బాగుగా పనిచేయును. రోగి చల్లదనమును, పాలను, పుల్లనిపదార్థములను ఆహారపా నీయములను ఎక్కువగా కోరుచుండుట, ముఖము, చెవులు, దిగువ కను రెప్పలు, గొంతుక, వృషణములు, పొట్ట, వీటియందును, శరీరమునందు మరి యెక్కడనైననుఉబ్బు కనుపించుటయు, బాధలు అన్నియును కుడివైపు నుండి ఎడమవైపునకు మారుచుండుటయు దీనివుపయోగమును సూచించును. యాపిసు వాడదగిన కాలికరోగలక్షణములు దీర్ఘరోగములుగా పరిణ మించినపుడు నేట్రంమ్యూరియాను వాడనగును. కొన్నికొన్ని ఉబ్బులలోను,

వాపులతోను ఇతర బాధలు లేకపోయినను ఇది బాగుగా పనిచేయును.

మనస్సు:—చదువుచున్నపుడు పరధ్యానముగా నుండుట. చేయుచున్న యేపనియందైనను ధ్యానముండకపోవుట. ఒకప్పుడు మత్తుగాను మరియొకప్పుడు సంభోగేచ్ఛతోను యుండుట. నిద్రయందు పిల్లలు ఉలికిపడి కెవ్వుమని కేక వేయుట. జ్ఞాపకశక్తి తగ్గిపోవుట. వ్యతిరేక భావముతో నుండుట (లిలియంటిగ్, సేపియా). నిరాశ చెందియుండుట (పల్సటిల్లా).

తల:—వేడిమి, బర్రిద్దలు కొట్టుచున్నట్లును, పొడుచుచున్నట్లును, పెద్దదైనట్లును బాధగానుయుండుట; నొక్కుటవలన యీబాధలుపశమించుట, మరియు నడుచుచున్నప్పుడు ఎక్కువగుట. తలను నీరుపట్టుట, ఎక్కువ చెమటపట్టుట.

కన్నులు:—మెల్లకన్ను. మంటలు, పోట్లు, వాపుగలుగుట. కనురెప్పలలో నీరుపట్టి వాచి యెర్రగానుండుట, అకస్మాత్తుగా పొడుచుచున్నట్లుండు బాధలు. కనురెప్పమీగ కాయలను మాన్పును. ఇవి తిరిగి రాకుండునట్లుగా కూడ చేయును. కాచబింబము (Cornea) దళసరెక్కి దానిపైని మబ్బురంగుమచ్చలు బయలుదేరుట.

చెవులు:—ఎర్రగావాచి నొప్పిగాను, కుట్టుచున్నట్లు బాధగానువుండుట. వినబడుట కష్టముగానుండుట.

ముక్కు:—ముక్కుచివర చల్లగానుండుట. వాపు, యెర్రదనము, మంట, బాధయుండుట. ముక్కులో నరుపులు బయలుదేరుట.

ముఖము:—పొంగరించి యెర్రగాను, చురుక్కుమనుచుండు బాధతోనుండుట. నీరుపట్టి పాలిపోయి నిగనిగలాడు నుండుట.

నోరు:—నాలుక నిప్పువలె యెఱ్ఱగాను, వాపుతోను, పుండ్లతోను, నొప్పిగాను యుండుట. ఇగుళ్ళవాపు. నాలుకపైని పుట్టవ్రణము బయలు

దేరుట, పొక్కులు బయలుదేరుట, పైపెదవివాచి, యెఱ్ఱిగాను, వెచ్చగాను వుండుట.

గొంతుక:—ముడుచుకొనిపోయినట్లు నొప్పిగానుండుట. కొండనాలుక వాచుట. గొంతుక వెలుపలను లోపలనువాచుట గవదకాయలు వాచి, ఎఱ్ఱిగాను, పెద్దవిగాను, అగుట. చిక్కని ఆమముతో గొంతుక నిండియుండుట. గొంతుకలో పుండ్లు గొంతుకలో చేపయెముక అడ్డుపడినట్లుగా నుండుట.

అన్నకోశము:—ఆకలి లేకపోవుట. ఆహారమునందు కోర్కెలేకపోవుట. తీరని దాహము. తరుచు దాహము పుచ్చుకొనినను కొద్దికొద్దిగా పుచ్చుకొనుట. తినిన ఆహారమును వమనము చేసికొనుట. పాలయందు ఎక్కువకోర్కె (రూస్టాక్స). పైత్యరసమును వమనము చేసికొనుట. కడుపులో వుండువలె వెచ్చగాను, మంటగాను యుండుట. జలోదరము—

పొత్తికడుపు:—నొక్కుటవలనను, తుమ్ముటవలనను బాధగా నుండుట. నీరుపట్టుటను మాన్పును. కుడిగజ్జలో వాపు. ముట్టుకొనిన నొప్పిగానుండుట. బాధలు కోయుచున్నట్లుండుట. కాలేయము, ప్లీహము వాచుట.

మలము, మలాశయము:—కదలినపుడు ప్రతిసారియు అప్రియత్నముగా విరేచనమగుట. విరేచనము రక్తముతోగూడి బాధలేకుండగనగుట. విరేచనమునకు ముందు అపానవాయువు వెడలుట. విరేచనము నల్లగాను, పచ్చగాను, పసరువలెను, ఆమముతోనుగూడి వెడలుచుండుట. గుదద్వారమెప్పుడును తెరచియున్నట్లుండుట. మూత్రవిసర్జనతోపాటు విరేచనమగుట. భోజనానంతరము విరేచనము లెక్కువగానగుట. మలాశయము వెలుపలకు వచ్చుట. ఒకప్పుడు విరేచనబద్ధ మెక్కువగానుండుట.

మూత్రకోశము:—మూత్రము మంటతోను, బాధతోను అగుట. మూత్రము బంధించుట, బహుతక్కువగాను ముదర రంగుగాను అగుట, ఒకప్పుడు మూత్రమప్రియత్నముగా వెడలుట, యిది రాత్రియందును, దగ్గినపుడును, తుమ్మినపుడును గలుగును.

పురుషావయవములు:—వృషణములు నీరుపట్టుట. బుడ్డ. కుడివృషణము వాపు. సవాయివుండ్లలో తేనెటీగలు కుట్టుచున్నట్లు బాధగా నుండుట. సంభోగేచ్ఛ ఎక్కువగుట.

స్త్రీఅవయవములు:—యోనియోష్ఠముల వాపు. ఇది చన్నీటివలన ఫలించుట. కుడి అండాశయము వాపు. అండాశయములో కుట్టుచున్నట్లు, పొడుచుచున్నట్లు బాధగానుండుట. ఇది బహిష్టులో ఎక్కువగా నుండుట. మనోవైకల్యమువలన ఋతువు ఆగిపోవుట, ఇట్టిది ముఖ్యముగా పడుచువారిలో కలుగుట. ఋతుశూల. గర్భాశయమతిసున్నితముగా నుండుట. 3 లేక 4 నెలలో కలుగునట్టి గర్భస్రావములను మాన్పును. గర్భిణులకు 7, 8, 9 నెలలలో శరీరమునకు నీరుపట్టుట. పూర్వసువాసినులలో కలుగు అమితసంభోగేచ్ఛను తగ్గించును. అండాశయమందు బయలుదేరు కంతులను కరగించును.

శ్వాసకోశములు:—ఛాతీకి నీరుపట్టి రొమ్ముకు ఆయాసముగా నుండుట. గొంతుక బొంగురుపోవుట. శ్వాస తొందరగాను కష్టముగాను వుండుట. స్వరపేటిక వాచుట. ఇంకొక్కసారి ఊపిరి పీల్చలేననుకొనుట. పొడిదగ్గు. రాత్రి 9 గంటలు లగాయతు తెల్లవారుజామున 4 గంటలవరకు విడువనటువంటి దగ్గు. పుపుసవేష్టము వాపు (Pluerisy) లో కలుగు స్రావము నిది హరింపజేయును.

హృదయము:—దిగువభాగమందు అకస్మాత్తుగా వచ్చు నొప్పి. నాడి బహునిస్త్రాణను చెందియుండుట. నాడి ఒకప్పుడు విపరీతముగా కొట్టుకొనుటవలన శరీరము కంపించుట. నాడి విడిచివిడిచి కొట్టుకొనుచుండుట. ఒకప్పుడు మణికట్టువద్ద నాడి సరిగా ఆనకపోవుట.

కాళ్లు, చేతులు:—నీరుపట్టుట, కీళ్ళసంధులలో వాపులు, నొప్పి, బాధ. గోరుచుట్టుయొక్క ప్రథమావస్థలో నిది బాగుగా పనిచేయును. చేతులు, వేళ్లచివర, తిమ్మెరలుగా నుండుట. మోకాలువాచి నిగనిగలాడుచు కుట్టుచున్నట్లు బాధగానుండుట, నడుములోను, అవయవములలోను,

మేహవాత నొప్పుడు. చేతులు, కాళ్లు, చీలమండలు, పాదములు ఉబ్బుట. చేతులునీలివర్ణముగాను చల్లగాను వుండుట. వాపులు పాలిపోయి నిగనిగ లాడుచుండుట. వీటిని ముట్టుకొనుటకు అతిసున్నితముగా నుండుట.

చర్మము:—కందిటీగలు, విషజాతిపురుగులు కుట్టుటచే లేక కరుచుటచే వచ్చినవాపులు. యివి బాధగాను ముట్టుకొనినయెడల వుండునలె బహునొప్పిగాను వుండుట. రాచపుండ్లను (?) మంటతోను, కుట్టుచున్నట్లు బాధగాను వున్నప్పుడు యిది బాగుగా పనిచేయును (యాంత్రిసైనం, ఆర్సెనికం ఆల్బం). శరీరము అకస్మాత్తుగా ఉబ్బుట. అన్నిరకముల కురుపులు, వాపులు, కుట్టుచున్నట్లు బాధగా, వున్నప్పుడిది బాగుగా పని చేయును.

నిద్ర:—తరుచు ఆవలింతలు, మత్తుగానుండుట, నిద్రలో పెద్ద పెద్ద కేకలువేయుట. ఉలికిపడిలేచుట, ప్రయాణముచేయుచున్నట్లు, గాలిలో ఎగురుచున్నట్లు కలలువచ్చుట.

జ్వరము:—సాయంకాలము చలి, దాహము, యివి కదలికవలనను, వెచ్చదనమువలనను ఉద్రేకించుట. కొద్దిగా చెమటపట్టుట, మగతగా నుండుట. తరుచు చెమటపట్టి ఆరిపోవుచుండుట. చెమటపట్టినపుడు దాహములేమి, మూత్రము కొద్దిగానగుట. సన్నిపాతజ్వరము, అతినిస్త్రాణ, సాయంకాలము 3, 4 గంటలకువచ్చు జ్వరముమీదబాగుగా పనిచేయును.

ఉద్రేకము:—వేడివలన, వాపున్నచోట ముట్టుకొనినచో, అపరాహ్ణమందు, నిద్రనుండి లేచినపిమ్మట, సాయంకాలము 5 గంటలకు.

ఉపశమనము:—చన్నీళ్లవలన, చల్లగాలివలన, పగలు నిబ్బరముగా కూర్చుండుటవలన, నడకవలన.

దీనిని రూస్టాక్సుకు ముందుగాని తరువాతగాని వాడకూడదు.

పోలికలు:—వెస్పా, లెకెసిస్, ఎకోనైటు, ఆర్సెనికంఆల్బం, జింకంమెట్, పల్సటిల్లా, రూస్టాక్సు.

సహచరులు:— నేట్రింమూరు, బెరీటాకార్బ.

విరుగుళ్లు:— ఇపెకాక్, యాసిడ్ లేక్టిక్, లిడం, ప్లాటినా, లేకెసిసు.

చైనా, కేంథారిసు, డిజిటాలిసు—లకిది విరుగుడు.

మోతాదు:— 3 మొదలు 200 పొటెన్సీ. ఒకప్పుడు ఇది నెమ్మదిగా పని చేయును. ఉబ్బులమీదను, మూత్రము తక్కువగానగునపుడును చిన్నపొటెన్సీలలో వాడవలయును. మూత్రపిండముల జబ్బులమీదను, ఎక్కువమూత్రమగుచున్నపుడును, నీళ్లవిరేచనములమీదను, పెద్దపొటెన్సీలు వాడనగును. చిన్నపొటెన్సీలలో నిది గర్భస్రావములను కలిగింపవచ్చును కనుక దీనిని గర్భిణీస్త్రీలలో మొదటి మూడుమాసములలోను అతిజాగరూకతతో వాడవలయును.

బాహ్యోపయోగములు:— ఇది పాలిపోయిన రంగుగల దద్దుర్లమీదను, తేనెటీగలు, కందిటీగలు, విషజాతిపురుగులు, కుట్టిన లేక కరచిన ప్రదేశమునను, మంట, కుట్టుచున్నట్లు బాధతోగూడిన వాపులమీదను, వాచినకనురెప్పలమీదను, అతిబాధతోకూడిన మూలశంఖమీదను, ఎర్రని వాపుతోకూడి గట్టిపడిన వృషణములమీదను, స్వచ్ఛమైన టించరుగాని, కొలదినీళ్లలో యీటించరును కలిపిగాని పట్టింపవలెను.

---

## 224. బ్లేటా ఓరియంటాలిస్. BLATTA ORIENTALIS.

(హిందూదేశపు ఔషధము. 63. బొద్దింక)

ఇది ముఖ్యముగా వుబ్బసపువ్యాధిమీదను, సాధారణముగా బ్రాంకైటిసు,క్షయసంబంధమైన శ్లేష్మజాతిరోగములమీదనుబాగుగా పనిచేయును. ఆర్సెనికం ఆల్బమ్‌యొక్క పని చాలనపుడు దీనిని వాడనగును.

శ్వాసావయవములు:— ఇది స్థూలశరీరులకును, నూతనముగావచ్చిన

రోగలక్షణములమీాదను బాగుగా పనిచేయును. శ్వాసనాళములలో ఆమము లేక శ్లేష్మము యెక్కువగా చేరుటవలన వుక్కిరిబిక్కిరియై శ్వాసఆగిపోవు నంతటిస్థితిలోకూడ బాగుగా పనిచేయును. ఊపిరాడకపోవుట, అస్థిమిత ముగా నుండుట, విస్తారము చెమటపట్టుట, పరుండినయెడల లక్షణము లుదేరికించుట, చీముపంటి ఆమము వెడలుచుండుట, క్షయజాతిరోగులలో వూపిరాడనంతటి దగ్గువచ్చుటను మాన్పును.

మోతాదు:—ఫిట్టువచ్చినప్పుడు లేక దగ్గు యెక్కువగానున్నప్పుడు మదరుటించరును మోతాదుకు ఒకచుక్క చొప్పున వాడుటమంచిది. తక్కి నసమయములందు చిన్నపొటెన్సీలలో వాడవగును.

---

## 225. బ్లేటాఅమెరికానా. BLATTA AMERICANA.

(అమెరికాదేశపు బొద్దింక).

శరీరమునకు నీరుపట్టుట లేకశరీరమువుబ్బుట, శరీరచ్ఛాయ పసుపు పచ్చగామారుట, ఆయాసము, అలసట, విసుగుదల, మెట్లనెక్కుటఆయాస కరముగానుండుట, కామెర్లరోగము, మూత్రము విడుచునప్పుడు మూత్ర నాళమునందు మంటగానుండుట (కేంథారిసు), వీపునుండిబాధలు వెచ్చగా ను, అంసఫలకము వరకు వ్యాపించుటను మాన్పును. వూపిరి అందక పోవుట, ఉబ్బసము, నిస్త్రాణ.

పోలికలు:—కేంథారిసు, సీనోతసు అమెరికానసు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 226. కేంథారిసు. CANTHARIS.

(స్పెయిన్ దేశపు ఈగ)

ఇది మూత్రావయవముల యొక్కయు మర్మావయవముల యొక్కయు, నరములకు సంబంధించిన వ్యాధులమీద బాగుగా పనిచేయును. రోగి ఒంటరిగా నుండగోరుట, తరుచు మూత్రనుమానము గలుగుచుండుట. ఆహారము, పానీయములు, పుగాకు, పీటియందయిష్టత, ఇవి దీనిముఖ్యలక్షణములు. ఎండవేడిమివలన వచ్చురోగములమీద నిది బాగుగాపనిచేయును.

మనస్సు:—విపరీతమైనసంధి. ఆతురతతోకూడిన అస్థిమితము, ఆగ్రహము. రోగి యెప్పుడును యేదియో చేయవలయునని ప్రయత్నించినను, యేమియు చేయలేకపోవుట. స్వల్పముగా మదపిచ్చియుండుట. ముఖము యెఱ్ఱబారి అకస్మాత్తుగా స్మృతితప్పి పడిపోవుట.

తల:—మెదడులో నీళ్లు మరుగుచున్నట్లుండుట, మంటగావుండుట. బహిరంగమైన గాలిలో తలతిప్పు యెక్కువగుట.

కన్నులు:—వస్తువులు పసుపుపచ్చగా కనిపించుట. కండ్లు పసుపుపచ్చగాను, మంటగానువుండుట.

చెవులు:—చెవులలోనుండి వెచ్చని గాలివచ్చుచున్నట్లుండుట. చెవులు వాపుగానుండుట. చెవివద్దయెముకలలో బాధగానుండుట.

ముఖము:—దురదతోకూడిన పొక్కులు. ఇవి ముట్టుకొనినమంటగానుండుట. ఎఱ్ఱగాను, వెచ్చగానువుండుట. పాలిపోయి నిరాశజెంది మరణించుచున్నవాని ముఖమును పోలియుండుట.

నోరు:—నాలుకమీద పొక్కులు బయలుదేరుట, నాలుక బీటలు తీయుట. నోరు మంటగాను, బాధగాను, అదుముకొనిపోయియుండుట. దౌడలు దగ్గరపడుట, పండ్లు పటపటకొరుకుచుండుట.

గొంతుక:—వాచి మంటగానుండుట. గుటకవేయుట కష్టముగా

నుండుట. గవదకాయలు యెఱ్ఱగావాచి బాధగానుండుట. రక్తజీరతో కూడిన లాలాజలము వెడలుట.

అన్నకోశము:—అమితమైన దాహము, అకలితగ్గుట. అన్నహితవు లేకుండుట. పులితేన్పులు, తలతిప్పు, వమనములు. కాఫీతాగుటవలన జీర్ణకోశమును, మలాశయమును, సంబంధించినవ్యాధులు వుద్రేకించుట.

మలము, మలాశయము:—తెల్లని ఆమము, అంత్రములలో గోకిన యెడల వచ్చుపదార్థముతోగూడి వెడలు జగటవిరేచనములు, రక్తవిరేచనములు. పొత్తికడుపు నీరుపట్టుట, కాఫీతాగినపిదప బాధవచ్చుట.

మూత్రావయవములు:—కోయుచున్నట్లు, అవయవములు ముడుచుకొనిపోవుచున్నట్లుయుండు బాధలు. మూత్రవిసర్జనకు ముందును, వెనుకను విపరీతమైన మంట, కోయుచున్నట్లు బాధలు వుండుట. మూత్రము చుక్కలు చుక్కలుగా పడుచుండుట, ధారలుగా వెడలుట. మూత్రము బంధింపబడుటవలన యెక్కువ బాధగానుండుట రక్తము కలిసినట్లు మూత్రము యెఱ్ఱగాను, ఒకప్పుడు తక్కువగాను, రాత్రియందు గంజివలె తెల్లనిమడ్డితోను, సుద్దకట్టుగాను వెడలుట. రక్తస్రావమగుట.

పురుషావయవములు:—సెగవ్యాధిగలవారిలో సంభోగేచ్ఛ యెక్కువగుట. తరుచు లేపనము కలుగుట, ఇందువలన బాధగానుండుట, శృంగారసంబంధమైన విషయములు తోచినవెంటనే స్ఖలనమగుట. శుక్లనష్టమును మాన్పును. సంభోగానంతరము మూత్రనాళములో మంటగానుండుట.

స్త్రీఅవయవములు:—ఎక్కువ సంభోగవాంఛ. మావిని, చనిపోయినపిండమును, రక్తకండలు మొదలగు అన్యపదార్థములను బయటకు త్రోసివేయుటలో చాల సహాయపడును (సేపియా). ఋతువు అతిత్వరగాను, స్రావమువిస్తారముగాను వెడలుచుండుట. అండాశయములో మంటగాను, కోయుచున్నట్లు బాధగాను యుండుట. వేవిళ్లను, గర్భస్రావమును మాన్పును. ఋతురక్తము బహుతక్కువగాను, నల్లగాను వెడలుట, ఒకప్పుడు బాలకాలములోనే ఋతురక్తము వెడలుచునేయుండుట.

శ్వాసావయవములు:—చిక్కని అమ్లముతో వెటలుటతోనుండు శ్వాసావయవరోగములమీద బాగుగా పనిచేయును.

చర్మము:—చర్మము కాలుట. పొక్కులెక్కుటకు ముందుగా దీనిని వాడిన వెంటనే అవి నయమగును. మర్మావయవములమీద చెమటతో కూడిన మంతప్రుపొక్కులు, రాత్రియందు అరికాళ్ళమంటలు.

నడుము, కాళ్లు, చేతులు:—మూత్రము విడుచునప్పుడు తొడల లోను, మూత్రపిండములలోను, పొట్టలోను, అపరిమితమైనబాధగాయుం డుట. మూత్రము విడువవలయునని తీరనికోరికయుండుట. అవయవములలో చీల్చుచున్నట్లుబాధగానుండుట. అరికాళ్లలో పుండ్లయినట్లుబాధలు.

జ్వరము:—కాళ్లును, చేతులును చల్లగానుండుట. అరికాళ్లు మంట గానుండుట. నీళ్లుపోసినట్లు చలిగాయుండుట. నాడి పుష్టిగాను, దుడుకు గాను యుండుట. చేతులమీదను, కాళ్ళమీదను, మర్మావయవములకును చెమటపట్టుట. చెమట మూత్రపు వాసనవేయుట.

ఉద్రేకము:—తాకుడువలన, అల్పాచమానము చేయుచున్నప్పుడు, చల్లనినీళ్ళు, కాఫీత్రాగుటవలన.

ఉపశమనము:—తోముటవలన, పరుండుటవలన, ఉదయమున.

సరిపడనిది:—కాఫీ.

సహచరులు:—కేంఫరు,

కేంఫరు, వినిగార్, ఆల్కహాలు—లకిది విరుగుడు.

విరుగుళ్ళు:—ఎకొనైట్, పల్సటిల్లా, రియం. కేంఫరు, లారోసిరే సస్, యాపిస్, కాలీనైట్రికం.

పోలికలు:—యాపిస్, బెల్లడోనా, బ్రియోనియా, కెన్నబిసుసతీ వా, తూజా, మెర్క్యురియస్, కేప్సికం, సార్సపరిల్లా.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 3 వారములు,

బాహ్యోపయోగములు:—దీనిని 10 మొదలు 40 రెట్లు నీళ్ళలో కలిపి శరీరము కాలినపిదప పొక్కులెక్కకుండుగా పట్టించినయెడల పొక్కులెక్కకుండా చేయును. మరియుమంటలను, బాధలనుమాన్పును. పొక్కులెక్కినను గూడ దీనిని యిట్లేవుపయోగించపలెను. భగందరములు, కుష్టు, రాచపురుపులు మంతప్రుపొక్కులు మరి యితరచర్మరోగముల మీదను దీనిని పైవిధమునగాని, లేక గ్లిసరిన్, లేక వేసిలైనులో కలిపి మంటలను, బాధలను మాన్పుటకు పైకి పట్టించవలెను.

---

## 227. ఫార్మికా. FORMICA RUFA.

(చీ మ లు)

ఇది ముఖ్యముగా మేహవాతతత్వములమీద పనిచేయు అమోఘమైన ఔషధము. వివిధములగు నరములదోషములు, రుద్రివాతము, కీళ్లు వంగక పోవుట, కదలికవలన కీళ్లలో నొప్పిపుట్టుట. మఱియు యీ నొప్పి మర్దనమువలన ఉపశమించుట, సాధారణముగా కుడివైపు అవయవములు దోషించుట—ఇవి దీని ప్రధానలక్షణములు.

పాదముల చెమట నణచిపెట్టుటవలని రోగలక్షణములమీద నిది బాగుగా పనిచేయును.

మనస్సు, తల:—జ్ఞాపకశక్తిలేకుండుట. మనోవికారము జెందుట. తలనొప్పి. మెదడు పెద్దదిగను, బరువుగను యున్నట్లుతోచుట.

ముఖము, కన్నులు:—వస్తువులు మబ్బులోనుంచి చూచినట్లువలె కనబడుట. దృష్టిమాంద్యము. ముఖమునకు ఎడమవైపున పక్షవాతము వచ్చినట్లుండుట.

చెవులు:—గింగురుమనుచున్నట్లు, బజ్జుమనుచున్నట్లు యుండుధ్వనులు వినిపించుట. కాయలుబయలుదేరుట. చెవిమట్టూవాపుబయలుదేరుట. చెవులలోపటపటమను శబ్దమగుచుండుటతో ద్వంద్వముగానుండుతలనొప్పి.

అన్నకోశము:—వికారము, తలనొప్పితో పసుపుపచ్చగను చేదుగనువుండు పదార్థమును వమనము చేసుకొనుట, మంటగను, బరువుగను యుండుట.

పొత్తికడుపు, మలాశయము:—ప్లీహమువద్ద బాధగానుండుట. వుబ్బరింపు. బొడ్డుదిగువను నలుగగొట్టినట్లునొప్పి. భోజనానంతరమునగాని, పగటియందు మాత్రమే గాని నీళ్లవిరేచనములగుట.

మూత్రావయవములు:—మూత్రములో యూరేట్సు విస్తారముగా పోవుట. మూత్రములో రక్తము, శ్వేతధాతువు కలసిపోవుచుండుట, మరియు మూత్రవిసర్జనకొరకు అతి తొందరగలుగుచుండుట. మూత్రకోశమునకు పక్షవాతము వచ్చుట.

పురుషావయవములు:—వీర్యస్ఖలనములు. నీరసము. లేపనమును స్ఖలనములును తక్కువగా నుండుట.

స్త్రీఅవయవములు:—మామూలుకన్న బహిష్టు ఎనిమిది రోజులు ముందుగా వచ్చుట. పాలకల్లులలో స్తన్యము తక్కువగుట.

కాళ్లు, చేతులు:—కీళ్లు వంగకపోవుట. కాళ్ళలో నీరసము. ఆమవాతదోషము వక్కసారిగను, అస్థిరితమును గలుగజేయుచు వచ్చుట. రోగలక్షణములు చమటపట్టినపిదప వుపశమింపకపోవుట. మర్దనమువలనను, అర్ధరాత్రిమకు పిదపను రోగోపశమనము గలుగుట. వుదయమున చంకలలోదురద.

చర్మము:—ఎఱ్ఱగను, మంటగను, దురదగను యుండుట.

వుద్రేకము:—చల్లదనమువలన, చన్నీళ్ళతో కడుగుటవలన, తేమలో, మంచు పడుటకుముందు.

వుపశమనము:—వెచ్చదనమువలన, నొక్కుటవలన, మర్ధనమువలన.

సహచరులు:—కేమొమిల్లా,

పోలికలు:—ఆర్సెనికం ఆల్బం, బ్రియోనియా, డల్కమారా, యుర్టికాయూరెన్సు, కేప్సికం.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 228. వెస్పా. VESPA CRABRO.

(పాశ్చాత్యదేశములందలి కందిరీగలనుండి తయారుచేయబడినది)

ముఖ్యముగానిది చర్మరోగములమీదను స్త్రీలయొక్క రోగముల మీదను వుపయోగింప తగినది.

సొమ్మసిల్లుట; శరీరము మొద్దుబారుట, దృష్టిచెడుట; వికారము, వమనము గలిగినపిదప పాదములనుండి పైపై పునకు చలి ఎగబ్రాకుట; శోష ములు గట్టిపడిపోవు భావన గలుగుట, దురదగానున్నచోట్లచమటలుపోయు చుండుట. అంత్రములలో నొక్కివేయుచున్నట్లు మెలిపెట్టుచున్నట్లు బాధలు గలుగుట—యివి దీని ముఖ్యలక్షణములు.

మనస్సు:—తలతిప్పుచలన కదలలేకుండుట. ఆతురత.

తల:—వెంట్రుకలూడిపోవుట. వేడిగా బాధగా వాపుగానుండుట.

ముఖము, కన్నులు:—ముఖము కందబారి, వెచ్చగానుండుట. కండ్లు రక్తము జిమ్మినట్లగుట. ఆతురతగా కనబడుట, నోరు, నాలుక, గొంతుక-ఇవి వెచ్చగా, వాపుగా మంటలుగా నుండుట.

అన్నకోశము:—ఆకలిగను, దాహముగాను యుండుట. వమనము లగుటతో తల కందబారుట.

మూత్రావయవములు:—రక్తమూత్రము. మూత్రముమంటలుగా వెడలుట. తరుచు మూత్రము బాధతో లేక కష్టముమీద వెడలుటతో నడుమునందు నొప్పిగలుగుచుండుట.

పురుషావయవములు:—వాపు, బాధ గలుగుట.

స్త్రీఅవయవములు:—ఎడమ అండాశయము దుస్థితిజెందుట, బాధగానుండుట, బాధలు వెన్నులోనికి పొడుచుచుండుట. మాంద్యత, బాధ. నొక్కుచున్నట్లునొప్పి, విరేచనబద్ధము గలిగినపిదప బహిష్టు అగుచుండుట. పుండుపడుట.

చర్మము:—హాపులు, మంటలు, దురదలు కుట్టుచున్నట్లుండు బాధలు, ఎరుపెక్కుట, ఇట్టి లక్షణములు పురుగులుకుట్టినపిదప గలుగుట. శరీరమంతటను పెద్దపెద్దకురుపులు వేయుచుండుట (ఈ లక్షణము రక్తదోషమును సూచించును).

పోలికలు:—స్కార్పియో, యాపిసు, ఆర్సెనికంఆల్బం.

విరుగుళ్ళు:—కేంఫరు, యాపిసు, లెడం, వుప్పునీరు, వినిగార్.

సరిపడనివి:—ఆర్జెంటం నైట్రికం.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## (ii) Serpent Poisons—సర్పవిషములు.

### 229. బోత్రాప్సు. BOTHROPS LANCEOLATUS.

(పసుపుపచ్చని విషసర్పము).

చూపు చెడిపోవుట; పగటియందు చూపుఆనకపోవుట (రాత్రియందు చూపుఆనని రోగులకు "బెల్లడోనా" మంచిది), నల్లగను పలుచగనుయుండు రక్తస్రావములు; వూపిరితిత్తులనుండి రక్తమిశ్రితమైనస్రావము; వూపిరి అందకపోవుట; ఒక చేతికో లేక కాలికో పక్షవాతమువచ్చుట; కొలది చలి, మరియు కంపముగలిగి, విస్తారముగా చెమటలుపోయుట, రోగలక్షణములు ఎడమవైపు పైఅవయవమునకును మరియు కుడివైపు దిగువఅవయవమునకును ఒకేసారి కనబడుట, ఇట్లే రోగలక్షణములు—పార్శ్వములు Sides—మారుచువచ్చుట; రక్తమువిషతుల్యమగుటతో నుబ్బు

అపాయకరములగు దుష్టలక్షణములు; నరములు దోషించుట—యిట్టి లక్షణములమీద నిది పనిచేయును.

కన్నులు:—సూర్యోదయమునకు పిదప దృష్టిఆనకపోవుట. దృష్టినాడి చెడుట.

ముఖము:—పొంగరించుట. త్రాగినవానివలె, తెలివితప్పునట్లుఆగుట.

నోరు, గొంతుక:—నాలుకకు పక్షవాతము వచ్చుట.

అన్నకోశము, పొత్తికడుపు, మలాశయము:—బాధగానుండుట. నల్లగా వమనమగుట. రక్తవమనము, పొంగరింపు. రక్తవిరేచనములు.

చర్మము:—వాచి, ఎఱ్ఱగను లేక, కమికినట్లు నీలిరంగుగను, చల్లగను, రక్తము పేరుకున్నట్లుగను యుండుట. కోశము కుళ్లుట. ఎక్కువ బాధగను మంటగను యుండునట్టియు, ప్రమాదకరమైనట్టియు, పొక్కులతోను దద్దురుతోను యుండు చర్మరోగము ప్రవేశించుట.

పుదేహ్రకము:—కుడి నైఫ్రస.

పోలికలు:—లెకెసిస్.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 230. క్రొటాలను. CROTALUS HORRIDUS.

(ఉత్తర అమెరికాదేశపు విషసర్పము.)

ఇది రక్తదోషముతోకూడిన రోగములమీద బాగుగా పనిచేయును. త్రాగుడు అలవాటుపడినవారికి, రక్తపుగెడ్డలు, మరియు రాచకురుపులు వేయునని సూచనగలిగినప్పుడును (యాంత్ర్రాసైనం), రక్తస్రావము అగుచుండువారికి, నిస్త్రాణ జెందువారికి, కామెర్ల రోగములోను, టీకాలవలని దోషములకును, పుండ్లుపడినచోట కుళ్లునట్లు సూచనకలిగినప్పుడును, ప్లేగు, కలరా, రక్తదోషముతో గూడిన యితర వ్యాధులకును, దీనిని వాడవచ్చును.

పైరోగములచే బాధపడుచున్నప్పుడు రోగితరుచు నిద్రమత్తుగానుండుట లేక, నిద్రించుచుండుట. ఈయౌషధ ముపయోగమును సూచించును. ఇది కుడివైపు అవయవములమీద బాగుగా పనిచేయును.

మనస్సు:—విచారగ్రస్తముగా నుండుట. జ్ఞాపకశక్తి తగ్గుట. పరాకుమాటలాడుట. నిద్రమత్తుగానుండుట. సిరికితనమువలన యేడ్చుచుండుట. తలలోని రక్తనాళము బ్రద్దలగుటవలన వచ్చు రుధిరవాతము (Apoplexy), ఇది తాగుబోతులలోను యితరులలోను కలిగినప్పుడు పనిచేయును.

తల:—యెడమవైపు పరుండినప్పుడు తలలోను, హృదయములోను, నొప్పిగానుండుట. నీరసము, వణకు; యివి తలతిప్పు, వికారముతో నుండుట. తలనొప్పి కుడివైపున, కుడికంటివద్దను వుండుట.

కన్నులు:— దీపపు వెలుతురును చూచుటకష్టముగా నుండుట. కండ్లుపచ్చబడుట. కనురెప్పలు వుదయమునను సాయంకాలమునను అంటుకొనుట. కండ్లనుండి రక్తము స్రవించుట. కండ్లయెదుటి వస్తువులు నీలిరంగుగానున్నట్లు కనపడుట. దృష్టిచెదరుట.

చెవులు:—రక్తము స్రవించుచుండుట. కుడిచెవి దిబ్బడవేయుట. చీము వెడలుచుండుట. చెవిరోగముతో సంబంధించి తలతిప్పువచ్చుట.

ముక్కు:—నల్లని రక్తము తీగవలె స్రవించుట.

ముఖము:—పొక్కులు బయలుదేరుట, పెదవులు వాచి మొద్దుబారుట. దౌడలుదగ్గరపడుట.

నోరు:—నాలుక యెర్రగాను, వాపుగాను మెరుగుపెట్టినట్లును వుండుట. నాలుకమీద పుట్టపగ్గము బయలుదేరి, దీనినుండి రక్తముస్రవించు సూచనలుగలుగుట. దుర్వాసనగా నుండుట, కుళ్ళిన వాసనవచ్చుట. లాలాజలము నురగవలెను, రక్తజీరతోను వెడలుట. రాత్రియందు పండ్లు కొరుకుట.

గొంతుక:—ముడుచుకొనిపోయినట్లుండుట. కొండనాలుక వాచి గట్టిపడినట్లుండుట. గొంతుక యెఱ్ఱగాను, వాపుగాను, ఆర్చుకొనిపోయి యుండుట. ఇందువలన గట్టిపదార్థములను మ్రింగుటకు వీలులేకుండుట.

అన్నకోశము:—తినిన ఆహారము యిముడకపోవుట. వమనములు విపరీతముగాను, పైత్యరసముతోడను, పసరికగాను వెడలుచుండుట. కుడి వైపు పరుండినయెడల తప్పకుండా వమనము వెడలుట. పుట్టపరిణము లేక పుండ్లు బయలుదేరుటవలన రక్తమును, తెల్లని ఆమమును వమనముచేసుకొనుట. కడుపుచుట్టూకట్టుకొనిన బట్టలు లేక దుస్తులు, భారముగాతోచుట. తరుచు ఆకలిగానుండుట, మైకమునిచ్చు పదార్థములను, చక్కెరను కోరుచుండుట. మాంసమందయిష్టము జెందుట.

పొత్తికడుపు:—దీర్ఘముగా వూపిరి తీయుటవలన కాలేయములో కుట్టుచున్నట్లు బాధగానుండుట. మరియు నిది నొక్కుటవలన వుద్రేకించుట. పొత్తికడుపు పొంగరించి, నెచ్చగాను, బాధగాను వుండుట.

మలము, మలాశయము:—పల్చగాను, నల్లగాను, దుర్వాసనతోను, కాఫీరంగుగాను మలమువెడలుట. మలము ఒకప్పుడు తెల్లగానగుట. జిగట విరేచనములు. కుళ్లినట్లు విరేచనమగుట, యిది చెడినఆహారము, నీళ్లుతీసుకొనుటవలన గలిగినప్పుడిది బాగుగాపనిచేయును. రక్తస్రావమగుటకు సూచనలు మూలశంఖలోను, మలవిసర్జనలో తినుకుటవలనను, నిలుచుండుటవలనను, గర్భిణులలోను, బహిష్టుదోషముతో కూడియున్నప్పుడును, హృదయరోగము లేక కాలేయరోగముతో కూడియున్నప్పుడును, త్రాగుబోతులలోను, గలిగినపుడిది పనిచేయును.

మూత్రావయవములు:—మూత్రము అణచిపెట్టబడుట. కొలదిగాను, రక్తముతోను, ముదరరంగుగాను, జిగురువంటి పదార్థముతోను, పైత్యోద్రేకమువలనను, ఆకుపచ్చని పసుపుపచ్చన మిశ్రమవర్ణముగాను, ఒకప్పుడుపల్చని రంగుగాను వెడలుట.

పురుషావయవములు:—అంగములో బిగువుతగ్గినను, సంభోగవాంఛ యెక్కువగుట.

స్త్రీ అవయవములు:—ఋతుశూలలో బాధలు తొడలలోనికి వ్యాపించుట; మరియు హృదయములో పొడుచుచున్నట్లుండుట. ఋతుస్రావము కొలదిరోజులవరకు వెడలుచుండుట. సూతికజ్వరము లేక సూతికవాతము వలని ఫిట్లు. దుర్వాసనతో కూడిన మైల. స్తనములవాపు. గర్భాశయము నుండి రక్తము స్రవించుట.

హృదయము:—బహిష్టులో గుండెదడయెక్కువగా నుండుట. గుండెలో వణకుచున్నట్లుండుట. గుండెసమీపమున బాధగాను, గుండెలో దడగాను యుండుట. నాడిసరిగా ఆనకపోవుట లేక అందకపోవుట.

శ్వాసావయవములు:—మాట్లాడుటవలన పొడిదగ్గువచ్చుట. నుదురు వెచ్చగాను, ఛాతీలో మంటగాను యుండుట. రొమ్ముముక సమీపమున కుట్టుచున్నట్లు బాధగానుండుట.

కాళ్లు, చేతులు:—మేహవాతము. పక్షవాత సంబంధమైననొప్పులను మాన్పును. నరములలోవచ్చు నొప్పులను మాన్పును. చేతులు వాచుటను, వణకుటను మాన్పును. కుడివైపు అవయవములకువచ్చు పక్షవాతము మీద బాగుగాపనిచేయును. కాళ్లమీగ వూదారంగుగల చిన్నచిన్న మచ్చలు బయలుదేరుట.

జ్వరము:—రక్తస్రావములకును, శరీరముకుళ్లుట లేక పాడగుటకు సంబంధించియుండు విషజ్వరము. పైత్యజ్వరములు. చల్లనిచెమట పోయుచుండుట. వమనము, విరేచనము, పైత్యదోషముతోను, రక్తముతోను కలిసి యుండుట.

చర్మము:—దురదగాను, కుట్టుచున్నట్లును యుండుట. పసుపుపచ్చగానుండుట. పొక్కులు, మొటిమలు, కురుపులు, రాచపుణ్ణములు, శరీరము కాలుట, విషజాతిపురుగులు కుట్టుట, పుండ్లు, శరీరముకుళ్లుట, ఇట్టిరోగముల

మీద బాగుగా పనిచేయును. కురుపులు, పుండ్లు, మొసలగువాటివద్ద చర్మము నల్లగాను పూదారంగుగాను యుండుట.

నిద్ర:—ప్రయాణము చేయుచున్నట్లు దెబ్బలాడుచున్నట్లు కల వచ్చుట. నిద్రమత్తుగానుండుట గలుగుచు నిద్రమాత్రము పట్టనపుడిది పనిచేయును.

వుద్రేకము:—వుదయమున, వేసగిలో, నిద్రనుండి లేచినప్పుడు, ప్రతిసంవత్సరమున, తేమవలన.

వుపశమనము:—విశ్రాంతివలన, బహిరంగమైన గాలిలో.

పోలికలు:—నజా, లెకెసిస్, ఇలాప్సుకర్, క్రొటేలస్, యాపిసు, టారంట్యులా, ఆర్సెనికం ఆల్బం, కుప్రంమెట్, బెల్లడోనా.

విరుగుళ్లు:—లెకెసిస్, కేంఫరు, ఆల్కహాలు, ఓపియం, కాఫీ.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

---

## 231. ఇలాప్సు. ELAPS CORALLINUS.

(బ్రెజీల్ దేశపు విషసర్పము).

ఇది మేహావాత తత్వములమీద పనిచేయును. స్రావములు నల్లగానుండుట, చెవినుండి నల్లని గులివి వచ్చుట, తీసికొనిన పండ్లు, చల్లని పానీయములు, కడుపులో మంచుగడ్డవలె చల్లదనమును కలుగజేసినట్లుతోచుట, మాంసగ్రంథులు వాచుట, కుడివైపు అవయవములకు పక్షవాతము వచ్చుట; ఇట్టి రోగలక్షణములమీద నిది బాగుగా పనిచేయును. ఇది ముఖ్యముగా చెవి, ముక్కు, గొంతుక, వీటికి సంబంధించిన రోగములమీదబాగుగా పనిచేయును.

మనస్సు:—వర్షమువలన భయము గలుగుట. పరధ్యానముగాను, విచారగ్రస్తముగాను యుండుట, ఒంటరిగానుండగోరుట, ప్రాణము తీయునట్టి రోగమేదియో కలుగునని తోచుట.

తల:— తలతిరిగి ప్పవలనరోగి ముందుకు పడిపోవుట. నుదిటిలో పొడుచుచున్నట్లు బాధగానుండుట.

కన్నులు:—కనురెప్పలలో మంటగా నుండుట, వుదయమున లేచు సరికి రెప్పలు యెర్రగా వాచుట. వెలుతురు చూచుటకు యిష్టపడకపోవుట. పెద్దదైనట్టి యెర్రనిచుక్క కండ్లయెదుట కనుపించుట.

చెవులు:—మాటసరిగావినపడకపోవుట. స్రావము దుర్వాసనగాను, ఆకుపచ్చగాను యుండుట. చెవులలో గురదగానుండుట.

ముక్కు:—దిబ్బడవేయుట. వాసన తెలియకపోవుట. ముక్కుమీద పొక్కులతో గూడిన చర్మవ్యాధి బయలుదేరుట.

గొంతుక:—మూసుకొనిపోయినట్లుండుటవలన ఆహారపదార్థములును, పానీయములును లోపలకు దిగకపోవుట.

ఛాతీ:—స్రావములు నల్లగా సిరావలెను, పల్చగాను యుండుట. ఛాతీలో విపరీతమైన నొప్పితోగూడిన దగ్గువచ్చుట.

అన్నకోశము:—చల్లగానుండునట్లుతోచుట. భోజనము చేయుచున్నప్పుడు పులియగొట్టినట్లుండుట. తియ్యని మజ్జిగను తాగగోరుట.

పొత్తికడుపు:—పేగులను నులిమివేసి, ముడిపెట్టినట్లు నొప్పిగా యుండుట. శూలతోనుండు విరేచనానుమానము.

మలము, మలాశయము:—నీళ్లవిరేచనములు నల్లగాను,నురగతోను, పల్చగాను, ఒకప్పుడు పసుపుపచ్చగాను, ఆమము, పైత్యరసము, రక్తముతోను, గుడగుడలాడుచును పడలుట. నల్లనిరక్తము స్రవించుట. మలాశయము వెలుపలికివచ్చుట.

మూత్రావయవములు:—మూత్రము యెర్రగాను, చిక్కగాను, యెర్రనిమడ్డితోను వెడలుట.

పురుషావయవములు:—నపుంసకత్వము, అండములు బరువుగాను వాపుగాను యుండుట.

స్త్రీఅవయవములు:—ప్రతి 2, 3 వారములకొకసారి బహిష్టు అగుచుండుట; బహిష్టుకు బహిష్టుకుమధ్య నల్లని రక్తస్రావము గలుగుచుండుట. ఋతుశూల.

హృదయము:—హృదయములో చీల్చుచున్నట్లు బాధగానుండుట. గుండెదడగానుండుట. ఆతురతగానుండుట. చేతులు వణకుట. నల్లనిరక్తమును కక్కుకొనుట.

నిద్ర:—తలనొప్పివలన నిద్రపట్టకుండుట. వ్యాపారమును గూర్చియు, చనిపోయినవానినిగూర్చియు, కలలువచ్చుట.

చర్మము:—మాంసగ్రంథులు వాచుట. వ్రేళ్లచివర చర్మము పొరలు పొరలుగా వూడిపోవుట. చంకలలో దురదతోగూడిన పొక్కులు బయలుదేరుట.

కాళ్ళు, చేతులు:—మోకాలులో బెణికినట్లు నొప్పిగా యుండుట. చేతులు, భుజములు, నీలిరంగుగావాచుట. పాదములు మంచువలె చల్లగానుండుట.

జ్వరము:—చల్లని చెమటపట్టుట. సన్నిపాతములో పుండ్లు లోతుగానుండుట, వీటినుండి నల్లనిరక్తము స్రవించుట.

వుద్రేకము:—పండ్లు తినుటవలన, చల్లని పానీయములు త్రాగుటవలన, తేమగాలివలన, పరిశ్రమవలన, రాత్రియందు.

వుపశమనము:—విశ్రాంతివలన.

పోలికలు:—క్రొటేలసు, ఎల్యూమెన్, కార్బోవెజ్, లెకెసిస్, ఆర్సెనికంఆల్బం.

విరుగుళ్ళు:—ఆర్సెనికం ఆల్బమ్, ఆల్కహాల్.

మోతాదు:—12 మొదలు 200 పొటెన్సీ.

## 232. లెకెసిస్. LACHESIS.

(దక్షిణ అమెరికా దేశపు విషసర్పము)

భయము, ప్రేమభంగము, ముష్టిమైథునము, రక్తదోషముతో గూడిన పుండ్లు, కోపము, విచారము, విసుగుదల, వేసవి—వీటివలని రోగలక్షణముల నిది మాన్పును.

రక్తదోషములమీదను, నిస్త్రాణమీదను, స్త్రీలకు ముట్లుడుగు కాలములో వచ్చు రోగములమీదను, విచారగ్రస్తముగానుండువారికిని, శరీర మందంతటను బిగపట్టినట్లుండునపుడును, యెడమప్రక్క అవయవములకువచ్చు రోగములమీదను, పల్చని శరీరముగలవారిలోను, లేక శుష్కించిన దేహము గలవారికిని, రోగములవలన శరీరమందును మనస్సునందును మార్పుజెందిన వారికిని ఇది బాగుగా పనిచేయును.

మనస్సు:—తనను యేదియోశక్తి ఆవహించిందనుకొనుట. జ్ఞాపక శక్తి తగ్గిపోవుట. అంకెలు పొరబడుట. అతిఖులాసాగానుండుట. యెక్కువగా చదివినపిమ్మట అధిక ప్రసంగములు చేయుచుండుట. తనకు విషము పెట్టుదురని భయపడుచుండుట. చావును గురించి భయమువలన నిద్రపోవుట కిష్టపడకుండుట.

తల:—ఉదయమున లేచునరికి వికారముగానుండుట. తలనొప్పి ఒక పార్శ్వమునకేవచ్చుట. యెడమప్రక్కన మొద్దుబారినట్లుగాను పురుగులుప్రాకుచున్నట్లును యుండుట. కదలికవలన నొప్పి యెక్కువగుట. సూర్యరశ్మిని చూచుట కష్టముగానుండుట. గర్భిణీలలో తలవెంట్రుకలూడిపోవుట. ఎండవలని తలనొప్పులు.

కన్నులు:—వెలుతురును భరించుట కష్టముగానుండుట. కనుగ్రుడ్లు వూడిపోయినట్లు బాధగాయుండుట. కనురెప్పలువాచి బాధగానుండుట. కనురెప్పల అస్సురుకు మాన్పును. కండ్లయెదుట మంటలు, చుక్కలు లేక నీలిరంగు తెర యున్నట్లు తోచుట.

చెవులు:—చెవులలో బాధగాను, గొంతుక బొంగురుగాను నొప్పిగాను, చీల్చుచున్నట్లు బాధగాను వుండుట. మాట సరిగా వినపడకపోవుట. గులివి ఆర్చుకొనిపోయి గట్టిగానుండుట.

ముక్కు:—ముక్కుశోణములు నొప్పిగాయుండుట. రక్తస్రావములను మాన్పును. నీళ్లవంటి స్రావముతోనుండు తలనొప్పి. తుమ్ములు విడిచి విడిచి వచ్చుచుండుట. ముక్కు దిబ్బడవేయుట. ముక్కుచివర యెర్రగానుండుట. ముక్కుపైని మానసటుపంటి యెర్రని మొటిమలను మాన్పును.

ముఖము:—మట్టిరంగుగా పాలిపోయి యుండుట. యెర్రగాను వెచ్చగాను యుండుట యెడమవైపునను, అడుగుదౌడలోను, వాపుగాను, బాధగాను యుండుట.

నోరు:—యెక్కువ నొప్పిగానుండుట ఇగుళ్లువాచి, మెత్తగా స్పంజివలెనుండుట, రక్తము స్రవించుచుండుట. నాలుక యెర్రగావాచి మంటగాను చివరను వణకుగాను, అర్చుకుపోయి బీటలుతీసి యుండుట. నాలుక బరువుగా నుండుట మాట్లాడుట కష్టముగా నుండుట.

గొంతుక:—రాత్రియందు మెలకువ వచ్చుసరికి ఆర్చుకొనిపోయి యుండుట; దాహముండకపోవుట. లాలాజలము గుటక వేయునప్పుడు గొంతుకలో 2 పెద్దవుండలు వున్నట్లును గొంతుక వాచినట్లును తోచినను ఆహారమును గుటకవేయునప్పుడు యిట్టిభావన తగ్గియుండునెడల దీనిని వాడవగును. ఎడమవైపు గవదకాయ వాచి బాధగానుండుట. ఘనపదార్థమును తీసికొనినకంటె ద్రవపదార్థములను తీసికొనుట యెక్కువ కష్టముగా నుండుట.

అన్నకోశము:—రుచి చేదుగానుండుట. నమలుచున్నట్లుండుబాధ భోజనానంతరము వుపశమించుట, మరియునిది అన్నకోశము కాళీయైన పిమ్మట తిరిగి వచ్చుచుండుట. అతిఆకలిగా వుండుటవలన ఆహారమును వడ్డనచేయువరకును ఆగలేకుండుట. తినిన ఆహారముపులిసి గొంతుకలోనికి వచ్చుచుండుట.

పొత్తికడుపు:—నొప్పిగా నుండుట, ఇందువలన బట్ట వదులుగా కట్టుకొనవలసివచ్చుట. పొంగరించి డోలువలె నుండుట. తాగ్రుబోతుల రోగలక్షణములమీద బాగుగా పనిచేయును.

మలము, మలాశయము:—మలము పల్చగాను, పసుపువర్ణముగాను, దుర్వాసనగాను, చెడినరక్తముతోను, అమముతోను, వేసవిలోను, ముఖ్యముగా రాత్రియందును, వెడలుచుండుట. ఒకమాటు విరేచనబద్ధము మరొకమాటు నీళ్లవిరేచనములు. మూలశంఖమొలలు వెలుపలకు వచ్చుచుండుట. మేకపెంటికలవలె విరేచనము గట్టిగా వెడలుట. దగ్గునప్పుడు, తుమ్మునప్పుడు, ఆసనములో పోటువచ్చుట.

మూత్రావయవములు:—మూత్రము ముదరరంగుగాను, లేక నల్లగాను వెడలుట. మూత్రము సరసగాను, ముదిరరంగుగాను, తరుచుగాను, వెడలుచుండుట. మూత్రపిండములనుండి కుట్టుచున్నట్లుండు బాధలు మూత్రనాళములోనికి వ్యాపించుట.

పురుషావయవములు:— దేహదారుఢ్యము తక్కువగానున్నను, లేపనశక్తి యెక్కువగానేయుండుట. సంభోగవాంఛ లేకుండగనే లేపనము గలుగుచుండుట. రసదోషములకును, సవాయివ్యాధికిని సంబంధించియుండు పుండ్లు బయలుదేరుట.

స్త్రీఅవయవములు:—బహిష్టులో స్రావము కొలదిగాను, అప్పుడప్పుడును, నల్లగాను వెడలుచుండుట. ఋతుశూల ప్రసవవేదనలోవలె యెక్కువ బాధగానుండుట. అండాశయములోను, గర్భాశయములోను, బాధలు ఋతుస్రావమగుట ప్రారంభించిన పిమ్మట వుపశమించుట. బాధలు కత్తితో పొడుచుచున్నట్లుండుట. బహిష్టుకు బహిష్టుకు మధ్యస్రావమగుటను, ముట్లుడుగు కాలమందు వచ్చురోగములను, శరీరమునకు తరుచు వెచ్చనగలుగుటను మాన్పును.

శ్వాసావయవములు:— శ్వాస గట్టిగా పీల్చవలెనని యుండుట. నిద్రపోయినపిమ్మట శ్వాస ఆగిపోయినట్లుండుట. తీగవంటి అమము

యెక్కువగా వెడలుచుండుట. కంఠము బొంగురుగా నుండుట, ముట్టు కొనినయెడల బాధగా నుండుట.

హృదయము:—గుండెదడ. ఇందువలన నిబ్బరముగా కూర్చుండవలసి వచ్చుట. మహావాత సంబంధమైన బాధలు. నాడి నిస్త్రాణగాను చురుకుగాను వుండుట. విడిచివిడిచి, యెగుడు దిగుడుగాను కొట్టుకొనుచుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—కూర్చున్నపిదప లేచినయెడల నడుములోనొప్పివచ్చుట. నడుము నొప్పితోనుండు విరేచనబద్ధమువిూద పనిచేయును, చంకలోని మాంసగ్రంధులు వాచుట, చేతులు ఒణుకుట. చూపుడువ్రేలిలోను, గుత్తిలోను వాపును మాన్పును. వ్రేళ్లచిగుళ్ళు మొద్దుబారుట.

చర్మము:—కురుపులు, రాచకురుపులు, పుండ్లు, పీటికిసంబంధించిన వాపులు నీలిరంగుగా నుండుట. పడక రాపడమువలన గలుగు పుండ్లను మాన్పును. వాపులు నీలిరంగు నల్లన మిశ్రమవర్ణముగా యుండుట. దురదగా నుండుట. చర్మము నీలిరంగుగాను, పూదారంగుగాను కనిపించుట, మరియు వెచ్చని చెమటపట్టుచుండుట.

నిద్ర:—నిద్రవలన లక్షణములు దేశ్రకము జెందుట. నిద్రనుండి అకస్మాత్తుగా లేచుచుండుట. నిద్రమత్తుగా నున్నను నిద్రపట్టకుండుట (బెల్లడోనా, ఓపియం).

జ్వరము:—నడుములో చలిగా నుండుట. వెచ్చగా నున్నప్పుడు వణకుచుండుట. కామోద్రేకముతో వలె వెచ్చగా నుండుట. వసంతఋతువులో వచ్చునట్టి మన్యపు జ్వరమును మాన్పును. సన్నిపాతజ్వరమువిూదను, సన్నిపాత లక్షణములతో గూడిన యితరరోగ లక్షణములవిూదను బాగుగా పనిచేయును.

ఉద్రేకము:—వుదయమున, చలిగాలివలన, నిద్రనుండి లేచుటతో, మత్తును కలుగజేయు మందులవలన, రసదోషమువలన.

వుపశమనము:—భోజనము చేయుచున్నప్పుడు, ఋతుస్రావము వెడలుచున్నప్పుడు, బట్టను వదులు చేసుకొనుటవలన.

పోలికలు:—కొంత్రేలను, హెలోడెర్మా, బోత్రాప్స్, నజా, యాపిసు, లైకోపోడియం, సల్ఫరు, డిజిటాలిసు, ఆర్సెనికం ఆల్బం, గ్లోనోయినం, విరేట్రింఆల్బం, జల్సిమియం.

సహచరులు:—లైకోపోడియం, హెపారుసల్ఫ, యాసిడ్ నైట్రిక్.

సరిపడనివి—యాసిడు ఎసెటికు.

విరుగుళ్లు:—ఆర్సెనికం ఆల్బమ్, మెర్క్యూరియసు, ఆల్కహాల్, కార్బోవెజ్, బెల్లడోనా, కేమోమిల్లా, కాఫీ, నేట్రింమూరు, నక్సవామికా, వుప్ప, యాసిడుఫాస్, వేడిమి.

బ్రాయొనో, కొంత్రేలను, రూస్టాక్సు లకిగ విరుగుడు.

మోతాదు:—12 మొదలు 200 పొటెన్సీ. దీని మోతాదులను అతి తరచుగా వాడరాదు. దీని గుణకాలపరిమితి 4 లేక 5 వారములు.

---

## 233. నజా. NAJA.

(హిందూదేశపు ఔషధము. 64. త్రాచుపాము.)

నీరసముగాను, దడతోను, వుండు హృదయ రోగముల మీదను, నరములకు సంబంధించియుండు రోగములమీదను విచారమువలని రోగలక్షణములమీదను యిది పనిచేయును. రోగి త్రాగినవానివలె మత్తుగా నుండుట, మరియు ఆవయవములు స్వాధీనము తప్పుటయు దీని ప్రధాన లక్షణములు.

మనస్సు:— లేనిపోని బాధలను గూర్చితలపోయు చుండుట. ఆత్మహత్య చేసుకొనవలెనని భ్రమగా నుండుట. విచారగ్రస్తముగాను మాట్లాడుట కిష్టములేకయు యుండుట. ముద్దమాటలాడుట. వర్షముపడునని భయము జెందుట.

తల:— తేరబారి చూచుచుండుట. పైపై పు కనురెప్పలకు పక్షవాతమువచ్చుట. నిద్రపోయినపిదప వుక్కిరి బిక్కిరిగా నుండుట (లెకెసిస్).

ఎడమకణతలోనిబాధ ముచ్చిల గుంటవరకు వ్యాపించుట; దీనితో వికారము వమనము గలుగుట.

చెవులు:—యేనియో ధ్వనులు వినబడుచున్నట్లు తోచుట. చాల కాలమునుండి చీము వెడలుచుండుట. స్రావము నల్లగాను, నీచువాసనగాను యుండుట.

పురుషావయవములు:-స్వప్నస్ఖలనములు. సంభోగేచ్ఛయెక్కువగుట.

స్త్రీఅవయవములు:—ఎడమ అండాశయమునందువచ్చు వరముల సంబంధమైన బాధ. శస్త్రచికిత్సానంతరము గజ్జలలో బయలుదేరు బాధ. ఈబాధ హృదయము వైపుకు లాగుచున్నట్లుగా యుండుట.

శ్వాసావయవములు:—హృదయ దోషములతో నుండు పొడిదగ్గు (స్పాంజియా). వుక్కిరి బిక్కిరి యగుచున్నట్లుండుటవలన కంఠమును పట్టుకొనుట. సాయంకాలమందును, నీళ్ళవంటి స్రావముతోను, ప్రారంభించునట్టి వుబ్బసపు దగ్గు.

హృదయము:—బరువుగానుండుట. హృదయవేదనతో గూడిన దడ మెడవరకును, యెడమ భుజము, చేయివరకును వ్యాపించుట; మరియు దీనివలన ఆతురతయు, చావునుగురించి భయమును గలుగుట. హృదయ బాధతో పాటు నుదిటియందును, కనుబొమలలోను నొప్పిగా యుండుట. నాడి వక్రముగా నుండుట. శరీరము చల్లగాను, నాడి మందముగాను, నిస్త్రాణగాను వుండుట, మరియు హృదయమునకు పక్షవాతమువచ్చు సూచనలు గలుగుట. అంటువ్యాధులు వచ్చినపిమ్మట హృదయము పాడైపోవుట.

వుద్రేకము:—వుద్రేకమునిచ్చు పదార్థముల నుపయోగించుట వలన, తాకుడువలన, పరిశ్రమ వలన, కదలిక వలన, ఒకవైపు పరుండుట వలన.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో నడచుట వలన, ప్యారి చేయుటవలన, పొగ త్రాగుటవలన.

పోలికలు:—లెకెసిస్, క్రొటాలస్, స్పైజీలియా, స్పాంజియా,

ఆరంమెట్, నేట్రింకార్బ్, నక్సువామికా, కాగ్నోవెజ్, బాప్టీషియా, డిజిటాలిసు.

విరుగుళ్లు:—టుబాకం, వుద్రేకమునిచ్చు పదార్థములు, అమోనియా.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 234. వైపిరా. VIPERA TORVA.

(జర్మనీదేశపు విషసర్పము).

సిరలసంబంధమయినవాపులు, బాధలు, దుస్థితి జెందినఅవయవమును వేళ్లాడ నిచ్చినయెడల అవయవము బ్రద్దలవనున్నంతబాధ, రోగోద్రేకము గలుగుట, కాళ్లకుమట్టుకు పక్షవాతమువచ్చుట, యిట్టి పక్షవాతదోషము పైవైపునకు వ్యాపించుట, హృదయమునకు నీరుపట్టుట, రక్తమిశ్రితమైన మూత్రమువెడలుట, కాలేయమువాచుట మరియు పెద్దదగుట, బాధగానుండుట, కామెర్లదోషములు, జ్వరము, దీనితో ఆకుపచ్చని విరేచనములగుట, ముక్కునుండి రక్తస్రావము, ముట్లుడుగుకాలమునందు వచ్చురోగలక్షణములు, వివిధములగు నరములసంబంధమైన బాధలు, వెన్నుపాముదోషములును దీని వుపయోగమును సూచించును.

మనస్సు, తల:—సంధిలక్షణములు, వమనములు; మగతతో దాహము, వికారముతో, ముందరవైపునకు పడిపోవుట, వీటితో ఆతురత, ముక్కునుండి రక్తస్రావము ద్వంద్వముగానుండుట, వమనములగుట, దృష్టి చెడుట. నాలుకపైపూత, ఆకలి పాడగుట, నిట్టూర్పు జెందుచుండుటతో నుండు తలనొప్పి.

ముఖము:—ముఖము ఎక్కువగా వుబ్బుట. నాలుక అర్చుకుపోయి గోధుమరంగుగాను నల్లగాను అగుట. మాటలాడుట కష్టముగానుండుట. మాట ముద్దగావచ్చుట. నాలుక, పెదవులు వాచుట. నీలిరంగుగానయు, చల్లని చెమటలతో నిండి, చావుముఖమువలెనగుట, నోటిలోని మరియు,

గొంతుకలోని గ్రంధులువాచుట. వూపిరి దుర్వాసనగానగుట.

అన్నకోశము, పొత్తికడుపు:—పాలుత్రాగినపిదప వమనమగుట. శూల, బాధ. జీర్ణము నెమ్మదిగా నగుట. కాలేయమువాపు, కామెర్లు, జ్వరముతో బాధ భుజములోనికిని, తొడ్రటికలోనికిని వ్యాపించుట.

మలము, మూత్రము:—నల్లగా మదరగంగుగా, వెడలుట. రక్తమూత్రము. మలముతో రక్తము ముద్దలుగా, దుర్వాసనగా వెడలుట.

కాళ్లు, చేతులు:—బాధవలన కాళ్ళను, చేతులను ఎత్తుగానుంచవలసివచ్చుట. కాళ్లులాగుట.

చర్మము:—పెద్దపెద్దపొరలుగా వూడిపోవుట. కురుపులు, రాచవ్రణములు.

వుద్రేకము:—తాకుడువలన, బాధతోనుండు కాలునుగాని చేతినిగాని వ్రేలాడనిచ్చుటవలన.

పోలికలు:—తూజా, ఎమోనియంకార్బ్, కాక్సికార్బ్.

మోతాదు:—12 మొదలు 200 పొటెన్సీ.

---

## (iii) సాలిపురుగులు—Spider Poisons.

### 235. అరేనియా డయాడిమా. ARANEA DIADEMA.

(ఐరోపా, అమెరికా ఖండములలోని తోటలలోను పాడుపడిన దొడ్లలోను యుండు ఒకజాతి సాలిపురుగు)

యిది ముఖ్యముగా మన్యపుజ్వరము లేక, చలిజ్వరము మీద పని చేయునట్టి యొక దివ్యౌషధము. ఇతరములైన సాలిపురుగుల విషములవలెనే యిది కూడ నరములసంబంధమైన దోషములమీద వుపయోగింపదగినది.

తేమవలన (తేమప్రదేశ నివాసమువలన, తేమగాలిలో) ను మరియు చల్లదనమువలనను లక్షణములు ద్రేకించుటయు; రోగలక్షణములు నియమిత

కాలములందు తిరిగి వచ్చుచుండుటయు, యిట్టి రోగలక్షణములుగల రోగికి వాతావరణ స్థితి పొడిగా నుండుటలోనికి మారుటతో రోగోపశమనము గలుగుచుండుటయు ఈ యౌషధ ప్రుపయోగమును సూచించును; మరియు ఏమిచేసినను చలిమానకుండుట, శరీరమునందలి యెముకలను చలి కొరికి వేయుచున్నట్లుండుట, ప్లీహము వాచుట లేక పెద్దదగుట, నదులు, యేళ్లు, చెరువులు, మున్నగువాటి సమీపమున నివసించుట యందయిష్టత (నేట్రిం సల్ఫ, తూజా), అవయవములు, కోశములు లేక పార్శ్వములు పొడుగు అయినట్లు భావన గలుగుట—యివి దీని ముఖ్యలక్షణములు.

మనస్సు:—నిరాశ జెందుట. చావునుకోరుట.

తల:—నుదిటిలో నొప్పి పొగత్రాగుటవలనను బహిరంగమైన గాలి లోను ప్రుపశమించుట. నుదురు, ముఖము మంటగా యుండుట. ముఖము వెచ్చన, కడ్డునుంటలుతో వచ్చు తలనొప్పి.

నోరు:—రాత్రిపరుండిన వెంటనే పంటిసలుపు వచ్చుట. ప్రతిదిన మునను ఒకేగంటకు పండ్లుచలికొనిపోయినట్లుండుటతో బాధ వచ్చుట. నాలుకకు, దవుడలకు, తలకు ఒక్కసారిగా బాధవచ్చుట.

పొత్తికడుపు:—క్వయినా వలన మన్యపుజ్వరము అణచిపెట్టబడుట తో వచ్చిన ప్లీహమువాపు. గుడగుడలు. పొత్తికడుపుదిగువభాగము రాయి వలె గట్టిగానుండుట.

మలము, మలాశయము:—నీళ్ల విరేచనములు, వీటివలన చేతులలోను కాళ్లలోను అతినీరసము గలుగుట. మలము పలుచగాయున్నను, వెలువరిం చుటకు శూలవలన కష్టముగానుండుట.

స్త్రీఅవయవములు:—బహిష్టు చాల ముందరగాను స్రావము అతి విస్తారముగాను వచ్చుట, మరియు చాలదినములవరకును యుండుట. గర్భా శయ రక్తస్రావములు. బహిష్టుమామూలుకన్న 8 దినములు ముందుగా నగుట. జిగటగను లేక బంకగనుయుండు కుసుమ. ఋతుశూలవలని బాధ అన్నకోశమునుండి ప్రారంభించినట్లుండుట.

శ్వాసావయవములు:—రక్తస్రావములు.

కాళ్లు చేతులు:—ఉబ్బినట్లు భావన యెముకల చివళ్ళు బాధగా యుండుట. ఎడమచీలమండవద్ద పుండు బయలు దేరుట.

నిద్ర:—పరుండిన వెంటనే పంటిపలుపు ప్రారంభించుట. అస్థిమిత ముగను తరచు మెలకువ జెందుచును యుండుట. మెలకువ జెందు పరికి చేతులు బరువెక్కినట్లు తోచుట.

జ్వరము:—రాత్రింబవళ్ళు చలితోనుండుట. చలికిముందు కడుపులో కోయుచున్నట్లుండు బాధ, వమనములు, నడుమునొప్పివచ్చుట. వేసవిలో సహితము యెముకలు మంచుగడ్డతో చేయబడినంతటి చల్లదనము. చలినియమిత కాలములందు అనగా చలి, జ్వరము ప్రతిదినమునగాని, ప్రతి మూడవదినమునగాని ఒకేగంటయందు ప్రారంభించుట. చలితో రోగి ముద్దరైపోయినట్లుండుట. పొడుగుపాటి యెముకలలో అతి చల్లదనము, బాధ. చమటలు పోయకుండుట, చమటలులేకుండగ దాహము గలుగుట లేక చమటపోయుటతో దాహముగలుగుట. మన్యపుజ్వరము. చనిపోయినవానివలె నిస్త్రాణతో పరుండుట.

వృద్ధికము:—తేమ గాలిలో, అర్ధరాత్రిమున, స్నానమువలన, చల్లని గాలిలో, రాత్రియందు పరున్నపిదప.

ఉపశమనము:—పొగత్రాగుటవలన.

విరుగుళ్లు:—పొగత్రాగుటవలన.

చైనా, క్వాయినా, మెర్క్యూరియసు—లకిది విరుగుడు.

పోలికలు.—సిడ్రాను, నక్సువామికా, ఇపెకాక్, ఆర్సెనికం ఆల్బం, టారంట్యులాక్యూబెన్సిసు, హెలోడెర్మా, మైగేల్.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ.

## 236. లేట్రొడెక్టసు. LATRODECTUS.

(అమెరికా దేశపు సాలిపురుగు).

ఇది ఎంజీనా పెక్టొరిస్ (Angina Pectoris) అనబడు హృదయరోగముమీద బాగుగా పనిచేయును. హృదయములో దడను, నొక్కుచున్నట్లుండు నొప్పిని, బాధను మాన్పును. ఛాతీలోని కండరములు ముడుచుకొనిపోవుట, బాధలు ఛాతీనుండి భుజములలోనికిని, నడుములోనికిని వ్యాపించుట యున్నపుడిది పనిచేయును.

తల:—బాధవలన కేకలు వేయుచుండుట. శ్వాస ఆగిపోవునని భయము జెందుట, ఆతురతగా నుండుట.

అన్నకోశము, పొత్తికడుపు:—వికారము. పొత్తికడుపులో బాధలు వచ్చుట. నల్లని పదార్థమును వమనము చేసుకొనుట. వమనమును పోలియుండు నల్లని విరేచనములు రెండు అగుట.

హృదయము:—హృదయము సమీపమున నుండి బాధలుచంకలలోనికిని, చేతులలోనికిని, వేళ్లలోనికిని వ్యాపించుట. నాడి వడిగాను, సన్నముగాను యుండుట.

చర్మము:— చలువరాతివలె చల్లగా నుండుట.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 237. మైగేల్. MYGALE LASIDORA.

(క్యూబా యనబడు ద్వీపము నందలి నల్లని సాలిపురుగు.)

నరముల సంబంధమయిన దోషములమీదను సుఖరోగములమీదను యిది వాడదగినది. ముఖ్యముగా నిది కొరియారోగముమీదను, సెగవ్యాధిమీదను బాగుగా పనిచేయును.

మనస్సు:—విచారగ్రస్తముగను, చనిపోవుదుననుభయముతోను యుండుట. అస్థిమితముగను, పరాకు మాటలాడుచును యుండుట. నిరాశ జెందుట.

తల:——ముందరవైపు నొప్పి. తరుచు కదలుచుండుట.

కన్నులు:— నీరసము జెందుట. వికారముగా నుండుటతో దృష్టి మందగించుట.

చెవులు:—కుడిచెవిపోటు. ఎక్కువబాధగా నుండుట.

ముఖము:—కందుట. కండరములు కదలుచుండుట.

నోరు:—నిద్రలో పండ్లుపటపట కొరుకుట. నాలుక అరుచిపోవుట. పొడిగాను, గోధుమరంగు పూతతోను యుండుట.

అన్నకోశము:—అతిదాహము. ఆకలి అసలేలేకుండుట. భోజనము నందయిష్టత. వికారముగనుత్రృప్తిమాంద్యముగను గుండెదడతోనుయుండుట.

మూత్రావయవములు:—మూత్రము మంట, బాధతోను, మూత్ర నాళమునందు చిమచిమ లాడుటతోను, విస్తారముగను వెడలుట. మూత్ర నాళమునందు కుట్టుచున్నట్లుండు బాధ.

పురుషావయవములు:—జీర్ణించిన సెగరోగము—దీని దోషములు మానుచును వచ్చుచును యుండుట. సవాయిరోగము. తీవ్రమైన లేపనము గలుగుచుండుట.

శ్వాసావయవములు :—శ్వాస కష్టముగా నుండుట. మాటలు తడబడుట.

హృదయము:——విస్తారణ, గుండెదడ, వికారము, తలతిప్పు.

కాళ్లు చేతులు:—అప్రయత్నముగ కదలుచుండుట. వాచుట. వాపుపై ఎర్రని చారికలవలె పైకి కనపడుట. మోకాలు మొదలు పాదము వరకు వాపుబయలు దేరుట. వాపున్న ప్రదేశము కమికినట్లు గంగుమారుట

నిద్ర:—అస్థిమితమైననిద్ర. సంబంధములేని విషయములగూర్చిన కలలు.

జ్వరము:—అరగంటవరకు, తీవ్రమైనచలివచ్చుట; అటుపిమ్మట జ్వరము, దాహము, వణకువచ్చుట.

వుద్రేకము:—వుదయమున, భోజనముపలన.

వుపశమనము:—నిద్రలో.

పోలికలు:—ఇగ్నేషియా, స్ట్రామోనియం, సిమిసిఫ్యూగా, ఎగేరికసు, యాంటింకూడం, టారంట్యులా క్యూబెన్సిసు, కుప్రం మెట్.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 238. టారంట్యులా క్యూబెన్సిసు. TARENTULA CUBENSIS.

(క్యూబా మరియు మెక్సికోదేశములోనిఒకజాతి సాలిపురుగు)

రక్తదోషములు, అతివిపరీతమైన బాధలు, వాపులు, త్వరితముగా నిస్త్రాణ జెందుట, అపాయములను కలిగించునట్టి సాగ్రవములు, పుండ్లు వూదారంగుగాను మంటతోను కుట్టుచున్నట్లు బాధతోను వుండుట, బిళ్లలు, పాదముల నెప్పుడును కదల్చుచుండుట, మర్మావయవములలో దురద, మరణ సంబంధమైన బాధలు, పొక్కులు లేక బొబ్బలుతోనుండు మహామారి లేక ప్లేగు (యీరోగమును మాన్పుటకును, రాకుండగ నాపుజేయుటకును గూడ వాడవచ్చును).—ముఖ్యముగా వీటిమీద నిది పనిచేయును.

పడిపోవుటవలన, సమాధానము కలుగని ప్రేమవలన, తిట్లవలన, శిక్షవలన, శరీరముకుళ్లుటవలన, దుర్వార్తలవలననువచ్చు రోగలక్షణముల మీద నిది పనిచేయును.

తల:—వేలకొలది సూదులు మెదడులో గుచ్చుచున్నట్లు నొప్పిగా

యుండుట. పార్శ్వపునొప్పులు.

అన్నకోశము:—ఉదయమునతప్ప తక్కిన వేళలయందు ఆకలి యుండకపోవుట. అన్నకోశము గట్టిగాను బాధగాను వుండుట.

మూత్రము:—అణచిపెట్టబడుట. దగ్గినప్పుడు తటాలున వెడలుట.

పురుషావయవములు:—శృంగార చేష్టలతోనుండు వుద్రేకము పిచ్చిలోనికి మారుట. అధిక లేపనము. స్ఖలనములు.

స్త్రీ అవయవములు:—ఒకమారు రక్తస్రావము, ఒకమారు కుసుమ. బహిష్టు మామూలుకన్న 7 దినములు ముందుగానగుట. గర్భిణిలో కలుగు రోగలక్షణములు. సంభోగమువలన గలుగు అధికమైన సంభోగేచ్ఛ.

కాళ్లు, చేతులు:—మూత్రపిండములసమీపమున దురదలు బయలుదేరుట. చేతులు వణకుట. రక్తము యెక్కువగా చేరి వుబ్బుట.

చర్మము:—వుబ్బుట. యెఱ్ఱని మచ్చలు, పొక్కులు బయలుదేరుట. రాచకురుపులు. కురుపులు బయలుదేరిన ప్రదేశముకుళ్లుట—వీటిలో మంటలు, కుట్టుచున్నట్లుండు బాధలు. వాపు, బాధ, యెఱ్ఱదనముతోనుండు పెద్దపెద్దకురుపులు. స్తనములపైని బయలుదేరు కంతులు, పుండ్లు. మూన వటువంటిపుండ్లు.

నిద్ర:—మగత. అస్థిమితముతోనుండు నిద్ర. దగ్గువలని నిద్రలేమి.

వుద్రేకము:—రాత్రియందు, బాధతోనుండు అవయవములను తాకుటవలన, గాలి మార్పులవలన.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో, సంగీతము వలన, బాధగానుండు ప్రదేశమున మర్దనమువలన, పొగత్రాగుట వలన.

లెకెసిసు—నకిది విరుగుడు.

విరుగుళ్లు (కొంతవరకు):—పల్సటిల్లా, కుప్రంమెట్, మెగ్నీషియా కార్బ, మోస్కసు, చెలిడోనియం, జల్సిమియం, బోవిస్టా, కార్బోవెజ్,

పోలికలు:—ఆర్సెనికం ఆల్బమ్, పైరోజీనియం, యాపిసు, క్రొటేలసు, నజా, ఎఖినేషియా అంగుష్టిఫోలియా, యాంత్రిసైనం, బెల్లడోనా.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 239. టారంట్యులా హిస్పా. TARANTULA HISPANIA.

(స్పాయిను దేశపు సాలిపురుగు)

తీవ్రమైన సంభోగేచ్ఛ, అతి అస్థిమితము, కొరియాలక్షణములు, అపస్మారదోషములు మరియు వీటితో రక్తవిహీనత ద్వంద్వముగానుండుట. అవయవములు మరియు కోశములు ముడుచుకుపోవుచున్నట్లుండుట. మూత్రకోశమునందు తీపుగానుండుట. ఒకప్పుడు అపస్మారము మరియు మూర్ఛ ద్వంద్వముగానుండుట—ఇవి దీని వుపయోగమును సూచించును.

మనస్సు, తల:—పాడుచేయుతలంపు. నీతిమార్గమును విడుచుట. సంగీతమును భరింపలేకుండుట. తోచినట్లుచేయజూచుట. తనకుచేసిన మేలును గమనించలేక తృప్తిజెందకపోవుట. సూదులతో పొడుచుచున్నట్లు బాధ. వికారము లేక తలతిప్పువచ్చుట.

పురుషావయవములు:—సంభోగసంబంధమైన ఉద్రేక మెక్కువగా గలుగుటతో క్రమముగా మద్దపిచ్చియెత్తు సూచనలుగలుగుట. రేతస్ఖలనములగు చుండుట.

స్త్రీ అవయవములు:—పొడిగాను వెచ్చగాను, దురదగనుయుండుట. అండాశయబాధతోగూడిన ఋతుశూల. ఆపుకొనలేని సంభోగకోర్కె. ఋతుస్రావము అమితముగా వెడలుట.

హృదయము:—హృదయమును మెలితిప్పి, నులిమివేసి పారవేసినట్లుబాధ, మరియు భావన. గుండెదడ.

కాళ్లు, చేతులు:—కాళ్లు తేలిపోవుట. నీరసముగానుండుట. మొద్దుబారుట. తిమ్మిరెక్కుట. వింతగాముడుచుకొనుచును జాపుచునుయుండుట.

వుద్రేకము:—తాకుడువలన, ధ్వనివలన, కదలికవలన.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో, సంగీతమువలన, నిగనిగలాడురంగువలన, బాధగానున్న కోశమును మర్దించుటవలన.

విరుగుళ్లు:—లెకెసిస్.

పోలికలు:—ఎగేరికసు, ఆర్సెనికం ఆల్బం, మెగ్నీషియాఫాసు, కుప్రింమెట్.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.



## 240. తెరీడియాన్. THERIDION CURAS.

(వెస్టు ఇండీస్ దీవులందు నారింజచెట్లపైనుండు ఒకజాతి సాలిపురుగు.)

సముద్రయానమువలనను, స్వారిచేయుటవలనను, బట్టలనుతుకుటవలనను వచ్చు రోగములమీద నిది ముఖ్యముగా వాడదగినది.

క్షయరోగతత్వమును మార్చును. ధ్వనివినుట బాధకరముగాతోచుట, మరియు యెట్టిబాధశరీరము గుండాయున్నూ ముఖ్యముగా పండ్లగుండాయున్నూ చొచ్చుకు పోవుచున్నట్లుండుట దీని ప్రధానలక్షణము. ఏయౌషధముయొక్కగుణమున్నూ నిలువగా యుండకపోవుట దీని వుపయోగమును కొంతవరకు సూచించును.

మనస్సు:—కాలము అతిత్వరితముగా గడచుచున్నట్లుండుట. తలభారముగానున్నను రోగి ఖులాసాగానూ పాడుచునూయుండుట. అస్థిమితమువలన యేమిచేయుటకును యిష్టములేకుండుట.

తల:—కదలినచోతలతిప్పు, వికారము, వమనమువచ్చుట, యీలక్షణము కండ్లుమూసికొనినచో ముఖ్యముగావచ్చుట. సమీపమున యెవరైన నడచినట్లు ధ్వనిఅయినచో బాధలు దేర్కించుట.

కన్నులు:—వెలుతురును చూచుట కష్టముగానుండుట. కనుగ్రుడ్లు వెనుకవైపు బాధగానుండుట. కుడికంటిని చికిలించుట. ప్రతివస్తువు రెట్టింపుపరిమాణముగా కనబడుట.

ముక్కు:—దుర్వాసనగానుండు చిక్కని, పసుపుపచ్చని స్రావము వెడలుట (పల్సటిల్లా, తూజా).

మూత్రావయవములు:—పగటియందు తక్కువగను రాత్రియందు ఎక్కువగను (అయిదారుసార్లు) మూత్రము వెడలుట.

పురుషావయవములు:—వుదయమున కోర్కెలేకుండగనే గాఢమైన లేపనము. సంభోగమునందు లేపనము తక్కువగానుండుట లేక అసలే లేకుండుట లేక కోర్కెనశించుట.

స్త్రీఅవయవములు:—యుక్తవయసునందును ముట్లుడుగుకాలమునందును అపస్మారమువచ్చుట.

అన్నకోశము:—వికారము, తలతిప్పు(టబాకం). కాలేయమువద్ద మంటగానుండుట.

శ్వాసావయవములు:—ఛాతీ ఎడమవైపు పైభాగమున బాధగానుండుట. ఎడమవైపు చిన్నప్రక్క యెముకలలో నొప్పి. రాత్రియందు ఎక్కువ దగ్గు వచ్చుట. నిట్టూర్పుకొరకు శ్వాసబాగుగా పీల్చవలయునని యుండుట. క్షయరోగచిహ్నములు.

నడుము, కాళ్లు చేతులు:—నడుము పొడుగునను బాధ. కుట్టుచున్నట్లు నొప్పులు. నడుమును మోపి కూర్చొనలేకుండుట. భోజనానంతరము కాళ్లు చేతులు లాగుచున్నట్లుండుట.

చర్మము:—దురదలు, మంటలు, కుట్టుచున్నట్లుండు బాధలు.

వృద్ధిక్రమము:—బండిలో స్వారిచేయుట లేక ప్రయాణము చేయుట వలన, తాకుడువలన, నొక్కుటవలన, ఓడలో ప్రయాణము చేయుటవలన, కండ్లుమూసికొనినపుడు, ఎడమపార్శ్వమున, సంభోగమువలన, ధ్వనివలన, ప్రతిరాత్రియందు, విరేచనానంతరమున.

వుపశమనము:—వెచ్చదనమువలన, వెన్నెటివలన.

విరుగుళ్లు:—ఎకోనైటు, గ్రాఫైటిసు, మోన్కాసు.

సల్ఫరు, కాల్కేరియా కార్బ్, లైకోపోడియం—ఇకు పిమ్మట వాడదగినది.

పోలికలు:—సేపియా, అరేనియాడయాడిమా కెన్నబిస్ ఇండికా, లెకెసిస్, తూజా, పల్సెటిల్లా, యాసిడ్ ఫాస్, బేసిలినం, అర్జెంటంనైట్రికం.

మోతాదు:—30 మరియు 200 పొటెన్సీలు.

---

# (iv) చేపలు, స్పాంజిలు.

# Animals living in water.

## 241. ఎస్టీరియస్ రూబెన్సు. ASTERIAS RUBENS.

(నక్షత్రమువలె 5 మూలలు, కండ్లుగల ఒకవిధమైన యెర్రని చేప. ఇది అమెరికా, ఐరోపా ఖండములందు గలదు.)

పుట్టువ్రణము అనబడు కేన్సరుమీదను నరములసబంధమైన వ్యాధులమీదను ఇది బాగుగా పనిచేయును.

మనస్సు:—అపస్మారసబంధమైన రోగములు, నరములలో వుద్రేకము, మరియు పార్శ్వపునొప్పులమీదను బాగుగా పనిచేయును. అతిస్వల్పకారణమువలన గూడ యేడ్పువచ్చుట. ఒకప్పుడు విచారము యింకొకప్పుడు సంతోషము గలుగుచుండుట.

తల:—తల అన్నివైపుల వేడిగాలిచే ఆక్రమింపబడినట్లు తలలో వేడిగానుండుట. విద్యుచ్ఛక్తివలన తల కంపింప బడినట్లుగా యుండి అపస్మారమువచ్చునేమోయను భయముతో గాత్రిమెలకువగా నుండుట. తల ఖాళీగాయున్నదనుకొనుట. స్మృతితప్పుట. అపస్మారమునుగురించి ఆలోచన గలుగుచుండుట. వ్యతిరేకభావముగా నుండుట.

ముఖము:—ఎఱ్ఱగా కందుట. మొటిమలు ముక్కుపక్కను గెడ్డము మీదను మూతిపద్దను బయలుదేరుట. యువకులలో తరచు మొటిమలు బయలుదేరుచుండుట. ముక్కునుండి రక్తము స్రవించుట. ఉదయమున లేచుసరికి రొంప, తుమ్ములువచ్చుట. నాలుక లాగుచున్నట్లుండుట. లాలాజల మెక్కువగా వూరుచుండుట.

అన్నకోశము:—ఆకలిమందముగా నుండుట. రుచిసరిగా తెలియక పోవుట. తరుచుగా త్రేణుపులు, కొద్దిగా శూలవచ్చుచుండుట.

పొత్తికడుపు:—వాయువు బంధింపబడుటవలన విపరీతమైన శూల. ముఖము వెచ్చగానుండుట. పొత్తికడుపు ఒక్కొక్కసారి వుబ్బుచుండుట.

మలము, మలాశయము:—ఎక్కువ విరేచనబద్ధము. 12 లగాయితు 15 రోజులవరకు విరేచనమవకుండుట. అయినప్పుడు చిన్నచిన్న వుండలవలె గట్టిగా అగుచుండుట. ఒకప్పుడు విరేచనము పల్చగా చాలసారులు వడలుచుండుట. ఆసనములో వెచ్చగానుండుట. మూలశంఖ.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ యెక్కువగుట. నిద్రిలో లేపన మెక్కువగానుండుట.

స్త్రీఅవయవములు:—స్తనములమీద కేన్సరు అనబడు పుట్టపణము దీనిలో పొడుచుచున్నట్లుండు బాధలనుభూన్పును. సంభోగేచ్ఛ యెక్కువగానుండుట. బహిష్టులో స్రావము ప్రారంభింపగనే శూలతగ్గుట. బహిష్టుఆలస్యముగా నగుచుండుట. స్తనములోని మాంసగ్రంధులు గట్టిగాను వాపుగాను యుండుట (కోనియం). ఎడమస్తనములోను, ఎడమచేతిలోను లాగుచున్నట్లు నొప్పులు.

హృదయము, నరములమండలము:—గుండెదడ. ఆతురతతో కొట్టుకొనుచుండుట. గట్టిగాను త్వరగాను కొట్టుకొనుచుండుట. కండరములు వణకుతప్పుట. అపస్మారమునకుముందు శరీరములో ఈడ్పులువచ్చుచుండుట.

చర్మము:—దురద, దుర్వాసనతోను స్రావముతోను కూడిన చర్మ

రోగములు. చిన్న చిన్న యెఱ్ఱనిపొక్కులు నల్లని మొనలు కలిగియుండుట. చర్మము ఆర్చుకొనిపోయి గట్టిగాను బూడిదరంగుగానుయుండుట.

వృద్ధికము:— కాఫీవలన, రాత్రియందు, చల్లని తేమగాలిలో, ఎడమవైపున.

పోలికలు:— సేపియా, మ్యూరెక్సు, కోనియం, కార్బోవెజ్, ఆర్సెనికం ఆల్బం, హామేలిస్, క్రోటాలస్, తుజా.

విరుగుళ్లు:— ప్లంబం మెట్, జింకం మెట్.

దీనికి ముందువాడదగినవి:— బెల్లడోనా, కార్బోయానిమలిసు, కోనియం, సైలీషియా, సల్ఫరు, కాల్కేరియాకార్బ.

సరిపడనివి:— నక్సువామికా, కాఫీ.

పొటెంటు:— 6 మొదలు 30 పొటెన్సీ.

---

## 242. బేడియాగా. BADIAGA.

(రష్యా, జర్మనీ దేశముల నదులలో బయలుదేరు "స్పాంజి".)

ఇది ముఖ్యముగా మాంసగ్రంధుల వాపులమీదను, సవాయిదోషము మీదను బాగుగా పనిచేయును. శరీరమందెచ్చట ముట్టుకొనినను నొప్పిగా యుండుట దీని ప్రధానలక్షణము.

తల:— విస్తారముగా చుండ్రుబయలుదేరుట. ముట్టుకొనినన నొప్పిగా నుండుట. గొంతుకనొప్పిగాను, బాధగాను గుటకవేయునపుడుండుట. పడిశెముపట్టుట. తుమ్ములువచ్చుట.

హృదయము:— గుండెదడ.

శ్వాసావయవములు:— విడిచివిడిచివచ్చు దగ్గు. జిగురువంటి ఆమము గొంతుకనుండి బయటకు యెగిరిపడుచుండుట. కోరింతదగ్గు. గట్టిగా వూపిరినిపీల్చినయెడల వూపిరితిత్తులలో నొప్పిగానుండుట, క్షయరోగచిహ్నము

లతో కూడిన యితరవ్యాధులు.

కాళ్ళు, చేతులు:—మహా వాతపునొప్పులు. కండరములలో యెక్కువనొప్పిగా నుండుట. గజ్జలలో మాంసగ్రంధులు వాచుట.

మర్మావయవములు:—చిన్నపిల్లలలో సవాయిని మాన్పును. బిళ్లలు, సవాయిజాతి పుండ్లు మొదలగువాటిని అణచిపెట్టుటవలన కలుగు రోగ చిహ్నములను మాన్పును. వంధ్యత్వము. స్త్రీలలో కలుగు రక్తస్రావములు. స్తనములమీద పుట్టపగ్గము అనబడు కేన్సరు బయలుదేరుట.

ఉద్రేకము.—చల్లదనమువలన.

ఉపశమనము:—వెచ్చదనమువలన.

సహచరులు:—సల్ఫరు, అయోడియం, మెర్క్యూరియస్.

పోలికలు:—మెర్క్యురియసు; స్పాంజియా, అయోడియం, పైటోలక్కా, కోనియం, కాలీఅయోడ్.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—ఇది మాంసగ్రంధులవాపులను మాన్పుటకు పైకి వుపయోగించవలెను. మదరుటించరు రూపమున దీనిని తీసికొని దూదితో తడిపి మాంసగ్రంధులపైని పట్టించవలెను.

---

## 243. హోమేరస్. HOMARUS.

(“లాబ్‌స్టరు” అనబడు చేపకడుపులో జీర్ణము చేయుటలో సహాయపడు ద్రవము.)

అజీర్ణము, గొంతునొప్పి, తలనొప్పి—వీటిమీద నిది బాగుగా పని చేయును. పాలను యెక్కువగా త్రాగుటవలనవచ్చు రోగములనుమాన్పును.

తల:—నుదిటియందును, కణతలయందును కండ్ల కలకతోను వచ్చు నొప్పిమీద బాగుగా పనిచేయును.

కండ్లు:—కండ్లుపోట్లుగాను మంటగాను యుండుట. హృదయమున

తేమసరికి కండ్లు అంటుకొనుట, కనురెప్పలు వాచుట, యెక్కువగా నీళ్లుకారుట.

ముక్కు:—స్రావము, తరచు తుమ్ములు, వచ్చుచుండుట.

గొంతుక:—పొడిగాను, నొప్పిగాను, మంటగాను, గరుకుగాను వుండుట. గొంతుక వాపువలన వూపిరి పీల్చుటకష్టముగానుండుట.

అన్నకోశము:—అన్నకోశము, పొత్తికడుపు, వీటియందలి బాధ భోజనానంతరము వుపశమించుట. త్రేణుపులు వచ్చుచుండుట, కడుపులో మంటగానుండుట.

చర్మము:—దురదగానుండుట.

పోలికలు:—సేపియా, ఎస్క్రిరియాస్ ట్యూబెన్సు, ఎథూజా, లెకెసిస్, కాల్కేరియాకార్బ్బ, మ్యూరెక్సు.

వుద్రేకము:—పొలవలన, నిద్రించినపిదప.

వుపశమనము:—కదలికవలన, భోజనానంతరము.

మోతాదు:— 6 x పొటెన్సు.

---

## 244. మెడ్యూసా. MEDUSA.

("జెల్లీ ఫిష్" అనబడు ఒకజాతి చేప)

మూత్రావయవరోగములమీదను, స్తన్యదోషములమీదను యిది ముఖ్యముగా పనిచేయును.

మనస్సు:— అతి ఆతురతవలన మాట్లాడుట కష్టముగానుండుట.

ముఖము, కన్నులు:— మంటగానుండుట, వాచుట, పొంగరించుట, నీరుపట్టుట.

మూత్రావయవములు:— సుమారు 12 దినములవరకు మూత్రము పూరుట లేక స్రవించుట ఆగిపోవుటను షనోశము ఇది మాన్పునది.

స్త్రీ అవయవములు:— స్తన్యము తక్కువగానుండుట(రిసినస్ కం) లేక అసలే లేకుండుట. మొదటి 12 పురుళ్లకును స్తన్యము అసలేలేని ఒక స్త్రీకి 13 వ పురిటిలో దీనివలన స్తన్యము కలిగినది.

చర్మము:— వేసవిలో చర్మములో పేలుట, మంటలుగానుండుట. ముళ్లు గుచ్చుకొనుచున్నట్లు బాధలుగానుండుట (జబోరాండీ). ఎఱ్ఱని దద్దుర్లు బయలుదేరుట.

పోలికలు:— యూపిను, సేపియా, హామేరను, యుర్టికాయురెన్సు.

మోతాదు:— 6 మొదలు 30 పొటెన్సీ.

---

## 245. సేపియా. SEPIA.

(ఐరోపా ప్రాంతములందును ముఖ్యముగా మధ్యధరాసముద్రమున నుయుండు "కటిల్ ఫిష్" అనబడు ఒకజాతి చేపనుండి తీయబడి, సిరావలె నల్లగానుండు ద్రవము).

నల్లని తలవెంట్రుకలు, కాయశరీరము, శాంతస్వభావము (పల్సటిల్లా) తో నుండు వారి రోగములమీదనిది బాగుగాపనిచేయును. స్త్రీ రోగులలో నిస్త్రాణ, పసుపుపచ్చని దేహచ్ఛాయ, దిగలాగుచున్నట్లుండు భావన, గర్భస్రావసూచనలు గలుగుట, ముట్లుగుకాలములో శరీరమునకు వుడుకు తగులుచుండుట, చెమట పట్టుచుండుట, సులభముగా సొమ్మసిల్లిపోవుచుండుట, లోపలి అవయవములలో బంతివంటిది యున్నట్లు భావన గలుగుట, బాధలు దిగువనుండి పైపై పునకు వ్యాపించుచుండుట—ఈలక్షణములమీద నిది బాగుగా పనిచేయును. ఈఔషధము ముఖ్యముగా వయస్సుమళ్ళిన స్త్రీరోగులకు బాగుగా వుపయోగపడును. వెచ్చనిగదిలోనున్నను చలిగానున్నట్లుతోచుట దీనివుపయోగమును సూచించును.

మనస్సు:— ఇంద్రియజ్ఞానమెక్కువగా యుండుట, యెక్కువ

విచారగ్రిస్తముగాను, యేడ్చుచును యుండుట. తన దేహారోగ్యమును గురించి విచారముతోనుండుట. శారీరమానసిక పరిశ్రిమలయందు అయిష్టత. పరధ్యానము. చాల ఆలోచనలు తోచుచున్నను జ్ఞాపకశక్తి తక్కువగా యుండుట.

తల.—బహిరంగమైన గాలిలో నడచునప్పుడు వికారము, వమనానుమానము, ఆతురతవచ్చుట. తలబ్రిద్దలగునట్లుగా నొక్కుచున్నట్లుండు తలనొప్పి. తలవెంట్రుకలు విస్తారముగా వూడిపోవుచుండుట. మనోవ్యథతోనుండు తలనొప్పి వుదయమున ప్రారంభించి మధ్యాహ్నము వరకును సాయంకాలమువరకును యుండుట. మరియు నిది బహిరంగమైన గాలిలో వుపశమించుట.

కండ్లు:—బరువుగానుండుట, రెప్పలు పక్షవాతములోవలె మూతలుపడుట. వుదయమునను, సాయంకాలమునను నీళ్ళుకారుచుండుట. చల్లని గాలిలో నడచుటవలన మంటగాను, పోట్లుగాను, గరుకుగాను వుండుట. మరియు నిది గ్యాసులైటు కాంతివలనను, చదువుటవలనను, వుద్రేకము జెందుట.

చెవులు:—ధ్వనులను భరింపలేకపోవుట.

ముక్కు:—చిక్కని ఆకుపచ్చని స్రావము వెడలుట. పెద్దపెద్ద పక్కులు కట్టుచుండుట, ముక్కునుండి వెలువరించుటకు కష్టముగానుండు పెద్దపెద్ద శ్లేష్మపు ముద్దలను నోటిలోనికి తెచ్చుకొని వుమియవలసివచ్చుట.

ముఖము:—పసుపుపచ్చగా పాలిపోయి, పొంగరించి వెచ్చగానుండుట. పసుపుపచ్చని మచ్చలు బయలుదేరుట. మురదతోనుండు మొటిమలు బయలుదేరుట.

నోరు:—పండ్లు త్వరగా పాడగుట. కుట్టుచున్నట్లును, లాగుచున్నట్లును, ఆహారపానీయములు తీసికొనినపిదపగాని వెచ్చని లేక చల్లని పదార్థములు తీసికొనుటవలననుగాని పంటిపోటువచ్చుట. బహిష్టులోవచ్చు పంటిపోటును మాన్పును. ఇగుళ్ళువాచి, పుండ్లుపడి, యెర్రిగాను, మలభ

ముగా రక్తముస్రవించుచునుయుండుట. నాలుకపై బొబ్బలెక్కినట్లుండుట. దుర్వాసనవచ్చుచుండుట. పెదవులు, నోరు, నాలుక ఆర్చుకుపోవుట.

గొంతుక:—రెండువైపులవచ్చు వాపు, బాధ.

అన్నకోశము:—వుదయమున రుచి పుల్లగాను, చేదుగాను, కుళ్లినట్లును వుండుట. ఆహారపానీయములు తీసికొనినపిదప రుచి చేదుగాను, పుల్లగాను, తరుచు త్రేణుపులతోనుండుట. ఆహారమునుచూచినను ఆహారపు వాసనవలనను తలతిప్పువచ్చుట. పుగాకువలని అజీర్ణమునుమాన్పును.

పొత్తికడుపు:— భోజనానంతరము రాయి పెట్టినట్లు బరువుగా తోచుట. పోట్లుగాను లేక మంటలుగాను యుండుట. వుబ్బరించి తలనొప్పితో యుండుట. కాలేయములోనిబాధ కుడివైపున పరుండుటవలన వుపశమించుట. దిగలాగుమన్నట్లుండుట.

మలము, మలాశయము:—జిగురువలెనుండు పల్చని విరేచనములు శూలతోను, తీపుతోను వెడలుట. విరేచనమగుచున్నప్పుడును, నడుచుచున్నప్పుడును, మూలశంఖ మొలలు వెలుపలకువచ్చుట; మరియు నడచునప్పుడు రక్తముస్రవించుట. విరేచనబద్ధము, మలము గట్టిగాను, పెద్దపెద్ద వుండలుగాను వెడలుట. ఆసనములో బంతివున్నట్లు భావనయుండుట.

మూత్రావయవములు:—బంకగానుండు యెర్రని ఇటుకపొడివంటి పదార్థము వెడలుచుండుట. నిద్రలో అప్రయత్నముగా మూత్రమును విడుచుచుండుట, మూత్రకోశము వాచుట, బాధగానుండుట. మూత్రము అణచిపెట్టబడుట లేక చుక్కలుచుక్కలుగా వెడలుట.

పురుషావయవములు:—జీర్ణించిన శగరోగముచే బాధపడువారికి రాత్రియందు స్రావము బాధలేకుండగ వెడలుచుండుట. శిశ్నాగ్రముపై సురుగడుకాయలవంటివి బయలుదేరుట. వృషణములు వాచుట. తరుచు స్ఖలనములగుచుండుట.

స్త్రీఅవయవములు:—గర్భాశయము నిండుగా నుండుట. పసుపుపచ్చని కుసుమ. గర్భాశయము వెలుపలకువచ్చుట. పొత్తికడుపునకు

దిగువనున్న అవయవములన్నిటిలోను దిగలాగుచున్నట్లుండుటవలన నవి మర్మావయవముగుండా బయటకు వెలువడునట్లు తోచుట. ఋతువు చాల ముందరగాను, స్రావము తక్కువగాను, వుదయముననే అగుచుండుట. ఋతువు ఒకప్పుడు ఆలస్యముగాను, స్రావము తక్కువగాను, ముదర రంగుగాను వెడలుట. కుసుమ పాలవలెను, ఒరుపును కలుగజేయుచును, పసుపుపచ్చగాను, ఒకప్పుడు చీమువలెను, దుర్వాసనతోను, బహిష్టుకు ముందరగాను వెడలుట. 5 వ నెలకు పిమ్మటవచ్చు గర్భస్రావలక్షణముల మీద పనిచేయును. సంభోగమునందు మర్మావయవ ద్వారమువద్ద బాధగా నుండుట.

శ్వాసావయవములు:—సాయంకాలముననుు, రాత్రి పరుండినప్పుడును పొడిదగ్గు యెక్కువగా వచ్చుచుండుట. మాననటువంటి కోరింతదగ్గు. నిద్రనుండి మెలకువవచ్చినపిదప వూపిరాడకపోవుట; మరియు నిది వడిగా కదలుటవలన వుపశమించుట. వుదయమున వుప్పగానుండు స్రావము యెక్కువగా వెడలుట.

హృదయము:—అతివేగముతోను, విడిచివిడిచియు కొట్టుకొను చుండుట. సాయంకాలముననుు, ఆహారము జీర్ణమగుచున్నప్పుడును ఎక్కువగా కొట్టుకొనుట.

నడుము, కాళ్లు, చేతులు:—నడుములో నీరసముగా నుండుట. నడుము కొయ్యబారుట; మరియు నిది నడచుటవలన వుపశమించుట. అవయవములలో అస్థిమితము, ముడుచుకొనిపోవుచున్నట్లుండుట, కంపముబు రాత్రింబవళ్లుండుట. మడమలో నొప్పిగాయుండుట.

చర్మము:—గోకుటవలన దురద వుపశమింపకుండుట పెదవులపైని, నోరు, ముక్కుసమీపముననుు, దురదతోనుండు పొక్కులు బయలుదేరుట. తామరను పోలియుండు దద్దురువంటి చర్మరోగము ప్రతి వసంతఋతువునందును వచ్చుచుండుట.

నిద్ర:—పగలు నిద్రమత్తుగాయుండుట. ఉదయమున మెలకువ

తెచ్చుకొనుట కష్టముగా నుండుట, అస్థిమితముగానుండునిద్రవలన లేచు సరికి బడలికగాను, బాధతోను యుండుట.

జ్వరము:—తరుచు వుడుకు తగులుచుండుట, కదలికవలన చెమట పట్టుచుండుట, పాదములు చల్లగాను, తడిగాను యుండుట.

ఉద్రేకము:—పూర్వాహ్నమందు, సాయంకాలమున, అధిక సంభోగమువలన, భోజనానంతరమున, మానసిక పరిశ్రమవలన, కారులో ప్రయాణము చేయుటవలన, గర్భిణీలో.

ఉపశమనము:—వెచ్చదనమువలన, నొక్కుటవలన, చన్నీటి స్నానమువలన.

దీనికిముందుగాని వెనుకగాని లెకెసిస్, పల్సటిల్లా లనువాడరాదు.

సహచరులు:—నక్సువామికా, సేటప్రింమూరు.

పోలికలు:—ఆర్సెనికంఆల్బం, ఆర్సెనికంఅయోడేటం, నక్సువామికా, సల్ఫరు, టెల్లూరియం, పల్సటిల్లా, కాస్టికం, మ్యూరెక్సు.

విరుగుళ్లు:—కాల్కేరియాకార్బ, ఎకోనైటు, మెర్కుసాల్, యాంటింక్రూడం, యాంటింటార్టు.

కాల్కేరియాకార్బ, చైనా, మెర్క్యూరియాసు, ఫాస్ఫరసు,సార్సపరిల్లా, సల్ఫరు—లకిది విరుగుడు.

మోతాదు:—12 మొదలు 200 పొటెన్సీ. డాక్టరు హానిమాన్ గారు 30, 200 పొటెన్సీలను ఉపయోగించిరి. దీనిని చిన్న పొటెన్సీలలోను, అతితరుచుగాను వాడరాదు. దీని గుణకాలపరిమితి 40 లగాయతు 50 దినములు.

---

## 246. స్పాంజియా. SPONGIA.

(" టర్కీస్పాంజి " అను పేరుగల ఒకవిధమైన స్పాంజి)

చిన్నపిల్లలయొక్కయు, స్త్రీలయొక్కయు రోగములమీద నిది బాగుగాపని చేయును. జలుబుతోగూడిన శ్లేష్మరోగములమీదనిది బాగుగా

పని చేయును. హృదయరోగములందును, క్షయసంబంధమైన తత్వములమీదను మాంసగ్రంథులువాచి గట్టిపడినప్పుడును దీనిని వాడవచ్చును. పరిశ్రమవలన శరీరము బరువెక్కి, యెక్కువ నిస్త్రాణతో నుండుట, మరియు ముఖమునను, ఛాతీకిని రక్తము యెక్కువగా చేరుట. రోగి ఆతురతగాను, శ్వాస కష్టముగా పీల్చుచును యుండుట— ఇవి దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—ఉద్రేకమువలన దగ్గు యెక్కువగుట.

తల:—ఎక్కువ రక్తము జేరుటవలన బ్రద్దలగుచున్నట్లుండుట. నుదిటిలో యెక్కువ బాధగానుండుట.

కన్నులు:—నీళ్ళు, జిగురువంటి ఆమము స్రవించుచుండుట.

చెవులు:—చెముడు. మంటగానుండుట.

ముక్కు:—నీళ్లవంటి స్రావము, తుమ్ములువచ్చుచుండుట. దిబ్బడవేయుట. శోణములు ఆర్చుకుపోవుట.

ముఖము:—ఎర్రగాను లేక నీలిరంగుగాను, యెక్కువ ఆతురతతోను పొంగరించి యుండుట. వెచ్చగానుండుట. ఎడమదౌడక్రిందనున్న మాంసగ్రంథులు వాచుట.

నోరు:—నమలుచున్నప్పుడు పళ్లు కదలుచున్నట్లును, మొద్దుబారినట్లును తోచుట. నాలుక గోధుమరంగుగాను, పొడిగాను పొక్కులతోను యుండుట. నోరు మంటగాను, ఆర్చుకుపోయి యుండుట.

గొంతుక:— థైరాయిడు (Thyroid gland) గ్రంధి గెడ్డముతో సమానముగావాచుట. రాత్రియందు వూపిరాడకుండుట. గొంతుకలో కుట్టుచున్నట్లుండుట, పొత్తికడుపులో తీపుగావుండుట. గొంతుకవాచుట. జేర్లబడి పరుండుటవలన గొంతుకలోని బాధలు వుపశమించుట. బొంగురుతనము,

అన్నకోశము:—రుచి చేదుగా నుండుట. బట్టనుగట్టిగా కట్టుకొను టను భరింపలేకుండుట. పుండుపడినట్లుండుట. ఎక్కిళ్లు, విస్తారము దాహ ముగాను ఆకలిగాను యుండుట.

పొత్తికడుపు:—ఎడమగజ్జలోని మాంసగ్రంధివాపు, బాధ.

మలము, మలాశయము:—ఎక్కువ విరేచనబద్ధము క్రిమిదోషము.

మూత్రము:—తరుచు మూత్రానుమానము. మూత్రమప్రయత్న ముగా వెడలుట.

పురుషావయవములు:—వృషణములు వాచుట, బాధగా నుండుట, నెప్పగానుండుట. శగ.

(స్త్రీ)అవయవములు:—బహిష్టుకు ముందుగా యెక్కువ ఆకలి, గుండెదడ, శూల, నడుమునొప్పి యుండుట. బహిష్టులో అన్ని అవయవ ములు లాగుచున్నట్లుండుట; వూపిరాడకపోవుటవలన మెలకువవచ్చుట. ఋతువు అణచిపెట్టబడుటతో నుండు వుబ్బసపుదగ్గు.

శ్వాసావయవములు:—మాట బొంగురుగా వచ్చుట. వూపిరితీయు చున్నప్పుడు యీల వేయుచున్నట్లుండుట. మాట్లాడుచున్నప్పుడును, పాడుచున్నప్పుడును, ధ్వని పాడగుచుండుట. స్వరపేటికలో కొయ్యా కొట్టినట్లు భావనగాయుండుట. కోరింతదగ్గు, జలుబుతో వచ్చు వుబ్బసపు దగ్గు పరుండినయెడల వుద్రేకము జెందుట. అరచుచున్నట్లును, యీస్పు లతోను, వుబ్బసములో వలె ఆయాసముతోను వచ్చు దగ్గు. న్యుమోనియా యొక్క ఆఖరుదశలో బాగుగా పనిచేయును. గురకను మాన్పును. క్షయ రోగము యెడమ వూపిరితిత్తి పైభాగమందు ప్రారంభించినపుడు పనిచే యును. ఆహారపానీయములు తీసికొనిన పిదపను, నెచ్చని పానీయములు త్రాగినపిదపను దగ్గు వుపశమించుట.

హృదయము:—హృదయములో నొక్కుచున్నట్లుబాధగాను, దడ గాను యుండుట. ఇందువలన రోగి పరుండలేకుండుట. బాధవలనను వూపి రాడకపోవుటవలనను, అర్ధరాత్రిమైన పిమ్మటను, ఆకస్మికముగా నిద్ర

నుండి లేచుట. హృదయము కుడివైపున పెద్దదగుట లేక వాచుట మరియు నిది వుబ్బసవు లక్షణములతో గూడియుండుట.

మెడ, నడుము, కాళ్ళు, చేతులు.— మెడలోనికండరములు కొయ్య బారుట. బాధగానుండుట. నడుములోని చల్లదనము ఉష్ణోపచారమువలన వుపశమింపకుండుట. చేతులు వుబ్బుట. వేళ్ళు పంగకపోవుట. కాళ్ల లోను పాదములలోను లాగుచున్నట్లును చీల్చుచున్నట్లును యుండుట.

చర్మము:—మాంసగ్రంధులు వాచుట, గట్టిపడుట. దురదగా నుం డుట. పొంగు. గండమాలరోగము.

నిద్ర:—రోగలక్షణము లుద్రేకించుటతో నుండు నిద్ర.

జ్వరము:—వెచ్చగాను, ఆతురతగాను యుండుట. ముఖము ఎర్ర గాను, వెచ్చగాను, చెమటతోను యుండుట.

ఉద్రేకము:—మెల్లెక్కుటవలన, గాలిలో, అర్ధరాత్రమునకు ముం దుగ, భోజనానంతరమున.

ఉపశమనము:—ఎత్తుప్రదేశమునుండి దిగుటవలన.

దీనిని వాడినపిదప బ్రోమియం, కార్బోవెజ్, హెపారుసల్ఫు, బాగుగా పనిచేయును.

ఎకోనైట్, హెపారుసల్ఫు—లకు పిమ్మట ఇది వాడదగినది.

విరుగుళ్లు:—కేంఫరు.

పోలికలు:—క్లోరీనం, బ్రోమియం, అయోడియం, బేడియాగా, శాంబూకసు, ఎనకార్డియం, సేపియా, హెపారుసల్ఫు, నక్సువామికా, పల్సటిల్లా, హెమామెలిసు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 3 లగాయతు 4 వారములు.

---

## V. Miscellaneous animals.—పలురకముల జంతుజాలములు

### 247. కేస్టోరియం. CASTOREUM.

ఇది ముఖ్యముగా అపస్మారము, లేక హిస్టీరియాజబ్బును మాన్పుట లోను, నిసార్గినను కట్టుటలోను బాగుగా పనికివచ్చును. ఉదయమున కండ్లు సరిగా ఆనకపోవుటను వెలుతురును చూచుట బహుకష్టముగా నుండుటను తరుచు ఆవలింతలువచ్చుటను మాన్పును.

మనస్సు:—నిద్ర స్థిమితముగా నుండకపోవుట. నిద్రలో భయంకరమైన కలలుగనుటవలన రోగి పడకనుండి బయలు దేరుట.

నాలుక:—వాచుట.

స్త్రీఅవయవములు:— ఋతుశూల. రక్తము ముక్కలుముక్కలుగా గర్భాశయము తీపుగానుండుటతో వెడలుట. ఋతువు అణచిపెట్టబడుట; ఇందుతో పొత్తికడుపు వుబ్బరముగా నుండుట.

జ్వరము:—చలి యెక్కువగా నుండుట. నడుము మంచుగడ్డవలె చల్లగానుండుట. అప్పుడప్పుడు చలివేయుట.

పోలికలు:—యాంబాగ్రిగ్రిషియా, మోస్కస్, యాసిడ్ మూర్, వెలీరియానా, నక్సువామికా, తూజా, సోరినం.

విరుగుళ్లు:—కోల్చికం.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

### 248. లేక్ కేనినం. LACCAN INUM.

(కుక్కపాలు).

ఇది మేహవాతరోగములమీదను; స్తనములకు, గొంతుకకు సంబంధమైన రోగములమీదను, పడుటవల్లను దెబ్బతగులుటవల్లను కలుగుదోషముల మీదను బాగుగా పనిచేయును.

మనస్సు:—వ్రాయుచున్నప్పుడు, పరధ్యానమువలన తప్పులు వ్రా

యుట. అతికోపముతోనుండుట. తాను ప్రపంచమున కొకలెఖ్ఖగా లేనట్లు తలచుట. తనరోగము కుదరని, నిరాశజెందుట, తాను పాములచే చుట్టబడియున్నట్లు తలచుట. మరపు యెక్కువగానుండుట (యాసిడ్ ఫాసు, ఎనకార్డియం, కెన్నబిస్ ఇండికా).

తల:—గాలిలో యెగురుచున్నట్లును, నడచుచున్నట్లును, భావన యుండుట. బాధ మొదట ఒకవైపునను, తరువాత రెండవవైపునను కను పించుట. మెదడు ముడుచుకొనిపోవుచున్నట్లును, పెద్దదియగుచున్నట్లును భావనయుండుట. దృష్టి చెదరుటను, తలనొప్పి యెక్కువగానున్నప్పుడు వికారముగా నుండుటను, వమనములు వెడలుచుండుటను మాన్పును. నడి నెత్తిలో పోటుతోనుండునొప్పి నుదుటిలోనికి వ్యాపించుట. చెవులలో ధ్వనులు వినిపించుట.

ముక్కు:—ముక్కు యెముకలలో నొప్పిగానుండుట. రక్తము, చీము వెడలుట. రొంపతో ముక్కు ఒకవైపుమాత్రమే దిబ్బడ వేయుట.

నోరు:—తియ్యని ఆహారములు తినుటవలన కుళ్ళినట్లుండు రుచి యెక్కువగుట. నమలునపుడు దౌడ ఎముకలలో పటపటలాడుట. నాలుక పై తెల్లనిపూతగలుగుట. లాలాజల మెక్కువగా వూరుట.

గొంతుక:—నొప్పిగానుండుట. కాలినట్లు గరుకుగా నుండుట. గిలిగింతలు పెట్టుచున్నట్లుండుటవలన దగ్గు వచ్చుట, గొంతుకలో పుండ్లు పడుట. బహిష్టులో ప్రారంభమునుండి ఆఖరువరకు గొంతుక నొప్పిగా నుండుట, గుటక వేయుట కష్టముగా నుండుట. గవదకాయలు వాచుట.

పురుషావయవములు:—సవాయి సంబంధమైన పుండ్లవలన అంగ ములో బిగపట్టినట్లుండుట. అంగము వాచుట. శెగ సంబంధమైన పోటు అంగములో విడిచి విడిచి వచ్చుచుండుట.

స్త్రీఅవయవములు:—ఋతువు అతి ముందరగాను, స్రావము యెక్కువగాను, గొట్టములోనుండి వెడలునట్లు వడిగాను వుండుట. స్తనము లవాపు; ఇది బహిష్టుకుముందు యెక్కువ బాధతోనుండి, స్రావము ప్రా

రంభించిన వెనుక వుపశమించుట. స్తన్యమును హరింపజేయుటలోనిది బాగుగా పనిచేయును. నడుములోను వెన్నెముకలోను నొప్పిగాయుండుట. స్తన్యము యెక్కువగా వూరుచుండుట. ఋతుశూలను మాన్పును. కుసుమ పగటియందు మాత్రమే స్రవించుచుండుట, మర్మావయవము దురదగా నుండుట. కదలికవలనను, స్తనమును చేతితో తాకిన యెడలను, కూర్చుండుట వలనను, నడచుటవలనను, మర్మావయవమునందు గలుగు రాపుడువలనను మర్మావయవములకు యెక్కువ వుద్రేకము గలుగుట.

హృదయము:—గుండె దడగానుండుట, వూపిరాడక పోవుట.

కాళ్ళు, చేతులు:—అవయవములలోను, నడుములోను, ఒక వైపు నుండి మరియొక వైపుకు వ్యాపించునట్టి మేహవాతనొప్పులు. కాళ్లు మొద్దు బారుట, పాదములు తిమ్మిరెక్కుట. అరిచేతులలోను అరికాళ్లలోను మంటలుగా నుండుట.

నిద్ర:—కలలో పాములు కనబడుట.

వుద్రేకము:—ఒకరోజున వుదయముననను, ఒకరోజున సాయంకాలముననను, లక్షణములు వుద్రేకము నెందుచుండుట.

వుపశమనము:—చల్లదనమువలన, చల్లనిపానీయముల వలన.

పోలికలు:—లేక్ ఫెలీనం, కోనియం, లెకెసిస్, లేక్ వేక్సీనం, యాసిడు లేక్టిక్, నేట్రంమూరు, సేపియా, ప్లాటినా.

మోతాదు:—30 మొదలు 1000 పొటెన్సీ. సాధారణముగా దీనిని ఒక్కమోతాదును వాడిన చాలును.

---

## 249. లేక్ డిఫ్లోరేటం. LAC DEFLORATUM.

(మీగడతీసిన ఆవు పాలు).

శరీర పోషణయందలి లోపముల వలన వచ్చురోగములమీదను, బండిలో ప్రయాణముచేయుట వలనవచ్చు వికారము, వమనానుమానము

మీదను, తలనొప్పి బాధఎక్కువగా యున్నప్పు డధికము గాగలుగు మూత్ర విసర్జనమీదను ఇది బాగుగా పనిచేయును.

మనస్సు, తల:—నిరాశ జెందుట. హృదయమున ప్రారంభించు తల నొప్పులు. తలనొప్పి ఎక్కువ తీవ్రతతోను, వికారము, వమనానుమానము తోను, బహిష్టుంగోను, నిస్త్రాణతోను, విరేచనబద్ధముతోను వచ్చుట. తలను నొక్కుటవలనను, తలను గట్టిగా టేపుతో కట్టుటవలనను తలనొప్పి వుపశ మించుట.

విరేచనము:—మలము గట్టిగను, విస్తారము గాను, కష్టము మీదను, ఆసనమున వుండు చేయుచును, వెడలుట. విరేచనబద్ధమును మాన్పును.

పోలికలు:—నేట్రింఘాను, నేట్రింమూరు, ఎథూజా, నక్సుమోస్కేటా, కేక్టసు.

ఉద్రేకము:—పరుండుట వలన, కదలిక వలన, నడచుట వలన, కూర్చుండుట వలన.

ఉపశమనము:—నొక్కుట వలన.

మోతాదు:—30, 200 పొటెన్సీలు.

---

## 250. లేక్ ఫెలీనం. LAC FELINUM.

### (పిల్లిపాలు)

ఇది పలువిధములగు కంటిదోషములమీదను స్త్రీలరోగములమీదను బాగుగా పనిచేయును.

మనస్సు:—తలతిప్పు లేకుండగనే, మేడమీదనుండి క్రిందకు పడిపోవుదుసను భీతి జెందుట.

తల:—నుదిటినొప్పి, భారము. ఎడమకనుబొమవద్దనొప్పి.

కన్నులు:—లోతునపడినట్లు భావన. కంటిలో పువ్వులుబయలు

దేరుట. కండ్లుఎర్రబడుట, వాచుట, బాధగానుండుట. ఒకవస్తువు రెండు వస్తువులుగాఅనుట. గాఢమైన వెలుతురును చూచుట బాధకరముగా నుండుట. ప్రతిసెప్టెంబరు నెలలోను కన్నులుపొడగుట. పైరెప్పలోకాయలు బయలు దేరుట.

అన్నకోశము:—కాగితములనుతినుటయందుకోర్కె (మన్ను, సుద్ద, బియ్యము, కచికి, సున్నపుబెల్లులుతినుట విషయములో ఎల్యూమినా, కాల్కేరియా కార్బ్బలనుగూర్చి చూడుడు.)

స్త్రీఅవయవములు:—పసుపుపచ్చకుసుమ. విపరీతమైన దురద.

వృద్ధికము:—రాత్రియందు, బాధగానున్నవైపునపరుండుటవలన.

పోలికలు:—లేక్ కేనినం, లేక్ డిఫ్లోరేటం.

మోతాదు:— 6 వ పొటెన్సీ.

---

## 251. మోస్కస్. MOSCHUS.

(హిందూదేశపు ఔషధము. 65. కస్తూరి).

ఇది నరములసంబంధమైన దోషముల (అపస్మారము, పక్షవాతము మొదలగువాటి) మీద పనిచేయును. ఇట్టి రోగములలో అవయవములకు కంపముపచ్చుట లేక కొయ్యబారుట, తరుచు మూర్ఛ జెందుచుండుట, లేక సొమ్మసిల్లుట గలుగును. సొమ్మసిల్లిపోవు విషయములో ఎకొనైటు. ఎసాఫొటీడా, ఎల్యూమినా, ఎగేరికస్, కార్బోవెజ్, కోనియం, లైకోపోడియం, ఓపియం, పల్సటిల్లా, ఫాస్ఫరసు, పోడోఫైలం, సేపియా—యీమందులుకూడ ఆలోచించి జాగ్రత్తతో వాడవలయును. హిస్టీరియా మీద పనిచేయు ముఖ్యమైన 5 ఔషధములలోను యిది యొకటి; తక్కినవి (i) యాంబ్రాగ్రిషియా (ii) ఎసాఫొటీడా. (iii) కేస్టోరియం. (iv) వెలీరియానా. హిస్టీరియాలో రోగికి అచ్చటచ్చట చీల్చుచున్నట్లు బాధలు, వణకు వచ్చుచుండుట, మరియు గాలిలో యీదుచున్నట్లు భావ

నగలుగుట, ఇంద్రియ జ్ఞానము యెక్కువగానుండుట, గొంతుకనుండి తాళ్ళు వ్రేలాడుచున్నట్లు భావనయుండుటయు సాధారణలక్షణములు.

మనస్సు:—అపజాలనంతటి నవ్వు. భయము జెందుట, ఆతురతతో గూడిన గుండెదడ. తిట్టుచుండుట. ఒకమారు సంతోషము ఒకమారు విచారము. తాగినవానివలె వుద్రేకము జెందుట.

తల:—నడినెత్తిని నొక్కుచున్నట్లు నొప్పిగా యుండుట. కదలికవలన వికారము వచ్చుట. యెత్తునుండి పడిపోవుచున్నట్లు భావన గలుగుట చెవులలో ఫిరంగి ధ్వనులు వినిపించినట్లుండుట. ముక్కు మొదట నొక్కుచున్నట్లు బాధగా యుండుట.

అన్నకోశము:—మత్తుపదార్థముల యెడలను నల్లని (చిక్కని) కాఫీకొరకును కోర్కెకలిగి యుండుట. ఆహారము యెడల అసహ్యత జెందుట. ఆహారపు రుచి చప్పగానుండుట. ఛాతీలో ఆతురతగా నుండుట. అన్నకోశము వ్రేలాడునట్లుండుట. భోజనము చేయుచున్నప్పుడు సొమ్మసిల్లిపోవుట, లేక తెలివితప్పి పడిపోవుట. ఎక్కిళ్లు వచ్చుచుండుట.

మూత్రావయవములు:—అతి మూత్రము.

పురుషావయవములు:—ఎక్కువ సంభోగేచ్ఛ—ఇది అంగమునందు గలుగు దురదవలనగాని లేక బిగపట్టినట్లుండు బాధవలనగాని గలుగుట. అప్రియత్నముగా అగునట్టి స్ఖలనములు. నపుంసకత్వము; దీనితో ద్వంద్వముగానుండు మధుమూత్రము. చిన్నవయస్సులోనే ముసలివానివలె నగుట. సంభోగానంతరము వికారము, వాంతిగలుగుట, లేపనము గలిగినపుడు మూత్రానుమానము గలుగుట.

స్త్రీఅవయవములు:—ఋతువు చాలముందరగాను, స్రావము యెక్కువగాను రోగి సొమ్మసిల్లిపోవునట్లును వుండుట (నక్సువొమికా). భరింపజాలనట్టి గిలిగింతలతోనుండు సంభోగేచ్ఛ. బహిష్టుఅగునట్లు భావన గలుగుట. ఋతుకాలవలన సొమ్మసిల్లిపోవుట.

శ్వాసావయవములు:—ఛాతీ బిగపట్టినట్లుండుటవలన శ్వాస గాఢముగా తీసికొనవలసి వచ్చుట. వూపిరితిత్తులకు పక్షవాతము వచ్చునట్లుండుట. యెక్కువ ఆతురత, భయము, పాణమును తీసివేయునట్లు భావనతోయుండు వుబ్బసపుదగ్గు. దగ్గు తగ్గిన పిమ్మట శ్లేష్మమును వెలువరించుట కష్టముగా యుండునపుడు పని చేయును. గొంతులోనికి బంతివచ్చుచున్నట్లు భావనతోయుండు హిస్టీరియా లేక అపస్మార వ్యాధిమీద బాగుగా పని చేయును. ఛాతీలో హిస్టీరియా సంబంధమైన యీడ్పులు వచ్చుట.

హృదయము:—హిస్టీరియా సంబంధమైన దడ. హృదయమువద్ద వణకుగా యుండుట. నాడి నిస్త్రాణగా యుండుట. రోగి సొమ్మసిల్లిపోవుట.

నిద్ర:—పగలు నిద్రమత్తుగాను, ఆవలింతలుతోను యుండుట. మగత. రాత్రియందు ఒకేవైపున పరుండుటవలన పరున్నవైపు నొప్పి వచ్చుచుండుట. నరముల వుద్రేకమువలన రాత్రియందు నిద్రపట్టకపోవుట. హిస్టిరియా రోగముచే బాధపడువారి నిద్రలేమిని మాన్పును.

వృద్రేకము:—చలివలన.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో, మర్దనమువలన.

విరుగుళ్లు:—కేంఫరు, కాఫీ.

తెరీడియాన్—న కిదివిరుగుడు.

పోలికలు:—నక్సుమాస్కేటా, వెలేరియానా, ఎసాఫొటీడా, ఇగ్నేషియా, కేస్టోరియం, పల్సటిల్లా, స్పైజీలియా.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి ఒక్కదినము.

—

## 252. లేక్ వేక్సినం. LAC VACCINUM.

(ఆవుపాలు)

పాలు వికటించు తత్వములవారికిది అమోఘముగా పనిచేయును. పైత్యదోషములు, కీళ్ళనొప్పులు, తలతిర్పు, వికారము, తలనొప్పులు, అతిమూత్రము—ముఖ్యముగానివి దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—కంగారుగానుండుట.

తల:—తలనొప్పి, వికారము, పైత్యవమనము. వుదయమున లేచుసరికి తలయందంతటను, ముఖ్యముగా నడినెత్తిని బాధవచ్చుట.

కన్నులు:—దృష్టిఆనుచు, మానుచు యుండుట. దృష్టి చెదరుట లేక మందగించుట. కొలదిలిప్తలచేపు రెండుకళ్లను చీకట్లుగ్రమ్ముట.

చెవులు.—దిబ్బడవేయుట.

నోరు, గొంతుక:-—నాలుక పసుపు పచ్చగ, ఆర్చుకుపోయి యుండుట. పుల్లనిరుచి. గొంతుకలోగాని, స్వరపేటికలోగాని కొరుకొట్టినట్లు భావన. సాయంత్రము అమితమైన దాహము.

అన్నకోశము, పొత్తికడుపు:—వుబ్బరింపు. పులియగొట్టుట. వికారముగానుండుట. ముణిగిపోవుచున్నట్లునొప్పి. రొమ్మెముకవద్ద ప్రారంభించి బొడ్డువరకు వ్యాపించునొప్పి.

మలాశయము:—తీరని విరేచనబద్ధము.

మూత్రావయవములు:—వుదయమున మూత్రము కొలదిగను, ఎర్రని ముదరరంగుగను వెడలుట. పరిశోధనకు మూత్రము ఒకదినమున ఒకరకముగను, రెండవదినమున మరియొకరకముగను యుండుట.

స్త్రీఅవయవములు:—తెల్లని, పలుచని కుసుమ.

నడుము:—నడుమునొప్పి.

కాళ్లు, చేతులు:—మోకాళ్ళలోతప్ప తక్కిన అన్నికీళ్లలోను

తాగినవానివలె తట్టుతప్పుట, నీరసము జెందుట. అరిచేతులు, అరికాళ్ల లోను ఎక్కువచల్లదనము, శరీరమానసిక దుర్బలత్వము.

నిద్ర:—తరుచు నిద్రమత్తుగానుండుట. దుష్టకలలు వచ్చుట.

జ్వరము:—చేతులు పొడిగాను, వెచ్చగాను వుండుటతో జ్వరసూచనలు గలుగుట.

పోలికలు:—లేక్ కేనినం.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 253. మిఫైటిసు. MEPHITIS.

ఇది ముఖ్యముగా కంఠరోగములమీదను, శ్వాసావయవ రోగముల మీదను బాగుగా పనిచేయును. చిన్నబిడ్డలకు వచ్చు కోరింతదగ్గుమీద అమోఘముగా పనిచేయును.

మనస్సు, తల:—బండికదలుచున్నచో తలనొప్పివచ్చుట. లేనిపోని బాధలను తలపెట్టుకొనుచు బాధపడుచుండుట. నిద్రించుటకుకాని, పరిశ్రమకుకాని యిష్టము కలుగక పోవుట.

కన్నులు:—దృష్టిచెదరుట. కండ్లు ఎర్రగావాచి, వెచ్చగాను, బాధగాను యుండుట. సూదులతో గుచ్చుచున్నట్లు బాధగా యుండుట. రేచీకటి. అక్షరములు చిన్నవిగా ఆనుట. సన్ననిలేక చిన్నచిన్న అక్షరములను చదువలేకుండుట.

చెవులు:—చెవులలోను లేక దవుడలలోను మరియు పండ్లలోను చీల్చుచున్నట్లుండు బాధలు.

ముక్కు:—పొడిగాయుండుట. రక్తస్రావము. తరుచు తుమ్మవలెనను వుద్దేశ్యము గలుగుట.

నోరు:—పుప్పిపళ్లలోసలుపు, బాధ. రాగిరుచి. పుప్పనిఆహారముల నెక్కువగా కోరుట.

పొత్తికడుపు:—పుబ్బరింపు మరియు శూల.

మలము, మలాశయము:—తరుచుగా నీళ్ళవిరేచనములు వెడలుట.

శ్వాసావయవములు:—కోరింతదగ్గునకిది సిద్ధౌషధమువంటిది. వూపి రాడనట్లుండుట. దగ్గుఆగుచు, వచ్చుచుయుండుట. వరుండినచో దగ్గువలన బిడ్డముఖము నీలివర్ణముగా నయిపోవుట, మరియు, వూపిరిని విడుచుటకు బహుకష్టపడుట. దగ్గు ఆగుచును వచ్చుచును యుండుట. రాత్రియందును, పగటియందును వచ్చు కోరింతదగ్గు, దీనిలో దగ్గు రాత్రియందే యెక్కువ గానుండుట. భోజనమైన వెంటనే వమనమగుట. బిగ్గరగా చదివినను మా ట్లాడినను దగ్గువచ్చుట. గంధక సంబంధమైన వాయువును పీల్చుచున్నట్లుం డుటతో నుండు పుబ్బసపుదగ్గు.

నిద్ర:—నీళ్లు, అగ్నిమున్నగువాటిని గూర్చి కలగనుట. మాట్లాడు చునే నిద్రజెందుట.

వృద్ధికము:—విశ్రాంతివలన, రాత్రియందు తాకుడువలన.

వుపశమనము:—చన్నీళ్లతో కడుగుటవలన, కదలికవలన లేక నిబ్బ రముగా కూర్చొనుటవలన.

విరుగుళ్లు:—కేంఫరు, క్రోటేలసు.

పోలికలు:—కొరాలియం, స్టిక్టా, రూమెక్సు.

ముందువాడతగినవి:—డ్రొసీరా.

మోతాదు—3 మొదలు 30 పొటెన్సీ.

---

# VI నోసోడ్సు. Nosodes.

(రోగమాలిన్య పదార్థములనుండి తయారుచేయఁబడినవి)

## 254. బేసిలినం. BACILLINUM.

(క్షయరోగముగలిగిన వూపిరితిత్తి సంబంధమైనది).

ఇది క్షయరోగలక్షణములమీదను, వీటిని పోలియుండు యితరరోగ లక్షణములమీదను, ఆయాసముతోకూడిన రోగములమీదను బాగుగా పని చేయును. ముసలివారిశ్వాసావయవరోగములమీద అనగా నిలువగాయున్న శ్లేష్మరోగములు, శ్వాసావయవములలో రక్తపరిసరణము తక్కువగానుండుట, ఊపిరి ఆడకపోవుట, దగ్గుట కష్టముగానుండుట, శ్వాసకభ్యంతరము వచ్చునట్టి స్రావములు—వీటిమీదనిది ముఖ్యముగా పనిచేయును.

మెదడు:—చిరచిరలాడుట. విచారగ్రస్తముగాను కంగారుగాను, మగతగాను యుండుట. భయపడుచుండుట.

తల:—అప్పుడప్పుడు వచ్చుచుండెడు తలనొప్పులు. తల ఇనుప తీగతో కట్టినట్లు నొప్పిగానుండుట. తామర. వెంట్రుకలూడిపోవుట. కనురెప్పలమీద దురదతోకూడిన పొక్కులు. ఎడమదవుడమీద తరుచు మొటిమలు, పొక్కులు విడువకుండగ బయలుదేరుట.

నోరు:—పిల్లలలో పండ్లు సరిగా యెదుగకపోవుట. రాత్రియందు పండ్లు పటపటకొరుకుట.

అన్నకోశము:— వాయువుజేరుటతోను త్రేనుపులతోనుకూడిన అజీర్ణము. దీనివలన ప్రక్కయెముకలదిగువను కట్టుచున్నట్లు నొప్పిగా నుండుట.

పొత్తికడుపు;—ప్రాతఃకాలభోజనమునకు పూర్వము అకస్మాత్తుగా పెడలు నీళ్లవిరేచనములు. గజ్జలలోని మాంసగ్రంథులువాచి పెద్దవై గట్టి పడుట. పొట్ట యెండిపోవుట, బాధగానుండుట, జ్వరమువచ్చుచుండుట.

నిద్రలో కేకలు వేయుచుండుట. మాంసగ్రంథులన్నియు గట్టిపడుట. పొట్ట డోలువలె పెద్దదగుట. ప్లీహమువద్ద యెక్కువ యెత్తుగానుండుట. ఎక్కువ చెమటపట్టుచుండుట. మాననటువంటి నీళ్ల విరేచనములు. ఒకప్పుడు ఎక్కువ విరేచనబద్ధము. మూలశంఖలో కట్టుమన్నట్లుండు బాధలు.

మూత్రావయవములు:—పాలిపోయిన రంగుతోను, తెల్లని మడ్డితోనుకూడి మూత్రమెక్కువగా పడలుట. రాత్రి మూత్రవిసర్జనకొరకు చాల సారులు లేవవలసివచ్చుట.

శ్వాసావయవములు:—నిద్రపోవుచున్నప్పుడు దగ్గు గట్టిగాను, కొద్దిగాను, విడువకుండగను, కంపింపజేయుచు వచ్చుచుండుట, బాధలు శ్వాసను ఆపుచేయుచున్నట్లుగాయుండుట, స్రావముతోకూడిన వుబ్బసపు దగ్గు. ఛాతీలో గురగురలాడుచు, చీము, ఆమము, పడలుచుండుట.

మెడ, కాళ్లు:—మెడకు సంబంధించిన మాంసగ్రంథులువాచి నొప్పిగానుండుట. మోకాలులో క్రిమిసంబంధమైన వాపు, బాధ.

చర్మము:—తామరను, తామరవంటి చర్మరోగములను మాన్పును.

నిద్ర:—పగలు నిద్రమత్తుగాను, రాత్రియందు అస్థిమితముగాను వుండుట. కలలు వచ్చుచుండుట.

జ్వరము:—మోతాదు యిచ్చినపిమ్మట ఒక్కమారుగా శరీరము వెచ్చనగుట. కొద్దిగా చమటపట్టుట. ఎక్కువ తలనొప్పివచ్చుట.

నిస్త్రాణవలన యితరులతో మాట్లాడుట, కదలుట యిష్టముగానుండకపోవుట—ఈ యౌషధవుపయోగమును సూచించును.

వృద్ధిక్రమము:—రాత్రియందు, తెల్లవారుఝామున, చల్లని గాలిలో.

సహచరులు:—కాల్కేరియాఫాసు, కాలీకార్బ.

మోతాదు:—30 మొదలు 1000 పొటెన్సీ. 30 కు తక్కువపొటెన్సీలో దీనిని వాడరాదు. దీనిని తరుచు వాడరాదు. వారమునకు ఒక మోతాదు యిచ్చిన చాలును. ఇది త్వరితముగా పనిచేయును.

## 255. గనోరినం — మెడోరినం.

## GONORRHINUM-MEDORRHINUM.

(సెగవ్యాధిసంబంధమైనది).

ఇది జీర్ణించిన సెగలోను, లేక సెగవ్యాధినిఅణచిపెట్టుటవలననుకలుగురోగ లక్షణముల మీదను బాగుగా పనిచేయును. జీర్ణించిన మేహవాతరోగమును మాన్పును. చిన్నపిల్లలు సరిగా యెదుగకపోవుటను లేక సురుగుజ్జుతనమును మాన్పును అవయవములలో వుబ్బునుమాన్పును. జీర్ణించిన సెగవ్యాధిచేబాధపడువారికి స్రావమును తిరిగి కలిగించి వ్యాధినిమాన్పును. రోగిముఖము పాలిపోయియుండుటను శోషరసగ్రంథుల (Lymphatic Glands) వాపులను మాన్పును.

మనస్సు:— జ్ఞాపకశక్తి తగ్గుట, మాట్లాడుచున్న అంశములను మధ్యమధ్య మరచిపోవుచుండుట. కాలక్షేపమవకపోవుట (కెన్నబిస్ ఇండికా). ఆత్మహత్య చేసుకొనవలెనని తోచుట.

తల:— బట్టతలయగుట, దురదగానుండుట. వెంట్రుకలు అర్చుకు పోయి గరుకుగా నుండుట, తలను వెనుకకు బిగపట్టిలాగుచున్నట్లును, భారముగాను వుండుట. మానసిక పరిశ్రమవలన తలనొప్పివచ్చుట.

కన్నులు:— కనుగ్రుడ్లకు సంబంధించిన నరములలో లాగుచున్నట్లు బాధగానుండుట. తేరపారిచూచుచున్నట్లుండుట.

చెవులు:— వడిగా పొడుచుచున్నట్లు కుడిచెవిలో బాధగానుండుట. మాటసరిగా వినపడకపోవుట.

ముక్కు:— దురదగాను, దిబ్బడగాను వుండుట. ముక్కుచివర చల్లగానుండుట.

ముఖము:— పాలిపోయి, మొటిమలతోను, యెర్రనిమచ్చలతోను, నిండియుండుట.

నోరు:— పెదవులు, పొడలు, వీటిలోపలవైపు నీటిపొక్కులు

బయలు దేరుట. నాలుకపైని నీటిపొక్కులు, మరియు చిక్కని గోధుమవర్ణముగల పూత బయలు దేరుట.

అన్నకోశము:—లోహపురుచి, గంధక సంబంధమైన వాసనతో గూడిన త్రేణుపులు. యెక్కువ దాహము. సారాయి, తీపివస్తువులు, ఉప్పు, వెచ్చని పానీయములు, వీటియందు కోర్కెగలిగి యుండుట. రొమ్ములను కట్టును.

పొత్తికడుపు:—ప్లీహములోను, కాలేయములోను యెక్కువబాధ.

మలము, మలాశయము:—ఆసనము యెక్కువ దురదగా నుండుట. దుర్వాసనతో గూడిన స్రావము వచ్చుచుండుట. గోడనుగాని మరి దేనినిగాని జేరబడినపిమ్మటగాని విరేచన మవకపోవుట.

మూత్రావయవములు:—మూత్రము నెమ్మదిగా వెడలుట. మూత్రము వెడలునప్పుడు యెక్కువబాధ, తీపుయుండుట. నిద్రలో అప్రయత్నముగా మూత్రము విడచుటను మాన్పును. మధుమూత్రమును మాన్పును.

పురుషావయవములు:—నిద్రలో స్ఖలనములగుట. నపుంసకత్వము. రాత్రింబవళ్లు తరుచుగాను తీవ్రముగాను యుండునట్టి లేపనము. అణచి పెట్టబడిన సెగవ్యాధి.

స్త్రీఅవయవములు:—కన్యకలలో బహిష్టుకు పిమ్మట అధిక సంభోగేచ్ఛ గలుగుట. ఋతుస్రావము దుర్వాసనగాను, యెక్కువగాను, నల్లగాను, ముద్దలు ముద్దలుగాను వెడలుట బహిష్టులో నున్నప్పుడు తరుచు మూత్రానుమానము గలుగుట. వంధ్యత్వము. బహిష్టుకు బహిష్టుకు మధ్య స్రావమగుట.

శ్వాసావయవములు:—శ్వాస తీయునప్పుడు ఛాతీలో బరువుగా నుండుట. రాత్రియందు పొడిదగ్గు వచ్చుచుండుట. వూపిరివిడచుట కష్టముగా నుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—నడుములో మంటతో గూడిన వెచ్చదన

సము. కాళ్ళు బరువుగా నుండుట. రాత్రియందు కాళ్లలో నొప్పులువచ్చుటచే వీటిని కదుపుచుండవలసి వచ్చుట. అరికాళ్లలో నొప్పులు. చేతులు కాళ్ళు మంటగానుండుట. మేహవాతనొప్పులు, వాపులు. శెగ స్థాయి వ్యాధులు అణచిపెట్టబడుటవలన రోగులయొక్క బిడ్డలు యెదుగకుండునప్పుడు దీనిని వాడవచ్చును.

వృద్ధికము:—రోగమునుగూర్చి తలచుకొనుటవలన, వుదయమునుండి రాత్రివరకు, వెచ్చదనమువలన.

వుపశమనము:—సముద్రపుటొడ్డున, తేమగాలిలో.

విరుగుళ్ళు:—ఇపెకాక్.

మోతాదు:—200 మొదలు 1,00,000 పొటెన్సీ. దీనిని అతితరచుగాను చిన్న పొటెన్సీలలోను వాడరాదు.

---

## 256. మార్బిల్లినం. MORBILLINUM.

(పొంగుకుసంబంధించినది)

ఇది పొంగు (Measles) ను రానీయకుండ కాపాడుటలోను, వచ్చినయెడలనది త్వరలో మానునట్లు చేయుటలోను, చాలసహాయపడును. చిక్కుపెట్టునటువంటి సాధారణపు పొంగులలో దీనిని, బెల్లడోనా అను మందుతో మార్చుచు యిచ్చినయెడల పల్సటిల్లాకన్న యెక్కువ బాగుగా పనిచేసినట్లు డాక్టరు క్లార్కుగారు వ్రాసియున్నారు. సాధారణముగా పొంగుకు [ఆటలమ్మ (Chickin Pox) కు మాత్రము కాదు] దీనిని 30 పొటెన్సీరూపమున దినమునకు 2, 3 సారులు వాడినయెడల వ్యాధిని రానీయకుండ చేయును. పొంగు వచ్చినవారికి దీనిని దినమునకు 3,4 మోతాదులు యిచ్చిన చాలును. దీనిని బెల్లడోనా 30 పొటెన్సీతో ప్రతి 3 గంటలకు ఒక మోతాదుచొప్పున మార్చుచుయిచ్చిన యింకను బాగుగా పనిచేయును. పొంగులో ముక్కునుండి స్రావముగలుగుట మొదలగు లక్షణములన్నిటిమీదను పనిచేయును.

మోతాదు:—30 పొటెన్సీ.

---

## 257. సిఫిలినం.

## SYPHILINUM—LUETICUM—LUESINUM.

(సవాయి సంబంధమైనది).

ఇది సవాయి సంబంధమైన దోషములవలనను, రాత్రియందును లేక చీకటిపడినవెంటనే ప్రారంభించి వెలుతురు వచ్చువరకును వుండునట్టియు (మెర్క్యూరియస్, ఫైటొలక్కా), నెమ్మదిగా తగ్గుచును హెచ్చుచును వుండునట్టియు బాధలకును (స్టేనం మెటాలికం), బాగుగా పని చేయును. రోగి ఒకసారి కూర్చొనుచు, మరియొక నిలుచుచు, యింకొకసారి పరుండుచు, వేరొకసారి నడుచుచు—యిట్లు తనయొక్క స్థానము లేక స్థలమును తరచు మార్చుచు యుండుట, రోగి హృదయమున విశేషమైన నిస్త్రాణ వలన యేపనియు చేయజాలకుండుట, మేహవాతనొప్పులు ఒకచోటినుండి మరియొకచోటికి మారుచుండుట, వంశపారంపర్యావచ్చునట్టి త్రాగుడు దురభ్యాసము (ఎసారం యూరోపం, సోరినం, సల్ఫర్, యాసిడ్ సల్ఫ, టేసిలినం) లకలవాటగుట, నోరు, ముక్కు, మర్మావయవములు, చర్మము; వీటిమీద పుండ్లు బయలుదేరుట, పొక్కులు, దద్దురులు నిలువగాయుండుట, మేహవాతము, విడువకుండా పురుపులు వేయుచుండుట—వీటిమీద నిది బాగుగా పని చేయును

మనస్సు:—తనకు పిచ్చియెత్తుచున్నట్లును లేక పక్షవాతము వచ్చుచున్నట్లునుతోచుట. తనరోగము కుదరదని నిరాశజెందుట.

తల:—వెంట్రుకలూడిపోవుట. యెముకలలో నొప్పులువచ్చుట.

కన్నులు:—కాచబింబముయొక్క యెర్రతనము, వాపు, బాధ, కనురెప్పలు వాపులు, మానకుండగను, తరచుగావచ్చుచును యుండుట. రాత్రియందు యెక్కువ బాధగానుండుట.

చెవులు:—సవాయివలన ఎముక పుచ్చుట.

ముక్కు:—ఎముకలు పుచ్చుట. దుర్వాసన.

నోరు:—సండ్లు పొడగుట. నిద్రలో చొంగకార్చుట.

అన్నకోశము:—ఆల్కహోలును లేక బ్రాందీని కోరుట. మాంసము నందిష్టముండక పోవుట.

పొత్తికడుపు:—గజ్జలలో బిళ్ల బయలుదేరుట.

మలము, మలాశయము:—సంవత్సరములకొలది నిలువగాయున్న విరేచనబద్ధము. మలము దుర్వాసనతోను, ముదరరంగుగాను యుండుట. ఆంత్రములలోను, ఆసనములోను పుండ్లుపడుట. ఆసనమువద్ద గట్టిగానుండు రెండు పుండ్లు (సవాయి సంబంధమైనవి) బయలుదేరుట (తూజా).

మూత్రావయవములు:—నెమ్మదిగాను బాధతోను మూత్రము వెడలుట.

పురుషావయవములు:— శిశ్నాగ్రచర్మముపై పుండ్లు. బిళ్ళలు. శిశ్నముపై గట్టిగానుండు పుండ్లు ఒకేచోట బయలుదేరుచుండుట. రేతో వాహిక వాపు, బాధ, గట్టిపడుట. సవాయి రోగలక్షణములు.

స్త్రీ అవయవములు:— పసుపుపచ్చగాను, పల్చగా నీళ్ళవలెను, విస్తారముగాను, చురుక్కుమనుచును వెడలు కుసుమ; మరియు దీనితో అండాశయములో చాకుతో పొడుచుచున్నట్లు బాధ. పచ్చని కుసుమ.

శ్వాసావయవములు:—వేసవిలో ప్రకోపించునట్టియు, నిలువగా యున్నట్టియు, ఊపిరాడకపోవుటతోను, శ్లేష్మమువలన ఛాతీలో గురగురలుతోనువుండు వుబ్బసపుదగ్గు (యాంటిమొటార్టు). రాత్రి ప్రకోపించు దగ్గు.

చర్మము:—యెర్రగాను, గోధుమరంగుగాను వుండునట్టి దద్దురు లేక పొక్కులు.

ప్రకోపము:—రాత్రియందు, సముద్రపుటొడ్డున, వేసవిలో.

ఉపశమనము:—పగటియందు నెమ్మదిగా నడచుటవలన, పర్వత ప్రాంతమున.

పోలికలు:—మెర్క్యూరియసు, కాలీఅయోడ్, యాసిడ్ నైట్రిక్, ఆరం మెటాలికం, ఎల్యూమినా, ఫైటోలక్కా, ఎసాఫోటీడా.

మోతాదు:—200 మొదలు 1,000 పొటెన్సీ. దీనిని అతితరముగా వాడరాదు.

---

## 258. యాంత్రిసైనం. ANTHRACINUM.

ఇది రక్తము చెడిపోయినమీదట వచ్చురోగములమీద బాగుగా పనిచేయును. బాధలు కోయుచున్నట్లు, పొడుచుచున్నట్లు, మంటలతోను కూడియుండుట; నోరు, ముక్కు, ఆసనము, మర్మావయవములు, వీటినుండి చిక్కగాను నల్లగాను, తారువలె రక్తస్రావముగుచుండుట (క్రొటేలసు); విషవాయువులను పీల్చుటవలన వచ్చినరోగములు (పైరోజీనియం); మాంస గ్రంథులు గట్టిపడుట, వరుసగా ఒకటివిడిచి ఒకటి, కురుపులు గాని రాచ కురుపులు గాని వేయుచుండుట, విషపురుగులు కుట్టుటవల్ల కలిగిన బాధలు—వీటిమీద నిది ముఖ్యముగా పనిచేయును.

దీని లక్షణములు ఆర్సెనికంఆల్బముయొక్క లక్షణములను పోలి యుండి, అతితీవ్రతను దాల్చియుండును.

పొత్తికడుపు:—ప్లీహము వాచుట. చలితో కూడిన కడుపునొప్పి.

మర్మావయవములు:—బిళ్లలు.

కాళ్లు, చేతులు:—గోరుచుట్టు, దీనినుండి రసికారుట, మంట, పోటు (ఆర్సెనికం ఆల్బం, లెకెసిసు, యాసిడ్ కార్బాలిక్).

జ్వరము:—విషజ్వరము, దీనిలో త్వరితముగా నిస్త్రాణచెందుట. నాడిసన్నగిలుట, పరాకుమాటలు, స్పృహతప్పుట (పైరోజీనియం).

చర్మము:—వరుసగా ఒకటివిడిచి ఒకటి కురుపులు గాని రాచకురుపులుగాని వేయుచుండుట. పుండ్లలో కుళ్లినప్రదేశములనుండి దుర్వాసన

వచ్చుట. మొటిమలు, మసూచికము. పుండ్లనుండి రసికారుచు, ఆగలేనంతటి మంట, బాధతోకూడిన పెద్దపెద్దవ్రణములకును రాచపుండులకును దీనిని వాడవచ్చును. మంటను, బాధను మాన్పుటకు ఆర్సెనికం ఆల్బం గాని మరి యితరమందులు గాని సరియైన గుణమివ్వనపుడు దీనిని వాడవలెను. శస్త్ర చికిత్సానంతరము పుండుమానక చికిత్స చేసినప్రదేశము కుళ్లినపుడు వచ్చు విషజ్వరమును నిస్త్రాణను మాన్పును (ఆర్సెనికం ఆల్బం, పైరోజీనియం).

పోలికలు:— ఎఖినేషియా, పైరోజీనియం, లెకెసిసు, క్రోటేలసు, టారంట్యులా క్యూబెన్సిస్, ఆర్సెనికం ఆల్బం, కార్బోవెజ్.

విరుగుళ్లు:— క్యాంఫరు, ఆర్సెనికం ఆల్బం, యాపిసు, రూస్టాక్సు, లెకెసిసు, కార్బోవెజ్.

సహచరులు:— ఆరంమూరు నేట్రం, సైలీషియా.

ఆర్సెనికం ఆల్బం, యాసిడు ఫాసు—లకు పిమ్మటనిది బాగుగా పని చేయును.

గొఱ్ఱెలు, పశువులు, గుఱ్ఱములు, వీటియొక్క ప్లీహసంబంధమైన అంటువ్యాధులమీదకూడ నిది బాగుగా పనిచేయును.

మోతాదు:— 30, 200 పొటెన్సీలు.

---

## 259. మెలాండ్రినం. MALANDRINUM.

(మసూచికవ్యాధి సంబంధమైనది).

మసూచికము రాకుండ కాపాడుటలో నిది చాల సహాయకారిగా నుండును. టీకాల సంబంధమైన దోషములనిది మాన్పును (తూజా, సైలీషియా).

తల:— తలమీద దళసరైనటువంటి అకుపచ్చని, యెర్రనిపక్కులు కట్టునట్టి కురుపులు బయలుదేరుట.

చెవులు:—ఆకుపచ్చని, పసుపుపచ్చనివర్ణముగాను, రక్తజీరతోను, విస్తారముగాను నెడలునట్టి చీమువంటి స్రావమును మాన్పును.

పురుషావయవములు:—బిడ్డ, తన అంగమును అతితరముగా ముట్టుకొనుచుండుట.

స్త్రీ అవయవములు:—పొక్కులవంటి చర్మరోగములో గలిగిన పసుపుపచ్చని, ఆకుపచ్చని, గోధుమరంగుగానుండు పక్కులతో మర్మావయవము కప్పబడుట.

చర్మము:—పైపెదవిమీది పక్కును తీసివేయుటవలన కుట్టుచున్నట్లు బాధగానుండుట. పొడిగాను ఆర్చుకొనిపోయి దురదతోను, పొడుగుగాను వుండునట్టి పుండ్లు చేతులమీదను, కాళ్లమీదను, శీతకాలములోను, కడుగుటవలనను బయలుదేరుట ఇది మశూచికమును, పొంగును కూడ రానియకుండ చేయుటలో బాగుగా పనిచేయును.

వృద్ధికము:—సాయంకాలమున.

పోలికలు:—వేక్సినినం, వేరియోలినం, తూజా, యాంటిం టార్టు, యాపిసు, సైలీషియా, మెజోరినం, సెబీనా, హిపారుసల్ఫ, మెర్క్యూరియసు.

మోతాదు:—30,200 పొటెన్సీలు.

---

## 260. సోరినం. PSORINUM.

(చర్మరోగసంబంధమైనది).

ఇది యాంటిసోరిక్ ఔషధము. సరిగా ఆలోచనచేసియిచ్చిన ఔషధములు పనిచేయనప్పుడును, తరుణవ్యాధులవలని నిస్త్రాణకును, స్రావములు దుర్వాసనతో యున్నప్పుడును, చిడుము మొదలగు చర్మరోగముల నణచిపెట్టుటవలన వచ్చిన రోగములకును, సవాయివ్యాధికిని, సల్ఫరును వాడిన

పిమ్మటను, దీనివి వాడవచ్చును. రోగి చలిచే బాధపడుచుండునట్లుయెప్పు డును వెచ్చని దుస్తులనే ధరించుట, వేసవిలోకూడ శాచ్ఛదనము నిచ్చు టోపీని, వున్నితో చేయబడిన దళిసరియైన కోటును లేక మంచిశాలువను కప్పుకొనుట, ఇట్టిరోగులకు చర్మరోగములు వేసవిలో మానుచును శీత కాలములో బయలుదేరుచును యుండుటయు దీని వుపయోగమును సూచిం చును.

మనస్సు:—ఆత్మహత్య చేసుకొనవలెనని ఆలోచనతో యుండుట. మతసంబంధమైన తీరని విచారముతో బాధపడుచుండుట. తన రోగము కుదరదని నిరాశజెందుట.

తల:—కొట్టినట్లుండు బాధవలన రాత్రి నిద్రనుండి లేచుట. నిలు వగానుండు తలనొప్పులు, వీటితో రోగి ఆకలిగాను, వికారముగాను యుండుట, సుత్తులతో బ్రద్దలుకొట్టుచున్నట్లుండు తలనొప్పివచ్చుట. తేమ తోనుండు పొక్కులుబయలుదేరుట, వీటిరసితో వెంట్రుకలుఅట్టలుకట్టుట.

కన్నులు:—అంటుకొనుట. మాననటువంటికండ్లకలకలు. కనురెప్ప లవంచలు యెర్రగానుండుట, స్రావము వగరుగా నుండుట.

నోరు:—నాలుక, యిగుళ్లు పుండ్లుపడుట. చిక్కని కుళ్లినరుచితో నుండు ఆమము అంగుడుకు అంటుకొనుట.

ముక్కు:—అస్సుకుపోవుట. నీళ్లవంటిస్రావము వెడలుట. దిబ్బడ వేయుట. మాననటువంటి పడిశెము.

చెవులు:—భరింపజాలని దురద. మాననటువంటి స్రావము, ఇది గోధుమవర్ణముగాను, దుర్వాసనతోను యుండుట.

ముఖము:—పాలిపోయి, నీరసముగా కనబడుట. తేమతోగూడిన పొక్కులు బయలు దేరుట. జబ్బుపడినవానివలెనగుపడుట, పైపెదవివాచుట.

గొంతుక:—గవదకాయలు వాచి పెద్దవగుట. గుటకవేయుట కష్ట ముగానుండుట, దీనితో చెవులలో బాధవచ్చుట. చిక్కని ఆమము చేరు

ట. దుర్వాసనగానుండు లాలాజలము పూరుట, మాంసగంధులు వాచుట.

అన్నకోశము:—వికారమును, వేవిళ్లను మాన్పును. భోజనానంతరము పొత్తికడుపులో భాధగానుండుట, ఎల్లప్పుడును ఆకలిగానుండుట, అర్ధరాత్రియందుగూడ ఆహారము తీసికొనవలసివచ్చుట.

మలము:—ఎక్కువ దుర్వాసనగాను, రక్తముతోను, ఆమముతోను, నల్లని ద్రవమువలె వెడలుట. పాలిపోయి జబ్బుగాను, చర్మరోగములతో బాధపడుచును యుండు పిల్లలవిరేచనబద్ధమును మాన్పును. మలము ఒకప్పుడు గట్టిగాను, రక్తస్రావముతోను, మంటగానుండు మూలశంఖతోను వెడలుట.

పురుషావయవములు:— జీర్ణించిన శెగ. శృంగారసంబంధమైన ఆలోచన గలిగినను లేపనముండకపోవుట. సంభోగమందయిష్టత.

స్త్రీ అవయవములు:—నిస్త్రాణతోను నడుము నొప్పితోను, ముద్దలవలెను, దుర్వాసనగాను వెడలునట్టి కుసుమ. స్తనములవాపు, బాధ.

శ్వాసావయవములు:—వూపిరాడకపోవుటతో నుండు వుబ్బసము, దీనిలో లక్షణములు కూర్చుండుటవలన వుద్రేకము జెందుట; మరియు నివి చేతులను జాచుకొనుటవలనను పరుండుటవలనను వుపశమించుట. రొమ్ముకక్రింద పుండుపడినట్లు తోచుట. చర్మరోగము నణచిపెట్టుటవలన ప్రతి శీతకాలమందును దగ్గు వచ్చుచుండుట.

కాళ్ళు, చేతులు:—గోళ్లచుట్టూ పొక్కులు బయలుదేరుట. పాదములకు దుర్వాసనతోగూడిన చెమటపట్టుట. కీళ్లలో సత్తువలేకపోవుట.

చర్మము:—చెవులవెనుక పుండ్లగుట. కాంతిలేక అర్చుకుపోయినట్లు వుండు వెంట్రుకలు. తీరనిదురద. తలమీదను, కీళ్ళసంధులలోను, దురదతోనుండు పొక్కులు. చర్మము జిడ్డుగా నగుపడుట.

నిద్ర:—ఎక్కువ దురదవలన నిద్రపట్టకుండుట.

జ్వరము:—దుర్వాసనతోను, విస్తారముగాను చెమటలు పోయుట. రాత్రియందు చెమట పట్టుట.

ఉద్రేకము:—కాఫీవలన, కాలమార్పులలో, ఎండలో.

ఉపశమనము:—వెచ్చదనమువలన, వేసవిలో సహితము వెచ్చదనమునిచ్చు దుస్తులు ధరించుటవలన.

సహచరులు:—సల్ఫరు, బేసిలినం.

సరిపడనివి:—లెకెసిసు.

విరుగుళ్లు:—కార్బోవెజ్, కాఫీ, ఫాస్ఫరసు, లేక్ డిఫ్లోరేటం, కాలీబైక్, ఎనకార్డియం, కాలీఫాసు.

పోలికలు:—బైకోపోడియం.

మోతాదు:—30 మొదలు 1000 పొటెన్సీ. దీనిని అతితరుచుగా వాడరాదు. దీనిని వాడిన 9 రోజులకుపిమ్మట పని కనిపించును. ఒకప్పుడు ఒక్క మోతాదువలనగూడ అణచిపెట్టబడిన లక్షణములు బయల్పడి, కొన్ని వారములవరకు సహితమివి కనిపించగలవు. కావున దీనిని కడుజాగరూకతతో వాడవలయును.

---

## 261. పైరొజన్—పైరోజీనియం.

## PYROGEN—PYROGENIUM.

చెడినఆహారమును తినుటవలనను, అతిసమీపముననుండు కుళ్లుకాలువనుండివచ్చు దుష్టవాయువును పీల్చుటవలనను, సరిగాసిద్ధపరుపబడనట్టి లేక అంటువ్యాధుల సంబంధమైన మలినముతో గూడినట్టి శస్త్రములచే చికిత్స చేయబడుటవలనను, వచ్చు రోగలక్షణములకును, సన్నిపాత జ్వరము మొదలగు విషజ్వరములకును, సూతికా దోషములకును, సరిగా యెంచబడినమందువలన లక్షణములు వుపశమించక పోయినప్పుడును, నిలువగాయున్న మన్యపు జ్వరముమీదను, గర్భస్రావమునకు పిమ్మట వచ్చు రోగలక్షణము

లకును, స్రావములన్నియు (ఋతుస్రావము, ప్రసవానంతర స్రావములు, నీళ్ల విరేచనములు, వమనములు, చెమట, మొదలగునవి) యెక్కువ దుర్వాసనతోనుండునపుడును, యెక్కువబాధ, మంటతోనుండు కురుపులు లేక పుండ్లకును ఇది అత్యవసరమైనఔషధము. పైరోగములలోను లక్షణముల లోను గలుగు రక్తదోషమును లేక రక్తము విషతుల్యమగుటను మాన్పును.

మనస్సు:—ఆతురతగాను, పిచ్చిఅభిప్రాయములతోను యుండుట. తాను యెక్కువ ధనవంతుడనని కొనుట. అస్థిమితముగా నుండుట.

తల:—అస్థిమితముతోను, బద్దలగు చుండునట్లునుపుండు తలనొప్పి.

నోరు:—నాలుక యెర్రగా ఆర్చుకుపోయి శుభ్రముగాను, బీటల తోను, వార్నీషు వేసినట్లు నునుపుగాను యుండుట. గొంతుక ఆర్చుకొని పోయి, కదల్చుటకుగాని మాట్లాడుటకుగాని కష్టముగా నుండుట. వికారము, వాంతి కుళ్లినరుచితోనుండుట. దుర్వాసన వచ్చుట.

అన్నకోశము:—నీళ్ల వమనములు. భోజనానంతరము పులితేన్పులు వచ్చుట. ఒకేసారి విరేచనములు వమనములు వెడలుట.

స్త్రీకడుపు:—ఉబ్బరించి, కోయుచున్నట్లు బాధతో నుండుట. ఆసనములోను, మూత్రకోశములోను తీపుగా నుండుట.

మలము:—గోధుమరంగు నల్లరంగు మిశ్రమవర్ణముగాను, దుర్వాసనతోను, అప్రయత్నముగాను, బాధలేకుండగను వెడలు నీళ్లవిరేచనములు. ఎడతెగని విరేచనబద్ధము. మలము పెద్దపెద్ద ముద్దలుగాను లేక నల్లగానుండు చిన్నబంతులవలెను వెడలుట.

మూత్రావయవములు:—మూత్రము కొలదిగా వెడలుట; దినమంతటికి 2 సారులుమాత్రమే వెడలుట. జ్వరములో తరుచు మూత్రానుమానము గలుగుట.

పురుషావయవములు:—అండములు వ్రేలాడుచుండుట.

స్త్రీఅవయవములు:— ఎక్కువగా వాచుట, ఋతుస్రావము ఒక్క

రోజుననే వెడలి, అటుపిమ్మట దుర్వాసనతోనుండు రక్తకుసుమ వెడలుట. సూతికదోషములు. శస్త్రచికిత్సవలన వచ్చు రక్తదోషములు.

శ్వాసావయవములు:—దుర్వాసనగాను, తుప్పురంగుగాను యుండు స్రావము వెడలుట.

హృదయము:—దడగానుండుట. నిండుగా నున్నట్లు తోచుట. శీతోష్ణపరిమాణము ననుసరించియుండక అతిమరుకుగా కొట్టుకొనుచుండుట.

చేతులు, కాళ్లు:—చేతులు, పాదములు, తిమ్మిరెక్కుట, అవయవములలోను, యెముకలలోను పోట్లువచ్చుట. పరుపు యెక్కువ గట్టిగానున్నట్లు తోచుట (ఆర్నికా). నొప్పులు కదలికవలన వుపశమించుట (రూస్టాక్సు).

చర్మము:—చిన్నసరుప లేక దెబ్బ లేక గాయము యెక్కువగా వాచి, బాధగానుండి, అట్టిప్రదేశము నల్లబడుట. చర్మము అరుచుకుపోయి యుండుట.

నిద్ర:—నిద్రకొద్దిగా పట్టుట. రాత్రియంతయు కలలువచ్చుట.

జ్వరము:—రక్తదోషముతోగూడిన జ్వరములు. చలిగాను, వణకుగాను యుండుట. చలి నడుములో ప్రారంభించుట. ఉష్ణము లేక జ్వరము త్వరితముగా హెచ్చగుట. ఎక్కువ వెచ్చగాను, వెచ్చని చెమటతోను యుండినను చెమటపట్టినపిమ్మట వుపశమనము గలుగకుండుట.

వుద్రేకము:—పరుపుమీద కూర్చుండుటవలన, లేచుటవలన.

ఉపశమనము:—కదలికవలన.

పోలికలు:—ఎఖినేషియా అంగుస్టిఫోలియా, కార్బోవెజ్, ఆర్సెనికం ఆల్బమ్, లెకెసిస్, రూస్టాక్సు, బేప్టీషియా, మలేరియాఆఫ్, ఆర్నికా, సోరినం, లెప్టాండ్రా, యాసిడు నైట్రిక్, ఓపియం, బెల్లడోనా, హైడ్రాస్టిస్ సల్ఫ.

సహచరులు:—బ్రియోనియా.

మోతాదు:—6 మొదలు 1000 పొటెన్సీ. దీనిని అతితరచుగా వాడరాదు. 30, 200 పొటెన్సీలలో యిది బాగుగా పనిచేయుచున్నది.

---

## 262. వేక్సినినం. VACCININUM.

(టీకాలసంబంధమైనది).

ఇది ముఖ్యముగా మశూచికము రాకుండ కాపాడుకొనుటకు వుపయోగపడును. దీనిని వాడుటవలన మశూచికమును రాకుండ జేయుటలో టీకాలకన్న యెక్కువ వుపయోగము గలదని చెప్పబడియున్నది. ఇందులకు 6x పొడుమురూపమున 1 మోతాదును వాడిన చాలును. ఇది నరముల నిస్త్రాణ, చిరచిరలాడుట, మానవటువంటి పొక్కులతోగూడిన చర్మరోగము, అర్చుకుపోయి యుండునట్టి పెచ్చని చర్మము, మొటిమలు, మశూచికములోవలె పొక్కులతో నుండు చర్మరోగము—యీలక్షణములమీద నిది బాగుగా పనిచేయును. కోరింతదగ్గుకును, కుష్టుకును కూడ దీనిని వాడవచ్చును.

వుద్రేకము:—ప్రాతఃకాలమున.

విరుగుళ్ళు:— తూజా, సల్ఫరు, యాంటింటార్టు, సైలీషియా, మెలాండ్రినం, యాపిసు.

పోలికలు:—సరాసీనియా, తూజా, మెర్కుకర్, మెలాండ్రినం, వేరియోలినం, యాంటింటార్టు, బేసిలినం, మిష్ఫైటిసు.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ.

---

## 263. వేరియోలినం. VARIOLINUM.

(మశూచిక సంబంధమైనది).

మశూచికమును రానీయకుండ జేయుటకును, వచ్చినయెడల వుద్రిక్తము లేకుండగ రోగమును జాగ్రత్తగామాన్పుటకును దీనినివాడవచ్చును.

తల:—మశూచికము వచ్చునని తీరని భయముగలుగుట. కండ్లు వాచుట, యెర్రబడుట, బాధగానుండుట.

జ్వరము:—ఎక్కువ వెచ్చన, దుర్వాసనగానుండు చెమట.

కాళ్లు, చేతులు:—కాళ్లలో నొప్పులుగా నుండుట. అలసట జెందినట్లును, అస్థిమితముగాను యుండుట. గుత్తులలో నొప్పులు.

వుద్రేకము:—కదలికవలన.

విరుగుళ్ళు:—మెలాండిరినం, తూజా, వేక్సినినం, యాంటింటార్టు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ. 6 వ పొటెన్సీలో నిది బాగగా పనిచేయుచున్నది.

---

## 264. యాంబ్రా గ్రిషియా. AMBRA GRISEA.

(తిమింగలముయొక్క ఒకజాతి రోగమాలిన్య సంబంధమైనది).

ఇది సులభముగా కోపమువచ్చువారికిని, పల్చని దేహముగలవారికిని పనికివచ్చును. ఉదయమందుశరీరము మొద్దుబారుటనుమాన్పును. హిస్టీరియా లేక అపస్మారముమీద బాగుగా పనిచేయు అయిదు ఔషధములలో నిది యొకటి. మిగిలినవి (1) మోస్కసు, (2) కేస్టోరియం, (3) ఎసఫోటీడా, (4) వెలీరియానా. సులభముగా కోపమువచ్చు పిల్లలలోను, ముఖ్యముగా ఆడపిల్లలలోను, పల్చనిశరీరముగలవారికిని, నరములనిస్త్రాణచే బాధపడువారికిని యిది బాగుగా పనిచేయును. పైత్యతత్వములమీద నిట పనిచే

యును. అధిక పరిశ్రమవలన గాని, వయస్సుమీరినప్పుడు గాని నిస్త్రాణచేయుటను, ఫిట్టువచ్చి పడిపోయి కాళ్ళుచేతులు కంపించుటను మాన్పును.

మనస్సు:—ఒంటరిగా నుండగోరుట. ఇతరులు యెదుటయున్నప్పుడు ఏపనియుచేయలేకపోవుట. సంగీతము వినిన ఏడ్పువచ్చుట (సెబీనా, ఏకోనైటు నేపెల్లసు), ఈ లక్షణము బహిష్టుఅయినపుడు కలిగినయెడల కాలీకార్బ వాడవలెను. సులభముగా సిగ్గుపడుచుండుట. జీవితముమీద నిరాశ. నెమ్మదిగా గ్రహించుట. బుద్ధిమాంద్యము.

తల:—నుదుటనొప్పి, మాట సరిగా వినపడకపోవుట. పండ్లనుండి రక్తము స్రవించుట. తలవెండ్రుకలూడిపోవుచుండుట.

అన్నకోశము:—విడిచివిడిచివచ్చునట్టి, విపరీతమైన దగ్గుతోపాటు త్రేణుపులుండుట. పులిత్రేణుపులు.

మూత్రావయవములు:—మూత్రము మడ్డివంటి పదార్థముతో కూడి వెడలుట. మూత్రవిసర్జనకాలమందు మూత్రావయవములో మంట, దురద.

పురుషావయవములు:—వృషణములు మిక్కిలి దురదగానుండుట. ఇచ్ఛలేకపోయినను లేపనము ఎక్కువగానుండుట.

స్త్రీ అవయవములు:—బహిష్టుకు బహిష్టుకు మధ్యను స్రావము గల్గుట. ఇది విస్తారముగా నడచినప్పుడును, విరేచనము గట్టిగా అయిన తరువాతను గలుగుచుండుట. మిక్కిలి సంభోగేచ్ఛ. నీలిరంగు గలిగిన కుసుమ ఎక్కువగానుండుట.

శ్వాసకోశములు:—విడిచి విడిచివచ్చునట్టిదగ్గు, ఉబ్బసము, ఊపిరి అందకబోవుట. దగ్గునపుడు శ్వాస ఆగిపోయినట్లుండుట. అరుచుచున్నట్లు దగ్గు ఎక్కువగానుండుట.

హృదయము:—గుండెభాగము, దడవచ్చుట, బహిరంగమైన గాలిలో ముఖము పాలిపోయినట్లుండి, గుండెదడ ఎక్కువగుట.

నిద్ర:—మనోవ్యాకులతవలన నిద్రపట్టకుండుట, ఇందువలన లేచి

కూర్చొనవలసి యుండుట. ఆతురతతో కూడిన కలలువచ్చుట.

కాళ్లు, చేతులు:—చేతులవేళ్లలోను కాళ్లలోను తిమ్మెరలు.

ఉద్రేకము:—సంగీతమువలన, పరాయివారు ఎదుటనున్నప్పుడు, అసాధారణమైన వాటివల్ల, ఉదయమున, వెచ్చనిగాలిలో.

ఉపశమనము:—బహిరంగమైన గాలిలో, బాధవున్నవైపు పరుండుటవల్ల, చల్లనిపానీయమువల్ల.

విరుగుళ్ళు:—కేంఫరు, కాఫీ, నక్సువామికా, స్టాఫిసేగ్రియా, పల్సటిల్లా, ఎస్సరే.

స్టాఫిసేగ్రియా, నక్సువామికా—లకిదివిరుగుడు.

పోలికలు:—ఎసాఫొటీడా, కేస్టోరియం, లిలియంటిగ్, క్రోకసు, మోస్కసు, వెలేరియానా, సోకనం, నక్సువామికా, కాలీబ్రోమ్, ఇగ్నేషియా, పల్సటిల్లా, కాఫీ, చైనా, సల్ఫరు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ. దీని మోతాదులు పలుమారు వాడినయెడల ఎక్కువ వుపయోగముగల్గును.

---

## 265. పెర్టుసిన్—కాక్వెలుకిన్.

## PERTUSSIN—COQUELUCHIN.

(కోరింతదగ్గును సంబంధించినది):

ఇది కోరింతదగ్గునకు పరమౌషధముగా డాక్టరు. జె. హెచ్. క్లార్కు, మున్నగు సుప్రసిద్ధవైద్యులవలన పరిగణింప బడినది. కోరింతదగ్గును, కోరింతదగ్గునుబోలి, ఆగిఆగి తీవ్రముతో వచ్చు యితరజాతుల దగ్గులమీదను యిది బాగుగా పనిచేయును.

కన్నులు:—విడువని దగ్గు, దీనితో కండ్లనుండి నీళ్లుకారుట.

ముఖము:—దగ్గుటతో ముఖము కంపబారుట.

గొంతుక:—గిలిగింత లెక్కువగానుండుటతో నగ్గువచ్చుచునే యుండుట.

అన్నకోశము:— దగ్గుకుపిమ్మట వికారము వమనములు వచ్చుట (ఇపెకాక్).

శ్వాసావయవములు:—గురకతోకూడిన దగ్గు వచ్చుచుండుట. దగ్గు వచ్చునప్పుడు వుక్కిరిబిక్కిరి యగుచుండుట. దగ్గుతో ఆయాసము వచ్చుచుండుట, వూపిరి అండకపోవుచుండుట. దగ్గునప్పుడు ఛాతీలో కుట్టుచున్నట్లు బాధ వచ్చుట.

పోలికలు:—మిఫైటిసు, కోరాలియం, కోకసుకేక్టి, డ్రాసీరా, మెగ్నీషియాఫాసు, నెఫ్తలీన్, కుప్రింమెట్, కుప్రింఎసెట్, ప్యాసిఫ్లోరా ఇన్కార్నేటా, బెల్లడోనా.

మోతాదు:—30 పొటెన్సీ.

---

## 266. పేరోటీడినం. PAROTIDINUM.

(గాలి బిళ్లల సంబంధమైనది)

ముఖ్యముగా నిది గవదలు అనబడుగాలిబిళ్లలు అను వ్యాధికి నిరోధకౌషధముగను నివారణౌషధముగను వాడదగినది. గాలిబిళ్లలు (Mumps) అనబడు వ్యాధి ప్రబలముగనున్నపు డీయౌషధమును 6 లేక 30 పొటెన్సీలో దినమునకు 2 లేక 3 మోతాదులు వాడినచో వ్యాధినిరోధకముకాగలదనియు, వ్యాధిపిడితులు దీనిని నాల్గుగంటలకొక మోతాదును సేవించిన వ్యాధినివారణ కాగలదనియు, డాక్టరు క్లార్కుగారు వ్రాసిరి. ఈవ్యాధితో మెదడునందు బాధ, వేడిమికలుగుటయు, వృషణములందు బాధ, వాపు, వేడిమిగలుగుటయు యీయౌషధముయొక్క వుపయోగమును సూచించుచుననియుకూడ వారు వ్రాసిరి.

పోలికలు:—ఫైటొలక్కా, మెర్క్యూరియసు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

# హోమియోపతీమెటీరియామెడికా.

# Homœopathic Materia Medica.



## Section 3. Mineral Kingdom.

## తృతీయాశ్వాసము : ఖనిజపదార్థములు.



### 267. యాసిడ్ ఎసెటికమ్. ACID ACETICUM.

ఇది చిన్నపిల్లలకు, ముసలివారికి, పాలిపోయి సన్నగిలినవారికి బాగుగా పనిచేయును. ముక్కు, గొంతుక, శ్వాసకోశము, అన్నకోశము, మరియు గర్భాశయమునుండియు, దెబ్బలుతగిలిన ప్రదేశములనుండియు కలుగురక్త స్రావములను కట్టును. మత్తుమందు తీసికొనినపిమ్మటను, శస్త్రచికిత్సానంతరమునను, దెబ్బలుతగిలినపిమ్మటను కలుగునిస్త్రాణను, నీరసమును బోగొట్టును. ఉబ్బువ్యాధులలోకలుగు అమితదాహమును గొంతుకమంట, తరుచు తలతిరిగిపడిపోవుట, ఊపిరి అందకపోవుట, గుండెలో నీరసమును మాన్పును.

అన్నకోశము:—రాత్రులయందు అపరిమితమైన దాహము, తల త్రిప్పు, తరుచు వమనమగుట, చల్లనిపదార్థము తినినచో జీర్ణముకాకుండ కడుపులో బరువుగాయుండుట. బంగాళాదుంపలుతప్ప తక్కినకూరగాయలువికటించుట. రొట్టె, వెన్న ఎక్కువ అయిష్టతగా యుండుట.

పొత్తికడుపు:—కడుపు వ్రేలాడినట్లుండుట, శూలవంటి బాధ.

మలము, మలాశయము:—నీళ్లవిరేచనములగుట. కాళ్లు, పాదములు (క్షయజాతిరోగులలో) ఉబ్బుట. నిలువగానుండిన మలబద్ధము, పిల్లలకు నీళ్ళవిరేచనములు నిలువగానుండుటవల్ల నిస్త్రాణచేయుటను మాన్పును.

శ్వాసకోశము:—వూపిరి అందనట్లుండుట, వూపిరిని లోపలికి పీల్చునపుడు దగ్గువచ్చుట, పిల్లికూతలుండుట, గొంతుక బొంగురుపోవుట.

చర్మము:—పాలిపోయి, మైనము పూచినట్లగపడుట

జ్వరము:—క్షయరోగములో వచ్చుచుండుజ్వరము, రాత్రియందు ఎడతెగని (స్నానము చేసినట్లగుపడునంతటి) చల్లని చెమటలుపోయుట, దాహములేక పోవుట.

సహచరులు:—చైనా.

విరుగుళ్లు:—కాల్కేరియాకార్బ, నేట్రింమూరు, సున్నపునీళ్లు.

సరిపడనివి:—నక్సువామికా, కాస్టికం, బోరాక్సు, సార్సపరిల్లా, రానన్క్యులసుబల్బు.

హెపారుసల్ఫు, ఇగ్నేషియా, ఓపియం, టబాకం, స్ట్రామోనియం, ఆల్కహోలు, ఎసారంయూరోపం, ప్లంబం మెట్, సేపియా—లకిది విరుగుడు.

పోలికలు:—యాపిసు, ఆర్సెనికంఆల్బం, యురానియం నైట్రికం, యాసిడు కార్బాలిక్, యాసిడు లేక్టిక్.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. గురక మొదలగు శ్వాససంబంధమైన రోగములలో తప్ప, తక్కినరోగములలో అతితరుచుగా యీ మందును వాడరాదు.

---

## 268. యాసిడ్ బెంజోయిక్. ACID BENZOIC.

మూత్రము మిక్కిలి దుర్వాసనతోను, యిటికెపొడిరంగువలె వెడలునప్పుడును, సెగసవాయి వ్యాధులమీదకలిగిన మేహవాతపు నొప్పులు, వాపులు, మరియు మూత్రిసంబంధమైన వ్యాధులలోను యిది బాగుగా పనిజేయును.

తల:—తలనొప్పి విశ్రాంతివలన వుద్రేకించుట.

ముఖము:— రాగిరంగుమచ్చలు, బుగ్గలమీద యెఱ్ఱనిమచ్చలు.

మూత్రకోశము:— మూత్రము బాధతో నగుట, సెగరోగముఅణచి పెట్టబడుటవలన మూత్రముతోపాటు చీమువంటి పదార్థము వెడలుట. అప్రయత్నముగా మూత్రమువిడచుట. మూత్రము గుజ్జుపుమూత్రమువలె దుర్వాసనగావెడలుట.

శ్వాసావయవములు:— రాత్రియందును కుడిప్రక్క పండుకొనిన యెడలను, వుద్రేకించు ఫుబ్బసపుదగ్గు, ఆకుపచ్చని కళ్లిపడుట.

మలాశయము:— చిన్నపిల్లలలో దుర్వాసనతోకూడి, తెల్లగాను, పచ్చగాను, పెద్దపెద్ద నీళ్ళవిరేచనములు వెడలుట, వీటివలన బహునిస్త్రాణ గలుగుట, విరేచనములతోబాటు మూత్రము యెఱ్ఱరంగుగాను, దుర్వాసనతోను వెడలుట.

కాళ్లు, చేతులు:— నడచునప్పుడు మోకాళ్ళలో బిర్రబిగిసినట్లుచప్పుడగుట. మోకాళ్లపోటు, వాపు. మణికట్టువాపు, బొటనవ్రేలులో అపరిమితమైన బాధ. అక్కడక్కడ వాచుచుండుట. కీళ్ళలోనొప్పులు మూత్రావయవ రోగములతో గాని హృదయరోగములతో గాని ద్వంద్వముగా యుండుట.

విరుగుళ్ళు:— కోపైబా.

ఉద్రేకము:— చల్లగాలితగులుటవలన, గాలిమార్పువలన.

పోలికలు:— సెబీనా, యాసిడునైట్రికు, ఫెరంమెట్.

సరిపడనివి:— వైను (Wine).

మోతాదు:— 3 లగాయితు 30 పొటెన్సీ.

---

## 269. యాసిడ్ బొరాసిక్. ACID BORACIC.

ముఖ్యముగానిది అతిమూత్రము, నిస్త్రాణ, చెవులలోహోరు, చిక్కని ఆకుపచ్చని వమనము, ఎక్కిళ్ళు, మూత్రవాహికలసమీపమున

బాధ, తరుచు మూత్రానుమానము గలుగుచుండుట, మూత్రములో శ్వేత ధాతువు పోవుచుండుట (కాల్కేరియా ఫాసు, ఆర్సెనికం ఆల్బం) ను ముఖముమీదను శరీరముమీదను దద్దురుబయలు దేరుటను మరియు ముఖము మీదను మెడమీదను ముత్యములవలెనుండు చిన్నపొక్కులు బయలుదేరుటను మాన్పును. శరీరము చల్లగాయుండుట (హెలొడెర్మాహోరిడసు) దీని ముఖ్యలక్షణము.

తల:—అజీర్ణదోషముతో గూడిన తలనొప్పి. వికారము, చెవులలో హోరు. కనుపొట్లుబ్బుటతో కండ్లు మూసుకుపోవుట. కండ్లకలకలు. ఒకవస్తువు రెండు వస్తువులుగా అనుట.

స్త్రీ అవయవములు:—ముట్లుడుగుకాలమున అప్పుడప్పుడు శరీరమున వుడుకు తగులుచుండుట. మర్మావయవము మంచుగడ్డతో నింపబడినట్లు భావన గలుగుట.

సాధారణలక్షణములు:—అవసానదశ. చేతులు పాదములు చల్లబడిపోవుట. చీమలు పాకుచున్నట్లుతోచుట.

జ్వరము:—అతిచల్లదనము. వాతమును సూచించునట్టి శీతోష్ణ పరిమాణము.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో నడచుటవలన.

పోలికలు:—బోరాక్సు, యాసిడ్ కార్బాలిక్, కాలీబైక్రోమికం, లెకెసిస్.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 270. యాసిడ్ కార్బాలిక్. ACID CARBOLIC.

ఆకస్మికముగా వచ్చునట్టియు కొంచెముసేపుమాత్రమే యుండునట్టియు, ఒక్కమారుగా అంతరించునట్టియు, నొప్పులు మరియు బాధల

లోను ఇది బాగుగా పని చేయును. ఆఘ్రాణశక్తి యెక్కువగుట దీని ప్రధానలక్షణము

తల:— ఆలోచనయందయిష్టత. రెండు కనుబొమల మధ్యనునొప్పి, తలపట్టినట్లుండుట. పొగ, టీ, త్రాగుటవలన తలనొప్పులు ఉపశమించుట, గొంతుక మంటగానుండుట, ఎర్రబడుట, ఆహారము మ్రింగుట కష్టముగానుండుట. కొండనాలుక తెల్లబడి వేళ్లాడుట. తలనొప్పి ఆకస్మికముగా వచ్చి, ఆకస్మికముగానే అంతరించుట.

అన్నకోశము:—ఉద్రేకమునిచ్చు పదార్థములను, పొగాకును కోరుట, నోటియందు దుర్వాసన కలుగుట, రుచితప్పుట, త్రాగుబోతులలోను, గర్భిణీ స్త్రీలలోను గలుగు వమనములు, సముద్రయానమువలనకలుగు తలతిప్పు, వమనములు. ఆకలి మందగించుట, విశేషముగా త్రేనుపులువచ్చుట.

మలము:—ఆసనము తీపు. ఒకమారు విరేచనబద్ధము, ఒకమారు విరేచనములు నల్లగాను పల్చగాను, దుర్వాసనతో కూడి పడలుట. పసిపిల్లలలో కలుగు కలరాను మాన్పును.

స్త్రీ అవయవములు:—సూతికదోషములు. వేవిళ్ళు. తరుచు దుర్వాసనతో కూడిన ఆకుపచ్చని కుసుమజాతి స్రావము అగుచుండుటను మాన్పును సూతికజ్వరము.

చర్మము:—కుళ్ళుట. పుండ్లు దుర్వాసనగానుండుట. ఊదారంగుగా కనపడు వాపులు, దురద, మచ్చలు, దద్దుర్లు, రాచకురుపులు, మానవటువంటివన్ని ఎల్లప్పుడును రసికారుచునుండు కురుపులు, వ్రణములు, కుష్టునుమాన్పుటలోను యిది బాగుగాపనిచేయును.

పోలికలు:—క్రియసరోటీనం, ఆర్సెనికం ఆల్బం, క్రియసోటం, జల్సిమియం, మెర్క్యూరియాసు, సల్ఫరు, కార్బోవెజ్, చైనా, వేరియోలీనం, యాంటిమొంటార్టు.

విరుగుడు:—ఆల్కహాల్, మస్స, అయోడియం.

సంపదునవి.—గ్లిసరిన్, వ్యత్యసంబంధమైన నూనెలు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—దీనిని కార్బాలిక్ అయిల్ అను తైల రూపమునగాని, కార్బాలిక్ యాసిడ్ సొల్యూషను అను అరకురూపమున గాని పైకి ఉపయోగించవచ్చును. కార్బాలిక్ ఆయిలుకు ఏమియుచేర్చ కుండా స్వచ్ఛముగానే వాడవలయును. కార్బాలిక్ యాసిడ్ ఒకవంతును, 20 లగాయితు 100 వంతుల కాచిచల్లార్చిన నీళ్లలోకలిసినయెడల అది కార్బాలిక్ యాసిడ్ సొల్యూషను అగును. ఈరెండురకముల మందుల (ఆయిల్, సొల్యూషను) లో యేయొక్క మందుగాని, దుర్వాసనతో కూడిన రసి లేక, స్రావముతో కూడిన పరుకులు, పుండ్లు మొదలైనవాటికి పట్టించిన అవి మానును. వీటిని పట్టించి పైని మామూలుప్రకారము కట్టు నుకూడ కట్టుటయు, ఔషధసేవనయు చేయుటయుక్తము.

---

## 271. యాసిడ్ ఫ్లోరిక్. ACID FLUORIC.

ఇది ముసలివారికిని, ముసలివారివలె కనబడువారికిని, రసము విస్తారముగా సేవించినవారికిని, సవాయిజీర్ణించినవారికిని వుపయుక్తమైనది. వేసవిలో అమితమగు ఎండవలనిబాధలును, వర్షాకాలమునందు యెక్కువ శీతలమువలన బాధలును కనిపింపకపోవుట దీనిముఖ్యలక్షణము. ఎముకలు పుచ్చిపోవుటవలనకలిగెడు బాధలనుమాన్పుటలోనిది అమోఘముగాపనిచేయును. ఆసనముపద్ద బయలుదేరు భగందరము (Fistula in Ano) వ్యాధికిని, ఇటువంటివ్యాధి కండ్లపద్దను, పండ్లపద్దను కలిగినపుడు దీనిని వాడవచ్చును. వెంట్రుకలు ఊడిపోవుటను మాన్పును.

నోరు:—సవాయివ్యాధివలన గొంతుక పుండగుట, పైదవుడకు సంబంధించిన ఎముకలలోను, పండ్లలోను కలుగుబాధలను మాన్పును. లాలాజలము అధికముగాయూరుట. ఉదయమందు రక్తముతో కలిసిన శ్లేష్మము విస్తారముగా వెడలుట.

అన్నకోశము:—కడుపులో బరువు, పులిత్రేన్పులు, కాఫీయం దయిష్టత. వివిధములైనరుచులుగలిగిన పదార్థములుకోరుట, విస్తారము ఆకలి, చన్నీళ్లయందు కోరికగలిగియుండుట.

మలాశయము:—కాఫి త్రాగినపిమ్మటను సాయంకాలమందును మూలశంఖ మొలలు వెలుపలికి వచ్చుచు కొంచెముపల్చగా విరేచనమగుట.

చేతులు, కాళ్లు:—కుడిరెక్క గూటిలోనొప్పి, యీనొప్పి వేళ్ల వరకు పాకినట్లుండుట. చేతులు, తల, మొద్దుబారినట్లుండి బలహీనత చెందినట్లుండుట. అరిచేతులు యెర్రబారుట. వేళ్లుసూదులతో గుచ్చినట్లును మంటగానుయుండుట. పిప్పిగోళ్లుఅగుట, గోళ్లక్రిందమంటగానుండుట.

ఉద్రేకము:—ఉదయమున, వెచ్చదనమువలన, వెచ్చనిపానీయము లు త్రాగుటవలన.

ఉపశమనము:—చల్లదనమువలన, కదలికవలన.

పోలికలు:—కాల్కేరియాఫ్లోరు, సైలీషియా, తయాసినమిన్, కాఫీ, సేపియా, రూస్టాక్సు, స్టాఫిసేగ్రియా, అయోడియం, బ్రోమియం, స్పాంజియా, రూటా.

కాలీకార్బ, ఆర్సెనికంఆల్బము, యాసిడుఫాసు—లకు పిమ్మట నిది బాగుగాపనిచేయును.

సహచరులు:—సైలీషియా, కోకా.

మోతాదు:—12 మొదలు 200 పొటెన్సీ.

---

## 272. యాసిడ్ హైడ్రోసయానిక్. ACID HYDROCYANIC.

ఇది పక్షవాతములోను, కంపముతోకూడిన రోగములలోను వుపయోగపడును. స్వరపేటిక నొక్కబడినట్లుండుట, ఊపిరి ఆడకపోవుట, ఛాతీలో బాధ, బిగపట్టినట్లుండుట, గుండెదడ, నాడియందు నీరసము, తల

వెనుకభాగమందు పైభాగమందు నొప్పి, మగత, కండ్లు లోతునబడుట, అపస్మారము, మూర్ఛసంబంధమైన కంపముతోగూడిన వ్యాధులు, శ్వాసావయవసంబంధమైన జబ్బువలనకలిగిన వాతపుపాలి, కలరాజబ్బుయొక్క ఆఖరుదశలో అకస్మాత్తుగా స్రావములు ఆగిపోవుట, వాతరోగములు—వీటి మీదనిది ముఖ్యముగా పనిచేయును.

మనస్సు:—స్మృతితప్పుట, అధికమైనసంధి, మానసిక బాధవలన కలిగినభయము. గుర్రములు, బండ్లు, యిండ్లుకూలుట మొదలగువాటిని చూచిన భయము గలుగుట. ఆలోచనాభావముతగ్గుట. విచారము.

తల:—ఆందోళన. తలదిమ్ము. బహిరంగముగా గాలిలోనున్నప్పుడురోగము ఉద్రేకించుట. రాత్రిభాగమందు తలనొప్పి, పార్శ్వపునొప్పి. తలవెచ్చగానుండుట, కండ్లుపొరకప్పినట్లుండి తేటగానగుపడకపోవుట. చెవులలోపోటు, ధ్వని, మోత, సరిగావినబడకపోవుట. ముక్కులో పైభాగమందు మంట, ఆర్చుకొనిపోవునట్లుండుట.

ముఖము:—పొంగినట్లుండుట, ముసలివానివలె అగపడుట, ముఖము ముడతలుపడినట్లుండుట, పాలిపోవుట.

నోరు:—దౌడలు దగ్గరపడుట, నోరు ఆర్చుకొనిపోవుట, నాలుకపై తెల్లని లేక నల్లనిపూత. నాలుకలాగుకొనిపోయినట్లుండుట. గొంతుక బొంగురుపోయినట్లుండుట. మంట. నోటినుండినురగ. పెదవులు నీలివర్ణముగానగుట, ప్రతివస్తువు తీపిగాయున్నట్లు తోచుట.

అన్నకోశము:—పానీయములు గుడగుడలాడుచు గొంతుకగుండా జీర్ణకోశముచేరుట. కడుపులోనొప్పి, తీపు, యిది జీర్ణకోశము ఖాళీగానున్నప్పుడు హెచ్చుఅగుట. కడుపు లోతుగా పోయినట్లగుట.

శ్వాసావయవములు:—ఊపిరి సరిగా రాకపోవుట. వూపిరిపీల్చిన ధ్వనిగా నుండుట. విడిచివిడిచివచ్చు పొడిదగ్గు, ఊపిరిఆడకపోవుట, ఉబ్బసములో గొంతుకనొక్కినట్లుండుట. కోరింతదగ్గు. ఊపిరితిత్తుల పక్షవాతము. శ్వాసకోశములో భరువుగానుండుట, మండుట రక్తస్రావముగలుగుట,

హృదయము:—అమితమగు గుండెదడ, గుండెబరువు, గుండె వక్రముగా కొట్టుకొనుట, గుండెలోని బాధవలన ఊపిరాడనంతటినొప్పి.

నిద్ర:—ఆపలేనిమగత, తరుచు ఆవలింతలు, ఉదయమున నిద్రమత్తు. నిద్రలేమి, తరుచు నిద్రలో మెలకువవచ్చుట. దుస్స్వప్నములు.

జ్వరము:—రాత్రి 12 గంటలతర్వాతగాని, ఉదయమునగాని వణకు, ఆవలింతలు, దాహముతోగూడి వచ్చుజ్వరము. అవయవములు చల్లగానుండుట, జ్వరము తగ్గినపిమ్మట శరీరము వేడి, తలవెచ్చన, అస్తిమితము నకు పనిచేయును.

పోలికలు:—యామిగ్డలను అమారా, కేంఫరు. లారోసిరేసను, హెలోడెర్మా, సిక్యూటావిరోసా, కోనియం, ఒయినాంతి క్రోకేటా, నక్సువామికా, ఆకెసిను.

విరుగుళ్ళు:—క్యాంఫరు, ఓపియం, ఎమోనియం, కాఫీ, ఇపెకాక్, విరేట్రింఆల్బం.

మోతాదు:—6 మొదలు 1000 పొటెన్సీ.

---

## 273. యాసిడ్ లేక్టిక్. ACID LACTIC.

మంట వేడితోకూడినవాపులు, శరీరమునందెచ్చటనైనను మేహవాత దోషముచేతకలిగినపుడు ఇది అమోఘముగా పనిచేయును. తినిన ఆహారము అరగక అన్నకోశములో నిలువయుండి బరువుగాయుండుట, కడుపులోమంట, తలతిప్పు, మరియు, వేడిగా అన్నకోశమునుండి గొంతుకవరకుమంటతోకూడి ద్రవపదార్థము పులితేంపుతో కలసి వచ్చుచుండుటయు దీని ముఖ్యలక్షణములు.

తల:—నడినెత్తిలోను,నుదుటిలోను, నడుములోను నొప్పిగా యుండుట. కన్నులు బరువుగా నుండుట. గుడ్లలోను, వెనుకకు నొప్పిగానుం

డుట. ముక్కునుండి ఉదయమునందు రక్తస్రావము, ముక్కుదిబ్బడవేయుట, తుమ్ములు. శిరస్సునుండి గొంతుకవరకు చిక్కని పసుపుపచ్చని స్రావము (శిరోహాతము). తలనొప్పివలన సుఖము కందుట. గొంతుక ఆరిపోవుట, వెచ్చన, వాపుగానుండుట, గట్టిపదార్థములు మ్రింగుట కష్టముగానుండుట. మెత్తని లేక పల్చని పదార్థములు తినునపుడు అంత కష్టము లేకపోవుట.

అన్నకోశము:—ఆకలిలేకపోవుట, ఒకప్పుడు విస్తారము ఆకలి. విదాహముగానుండుట. గర్భిణీ స్త్రీలకు కలుగు వేవిళ్ళలో వాడవచ్చును.

మలాశయము:—తీపు. ఆసనములోపోటు, పచ్చనిరంగుగల పల్చని విరేచనము. ఎడతెగని విరేచనబద్ధము. వారమునకొకతూరి గట్టిగాను పల్లగాను విరేచనమగుట.

స్త్రీ అవయవములు:—ఋతుస్రావము తక్కువగానగుట, బహిష్టు పదునేడురోజులు ఆలస్యమగుట లేక రెండురోజులు ముందుగా నగుట. మామూలుకన్న స్రావము ఎక్కువగుట, నడుములోను పొత్తికడుపులోను నొప్పివచ్చుట. పసుపుపచ్చ కుసుమ; దీనిని మాన్పవచ్చొ రొంపపట్టుట.

నిద్ర:—రాత్రియందు అస్థిమితము, సరిగా నిద్రపట్టకపోవుట.

జ్వరము:—చల్లగాను, చలిగానుండుట, అప్పుడప్పుడు వెచ్చగానుండుట. విస్తారముగా చెమటపట్టుట. కాళ్ళకు చెమటపట్టుట. మేహావాత జ్వరము.

విరుగుళ్ళు:—బ్రియోనియా.

పోలికలు:—లేక్ కేనినం, లేక్ డిఫ్లోరేటం, పల్సటిల్లా, రూస్టాక్సు, యాసిడుఫాస్.

సరిపడనివి:—కాఫీ.

మోతాదు:— 3 మొదలు 200 పొటెన్సీ.

## 274. యాసిడ్ మ్యూరియాటికం. ACID MURIATICUM.

ఎండవలని దోషములకిదిమాన్పును (గ్లోనోయిన్, నేట్రింమూరు). దేహచ్ఛాయ, తలకెంటుర్కలు, కన్నులు నల్లగాయున్నవారికి ఇది ఉపయుక్తమైనది. సన్నిపాతజ్వరము (టైఫాయిడ్ జ్వరము) కు ఇది ప్రధానౌషధము. నిస్త్రాణ, వేర్ల్లలో నొప్పులు, అస్థిమితము, తలనొప్పి, భయము, నాలుక ఆర్చుకొనిపోవుట, మూలుగుట, మొదలగు రోగగుణముల లోను, రక్తము చెడినమీాదటవచ్చిన కురుపులు, జ్వరము, మూలశంఖ, మొదలగు వాటిలోను ఇది బాగుగా పనిచేయును. నోరు, ఆసనమునకు సంబంధించిన వ్యాధులలో ఇది అమోఘముగా పనిచేయును. అతినిస్త్రాణవలన కూర్చున్నవెంటనే కన్నులు మూతపడుట, నీరసమునకు ఆగలేక వెంటనే పరుండుట (కార్బొవెజ్), రోగి జ్వరముతో పరుండినపుడు క్రిందికి జారుచుండుటయు దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—విచారము, ఆతురత, మనోనిశ్చలత లేకపోవుట, కోపము, గట్టిగామూల్గుట, నిశ్శబ్దముగానున్నప్పుడు బాధపడుట.

శిరస్సు:—కుడివైపున పరుండిన ఎక్కువగా తలతిర్పువచ్చుట, ముచ్చిలి గుంటలో సీసముపోసినట్లు భారముగానుండుట, తలబర్దలుకొట్టుచున్నట్లునొప్పి, శబ్దమునందు అ-యిష్టత.

ముక్కు:—రక్తస్రావము. ఎక్కువగా తుమ్ములువచ్చుట.

ముఖము:—దిగువదవుడ పడిపోవుట. పోతర్పు మొటిమలు వచ్చుట.

నోరు:—పెదవులు ఆర్చుకొనిపోవుట, బీటలుతేరుట, నాలుకపై బూడిదరంగు లేక నీలిరంగుపొర కప్పినట్లు పూతగలిగియుండుట. నోటిలో నీలిరంగుగను, బాధగను, దుర్వాసనతోనుకూడిన పుండ్లు. ఈపుండ్లు చుట్టువైపులమంటగా నుండుట, పళ్లు గారకట్టుట, ఇగుళ్లు, మాంసగ్రంధులు వాచుట, నాలుకఆరిపోయి, వాచి, తోక్కవలె ఆడకుండాయుండుట, విస్తారముగా లాలాజలము వూరుట,

గొంతుక:—ఎర్రబారుట, వాచుట, మంటగానుండుట, కొండ నాలుక, మాంసగ్రంథులు వాచుట. గుటక వేయునపుడు కంపమునొందుట, ఉక్కిరిబిక్కిరియగుట.

అన్నకోశము:—మాంసమునందు అయిష్టత, ఒకప్పుడు మిక్కిలి ఆకలి, విదాహము, అన్నము సరిగా అరగకపోవుట, పులియుట. భోజనమునకు పూర్వమున్ను, తరువాతయున్ను ఎక్కిళ్లు, పులితేన్పులు, తల తిరిప్పు, పుల్లనివమనమువచ్చుట.

మలాశయము:—మూత్రము విడుచునపుడు మలము పల్చగాను, అప్రయత్నముగాను వెడలుట. మలము నల్లగాను, పల్చగాను, ఒకానొకప్పుడు రక్తముతోను కలిసివెడలుట. మూత్రము విడిచినపుడును, విరేచనము అయినపుడును, అపానవాయువు విడిచినపుడును, మలాశయము వెలుపలకువచ్చుట. ఆసనముదురద, మూలశంఖ (మొలలు) ముట్టుకొనిన అపరిమితమైన బాధ. గర్భిణులలో మూలశంఖ (మొలలు) నీలివర్ణముగాను, వేడిగాను, పోటుగాను వున్నప్పుడును ఇది బాగుగా పనిచేయును.

హృదయము:—నాడి చురుకుగాను, సన్నముగాను, నీరసముతో కూడినట్లునుయుండుట. ప్రతి మూడవదెబ్బ విడిచికొట్టుచుండుట.

మూత్రము:—విరేచనముఅయితేనే కాని మూత్రము వెడలకపోవుట.

స్త్రీఅవయవములు:—బహిష్టు మామూలుకన్న చాలత్వరగా యగుట, అమితముగా ఋతురక్తము వెడలుట. బహిష్టులో మలాశయమునందు నొప్పిగాయుండుట. కుసుమవ్యాధి. మర్మావయవములో పుండ్లు.

కాళ్లు, చేతులు:—బరువు, బాధ. నీరసముగానుండుట. నడుచునపుడు తూలుచుండుట.

చర్మము:—ఎక్కువ దురదతోకూడిన దద్దుర్లు, నీటిపొక్కులు, రాచకురుపులు. కాళ్లమీద దుర్వాసనతోకూడిన స్రావముగల పుండ్లు అగుట. చేతుల వెనుకవైపున మంత్రపుపొక్కులు బయలుదేరుట.

జ్వరము:—జ్వరములో కాళ్లు చేతులు చల్లగానుండుట, అమిత మైనవేడి. దాహము లేకుండుట. రక్తస్రావములు. అస్థిమితము. అప్రియ త్నముగా స్రావములు వెడలుట (మలము, మూత్రము నగైరా). నాడి యందు చురుకుదనము, నిస్త్రాణ, దేహమునందు అతినీరసముగా నుండుట. టైఫాయిడు. టైఫసువంటి విషజ్వరములలోనిది బాగుగా పనిచేయును. నోటిపూత, కనులెత్తిచూడలేకపోవుట, చెవులలో హోరు. చెవుడు, తల దిమ్ము. నాలుక ఆడకపోవుట. అరుచి, కడుపులో ఆవేదన. రక్తదోషము తోకూడిన జ్వరములలో బాగుగా పనిచేయును. సన్నిపాతగుణములకు ఇది సరిగా సరిపోవును; ఇట్టిజ్వరములలో క్వైనా, బ్రాంది, మొదలగు నవి యివ్వనవసరములేదు. పాలుగాని ఓట్‌మీలు (జావ) గాని ఇచ్చుచు యీ యాసిడ్ మూరును వాడినయెడల రోగము నయమగును.

పుగాకు, నల్లమందు విస్తారముగా ఉపయోగించువారికి కండరముల లోకలుగు నీరసమును ఇది తగ్గించును.

ఉద్రేకము:—తేమతోకూడిన గాలి వీచునపుడు, వాతావరణస్థితి తేమతో కూడియున్నప్పుడు, అర్ధరాత్రికి పూర్వము.

ఉపశమనము:—ఎడమవైపు పరుండినపుడు, వేడివలన.

బ్రియోనియా, రూస్టాక్సులకు తరువాత ఇదివాడినయెడల బాగుగా పనిచేయును.

పోలికలు:—ఆర్సెనికం ఆల్బం, బాప్టీషియా, యాసిడుఫాస్.

విరుగుళ్లు:—బ్రియోనియా, క్యాంఫరు.

మెర్క్యురియసు, ఓపియం—లకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 5 వారములకుపైగా యుండును.

## 275. యాసిడ్ నైట్రికం. ACID NITRICUM.

పలుచగాను, మోటుగానుయుండి,నల్లని దేహచ్ఛాయ,నల్లనివెండ్రుకలు,నల్లనికన్నులుగలవారికిన్ని,మధ్యవయస్సు దాటినవారికిన్ని ఇది ముఖ్యముగా పనిచేయును. ఇది సులభముగాను తరుచుగాను రొంప పట్టువారికిన్ని, నీళ్లవిరేచనములు తరుచుగా అగుచుండువారికిన్ని బాగుగా పనిచేయును. అతినిస్త్రాణ, అతిసారవిరేచనములతో బాధపడు ముసలివారికి ఇది బాగుగా పనిచేయును. విరేచనబద్ధముతో తరుచుగా బాధపడుచుండువారి కిది సాధారణముగా పనిచేయదు. ముల్లుగుచ్చుచున్నట్లున్ను, పొడుచుచున్నట్లును, మంటలుగానుయుండుట, ఇటుల అకస్మాత్తుగావచ్చి అట్లే మాయమగుచుండుట; చర్మముమీదపుండ్లు అగుచుండుట; నోటిలోను, నాలుకమీదను, మర్మావయవములమీదను పుండ్లు, పొక్కులు బయలుదేరి, వీటినుండి రక్తము స్రవించుట; ఆసనములోని పుండ్లవలన ఆసనము చీల్చుకొనిపోయి బద్దలైనట్లు బాధగా నుండుట (రటన్ హియా); స్రావములన్నియును, ముఖ్యముగా మూత్రము, మలము, చెమట, మిక్కిలి దుర్వాసనతో కూడియుండుట; గోకుడుపుండ్లనుండి సులభముగా రక్తము కారుట; తలకును, ఎముకలకును, గట్టిగాబిగించి ఏదియో చుట్టపెట్టినట్లుండుట; పుండ్లు, మూలశంఖ, గొంతుక, బొటనవ్రేలి గోరుమీదను మేకులు గుచ్చినట్లుండుట, వీటికి ఏది తగిలినను బాధలుఎక్కువగుట; విషసంబంధమైన మందులను లోపలికి తీసుకొనుటవలనను, పాదరస సంబంధమైన మందులు లోపలికి తీసుకొనుటవలనను కలిగిన వ్యాధులు, గండమాలరోగము— ఇవి దీని వుపయోగములను సూచించును. నిద్రలేమివలననున్ను, తీరని ఆతురతవలననున్ను, జబ్బుపడినవారికి యుపచారము చేయుటవలన కలిగిన శరీర మానసికోద్రేకమువలననున్ను, ప్రియమిత్రు నష్టమువలన కలిగిన విచారమువలననున్ను, జీవితముమీద అసహ్యతగలవారికిన్ని, ఋతువుకు పూర్వము విచారముచేతనున్ను గలుగు రోగమున్నిటిలోను దీనిని వాడవచ్చును.

ఇతర రకముల రసదోషములకు దీనికన్న హెపారుసల్ఫు బాగుగా పనిచేయును. ఇది భగందరము (Fistula-in-ano) ను మాన్పును.

మనస్సు:—తనకుగల రుగ్మతనుగురించి ఆతురత, అదివరలోవచ్చిన బాధలు తిరిగి జ్ఞప్తికివచ్చుచుండుట, కలరావచ్చుననుభయము (ఆర్సెనికం). చనిపోవుదుననుభయమును, సాయంకాలమందు మాంద్యముగాను, ఆతురతతోను యుండుటను మాన్పును. కోపముగాయుండుట, తోచినదిచేయుట, దురాలోచన, బ్రతిమాలినను వినకపోవుట మొదలగు గుణములు గలవారికిది పనిచేయును. వీధివెంబడిని నడచుచున్న బండ్లయొక్క అలుకుడు తెలియుట.

తల:—టోపీ పెట్టుకొనుటవలన తలనొక్కబడి తలనొప్పివచ్చుట. తలవెంట్రుక లూడిపోవుట.

చెవులు:—గట్టిగా మాట్లాడుటవలననున్ను, ధ్వనివలననున్ను, చెవులు దిబ్బడవేయుట, సరిగా వినబడకపోవుట. బండిలోగాని, రైలులోగాని ప్రయాణముచేయుచున్నప్పుడును బాగుగా వినబడుట. నమలుచున్నప్పుడు చెవిలో ఏదో చప్పుడైనట్లుండుట.

కన్నులు:—ఒకవస్తువు రెండువస్తువులుగా కనబడుట, పోటు, నల్లగుడ్లుపైని చిన్నచిన్న పుండ్లు పడుట, సెగవలనవచ్చిన కండ్లయెరుపు, వాపు, కండ్లనుండి నీరుకారుట, దృష్టిదోషము, సవాయివ్యాధివలన కనీనికాపటలము వాచి వెలుతురును చూడలేకపోవుట.

ముక్కు:—ముక్కునుండి ఆకుపచ్చని ముద్దలవంటి ప్రదార్థము ప్రతిరోజున ఉదయమున వెడలుట, నీరుకారుచుండుట. రక్తస్రావము. తీపు. ముక్కుయెదుట (చిగురున) ఎఱ్ఱబారుట. ముక్కుయెముక పుచ్చిపోవుట. శ్వాసకోశవ్యాధులవల్ల కలిగిన రక్తస్రావము ముక్కువెంబడిని వచ్చుట, దుర్వాసనతోకూడిన పసుపుపచ్చనిస్రావము. ముక్కునుండి ఎడతెగక వచ్చు స్రావమువలన కలుగు ఒరుపులు.

నోరు:—నోటికి ఇరుపార్శ్వములను బీటలుతీయుట. నోటినుండి

నీరుకారుచుండుట, ఇగుళ్ళువాచుట. ఇట్టివారికి మెర్క్యూరియస్ ఉపయోగపడనపుడు యాసిడ్ నైట్రికము పనిచేయును. సవాయివ్యాధివలనను, రస సంబంధమైన మందులు సేవించుటవలనను కలిగిన పుండ్లను మాన్పును. ఇట్టిపుండ్లు గొంతువరకు వ్యాపించియున్నను యీమందు బాగుగా పనిచేయును. నోటినుండి దుర్వాసనతో కూడిన లాలాజలము వూరుచుండుట, ఇగుళ్ళనుండి రక్తస్రావము, నాలుకకు ఇరుపార్శ్వములందును బాధను కలిగించు పొక్కులు బయలుదేరుట. నాలుక స్వచ్ఛముగాను, ఎఱ్ఱగాను, తేమతోను, నాలుకకుమధ్యను పగుళ్లుతోను యుండుట. పండ్లుకదలుట.

అన్నకోశము.—అతి ఆకలి, తియ్యని రుచి. సున్న, మన్ను, మొదలగు వస్తువులను, అజీర్ణపదార్థములను కోరుట, అజీర్ణముతో పాటు మూత్రములో యూరిక్ యాసిడ్, ఫాస్ఫేట్సు కలిసిపోవుచుండుట. క్రొవ్వుపదార్థములయందును, ఉప్పనిపదార్థములయందును ఎక్కువ యిష్టత.

మలాశయము—మలాశయము వెలుపలకు వచ్చుట, మలాశయమునుండియు, మూలశంఖునుండియు విశేషముగా ఎఱ్ఱనిరక్తము స్రవించుట, విరేచనానంతరము అతి నిస్త్రాణ, కాలేయములో పోటు, కామెర్ల రోగము. బట్టగట్టిగాబిగించి కట్టుకొనినయెడల శూల వుపశమించుట. చీము, జిగట, రక్తము, తీపు, విరేచనమైనపిమ్మట కోయుచున్నట్లు అపరిమితమైన బాధ.

మూత్రము:—మంట, పోటుతో వెడలుట. తక్కువగాను, ముక్కుపోడుపురంగువలెను, గాఢమైన దుర్వాసనగను, గుఱ్ఱపుమూత్రమువలెను యుండుట. మూత్రము వెడలునపుడు చల్లగానేయుండుట. ఇటువంటిగుణములు గలిగిన మూడుమందులలో ఇదియొకటి; మిగిలినవి (1) యాసిడ్ బెంజోయిక్, (2) సెపియా.

పురుషావయవములు:—మంట, తీపు, దుర్వాసన, పోటుతో కూడి అంగముచివరను పుండ్లగుట.

స్త్రీఅవయవములు:—నొప్పితో కూడియుండుట. కుసుమ, మాంసపుకండరంగువలెను, నీళ్లవలెను లేక, తీగెవలెను, దుర్వాసనతో కూడి వెడలు

ట. ఋతువు మామూలుకన్న త్వరగానున్ను, స్రావము ఎక్కువగాను న్ను, ఋరదనీటివలెనున్ను అగుట. నడుములోను, తుంట్లలోను, తొడలలో ను, విశేషము నొప్పిగాయుండుట. మర్మావయవములలో పోటుగాను, బాధగాను యుండుట. అమితమైన ప్రసవానంతర రక్తస్రావము.

శ్వాసావయవములు:—గొంతుక బొంగురుపోవుట, విశేషము దగ్గు, గుండెలలో బరువు. మెట్లు ఎక్కినయెడల ఊపిరిఅందక పోవుట, ఆయా సము (ఆర్సనికం). నిద్రలో దగ్గువచ్చుట (కేమోమిల్లా).

కాళ్లు, చేతులు:—కాళ్లకు దుర్వాసనతో కూడిన చెమటపట్టుట. వేళ్లునొప్పి, పాదములబరువు,అరిచేతులు చల్లగానుండుట, చెమటపట్టుట.

చర్మము:—సురుగుడుకాయలు, ముఖముమీద మొటిమలు.

పాదరసమువలనను, డిజిటాలిస్ వలనను కలిగిన దుర్గుణముల నిది తీసివేయును.

ఉద్రేకము:— గాలిమార్పులవలన, సాయంకాలమందు, రాత్రియం దు, నడచునపుడు, మెళుకువవచ్చుటచేత, చెమటపట్టినపుడు, చల్లనిగాలివల న, వేడిగాలివలన.

ఉపశమనము:—బండిలో ప్రయాణముచేయుటవలన, కప్పుకొనుట వలన.

సహచరులు:—ఆర్సెనికంఆల్బం, కెలేడియంసెగ్, సేపియా, లేక్ కేనినం.

దీనిని లెకేసిస్‌నకు ముందుగాని, వెనుకగాని వాడరాదు యాసిడ్ నైట్రికం వాడుటకు ముందుగా కాల్‌కేరియా కార్బ వాడరాదు అని హానిమన్‌గారు వ్రాసిరి.

పోలికలు:—మెడోరినం, సిఫిలినం, సోరినం, మెర్క్యూరియాసు, యూపిఘుమారు, లెడం, తూజా, సల్ఫరు, ఎస్కులసు,

విరుగుళ్ళు:—కాల్ కేరియాకార్బ, క్యాంఫరు, హిపారుసల్ఫ, లెకేసిస్, మెర్క్యూరియస్, సల్ఫరు, మెజీరియం.

కాల్కేరియాకార్బ, డిజిటాలిసు, మెర్క్యూరియసు—లకిదివిరుగుడు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ. ఇంతకు పైపొటెన్సీలలో వైద్యులసలహాపైన మాత్రమే వాడవలయును. దీని గుణకాలపరిమితి 40 దినములకు పైగాయుండును.

---

## 276. యాసిడ్ ఆగ్జాలికం. ACID OXALICUM.

కాఫీవలని పలువిధరోగలక్షణములనిది మాన్పును. ఇది ఎడమవైపు అవయవములకు సంబంధించిన రోగములలోను, హృదయకోశములమీదను బాగుగా పనిచేయును. స్వల్పముగా ఆయాసపడినను వేడిచేయుచుండుట, పిదప చల్లని చెమటపట్టుట; ముఖము, చేతులు, కాళ్ళు, వీటిమీద చల్లని చెమటపట్టుచుండుటయు, నిస్త్రాణజెందుటయు దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—భయకంపితమైన కలలు, వీటివలన గుండెదడ, మెలకువ వచ్చుచుండుట. కడుపులో పోటుగాయుండుటవలని నిద్రలేమి.

తల:—వేడిగానుండుట. నొప్పిగానుండుట. మలవిసర్జనమునందును, అంతకుపూర్వమును యుండు నొప్పి, తలఖాళీగాయున్నట్లుతోచుట. తల మీద మచ్చలలో నొప్పియుండుట. త్రాగుటవలనను, పరుండుటవలనను, నిద్రపోయినపిమ్మటను, లేచినపుడును తలనొప్పి, ఎక్కువగుట. మరియు నిది విరేచనమైనపిదప తగ్గుట.

కన్నులు:—చదువునపుడు అక్షరములు కదలుచున్నట్లుండుట. చూపుతగ్గిపోవుట. దగ్గరగానున్న సన్నని చిన్నవస్తువులు పెద్దవిగాను, దూరముగాను ఉన్నట్లు అగుపడుట. ఎక్కువ బాధగాయుండుట, పెద్దవైనట్లు తోచుట.

ముక్కు:—తుమ్ములు, నీటివంటి స్రావము, ఒరుపు యుండుట.

నోరు:—ఇగుళ్లపై పుండ్లు, ఇగుళ్లనుండి రక్తముకారుట, నాలుక నోరు పుల్లరుచిగలిగియుండుట. నాలుక ఆరిపోయి ఎఱ్ఱగాను, మంట, వాపు, తెల్లనిపూత గలిగియుండుట. రుచి తెలియకుండుట. నోటినుండి ఆమము వెడలుచుండుట.

శ్వాసకోశములు:—రొమ్ముయెముక (Sternum) వెనుక కుట్టుచున్నట్లును, చీల్చుచున్నట్లును బాధగాయుండుట. ఇది భుజములలోనికి చేతులలోనికి వ్యాపించుట. ఈబాధ ఎడమవైపునఎక్కువగానుండి, గోళ్లు పెదవులు, నీలిరంగుగా యుండుట. శ్వాస సరిగా నుండక తెరలుతెరలుగా వచ్చుచుండుట (లేటోడెక్టసు మెక్టాన్సు). ఎడమ యూపిరి తిత్తిలోను, హృదయములోను, పొట్టకు ఇరుపార్శ్వములందును పొడుచుచున్నట్లుండు శూల. విశ్రాంతిలోను, నిద్రలోను ఊపిరిపీల్చుట కష్టముగా యుండుట. ఛాతీమధ్యను నొప్పిగాయుండుట. ఇది వీపునుండి వ్యాపించినట్లు అగుపడుట.

హృదయము:—మేహవాతరోగులలో కలుగు విపరీతమైన గుండెదడ, వక్రమైననాడి. నాడిసన్నముగానున్ను, విడిచివిడిచిన్ని, వేగముగానున్ను కొట్టుకొనుచుండుట. ఇది హృదయసంబంధమైన పెక్కురకముల వ్యాధులలో పనిచేయును. హృద్రోగముతోపాటు కష్టమైన శ్వాస, గొంతుక బొంగురుపోవుట యుండుట, స్వరపేటిక తెల్లని లేక పచ్చని శ్లేష్మముతోకూడి యుండుట. కాఫీత్రాగుటవలన హృద్రోగము ఎక్కువై దీనివలన నీళ్లవిరేచనములగుట.

అన్నకోశము:—భోజనమైనపిదప నొప్పితగ్గుట. కొరుకుచున్నట్లుండునొప్పి, పంచదారవలన కడుపులోబాధ ఎక్కువగుట. గర్భిణీస్త్రీలలో కలుగు వేవిళ్ళను కట్టును. అజీర్ణమువలన గుండెలలోమంట. తరుచు త్రేణుపులు, ఎక్కిళ్లువచ్చుట. కడుపులో మంటతోకూడిన శూల,

మలము, మలాశయము:—కాఫీ త్రాగినవెంటనే పలుచని విరేచన మగుట, అతివిరేచనబద్ధము. ఒకప్పుడు మలముపల్చగాను, శీఘ్రవలెను యుండి తరుచు విరేచనమగుచుండుట. విరేచనమైన వెనుక నీరసించి సొమ్మసిల్లిపోవుట.

మూత్రావయవములు:—వీటిని తలచినంతనే మూత్రానుమానము గలిగి వెంటనే మూత్రవిసర్జనము చేయవలసివచ్చుట మూత్రము మంట, బాధతోకూడి విస్తారముగా వెడలుట.

పురుషావయవములు:—లేపనశక్తి ఎక్కువగుట, ఉదయమున లేప నము ఎక్కువగానుండుట. నడుమనప్పుడు వృషణములు బరువుగను, నొప్పి గాను యుండుట. స్వప్నస్ఖలనమగుట.

కాళ్లు, చేతులు:—తరుచు మంటలుగానుండుట. కీళ్ళలో నొప్పులు ఎక్కువగానుండుట. దిగువ అవయవములకు చల్లనిచెమటపట్టుట. పక్షవా తమువచ్చుట.

వీపు, నడుము:—నొప్పి తొడలవరకు వ్యాపించుట. కూర్చున్న మనిషి నిలువబడుట లేక నిలువబడినమనిషి పరుండుట, ఇట్టిమార్పులవలన నొప్పి ఉపశమించుట. దేహభారమును ఆపలేనంతనొప్పి నడుములోకలు గుట. ఈనొప్పిని గురించి తలచినయెడల యీనొప్పి ఎక్కువగునట్లు తో చుట; యీనొప్పి తెరలుతెరలుగావచ్చుట. వెన్నెముకలో అధికముగా బాధగా నుండుట. అవయవములలో వణుకుకలుగుచుండుటయు తరుచు మొద్దుబారుటయు కూడ యుండుట (పిక్రిక్ యాసిడ్‌కు అవయవము లలో నొప్పులు, బరువులు యుండును).

జ్వరము:—చలి వెన్నెముక చివరభాగమందు ప్రారంభించి పైకి ప్రాకుచున్నట్లుండుట. సాయంకాలము తుమ్ములువచ్చుట. స్వల్పపరిశ్రమ వలన వేడి ఎక్కువగుట. ఈవేడి చేతులకును, ముఖమునకును తప్పకుండా యుండుట. దీనితోపాటు విస్తారము చెమటలుపోయుట.

ఉద్రేకము:—కదలికవలన, అలసటవలన, తాకినచో, వెలుతురు వలన, క్షురకర్మవలన, తననుగురించి తలచుకొనుటవలన, ఎడమవైపున.

విరుగుడు:— సున్నపునీళ్లు.

పోలికలు:—ఆర్సెనికం ఆల్బం, ఎపెకాక్, విరేట్రిం ఆల్బం, కోల్చికం, యాసిడుపికిరిక్, ఆర్జెంటం మెట్, యాంటిటార్టు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 277. యాసిడ్ ఫాసు. ACID PHOSPHORICUM.

ఇది స్వతసిద్ధముగా బలమైన మనుష్యులలోను, ఇంద్రియనష్టమువలనను, అమిత సంభోగమువలనను (చైనా), తత్కాలవ్యాధులవలనను వచ్చు నీరసములోను, అతివిచారమువలనను కలిగిన నిస్త్రాణలోను బాగుగా పని చేయును. రోగి మత్తుగాను, నిర్లక్ష్యముగాను సమీపమున ఏమిజరుగుచున్నదియు తెలియకుండాను యుండినను మేలుకువగలిగించుటకు తగిన వీలులో నుండుట. విచారమువలన కలుగు దీర్ఘరోగములు, తలవెంట్రుకలు ఎఱ్ఱబడుట, నిరాశజెందుట, కృశించిపోయి శవాకారమును బోలియుండుట. రోగి అతిత్వరితముగాను, అతిగాఢముగాను పెరుగుట; యువకులలో ఎముకలలో నొప్పులు ఎక్కువగుచుండుట, అధికసంభోగమువలన శారీరమానసిక దుర్బలత్వములు కలుగుట. విరేచనములు నీళ్లవలెను, తెల్లగాను, బాధలేకుండగను, గుడగుడలాడుచు అగుచు, అంత నీరసమువుండకుండుట, మూత్రము తెల్లగాను లేక పాలవలెను విస్తారముగానగుట, కాళ్ళు తేమగా నుండుట, పైన తెలుపబడిన రోగచిహ్నములవలన ఒకప్పుడు రోగికి క్షయరోగము ప్రవేశించు సూచనలుగలుగుట—ఈలక్షణములు దీనివుపయోగమును సూచించును.

మనస్సు:—ఆలోచనాశక్తితగ్గుట, సరియైనమాట తోచకపోవుట, చెప్పనది వినిపించుకొనకపోవుట, జ్ఞాపకశక్తితగ్గిపోవుట, మత్తుతోకూడిన

సంధి, మనోవికారములవలనవచ్చు రోగములు, మనస్థిమితముండకుండుట. ముందు రాబోవు విషయములను గురించి ఆతురత జెందుట.

తల:—చదువుకొనుచున్న ఆడపిల్లలు విస్తారముగా కండ్లను ఉపయోగించుట (కుట్టుట, చదువుట) వలన గలిగిన తలనొప్పులలో ఇది బాగుగా పనిచేయును (నేట్రంమూర్, కాల్కేరియా ఫాస్). ఈరోగగుణములు త్వరితముగా పెరుగుచుండు విద్యార్థులలో గలిగినను యీమందును వాడవచ్చును. బరువుతో అణచివేయుచున్నట్లు నడినెత్తినొప్పి లేక మెడపైభాగమందునొప్పి. దీనితో బలహీనత, నిస్త్రాణగాను, పడుండవలయు ననియుండుట. మాట్లాడుటయందయిష్టత. ఇది అమితసంభోగము మొదలైన దురభ్యాసములవలనకూడ కలుగవచ్చును. సంభోగానంతరమువచ్చు తలనొప్పి, చిన్నవయస్సులోనే వెంట్రుకలు నెరయుట, వెంట్రుకలూడిపోవుచుండుట (సిలీనియం, నేట్రంమూర్). కదలికవలనను, ధ్వనులవలనను తలనొప్పి ఎక్కువగుట. సాయంకాలమునను నిలుచుండుట వలనగాని, నడచుచుండుటవలనగాని నొప్పి ఎక్కువగుట. వెంట్రుకలు పలుచబడుట, ఎముకలలో కత్తితో గోకుచున్నట్లుండుట.

కన్నులు:—బరువుగానుండుట, గుడ్లు పెద్దవైనట్లుండుట, గాజుకండ్లవలె నగుపడుట, కనురెప్పలు వాచుట, కాంతిని చూడలేకపోవుట, చూచునపుడు ఇంద్రధనస్సువలె రంగులతో నగుపడుట, హస్తప్రయోగము చేయువారిలో దృష్టి మబ్బుగానుండుట, ఉదయమున కన్నులు అంటుకొనుట, కండ్లలో తేజస్సు తగ్గుట. కాంతిగల వస్తువులను చూచినపుడు దృష్టి చెదురుట, గుడ్లు తలలోనికి బలవంతముగా నొక్కబడిపోయినంతనొప్పిగానుండుట, కనుపాపలు పెద్దవైనట్లుండుట, కండ్లనుండి నీరుకారుట.

చెవులు:—శబ్దమును, సంగీతమును భరించలేకపోవుట. చెవిలో హోరు, దీనివలన సరిగా వినబడకపోవుట, ప్రతిధ్వనించుట, గంటలు వినబడినపుడును, సంగీతము వినబడినపుడును చెవిలో పోటు ఎక్కువగుట. దూరపు శబ్దము అసలే వినబడకపోవుట, చీదునపుడు చెవిలో కీచుమని

శబ్దమువచ్చుట.

ముక్కు:—ముక్కునుండి నల్లనిరక్తము స్రవించుట, ముక్కుచివర దురదగానుండుట, చేతివేళ్ళను ముక్కురంధ్రములలో యుంచవలయునని తోచుట. ముక్కునుండి విడుచువాయువు దుర్వాసనతోకూడి యుండుట, రక్తముతోకూడిన చీముకారుట, ఎడతెగని నీళ్ళవంటి స్రావము, ముక్కుఒరుపు, ముక్కు పైయొముక పైవాపు, ఎఱ్ఱనిమచ్చలు.

ముఖము:—పాలిపోవుట, ఆరిపోయినట్లుండుట, పెద్దపెద్దపోత్రపు మొటిమలు. ఒకనైపు చల్లగానుండుట, కన్నులు గుంటలుపడుట.

నోరు:—పెదవులు ఆర్చుకొనిపోవుట, బ్రద్దలగుట. ఇవి స్వల్పముగా రక్తస్రావముతోను, ఒరుపుతోను కూడియుండుట. ఇగుళ్లనుండి రక్తముకారుచుండుట. నాలుకవాచుట నాలుక ఎండిపోయినట్లుండినను నురగవంటి చిక్కని ఆముమువచ్చుచుండుట, పళ్లుచల్లగానుండుట, రాత్రులయందు అప్రయత్నముగ నాలుకను కరుచుకొనుట, నాలుకమధ్య ఎఱ్ఱనిచారిక యుండుట. ఈచారిక ముందరనైపు వెడల్పుగాయుండుట. ముక్కుతో మాట్లాడినట్లుండుట, పుప్పిపన్నుదొలకలో ఆహారపదార్థము దూరినయెడల మిక్కిలి బాధగానుండుట, ఆపదార్థమును తీసివేసినయెడల బాధ ఉపశమించుట, ఇగుళ్లు పండ్లనుండి దూరముపడుట.

కంఠము:—ఆహారము మ్రింగునపుడు గోసుచున్నట్లును, పుండువలెను, పొడుచుచున్నట్లును, గ్రిచ్చుకొనుచున్నట్లును ఉండుట. కంఠము దిగువభాగమందు ముడుచుకొనిపోయినట్లుండుట. కంఠములో గట్టిగా బిగపట్టియుండు చిక్కని ఆముము దగ్గినపుడు వెడలుట.

అన్నకోశము:—ఎల్లప్పుడును ద్రవపదార్థములనే కోరుచుండుట. పులితేన్పులు. భోజనానంతరము కడుపులో బరువుగానుండి నిదురవచ్చుట. ఆవుపాలను త్రాగవలయునని ఎక్కువవాంఛ యుండుట, ఆకలి లేకపోవుట. తీరనిదాహము. పుల్లనిపదార్థములను తినుటవలనను పుల్లని పానీ

యములు తాగుటవలనను కలుగు అజీర్ణసంబంధమైన రోగగుణములు. కడుపులో గుడగుడలాడుచుండుట, ప్లీహము వాపుతో పాటు కడుపు గుల్లబారి యుండుట(సినోతస్). విడిచివిడిచివచ్చు కడుపునొప్పి, పుల్లని వమనము.

పొత్తికడుపు:—పేగులు బరువెక్కి వ్రేలాడుచున్నట్లుండుట, బొడ్డుదగ్గిర పోటుగానుండుట, ఉబ్బరముగా నుండుట.

మలము, మలాశయము:—తెల్లని లేక పసుపుపచ్చని పల్చనినీళ్ళ విరేచనములు బాధలేకుండగను,నిస్త్రాణచేయకుండగను అగుట. ఇవిపుల్లని పదార్థములను తినుటవలనను, అప్రియత్నముగను, అపానవాయుపుతో కలిసియు వెడలుట (ఎలోసు, నేట్రింమూరు). భయమునలన కలరాలోవలెవిరేచనములగుట, బలహీనముగానున్న పిల్లలలో కలుగు నీళ్లవిరేచనములకు ఇది బాగుగా పనిచేయును. అజీర్ణవిరేచనములు, ఆమువిరేచనములు, సన్నిపాతజ్వరములో కలుగు రక్తవిరేచనములను, కలరా రోజులలోను వేసవిలోను అగు నీళ్లవిరేచనములను కట్టును.

మూత్రావయవములు:—పాలవలెనుండి చిక్కని పదార్థము కలిసిగాని లేక రక్తకణములతోగాని మూత్రము వెడలుట. రాత్రిభాగమందు స్వచ్ఛమైన నీటివంటి మూత్రము (Phosphates) ఫాస్పేట్సుతో కలిసిగాని, కలియకగాని, ఎక్కువగా పోవుట. అతిమూత్రమును, మధుమూత్రమునుమాన్పును. మూత్రము అప్రియత్నముగా వెడలుట. మూత్రము విడుచుటకు ముందు ఆతురతయుండుట, అనంతరము మంటగానుండుట. పిల్లలు రాత్రులయందు పక్కలో మూత్రమువిడుచుటను మాన్పును.

పురుషావయవములు:—అసంపూర్తియైన సంభోగక్రియ వలనగాని లేక హస్తప్రయోగమువలనగాని కలిగిన విచారము (డయాస్కోరియా, స్టాఫిసేగ్రియా). తరుచుగాను, విస్తారముగాను, అతినీరసమును గలిగించునట్టి స్ఖలనములగుట. తరుచు సంభోగమును కోరుచుండుట. నిద్రలోను, మూత్రమును విడిచినపిమ్మటను, మలము సరిగా వెడలనపుడు తినుకుటవలనను, అప్రయత్నముగా స్ఖలనమగుట. ఇది శుక్లనష్టమునకు ప్రధానౌషధము,

నపుంసకత్వము, మర్మావయవమునందు బలముతగ్గుట, లేపనశక్తితగ్గుట, వృషణములలో మంటతోకూడిన వాపు, నొప్పి. అంగముయొక్క పోశ పత్రిక్కను చిన్నచిన్న సురుగుడుకాయలువలె లేచుట. అంగముపైనను, వృషణములపైనను దద్దుర్లు, పొక్కులు బయలుదేరుట. ఎడమవృషణము వాచుటను మాన్పును.

స్త్రీఅవయవములు:—హిస్టీరియా లేక అపస్మారము. ఋతుశూల. రక్తస్రావము, కుసుమవ్యాధి. బహిష్టు చాలముందుగాను, విస్తారముగాను, నల్లగాను అగుట. కాలేయములో నొప్పి. బహిష్టుకు ముందు దురదతోకూడిన పసుపుపచ్చని కుసుమ పాలతల్లులలో స్తన్యము తక్కువగానుండుట. స్తన్యము నిచ్చుటవలన కలిగిన నిస్త్రాణ, అనారోగ్యముగానుండుట. గర్భవతులలో మూత్రము కష్టముగా వెడలుట; ఇట్టివారు ఆహారమునుచూచిన యెడల వమనముచేసికొనుటను మాన్పును. గర్భాశయములోనిపుండ్లు, వీటినుండి దుర్వాసన, రక్తము, దురద, వీటితోకలసి వెడలునట్టి స్రావము.

శ్వాసావయవములు:—మాట్లాడుటవలనను, దగ్గుటవలనను నీరసము (స్టేనంమెట్). క్షయజాతి దగ్గులలోను, స్రావములవలన కలిగిన నిస్త్రాణ మీదవచ్చిన దగ్గులలోను, దగ్గుతోబాటు దుర్వాసనతోకూడిన చిక్కని స్రావముండుట. దగ్గునపుడు ఛాతీలోనొప్పి కలుగుచుండుట. సాయంకాలమందును, పరుండినపిమ్మటను దగ్గు ఎక్కువగుట, దీనితోవచ్చు శ్లేష్మము ఉప్పగాయుండుట. బొంగురుతనము. ఛాతీలో కితకితలుపెట్టినట్లుండి పొడిదగ్గువచ్చుట, ఇట్లు ఉదయముననే యుండుట. శ్వాస కష్టముగా యుండుట.

హృదయము:—త్వరగా ఎదుగునట్టి పిల్లలలో కలుగు గుండెదడ. విచారమువలనను, ముష్టిమైథునమువలనను వచ్చు గుండెదడ, నాడి వంకరగాను, విడచివిడచియు కొట్టుకొనుచుండుట. హృదయములో కుట్టుచున్నట్లుండుట. దుష్టరక్తనాళముల వాపు.

నడుము, వీపు:—రెక్కయెముకలమధ్య పొడుచుచున్నట్లు నొప్పి.

వెన్ను దిగువభాగమందు మంటతోకూడి చితుకకొట్టినట్లుండు నొప్పి.

కాళ్ళు, చేతులు:—రోగి వణకుచుండుట. కాళ్ళలో నీరసముచేత సులభముగా తూలుచుండుట లేక తప్పటడుగులు వేయుట. నరములలో లాగుచున్నట్లు, పొడుచుచున్నట్లు, త్రిప్పుచున్నట్లు బాధగాయుండుట. దండలలోను, గుత్తులలోను విడిచివిడిచివచ్చు నొప్పి. ఈనొప్పి లాగుచున్నట్లుండుట. వేళ్ళమధ్యను, కీళ్ళమడతలలోను దురద. స్ఖలనమైన పిదప కాళ్ళు, చేతులు లాగుట. కాళ్ళమీద దురదతో కూడినకురుపులు. అరికాళ్లు మంటలు. కాలివేళ్ళమధ్యను ఒరుపులు. కాలిజోళ్లు తొడిగి నడచుటకు వీలులేనంతటి పాదములవాపు.

చర్మము:—పుండ్లనుండి దుర్వాసనతోకూడిన చీము కారుట. పో త్రిపుమొటిమలు, రక్తపుగెడ్డలు, లేక సెగ్గెడ్డలు, మంటతోకూడిన ఎఱ్ఱని దద్దుర్లు, జ్వరము తగ్గినపిమ్మట కురుపులు వేయుచుండుట. పోటు మంటతో కూడిన ఆనికాయలు, పెద్దపెద్ద సురుగుడుకాయలు, మాననటువంటివిన్ని దురదతోకూడినటువంటివిన్ని పెద్దపెద్దపుండ్లు.

నిద్ర:—ఎల్లప్పుడును మత్తుగానుండుట. శృంగారసంబంధమైన కలలవలన కలుగు స్ఖలనము. సాయంకాలమందు నిద్రజెందుట. అర్ధరాత్రికి పిదప నిద్రపట్టకపోవుట. ఉదయమున లేచుట బహుకష్టముగా నుండుట. రాత్రి కలలో చనిపోయినట్లనుకొని ఉదయమున లేచుసరికి ఆతురత, భయము యుండుట. కలలో అంకెలు కనబడుట.

జ్వరము:—సన్నిపాతజ్వరములో మెదడు ననుసరించిన గుణములు ముఖ్యమైనవి; వీటిలో రోగి దుంగవలె దేహస్మారములేక పరుండియుండుట. తనప్రక్కను, దగ్గరలోను ఏమిజరుగుచున్నదియు రోగికి తెలియక పోవుట. నల్లనిరక్తముతోకూడిన విరేచనములగుట. సంధిలోగొణుగుకొనుట. తెలివితప్పియుండుట, మెళుకువచేసినపుడు బాగుగా తెలివిగలిగియుండుట, అడిగినమాటకు సరిగా సమాధానము నెమ్మదిగాచెప్పినను వెంటనే తెలివితప్పి నిద్రపోవుట. అప్రయత్నముగా మలమూత్రవిడలుట, కడుపు

గుల్లగా నుండుట. ఉదయమునను, రాత్రియందును చెమట ఎక్కువగా నుండుట. చలిగా నుండుట. చలిజ్వరము. వేళ్లు మంచువలె చల్లగానుండుట. దాహముండకపోవుట. అపరిమితమైన చలి. స్థిమితము లేకపోవుట విస్తారము చెమట, వమనములగుట, తలవెనుకను మెడమీదను చెమట తప్పకుండా వుండుట.

ఉద్రేకము:—అలసటవలన, అధికసంభాషణవలన, దుర్వార్తవలన, అధికసంభోగమువలన, హస్తప్రయోగమువలన, చలిగాలివలన, వేడియాహారమువలన, రాత్రియందు, కాఫీవలన.

ఉపశమనము:—నిద్రానంతరము వెచ్చదనమువలన, కదలికవలన.

విరుగుళ్లు:—కాఫీ, కేంఫరు, స్టాఫిసేగ్రియా, ఆర్నికా, లెకెసిస్, నక్సువామికా.

పోలికలు:—ఫాస్ఫరసు, యాసిడ్ పిక్రిక్, నక్సువామికా, చైనా, యాసిడ్ లేక్టిక్.

మోతాదు:—1 మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాలపరిమితి 40 దినములకు పైగా యుండుట,

---

## 278. యాసిడ్ పిక్రిక్. ACID PICRIC.

మెదడు, రక్తము, మర్మావయవములు, మూత్రము వీటిసంబంధమైన రోగములనిది మాన్పును.

ఇది సాధారణముగా నల్లనిదేహచ్ఛాయగలవారికి బాగుగా పనిజేయును. ఆహారవిహారములలోని దోషములవలన కలిగెడి శరీరమానసికదుర్బలత్వమును తొలగించును. రక్తవిహీనులకు ఇది అమృతమువంటిది. అధికపరిశ్రమవలని తలనొప్పులను, సుఖసంబంధమైన వ్యాధులవలనను, రక్తము చెడుటవల్లను కలిగెడు కంతులను, కాయలను మాన్పును. సెగరోగము, నరముల నిస్త్రాణ, హిస్టీరియా లేక అపస్మారము, నపుంసకత్వము, మూత్రి

పిండముల వాపుతోకూడిన రోగములను, వెన్నెముకసంబంధమైన రోగములలో కలిగిన అధిక లేపనశక్తిని ఇది మాన్పును.

మనస్సు:—మనస్సు నిలుపలేకపోవుట. చేయుచున్న పనియందు అయిష్టత. అధికమైన మానసిక పరిశ్రమవలనను చదువుటవలనను వచ్చు రోగలక్షణములు.

తల:—గట్టిగా కట్టుటవలన నొప్పి సర్దుకొనుట. నడినెత్తిమీదనొప్పి. ఆలోచనవలన యీనొప్పి ఎక్కువగుట. చెవులలో ధ్వనులు వినబడుచుండుట. చెవి లోపలను, కంఠము వెనుకను కురుపులు వేయుచుండుట. చెవులలో పురుగులు పాకుచున్నట్లు గురగుర లాడుచుండుట. చాలకాలమునుండి యున్నట్టి చెముడు. ముక్కునొప్పిగా నుండుట. ముక్కు దిబ్బడవేయుటవల్ల శ్వాస నోటిద్వారా పీల్చుచుండుట. కుడిముక్కునుండి రక్తస్రావము. ముఖముమీద చిన్నచిన్న పొక్కులు మంట, పోటుతో బయలుదేరుట. నోటినుండి తెల్లనిశ్లేష్మము నురగవలె వచ్చుచుండుట. సాయంకాలమందు ఎక్కువ ఆకలిగానుండుట. దాహము ఎక్కువగానుండుట. విద్యార్థులు, ఉపాధ్యాయులు, వ్యాపారస్థులు, ఇతరవృత్తులు చేయువారిలోను అధిక పరిశ్రమవలనను వచ్చు తలనొప్పులకు ఇది బాగుగాపనిచేయును. విచారము వలన కలిగిన నరముల నిస్త్రాణతోకూడిన తలనొప్పులను మాన్పుటలో దీనికి సాటియైన దింకొకటిలేదు. తలలో ఏభాగమునయున్న నొప్పినైనను ఇది మాన్పును. తలనొప్పులు ఉదయమున ప్రారంభించి క్రమముగా సాయంకాలమునకు ఎక్కువగుట; రాత్రి నిద్రవలనమాత్రమే ఇవి ఉపశమించుట. పగటియందు ఏమిచేయుటకును రోగి అశక్తతగా నుండుట. రాత్రియందును, నిద్రలోను ఉపశాంతినొందుట.

కన్నులు:—విస్తారము పచ్చని చిక్కని పుసులుకట్టుచుండుట. కన్నులు పచ్చబడుట,* సన్నని అచ్చుఅక్షరములు చదువుటవలన తలనొప్పియు, కంటిరోగమును ప్రవేశించుట (ఒనాస్ మోడియం). కంటిలోఇసుక పోసినట్లు మెరుగుచుండుట. కండ్లుమంట, నీరుకారుట, కండ్లయెముటవాలు

తురుతో కూడిన చుక్కలును, మబ్బుగను, వస్తువులు చెదరినట్లును అగుపడుట, పాపలు పెద్దవగుట.

ముఖము:—పక్షవాతము వచ్చుట (జింకంపిక్రికం).

అన్నకోశము:— అన్నహితవులేమి. నోరు చేదుగాయుండుట. తరుచు వమనములగుచుండుట. కడుపు బరువుగాయుండుట. అపానవాయువు తరుచు వెడలుచుండును. ఉదయమున గంజివలె పసుపుపచ్చని లేక గోధుమరంగుగా పల్చనివి రేచనము లగుచుండుట.

మూత్రావయవములు:—మూత్రము స్వల్పముగా వెడలుచుండుట. మూత్రపిండములలో బలముతగ్గుట. దీనివలన రక్తముతో కూడి ముదగ రంగుగా స్వల్పముగా మూత్రము వెడలుచుండుట రాత్రియందు మూత్రము విడుచుటకు ఎక్కువతొందర గలుగుచుండుట మూత్రములో శ్వేతధాతువు పంచదారవంటి పదార్థమును కలిసిపోవుచుండుట మూత్రకోశమునందు కూడ బలము తగ్గియుండుట. ప్రోస్టేటుగ్రంధివాపు (ఫెర్రింపిక్రికం).

పురుషావయవములు:—స్ఖలనానంతరము అమితమైన నీరసము. వృషణములలోను, రేతోవాహికలలోను బాధతోకూడిన అధికమైన లేపనము. స్త్రీ కనబడినయెడల వెంటనే శృంగారసంబంధమైన ఊహలు స్ఫురించుట. రాత్రింబవళ్లు విడవకుండా లేపనము ఎక్కువగానుండుటవల్ల నిద్రలేకపోవుట. శుక్లనష్టము మరియు నపుంసకత్వము, మానసికదుర్బలత్వముతో కూడియున్నపుడిది బాగుగా పనిచేయును.

స్త్రీఅవయవములు:—మర్మావయవమున ఎడమవైపు నొప్పి, కుసుమ, పోటు. ఇవి బహిష్టుకుముందు గలుగుచుండుట. బహిష్టు ఆలస్యముగా నగుట. అపరిమితమైన దురద.

కాళ్లు, చేతులు:—మేహవాతపు నొప్పులు, కొలదిదూరము నడచిన యెడల నీరసము, బరువు కలుగుట. మొద్దుబారుట. పురుగులు ప్రాకుచున్నట్లును, సూదులతో గ్రుచ్చుచున్నట్లును యుండుట. మంచు శీతలము

వలన కలిగెడి బాధలను పోలినబాధలు గలుగుట. కాళ్లు చల్లగానుండుట. దిగువనుండి పైకి ఎగబ్రాకునట్టి పక్షవాతము. కండరములలో బలములేకుం డుట.

చర్మము:— మొటిమలు, చీముపెడలునట్టి ఎఱ్ఱని కురుపులు ముఖము మీద బయలుదేరుట. ఇవి రాత్రియందు దురదగాయుండుట. కాలేయ ములో జబ్బుతోకూడి కామెర్లరోగముగలిగి చర్మము పచ్చగానగుపడుట.

నిద్ర:— దేవాలయమునకు వెళ్ళినప్పుడు తరుచు నిద్రవచ్చుచుండుట. మధ్యాహ్నము ఒకగంటపరుండినయెడల సౌఖ్యముగా నుండుట. సాయం కాలము నిద్రమత్తుగా నుండుట. రాత్రియంతయు నిద్రయుండకపోవుట. అమితమైన ఆలోచనలవలన ఆలస్యముగా నిద్రపట్టుట. ఉదయమున మెల కువ త్వరగా వచ్చునపుడు, లేచుటకు మామూలువేళ అగుపరకును, పనికి పాట్లుపడుచునే యుండుట. ఎల్లప్పుడును కలలు వచ్చుచుండుట. తాను గర్భవతినైతినని కలగనుట.

జ్వరము:—చలి, కాళ్ళు చేతులు చల్లగానుండుట, పగలు కాళ్లకు చేతులకు చెమటపట్టుచుండుట. వీపు వెచ్చగానుండుట.

ఉద్రేకము:—స్వల్పమైన మానసికపరిశ్రమవలన,నిద్రానంతరమున, తేమగాలివలన.

ఉపశమనము:—చల్లనిగాలివలన, చల్లనినీళ్లవలన, నొక్కుటవలన.

వేసవిలో ఉద్రేకించు రోగగుణములలో దీనిని వాడినయెడల ఆగు ణములు వెంటనే ఉపశమించును.

పోలికలు:—జల్సీమియం, సైలీషియా, ఫాస్ఫరసు, ఆగ్జాలికంయా సిడం, ఆర్జెంటంనిట్.

మోతాదు:— 6 మొదలు 200 పొటెన్సీ.

## 279. యాసిడ్ సక్సినికం. ACID SUCCINICUM.

ఇది శ్వాసకోశసంబంధమైన వ్యాధులలో బాగుగా పనిచేయును.

రొంప, తుమ్ములు, ముక్కునుండి నీరువంటి స్రావముతోకూడిన జ్వరములు, శ్వాసనాళములలో వాపు; దీనితోకూడిన ఉబ్బసము, గుండెల లోనొప్పులు యుండుట. దీని వుపయోగమును సూచించును.

కనురెప్పలు, ముక్కు, దురద; ఈగుణములు చలిగాలివలన ఉద్రేకించుట. గాలి విస్తారము వీచునపుడు ముక్కుసంబంధమైన వ్యాధులు ఉద్రేకించుట.

ఇది ఉబ్బసము, దగ్గు, తుమ్ములు, ఏడ్చుట, ముక్కునుండినీళ్లవంటి స్రావముకారుచుండుట (సెబాడిల్లా), ఛాతీలోనొప్పులకు పనిచేయును.

పోలికలు:— వయేథియా, సెబాడిల్లా.

మోతాదు.—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 280. యాసిడ్ సల్ఫ్యూరిక్. ACID SULPHURIC.

శరీరములో మిక్కిలి నిస్త్రాణ, వణకు యుండినను పైకి ఇది కనబడకుండుట. బిడ్డశరీరమును ఎంతజాగ్రతగా తోమి నీళ్ళుపోసినను పుల్లని వాసనతోనే యుండుట (హెపారుసల్ఫ, మెగ్నీషియాకార్బ, రియం), బ్రాంది విస్కీ త్రాగుటవలన వచ్చురోగములు, ముసలివారికిని, ముఖ్యముగా స్త్రీలకును, పల్చని వెంట్రుకలుగలవారికిని వచ్చు రోగములు; జీర్ణకోశమునకు సంబంధించిన నీరసము, రోగి ఎల్లప్పుడును ఉద్రేకమునిచ్చు పదార్థములనే కోరుట, ప్రతివిషయములోను తొందర ఎక్కువగానుండుట (ఆర్జెంటంనిట్), తరుచు ఉడుకు తగులుచుండుట, అటుపిమ్మట వణుకు, చెమటగలుగుట, కముకుదెబ్బలుతగిలిన భాగము త్వరగా నల్లనారంభించుట, వ్రాతగాండ్రు వ్రేళ్ళువంగకపోవుట, కంపమునొందుట, నొప్పిగా యుండుట, విస్తారము సీసము (Lead) సంబంధమైన మందులు ఉప

యోగించుటవలన కలిగిన దోషములు, ప్రసవానంతరము స్రావము ఎక్కువగా వెడలుట—ఇవి దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—భయము, ఆతురత, తొందరతో కూడియుండుట. ప్రతి ప్రశ్నకు సమాధానము యిచ్చుటకు ఇష్టముండకపోవుట.

తల:—కుడిపార్శ్వమందు నొప్పి. అకస్మాత్తుగా వచ్చుచుండుట. మెదడు ఒకప్రక్కనుండి మరియొకప్రక్కకు పడుచున్నట్లు తోచుట. (బెల్లడోనా, బ్రియోనియా, స్ట్రెజీలియా, రూస్టాక్సు). నడినెత్తి గట్టిగా నొక్కుచున్నట్లు నొప్పి, చేతులలో తలనుపట్టుకొనినయెడల ఈనొప్పి ఉపశమించుట. కుడివైపు కనుబొమలో కొయ్యకొట్టినట్లు నొప్పి.

కన్నులు:—దెబ్బలవలన గ్రుడ్డులోనుండివచ్చు రక్తస్రావము.

ముఖము:—కోడిగ్రుడ్డులోని తెల్లనిచొన పూసి ఆరబెట్టినట్లుగా బిగపట్టినట్లుండుట. మిక్కిలి బాధతో నెమ్మదిగావచ్చి ఆకస్మికముగా మాయమగునట్టి పార్శ్వపునొప్పులు.

నోరు:—నోటిలో విస్తారముగా నీరూరుట, ఇగుళ్లనుండి రక్తము, చీము స్రవించుచుండుట, నోటినుండి దుర్వాసన (బొరాక్సు). ఇది పయోరియా (Pyorrhoea) అనబడు (ఇగుళ్లనుండి రక్తము, చీము కారుట, దుర్వాసనగల) రోగమును మాన్పును.

పొత్తికడుపు:—నీరసము, నడుములోను తుంట్లలోను దిగలాగుచున్నట్లునొప్పి. గిలక (Inguinal Hernia) ముందుకు చొరుచుకొని వచ్చునటుకొనుట, ఇది ఎడమవైపున ఎక్కువగ అగుపడుట.

మలము, మలాశయము;—మలము చిన్న చిన్న వుండలవలె వెడలుట. మూలశంఖ బాధ, దురదతో కూడియుండుట. ఇవి విరేచనమగునపుడును త్రాగుబోతులలోను ఎక్కువగా నుండుట.

ఆసనము:—మూలశంఖ. తేమతోనుండుట. ఆసనమువద్ద పెద్దబంతి యున్నట్లుతోచుట. దుర్వాసనతోకూడిన నల్లని నీళ్లవిరేచనములు, దీనితో

పాటు దేహము పుల్లనివాసనవేయుట. కడుపు గుల్లగానున్నట్లు అగుపడుట.

పురుషావయవములు:—మర్మావయవములును, వృషణములును వెచ్చగానుండుట. సంభోగేచ్ఛవిశేషముగా లేకుండగనే స్ఖలనమగుట. కుడివృషణము వాపు, నొప్పి, పోటు, బాధ.

స్త్రీఅవయవములు:—ఋతువు మామూలుకన్న ముందుగా అగుట. ఋతురక్తము విస్తారముగాఅగుట. వయస్సుమీరినవారిలో మర్మావయవములలో పుండుపడి దానినుండి రక్తము సులభముగా స్రవించుట. మంటతోను ఆముమువంటి పదార్థముతోను కూడిన రక్తకుసుమ. ముట్టుడుగుకాలములలో అప్పుడప్పుడు ఉడుకుచేయుచుండుట. ఋతుస్రావము ఎక్కువగా అగుచు తరుచు బహిష్టుఅగువారిలో గొడ్డుతనమును పోగొట్టును.

శ్వాసకోశములు:—శ్వాస బహుత్వరితముగా నుండుట. ముక్కుపైభాగములోని కండరములలో పొడుచుచున్నట్లుండుట; ముక్కు దిగువభాగము రెండువైపులను కదలుచుండుట; ఇవి అన్నియు స్వరపేటిక పైకినికిందికిని త్వరితముగా కదలుచుండుటతో కూడియుండుట. పిల్లలలో రొమ్ముపడిశెము(బ్రాంకైటిసు), కొద్దికొద్దిగానున్న, విడవకుండానుయుండెడిదగ్గు. క్షయరోగముయొక్క ప్రథమావస్థలో నిస్త్రాణను, చెమటను మాన్పును.

కాళ్ళు, చేతులు:—చేతులలోను, దండలలోను, నరములలోను నొప్పులు. పక్షవాతములోవలె ముడుచుకొనిపోవుట. వ్రాయునపుడు వేళ్ళు కదలిపోవుచుండుట.

చర్మము:—దెబ్బవలన కమికిపోవుట, కమికినచోట త్వరగా మానవటువంటి నీలిరంగుమచ్చలు పడుట, వీటికి ఆర్నికాతరువాత దీనిని వాడిన బాగుగా పనిచేయును. దెబ్బలవలనకలిగిన నిస్త్రాణ (యాసిడ్ ఎసెటిక్). దురదతోకూడిన ఎఱ్ఱనిమచ్చలు, నల్లనిరక్తము స్రవించుట. ఎల్లప్పుడు ఘరుండియుండుటవలన పడకగాపడముపల్లకలిగిన పుండ్లనుకూడ

దీనిని వాడవచ్చును. కాళ్ల ఒరుపులవలన కాళ్ళ చర్మము కుళ్లునట్లుండుట. రాచకురుపులు, ఇతరమైన కురుపులు మరియు క్రిముల (Streptococcic and Staphylococcic) సంబంధమైన అంటువ్యాధులలో దీనిని వాడవగును.

జ్వరము:—క్షయవ్యాధిలోవచ్చు జ్వరము, టైఫసుజ్వరము, రిస్ప్రా నతోకూడిన సన్నిపాతజ్వరము, విషజ్వరములలోకూడ ఇది బాగుగా పని చేయును. సాయంకాలమందును, పరుపుమీద పరుండినపుడును వేడి ఎక్కు వగుట. సాధారణముగ ఎల్లప్పుడును ఉడుకు కనబడుచునేయుండుట. నాడి సన్నముగాను, బలహీనముగాను యుండుట. కదలనయెడల చెమటపట్టుచుం డుట; కూర్చున్న కొంతసేపటికికాని చమటమానకుండుట. ఉదయమునను, రాత్రియందును చెమట ఎక్కువగాయుండుట. వేడియైన భోజనము చేసిన వెంటనే చల్లనిచెమటపట్టుట.

ఉద్రేకము:—పూర్వాహ్నమందు, బహిరంగమైనగాలిలో, భోజ నానంతరమున, సాయంకాలమందు, అధికమైన వేడివలనలేక శీతలమువలన.

ఉపశమనము:—వేసవిదినమువలన, బాధకలిగినవైపుపరుండుటతో.

దీనికి వెనుక సల్ఫటిల్లా వాడినయెడల దీనిపనిని పూర్తి చేయును.

విరుగుళ్లు:—పల్సటిల్లా.

పోలికలు:—కాస్టికం, యాసిడుమూరు, సల్ఫరు, క్రొటేలను, యాసి డునైట్రికు, అర్నికా, కాలెండ్యులా, లెడం, సేపియా, కాల్కేరియాకార్బ.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకాలపరిమితి నాల్గువారములు.

---

## 281. యాసిడ్ యూరిక్. ACID URIC.

మహావాతము, గౌటు (Gout) లమీదనిది అమోఘముగా పనిచే యును. యూరిక్ యాసిడ్ శరీరమునందు నిలువ యగుటవలన కీళ్లలో

వచ్చు పలువిధములగు నొప్పులు, బాధలు, కీళ్ళు వంగకపోవుట, పట్టుపట్టి నట్లుండుట, మేహవాతదోషముతో గూడిన ఒకవిధమగు ఎగ్జిమా అనబడు చర్మవ్యాధి బయలుదేరుట—వీటినిదిమాన్పును.

పోలికలు:—యూర్టికాయూరెన్సు, నేట్రంఫాసు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 282. ఎల్యూమెన్. ALUMEN.

ఇది ముఖ్యముగా మలాశయరోగములమీద పనిచేయును. విరేచన బద్ధమును మాన్పుటలోను; సన్నిపాతజ్వరములో మలముతోపాటు ఆసన మునుండి రక్తము వెడలుటను కట్టుటలోను చాల వుపయోగపడును. ఇదిగాక నరముల దుర్బలత్వమువలన గలిగిన పక్షవాతసంబంధమైన దోషములను కూడ హరించును. ముసలివారిలో శ్లేష్మదేరికమును మాన్పు ను. వాలుకకు, ఆసనమునకు సంబంధించిన కండరములు మరియు గర్భా శయము గట్టిపడిపోవుటను మాన్పును. దుర్వ్యర్థలవలనను, కండ్లకును పం డ్లకును శస్త్రచికిత్స చేసినపిమ్మటను వచ్చినరోగములమీదనిది బాగుగా పని చేయును.

తల:—నడినెత్తిపైని మంటతోకూడిన భారము, ఇది చేతితో గట్టి గా నొక్కినయెడల ఉపశమించుట. తలతిప్పు, వికారము, తలవెంట్రుక లూడిపోవుచుండుట. కుడివైపు మెల్లకన్నుయొక్క దృష్టి ముక్కుకొనను చూచుచుండుట. అంతరకుసుమ లేక కేటరాక్టుకు శస్త్రచికిత్సానంతరము కనీనికాపటలము వెలుపలకు వచ్చుట. కొవ్వువత్తి వెలుతురున ఒకవస్తువు రెండువస్తువులుగా గనబడుట.

గొంతుక:—గొంతుక లోపలిపొరవాచి ఎర్రబడుట. దగ్గును గొం తుకరొంపను, పెద్దవై గట్టిపడినట్టి గవదకాయలను, బొంగురుతనమును, గొంతుక నొక్కబడినట్లుండుటను మాన్పును. గొంతుకనొప్పితోపాటు

కొండనాలుక వాలుట లేక పొడుగగుటను మాన్పును.

నోరు:—పండ్లూడతీసిన పిమ్మట వచ్చు అధిక రక్తస్రావమును కట్టును. పండ్లు కదలుచుండుట. చిగుళ్లు వాపు, విస్తరించునట్టి పుండ్లు. నాలుక పొడిగాను, మంటగాను వుండుట.

హృదయము:—కుడివైపున పరుండినచో గుండెదడగానుండుట.

ఆసనము:—ఎక్కువ విరేచనబద్ధము, రోజులకొలది విరేచనాను మానము లేకపోవుట తెల్లని విరేచనములు, ఆసనము దురద, మూలశంఖ, ఆసనమునుండి రక్తస్రావము.

స్త్రీఅవయవములు:—చిరకాలమునుండియున్న పసుపుపచ్చని స్రావము. జీర్ణించిన సెగ, దీనివలన పసుపుపచ్చని స్రావము ముద్దముద్దలవలె పోవుచుండుట బుతుస్రావము నీళ్లవలె పల్చగా వెడలుట.

శ్వాసావయవములు:—రక్త స్రావము. ఛాతీలో నీరసముగానుండుట శ్లేష్మమును వెలువరించుట చాలకష్టముగానుండుట (సెనీగా). ఉబ్బసపు దగ్గు, ముసలివారిలో ప్రాతఃకాలమున చిక్కని శ్లేష్మము పడుచుండుట.

చర్మము:—పుండ్లు. రక్తనాళములు చెడిపోయివాటినుండిరక్తము స్రవించుచుండుట. మాంసగ్రంధులు గట్టిపడి, ఎర్రబారి, బాధగానుండుట. వెంట్రుక లూడుచుండుట. వృషణములపై మంత్రినుపొక్కులు బయలుదేరి దురదగా నుండుట. చర్మముపైని కొద్దిగా గీసుకుపోయినను విశేషమైన రక్తస్రావము కలుగుట.

కాళ్లు, చేతులు:—కండరము లన్నిటిలోను నీరసముగా నుండుట. కాళ్లు చేతులు పీకుచుండుట లేక లాగుచుండుట. ఒకప్పుడు ముడుచుకొని పోయినట్లుండి వంచుటకు బాధగానుండుట.

ఉద్రేకము:—శీతలమువలన.

విరుగుళ్లు:—కేమోమిల్లా, నక్సువామికా, ఇపెకాక్; సల్ఫరు.

పోలికలు:—ఎల్యూమినా, కేప్సికం, యాసిడుమూరు, మెర్క్యూరియసు, యాసిడునైట్రిక్, ప్లాటినా, ప్లంబం మెట్, జింకం మెట్.

మోతాదు:—$6_X$ మొదలు 200 పొటెన్సీ.

మదిరగెయినుల పటికను గుండచేసి చప్పరించిన ఉబ్బసపుదగ్గుయొక్క ఉదుృతము తగ్గును.

---

## 283. ఎల్యూమినా. ALUMINA.

శరీరము పల్చనై, అరిపోయినశరీరులకు, నీరసముగలవారికిని, ముసలివారికి లేక చిన్నవయస్సులోనే శరీరపాటవము తప్పి ముసలివారివలె నగుపడువారికి, డబ్బాపాలు (Condensed Milk) మొదలగు ఆహారముచే పోషింపబడు సున్నితమైన పిల్లలకువచ్చు రోగములమీద, నిది బాగుగా పనిచేయును. స్త్రీలలో కుసుమను, విరేచనబద్ధమును మాన్పును. ఇది స్రావముతోకూడిన రోగములు అనగా పడిశెము, కుసుమ, సెగ, కండ్లకలక, వీటిమీదను మరియు దీర్ఘవ్యాధులమీదను, వాత తత్వముమీదను; కోపమువల్లను అశాభంగమువల్లను, అధికమైన శారీర పరిశ్రమవల్లను కలుగు వ్యాధులలోను యిది బాగుగా పనిచేయును.

మనస్సు:—కత్తినిగాని, రక్తమునుగాని చూచినపుడు ఆత్మహత్య చేసుకొనవలెనని వుండుట. మనోధైర్యముండకపోవుట. మందముగాను, విచారములోను వుండుట. అతి తొందర, చురుకుదనము.

తల:—పల్చని శరీరముగలవారికివచ్చు శిరోఘాతము. కట్టుచున్నట్లు వుండుట. మంట, వికారముతోకూడిన తలనొప్పి, ఇది ఉదయమున ఎక్కువగానుండినను, ఆహారము తీసుకొనినవెంటనే ఉపశమించుట. హృదయ వేగముతోకూడిన తలనొప్పి. తలనొప్పి విరేచనబద్ధముతోకూడి యుండుట. తలవెంట్రుకలూడుట. తల దురదగాను మొద్దుబారియు యుండుట. తల తిప్పుతోకూడిన వమనములు.

కన్నులు:—రెప్పలు పొడిగాను, మంటతోను, సూదులతో గ్రుచ్చుచున్నట్లును, దళసరిగాను వుండుట. ఈబాధలు ఉదయమున ఎక్కువగా నుండుట. పుసులుకట్టుట, ఎఱ్ఱబడుట, అంటుకొనుట, వస్తువులు పసుపువచ్చగా నగుపడుట.

చెవులు:—హోరు, ధ్వనులు వినబడుట, దిబ్బడవేయుట.

ముక్కు:—పక్కులుకట్టి పచ్చనిస్రావముతో కూడి యుండుట. వాసన అంతగా తెలియకుండుట. నీళ్లు కారుచుండుట. ముక్కు ఒరిసి ఎఱ్ఱగానుండుట. ముక్కుచివరను పగులుట. ముక్కు మొదటనొప్పిగానుండుట.

ముఖము:—రక్తపుగెడ్డలు, మొటిమలు. భోజనానంతరము ముఖము కందుట.

అన్నకోశము:—స్వభావ విరుద్ధమైనట్టియు, అజీర్ణము గలుగజేయునట్టియు పిండిపదార్థములను, గుడ్డపేలికలను, లవంగములు, మట్టి, సుద్ద, మసిబొగ్గు, అరిపోయిన అహారమును కోరుట. పచ్చనిశరీరము కలవారిలో కలుగు తేన్పులు, అజీర్ణమువలన కడుపులోను గుండెలలోను మంట వచ్చుట. మాంసమునందయిష్టత (గ్రాఫైటీసు, అర్నికా, పల్సటిల్లా). బంగాళాదుంపలు వికటించుట. ఆకలిలేమి. చిన్నచిన్న ముద్దలుతినుచుండుట. అన్నకోశద్వారము నొక్కుకొనిపోయినట్లుండుట.

నోరు:—దుర్వాసనతో కూడిన పుండ్లు, యిగుళ్ళనుండి రక్తస్రావము, వాపు. నములునప్పుడుగాని నోరువిప్పినగాని, దవడకదలిన యెడల బాధగానుండుట. గొంతుక ఆర్చుకొనిపోయి దగ్గువచ్చుట. చిక్కని ఆమము వెడలుచుండుట.

పొత్తికడుపు:—శూల. ఎడమవైపున వచ్చు రోగములు.

మలము, మలాశయము:—మలము గట్టిగా ఆరిపోయి ఉండవలె వెడలుట. విరేచనానుమానము కలుగకుండుట (బ్రయోనియా). ఆసనములో మంట, తీపు, గుల, వాపు, వచ్చుట, రక్తస్రావములు. మలము

మెత్తగానున్నను వెడలుట కష్టమగుట (ఎనకార్డియం, ప్లాటినా, సైలీషియా, సేపియా, విరేట్రింఆల్బం). తినకవలసివచ్చుచుండుట. పసిపిల్లల విరేచనబద్ధమునకిది చాలమంచిది (కాలిన్సోనియా, సోరినం, వెరథిను). ఇది ముసలివారికిని (లైకోపోడియం), శరీరవ్యాయామము లేని స్త్రీలకును బాగుగా పని చేయును. చాలసేపు తినికినసిమ్మట గాని విరేచనమువక పోవుట. మూత్రవిసర్జనముతో పాటు నీళ్లవిరేచనము లగుట. ఒకప్పుడు నిలుచుండిన గాని విరేచనమవక పోవుట (కాష్టికం).

పురుషావయవములు.—అమితమైన సంభోగేచ్ఛ. విరేచనమగుటకు తినుకునపుడు అప్రయత్నముగా స్ఖలనమగుట. ప్రాస్టేటుగ్రంథినుండి స్రావము వెడలుట.

స్త్రీ అవయవములు:—మామూలుకన్న చాలముందుగా బహిష్టు అగుట. స్రావము పాలిపోయి బహుతక్కువగా నగుట, మిక్కిలి నిస్త్రాణ (కార్బోయానిమలిస్, కాక్యులసు). కుసుమ విస్తారముగాను, చిక్కగాను, మంటతోను, రంగులేకయు, ఒరుపుతోను, బహిష్టుకు తరువాతను, పగలు ఎక్కువగాను వెడలుచుండుట. దీనిని చన్నీళ్లతో కడిగిన ఉపశమించుట. కుసుమ చీలమండలవరకును కారుచుండుట (సిఫిలినం).

శ్వాసకోశములు:—ఉదయమున మెలుకువవచ్చినపుడు దగ్గువచ్చుట. ఉదయమున మాట్లాడుచున్నను దగ్గు వచ్చుట. మిరియము, అవ, మొదలగు కారపు పదార్థములు తినినయెడల దగ్గువచ్చుట. మాట్లాడుటవలన ఛాతీలో బరువుగానుండుట. శ్వాస అందక పోవుట రాత్రియందెక్కువగా నుండుట.

నడుము:—గుచ్చుచున్నట్లును, పొడుచుచున్నట్లును వుండుట. వెన్నెముక పొడుగునను బాధగానుండుట.

కాళ్లు, చేతులు:— సాయంకాలమందు దిగువ అవయవములు భారముగానుండుట. నడుచునపుడు తూలుచుండుటవలన కూర్చుండవలసివచ్చుట. అరికాళ్లు మొద్దుబారుట. చేతులు వేళ్లు వెచ్చగాను, నొప్పిగాను వుండుట. గోళ్లు పెళుసుగా నుండుట.

చర్మము:—భరింపలేనంతటి దురద. రక్తము వచ్చువరకు బరుకుట. అటుపిమ్మట బాధగానుండుట. దురదపొక్కులు, వర్షకాలములో ఎక్కువగుచుండుట (పెట్రోలియం).

ఉద్రేకము:—పౌర్ణమికి, అమావాస్యకు, అపరాహ్ణమందు, బంగాళాదుంపలు తినుటవల్ల, ఉదయమున లేచినపుడు, వెచ్చనిగదిలో నుండుటవలన.

ఉపశమనము:—బహిరంగమైన గాలిలో, చన్నీళ్లతో కడుగుట వలన, రోజువిడిచిరోజున, తేమగాలిలో.

సహచరులు:—బ్రియోనియా.

పోలికలు:—సెకెలే, సిలికా, ప్లంబంమెట్, లెతిరస్, ఎల్యూమినియం.

విరుగుళ్లు:—ఇపెకాక్, కెమోమిల్లా, కేంఫరు, బ్రియోనియా.

మోతాదు:—6 x మొదలు 1000 పొటెన్సీ. ఇది క్రియగా పనిచేయును. దీనిగుణకాలపరిమితి నలుబది దినములకు పైగాయుండును.

---

## 284. ఎల్యూమినా ఫాసు. ALUMINA PHOS.

రోగి బహునిస్త్రాణగా యుండుట. దిగువ అవయవములలో పక్షవాతమునకిది దివ్యౌషధము. దీని నిస్త్రాణ అధికసంభోగమువలన వచ్చిన నిస్త్రాణను పోలియుండును. పక్షవాతము బాధలేకుండగ నుండుట. రోగి బహిరంగమైన గాలినే కోరుచుండుటయున్నపుడు దీనిని వాడవగును. నరముల సంబంధమైన దీర్ఘరోగములమీద నిది బాగుగా పనిచేయును.

మనస్సు:—నిలకడలేమి. ప్రాణమునందు నిరాశ చెందియుండుట. విచారమువలన కలిగిన రోగములలో ఇగ్నేషియా వాడినపిమ్మట దీనిని వాడదగును, మానసిక దుర్బలత్వము ఎక్కువగానుండుట. మానసిక పరిశ్రమ

వలనను, అధికసంభోగమువలనను కలిగిన నిస్త్రాణను పోగొట్టును. మఱిశేని వానివలె మాట్లాడుట.

తల:—దినమునిడిచిదినము తలనొప్పి వచ్చుచుండుట.

కన్నులు:— రాత్రిఅంటుకొనుట. పసుపుపచ్చని స్రావము.ఆర్చుకు పోయినట్లుండుట. చదువుట కష్టముగానుండుట. కండ్లయెదుట పలువిధ రంగులు కనబడుట, దృష్టిమాంద్యము, కనురెప్పలు దురద, కనురెప్పల చివరను కాయలవలెలేచుట. కన్నులెరుపెక్కుట. కనుపొట్టలు ఉబ్బుట.

చెవులు:—ఎడతెగని స్రావము, చెవులు ఎర్రగాను, వెచ్చగాను, ఉండుట. చెవులలోధ్వనులు. చెవులలో చీల్చుచున్నట్లు బాధగానుండుట. చెవినుండి రసికారుట.

ముక్కు:—ఎరుపు, దురద, ముక్కుదిబ్బడవేయుట, వాసనతెలియక పోవుట, తరుచు తుమ్ములువచ్చుట. స్రావము, దగ్గువచ్చుట. పచ్చనిలేక రక్తముతో కూడిన స్రావము వెడలుట.

ముఖము:— మొటిమలు, చెమట. పొంగరింపు.

నోరు:—చేదుగానుండుట. ఇగుళ్ళువాచి, వీటినుండిరక్తము వెడలుట నాలుక తెల్లగానుండుట మంటతో కూడిన పుండ్లుపడుట. గొంతుక శ్లేష్మముతో చుట్టుకొనుటవలన తరుచ ఖాండ్రించి ఉమ్మివేయవలసి వచ్చుచుండుట. గొంతుకలోని గవదకాయలు వాచుట.

అన్నకోశము:—దగ్గుతో పాటు వమనము వచ్చుట. ఎక్కువదాహము అజీర్ణమువలన ఛాతీలోమంట. అగ్నిమాంద్యము, అతిఆకలి వున్నను ఆహారముయందు హితవుండకపోవుట. మామూలుగా ఉపయోగించుచున్న చుట్టలు, బీరు (Beer) నందును, మరియు ఆహారమందును కూడ యిష్టముండకపోవుట.

పొత్తికడుపు:—వాయుపూరితమై కడుపు వుబ్బరించియుండుట. శూల. తీరని విరేచనబద్ధము. ఆసనముసద్ద చీమలు పాకుచున్నట్లు వుం

డుట. భగందరము. అపానవాయువు మిక్కిలి దుర్వాసనగా నుండుట. వెలుపలికివచ్చు మూలశంఖ, దీనినుండిరక్తస్రావము, నడచుటవలన ఇది ఎక్కువగుట.

పురుషావయవములు:— జీర్ణించిన సెగ. పచ్చసెగకిది దివ్యౌషధము. మూత్రనాళమువాపు, మడ్డితోకూడిన మూత్రము వెడలుచుండుట. రాత్రులయందు లేపనశక్తి ఎక్కువగుట. వృషణములవాపు.

స్త్రీఅవయవములు:—సంభోగేచ్ఛ లేకుండుట. పుండును చేయునట్టి కుసుమ; యిది రక్తముతో కలసివెడలుట. ఋతుస్రావము తక్కువగా నుండుట. వివిధఋతుదోషములమీదనిది పనిచేయును. మర్మావయవములో పుండ్లు బయలుదేరుట.

కాళ్ళు, చేతులు:—కంపముతోకూడిన రోగములలో, కండరములకు కంపము గలుగుట. అపస్మారము, మూర్ఛ, దీనివలన భూమిమీద రోగి స్మారకముతప్పి పడిపోవుట, కొయ్యబారుట, వణుకు జెందుట. నడుచునపుడు తూలుచుండుట. ఆనికాయలు మంటగాను, పట్టుచున్నట్లును వుండుట. పిక్కలు లాగుచుండుట. కాళ్లమీద కురుపులువేచుట. చేతులు వెచ్చగానుండుట.

నిద్ర:—ఆతురతతో కూడియుండుట. విరామములేమి. తరుచు మెలకువ వచ్చుచుండుట.

జ్వరము:—దాహముండకపోవుట. రాత్రి చలిగానుండుట. ప్రతిదినము ఒకసారి చలితో జ్వరము వచ్చుచుండుట. చెమటయుండకపోవుట ఒకసారి వెచ్చదనము, ఒకసారి చలియుండుట.

చర్మము:—సులభముగా మాననటువంటి కురుపులు, పుండ్లు. ఇవి దురద, మంట, పోటుతోకూడియుండుట. మంత్రపుషాక్కులు. కురుపులనుండి రక్తము చీము వెడలుట. చీము పసుపుపచ్చగా నుండుట, చర్మము పచ్చబడుట.

ఉద్రేకము:—భోజనానంతరమున, శారీరపరిశ్రమవలన.

సరిపడనివి:—చల్లని ఆహారము, చల్లనిపానీయములు, పాలు, బంగాళాదుంపలు, వేడి ఆహారములు.

మోతాదు:—30, 200 పొటెన్సీలు.

---

## 285. ఎల్యూమినా సిలికేటా. ALUMINA SILICATA.

మెదడు, వెన్నెముక, ఆంత్రములు, నరములు, వీటికి సంబంధించిన దీర్ఘరోగముల మీద నిది బాగుగా పనిచేయును. రోగి బహిరంగమైనగాలిని కోరుచుండినను చలిగాలివలన రోగోద్రేకము హెంచుచుండుట, రోగములు క్రమముగా వృద్ధిజెందినపిమ్మటగాని గుర్తింపబడకపోవుట, మేహవాత తత్వములు (నేట్రంసల్ఫ), రోగి నిస్త్రాణజెంది ఆరుచ్చుకొనిపోవుట. బాధలు ఒకచోటనుండి మరియొకచోటునకు మారుచుండుట—ఇవి దీనివుపయోగమును సూచించును.

మెదడు:—అపస్మారము, మూర్ఛ మొదలగువాటివలన ఫిట్టువచ్చుచుండుట. పరధ్యానము, భయము, దృఢనిశ్చలత లేకపోవుట, తన్నుతానే నమ్మకుండుట. నరముల నిస్త్రాణ, జ్ఞాపకశక్తి తగ్గుట, విస్తారము మానసిక పరిశ్రమవలన కలుగు తలనొప్పులు. మెదడులో చీమలు పాకుచున్నట్లుండుట; క్రమముగా మెదడునుండి కాలివేళ్లవరకు చీమలుపాకుచున్నట్లుండుట.

తల:—తలతిప్పు, ముక్కునుండి చిక్కని పసుపుపచ్చని రంగుగల స్రావము, కండ్లు యెఱ్ఱనగుట, పుసులుగట్టుట, దృష్టిమాంద్యము. చెవులు వెచ్చగానుండుట, చెవులలో ధ్వనులు వినబడుట, పోటుగానుండుట, క్రమముగా చెముడువచ్చుట. ఇగుళ్లు వుబ్బుట, లాలాజలము యెక్కువగా వూరుట.

అన్నకోశము:— ఖాళీగానుండునప్పుడు చల్లగానుండుట. అతి

దాహము. భోజనానంతరము వాయువుతో కూడిన త్రేనుపులు, వమనములు, వుండుట. తినినఆహారము రుచింపకపోవుట. కాఫీ, మాంసము, భోజనము వీటియందయిష్టత. ఆకలి యెక్కువగానున్నను అన్నము హితవుగానుండక పోవుట. భోజనానంతరము పొట్టలో బరువుగానుండుట. త్రేనుపులు పుల్లగాను, చేదుగాను వుండుట. త్రేనుపులు వచ్చినపిమ్మట వుపశమనముగా నుండుట.

మలాశయము:—విశేషమలబద్ధము. విరేచనము కొద్దికొద్దిగాయగుట. ఒకప్పుడిదిశూల, బాధ రక్తముతో గూడియుండుట. అజీర్ణముతోగూడిన నీళ్లవిరేచనములు.

స్త్రీఅవయవములు:—గర్భాశయము బరువుగానుండి వెలుపలికి వచ్చుట. కుసుమ. ఋతువు సరిగానుండకపోవుట. ఋతుశూల. బహిష్టుకు బహిష్టుకు మధ్యను స్రావముగలుగుట.

మూత్రావయవములు:—మూత్రము యెఱ్ఱగా వెడలుట. మూత్రములో చీముకలిసి వెడలుట. అతిమూత్రము.

శ్వాసావయవములు:—ఊపిరి అందకపోవుట, జలుబుతో కూడిన దగ్గులు, నిస్త్రాణ. శీతగాలివలన దగ్గు యెక్కువగుట, ఛాతీలో యెక్కువ బాధ. శ్లేష్మము పసుపుపచ్చగాను, ఆకుపచ్చగాను వెడలుట. విస్త్రాగము దగ్గువలన శ్వాస ఆగిపోయినట్లుండుట.

జ్వరము:—జ్వరము రాత్రి 8 మొదలు 10 గంటలలోపుగా ప్రారంభించుట. జ్వరమున్నప్పుడు కాళ్లులాగుచుండుట.

చర్మము:—చల్లదనము, దురద, ఊదారంగుగాను వుండుట. మొటిమలు, సురుగుడుకాయలు, చిన్నచిన్నకంతులు బయలుదేరుట. పగుళ్లతో కూడిన చర్మరోగములు.

ఉద్రేకము:—చలిగాలివలన, పడకనుండి లేచుటవలన, వర్షకాలములో.

ఉపశమనము:—పరుండుటవలన.

మోతాదు:—6x మొదలు 1000 పొటెన్సీ.

---

## 286. ఎమోనియం ఎసెటేట్. AMMONIUM ACETICUM.

ముఖ్యముగా నిది పొట్టలోను, ముఖమునకును వృద్ధుకు తగులుటను మధుమూత్రమును, స్నానము చేసినట్లు తోచునంతటి చమటలుపోయుటను, తలభారమును మాన్పును.

పోలికలు:—నేట్రింమూరు, నేట్రింసల్ఫు, సిజీజియం జాంబోలినం.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 287. ఎమోనియంకార్బ్. AMMONIUM CARB.

సులభముగా జలుబు చేయుచు యాలసినట్లుండు స్థూలశరీరముగల స్త్రీల రోగములలో నిది బాగుగా పనిచేయును. వీరికి శరీరపరిశ్రమయుండదు. వీరికి బహిష్టుకునుందర కలరా చిహ్నములగపడుట; కొవ్వుపట్టిన రోగుల హృదయములలో కలుగు నీరసము, ఊపిరియాడకపోవుట రోగికి అన్ని యవయవములు భారముగానుండుట దీనివుపయోగమును సూచించును.

మనస్సు:—మాట్లాడుట కిష్టముండకపోవుట. మరుపు, విచారము, కోపము.

తల:—తలతిప్పు, సుత్తితో కొట్టుచున్నట్లు నొప్పిగానుండుట. తలవెంట్రుకలూడిపోవుటను మాన్పును.

కన్నులు:—రాత్రియందు కండ్లు అంటుకొనుట. కన్నుల నెక్కువగా వుపయోగించుటవలన జబ్బుచేయుట (నేట్రింమూరు). ఒకేవస్తువు రెండుగా కనపడుట. కేటరాక్టును మాన్పును.

చెవులు:—సరిగా వినబడకపోవుట, చెవులలో హోరు, చెవినుండి చీముకారుట.

ముక్కు:—ఉదయమున ముఖము కడుగుకొనునపుడు ముక్కునుండి రక్తస్రావము (ఆర్నికా, మెగ్నీషియాకార్బ, కాలీకార్బ) తరుచు ఎడమనాసికారంధ్రముగుండా వెడలుట.

నోరు:—నోరు, గొంతుక ఆర్చుకొనిపోవుట, పండ్లనలుపు. పండ్లు కదులుట, పాడైపోవుట, పుచ్చిపోవుట. గొంతుకవద్దనున్న మాంసగ్రంధులు వాచుట గవదకాయలమీద పుండ్లుబయలుదేరుట.

అన్నకోశము:—పులితేన్పులు, వమనము, భోజనానంతరము గుండెలలోమంట. ఆకలియెక్కువగానున్నను కొలది ఆహారముతోనే తృప్తిజెందుట. కడుపుబ్బరముతోకూడిన అజీర్ణము.

పొత్తికడుపు:—శూల విడిచివిడిచి వచ్చుచుండుట. దీనివలన రోగి చుట్టుకుపోవుట (కొలోసింథిస్). గుడగుడలాడుచుండుట. అపానవాయువుతోకూడిన శూల. మలము సరిగా వెడలకుండుట. ఆసనమునుండి రక్తము కూడ స్రవించుట. మలము వెడలునప్పుడు మూలశంఖ బయటకువచ్చుట. రక్తమువెడలునట్టి మూలశంఖ.

పురుషావయవములు:—కోరిక లేకపోయినను లేపనముండుట. శుక్లనష్టము.

స్త్రీఅవయవములు:—నిస్త్రాణవలన తలతిరిగి పడిపోవుదునను భయముచే స్మెల్లింగుసాల్టు (Smelling salt) బుడ్డిని దగ్గరనుంచుకొనుట. అట్టివారు నరములకు పుష్టినిచ్చునట్టి కేంఫరు, కస్తూరి (Musk) అల్కహాలు (Alcohol), స్పిరిట్సు ఎమోనియా (Spirits of Ammonia) లను కోరుచుండుట. ఎడతెగని ఋతుస్రావము. ఇది నల్లగానుండి, తగిలినచోట పుండుజేయుట. బహిష్టు అయినప్పుడు ఎక్కువ నిస్త్రాణగానుండుట. మర్మావయవము వాపు, దురద, మంటయుండుట.

ఋతువు మామూలుకన్న త్వరగాను స్రావమెక్కువగాను అగుట (ఎమో నియంమూరు).

మూత్రావయవములు:——మూత్రము కొద్దిగా వెడలినను పలుమారు మూత్రము విడువవలసియుండుట. ఒకప్పుడు పక్కమీదనే అప్రయత్నముగా మూత్రముపిడుచుట. మూత్రములో రక్తము కలిసిపోవుట.

శ్వాసకోశములు:——ముక్కుదిబ్బడవేయుటచే శ్వాస నోటితో పీల్చుట. దగ్గుయెక్కువగానున్నప్పుడు రక్తముకూడ స్రవించుట.

హృదయము:——బహునిస్త్రాణగా నుండుట. గుండెదడతోను కష్టమైన శ్వాసతోను మెలుకువవచ్చుట.

కాళ్ళు, చేతులు:——కీళ్లలో చీల్చుచున్నంత బాధగాయుండుట.అరికాళ్లలోను పిక్కలలోను లాగుచున్నట్లు నొప్పిగానుండుట.

నిద్ర:——పగలు నిద్ర మత్తుగానుండుట.

చర్మము:——దురద, మంటతోకూడిన నీటిపొక్కులు, కీళ్లసంధుల మధ్యను మంత్రపుపొక్కులు బయలుదేరుట.

జ్వరము:——రాత్రియందును, తెల్లవారుఝామునను చమటపట్టుట. సాయంకాలమునందు చలి, వణుకుయుండుట. నాడి గట్టిగాను, బింకముగాను ఎక్కువసార్లు కొట్టుకొనుచునుయుండుట.

విరుగుళ్లు:——ఆర్నికా, కేంఫరు, హెపారుసల్ఫ.

దీనికి ముందుగాని వెనుకగాని లెకెసిసును వాడరాదు.

రూస్టాక్సు, విషపురుగులుకుట్టుట——కు ఇది విరుగుడు.

పోలికలు.——రూస్టాక్సు, యాసిడుమూరు, యాంటిమొటార్టు, ఆర్సెనికం ఆల్బం, లెకిసిసు, ఆరంమెట్, పల్సటిల్లా, ఫాస్ఫరసు, సల్ఫరు.

ఉద్రేకము:——సాయంకాలమునందు, చల్లని లేక తేమతోకూడిన గాలివలన, చల్లని నీటితో కడుగుటవలన, సాయంకాలము 3, 4 గం

టలకు, బహిష్టులో.

ఉపశమనము:— బాధగానున్న వైపు పరుండుటవలన, పొడిగాలిలో.

పోతాదు:—6 x మొదలు 200 పొటెన్సీ.

---

## 288. ఎమోనియం కాస్టికం. AMMONIUM CAUSTICUM.

మూర్ఛ లేక అపస్మారము, మత్తుమందు ఎక్కువగుటవలని దుర్గుణములు, రక్తస్రావములు, పాముకాట్లు, వీటిలో దీనికి వాసనచూపించిన యెడల తాత్కాలిక వుపశమనముకలుగును. మరియు దీనివలన గుండెకును, శ్వాసావయవములకును బలము కలుగును.

మనస్సు:—పిరికిదనము.

ముక్కు:—దిబ్బడవేయుట. నీళ్లవంటి స్రావము.

గొంతుక:—బొంగురుపోవుట. గుటక వేయుట కష్టముగా నుండుట. కొండనాలుక ముడుచుకొనిపోవుట. కొండనాలుకమీద తెల్లనిపొరక్రమ్ముట. గవదకాయలు వాచుట. కొండనాలుకవాచుట, పొడుగగుట.

నోరు:—నాలుక మొదట గీచుచున్నట్లును, మంటగాను వుండుట. పెదవులు, ఇగుళ్లు, నాలుక వాచుట.

అన్నకోశము:—అమితమైనదాహము. రక్తము, ఆమముతో కూడిన వమనములు. వమనమగునపుడు తినిన ఆహారము ముక్కునుండియు, నోటినుండియు ఒక్కమారుగా వెలువడుట.

మలము, మలాశయము:—పెద్దపెద్దరక్తవిరేచనములు. ఆసనముతీపు.

మూత్రావయవములు:—మూత్రము ఎఱ్ఱగానుండుట.

స్త్రీఅవయవములు:—ఋతువు మామూలుకన్న 15 రోజులు ముందుగానగుట, స్రావమెక్కువగానగుట.

శ్వాసకోశములు:— జలుబుతోకూడిన దగ్గు. రక్తముతోకూడిన శ్లేష్మము ఎక్కువగా వెడలుట. ఊపిరిపీల్చుట కష్టముగానుండుట. ఊపిరి ఆడకపోవుట.

కాళ్లు, చేతులు:— మహావాతనొప్పులు. చర్మము వెచ్చగాను, ఆరిపోయి యుండుట. మిక్కిలి నీరసముగా నుండుట.

విరుగుళ్లు:—ద్రాక్షసారాయి (Vinegar) లేక శెనగపులును.

పోలికలు:—ఎమోనియంకార్బ.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. ఉపశమనముకొరకు 5 లగాయతు 10 చుక్కలు మదరుటించరును కొలదినీళ్లలో కలిపి పుచ్చుకొనవచ్చును.

బాహ్యోపయోగములు:— తేళ్లుగాని, మరి యితరజాతులవిషపురుగులుగాని కుట్టినప్పుడు కుట్టినచోట ఎఱ్ఱబారి మంటగానున్నప్పుడు వెంటనే దీనిని పట్టించినయెడల త్వరలో బాధతగ్గును. పాముకాటుకు కాటువేసినచోట దీనిని కొంతసేపు పట్టించుచుండినయెడలను, అరఔన్సు నీళ్లలో 5 చుక్కలు మదరుటించరునుకలిపి లోపలికి ప్రతి అరగంటకు ఒకసారి పుచ్చుకొనినయెడలను గుణమిచ్చును.

---

## 289. ఎమోనియం మూరు. AMMONIUM MUR.

స్థూలదేహముగలవారికిని, చురుకుదనములేనివారికిని వచ్చురోగముల మీద నిది పనిచేయును. సాధారణముగా ఇట్టివారికి కాళ్ళుపల్చగాను తక్కినశరీరము లావుగా క్రొవ్వుపట్టివుండును. వీరికివచ్చు శ్వాసకోశసంబంధమైన వ్యాధులమీద నిది బాగుగా పనిజేయును. సన్నిపాతజ్వరములోపలె నిస్త్రాణ యెక్కువగా నుండుట; రోగగుణములు దగ్గుతోను, నిగనిగలాడు పట్టె స్రావములతోను కూడియుండుట; తల, ఛాతీకి సంబంధించిన రోగగుణములు ఉదయమునను, అన్నకోశము, పొత్తికడుపునకు సంబంధించిన

గుణములు మధ్యాహ్నమునను; చర్మమునకు, జ్వరమునకు సంబంధించిన రోగ చిహ్నములు సాయంకాలమందును ఉద్రేకించుచుండుటయు, రోగి శరీరము యెప్పుడును వుడుకుచున్నట్లుగా నుండుటయు దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—విచారము, విచారమువలని బాధలు. పైకి ఏడ్వవలయునని యుండినను, నిజముగా పైకి ఏడ్వలేకుండుట.

తల:—దురద. చుండ్రు, వెండ్రుకలూడిపోవుట, నొక్కినట్లుండుట.

కన్నులు:—తెర వేసినట్లుండుట. పారిరంఘదళలోనున్న అంతరకుసుమలను (కేటరాక్టులను) మాన్పును.

ముక్కు:—దిబ్బడ వేయుట. వాసన తెలియకపోవుట.

అన్నకోశము:—లిమనేడ్ త్రాగవలయునని యుండుట. కడుపులో గుడగుడలాడుట, బాధగానుండుట. పుట్టవ్రణమును మాన్పును.

పొత్తికడుపు:—పట్టుకున్నట్లుండుట. కాలేయమువాపు.

మలము, మలాశయము:—అపానవాయువుతో కూడిన మలబద్ధము. విరేచనము గట్టిగానగుట. మలము మలాశయమునుండి బహుకష్టముతోను, ముక్కలుముక్కలుగాను వెలువడుట (మెగ్నీషియం మూరు). రెండుమార్లు వెళ్లినవిరేచనములు ఒకేరంగుగానుండకపోవుట (పల్సాటిల్లా). మూలశంఖలో తీపు, మంట, పోటు విరేచనమైన కొన్నిగంటలవరకు వుండును.

స్త్రీ అవయవములు:—ఋతువు మామూలుకన్న త్వరగాను, స్రావమెక్కువగాను వుండుట (ఎమోనియం కార్బ). దీనితోపాటు తొడలలో నొప్పులు గానుండుట. బహిష్టులో వమనములు, శీఘ్రవిరేచనములు, పాదములలో నొప్పులు వుండుట. రాత్రిభాగమందు ఋతుస్రావ మెక్కువగానుండుట (బొవిస్టా). క్రియసాటములో స్రావము పరుండినపుడు మాత్రమే అగును, మరియు కూర్చున్నప్పుడును, నడుచుచున్నప్పుడును అవదు. లిలియంటిగ్ లో స్రావము నడుచుచున్నప్పుడు మాత్రమే అగును మరియు నడుచుట

మానినప్పుడు స్రావ మాగిపోవును. మెగ్నీషియా కార్బునకు రాత్రియందును, పరుండినపుడును స్రావమగును మరియు నడుచునపుడు ఆగిపోవును. కనుక మూత్రవిసర్జనానంతరము బూడిదరంగుగాను, బాధ లేకుండగను అగుట నిది మాన్పును.

శ్వాసకోశములు:—రొంప, నీళ్లవంటిస్రావము, దీనివలన ముక్కు, పెదవులు ఒరియుట (ఏల్లియం సేపా).

ఛాతీ:—రెండుభుజములమధ్యను మిక్కిలి చల్లగానుండుట. ఇగి దగ్గు, ఛాతీలో నొప్పులు, వీటితోకూడియుండుట. ఇట్లుగాక లైకోపోడియమునకును, ఫాస్ఫరసునకును భుజములమధ్యను మంటగానుండును.

కాళ్లు, చేతులు:—చీలమండలలోనుండు నొప్పులమీద బాగుగా పనిచేయును (ఫైటోలక్కా, లిడం, కాస్టికం).

విరుగుళ్లు:—కాఫీ, నక్సువామికా, కాస్టికం.

పోలికలు:—కాల్కేరియా కార్బు, సెనీగా, కాస్టికం, నేట్రంమూరు, మెగ్నీషియా మూరు, రస్‌టాక్సు.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

---

## 290. ఎమోనియం వెలీరియానికం.

## AMMONIUM VALERIANICUM.

నరముల నిస్త్రాణ, హిస్టీరియా లేక అపస్మారముచే బాధపడు వారి లోకలుగు తలనొప్పులు, పార్శ్వపునొప్పులు, నిద్రలేమిని యిది మాన్పును. ఎప్పుడును నరములయందు వుద్రేకము ఎక్కువగా నుండుటనుమాన్పును.

హృదయము:—మిక్కిలి బాధగానుండుట. నరముల వుద్రేకము వలన గుండె వడిగాకొట్టుకొనుచుండుట.

మోతాదు:—6x మొదలు 30 పొటెన్సీ.

## 291. ఎమిల్ నైట్రోసం. AMYL NITROSUM.

నరములు, హృదయము వీటిసంబంధమైన పలువిధరోగములలో నిది వుపయోగపడును. గుండెదడ, ఎక్కిళ్లు, ఆవలింతలు (కాలీకార్బ) వచ్చుట, హిస్టీరియా లేక అపస్మారము, మూర్ఛ మొదలగు శరీరస్మారకము తెలియనటువంటి పాలి లేక ఫిట్టుతోకూడిన వాతరోగములు వచ్చుట, రోగి ఎప్పుడును స్వచ్ఛమైన గాలిని కోరుచుండుట, అందుచేత యింటితలుపులు తెరిచివుంచుచుండుట, తరుచు ముఖము, పొట్ట మొదలగు అవయవములు యెఱ్ఱగా కందుచుండుట, మత్తుమందు ఎక్కువగుటవలన కలిగిన దుర్గుణములు (వీటిలో దీనిని వాసనచూపించవలెను), శరీరమునందుగాని, మనస్సునందుగాని వుద్రేకమువలన ముఖమునందు రక్తప్రసరణము యెక్కువగుటచే ముఖము కందబారుట, ఇవి దీని వుపయోగమును సూచించును.

తల:—ఏదియో అవాంతరము జరుగునను అతురత, అందుచేత మన స్థిమితముండకపోవుట. ఎప్పుడును స్వచ్ఛమైన గాలిని కోరుచుండుట. ముఖము కందబారియుండుట. దిమ్ముతోకూడిన తలనొప్పివచ్చుట. కన్నులు యెఱ్ఱగానుండుట. దృష్టిచెదరుచుండుట. సూర్యరశ్మి తగిలినయెడల కండ్లలో పోటువచ్చుట. వస్తువులు కదలుచున్నట్లుండుట. కండ్లనుండి నీరు కారుచుండుట. తుమ్ములువచ్చుచుండుట.

అన్నకోశము:—వెచ్చన, మంట, ఎక్కిళ్లు, తలతిరుగుట, గుండెలాడుచుండుట, సముద్రప్రయాణమువలన కలిగిన తలత్రిప్పు,వమనము, అతితరుచుగా ఆవలింతలువచ్చుచుండుట (కాలీకార్బ).

పొత్తికడుపు:—కాలేయమువద్ద నొక్కుచున్నట్లుండుట. శూల.

శ్వాసకోశములు:—శ్వాస సరిగా అందకపోవుట, ఉబ్బసపురోగ గుణములు కనబడుచుండుట. ఫిట్టు విడిచివిడిచివచ్చుట. గుండెలలో బరువుగానుండుట. దగ్గు విడిచివిడిచివచ్చుచుండుట.

హృదయము:—గుండెదడ, దీనితోపాటు గుండెబిగపట్టినట్లును,

ముణుచుకొనిపోయినట్లును వుండుట.

స్త్రీఅవయవములు:—పొత్తికడుపుకు దిగువభాగమునందు కండర ములు ముడుచుకొనిపోవుట. బహిష్టు అయినప్పుడు యెడమపార్శ్వమున నొప్పి. రక్తాధిక్యముగల స్త్రీలలో ముట్లుడుగుకాలమందువచ్చు నరముల సంబంధమైన వ్యాధులలో నిది బాగుగా పనిచేయును. వీరికి తలనొప్పి, గుండెదడ, అప్పుడప్పుడు దేహము వెచ్చగానుండుట, ఆతురతగలుగుచుం డుట. వ్రిసవించినవెంటనే నరములనిస్త్రాణతో కూడిన హాతపుపోలివచ్చుట.

జ్వరము:—ఉడుకుజ్వరము, దీనివెంట అమితమైన చెమట. విష పడిశముపచ్చినపిమ్మట అమితముగా చెమటపోయుట. అతినిస్త్రాణను కలుగజేయునట్టి జ్వరములు వచ్చుచుండుట.

ఉద్రేకము:—శరీరమానసికోద్రేకములవలనవుద్రేకంచు వ్యాధులలో నిది బాగుగా పనిచేయును.

పోలికలు:—లెకెసిసు, గ్లనోయిన్, ఎకొనైట్, కేక్టసు.

విరుగుళ్లు:—కేక్టసు, స్ట్రిచినిసం.

స్ట్రిచినిసం—దీనికి విరుగుడు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ. టించరువాడినయెడల రోగో పశాంతి వెంటనే కనపడును. రోగనివృత్తికొరకు పొటెన్సీలనే వాడ వలయును.

బాహ్యప్రయోగములు:—దీనిని మదరుటించరురూపమున మూర్ఛ, హిస్టీరియా మొదలైన వణుకు, పాలితో కూడిన రోగములలో కొంచెము దూదిపైన వేసి వాసనచూపించినయెడల రోగికి వెంటనే తెలివివచ్చును. ఏవిధముననే మత్తుమందు ఎక్కువగుటవలన వచ్చిన దుర్గుణములకుకూడ దీనిని వాడవచ్చును.

## 292. యాంటిమోనియం ఆర్సు. ANTIMONIUM ARS.

ఎక్కువ ఆమము, ఊపిరి అందకపోవుట, దగ్గుతోపాటు అవయవములవాపు, ఇట్టిలక్షణములమీదనిది బాగుగా పనిచేయును.

ముఖము:—పొంగరింపు. కండ్లవాపు, ఎరుపు, బాధ.

శ్వాసకోశములు:—స్రావముతోకూడిన న్యుమోనియా (Pneumonia) అనబడు వేడి, వాపు, బాధతోకూడిన శ్వాసాపయనరోగము మీద నిది బాగుగా పనిచేయును. ఈరోగము విషపడిశెము (Influenza) తోకూడియున్నప్పుడుకూడ దీనిని వాడవచ్చును. ఎడమవైపు పుపుసవేష్టము వాపు లేక ప్లూరసీ (Pleurisy) ని, దీనినుండి స్రావమునుకూడ మాన్పును.

హృదయము:—గుండెకాయలోని కండరములలో బలముతగ్గుటను, కండరములవాపు, బాధను మాన్పును. హృదయము పైపొరవాచుట, లేక పెరికార్డైటిసు (Pericarditis)మీదకూడ పనిచేయును.

ఉద్రేకము:—పరుండుటవలన, భోజనానంతరమున.

పోలికలు:—లెకెసిస్, ఆర్సెనికంఆల్బం, ఆరం మెట్, పల్సటిల్లా.

మోతాదు:—3x మొదలు 200 పొటెన్సీ.

---

## 293. యాంటిం క్రూడం. ANTIM CRUDUM.

ప్రతిరోగము అన్నకోశసంబంధమైన వ్యాధితోకలిసి ప్రవంస్వముగానుండుట, రోగితత్వము మేహావాతముతో కూడియుండుట, రోగి అతికోపము, భయము, నాలుకమీద తెల్లనిపూత గలిగియుండుట—ఈఔషధమునకివి ముఖ్యలక్షణములు. తరుచు అజీర్ణవ్యాధితో బాధపడుచుండుట, పిండివంటలు, రొట్టె, కొవ్వుపదార్థములు, తీపిపదార్థములు తినుటవలనవచ్చు అజీర్ణము, వేసవిలోవచ్చునట్టి అజీర్ణము మొదలైన రోగములమీద బాగుగా పనిచేయును. మితిమీరిన భోజనము చేయువారికిని, కొవ్వుపట్టుచుండెడు

చంటిపిల్లలకు, యుక్తవయస్కులకు నిది బాగుగా పనిచేయును (కాల్కేరియా కార్బ). ఇది యాంటిసోరిక్ (Antipsoric) ఔషధము. పిల్లలు కోపముతోను భయముతోను కూడియుందురు, వారినిముట్టుకొనినను, వారి వైపుచూచినను వారు ఏడ్చుట, వయోవృద్ధులెప్పుడును నిద్రమత్తుగానుండుట. చన్నీటిస్నానమునందిష్టముండకపోవుట, ఎండవేడిమి భరించుట కష్టముగానుండుట (లెకెసిసు, నేట్రంమూరు)—ఇవి దీని ప్రత్యేకలక్షణములు.

మనస్సు:—జీవితమునందసహ్యత. పిల్లలు పట్టుపట్టి ఏడ్చుచుండుట. వీరికి ఏవస్తువునిచ్చినను ఏడ్చుట మానకపోవుట (కేమోమిల్లా). రోగిమతిభ్రమచెందినవానివలె నుండుట. నీటిలో మునిగి ఆత్మహత్యచేసుకొనవలెనని వుండుట.

తల:—నదీస్నానమువలనను, మెట్లు ఎక్కుటవలనను, అజీర్ణమువలనను, నిస్త్రాణవలనను, బెల్లముతినుటవల్లను, మంచుగడ్డచేర్చబడిన సారాయిని త్రాగుటవలనను, చర్మవ్యాధుల నణచిపెట్టుటవలనను, వచ్చిన తలనొప్పిని మాన్పును. నుదురు బరువుగాను, తలతిప్పు ముక్కునుండి రక్తస్రావము వుండుట. వెంటుకలూడిపోవుటతో కూడినతలనొప్పి.

నోరు:—నాలుకమీద తెల్లనిపూతయుండుట. పుప్పిపండ్లకు చల్లనినీరుతగులుటవలన నుద్రేకించు పండ్లసలుపును మాన్పును. నోటిచివరను, నాసికాద్వారము, ఆరిపోయి పగుళ్లతోనుండుట.

అన్నకోశము:—ఆకలిలేకపోవుట. ఎక్కువగా భోజనముచేయుటవలనను, అజీర్ణపదార్థములు భుజించుటవలనను వచ్చినవికారమును, వమనములను కట్టును. పిల్లలలో విస్తారముగా తీపివస్తువులు తినుటవల్లవచ్చిన అజీర్ణమును పోగొట్టును. తినినఆహారపురుచితో కూడిన త్రేనుపులువచ్చుట. అన్నకోశము సులభముగా పాడగుచుండుట. పుల్లనివస్తువులను, ఊరగాయలను తినవలెనని యుండుట. అజీర్ణములను మాన్పును. పిల్లలు పాలను జీర్ణముచేసుకొనలేక పెరుగుబిళ్లలవలె కక్కుటను మాన్పును (ఎథూజా).

మలము, మలాశయము:—ముసలివారిలో ఒకప్పుడు విరేచనబద్ధము మరియొకప్పుడు నీళ్లవిరేచనములు వుండుట. నీళ్లవిరేచనములతో పాటు మలము వుండలుకట్టి తరుచు వెడలుచుండుట. నులిపురుగుల నిది మాన్పును. ఆమముతోకూడిన మూలశంఖను మాన్పును. వేసవిలోవచ్చు విరేచనములు. ఎల్లప్పుడును అపానవాయువు వెడలుచుండుట. ఆసనమునుండి పసుపు పచ్చని ఆమము వెడలుచుండుట.

స్త్రీఅవయవములు:—చన్నీటిస్నానమువలన బుతువు అణచివేయ బడుటను మాన్పును. కుసుమ చిన్నచిన్న ముద్దలవంటి పదార్థముతోకూడి నీళ్లవలె వెడలుట. గర్భిణులలో తలతిరిప్పు, వమనము, నీళ్లవిరేచనములను కట్టును.

కాళ్లు, చేతులు:— పుప్పిగోళ్లను మాన్పును. గోళ్లు బీటలుతీయుచుం డుట. గోళ్లమీద కాయలు. అరికాళ్లలోని కంతులు. అరికాళ్లు, మడమలు బహుసున్నితముగా నుండుట. ఇందువలన నడుచుట బహుకష్టముగా నుం డుట. కీళ్లసంధులలో బీటలుతీయుట. అరికాళ్లలో ఆనికాయలను మాన్పు ను (రానన్క్యులస బల్బ).

చర్మము.—ఇది బహువిధచర్మరోగములను మాన్పును(గ్రాఫైటిసు, హెపారుసల్ఫ, సైలీషియా). కంతులను, సురుగుడుకాయలను, తేనెగండు గాను, దళసరిగానువున్న మచ్చలను మాన్పును.

జ్వరము:—అజీర్ణసంబంధమైన జ్వరము. ఒకమారు తగ్గుచు ఒక మారు హెచ్చుచుయుండు జ్వరము.

ఉద్రేకము:—ఉష్ణమువలన, వేడిగాలిలో, వేడిగదియందు, చన్నీటి స్నానమువలన జలుబుచేయుచుండునపుడు, భోజనానంతరమున లేక పానీ యములు త్రాగినపిమ్మట, ఎండలో, రాత్రియందు, సాయంకాలమందు, శరీరపరిశ్రమవలన, ఉద్రేకమును కలిగించు సారాయివంటి వస్తువులు వాడుటవలన,

ఉపశమనము:—విశ్రాంతివలన, చల్లని లేక బహిరంగమైనగాలివల న, ఉష్ణోదకస్నానమువలన, వెచ్చదనము వలన.

సహచరులు:—సల్ఫరు, స్కిల్లా.

పోలికలు:—ఇపెకాక్, సల్ఫరు, పల్సటిల్లా.

విరుగుళ్లు:—బ్రియోనియా, కాల్కేరియాకార్బ్, హెపారుసల్ఫ్, ఇపెకాక్.

మోతాదు:—3 x మొదలు 200 పొటెన్సీ. పెద్దపొటెన్సీలు జీర్ణ కోశము, మలాశయము సంబంధమైన వ్యాధులమీదను, నిస్త్రాణమీదను వాడనగును.

---

## 294. యాంటిమోనియం సల్ఫురేటం అరేటం.
## ANTIMONIUM SULPHURATUM AURATUM.

ఇది బహుకాలమునుండి బాధపడుచున్న శ్లేష్మవ్యాధులమీదను, మాంసవటునంటి రొంపమీదను బాగుగా పనిజేయును. మెటిమలను, గుడ్డి తనమును మాన్పును. చిన్నపిల్లల రొంపకు దగ్గుకు ఇది దివ్యౌషధము.

కన్నులు:—కంటిబాధలతోపాటు తలలో మంటగానుండుట. కనీ నికాపటలము (Iris) కాచబింబము (Cornea) గూడా వెలుపలికివచ్చుట. ప్రారంభమగుచున్న గుడ్డితనమును ఆపివేయును. కాచబింబముమీదమచ్చ లను మాన్పును.

ముక్కు:—ముఖముకడుగుకొనునపుడు ముక్కునుండిరక్తస్రావము.

నోరు:—నాలుకమీద తెల్లగాను, చిక్కగాను, జిగురువంటిపూత.

అన్నకోశము:—అజీర్ణముగా నుండుట. పొట్టనిండుగా నున్నట్లుం డుట. బొడ్డుదగ్గర ఎక్కువ నొప్పిగానుండుట.

మలము, మలాశయము:—మలము బహుకష్టముమీదను, అపాన వాయువుతోను వెడలుట.

శ్వాసకోశములు:—చిక్కనిఆమము స్వరపేటికలోను, కంఠనాళములోను విస్తారముగా చేరుటవలన ఊపిరిపీల్చుట కష్టముగానుండుట. ఒకప్పుడు పొడిదగ్గుగానుండి శ్లేష్మముపడకపోవుట. వర్షఋతువులో నుద్రేకించు దగ్గులు. రోగి శరీరము చితుకగొట్టినట్లుగా నొప్పిగానుండుట.

చర్మము:—ముఖముమీదను, చర్మముమీదను మరియెచ్చటనైనను బయలుదేరు మొటిమలను, పొక్కులను మాన్పును. కాళ్లుచేతులమీద పురదలను పోగొట్టును.

మోతాదు:—2 x, 3 x పొడుము. దీర్ఘవ్యాధులమీద 200 వరకు వాడవచ్చును.

---

## 295. యాంటిం అయోడ్. ANTIMONIUM IOD.

శ్వాసావయవరోగములమీద నిది బాగుగా పనిచేయును. జలుబుతోగూడిన పుబ్బసవ్యాధి, బ్రాంకైటిసు, ఇవి విడిగాగాని ద్వంద్వముగాగాని వుండుట; వీటివలన రోగినీరసించుట; ఆకలిమందగించుట; చర్మము పచ్చబడుట, కమటలుపోయుచుండుట; మందముగానుండుట; కొలదిగా జ్వరము కగులుచుండుట; నాలుక పూతతోనుండుట; అతితరుచుగాదగ్గువచ్చుచుండుట, శ్లేష్మమువెలువడకపోవుటవలన రోగి బాధపడుచు అలయుచు యుండుట. యిట్టిలక్షణములు వయోవృద్ధులకును, నీరసస్థులలో నుకలిగినపుడిది ముఖ్యముగా పనిచేయును.

స్త్రీలలోగర్భాశయము ఒకవైపునఎక్కువగా పెరుగుటనుమాన్పును.

మోతాదు:— 6x మొదలు 30 పొటెన్సీ.

---

## 296. యాంటింటార్టు. ANTIMONIUM TARTARICUM.

ఇది మందముగా నుండువారికిని శ్లేష్మతత్వమువారికిని బాగుగా పనిచేయును. రోగి ఆయాసము నిస్త్రాణ చెందియుండుట; తరుచు జలుబు చేయుచుండుట; తలతిర్పు వమనములు వుండుట, శ్లేష్మము తెగిపడనట్టు వంటి ఉబ్బసము; బాధలు కోయుచున్నట్లుండుట; రోగికి పాలు ఆహారములు, పుగాకు వీటియందిష్టముండకపోవుట; పుల్లనివస్తువులయందును, చల్లని నీటియందును కోర్కెయుండుట; విసుగుదల, కోపమువలనను, తేమతో గూడినట్టిగాని, వెలుతురు, గాలి సరిగా రానటువంటిగాని గదులలో నివసించువారికిని వచ్చు రోగములు (ఆర్సెనికం ఆల్బం, వెరిటింతినా), న్యూమోనియా; ఇవి దీని వుపయోగమును సూచించును.

ఇది యాంటిసైకొటిక్ ఔషధము.

మనస్సు:—విపరీతమైనసంధి, తనలోతాను మాట్లాడుకొనుచుండుట. అస్థిమితము. ఒంటరిగానుండుటకు భయపడుట. తనయారోగ్యమును గూర్చి అధైర్యము చెందుట.

తల:—తిర్పు. ఒకసారి తిర్పు మరియొకసారి మగతయుండుట. నుదురు తాడుతోకట్టినట్లు నొప్పిగానుండుట. దగ్గినపుడు తల వణకుట. తలయెత్తుటకు భారముగా నుండుట.

కన్నులు:—ఎర్రబారుట, దృష్టిమాంద్యము, నీరుకారుట, నొప్పులుగానుండుట.

చెవులు:—ధ్వనులు వినబడుట, వెచ్చగానుండుట.

ముక్కు:—తుమ్ములు. నీళ్లవంటి స్రావము; వాసన, రుచి తెలియకపోవుట. ఒకమారు ముక్కునుండి ఎడతెగని నీళ్లవంటి స్రావము, మరొకమారు ముక్కు దిబ్బడవేయుట. రక్తస్రావము.

ముఖము:—చల్లగాను, నీలివర్ణముగాను వుండి, చల్లని చెమటతో కప్పబడి పాలిపోయియుండుట (టబాకం). ఒకప్పుడు మంట, వేడియుం

డుట. కండరములు కంపము నొందుచుండుట. పెదవులుబీటలుతీసి పొడిగా నుండుట. గెడ్డము, క్రిందిదవుడ వణకుచుండుట. వమనము చేసికొనవలెనని నుదుట పెచ్చని చెమటపట్టుట.

నోరు:—గుటక వేయుట బాధగానుండుట. నోటిలో నీటిపొక్కులు, పుండ్లు. పండ్లసలుపు వుదయమున ఎక్కువగుట. ఇగుళ్లనుండి రక్తము కారుట.

నాలుక:—తెల్లని చిక్కని జిగురువంటి పదార్థముతో కప్పబడి యుండుట. వంచలు ఎర్రగానుండుట, పుండ్లుపడుట.

గొంతుక:—ఆమముతో నిండియుండుట. ఊపిరి పీల్చలేకపోవుట. గవదకాయలు వాచుట. మంట, ముడుచుకొనిపోయినట్లుండుట.

అన్నకోశము:—బరువుగానున్నట్లు తోచుట, తరుచు కుళ్లిన వాసనతో కూడిన త్రేణుపులువచ్చుట. కడుపులో నొక్కుచున్నట్లుండుట. రక్తవమనములు. ఎక్కిళ్లు, త్రేణుపులు తినిన ఆహారముయొక్క రుచితోను, పుల్లగాను వుండుట. భోజనానంతరము వికారము, వాంతియుండుట. వమనానుమానము కుడిపై పువ పరుండినపుడు తప్ప మరేవిధముగానున్నను కలుగుట.

పొత్తికడుపు:— అపానవాయువుతో కూడిన శూలతో కోయుచున్నట్లు బాధగానుండుట.

మలము, మలాశయము:—ఇది కలరాలో బాగుగా పనిచేయును.

పురుషావయవములు:—శెగవ్యాధిలో అంగము బొగడవెనుక కాయలు, పొక్కులువలె బయలుదేరినపుడును, యితరచోట్ల పుండ్లుపడినపుడును, సెగరోగము అణచిపెట్టబడుటవలన కలిగిన వృషణములవాపు, బాధకును (పల్సటిల్లా), తొడలమీదను మర్మావయవములమీదను పొక్కులు బయలుదేరునపుడును, సవాయివ్యాధిమీదను పనిచేయును.

స్త్రీ అవయవములు:—ఋతురక్తము నీళ్లవలె పల్చగా పొలిపోయి

అగుట. మర్మావయవములమీద మొటిమలు, పొక్కులను మాన్పును.

శ్వాసకోశములు:— తెల్లవారుఝామున వుద్రేకించు ఉబ్బసము. శ్లేష్మము తెగిపడకపోవుట. అందువలన ఆయాసము ఎక్కువగుట. పిల్లి మోత్రలు, ఈగుణములు పరుండిన యెక్కువగుట. ఊపిరితిత్తులకు నీరుపట్టుట. దగ్గు, ఆయాసము కుడిప్రక్కను పరుండినయెడల వుపశమించుట. పరుండుటవలన ఊపిరి ఆడకపోవుటచే ఉబ్బసరోగులు రాత్రియంతయు కూర్చుని దగ్గుచుండుట. న్యూమోనియా ఆఖరుఅవస్థలో ఊపిరితిత్తులు ఆమముతోను, చీముతోను నిండియున్నపుడు యిది బాగుగా పనిచేయును. బ్రాంకైటిసు, న్యూమోనియా, బ్రాంకోన్యూమోనియాలలో గుండెలలో శ్లేష్మము విస్తారముగా చేరి గురకగానున్నప్పుడు వాడవచ్చును. ఛాతీ శ్లేష్మముతో నిండియున్నను శ్లేష్మము తెగి పడకపోవుట. తేమగాలివలన శ్లేష్మ ద్రేకము, చలి, జలుబు కలుగుట.

నడుము:— నడుములో ఎక్కువబాధగాను బరువుగాను వుండుట. దిగలాగుచున్నట్లుండుట.

కాళ్లు, చేతులు:— మహావాతపు నొప్పులు, బాధలు. తరుచు కాళ్లు చాచుకొని కూర్చుండవలయునని యుండుట. అవయవములన్నియు బహు నిస్త్రాణ చెందియుండుట. చేతులు తడిగాను చల్లగాను, వణకుగాను వుండుట. కాళ్లు చల్లగాను, తిమ్మిరిగాను వుండుట.

చర్మము:— ఇది మశూచికముమీదను,మశూచికములోవలె పొక్కులు, పద్దులు లేచునట్టి యితరచర్మవ్యాధులమీదను బాగుగా పనిచేయును. మిక్కిలి దురద. అణచిపెట్టబడిన చర్మవ్యాధులలో దీనిని వాడినయెడల వాటిని బయల్పెట్టి మాన్పును (సల్ఫరు).

నిద్ర:— ఆవలింతలుండుట. నిద్రపోవుటయందు వాంఛను అపుకొనలేనంతగా యుండుట. నిద్రలో అవయవములను కదల్చుచుండుట. గాఢమైన నిద్ర.

జ్వరము.—వణుకు, చలి. ఎక్కువ వేడితో కూడియుండుట. శరీర మంతయు చల్లగానుండుట, దానితో చలి అన్ని వేళలయందును వుండుట. దీనితో పాటుమగతయుండుట. చల్లని చెమట. ఎక్కువనెచ్చుపనము, దాహము.

ఉద్రేకము:—సాయంకాలమందు, రాత్రియందు, నిదిలేమివలన, తేమగాలివలన, వాతావరణమార్పువలన, పాలవలన, పుల్లని పదార్థములవలన.

ఉపశమనము:—త్రేనుపులవలన, శ్లేష్మము పడినపిమ్మట, నిబ్బరముగా కూర్చుండుటవలన, బహిరంగమైన గాలిలో, కుడిప్రక్కకు పరుండుట వలన, చల్లదనమువలన.

పోలికలు:—ఇపెకాక్, కాలీసల్ఫ, ఎకోనైటు.

విరుగుళ్ళు:—పల్సటిల్లా, సేపియా, రూస్టాక్సు.

మోతాదు:—3x మొదలు 200 పొటెన్సీ. చిన్నపొటెన్సీలు శ్లేష్మ సంబంధమైన రోగములమీద బాగుగా వాడనగును.

---

## 297. అర్జెంటం మెటాలికం. ARGENTUM METALLICUM.

ఇది నరములకు పుష్టికి సంబంధించిన బహువిధరోగములమీద పనిచేయును. ఇది యాంటిసోరికు ఔషధము. యాంటిసైకోటికు లక్షణము లుగూడ దీనికి గలవు మేహవాతములమీదను, గొంతుపైపు అవయవముల మీదను బాగుగా పనిచేయును. పల్చగా, పొడుగుగా వుండువారికిని, సులభముగా కోపమువచ్చువారికిని బాగుగా పనిచేయును. పాదరసము యెక్కువగా వాడుటవలన గలిగిన దుర్గుణములను మాన్పును. ముష్టిమైథునము వలనను, ఎండదెబ్బలవలనను గలిగిన దోషములను పోగొట్టును. అన్నకోశము, శ్వాసావయవములు, మర్మావయవములు, మూత్రావయవములు వీటి యొక్క ఆమత్వచలసంబంధములైన రోగములమీద బాగుగా పనిచేయును.

మనస్సు:— అతితొందర, కాలక్షేపమవక పోవుట. ఆందోళన యెక్కువగానుండుట. మాట్లాడుటయందిష్టముండక పోవుట. జ్ఞాపకశక్తి

తగ్గిపోవుట. పిచ్చివానివలెనగుట. ఆలోచనశక్తి క్షీణించుట. ఆలోచన వలన అలసిపోయి సులభముగా తలనొప్పివచ్చుట.

తల:—పార్శ్వపునొప్పి యెడమప్రక్కను పిడిబిగిపిడిచినట్లుండుట. ఇది క్రమముగా యెక్కువగుచున్నను, ఒక్కసారి తగ్గుచుండుట. వ్యాపారస్థులలోను, విద్యార్థులలోను, ఎక్కువ ఆలోచన చేయువారిలోను, అధికమైన ఆలోచనవలన గలుగు తలనొప్పులు. తాగినవానివలె తలతిరిగిపోవుచున్నట్లుండుట. నుదుటియందును, తల వెనుకభాగమందును నొప్పులువచ్చుట.

కన్నులు:—కండ్లకొలికలు పెళుసరై ఎర్రగానుండుట. మత్తుచేత కనురెప్పలు మూతలుపడుట, కనురెప్పలలోను, కొలికలలోను దురదగానుండుట. దృష్టి మందగించుట. కనురెప్పలు పటుసడల్చుట. కన్నులు విప్పి చూచుటకు కష్టముగానుండుట. ఎడతెగని స్రావము ఒకప్పుడు చిక్కగాను పచ్చగాను వుండుట. కండ్లకొలికలు వాపు, ఎరుపు, దురద.

చెవి:—దురదగానుండుటవలన రక్తము వచ్చునంతవరకు గోకుచునేయుండుట. చెవులు ఘుడియలుపడుట. పొడుచుచున్నట్లు బాధ.

ముక్కు:—ఎడతెగని నీళ్లవంటి స్రావము, రొంప, తుమ్ములు, దురద.

ముఖము:—పాలిపోయినట్లగుపడుట. ఒకప్పుడు ఎర్రబడుట. ఎముకలలో నొక్కుచున్నట్లు నొప్పిగానుండుట. పై పెదవి వాపు.

నోరు:—ఆర్చుకొనిపోవుట. నాలుకమీద పొక్కులు లేచి, ఇవి బాధగాను, మంటగాను వుండుట. ఇగుళ్లు నొప్పిగాయుండుట. ఇగుళ్లు గుల్లబారి సులభముగా రక్తముకారుట.

గొంతుక:—ఉపన్యాసకులలోను, సంగీతపాటకులలోను, గొంతుక బొంగురుపోవుటను మాన్పును. గుటక వేయునపుడును, దగ్గునపుడును, గొంతుక, స్వరపేటిక పుండుపడినట్లు బాధగానుండుట. మాంసగ్రంధులు వాచుట. గొంతుకలో గోకుచున్నట్లుండుట. ఊపిరివిడుచునపుడును, గుటక వేయునప్పుడును చాల బాధగానుండుట. దగ్గునప్పుడు మరింతబాధగానుం

డుట. బూడిదరంగుగల శ్లేష్మము సప్తపథములో చేరుట, మరియు నిది సులభముగాబయటను వెడలుచుండుట.

అన్నకోశము:— ఆహారము చూచినను, ఆహారముగూర్చి తలచినను అసహ్యము తోచుట. ఒకప్పుడు తీరనటువంటి ఆకలి. ఇది భోజనముచేసిన పిమ్మటనుకూడ యెక్కువగా నుండుట. ద్రాక్షసారాయము త్రాగగోరుట. హాగమట్టు త్రాగినపిమ్మట యెక్కిళ్లువచ్చుట. కడుపులో మంటగానుండుట. వమనము చేసికొనవలెనని వుండుట. నోరు అరుచిగానుండుట.

పొత్తికడుపు:— దుర్వాసనతోకూడిన అజీర్ణవిరేచనములు. కటిప్రదేశమందు కొక్కుమన్నట్లు బాధగా నుండుట. కోయుచున్నట్లుండు బాధలు. కండరములు బిగలాగుచున్నట్లుండుట.

మలము, మలాశయము:— తరుచు విరేచనానుమానము. విరేచనము కొద్దిగాను, మెత్తగాను అగుట. భోజనానంతరము పొడియిసుకను పోలిన విరేచనమగుట. విరేచనమగు సమయమందే వమనమగుట.

మూత్రావయవములు:— శ్వేతధాతువు పోవుట. మధుమూత్రము, అతిమూత్రము. పిల్లలు నిద్రలో మూత్రమును విడుచుట. తరుచు మూత్రానుమానము. రాత్రియందు మూత్రమెక్కువగా వెడలుచుండుట.

పురుషావయవములు:— సాధారణముగా ప్రతిరాత్రియందును లేపనములేకయే స్ఖలనములుండుట. అంగము యెండిపోవుట. వృషణములలో నలుగగొట్టినట్లు బాధ, వాపు, లాగుచున్నట్లుబాధ, ముట్టుకొనిన బాధగా నుండుట (రోడోడెండ్రాను, అరం మెటాలికం, క్లిమేటిసు, పల్సటిల్లా, స్పాంజియా). కుడివృషణములో కలుగుబాధలు, జీర్ణించినసెగ, పసుపుపచ్చని లేక ఆకుపచ్చని లేక రెండురంగులమిశ్రమముతోగూడిన స్రావము.

స్త్రీఅవయవములు:— గర్భాశయము వెలుపలికి వచ్చుట. ఎడమ అండాశయములో నొప్పి, యిది ముందరకును దిగువునకును వ్యాపించుచుండుట. గర్భాశయము బరువుగా నుండుట, వెలుపలకు వచ్చుట. ముట్లుడుగుకాలములో గలుగు రక్తస్రావము. గర్భాశయములోని పుండ్లు. మిక్కిలి

దుర్వాసనతో కూడిన కుసుమ (కాలీఆర్సు, కాలీ ఫాసు). గర్భిణీస్త్రీలలో కలుగు గుండె దడ.

శ్వాసావయవములు:—నవ్వుటవలన దగ్గు వుద్రేకించుట (డ్రోసిరా, ఫాస్ఫరసు, స్టేనం) మరియు స్వరపేటిక ఆమముతో నిండియుండుట. ఛాతీలో ఎడమవైపున యెక్కువనిస్త్రాణగా నుండుట (స్టేనం మెట్). బిగ్గరగా చదువుటవలన మాట్లాడుటవలన, దగ్గు యెక్కువగుట.

హృదయము:—గుండెదడ. ఇది తలనొప్పితో కూడియుంకుట.

కాళ్ళు, చేతులు:—కండరములలోబిగలాగుచున్నట్లుండుట, ఎముకలలోను, కండరములలోను, మోచేతులలోను, వ్రేళ్లలోను నొక్కుచున్నట్లు విడిచివిడిచి నొప్పులు వచ్చుచుండుట, అతిమూత్రవ్యాధిగలవారికి పాదములలో నీరుపట్టుట, పిక్కలులాగుట, మేడమెట్లు దిగునప్పుడు కండరములలో బిగలాగుచుండుట, మడమ మొద్దుబారుట.

ఉద్రేకము:—బండిలో ప్రయాణము చేయుటవలన. తాకుడువలన, నొక్కుటవలన, మాట్లాడుటవలన, సంగీతము పాడుటవలన, గట్టిగా చదువుటవలన.

ఉపశమనము:—బహిరంగమైన గాలిలో. (రాత్రిపరుండినపిమ్మట దగ్గుకూడ వుపశమించును.)

విరుగుళ్లు:—మెర్క్యూరియసు, పల్సటిల్లా.

మోతాదు:—6 x (పొడుము) మొదలు 200 పొటెన్సీ. దీనిని అతి తరుచుగా వాడనక్కరలేదు. దీని గుణకాలపరిమితి 2 లేక 3 వారములు.

---

## 298. ఆర్జెంటం నైట్రికం. ARGENTUM NITRICUM.

నరముల మండలమునకు సంబంధించినవ్యాధులమీదను, అమితముగా సారాయి మొదలగునని త్రాగుటవలనను, మంచుగడ్డకలసిన పదార్థములు

తినుటవలనను, యెక్కువగా తీపివస్తువులు తినుటవలనను, అధిక సంభోగము వలనను, పొగాకు యెక్కువగా వుపయోగించుటవలనను, హస్తప్రయోగాది దురభ్యాసములవలనను వచ్చిన రోగములపైనను ఇది బాగుగాపని చేయును. రోగి యెప్పుడును పంచదారను, జున్ను తినుటయందును, శుభ్రమైన గాలియందును, యెక్కువ కోరికగలిగి యుండుట, మరియు వెలుతురుయెడలను సహవాసమందును అయిష్టముగా నుండుట, రోగి ఏపేట ఎక్కువగా చిక్కిపోవుచుండుటయు దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—మాటతడబడుట. జనసమూహముయెదుటవచ్చుటకుభయపడుట; మరియు యిందువలన నీళ్లవిరేచనములు వచ్చుట (జెల్సిమియం). కాలక్షేపము అవకపోవుట (కెన్నబిస్ ఇండికా). జ్ఞాపకశక్తితగ్గిపోవుట. పనులన్నియుతొందరగా చేయవలెననియుండుట. భయముచేవచ్చుమూర్ఛకు బాగుగా పనిచేయును; ఫిట్టు వచ్చుటకు ముందుగా కంటిపాప పెద్దదై కొలదిరోజులుండుట. నరముల నిస్త్రాణ యెక్కువగానుండుట. రోగభీతి గలుగుచుండుట.

తల:—అధికమైన మానసిక పరిశ్రమవలనను, నాట్యమువలనను వచ్చు బాధలు. మైకముతోను, తత్తరపాటుతోనుకూడిన తలనొప్పి. తలను గట్టిగా బిగించి కట్టుటవలన తలనొప్పి వుపశమించుట (యూపిస్, పల్సటిల్లా). మనోవికారములవలన పార్శ్వపునొప్పులు వచ్చుచుండుట. తల పెద్దదైనట్లును బ్రద్దలైపోవుననియు అనుకొనుట; యీగుణము తేలిపులు, చలితో కూడియుండుట. తలనొప్పి నిస్త్రాణతోను వణకుతోను కూడియుండుట. నుదిటిలో నొప్పి, దీనితోపాటు ఒకవైపు కన్నులో పోటుగా నుండుట.

కన్నులు:—దృష్టిమాంద్యము. కండ్లయెదుటసర్పములు, దుండు మన్న వస్తువులు, నల్లనిమచ్చలు కనపడుచుండుట. ఇది అంతరకుసుమలను (కేటరాక్టును) మాన్పును. చిక్కగానుపచ్చగానువెడలునట్టి స్రావముతో కూడిన కండ్లకలకలను మాన్పును. కన్నులు మాంసపుముద్దవలె ఎఱ్ఱగానుండుట,

కన్నులు ఉదయమున అంటుకొనుట (యాపిస్, మెర్క్యుసాల్, రూస్టాక్సు). పుసులతో నిండియుండుట. కనురెప్పలలో మాననటువంటి పుండ్లు. కాచబింబముపైని చిన్నచిన్న పుండ్లు. సరిగా దృష్టి నిలుపలేకపోవుట. వెలుతురును చూడలేకపోవుట. కుట్టుపనివలన కండ్లు యిరుసుపడుట, మరియును యిది వేడిగానుండు గదిలో ఎక్కువగుట. తల్లిదండ్రులయందుగల సెగరోగము వలన వారిపిల్లలకు వచ్చునట్టి కండ్లజబ్బులు. కండ్లకలక.

చెవులు:—సరిగా వినబడకపోవుట. గింగురుమనునట్లు ధ్వనులు. మూతపడినట్లుండుట.

ముక్కు:—గదిలో ఫుస్సఫుసు దిబ్బడవేయుట. బహిరంగమైన గాలిలో స్రావము వచ్చుచుండుట ముక్కు ఎముకలలో చిలుకకొట్టినట్లు నొప్పి. వాసన తెలియకపోవుట. పుండ్లు అగుట, రొంప, చీము, తలనొప్పితో కూడిన పడిశము.

ముఖము:—రోగిష్టివానివలె పాలిపోయి ముడతలుపడి యుండుట. ముసలివానివలె నగుపడుట.

నోరు:—ఇగుళ్లనుండి రక్తము స్రవించుట. పండ్లు పదులుగా నుండుట. నాలుక ఎర్రగాను, నాలుకచివరను ఎర్రగాను బాధగాను యుండుట. నీళ్ళూరుచుండుట.

గొంతుక:—చిక్కని ఆమము ఎక్కువగా చేరుటవలన కాండ్రించి ఉమ్మివేయవలసివచ్చుట. పుండ్లుపడినట్లు గరుకుగాను బాధగాను వుండుట. ఎర్రబారియుండుట. నొక్కుకొని పోయినట్లుండుట. అర్చుకుపోవుట, మంటగానుండుట. పొగ త్రాగువారిలో కలుగు శ్లేష్మదోషకము. గొంతుకలో నొకవెంట్రుక కదలుచున్నట్లుండుట. సంగీతము పాడుటవలన మెరుగు రాయుట.

అన్నకోశము:—పంచదారయందును, తీపివస్తువులయందును ఆపుకొనలేనంత కోరికయుండుట. అజీర్ణమువలన గుండెలలో మంట, దీనితో

పాటు గుండెకాయలో నొప్పి. వాయువు చేరుటవలన ఉబ్బరించి శూల వచ్చుట (కార్బోవెజ్, లైకోపోడియం, నక్సువామికా, అయోడియం). తీసికొనిన ఆహారపు రుచితోకూడిన త్రేన్పులు. భోజనమువలన ఉపశమించు వమనానుమానము. అన్నవాహికల శ్లేష్మకోశసంబంధమైన వ్యాధులతోను త్రేన్పులుండుట, అన్నకోశములో పుండుపడుట. నములుచున్నట్లు, పడివేయుచున్నట్లు, యీడ్చుచున్నట్లు వ్యాపించునట్టి బాధలు విరేచనానంతరము తగ్గును; ఇది ముట్టుకొనుటవలనను, ఆహారము తీసికొనిన పిమ్మటను, పానీయములు త్రాగినపిమ్మటను గట్టిగా ఊపిరిని పీల్చుటవలనను యెక్కువగుట. పుండువలన పొడుచున్నట్లు బాధలు ఎడమవైపున కలిగినపుడు యిది బాగుగా పనిచేయును.

పొత్తికడుపు:—విశ్రాంతిగానున్న పిమ్మట కదలుటవలన చురుక్కుమని పొడుచుచున్నట్లుండుట. అప్పుడప్పుడు విపరీతమైన బాధ వచ్చుటవలన రోగి దొర్లుచుండుట.

మలము, మలాశయము:—కొద్దికొద్దిగాను, నీళ్లవలెను లేక ఆకుపచ్చగాను, దుర్వాసనతోను మరియు చప్పుడుతోను వచ్చునట్టి అపానవాయువు, శూలతోకూడిన అజీర్ణవిరేచనములు. ఇవి తరచు పానీయములు త్రాగినవెంటను, ఆహారము తినినవెంటను, పంచదార తినుటవలనను కలుగుచుండుట (ఆర్సెనికం ఆల్బం). మాననటువంటి జిగటవిరేచనములు, జిగట పచ్చని ముక్కలవలె వెడలుట. ఆసనము దురద. మానసికోద్రేకమువలన విరేచనము లగుచుండుట.

మూత్రావయవములు:—రాత్రింపగళ్లు మూత్రము అప్రయత్నముగా వెడలుట (కాస్టికం). మూత్రనాళము మంటగాను బాధగాను యుండుట. మూత్రము ధారలుగాపడుట. మూత్రము ఒకప్పుడు రక్తముతోకూడి వెడలుట.

పురుషావయవములు:—నపుంసకత్వము, అంగము ముడుచుకొనియుండుట, లేచునశక్తి లేకపోవుట. అంగము పి[illegible]ండు. సంభోగేచ్ఛ లేకపోవుట.

స్త్రీఅవయవములు:—బహిష్టుకు పూర్వము అన్న కోశమునందు బాధగానుండుట. కుసుమ యెక్కువగాను, పచ్చగాను, తగిలినచోట పుండును చేయుచు స్రవించుట. బహిష్టు త్వరగాగాని అలస్యముగాగాని అగుచుండుట. ముట్లుడుగుకాలములో నరములయందు యెక్కువ ప్రుద్రేకము, రక్తస్రావము గలుగుచుండుట. సంభోగానంతరము రక్తము స్రవించుట (యాసిడ్ నైట్రిక్). బహిష్టుకు రెండువారములపిసప రక్తస్రావము కలుగుట. సంభోగము బాధకరముగా నుండుట. ఎడమ అండాశయములో నొప్పిగా నుండుట.

సెగరోగము:—ఎక్కువ స్రావము, కోయుచున్నట్లు అపరిమితమైన బాధతోను గూడిన సెగరోగముయొక్క ప్రథమావస్థలో యిది బాగుగా పనిచేయును.

శ్వాసావయవములు:—స్వరపేటిక పుండుపడినట్లు నొప్పిగానుండుట. గట్టిగా మాట్లాడుటవలన, పాడుటవలన దగ్గువచ్చుట (అర్జెంటం మెటాలికం). ఉబ్బసపుదగ్గు విడిచివిడిచి వచ్చుచుండుట. దగ్గు వచ్చినప్పుడు రోగి లేచి నడవవలసివచ్చుట. మధ్యాహ్నము వూపిరాడనంత దగ్గువచ్చుట. పొగాకు వుపయోగించుటవలన సాయంకాలమందు దగ్గు హెచ్చగుట.

హృదయము:—విడిచివిడిచి కొట్టుచుండుట. విపరీతమైన గుండెదడ, యిది మధ్యాహ్నమందుండుట. మఱియు నిది శరీరపరిశ్రమవలనగాని వుద్రేకమువలనగాని యెక్కువగుట.

నడుము, కాళ్లు, చేతులు:—లేచుటవలన నొప్పి యెక్కువగుట. మఱియు నిది నడచుటవలన వుపశమించుట. మెడ సమీపమందున్న మాంసగ్రంథులు గట్టిపడుట, మరియు నిది జీర్ణించిన సవాయిరోగమువలన కలిగినదను యనుమానమువచ్చుట. దిగువ అవయవములు క్రమముగా ఎండిపోవుట.

చర్మము:— నల్లగాను, నీలిరంగుగాను యుండునట్టి పొక్కులు బయలుదేరుట. అచ్చటచ్చట మచ్చలుబయలుదేరుట. వులిపిరికాయలు, దురదతోగూడినట్టి మొటిమలు, మశూచికము.

జ్వరము:—చలి అప్పుడప్పుడుగాని, వరుసగాగాని వచ్చుచుండుట, శరీరముపైని కప్పుకొనిన బట్టను తీసివేయుటవలన చలివచ్చుచుండినను, కప్పుకొనినయెడల వూపిరాడుట కష్టముగాయుండుట. దాహములేమి. రాత్రియందును, వుదయమునందును చెమటపట్టుట.

ఉద్రేకము:—రాత్రియందు, వెచ్చనిగదిలో, వెచ్చనిపానీయములు త్రాగుటవలన, తియ్యనివస్తువులు తినుటవలన, భోజనానంతరమున, బహిష్టులో, వూపిరి పీల్చుటవలన.

ఉపశమనము:—ఉద్రేకమును కలిగించు పదార్థములవలన, త్రేణుపులవలన, బిగించికట్టుటవలన, పరిశుభ్రమైన గాలివలన, చల్లనినీటివలన.

సరిపడనిది:—కాఫీ.

విరుగుళ్లు:—నేట్రింమూరు, ఆర్సెనికం ఆల్బమ్, పాలు, కాల్కేరియా కార్బ, సేపియా, సల్ఫరు, మెర్క్యూరియసు, రూస్టాక్సు, ఫాస్ఫరసు, లైకోపోడియం, పల్సటిల్లా.

అమోనియం కాస్టికము—నకిది విరుగుడు.

పోలికలు:—ఆర్జెంటం మెట్, కుప్రం మెట్, ఆరం మెట్, లెకెసిస్, మెర్క్యూరియసు, తూజా.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 299. ఆర్సెనికం ఆల్బం. ARSENICUM ALBUM.

మంట, నిస్త్రాణ, అర్ధరాత్రిమున వుద్రేకము, స్రావములు కుళ్ళిన వాసనతో కూడియుండుట; త్రాగుటవలనను, విషతుల్యమైన భోజనము వలనను, విషపురుగులు కుట్టుటవలనను, శస్త్రచికిత్సానంతరమునను, పుగాకు నములుటవలనను, చెడిపోయిన పదార్థములను తినుటవలనను, ప్రతి సంవత్సరము వచ్చుచుండు మన్యపుజ్వరమువలనను కలుగునట్టి రోగలక్షణ

ములకును దీనిని వాడదగును. ఇది వుబ్బులమీద బాగుగా పనిచేయును. దీనిలక్షణములు యీదిగువ నిరూపింపబడియున్నవి. (1) రోగలక్షణములు కొంతకాలమున కొకసారి అగుపడుచుండుట. (2) స్వల్పపరిశ్రమవలన కూడ యెక్కువ నిస్త్రాణ గలుగుచుండుట. (3) లక్షణములు యెక్కువ అపకారము గలుగజేయునట్టివిగా కనబడుట. (4) స్థిరత్వము లేకపోవుట, అతివేదన లేక బాధతోకూడియుండుట. (5) ప్రతి అవయవమునందును మంటగానుండుట. (6) బాధలు విశ్రాంతివలనను రాత్రులందును యెక్కువగానుండుట. మరియు చలి శీతలమువలన మిక్కిలి యెక్కువగుట. (7) తీరనిదాహము. కొంచెము కొంచెముగాను, అతివేగముగాను పానీయమును కోరుచుండుట. అమితముగా భోజనముచేయుట, వేగిరపడు యెక్కువగా తినుట. ఒకేరోగము ప్రతిసంవత్సరము ఒకనిసమయమున కనిపించుచుండుట (కార్బోవెజ్, లెకెసిస్, సల్ఫర్, తూజా).

ఇది నరములసంబంధమైన వ్యాధులుగలవారి తత్వములమీద బాగుగా పనిచేయును. క్షయరోగముమీద బాగుగా పనిచేయును. రోగి క్షీణించి తుదకు మరణింపనున్నట్లుండుట, లక్షణములన్నియు మధ్యాహ్నము 1-2 గంటలు లగాయతు రాత్రి 1-2 గంటలవరకు వృద్ధిచెందుట; వేడిమివలనను కప్పుకొనుటవలనను రోగలక్షణములు ఉపశమించుట; మరియు తలకు సంబంధించిన రోగములు చల్లదనమువలన ఉపశమించుటయు దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—రోగి అస్థైర్యమును చెందియుండుట. ఆత్మహత్య చేసికొనవలెనని తలంపుతోనుండుట (ఎకొనైట్, ఎల్యూమినా, ఆరంమెట్, యాంటిమోనియం క్రూడం, నేట్రం సల్ఫ). ఒంటరిగా నుండునపుడును పరుండబోవునపుడును అకస్మాత్తుగా చావునుగురించి భయపడుచుండుట. రాత్రిపగళ్లు దయ్యములు కనపడుచుండుట, అందువలన యెక్కువ భయము పరితాపము కలుగుచుండుట. రోగి యెచ్చటనుండినను విశ్రాంతిగానుండలేక ఒకచోటినుండిమరియొకచోటునకు, ఒకమంచమునుండియింకొక మంచమునొద్దకును వెడలగోరుట. జీవితమునందెక్కువ అసహ్యత కలుగుట.

ఎక్కువ విచారగ్రస్తముగానుండుట. చిరచిరలాడుచు ప్రతివిషయము లోను తప్పుపట్టుచుండుట. అవసరముకన్న యెక్కువైన కోరికలు స్త్రీ రోగులలో కలుగుచుండుట. ఎక్కువగా తినుచుండుట, తాగుచుండుట, తనజబ్బును మాన్పుకొను ఔషధము పుచ్చుకొనుట అనవసరమని అధైర్యము చెందుట.

తల:— తిరుగుటవలన పడిపోయినంతటి తలతిప్పు, తలభారముగా నుండుట, ఇవి బహిరంగమైన గాలిలో ప్రబలించుట, తిరిగి గదిలోనికి వెళ్లినపిమ్మట లక్షణములు యథాప్రకారముగా వచ్చును. ధ్వనులవల్లను కాంతివల్లను తలనొప్పి యెక్కువగుట. తలమీద రక్తముతో కూడిన కురుపులు వేయుచుండుట. ఎడమవైపున కన్ను పార్శ్వపునొప్పి. నుదురు యెక్కువ బరువుగానుండుట. తల వెంట్రుకలు ఊడిపోవుట. చల్లదనమువలన తలనొప్పి ప్రబలించుట. బాధలు మంటలతోను అస్థిమితముతోను కూడియుండుట. తల నెప్పుడును అటునిటు త్రిప్పుచుండుట. దురదగానుండుట. అక్కడక్కడ గుండ్రటి మచ్చలుపడుట. చుండ్రు బయలుదేరుట.

కన్నులు:— కనురెప్పలు ఉబ్బుట. మంటలుగానుండుట. గ్రుడ్లు మాంసపుముద్దవలె యెర్రగానుండుట. కనురెప్పలు యెర్రబడుట, ఒరియుట. వాచుట, నీళ్లుకారుట. రెప్పల లోపలివైపున దుర్మాంసము పెరుగుట. కాచబింబము పుండగుట. బాధలు ఉష్ణోపచారములవలన తగ్గుట. జలుబువలన కండ్లకలకవచ్చుట.

చెవులు:— బాధగానున్నపుడు ధ్వనులు వినపడుచుండుట. చెవిలో పోటు, బరువు, మంట దుర్వాసనగల పచ్చనిచీము వెడలుచుండుట.

ముక్కు:— ఒరియుట, పల్చని నీళ్లవంటిస్రావము వెడలుచుండుట. పడిశములోపలె ముక్కుదిబ్బడవేయుట. రక్తస్రావము. ముక్కు ఎముకలలో నొప్పిగానుండుట. తుమ్ములు వచ్చుచుండుట పుట్టపరిణము చేయుట. కొరుకు సవాయిపుండ్లు.

ముఖము:— మిక్కిలి బాధనొందుచున్నట్లగపడుట. ముఖము పాం

గరించి ముడుచుకొనిపోయి పచ్చగా పాలిపోయి శవాకృతినిపోలి చల్లని చెమటతో కప్పబడియుండుట. పెదవులు నల్లగా ఆరిపోయి బీటలుతీసి యుండుట; వీటికి రోగి తరచు నాకుచుండుట. సూదులతో కుట్టుచున్నట్లును చీల్చుచున్నట్లును బాధగానుండుట.

నోరు:—అనారోగ్యముగా నుండుట. ఇగుళ్లనుండి సులభముగా రక్తము స్రవించుట. పెదవులమీదను నోటిలోపలను పుండ్లు. రాత్రియందు నిద్రలో పండ్లు పటపటకొరుకుచుండుట. ఒక్కపార్శ్వమునవచ్చు పండ్ల నొప్పులు. పంటిపోటు రాత్రి 12 గంటలతరువాత యెక్కువగుట. ఇది వుష్ణముచే వుపశమించుట. బహిష్టులోకలుగు పంటిపోటు, పండ్లసొఖపు మీద కాల్కేరియా కార్బ, కేమోమిల్లా, లెకెసిస్, ఫాస్ఫరసు, సేపియా, స్టాఫిసేగ్రియా, యివికూడపనిచేయును. నాలుక ఆర్చుకొనిపోయి పూత గలిగియుండుట. నోయిఆర్చుకొనిపోయి అమితదాహముగానుండుట. నోరు, సప్తపథ, మంటగానుండుట. నీరు కొంచముకొంచము త్రాగినను యిమడక పోవుట. నీళ్ళూరుచుండుట.

అన్నకోశము:—అగ్నిమాంద్యముతో బాధపడుచున్నను తూనికకు రోగి యెక్కువగుట. మరియు నోరు దుర్వాసనగాను, నిస్త్రాణగానుయుండుట. ఆహారపురుచి, వాసనను భరింపలేకపోవుట. భోజనము రుచింపక పోవుట. భోజనానంతరము పొట్టలో బరువుగానుండుట. మంటగాను యెక్కువ వేడిగానుయుండుట. ఆహారముగాని పానీయముగాని అన్నకోశము జేరినవెంటనే వమనమగుట. వాంతులు, విరేచనములవలన మిక్కిలి నిస్త్రాణజెందుట. త్రాగుబోతులలో వుదయమున వమనము లగుచుండుట. నీరు యెక్కువగానుండు (ఆనపకాయ మొదలగు) కూరలు, మంచుగడ్డసంబంధమైన (ఐస్ క్రీమ్ మొదలగు)వాటిని తినుటవలన అన్నకోశము పాడగుట. పుల్లనిపండ్లను, ఆహారములను, బ్రాంది, కాఫీ, పాలను, తరుచుభోజనమును కోరుచుండుట. వెన్న, చల్లనిపానీయములం దిష్టముండక పోవుట.

పొత్తికడుపు:—బాధలు కొరుకుచున్నట్లును మంటగాను వుండుట;

ఇవి వృష్ణోపచారములవలన వుపశమించుట. కాలేయము, ప్లీహామువాచి నొప్పిగానుండుట. దగ్గునపుడు పుండులోపలబాధగానుండుట జలోదరము, పుబ్బుమీద బాగుగా పనిచేయును. పొట్టవుబ్బి బాధగానుండుట.

గొంతుక:—వాపు, నీరుపట్టుట, ముడుచుకొనిపోవుట, మంట, ఆర్చుకొనిపోవుట, నీటివలన గుటకవేయుట కష్టముగానుండుట.

హృదయము:—స్వల్పపరిశ్రమవలన కలిగిన అలసటవలన గుండెదడ వచ్చుట. రాత్రియందు విపరీతమైన దడ. మలవిసర్జనానంతరము యెక్కువ నిస్త్రాణగాను ఆవేదనగాను దడగాను యుండుటవలన రోగిపరుండవలసి వచ్చుట. నాడి వక్రముగాను ఒకవిధమైన చురుకుతనముతోను ఒకప్పుడు అతివేగముగాను సన్నముగాను, కొట్టుకొనుచుండుట. ఏంజినాపెక్టోరిస్ అనబడు దడతోకూడిన హృదయరోగముమీద బాగుగాపనిచేయును. మేహ వాతమువలన హృదయమునకు నష్టముకలుగుట. హృదయరోగమువలన కలుగు పుబ్బులమీద నిది బాగుగాపనిచేయును. పొగాకు నుపయోగించువారలలో గలుగు హృదయరోగములు. ఉదయమున నాడివేగముతో కొట్టుకొనుచుం డుట. హృదయము కొవ్వుతో కప్పబడియుండుట.

చర్మము:—సముద్రపుటొడ్డున నివసించువారికి కలుగుచర్మరోగ ములు. చర్మము పొడిగా ఆరుకుపోయి చల్లగాను నీలిరంగుగాను యుండు ట. తెల్లని లేక యెఱ్ఱనిమొటిమలు దురదతోను మంటతోను బయలుదేరు ట. నల్లని నీటిపొక్కులు బయలుదేరుట. పుండ్లు దుర్వాసనతోను రక్తము చీము స్రావముతోను నీలిరంగు లేక ఆకుపచ్చరంగుగాను అగుపడుట. ఎక్కువ మంటగానుండు గాచవ్రణములు. ఉలిపిరికాయలు. పుట్టవ్రణము లతో విపరీతమైన మంట, కోయుచున్నట్లు బాధలు.

మలము, మలాశయము:—మలము కొద్దిగాను నల్లగాను దుర్వాసన తోను, ఒకప్పుడు ఆకుపచ్చని ఆమముతోను వెడలుట. భోజనానంతరము, పానీయములు త్రాగినపిమ్మటను, రాత్రియందును, బ్రాందీమొదలగువాటిని త్రాగుటవల్లను, చెడిపోయిన మాంసమును తినుటవల్లను, నీళ్లవిరేచనము

లగుట. మిక్కిలిబాధ, నిస్త్రాణ, అతిదాహముతో కూడిన కలరావిరేచనములు. దేహముమంచువలె చల్లబడుట (విరేట్రిం ఆల్బం). విరేచనమగునపుడు ఆసనము మంటగా నుండుట. ఆసనమువద్దజిరియుట. విరేచనబద్ధము. మూలశంఖ మంటగానుండుట. నల్లని రక్తముతో కూడినజిగటవిరేచనములు. అనాస సంబంధమైన విరేచనములమీద బాగుగా పనిచేయును.

మూత్రావయవములు:—కొద్దిగాను మంటతోను అప్రియత్నము గాను మూత్రము వెడలుచుండుట. మూత్రకోశము పక్షవాతమునొందినట్లుండుట (కాస్టికం, హయోస్యామస్). మూత్రములో శ్వేతధాతువు, రక్తము, చీము కలసిపోవుట. మూత్రవిసర్జనానంతరము పొట్టలో నీరసముగానుండుట. మధుమూత్రము, అతిమూత్రము.

పురుషావయవములు:—దురద, మంట, పోటుతో కూడినపుండ్లు. అండములవాపు. స్వప్నస్ఖలనము. పల్చనివిరేచనమగుచున్నప్పుడు ప్రాస్టేటు గ్రంధినుండి స్రావము కలుగుచుండుట.

స్త్రీఅవయవములు:—ఎక్కువసంభోగేచ్ఛ. బహిష్టుయెక్కువ త్వరగాను, స్రావము విస్తారముగాను యెక్కువబాధతోను అగుట. ఒకప్పుడు ఋతువుఆగిపోవుట. భుజములలోనునడుములోను నొప్పిగానుండుట. కుసుమ పసుపుగాను చిక్కగాను దుర్వాసనతోను, ఒరుపు, మంటతోను వెడలుట, ఇది పరిశ్రమవలన నెక్కువగానగుట. అండాశయములో మంటగానుండుట. ఋతుస్రావము విస్తారముగానగుట.

శ్వాసకోశములు:—శ్వాసనాళములు ముడుచుకొనిపోయినట్లుండుట. స్వరపేటిక అర్చుకొనిపోవుట. ఛాతీలో బాధగానుండుట. ఉబ్బసపుదగ్గు—దీనివలన రాత్రి పడకనుండిలేచి కూర్చొని శ్వాసపీల్చవలసివచ్చుట. సాయంకాలము పరుండినవెంటనే వూపిరిఆడకపోవుట. పిల్లికూతలు. కంఠనాళము ముడుచుకొనిపోవుట. శ్లేష్మము నురగవలెను గుడ్డులోని సొనవలెను వెడలుట. దగ్గునప్పుడు శ్లేష్మముతో రక్తజీరపడుట. పొడిదగ్గువలన ఛాతీలో నొప్పిగానుండుట. శ్వాసకోశము కుళ్ళుటవలన ఆకుపచ్చ

గాను దుర్వాసనతోను కూడిన శ్లేష్మము వెడలుట. ఉబ్బసపుదగ్గు అర్ధరాత్రిమున వుద్రేకించుట. ఉక్కిరిబిక్కిరిఅగునను భయముచే పరుండలేక పోవుట. పానీయములు త్రాగుటవలన దగ్గు యెక్కువగుట. క్షయరోగులు తూనికలో తగ్గుచున్నప్పుడు పనిచేయును. క్షయరోగులలో ఉష్ణోగ్రతను తగ్గించును.

మెడ, నడుము:—నడుములో నొప్పిగానుండుట. భుజములులోనికి లాగుచున్నట్లుండుట, వీపు మంటగాను బాధగాను వుండుట.

కాళ్లు, చేతులు:—నిస్సత్తువచే లాగుచుండుటవలన పరుండవలసి వచ్చుట. కాళ్లు వుబ్బుట. మంటతోకూడిన బాధలు. మధుమేహమువలన కలుగు వ్రణములు. మడమలమీద పుండ్లగుట. దిగువఅవయవములకు పక్షవాతము వచ్చుట, మరియు నివి యెండిపోవుట. మోకాళ్లలో చితుకగొట్టినటు నొప్పులు, సిక్కలు లాగుట.

నిద్ర:—అస్థిమితముగానుండుట. దుష్టకలలవలని నిద్రలేమి. తెల్లవారుజామున 3 గంటలకుపిమ్మట నిద్రపట్టుట.తలదిండ్లపై తలనుంచి పండుకొనినయెడల నిద్రపట్టుట. చేతులను తలమీదపెట్టుకొని నిద్రించుట. నిద్రమత్తుగా నుండుట.

జ్వరము:— విడువని మన్యపుజ్వరములు దీనివలన కుదర్చబడినవి. అస్థిమితముతోకూడిన టైఫసుజ్వరము, దీనిలోమంట, ఆర్పివేయునట్టివేడి. అర్ధరాత్రియైనపిమ్మట ఆతురత. కప్పుకొనినబట్టను తీసివేయవలెనని యుండుట. పరుండబోవుముందు చెమటలుగ్రమ్ముట. మరియు నివి కొంచెము సేపు పరుండినచో మానుట. విషజ్వరము. మన్యపుజ్వరములో యెక్కువ వేడిగా నుండుట. పరాకుమాటలు అర్ధరాత్రిఅయినపిమ్మట యెక్కువగా నుండుట. కాలక్రమము,పద్ధతిలేక వచ్చుజ్వరములు, రక్తదోషమువలనవచ్చు జ్వరములు, శల్యగతజ్వరములు, మన్యపుజ్వరము, సన్నిపాతజ్వరములో ఆఖరుదశయందు మిక్కిలినిస్త్రాణ,అస్థిమితముగా నుండుట,—వీటికి దీనిని వాడవచ్చును. చెమట ఆరినపిమ్మట గుడ్డలు పసుపుపచ్చగానగుట. మన్యపు

జ్వరములో క్వయినా యెక్కువవాడుటవలనవచ్చినదోషమునుపోగొట్టును.

ఉద్రేకము:—పానీయములు త్రాగినపిమ్మట, అధిక పరిశ్రమవలన, తలను పల్లముగానుండి పరుండుటవలన; పండ్లు, పాలు, నైను త్రాగుటచేత; మెట్లు, పర్వతములు యెక్కుటచేత; నివ్రిలో.

ప్రశమనము:—తలను యెత్తుగానుంచి నిద్రించుటవలన; వేడిపదార్థములవలన, చీకటిగదిలో పరుండుటవలన.

సహచరులు:—రూస్టాక్సు, కార్బోవెజ్, ఫాస్ఫరస్, తూజా, సెకెలే.

విరుగుళ్లు:—ఓపియం, చైనా, హెపారుసల్ఫు, నక్సువామికా, క్యాంఫర్, ఆర్నికా, సల్ఫరు, విరేట్రంఆల్బం.

కార్బోవెజ్, చైనా, ఫెర్రంమెట్, గ్రాఫైటీసు అయోడియం, ఇపెకాక్, లెకెసిస్, మెర్క్యురియసు, నక్సువామికా, విరేట్రం ఆల్బం, త్రాగుడువలనిదోషములు—వీటికిది విరుగుడు.

పోలికలు:—ఎఖినేషియా, కేప్సికం, ఆర్జెంటం నైట్రికం, కేంథారిసు, ఇపెకాక్, లెకెసిసు, విరేట్రం ఆల్బం.

మోతాదు:—6 మొదలు 1000 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 36 దినములకు పైగాయుండును.

నీళ్లవిరేచనములు, కలరా, టైఫాయిడ్, పుట్టపగ్రణము, చర్మవ్యాధులలోను 6 వ పొటెన్సీ వాడనగును. మన్యపుజ్వరము వుబ్బసము మొదలగు వాటిలో 30, 200 వాడనగును. ఇంతకు పైపొటెన్సీలుకూడ బాగుగా పనిచేసినవి. సాధారణముగా చిన్నపొటెన్సీలు అన్నకోశము, పేగులు, మూత్రపిండములవ్యాధులలో వాడనగును. మరియు పెద్దపొటెన్సీలు పార్శ్వపునొప్పులకు నరములసంబంధమైన వ్యాధులలోను వాడనగును.

## 300. ఆర్సెనికం బ్రోమేటం. ARSENICUM BROMATUM.

ఇది సవాయివ్యాధిమీదను చర్మవ్యాధులమీదను బాగుగా పని చేయును. మచ్చలు, దద్దుర్లు, పుండ్లు సవాయిసంబంధమైన పొక్కులు, మాంసగ్రంథులవలె నగుపడుకంతులు, కీళ్లుపంగకపోవుట, విడువవటువంటి మన్యపుజ్వరము, మధుమూత్రము, వీటిమీద నిది బాగుగా పనిచేయును.

ముఖము:—పసుచువారలలో యొఱ్ఱని మొటిమలు. ఊదారంగుగల దద్దురు, ముక్కుమీద బయలుదేరుట. ఇవి మార్చి ఏప్రియల్ నెలలలో వచ్చుచుండుట.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 301. ఆర్సెనికం అయోడేటం. ARSENICUM IODATUM.

ఇది బహువిధములైన దీర్ఘవ్యాధులమీదను ముఖ్యముగా క్షయ రోగముమీదను బాగుగా పనిచేయును. పుండును కలుగజేయునటువంటి స్రావముతోకూడిన కుసుమ మొదలగు వ్యాధులమీద నిది బాగుగా పని చేయును. విస్తారముగాచదువుటవల్లవచ్చిన తలనొప్పిని మాన్పును. సవా యిరోగముయొక్క అన్నిదశలలోను బాగుగా పనిచేయును.

మనస్సు:—కోపము అధికముగానుండుట. చదువుటయందయిష్టత.

తల:—తలతిప్పు, నడచుటవల్ల తలనొప్పివచ్చుట. తలమీదవాపు, బాధతోకూడిన కురుపులు బయలుదేరుట.

కన్నులు:—చురుకుచురుకుమని పోటుగాను మంటగానుయుండుట, మాననటువంటి కండ్లకలకలు.

చెవులు:—చల్లనిగాలిలో ప్రయాణముచేయుచున్నపుడు ఎడమ చెవిలోను, నుదిటిలోను బాధగానుండుట.

ముక్కు:—మాననటువంటి స్రావము, యిది తేనెవలె పచ్చగాను

ఒకప్పుడు నీళ్లవలె పల్చగాను వుండుట. మరియు యిది తగిలినచోట పుండగుట, తుమ్ములువచ్చుచుండుట, ముక్కువాచుట.

గొంతుక:—సప్తపథలో మంటగానుండుట, గవదకాయలువాచుట. వూపిరి దుర్వాసనగానుండుట. చిక్కనిఆమము, రక్తము వెడలుట.

అన్నకోశము:—భోజనమైన గంటకు వమనమగుట, తరుచు తల తిరిప్పు, వమనము. ఎక్కువదాహమగుట, రోగి యెప్పుడును చన్నీళ్లనే కోరుట, చన్నీళ్లను త్రాగినయెడల వమనము చేసుకొనుట.

పొత్తికడుపు:—వాయువు యెక్కువగా చేరుటవల్ల పొంగరించి గట్టిగానుండుట. అపానవాయువు తరుచు వెడలుచుండుట, కోయుచున్నట్లు బాధగానుండుట.

మలము, మలాశయము:—ఆసనములో బాధ విడువకుండా యుండుట, నీళ్లవిరేచనముచే ఆసనముపుండగుట. జిగటవిరేచనములు, నీళ్లవిరేచనములు వెడలుచుండుట.

శ్వాసావయవములు:—ముక్కు దిబ్బడవేయుట. వుబ్బసములో శ్వాసనునిబ్బరముగా కూర్చుని పీల్చవలసివచ్చుట. రాత్రియందునుఉదయమందును శ్లేష్మ మెక్కువగా వెడలుచుండుట, తరుచు దగ్గువచ్చుచుండుట, మరియు చీము, శ్లేష్మము వెడలుచుండుట. స్రావము అసహ్యముగాను, పసుపుపచ్చగాను తెనెపలెను వెడలుచుండుట. ఊపిరి సరిగా అందకపోవుట. శ్లేష్మము వెడలుట కష్టముగానుండుట. గొంతుక బొంగురుపోవుట. క్షయరోగము.

జ్వరము:—అప్పుడప్పుడు చెమటలు పోయుచు జ్వరము వచ్చుచుండుట. రాత్రి చెమటపట్టుటవలన గుడ్డలన్నియు తడసిపోవుట. నాడి త్వరితము గాను, నీరసముగాను, వక్రముగాను వుండుట. చలిగానుండినను చల్లదనమును ఓర్చుట కష్టముగా నుండుట.

చర్మము:—ఆరిపోయి, దురదతోను పగుళ్లతోను కూడియుండుట. చర్మము ముడతలుపడినచోటనుండిగాని, బీటలుపడినచోటనుండిగాని స్రావమువచ్చుచుండుట. క్షయసంబంధమైన పెద్దపెద్దమాంసగ్రంధులను, సవా

యిసంబంధమైన బిళ్లలను మాన్పును. రాత్రి చెమటలు పోయుటవలన యెక్కువనిస్త్రాణవచ్చుట. రోగి ఆరుచికొనిపోయి బరువుకుతగ్గిపోవుట. చర్మరోగము యెన్నాళ్లకును మానకుండుట. చర్మము గట్టిపడి దానిపై బయలు దేరిన పొక్కులమొనలు గట్టిగాను రసితోను కూడియుండుట.

విరుగుళ్లు:—బ్రియోనియా.

మోతాదు:—3x మొదలు 30 పొటెన్సీ.

---

## 302. ఆర్సెనికం సల్ఫురేటమ్ ప్లేవమ్.

## ARSENICUM SULPHURATUM FLAVUM.

చర్మరోగములమీదను సహాయిమీదను గాఢముగా పనిచేయుమందులలో నిది యొకటి. రోగములు జీర్ణించినపిమ్మటను అణచిపెట్టబడిన పిమ్మటను దీనిని వాడినయెడల అట్టివాటినికూడ నిరపాయకరముగ మాన్పును. ఎముకలు పుచ్చిపోవుట, విరేచనానంతరగము స్మృతితప్పి పడిపోవుట, రోగివుద్రేకమునిచ్చువస్తువులను, కాఫీ, పుల్లనివస్తువులు, వెచ్చనివస్తువులు, తీపివస్తువులనుకోరుచుండుటయు, బలుహారమైన ఆహారమువలన అజీర్ణము చేయుచుండుటయు దీనివుపయోగమును సూచించును.

మనస్సు:—రాత్రియందు ఒంటరిగానుండుటను గురించియు చావునుగురించియు భయపడుట. దయ్యములు కనబడుచున్నవనుకొనుట. రోగి సులభముగా భయపడుచుండుట.

తల:—తలనొప్పిగాయున్నను చల్లగానేయుండుట. ముఖముమీద పొక్కులు, మొటిమలు బయలుదేరుట.

నోరు:—పుండ్లు.

కన్నులు:—కాచబింబముపైని మచ్చలు పుండ్లుఅగుట.

ముక్కు:—పడిశెముపట్టుట. ఆరిపోయినట్లుండుట. లోపలమంటగానుండుట, పుండ్లుపడుట, వాచుట, తరుచు తుమ్ముచుండుట,

శ్వాసావయవములు:—ఛాతీలో సూదులతో గ్రుచ్చు చున్నట్లు బాధగానుండుట. ఊపిరిపీల్చుట కష్టముగానుండుట. ఉబ్బసపుదగ్గు.

మలము, మలాశయము:—ఒకప్పుడు విరేచనబద్ధము. ఇంకొకప్పుడు నీళ్లవిరేచనములు. జిగటవిరేచనములు రక్తపుజీరతోను కొద్దిగా మలముతోను వెడలుట. ఆసనములోనిపుండ్లు. బయటికివచ్చు మూలశంఖ, నడచుట వల్ల నిది బాధకరముగానుండుట. ఆసనముదురద. విరేచనమగునపుడు మంట, బాధగానుండుట.

పురుషావయవములు:— అపరిమితమైన బాధలతోకూడిన సెగ. అస్థిమితము. రాత్రింబవళ్లు అంగముపొడుగున మంటతోను, ఎల్లప్పుడును పసుపుపచ్చని స్రావముతోను కూడినసెగ.

స్త్రీఅవయవములు:—రక్తకుసుమ, ఒకప్పుడిది చిక్కగాను పసుపుపచ్చగాను బహిష్టుకువెనుక వెడలుచుండుట.

చర్మము:—బొల్లి లేక శ్వేతకుష్ఠును, మంత్రిపుపొక్కులనుమాన్పుటలో అమోఘముగా పని చేయును. మచ్చలు పడినచోట మండుచుండుట. మచ్చలు తెల్లగాను, పైత్యమువలనను, నీలిరంగుగాను పాలిపోయినట్లుగాను యెఱ్ఱగాను ఆర్చుకొనిపోయి మంటగాను యుండుట. నీటిపొక్కులు, గట్టిపొక్కులు, రాచకురుపులు యివి మంటతో కూడియున్నప్పుడు దీనిని వాడవచ్చును. చర్మరోగములు దురదతోను మంటతోను కూడియుండుట. గోకినయెడల పుండుపడుట. రక్తము, నీళ్లవంటి స్రావము వచ్చుచుండుట. ఒకప్పుడు పొట్టువంటి పదార్థమువచ్చుచుండుట; ఇట్టివి వాపు, జ్వరముతోను అప్పుడప్పుడు కూడియుండుట. ఇట్టి బహువిధచర్మరోగములమీద నిది బాగుగా పనిచేయును.

నిద్ర:—స్వప్నములో స్ఖలనమగుట. అస్థిమితముగా నుండుటవలన నిద్రపట్టకపోవుట.

జ్వరము:—విడువనటువంటి మన్యపుజ్వరములమీద బాగుగా పని

చేయును. క్వయినా వాడినవల్ల వచ్చిన నీరసమును పోగొట్టును.

పోలికలు:—హైడ్రొక్లోరైడ్, ఎనకార్డియం.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ.

---

## 303. ఆరం ఆర్స్. AURUM ARS.

సవాయివ్యాధిమీదను, నరములసంబంధమైన వ్యాధులమీదను వీటి ననుసరించియుండు యితరరోగములమీదను, కుడిపైపు అవయవములకు వచ్చు రోగములమీదను ఇది బాగుగా పనిచేయును. ఎముకలు పుచ్చిపోవుట, ఎముకలలో కలుగు నొప్పులు, మాంసగ్రంధులు వాచుట, పుండ్లగుట, గట్టిపడుట, రక్తము క్షీణించిపోవుట, రోగి పాలిపోవుట, క్షయరోగము ఇవి దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—కంపముతో కూడిన నరములసంబంధమైన వ్యాధులమీద బాగుగా పనిచేయును. మూర్ఛ, హిస్టీరియా లేక అపస్మారము. నొప్పి లేనట్టి పక్షవాతము.

తల:—సవాయివ్యాధిలో కలుగు తలనొప్పులు.

శ్వాసావయవములు:—మాననటువంటి పడిశెములను, సార్పములను మాన్పును. తరుచు తుమ్ములువచ్చుచుండుట. ముక్కులో పుండగుట.

అన్నకోశము, పొత్తికడుపు:—ఎడతెగని ఆకలి, ఒకప్పుడు అన్నముయందు హితవుతప్పుట; వికారము, తలనొప్పిగాను వుండుట; యెక్కువ దాహముగానుండుట; పైత్యరసమును వమనము చేసుకొనుట. కాలేయము గట్టిపడి చిన్నదగుట; ఒకప్పుడువాచి పెద్దదగుట.

మర్మావయవములు:—సవాయిపుండ్లు. ఇది సవాయివ్యాధియొక్క అన్నిదశలలోను బాగుగా పనిచేయును. అధికసంభోగమువలనను దురభ్యాసములవలనను కలుగు నిస్త్రాణ. గజ్జలలోని బిళ్లలువాచి పుండ్లగుట.

చర్మము:—పుట్టపగిణము లేక కేన్సరు. చర్మముపైని పచ్చని లేక నీలిరంగుగల మచ్చలు. పొక్కులు మొటిమలు దురదగాను బాధగాను వుండుట, ఉబ్బుట, తూట్లుపడుట. పుండ్లనుండి దుర్వాసనతోకూడిన పసుపు పచ్చని రసివచ్చుట. సవాయిసంబంధమైన పొక్కులు, కాయలు. నురుగుడుకాయలు లేక చెమటకాయలు.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ.

## 304. ఆరం అయోడేటం. AURUM IODATUM.

ఇది కుడిపైపు అవయవములమీదను, సవాయివ్యాధిమీదను, మాంస గ్రింధులవాపుమీదను బాగుగా పనిచేయును.

మనస్సు:—ఉద్రేక మెక్కువగాయుండుట. మానసికపరిశ్రమవలన అస్థిమితముగా యుండుట. తొందరగాను పిచ్చివానివలెను వుండుట.

ముఖము:—కండ్లకలకలు. కంట్లనుండినీరుకారుట. కండ్లుబాధగాను నొక్కుచున్నట్లుయుండుట. దృష్టిమాంద్యము. చెవులనుండిదుర్వాసనతోకూడిన స్రావముపచ్చుట. చెవిలోగింగురుమన్నట్లును అరచుచున్నట్లును ధ్వనులు వినబడుట. కుట్లుచున్నట్లుండు బాధలు. మాటసరిగా వినపడకపోవుట. ముక్కు యెఱ్ఱగానుండుట. దుర్వాసనగలిగి, పచ్చనిరంగు లేక రక్తము చీమువంటిసావము వెడలుట. ముక్కు దిబ్బడవేయుట. తుమ్ములు వచ్చుచుండుట. పుండుపడుట. ముఖముమీద మొటిమలు. ముఖము పాలిపోయి నట్లుండుట. నోటినుండి నీళ్లుకారుచుండుట. ఇగుళ్లనుండి రక్తము స్రవించుచుండుట. నాలుక మండుచున్నట్లు బాధగాయుండుట. ఇగుళ్లు పుండ్లగుట. పండ్లనొప్పులు.

గొంతుక:—గొంతుకవాచి పుండగుట. గండమాలరోగమును మాన్పును (లైకోపోడియం).

అన్నకోశము:—ఎక్కువ ఆకలి, ఒకప్పుడు అన్నమునందసహ్యము కలుగుట. ఎక్కిళ్ళువచ్చుట.తలతిరుగుట. కడుపులోమండుచున్నట్లు కోయుచున్నట్లు, నొక్కుచున్నట్లు కుట్టుచున్నట్లువుండు బాధలు. విదాహము, పైత్యరసమును వమనము చేసుకొనుట.

పొత్తికడుపు:—కాలేయసంబంధమైన రోగములమీదపనిచేయును. కాలేయముగట్టిపడుట, చిన్నదగుట. దీనివలన శూలగాను, బాధగాను యుండుట. గుడగుడలాడుచుండుట. ఒకప్పుడు విరేచనబద్ధము. ఇంకొకప్పుడు నీళ్లవిరేచనములు. ఎక్కువ అపానవాయువు వచ్చుచుండుట మూలశంఖ వెలుపలకువచ్చుట. ఆసనము మంటగానుండుట.

మర్మావయవములు:—అండములు గట్టిపడి చిన్నవగుట. బుడ్డ, రాత్రియందు లేపన మెక్కువగానుండుట. అండములువాచి యెక్కువ బాధగానుండుట. అవయవములమీద నెక్కువ చెమటపట్టుట. స్త్రీలలో అండాశయముగట్టిపడుట. కుసుమ పసువుపచ్చగాను, చిక్కగాను,దుర్వాసనతోను, యెక్కువగాను వెడలుట. బహిష్టుకాకపోవుట, లేక అణిచిపెట్టబడుట. గర్భాశయము వెలుపలకు వచ్చుట. వంధ్యత్వమునుమాన్పును.

కాళ్లు, చేతులు:—మేహవాతనొప్పులు. అవయవములలో చీల్చుచున్నట్లు కుట్టుచున్నట్లువుండు బాధలు. అవయవములుబ్బుట. నీరుపట్టుట. మరియు నీరసముగానుండుట.

చర్మము:—మంటగాను ఒకప్పుడు చల్లగాను వుండుట. దురదగానుండుట. పుండ్లగుట. పుట్టువ్రణములను పోలినపుండ్లు బయలుదేరుచుండుట. వీటినుండి పచ్చనిరసి వెడలుచుండుట.

మోతాదు:—6 x మొదలు 200 పొటెన్సీ.

---

## 305. ఆరం మెట్. AURUM METALLICUM.

(బంగారము)

రసదోషములమీదను, సవాయివ్యాధిమీదను, ఎముకలు, రక్తము, మాంసగ్రంథులు, నరములు వీటికి సంబంధించిన వ్యాధులమీదను ఇది బాగుగా పనిచేయును. పొటాసియంఅయోడైడ్, ఆల్కహాలు, రసము యెక్కువగా తీసికొనుటవలనను, కోపమువలనను, విచారమువలనను, భయమువలనను, ప్రేమభంగమువలనను కలిగినరోగలక్షణములమీద నిది బాగుగా పనిచేయును. రోగి భవిష్యత్తును గూర్చి ఆతురతను జెందియుండుట, ఎముకలు పుచ్చిపోవుట, ఎముకలలో నొప్పులు—ఇవి దీనివుపయోగమును సూచించును.

మనస్సు:—ఈప్రపంచములో తనవలనకలుగు మేలేదియు లేదనుకొని ఆత్మహత్యచేసుకొనవలెనను తలంపుగలుగుట (నజా); కాని అట్లు చేయుటకు భయపడుట (నక్సవామికా). మనస్సువిచారముతో కూడియుండుట. రోగి చావునుగోరుచుండుట ఏడ్చుచుండుట. ప్రార్థనచేయుచుండుట. నిరాశజెందుచుండుట. ప్రాణము భారముగాతోచుట. తానుచెప్పినది కాదనిన తీవ్రమైన కోపమువచ్చుట.

తల:—విపరీతమైన బాధ రాత్రియందెక్కువగానుండుట. తలయెముకలలోని నొప్పులు ముఖమునకు వ్యాపించుచుండుట. తలమీద కురుపులువేయుచుండుట. తలతిప్పు. రసము యెక్కువగా వాడువారిలోను, సవాయివ్యాధివలనను, వెంట్రుకలూడిపోవుచుండుటను మాన్పును.

కన్నులు:—కండ్లు నొప్పిగానుండుట. రెప్పలు పైకెత్తిచూచుట కష్టముగానుండుట. దృష్టి క్రిందిభాగమునకు మాత్రమే ఆనుట. కంటిని ఆనుసరించియున్న యెముకలలో నొప్పులు. కండ్లయెదుట నల్లనిమచ్చలు, మంటలు, చుక్కలు, కనపడుట, వస్తువులు చిన్నవిగాను దూరముగానున్నట్లును అగుపడుట. దృష్టి మందగించుట. వస్తువులయొక్క పైసగముభాగము సరిగా కనిపించకపోవుట. దుర్వాసనతో కూడిన స్రావము.

చెవులు:—సవాయివ్యాధివలన చెవియెముకలు పుచ్చి, పోటుగా నుండుట, వాసనతోకూడిన స్రావమువచ్చుచుండుట.

ముక్కు:—సవాయివలన యెముకలుపుచ్చుట. దుర్వాసనతోకూడిన స్రావమువచ్చుచుండుట, వాపుగాను బాధగాను వుండుట. ముక్కుదిబ్బడ వేయుట, రసితో నిండియుండుట.

నోరు:—పడుచుపిల్లలలో నోరు దుర్వాసనగాయుండుట. రుచి కుళ్లినట్లుగాను చేదుగాను వుండుట. ఇగుళ్లు వుండ్లగుట.

గొంతుక:—గుటక వేయునపుడు కుట్టుచున్నట్లుండు బాధలు. మాంస గ్రంధులలో నొప్పిగానుండుట.

ముఖము:—ఎముకలలో చీల్చుచున్నట్లు బాధలువచ్చుట.

శ్వాసావయవములు:—కంఠనాళములోను ఛాతీలోను ఆమము యెక్కువగా చేరి, కష్టముమీద నిది వుదయమున వెలుపడుట. ముక్కుమాటలు. ఊపిరాడకపోవుటవలన దగ్గువచ్చుట. ఉదయమున లేచుసరికి పసుపుపచ్చని శ్లేష్మము వెడలుట. దగ్గువచ్చుట.

హృదయము:—ఆతురతతోకూడిన గుండెదడ. హృదయము వక్రముగాను ఒకప్పుడు వరుసగాను కొట్టుకొనుచుండుట. నడచుచున్నప్పుడిది కదలుచున్నట్లుండుట. ఒకప్పుడు గుండె కొట్టుచుండుట మానివేసినట్లుండుట. గుండెదడవలన చేయుచున్నపనిని ఆపవలసివచ్చుట. హృదయముకొవ్వుపట్టుట (ఫాస్ఫరసు). పెద్దదగుట లేక వాచుట.

ఎముకలు:—సవాయి మొదలగు సుఖరోగములవలన యెముకలు చెడిపోవుట. ఎముకలలో నొప్పులువచ్చుట (కాలీఅయోడ్, ఎసాఫాటీడా, మెర్క్యూరియసు), మరియు కంటిదోషములు. అంగుడు, ముక్కు, గొంతుక, చెవి మొదలగువాటిలోని యెముకలదోషములు.

అన్నకోశము:—దాహము, ఆకలియెక్కువగానుండుట. కడుపులో మంటగానుండుట. వెచ్చని తేన్పులు వచ్చుచుండుట.

పొత్తికడుపు:—వాయువు బంధింపబడుట, గజ్జలలోని మాంసగ్రంధులువాచి పుండ్లగుట. మూత్రము మజ్జిగవలెను, చిక్కనిముడ్డితోను వెడలుచుండుట. కామెర్లు.

మలము, మలాశయము:—విరేచనబద్ధము. పెద్దవిరేచనములు యెక్కువ గట్టిగాను వుండలవలెనుఅగుట. రాత్రియందు నీళ్లవిరేచనములు.

పురుషావయవములు:—వృషణములు వాచుట, గట్టిపడిపోవుట, బాధగానుండుట. ఇది బుడ్డనుమాన్పును. విపరీతమైన లేపనము కలుగుట. పిల్లవాండ్రి అండములుగట్టిపడి చిన్నవగుట. స్వప్నస్ఖలనములు. ప్రాస్టేటు గ్రంధినుండి స్రావము. సవాయిసంబంధమైన బిళ్లలు. అడ్డకఱ్ఱలు.

స్త్రీఅవయవములు:—గర్భాశయము పెద్దదై బరువెక్కి వెలుపలికి వచ్చుట. ఇట్టిలక్షణములు యెక్కువగా రక్తముచేరుటవలన కలుగగలవు. తలలోను, గుండెలోను, ఛాతీలోను, మూత్రపిండములలోను ఇట్లురక్తము చేరుటవలన బరువుగాకనుపించునపు డీయౌషధమును వాడనగును. ఋతువు అలస్యముగాను, స్రావము కొద్దిగాగాని అణిచిపెట్టబడిగాని యుండుట. మలాశయము వెలుపలకువచ్చుట. కుసుమ పచ్చగాను లేక తెల్లగాను,విస్తారముగాను, చిక్కగాను వెడలుట. గర్భిణీగాయున్నప్పుడు ఆత్మహత్య చేసుకొనుటకు మనస్సును కలవరముచేసుకొనుట.గర్భాశయముగట్టిపడుట.

కాళ్లు, చేతులు:—చేతులయొక్కయు, వేళ్లయొక్కయు, కీళ్ల సంధులలో చీల్చుచున్నట్లుండు బాధలు. దిగువ అవయవములు వుబ్బుట. మోకాళ్లలో నొప్పులు. నీరసము.

వుద్రేకము:—చలిగాలిలో, చలువచేయుటవలన, మనోవేదనవలన, శీతకాలములో, సూర్యోదయము మొదలు సూర్యాస్తమయమువరకు.

ఉపశమనము:—వేసవిలో, వేడివలన, వునయమున.

పోలికలు:—సిఫిలినం, మెర్క్యూరియాను, ఎసాఫొటీడా, ఆర్సెనికం ఆల్బం, ఆర్జెంటంమెట్, ఆర్జెంటంనిట్, కాలీఅయోడ్, కుప్రంమెట్.

విరుగుళ్లు:—బెల్లడోనా, చైనా, కుప్రం మెట్, మెర్క్యూరియస్, కాఫీ. పల్సటిల్లా, స్పైజీలియా, కాక్యులను.

మెర్క్యూరియసు, స్పైజీలియా, కాలీఅయోడ్—ల కిది విరుగుడు.

మోతాదు:—$6_X$ మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 42 దినములు.

---

## 306. ఆరం మూరు. AURUM MURIATICUM.

ఆగిపోయిన స్రావమును బయలువెడల్చి రోగమునుమాన్పును. రోగములు చిరాకువలనను భయమువలనను విసుగుదలవలనను కలిగినపు డిది బాగుగా పనిచేయును. అతినిస్త్రాణ, చెప్పలేనంతవిసుగుదల, శరీరమంతయు లాగుచున్నట్లుండుబాధలు దీని ప్రధానలక్షణములు.

తల:—తల నెచ్చగాను, అవయవములు చల్లగానుయుండుట. తల అంతయు యెప్పుడును మండుచుండుట.

కన్నులు:—పిల్లలలో అకస్మాత్తుగావచ్చు గ్రుడ్డితనమునుమాన్పును. ఎడమకంటిలో నొప్పివచ్చుట. కనురెప్పలువాచి బాధగానుండుట, కొలికవద్ద లోతుగా పుండుపడి స్రావమువచ్చుచుండుట.

చెవులు:—సంగీతమువలన చెవిరోగములు ప్రశమించుట.

ముక్కు:—మంటగాను, పుండ్లతోను, యెఱ్ఱనివాపుతోను, దురదగాను వుండుట.

ముఖము:— ఎఱ్ఱగానుండుట. కనుబొమలలోనుండియు తలనుండియు వెంట్రుకలూడిపోవు చుండుట.

పండ్లు:—విపరీతమైన పండ్లనొప్పి. పండ్లు కదలుచుండుట.

నోరు:—పుండ్లు, పుట్టవ్రణము, సురుగుడుకాయలు. నాలుక గట్టిపడుట.

అన్నకోశము:—మంట. కోయుచున్నట్లు సట్టుచున్నట్లు బాధలుండుట. జీర్ణము నెమ్మదిగా అగుట.

పొత్తికడుపు:—కాలేయము గట్టిపడుట. ప్లీహము పెద్దదగుట. పొట్ట వాచుట. గజ్జలలోని మాంసగ్రంధులు వాచుట.

మలము, మలాశయము:—భగందరము. నీళ్లవిరేచనములు. విరేచనమగుచున్నప్పుడు మూలశంఖునుండి రక్తము స్రవించుచుండుట.

మర్మావయవములు:—సురుగుడుకాయలవంటివి మర్మావయవముల మీదను, నాలుకమీదనుబయలుదేరుట. అడ్డగట్టలు, స్త్రీఅవయవములలో మంటగాను కుట్టుచున్నట్లునుయుండు బాధలు. పసుపుపచ్చని కుసుమ వుదయమువ స్రవించుచుండుట. సెగవ్యాధిలో స్రావము, దీనితోపాటు గజ్జలలో వాపులు.

శ్వాసావయవములు:— గొంతుక బొంగురుపోవుట. ఊపిరాడక పోవుట. మాట్లాడుట కష్టముగానుండుట.

హృదయము:—పైనుండి పొడుచుచున్నట్లుండు బాధలు.

కాళ్లు, చేతులు:—కాళ్ళువాచుట. చీల్చుచున్నట్లుండు బాధలు. మణికట్లలో వాపు.

విరుగుళ్లు:—బెల్లడోనా, కెన్నబిస్‌సతీవా, మెర్క్యూరియస్.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ.

---

## 307. ఆరంమూరు నేట్రం.

## AURUM MURIATICUM NATRONATUM.

స్త్రీమర్మావయవరోగములమీద నిది బాగుగా పనిచేయును. ఎముకలకు సంబంధించినరోగములలోను, నరములకుసంబంధించిన రోగములమీదను, సవాయిరోగములమీదను పనిచేయును.

ముక్కు:—పుండ్లగుట. ఎముకలు పుచ్చిపోవుట. గట్టిగాను వాపుగాను నిగనిగలాడుచు యుండుట.

నోరు:—నాలుకమీద పొక్కులు బయలుదేరుట. తెల్లనిపూత. లాలాజలము వూరుచుండుట, పండ్లుకదలుట.

మలము,మలాశయము:—మలము బంకమట్టినిపోలి వెడలుట మూలశంఖ బయటకువచ్చి బాధగానుండుట.

పురుషావయవములు:—అండములు వాపు. అంగముపైచర్మముమీద పుండ్లు, పొక్కులు బయలుదేరుట. బొగడపై లోతైన పుండ్లు. ఎడమ అండము వాచుట.

స్త్రీఅవయవములు:—చిన్నపిల్లలలో కలుగు గుండెదడ. గర్భాశయము బరువుగానుండుట, వెలుపలకువచ్చుట. మర్మావయవములలో వాపు, మంట, బాధగాయుండుట. అండాశయము గట్టిపడుట, ఉబ్బుట. గర్భాశయములో బయలుదేరు కంతులను కరగించును. గర్భాశయము పుండ్లుపడుట. పుండునుకలుగజేయునట్టి కుసుమ. మర్మావయవముమీద పొక్కులు బయలుదేరుట. దీనిని సవాయివ్యాధిచే బాధపడు స్త్రీ[illegible]చ్చినయెడలయీ వ్యాధి అట్టివారిపిల్లలకు రాకుండ కాపాడును.

హృదయము:—నిద్రపోవుచున్నప్పుడు గుండెదడ, ఆతురతగానుండుట. ఊపిరిఅందక పోవుట.

చర్మము:—దురదగా నుండుట. మానవటువంటి పుండ్లు.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ.

## 308. ఆరం సల్ఫ. AURUM SULPHURATUM.

బాధలు పొడుచుచున్నట్లుండుటను రోగి అప్రియత్నముగ రాత్రి నిద్రయందు మూత్రము విడుచుటను ఇది మాన్పును.

మనస్సు:—భయముతో కూడిన కలలు. ఒంటరిగా నుండగోరుట. జీవించుటయం దసహ్యముగా నుండుట.

తల:—ఊచుచుండుట. తల వెంట్రుకలూడిపోవుట. దురద.

కన్నులు:—రెప్పలవాపు. ఉదయమున రెప్పలంటుకొనుట. రెప్పల లోకలుగు కాయలు, పుండ్లు.

ముఖము:— పెదవులు బీటలుతీయుట. నోరు యెఱ్ఱగానుండుట. ఇగుళ్లువుబ్బుట. ఇగుళ్లనుండి రక్తము స్రవించుట.

నోరు:—గవదకాయలు వాచుట. కొండనాలుక పొడుగగుట.

అన్నకోశము:—ఎక్కువదాహము. తినిన ఆహారపు రుచితోకూడిన త్రేణుపులు, తరుచు యెక్కిళ్లువచ్చుట. జీర్ణము నెమ్మదిగాఅగుట. పైత్య రసమును వమనము చేసుకొనుట.

పొత్తికడుపు:—కాలేయము వాచుట.

పురుషావయవములు:—నపుంసకత్వము.

స్త్రీ అవయవములు:— స్తనములు వాచుట, ముట్టుకొనిన నొప్పిగా యుండుట. చన్మొనలు బీటలుతీయుట. పసుపుపచ్చని చిక్కని కుసుమ వుదయమున స్రవించుట. బహిష్టులో స్రావము సరిగా వెడలకపోవుట.

శ్వాసావయవములు:—రాత్రి విడిచివిడిచి వచ్చుచుండెడి దగ్గు. గట్టిగా దగ్గినయెడల కొద్దిగారక్తము, ఆమము వెడలుట. రాత్రియందు దగ్గువలన వూపిరాడకపోవుట.

హృదయము:—ఎత్తు యెక్కుచున్నప్పుడు దడగానుండుట.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ.

---

## 309. బెరీటా కార్బు. BARYTA CARB.

ఇది మాంసగ్రంధులకు సంబంధించిన రోగములమీదను, పక్షవాత ములమీదను, ముసలివారికిని పిల్లలకును వచ్చురోగములమీదను, జీర్ణసం

బంధమైన రోగములమీదను బాగుగా పనిచేయును.
కాయలవాపు, దీనివలనకలుగు చెవుడు, బిడ్డలు సరిగా
మొదలగు లక్షణములను మాన్పును. హస్తప్రయోగాది దురభ్యా
కలుగు నపుంసకత్వమును, బట్టతలయగుటను, జ్ఞాపకశక్తితగ్గుటను ఎ
ను. ఇది మరుగుజ్జుతనమును, గండమాలరోగమును మాన్పును. రుదప్రివాత
ముమీద పనిచేయును.

మనస్సు:—శరీరమానసిక దుర్బలత్వము, జ్ఞాపకశక్తితగ్గుట. తనయం దు తనకే నమ్మకము లేకపోవుట. ఏద్వవలెనని యుండుట. పరాయిమను ష్యులనుచూచిన భయపడుట. ముసలివారిలోకలుగు మానసిక రోగములు.

తల:—తాగ్రుబోతులలోకలుగు తలనొప్పి. వమనానుమానము. తల తిప్పు. నొక్కుచున్నట్లుండునొప్పి, ఇది యెండవలన యెక్కువగుట.

కన్నులు:— వృద్ధాప్యమువలనకలుగు దృష్టిమాంద్యము. కేటరాక్టు లేక అంతరకుసుమలు. కండ్లు అంటుకొనుట.

చెవి:—మాట సరిగా వినబడకపోవుట. చెవికిరుప్రక్కలనుండు మాంసగ్రంథులువాచి గట్టిపడి బాధగానుండుట.

ముఖము:—ఎఱ్ఱగాకందుట. మాంసగ్రంథులవాపు.

నోరు:—దుర్వాసన. ఆర్చుకొనిపోవుట. నాలుక బీటలుతీయుట.

గొంతుక:— జలుబుచేయుటవలన గవదకాయలు లేక టాన్సిల్సు యెఱ్ఱగావాచి బాధగానుండుట, మరియు నివి గట్టిపడి, పెద్దవై, వాచి, చీమువచ్చుచుండుట ద్రవరూపములోనుండు ఆహారమునుమాత్రమే తీసికొన గలుగుట. ఎక్కువగా మాట్లాడుటవలన, పాడుటవలన వచ్చు గొంతుకరోగ ములు. కొండనాలుక పొడుగగుట. పిల్లలలో గవదకాయలు పెద్దవికాకుం డగ ఆపుచేయును (కాల్కేరియాకార్బ, కాల్కేరియాఫాసు, కాల్కే రియా అయోడ్).

**అన్నకోశము:—ఆకలి తక్కువగానున్న నురుచిసరిగా నేయుండుట.**

ని భోజనము చేయవలెనని యుండకపోవుట. భోజనా
నంతరములో బరువుగానుండుట.

మలము, మలాశయము:—ఎక్కువవిరేచనానుమానము, దీనికిపిమ్మట పలువిరేచనములగుట, ఒకప్పుడు విరేచనబద్ధము, మలమువుండలుకట్టి వెడలుట. మూలశంఖ.

మూత్రము:—తరుచుగాను, యెక్కువగాను అగుట. మూత్రము విడుచునప్పుడు మూలశంఖ వెలుపలికివచ్చుట.

పురుషావయవములు:—సంభోగశక్తితగ్గుట, వాంఛతగ్గుట. ప్రాస్టేటుగ్రంధి పెద్దదగుట. వృషణములు గట్టిపడుట. జీర్ణించినసెగ.

స్త్రీఅవయవములు:—ఋతుస్రావము తక్కువగానగుట. బహిష్టుకు ముందుగావచ్చు కుసుమ. బహిష్టులోను అంతకు ముందుగనువచ్చు పండ్లసలుపు, శూల, నడుమునొప్పి.

శ్వాసావయవములు:—గొంతుక బొంగురుపోవుట. ఛాతీలో బిగపట్టునట్లుండుట. ఊపిరందకపోవుట. శ్లేష్మము పసుపుపచ్చగాను చిక్కగాను వుదయమందు వుప్పగాను వెడలుచుండుట.

హృదయము:—దడ. ఎడమనైపుపడుండినయెడల గుండెదడవచ్చుట. కాళ్లచెమట అణిచిపెట్టబడుటవలన వచ్చు హృదయరోగములు.

కాళ్లు, చేతులు:—కీళ్ళసంధులలోనుండు మాంసగ్రంధుల వాపు. దుర్వాసనతోకూడిన కాళ్లచెమట.

చర్మము:—సురుగుడుకాయలు. అచ్చటచ్చట మంటగాను గ్రుచ్చుచున్నట్లును బాధగా యుండుట.

ఉద్రేకము:—వుదయమున, కూర్చున్నప్పుడు, జబ్బులను తలచుకొనుటవలన.

ఉపశమనము:—బహిరంగమైన గాలిలో నడచుటచేత, నిలుచుండుటవలన, కదలికవలన.

సహచరులు:—యాంటిం టార్టు, డల్కామారా. సోరినం. సైలీషియా.

విరుగుళ్లు:—బెల్లడోనా, కేంఫరు, జింకం మెట్, యాంటిం టార్టు, డల్కామారా.

సరిపడనివి:—కాల్కేరియా కార్బ.

మోతాదు:—3x మొదలు 30 పొటెన్సీ. 6, 12 పొటెన్సీలు బాగుగా పనిచేసినవి. దీనిగుణకాలపరిమితి 40 లగాయతు 50 దినములు.

---

## 310. బెరీటా అయోడ్. BARYTA IODATA.

మేదస్సులేక శోషరససంబంధమైన రోగగుణములమీదను, రక్తక్షీణతమీదను, మాంసగ్రంధులరోగములమీదను ఇది బాగుగాపనిచేయును.

గవదకాయలను, స్తనములలోని మాంసగ్రంధులవాపులను మాన్పును. మరుగుజ్జుతనమును పోగొట్టును. కంతులను కరగించును. స్తనములమీద బయలుదేరు పుట్టవ్రణములను మాన్పును. కదలికవలన రోగగుణములు ఉద్రేకించుట దీని ప్రత్యేకలక్షణము.

తల:—కోపముగాను మనస్సులో కలవరముగానుయుండుట. రోగి మందముగా నుండుట, జ్ఞాపకశక్తి తగ్గిపోవుట, నుదురునొప్పిగా యుండుట. నడినెత్తిలో పోట్లుపొడుచుచుండుట. కండ్లుదురదగాయుండుట. కేటరాక్టు లేక అంతరకుసుమలు. కండ్లవాపు. చెవినుండి స్రావము వెడలుచుండుట. చీల్చుచున్నట్లు చెవిలో బాధగాయుండుట. రాత్రి ముక్కుదిబ్బడవేయుట. తరుచుతుమ్ములు వచ్చుచుండుట, ముఖము కందుట. నోటిలో ఇగుళ్లనుండి రక్తస్రావమగుట. నోరు అరుచిగానుండుట.

అన్నకోశము:—పుల్లనిత్రేనుపులు. వమనానుమానము. ఎక్కిళ్లు వచ్చుచుండుట. తీరనిదాహము. పైత్యగసమును వమనము చేసుకొనుట.

మలము, మలాశయము:—పచ్చగాను, పల్చగాను, నీళ్లవిరేచనము లగుట. మూలశంఖ వెలుపలకువచ్చుట.

మూత్రావయవములు:—రాత్రియం దెక్కువగా మూత్రమువిడుచు చుండుట. ప్రాస్టేటుగ్రంధివాపు.

శ్వాసావయవములు:—దగ్గు యెక్కువగానుండుట. గొంతుక బొం గురుపోవుట. శ్వాస తొందరగాను, వుబ్బసమువలెను, రాత్రియందును మెట్లెక్కుటవలనను, కష్టముగాను, దుర్వాసనతోను వెడలుట. ఉదయమున దగ్గువచ్చుట. ఛాతీ ముడుచుకొని పోయినట్లుండుట.

హృదయము:—రాత్రియందు గుండెదడ యెక్కువగానుండుట.

కాళ్లు, చేతులు:—చేతులు వేడిగాను బరువుగాను యుండుట. అవ యవములు దురదగానుండుట.

మోతాదు:—$6_X$ మొదలు 30 పొటెన్సీ.

---

## 311. బెరీటా మూరు. BARYTA MURIATICA.

ఇది ముసలివారియొక్కయు, చిన్నపిల్లలయొక్కయు రోగముల మీద బాగుగా పనిచేయును. తెల్లనిరక్తకణములు వృద్ధినొందుటవలనరక్త ము క్షీణదశకువచ్చుటను మాన్పును. రక్తప్రసరణము బాగుగా నుండక పోవుట; శరీరము చల్లగాను అపస్మారచిహ్నములతోను కూడియుండుట. రోగి మందముగాను, వినుటయందు శక్తి తక్కువతోను యుండుటను మా న్పును. మాంసగ్రంధుల వాపును మాన్పి మాట సరిగా వినపడునట్లు చేయును.

తల:—ఆతురతగాను, వికారముగాను యుండుట. తలమీదను, మెడమీదను రసితోకూడిన పొక్కులు. కంగారుగాను బరువుగాను యుం డుట. తదేకదృష్టితోనుండుట.

చెవులు:— చెవుడు. చెవినుండి కుళ్లువాసనతోకూడిన స్రావము వెలువడుట. చెవివెనుక కలుగుపుండ్లు.

ముక్కు:—నిద్రలో తుమ్ముచుండుట. పడిసెముపట్టుట.

గొంతుక:—గవదకాయల వాపు. గుటకవేయుట కష్టముగా నుండుట. కొండనాలుక పొడుగగుట.

అన్నకోశము:—తలతిరుగుట. వమనమగుట. వేడి తలకెక్కుట. ఆకలిలేకపోవుట. దాహము యెక్కువగానుండుట. నులిపురుగులవలన స్థిమితము లేకపోవుట.

పొత్తికడుపు:—గజ్జలలోని మాంసగ్రంధులు వాచుట. బాధగా నుండు కంతులు.

మలము, మలాశయము:—సులభముగా విరేచనమగుట. నీళ్లవిరేచనములు విపరీతమైన శూలతోకలసి వెడలుట. ప్రతి 15, 20 నిమిషముల కొకతూరి విరేచనమగుట. ఒకప్పుడు విరేచనము తెల్లగా వుండలుకట్టి వెడలుట.

మూత్రావయవములు:—మూత్రము తరుచుగాను, అప్రయత్నముగాను, బాధతోను, పచ్చగాను, దుర్వాసనగాను వెడలుట.

మర్మావయవములు:—తరుచు స్ఖలనములగుచుండుట. వృషణములు వాచుట. ఋతుస్రావము త్వరితముగా వెడలుట. వంధ్యత్వము. కుసుమ. ఎక్కువసంభోగవాంఛ స్త్రీలలో కలుగుట.

చర్మము:—గుచ్చుచున్నట్లుండు బాధలు. గజ్జివంటి కురుపులు, పొక్కులు తలమీదను, మెడమీదను, పొత్తికడుపుమీదను, తొడలమీదను, బయలుదేరుట.

మోతాదు:—6x మొదలు 30 పొటెన్సీ. దీనిని తరుచు వాడిన యెడల వుపయోగము కలదు.

## 312. బిస్మత్. BISMUTH.

జీర్ణకోశనాళసంబంధమైన వ్యాధులమీద నిది బాగుగా పనిచేయును. పొట్టకు శస్త్రచికిత్స చేసినపిమ్మట వచ్చు వ్యాధులమీద పనిచేయును.

మనస్సు, తల:—రోగి ఒంటరిగానుండుటను సహింపలేకుండుట. చిన్నపిల్లలు తమ తల్లులనుగాని, దాదులనుగాని వదలియుండలేకపోవుట. లనరోగమునుగూర్చి చెప్పుచుండుట. అజీర్ణవ్యాధితోకూడిన తలనొప్పి. చీల్చుచున్నట్లుండు పార్శ్వపునొప్పులు. నడినెత్తిని నొక్కుచున్నట్లుండుట. మనస్సు యెక్కువ ఆతురతతోనుండుట. నడచినను, పరుండినను, యేమి చేసినను సుఖముగా నుండకపోవుట (ఆర్సెనికం ఆల్బం).

నోరు:—చన్నీటివలన పంటినొప్పి వుపశమించుట. నోటిలోని చన్నీటియొక్క చల్లదనము తగ్గినయెడల పంటినొప్పి తిరిగివచ్చుట.

పురుషావయవములు:—అండములో పోటుగాను, బాధగాను యుండుట. రాత్రియందు స్వప్నములేకయే స్ఖలనమగుట.

అన్నకోశము:—జీర్ణకోశమునందు నొక్కుచున్నట్లు, మండుచున్నట్లుబాధ, బరువుగానుండుట, తలతిప్పు, విరేచనములు. వమనములగుట; ఇందువలన రోగి నిస్త్రాణజెందుట; ఇట్టి లక్షణములు కలరాలోను కడుపునొప్పి, కేన్సరు అనబడు పుట్టవ్రణము, తలనొప్పితోను కనపడినప్పుడు దీనిని వాడవలెను. త్రాగిననీళ్లు పొట్టలోజేరినవెంటనే వమనమగుట. ఆహారము నెమ్మదిగా జీర్ణమగుట.

విరుగుళ్లు:—నక్సవామికా, కాల్కేరియాకార్బ, కేప్సికం.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 20 లగాయతు 50 దినములు.

## 818. బ్రోమియం. BROMIUM.

స్వరపేటికకు, శ్వాసనాళములకు సంబంధించిన రోగలక్షణములమీదను, పుప్ఫుసవ్యాధిమీదను ఇది బాగుగాపనిచేయును. గండమాలసంబంధమైన రోగలక్షణములకును, మాంసగ్రంధుల వాపులకును దీనినివాడనగును. వయస్సులోనున్న స్త్రీలరోగములమీద బాగుగా పనిచేయును. రోగలక్షణములు విడిచివిడిచి వచ్చుచుండుటను వెచ్చతనమువలని దోషములను రోగికి ఊపిరాడుట కష్టముగాయుండుటను ఎక్కువ చెమటపట్టుటవలన బహు నిస్త్రాణ వచ్చుచుండుటను ఇది మాన్పును.

గొంతుక:—గుటకవేయునప్పుడు మాంసగ్రంధులవాపువలనబాధగానుండుట. వెచ్చదనమువలన గొంతుక బొంగురుపోవుట.

హృదయము:—వ్యాయామముచేయునట్టి మగపిల్లల హృదయమును పెద్దవగుట. ఇటులనే ఆడపిల్లలలోకూడ స్వల్పవ్యాయామమువలన హృదయము పెద్దదగుట (కాష్టికం).

శ్వాసావయవములు:—నావికులకు దరిచేరగానే పుప్ఫుసపుదగ్గువచ్చుట. ఛాతీలోబాధలు పైపైపుకు వ్యాపించుచుండుట. దగ్గుచున్నప్పుడు అనుము ఛాతీలో గురగురలాడుచుండినను ఊపిరిపీల్చుటకు సావకాశముండుట (హెపారుసల్ఫు). కళ్లి తెగిపడకపోవుట (యాంటిం టార్టు). కోరింతదగ్గులో గొంతుక బొంగురుపోవుట, గుగక, ఊపిరాడకపోవుట, శ్వాసను గాఢముగా పీల్చుకొనలేకపోవుట, ఉబ్బసములో శ్వాసపీల్చుట బహుకష్టముగానుండుట, శ్వాసనాళములు పొగతో నింపబడినట్లుండుట.

అన్నకోశము, పొత్తికడుపు:—అన్నకోశములో రాతితో నొక్కుచున్నట్లుండుబాధ. అన్నకోశములోవచ్చు బాధ భోజనానంతరము ఉపశమించుట. నోరు మొదలు అన్నకోశమువరకు మంటగాయుండుట. రక్తవమనమగుట. పొత్తికడుపు ఉబ్బరించుట. ప్లీహము పెద్దదై గట్టిపడుట. మూలశంఖ బాధగాను, మలము నల్లగానుయుండుట.

పురుషావయవములు:—సుగరోగమును అణచిపెట్టుటవలన బీజములు వాచుట.

స్త్రీఅవయవములు:—స్తనములలో కంతులుబయలుదేరుట. అండాశయమువాపు. మర్మాశయమునుండి పెద్దధ్వనిచేయుచు గాలివెడలుట.

చర్మము:—మొటిమలు, పొక్కులు బయలుదేరుట. చేతులమీదను, ముఖముమీదను కురుపులు బయలుదేరుట. గొంతుకలోను, దౌడలోనువున్న మాంసగ్రంథులు రాతివలె గట్టిగానుండుట.

ఉద్రేకము:—సాయంకాలము మొదలు అర్ధరాత్రివరకువెచ్చని గదిలో నుండుటవలన, యెడమవైపు పరుండుటవలన.

ఉపశమనము:—కదలికవలన, వ్యాయామమువలన, సముద్రయానము వలన.

పోలికలు:—అయోడియం, క్లోరం, స్పాంజియా, హెపారుసల్ఫ, ఆర్జెంటంనైట్రికం, కుప్రంమెట్, కార్బోవెజ్.

విరుగుళ్లు:—కేంఫరు, ఎమోనియంకార్బ.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 314. కాల్కేరియా ఆర్సు. CALCAREA ARS.

జీర్ణించిన మన్యపుజ్వరము, చిన్నపిల్లల కామెర్లు, ప్లీహము, వాచుట, త్రాగుడు మానినపిమ్మట వచ్చురోగములు, మూత్రపిండములవ్యాధి, రక్తదోషము—వీటిమీద నిది బాగుగా వుపయోగపడును. రక్తములోని యెఱ్ఱకణములను వృద్ధిపొందించును.

మలము, మలాశయము:—బంగాళాదుంపలు తినుటవలన అర్ధరాత్రి నీళ్లవిరేచనములు వచ్చుట. చంటిపిల్లలలోవచ్చు నీళ్ళవిరేచనములు.

మూత్రావయవములు; —మూత్రపిండములవద్ద నొప్పిగానుండుట,

మూత్రములో శ్వేతధాతువు కలిసిపోవుచుండుట, గంటకొకసారి కొద్ది కొద్దిగా మూత్రమును విడుచుచుండుట.

స్త్రీఅవయవములు:—గర్భిణీస్త్రీలలో దిగలాగుచున్నట్లుండు నొప్పులు. గర్భిణులకువచ్చు నీళ్లవిరేచనములు, శూల, దుర్వాసనతో కూడిన రక్తకుసుమ, పుష్టిగానుండు స్త్రీలలో ముట్లుడుగు కాలమునందు కలుగు వ్యాధులు.

శ్వాసావయవములు:— ఉబ్బసపుదగ్గువలన అర్థరాత్రిమైనపిమ్మట మెలకువవచ్చుట.

హృదయము:—దడగాను, మంటగాను, పోటుగాను వుండుట. అపస్మారమునకు ముందుగావచ్చు హృదయబాధలు, మనోవికారమువలన గుండెదడ వచ్చుట.

ఉద్రేకము:—పరిశ్రమవలన.

విరుగుళ్లు:—కార్బొవెజ్, పల్సటిల్లా, గ్లొనోయిన్.

మోతాదు:— 3x మొదలు 30 పొటెన్సీ.

---

## 315. కాల్కేరియా కార్బ్. CALCAREA CARB.

ఎముకలు సరిగా కలవక, లేక యెదుగకయుండునపుడును, శరీరమునందు క్రొవ్వు యెక్కువగాచేరినవారికి, లేక వూబశరీరముగలవారికిని, శరీరము తరుచు చల్లగానుండువారికి, నీటిలో నానుచు పనిచేయువారికి, రాత్రియందుగాని, పరిశ్రమవలనగాని చమటలుపోయుచుండువారికి, పిల్లలలో తలకు చెమటపట్టునప్పుడును, పుల్లనివమనములు, విరేచనములు అగువారికి ఇది బాగుగా పనిచేయును. ఎక్కువ నిస్త్రాణగా యుండువారికి, సులభముగా అలసటవచ్చువారికిని, శరీరపోషణ సరిగా నుండనపుడును ఇది బాగుగా పనిచేయును. చెమటను, చర్మరోగములను, బహిష్టును అణ

చిపెట్టుటవలనను, భయమువల్లను, ఆల్కహాలు త్రాగుటవలనను, హస్త ప్రయోగాది దురభ్యాసములవలనను, మానసిక పరిశ్రమవలనను వచ్చిన రోగములమీదను ఇది బాగుగాపనిచేయును.

మనస్సు:—ఆతురతగానుండుట. ఇందువలన గుండెదడవచ్చుట. బ్రతుకుటయందసహ్యముగా నుండుట. భయకంపితముగాను, పిచ్చియెత్తినట్లుగాను వుండుట. తాను కంగారుగాయున్నట్లు యెదుటివారు చూచెదరనుకొనుట.

తల:—పిల్లలకు తలలోని యెముకలు సరిగా కలుసుకొనకపోవుట, తల మంచువలె చల్లగానుండుట, ఎక్కువ చెమటపట్టుట, ఇందువలన తల దింట్లుతడిసిపోవుట. తలకు నీరుపట్టుట. తలలో రక్తమెక్కువగాజేరుట వలన తలవెచ్చగాను, యెఱ్ఱగాను వుండుట. వ్రాయుటవలనను, చదువుట వలనను నుదుటభాగముగానుండుట. పిల్లలను నిద్రలో లేపినయెడల వారు తలను గోకుకొనుచుండుట.

కన్నులు:—కంటిపాపలు పెద్దవగుట, బహిరంగమైన గాలిలోను, ఉదయమునను నీరుకారుచుండుట, వెలుతురును చూడలేకపోవుట, కంటి గ్రుడ్డుమీద మచ్చలు, చిన్నచిన్న పుండ్లుపడుట, కనుపొట్టలుబ్బుట, దగ్గరగానున్నవస్తువులు సరిగా అనకపోవుట.

చెవులు:—బ్రిద్దలగుచున్నట్లు ధ్వనులు వినబడుట, కుట్టుచున్నట్లుండు బాధలు, నీటిలోనుండి పనిచేయుటవలన వచ్చు చెముడు. చెవిలో కాయలు బయులుదేరి వాటినుండి రక్తముస్రవించుట, మన్యపుజ్వరములో క్వయినా నెక్కువగా వాడుటవలన వచ్చు చెవుడును మాన్పును. చెవివద్దనున్న మాంసగ్రంధులు వాచుట.

ముక్కు:—ముక్కుశోణములు పుండ్లుపడి బాధగానుండుట, దిబ్బడవేయుట, దుర్వాసనతోకూడిన పసుపుపచ్చని స్రావము వెడలుట, కాయలు బయులుదేరుట, ఉదయమున రక్తస్రావమగుట, గాలిమార్పువలన జలుబు చేయుచుండుట, నీళ్లవంటిస్రావము వెలువడుచుండుట.

ముఖము:—ఉదయమున పైపెదవివాచుట, ముఖము పల్చబడుట, మాంసగ్రంధులువాచుట. యెఱ్ఱగా పొంగరించియుండుట. దురదతోకూడిన పొక్కులు, మొటిమలు.

నోరు:—చల్లని పానీయమువలనను గాలిచేతను కలుగుపంటినొప్పి. ఇగుళ్లనుండి రక్తముస్రవించుట. పిల్లలలో పండ్లు త్వరగా రాకపోవుట, నాలుకమీద తెల్లనిపూత గలిగియుండుట, బహిష్టుతోను, చిమ్మటను వచ్చు పంటినొప్పిని మాన్పును.

గొంతుక:—మాంసగ్రంధులువాచి గుటక వేయుటకు కష్టముగాయుండుట. కొండనాలుక నల్లపడి పుండ్లుపడుట, గొంతుకనొప్పిగానుండుట.

అన్నకోశము:—పాలు వికటించుట. ఆకలిలేకున్నను భుజించునపుడు ఆహారము రుచించుట. తీసికొనిన ఆహారపురుచితో త్రేణుపులు తరుచుగా వచ్చుచుండుట. భోజనానంతరము మంటగానుండి పులియగొట్టుచుండుట. పుల్లనివమనమువచ్చుట, పాలుత్రాగినవెనుక పాలనుపెరుగు బిళ్లలవలె వాంతిచేసుకొనుట. గుడ్లు, వుప్పని లేక తీపివస్తువులు, కచికెలు, సుద్ద, బొగ్గు, గోడపెల్లలు, మట్టి, పెన్సిలుముక్కలు వీటిని తినుటయందు కోరికయుండుట. మరియు పుగాకు, బహిరంగమైన గాలి, మాంసము వీటియందు అసహ్యముకల్గుట.

పొత్తికడుపు:—ముందుకు వంగినయెడల పొత్తికడుపులో పొడుచుచున్నట్లుండుట. వాయువు బంధింపబడుట, మాంసగ్రంధులువాచి బాధగానుండుట, కాలేయములో రాళ్ళు (Gall Stone colic) బయలుదేరి శూలవచ్చుట, గజ్జలలోని మాంసగ్రంధులువాచుట, గిలక ముందుకుచొరుచుకొని వచ్చినట్లు బాధగానుండుట.

మలము, మలాశయము:—దుర్వాసనతోకూడిన అజీర్ణవిరేచనములు, అమితమైన ఆకలి, చిన్నపిల్లలకు కలుగు నీళ్లవిరేచనములు, విరేచనము తరుచుగాను, మొదట గట్టిగాను, తరువాత జిగురువలెను, నీళ్లవలెను, పల్చగాను,

చెడినగుడ్లవలె దుర్వాసనతో కూడియు వెడలుట. పిల్లలకు పండ్లువచ్చుకాలములో సుద్దనుపోలిన విరేచనములుఅగుట. ఆసనము ముడుచుకొని పోయినట్లుండుట, మలాశయము వెలుపలికివచ్చుట.

మూత్రావయవములు:— గోధుమవర్ణముగాను, దుర్వాసనతోను, తెల్లని మడ్డితోను, ఒకప్పుడు రక్తముకలసియు వెడలుచుండుట. నడచుచున్నప్పుడు అప్రయత్నముగా మూత్రము వెడలుట. అతిమూత్రము.

పురుషావయవములు:—తరుచు స్ఖలనమగుచుండుట. లేపనశక్తి తగ్గినను సంభోగేచ్ఛ యెక్కువగుట. సంభోగానంతరము అతినిస్త్రాణ, చిరచిరలాడుట. చిన్నపిల్లలలోగలుగు బుడ్డను మాన్పును. అండములు గట్టిపడి వీటిమీద చిన్నచిన్నపొక్కులు బయలుదేరుట.

స్త్రీ అవయవములు:—బహిష్టుకుముందు తలనొప్పి, శూల, చలి, కుసుమ వచ్చుట. గర్భాశయము స్వస్థానమునుండి తొలగుట, ఒకప్పుడు వెలుపలకువచ్చుట. పాలవలెనుండు కుసుమ (సేపియా). పాలతల్లులలో పాలు తక్కువగాగలుగుట, బహిష్టు మామూలుకన్న యెక్కువ ముందరగాను, స్రావమెక్కువగాను, నడినెత్తినొప్పితోను, పంటిసలుపుతోను, కాళ్లయందు చల్లదనముతోనువచ్చుట. మర్మావయవములలో పొడుచుచున్నట్లును, నొక్కుచున్నట్లును బాధగానుండుట. బహిష్టుకుముందును, వెనుకను మంటగాను, దురదగాను, అవయవములలోనుండుట. సంభోగేచ్ఛ యెక్కువగుట. వంధ్యత్వము. కాయలు (Uterine polypi) బయలుదేరుట. స్తనములు యెఱ్ఱగావాచుట, ఇవి బహిష్టుకుముందు నొప్పిగాను, వాపుగాను, యుండుట. యెఱ్ఱకుసుమను మాన్పును. పాలు యెక్కువగా వచ్చుచున్నను బిడ్డకు అవి వికటించుట.

శ్వాసావయవములు:—స్వరపేటిక గరుకుగాను, బాధగాను వుండుట. మెట్లెక్కుటవలన ఆయాసముపుచ్చుట. హృదయమున వుబ్బసపుదగ్గు వుద్రేకించుట. రాత్రియందువచ్చు పొడిదగ్గు. తియ్యని రుచిగల శ్లేష్మము రక్తజీరతో వెడలుట, వూపిరి గట్టిగాపీల్చిన బాధగాను, కుట్టుచున్నట్లును

వుండుట, వూపిరాడకపోవుట, కళ్లి వుప్పగాను, పసుపురంగుగాను వుండుట. క్షయలో బాగుగా వుపయోగపడును.

హృదయము:—ఆతురతతోకూడిన గుండెదడ. ఇది రాత్రిలందును, భోజనానంతరమందును వచ్చుచుండుట. ఛాతీ ముట్టుకొనుటకు నొప్పిగాయుండుట. చర్మవ్యాధుల నణచిపెట్టుటచేవచ్చు హృదయరోగములు.

మెడ, నడుము:—నలుగగొట్టినట్లు నడుములో నొప్పిగాయుండుట వలన లేచుటకష్టముగానుండుట. ఇది బరువునెత్తుటచే గల్గుట. మేహవాతము వలనగలుగు నడుమునొప్పి. మెడకొయ్యబారి త్రిప్పుటకు వీలులేకుండుట.

కాళ్లు, చేతులు:—నీళ్లలో నానుటవలన మేహవాతనొప్పి లెక్కువగుట. పిక్కలు లాగుట, మోకాళ్లుకాచుట, అరికాళ్లు మంటగానుండుట. చేతులకు చెమటపట్టుట, కాళ్లకుపట్టిన చెమట పుల్లనివాసనగాయుండుట. అరికాళ్లు బహుసున్నితముగాయుండుట. ఇందువలన రోగి నడచుటకుబాధపడుట. పిల్లలు నడచుటను ఆలస్యముగా నేర్చుకొనునప్పుడు దీనిని వాడవగును. కీళ్ళలోను, చేతులలోను నిస్త్రాణగాయుండుట.

నిద్ర:—ఆలోచనయెక్కువగుటచే నిద్రపట్టకుండుట. చనిపోయినవారు కలలో కనపడుట. చప్పుడువలన అతిసులభముగా మెలకువవచ్చుట. సాయంకాలమందు నిద్రమత్తుగానుండుట.

జ్వరము:—నాడి పుష్టిగానుండుట. చెమటతోకూడిన జ్వరము. రాత్రియందు మెడ, ఛాతీ, తల—వీటికి యెక్కువ చెమటపట్టుట. మధ్యాహ్నము 2 గంటలకు పొట్టలో చలి బయలుదేరి జ్వరమువచ్చుట. క్షయసంబంధమైన జ్వరము. బహిష్టులోజ్వరమువచ్చినప్పుడు రాత్రియందు యెక్కువ వెచ్చదనము, నిద్రలేకపోవుట, చలి, వేడియుండుట. నిద్రలేమివలన వచ్చు జ్వరములమీద బాగుగా పనిచేయును.

చర్మము:—సులభముగా పుండ్లుపడుచుండుట, చిన్నచిన్న పుండ్లు త్వరగా మానకపోవుట, ముఖముమీదను, చేతులమీదను, సురుగుడుకాయు

లు, మొటిమలు లేచుట. మాంసగ్రంథులవాపు, లోతైనపుండ్లు. తలమీది మంత్రపుపొక్కులను మాన్పును. చిన్నచిన్న కురుపులు, పసుపువచ్చని చీముతో పక్కులు కట్టియుండుట. చర్మము ఒరియుట.

క్షయజాతిచిహ్నములు గలవారికి, క్రొవ్వు లేక వ్రాబశరీరము గలవారికి, తరుచుగా జలుబుచేయుచుండువారికి, పెద్దతలగల చిన్నపిల్లలకు, పరిశ్రమలేనివారికి, పాలిపోయినవారికి, ముట్లుడుగుకాలము సమీపించిన స్త్రీలకు—వీరిరోగములమీద నిది బాగుగా పనిచేయును.

దీనిని యాసిడ్ నైట్రికముకు, సల్ఫరుకును ముందుగా వాడరాదు. మరియు బ్రియోనియాకు ముందుగాని, తరువాతగాని వాడరాదు.

ఉద్రేకము:—శరీరమానసిక పరిశ్రమవలన, పాలవలన, తేమవలన, అధికసంభోగమువలన, పౌర్ణమినాడు, పౌర్ణమికిసమీపమున, మెట్లెక్కుట వలన, భోజనానంతరమున, సూర్యరశ్మివలన.

ఉపశమనము:—బాధగానున్నవైపువ పరుండుటవలన, లేచుటవలన, వెచ్చనిగాలిలో.

సహచరులు:—బెల్లడోనా, రూస్టాక్సు, లైకోపోడియం, సైలీషియా.

విరుగుళ్లు:—కేంఫరు, ఇపెకాక్, యాసిడ్నైట్రిక్, నక్సువామికా, సల్ఫరు.

యాసిడుఎసెటిక్, బిస్మత్, చైనా, చైనాసల్ఫ, యాసిడ్నైట్రికం, మెజీరియం, డిజిటాలిసు—ల కిది విరుగుడు.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ. దీనినిముసలివారికితరుచు వాడరాదు. జీర్ణమండలమునకు సంబంధించిన వ్యాధులమీద చిన్న పొటెన్సీలు బాగుగా పనిచేయును. తక్కినవాటిలో పెద్దపొటెన్సీలు బాగుగా పనిచేయును. దీని గుణకాల పరిమితి 50 దినములు.

## 316. కాల్కేరియా ఫ్లోరు. CALCAREA FLUOR.

(సుధాస్పైకతము. సూస్లరుగారి ద్వాదశలవణములలో నిది మొదటిది)

ఎముకలకు, కండరములకు, చర్మమునకు, దుష్టరక్తనాళములకు సంబంధించిన రోగములమీద నిది బాగుగా పనిచేయును. కంతులను, మాంసగ్రంధులవాపులను, మూలశంఖను, భగందరమును, ఎముకలు చెడిపోవుట లేక పుచ్చిపోవుటను మాన్పును. గర్భిణీస్త్రీలకు దీనిని వాడినయెడల వారు సుఖముగా ప్రసవింతురు.

మనస్సు:—సొమ్ముసంబంధమైన వ్యవహారములనుగూర్చిఆతురతగా యుండుట. ఏమిచేయుటకును తోచకుండుట. ధనములేమినిగూర్చిభయము.

తల:—తలమీద కంతులు బయలుదేరుట. విరేచనబద్ధముతో కూడిన తలనొప్పివలన తలబ్రద్దలగుచుండునట్లుండుట. పసిపిల్లల తలమీద బయలుదేరు రక్తకంతులు.

కన్నులు:— కేటరాక్టు లేక అంతరకుసుమలకు ఇది ముఖ్యౌషధము. కనుగ్రుడ్లు నొప్పిగానుండుట. కండ్లు మూసికొనుటవలనను, కండ్లనునొక్కిపెట్టుటవలనను నొప్పి వుపశమించుట. కాచబింబముపైని మచ్చలు బయలుదేరుట, దృష్టిమబ్బుగాను, తెరవేసినట్లుగాను వుండుట. కంటిరెప్పలలో బయలుదేరు కాయలను మాన్పును.

చెవులు:—ధ్వనులు వినపడుట, చెవుడు, చెవినుండి చీమువచ్చుట.

ముక్కు:—జలుబుచేయుట, ముక్కుదిబ్బడవేయుట, దుర్వాసనవచ్చుట, ఆకుపచ్చగాను, చిక్కగాను, దుర్వాసనగాను వచ్చుస్రావములు.

ముఖము:—దౌడవాచుట, దౌడమీద గట్టిగానుండెడివాపు, దీనివలనబాధ, కంటిపోటు వచ్చుట.

నోరు:—ఆర్చుకొనిపోవుట, కంఠములో పొడుచుచున్నట్లుండు బాధలు, మంట. పండ్లపై నునుపుగానుండు పదార్థము లేక ఎనామెల్ తక్కువగా నుండుటవలన పండ్లు త్వరగా చెడిపోవుట.

అన్నకోశము:—అజీర్ణవమనము (ఫెరంఫాసు). ఎక్కిళ్లువచ్చుట, పసిపిల్లలవమనములను కట్టును. కడుపు పొంగరించియుండుట, మానసికోద్రేకమువలన వచ్చు అజీర్ణము.

పొత్తికడుపు, మలము, మలాశయము:—పొత్తికడుపుబ్బరముగానుండుట. తలభారముతోకూడిన విరేచనబద్ధము. ఆసనము దురదగాయుండుటవలన రాత్రి మెలకువవచ్చుట. రక్తస్రావముతోకూడిన మూలశంఖ, ఆసనములో పుండ్లు అగుట, భగందరము. దేహాంతరరోగములలోవచ్చు నీళ్ల విరేచనములు. అంత్రములలో యెక్కువగా వాయువుజేరుట, ఇందువలన కడుపు వుబ్బరముగానుండుట, ఇట్టిలక్షణములు గర్భిణీస్త్రీలలో గలిగినప్పుడిది బాగుగా పనిచేయును. మూలశంఖ మొలలు లోపలనేవుండుట, నడుములో యెక్కువ నొప్పిగాను, విరేచనబద్ధముగాను యుండుట. ఆసనము పగులుట.

మూత్రావయవములు:—మూత్రము బహుతక్కువగాను, ముదరరంగుగాను, దుర్వాసనతోను వెడలుట. మూత్రము విడుమనప్పుడు మూత్రనాళములో పోటుగాను, మంటగాను వుండుట.

పురుషావయవములు:—ఇది బుడ్డకు మంచియౌషధము. అండములు గట్టిపడిపోవుటను మాన్పును. ఈలక్షణములతోకూడిన సవాయిమీదకూడ పనిచేయును.

స్త్రీఅవయవములు:—గర్భిణులకు దీనిని వాడినయెడల వారు సుఖముగా ప్రసవింతురు. బహిష్టులో స్రావమెక్కువగావగుట, దిగలాడుచుండునట్లునొప్పులు. గర్భాశయము బరువుగానుండి వెలుపలకువచ్చుట, స్తనములలోని మాంసగ్రంధులు గట్టిపడి నొప్పిగానుండుట. ప్రసవానంతరము గర్భాశయము సరిగా ముడుచుకొనలేకపోయినపుడు దీనిని వాడవలెను.—గర్భిణీలో వాడదగిన నాలుగుఔషధములలో నిదియొకటి. తక్కినవి 1. కాల్కేరియాఫాసు, 2. కాలీఫాసు, 3. మెగ్నీషియాఫాసు.

శ్వాసావయవములు:—కొండనాలుక పెద్దదై స్వరపేటికకు తగులు

చుండుటవలన దగ్గువచ్చుట. కళ్ళు తెగిపడనపుడు దీనిని వాడవలయును. ఇట్లు పుబ్బసపురోగులలో కలిగినప్పుడు ఇది బాగుగా పనిచేయును.

నడుము, కాళ్లు, చేతులు:—ఇది నడుమునొప్పికి మంచియౌషధము. స్వారిచేయుటవలనవచ్చు నడుములో నొప్పిని మాన్పును. నడుములోకలుగు ఇరుకునొప్పులనుమాన్పును. మోకాళ్ళవాపు మొదలగు మేహావాతనొప్పులు, వాపులమీద పనిచేయును నడుచునప్పుడును, కదలుచున్నప్పుడును కీళ్ళ సంధులలో కరేలుమని శబ్దము వినిపించుట దీనివుపయోగమునుసూచించును.

చర్మము:—చర్మము గరుకుగానుండుట, పుండ్లుపడుట, ఆరుచుకు పోవుట. గోరుచుట్టువకును, భగందరమునకును దీనిని బాగుగా వాడవచ్చును. చర్మము బీటలుతీయుట మొదలగు లక్షణములలో దీనిని లోపలకును పైకిని కూడ వాడవలయును.

నిద్ర:—తృప్తిగానుండక పోవుట. కలలువచ్చి యేదియో అపాయము గలుగునని తోచుట. ఇందువలన ఒకప్పుడు రోగి మంచమునుండి [illegible] కుదుముకి కిటికీలోనుండి వెలుపలకు దుముకజూచుట.

జ్వరము:—దాహము, అస్థిమితము, గోధుమవర్ణము గానుండు నాలుక. నిద్రలేమి. జ్వరము సుమారు ఒకవారమువరకు వదలకుండుట.

ఉద్రేకము:—తేమగాలిలో, విశ్రాంతివలన.

ఉపశమనము:—మర్దనమువలన, వెచ్చదనమువలన.

మోతాదు:—3x మొదలు 1000 పొటెన్సీ. 3x, 6x, 12x పొడుములు మరియు బిళ్ళలు బాగుగా పనిచేయును. 6x వరకును యీమందు మాత్రిలలోను, ఆకులలోను తయారుకాబడదు. అవసరము వెంబడిని దీనిని వేసిలైనులోకలిపిగాని, నీళ్లలోకలిపిగాని పైకి (పగుళ్లు, కంతులు, మొదలగువాటికి) వుపయోగించవచ్చును.

## 317. కాల్కేరియా అయోడు. CALCAREA IODATA.

టాన్సిల్సు, ఎడినాయిడ్సు మొదలగు మాంసగ్రంధులవాపులమీద ను, క్షయరోగలక్షణములమీదను బాగుగా పనిచేయును. పుష్టిగానుండు పిల్లలకు సులభముగా జలుబుచేయుచున్నప్పుడు యితరవ్యాధులమీద బాగుగా పనిచేయును.

తల:—చల్లని గాలికెదురుగా స్వారిచేయుటవలనవచ్చు తలనొప్పి, జలుబుచేయుట, తుమ్ములువచ్చుట. ముక్కులోను చెవిలోను కాయలు (Polypi) బయలుదేరుట.

గొంతుక:—గవదకాయలు వాచుట, వీటిమీద చిన్నచిన్నరంధ్రములు, ముడతలు పడుట.

అన్నకోశము,— త్రేపులు. రొమ్ముక్కట్లువచ్చుట. వికారముగా నుండుట.

పొత్తికడుపు:—అపానవాయువు యెక్కువగా వెడలుట.

శ్వాసావయవములు:— నిలవగాయున్నదగ్గు, క్షయసంబంధమైన జ్వరము, ఆకుపచ్చని చీమువంటి స్రావము వెడలుట, న్యుమోనియాలో పనిచేయును.

చర్మము:—కూననటువంటి పుండ్లు, ఇవి దుష్టరక్తనాళములకు సంబంధించియుండుట, మాంసగ్రంధులువాచుట, చర్మముపగులుట, వెంట్రుకలూడుచుండుట.

దీనిలక్షణములు ఎగ్రఫిస్ న్యుటాన్సును కొంతవరకుపోలియుండును.

మోతాదు:—3x మొదలు 200 వరకున్ను.

---

## 318. కాల్కేరియా ఫాసు. CALCAREA PHOS.

(సుధాభాస్వరము. షూస్లరుగారి ద్వాదశలవణములోనిది రెండవది)

ఇది యొకగొప్పయాంటిసోరిక్ ఔషధము. ఇది డాక్టరుషూస్లరు

గారి ద్వాదశలవణముల (12 టిస్యూసాల్టుల) లోను అతిముఖ్యమైనదిగా పరిగణింపబడుచున్నది. దీనిలక్షణములు చాలావరకు కాల్కేరియాకార్బును పోలియుండును. రోగి కాల్కేరియాకార్బులోవలె కొవ్వుపట్టి స్థూలశరీరముతో నుండక క్షీణించియుండుట దీనిపుపయోగమును సూచించును. ఇది ముఖ్యముగా చిన్నపిల్లలలో పండ్లువచ్చు సమయమునరోగలుగు ఫిట్లుతో కూడిన రోగముల (బాలపాసచిన్నె మొదలైనవి)ను, నీళ్లవిరేచనములు, అజీర్ణవిరేచనములను మాన్పును. విరిగిపోయిన యెముకలను తిరిగి కలుసుకొనునట్లు చేయును. ఎముకలు, దంతములు, వీటిరోగములమీద వుపయోగపడును. కాలిక వ్యాధులవలన గలిగిన రక్తక్షీణత మరియు యేరోగమువలననైనను దేహముక్షీణత్వము పొందినపుడు దీనిని వాడినయెడల దేహమునకు యెక్కువపుష్టిని, ఆరోగ్యమును యిచ్చును. వాతావరణస్థితిలో కలుగు మార్పులవలన వచ్చు రోగములమీద నిది బాగుగా పనిచేయును. మాంసగ్రంధులవాపులను మాన్పును. చెమటపట్టుసూచనలు తరుచుగానున్నప్పుడు దీనిని వాడనగును.

మనస్సు:—విచారగ్రస్తముగానుండుట. నెమ్మదిగా గ్రహించుట. జ్ఞాపకశక్తి లేకపోవుట, ఆలోచనశక్తితగ్గుట.

తల:—తలమీది ఎముకలు సరిగా కలుసుకొనకపోవుట. లేక కలుసుకొనినవి తిరిగి విడిపోయినపుడును దీనిని వాడనగును. తలనొక్కబడినట్లు నొప్పిగానుండుట. తలతిర్పు, వికారము. స్త్రీవిద్యార్థులలో నీళ్లవిరేచనములతోపాటు వచ్చు తలనొప్పులు. కడుపు వుబ్బరముతో కూడియుండు తలనొప్పి. విద్యార్థుల తలనొప్పులను మాన్పును.

కన్నులు:—కంటిలో నలకలుపడినట్లుగా నుండుట. వెలుతురు చూడలేకపోవుటవలన చదువుటకష్టముగానుండుట. అంతరకుసుమములను మాన్పును.

చెవులు:—పొడుచుచున్నట్లు వినబడు ధ్వనులు. పుండును గలుగజేయునంతటి స్రావము.

ముక్కు:—చల్లనిగదిలోనున్నప్పుడు నీళ్లవంటిస్రావము వచ్చుట. ఇది బహిరంగమైన గాలిలోను, వెచ్చని గదిలోను మానుట. ఒకప్పుడు రక్తము వెడలుచుండుట.

ముఖము:—పాలిపోయినట్లుండుట, పసుపుపచ్చని రసితోకూడిన మొటిమలు, ముఖము రాగిరంగుగానుండి మొటిమలతో నిండియుండుట.

నోరు:—పళ్లు చెడిపోయి త్వరలో వూడనారంభించుట. నమలుట కష్టముగానుండుట. నాలుకవాచి గట్టిపడి మొద్దుబారుట. రుచిచేదుగాను, దీనితోపాటు తలలో నొప్పిగాయుండుట. గవదకాయలవాపు యెన్నాళ్లకును తగ్గకుండుట.

అన్నకోశము:—పులితేన్పులువచ్చుట, గుండెలలోమంటగానుండుట, తలతిప్పు, వికారము, దీనితోపాటు మనసు కంగారుగానుండుట, శ్లేష్మమును వెలువరించుటకు కాండ్రించినయెడల వమనమగుట. కొవ్వుపట్టిన మాంసము, వుప్పులో నిలువచేసినమాంసము, పొగత్రాగుట, పీటిని రోగి కోరుట. రసముతోకూడిన పండ్లను తినుటవల్లను, ఐస్‌క్రీమ్‌తినుటవల్లను, భోజనముచేయుట ప్రారంభించినప్పుడును, చల్లనినీరుత్రాగినప్పుడును, శూలగాని, నీళ్లవిరేచనములుగాని వచ్చుట. బిడ్డయెల్లప్పుడును పాలను లేక ఆహారమును కోరుచూ పీటిని తీసికొనినయెడల సులభముగా కక్కుకొనుట. పిల్లలవమనములను మాన్పును. కడుపువుబ్బరము త్రేన్పుల వలన ఉపశమించుట.

పొత్తికడుపు:—బొడ్డుచుట్టూతీపుగాను, నొప్పిగానువుండుట; ఇది దుర్వాసనతోకూడిన అపానవాయువు వెడలినపిమ్మట ఉపశమించుట. పసిపిల్లలబొడ్డునుండి రక్తముతోకూడిన స్రావమువెడలుటను మాన్పును. పొత్తికడుపులో మంటగాను, తీపుగాను, గజ్జలలో కోయుచున్నట్లును, లాగుచున్నట్లును బాధగానుండుట.

మలము, మలాశయము:—మలము అపానవాయువుతోకలసి వెడలుచుండుట. ప్రతిదినము వెడలుచుండు వెచ్చని నీళ్లవిరేచనములను కట్టును.

మరియు సాధారణముగా పల్చగాను, అప్పుడప్పుడు ఆకుపచ్చగాను, ఆమ ముతోను వెడలుచుండుట. క్షయసంబంధమైన విరేచనములమీద వాడ వచ్చును. రసము ఎక్కువగాగల పండ్లు (నారింజ మొదలైనవి) తినుటవలన వచ్చిన నీళ్లవిరేచనములను కట్టును. చిన్నపిల్లలకు పండ్లువచ్చుసమయములో కలుగు నీళ్లవిరేచనములమీద బాగుగా నుపయోగపడును. విరేచనానంతరము రక్తముపడుట, మూలశంఖువెలుపలకు వచ్చుట, ఆసనముపోటు, దురద, తీపుగానుండుట. భగందరము, ఇది ఛాతీసంబంధమైన రోగలక్షణములతో కూడియున్నప్పుడీయౌషధము ఎక్కువ వుపయోగపడును.

మూత్రావయవములు:—తరుచు మూత్రానుమానము. యెక్కువగా మూత్రమువెడలుట. మూత్రము వెడలినపిమ్మట మిక్కిలి నిస్త్రాణజెందుట. మూత్రవిసర్జనకు ముందును, వెనుకను, మూత్రనాళములో కోయుచున్నట్లు బాధగానుండుట. మూత్రము వెచ్చగాను, ముదరరంగుగాను వెడలుట. మూత్రములో ఫాస్ఫేట్సుకలిసివెడలుట. వరుండినపుడు అప్రయత్నముగా మూత్రమును విడచుట.

పురుషావయవములు:—స్వప్నస్ఖలనములను, దీర్ఘసెగను, వృషణముల వాపు, దురద, చెమటపట్టుట, నొప్పిగానుండుటను మాన్పును.

స్త్రీఅవయవములు:—గర్భిణీ స్త్రీలలో పుష్టినిచ్చుటకును, నీరసమును తగ్గించుటకును, బలమైనబిడ్డలు కలుగునట్లు చేయుటలోను ఇది చాల సహాయపడును. గర్భవతుల నేవిళ్లను మాన్పును. బహిష్టులో స్రావమెక్కువగా వెడలుట, ఇందువలన యెక్కువ నిస్త్రాణకలిగి ఒకప్పుడురోగలక్షణములు క్షయరోగములోనికిమారుట. తరుచు పిల్లలు కలుగుచుండుటవలనను, పిల్లలకు పాలను యెక్కువగా నిచ్చుచుండుటవలనను, బహిష్టులో నెక్కువగా స్రావము వెడలుటవలనను, కుసుమ యెక్కువగా వెడలుచుండుటవలనను వచ్చిన నిస్త్రాణను పోగొట్టును. ఋతుస్రావము నల్లగాను, ముద్దవలెను వెడలుచుండుట, యెక్కువ సంభోగేచ్ఛ గలుగుట, కోడిగుడ్డు సొనవలె తెల్లగాస్రవించుచుండు కుసుమ, ఋతుశూలు, వీటినన్నిటిని మాన్పును. గర్భి

ణీలో వాడవలసిన నాలుగు ఔషధములలో నిదియొకటి. తక్కినవి (1) కాల్కేరియాఫ్లోరు, (2) కాలీఫాసు, (3) మెగ్నీషియాఫాసు.

శ్వాసావయవములు:—శ్వాస తరుచుగాను, కష్టముగాను వుండుట. ఊపిరి సరిగా అందకపోవుట. గొంతుక బొంగురుగానుండుట. మాట్లాడునప్పుడు గొంతుకకు శ్లేష్మముఅడ్డుపడుట. అందువలన తరుచు కాండ్రించి వుమ్మివేయవలసివచ్చుట. క్షయదగ్గులో శ్లేష్మము పసుపువచ్చగాను, ఉదయమున యెక్కువగాను వెడలుచుండుట. ఛాతీలో కుట్టుచున్నట్లుండునొప్పులు. తరుచు నిట్టూర్పువిడచుట. పిల్లలకు పండ్లువచ్చుకాలములో వచ్చుదగ్గును మాన్పును.

హృదయము:—పాండురోగులలో యెఱ్ఱనిరక్తకణములను వృద్ధిపొందించును. హృదయము నిస్త్రాణగాను, దడగాను వుండుటను మాన్పును.

నడుము, కాళ్లు, చేతులు:—నిస్త్రాణగాను, నొప్పులుగాను వుండుట, భుజములకు చేతులకువచ్చు మేహవాతనొప్పులు. కీళ్లువాచివెచ్చగానుండుట, పిక్కలువాచుట. కాళ్లమీద పురుగులుపాకుచున్నట్లును, తిమ్మిరలుగాను వుండుట. చంటిపిల్లల యెముకలలో శక్తితక్కువగా నుండుట, పొట్టలావుగాను, కాళ్లు చేతులు మెడ సన్నముగాను యుండుట. దొడ్డికాళ్లు, మొదలైన రోగలక్షణములమీద నిది బాగుగా పనిచేయును. ఇది ముఖ్యముగా యెముకలరోగములమీద పనిచేయును. ఎముకలకు అమితమైన బలమునిచ్చును. పెద్దవారిలో నడుము వంకరపోవుటను మాన్పును.

నిద్ర:—తరుచు కాళ్లనుచేతులను చాచుచుండుట. ఆవలింతలువచ్చుచుండుట. ఎక్కువ నిద్రమత్తుగానుండుట, తరుచు భయంకరమైన కలలు వచ్చుచుండుట. భయమువలన రోగి వులికిపడి లేచి బయటకుపోవజూచుట.

చర్మము:—దురదతోకూడిన పోతరపు మొటిమలు. తెల్లనిసారముతో కూడిన పొక్కులు. చేతులకు చెమటపట్టుట, చర్మము ఆర్చుకొనిపోయి దురదగాను మంటగాను యుండుట.

జ్వరము:—ఎక్కువచెమట; ఇది ముఖముమీదను, దేహమంతటను గూడ యుండుట. జ్వరమున్నను దేహము చల్లగనేయుండుట.

సాధారణముగా పిల్లలు సరిగా యెదగక పోవునపుడును; దేహచ్ఛాయపాలిపోయియున్న వారికిని, ఎక్కువచదువుటవలనను, అధిక సంభోగమువలనను వచ్చిన నిస్త్రాణను మాన్పుటలోను, యెముకలరోగముల మీదను బాగుగా పనిచేయును.

ఉద్రేకము:—తేమలో, చల్లనిగాలివలన, కదలికవలన, రాత్రియందు మానసికపరిశ్రమవలన.

ఉపశమనము:—వేసవియందు, వెచ్చదనమువలన, పొడిగాలిలో, పరుండుటవలన, విశ్రాంతివలన.

మోతాదు:—$3_X$ మొదలు 200 పొటెన్సీ. $3_X$, $6_X$, $12_X$ పొటెన్సీలలో పొడుము లేక బిళ్లలను వాడుటమంచిది. $6_X$ వరకును యిదిమాత్రలలోను అరకులలోను తయారుకాబడదు.

---

## 319. కాల్కేరియా సిలికేటా. CALCAREA SILICATA.

దీర్ఘవ్యాధులమీదను, బహువిధచర్మరోగములమీదను ఇది బాగుగా పనిచేయును. రోగి యెక్కువ నిస్త్రాణజెంది ఆర్చుకొనిపోయి చల్లనిదేహముగలిగి, మరియు వెచ్చదనమువలన రోగోద్రేకము జెందుచువుండుట దీని ప్రత్యేకలక్షణము. ఆర్చుకొనిపోయిన శరీరముగలవారికి తిరిగి దేహపుష్టి నిచ్చును.

మనస్సు:—భయముజెందియుండుట. తనయందు తనకేనమ్మకముండకపోవుట. పరధ్యానముగానుండుట. చిరచిరలాడుచుండుట.

తల:—తలతిప్పుగానుండుట. తలలో నీరుపట్టుట, తలమీద కురుపులులేసి చీముపెడలుచు పక్కులుకట్టుచుండుట, ఎక్కువదురదగానుండుట, కండ్లనెక్కువగా నుపయోగించుటవలన వచ్చు తలనొప్పులు.

కన్నులు:—కండ్లకలక, దీనిలో పుసికట్టుట, ఎరుపెక్కుట, పసుపుపచ్చని స్రావము వెడలుచుండుట, కన్నులు పెద్దవై ముందరకువచ్చినట్లుగానుండుట. కాచబింబముపై పుండ్లను మాన్పును కేటరాక్టు లేక అంతర కుసుమలను మాన్పును.

ముక్కు:—తుమ్ములువచ్చుచుండుట, నీళ్లవంటి స్రావము, ఒకప్పుడు గట్టిగా పసుపుపచ్చని ముద్దవలెనుండు స్రావము వెడలుచుండుట. నాసికా రంధ్రముల ఒరుపును మాన్పును.

ముఖము:—జబ్బుచేసినవానివలె పాలిపోయినట్లగుపడుట. మొటిమలు, పొక్కులు బయలుదేరుట. మాంసగ్రంథులు వాచుట.

చెవులు:—దుర్వాసనతో కూడిన చిక్కని చీము వెడలుట.

నోరు:—నాలుక వెనుకవైపు పచ్చని పూతవుండుట. మేహవాత సంబంధమైన పండ్లనొప్పులు, ఇగుళ్లనొప్పులు, బాధ, ఇగుళ్లనుండి సులభముగా రక్తము స్రవించుటను కట్టును.

గొంతుక:—గవదకాయలువాచి పుండ్లై వాటినుండి రసికారుట.

అన్నకోశము:—అమితమైన దాహము. త్రేణుపులు, వమనములు వచ్చుచుండుట, భోజనానంతరము పొట్టబరువుగానుండుట.

మలము, మలాశయము:—నీళ్ళవిరేచనములు, అంబవిరేచనములు, జిగటవిరేచనములు, అన్నిరకములవిరేచనములును కట్టును. భగందరము, దీనికి సంబంధించి ఆసనముప్రక్కను కురుపులు బయలుదేరుచుండుట.

మూత్రావయవములు:—మూత్రము యెఱ్ఱగా వెడలుట. ఇది మధుమూత్రమును, మూత్రకృచ్ఛ్రమును మాన్పును.

పురుషావయవములు:—అండములు గట్టిపడుటను, బుడ్డను మాన్పును. స్ఖలనములను మాన్పును, లేపనము తక్కువగానున్నను సంభోగవాంఛ యెక్కువగుట,

స్త్రీఅవయవములు:—బహిష్టుకు బహిష్టుకుమధ్యగా ఋతుస్రావము వెలుమండుట, తెల్లకుసుమ, బహిష్టు సరిగా కాకుండుట. గర్భాశయము బరువెక్కి వెలుపలకువచ్చుట.

శ్వాసావయవములు:—శ్వాస బహుత్వరితముగానుండుట. ఉబ్బసపు దగ్గును మాన్పును. పరుండినపుడు సరిగా శ్వాస ఆడకపోవుట. ఇదిక్షయ రోగ చిహ్నములమీద బాగుగా పనిచేయును.

చర్మము:—దురద, మంటతో కూడిన చర్మరోగములు. అక్కడక్కడ మొటిమలవంటి చిన్నచిన్న పొక్కులు బయలుదేరుట. కురుపులు చితికిన పిమ్మటను, లేక మరియేవిధమైన పుండ్లైనను మాన్పుటలో నిది అమోఘముగా పనిచేయును. చీముపట్టి చితుకకుండా బాధపెట్టుచుండు కురుపులను చితుకునట్లుచేసి చీమును త్వరలో వెలుపరించి బాగుచేయును. దీనిని రాచకురుపులమీదకూడ వుపయోగించనచ్చును.

కాళ్లు, చేతులు:—అరిచేతులు, పాదములు, వీటికి దుర్వాసనతో కూడిన చెమటపట్టుట. నడుము, వీపు నొప్పిగానుండుట, వంగకపోవుట, మెడనరముపట్టుట, కాళ్లలో సత్తువలేకపోవుట కీళ్లలోపట్లుపట్టుట.

దీనిలక్షణములు ఆర్సెనికం ఆల్బం, బెరీటాకార్బ, కాల్కేరియా ఫాసు, సైలీషియాలను చాలవరకు పోలియుండును.

మోతాదు:—3x మొదలు 1000 పొటెన్సీ.

---

## 320. కాల్కేరియాసల్ఫ. CALCAREA SULPH.

(సుధాగంధకము. స్కూస్లరుగారి ద్వాదశలవణములలోనిది మూడవది).

ఇది మంత్రిమువంటి చర్మరోగములమీదను, సులభముగా హరించపట్టి మాంసగ్రంథులవాపులమీదను, కంతులను కరగించుటలోను కురుపులు మొదలైనవి చితికినపిమ్మట వాటినుండి చీమును వెలుపరించి మాన్పుట

లోను, ఆమత్వచలనుండి వెడలు పసుపుపచ్చని ముద్దవంటి స్రావములను మాన్పుటలోను బాగుగా పనిచేయును.

మనస్సు:—పిచ్చియెత్తునను భయము, జ్ఞాపకశక్తి తగ్గిపోవుట, ఒకమారు సంతోషము, ఇంకొకమారు కోపము, మరియొకసారి విచారము, ఇట్లు మారుచుండుట. ఇది అపస్మారము మెలపలగు నరముల సంబంధమైన వ్యాధులను మాన్పును.

తల:—పసుపుపచ్చని రసితోకూడిన పొక్కులు. రసి ఆరిపోయి సులభముగా పక్కులుకట్టుచుండుట, చుండ్రుబయలు దేరుట, నుదుటనొప్పిగానుండుట, తలను దువ్వుకొనినయెడల సులభముగా వెంట్రుకలూడిపోవుచుండుట. స్నానముచేయుటవలన పచ్చుతలనొప్పులను మాన్పును.

కన్నులు:—కండ్లకలక. దీనిలో పసుపుపచ్చని చిక్కని స్రావము వెడలుచుండుట, చూచుచున్నవస్తువు సగముమట్టుకే కనపడుట. కాచబింబము మబ్బుగానుండుట, కాచబింబముపై చిన్నచిన్న పుండ్లగుట.

చెవులు:—చెవిప్రక్కను మొటిమలు బయలుదేరుట. చెముడు, చెవినుండి చీముపచ్చుచుండుట.

ముక్కు:—పడిశెముపట్టుట, పసుపుపచ్చని చీమువంటి స్రావము తరుచు రక్తజీరతో వెడలుచుండుట, నాసికారంధ్రములు బహునొప్పిగానుండుట.

ముఖము:—మొటిమలను, పొక్కులను మాన్పును. దౌడవాచుట, పాలిపోయినవానివలె కనుపడుట.

నోరు:—పెదవుల లోపలినైపు బాధగానుండుట. వెచ్చగాను, ఆర్చుకుపోయియుండుట, పుండ్లుపడుట, దుర్వాసనగాయుండుట, మేహవాతసంబంధమైన పండ్లనొప్పులు, ఇగుళ్లువుబ్బుట.

గొంతుక:—గవదకాయలువాచి చీముపట్టి స్రావము వెడలుచుండుట, గుటకవేయుట కష్టముగానుండుట, గొంతుకలో పుండ్లుపడుట.

అన్నకోశము:—భోజనానంతరము పుల్లగాను దుర్వాసనగాను, తీసికొనిన ఆహారపు రుచితోను, త్రేణుపులు వచ్చుట. యెక్కువదాహము గాను, ఆకలిగాను వుండుట. రాత్రియందు భోజనానంతరము తలనొప్పి, వమనములు వచ్చుట.

పొత్తికడుపు:—కాలేయమువద్దను, కుడిచట్టిలోను నొప్పిగాను, నీరసముగాను యుండుట.

మలము, మలాశయము:—వాతావగణమార్పులవలన వచ్చు నీళ్లవిరేచనములు, చీమువంటి ఆమము వెడలుచుండుట, భగందరముకు సంబంధించి ఆసనముప్రక్కను కురుపులువేయుచుండుట, మలాశయము వెలుపలికివచ్చుట. జిగటవిరేచనములను కట్టును. రక్తజీరతోను, బాధలేకుండగను, నీళ్ల విరేచనములగుట. చాలకాలమునుండి బాధపడుచున్న విరేచనబద్ధము.

పురుషావయవములు:—శుక్లనష్టమును, దీనితోపాటు నపుంసకత్వమునుకూడ మాన్పును. స్రావముతోకూడిన సెగరోగమును, చాలకాలము నుండి నిలువగానుండిన సవాయివ్యాధిని మాన్పును.

స్త్రీ అవయవములు:—బహిష్టు ఆలస్యముగా నగుట, ఋతుస్రావము చాలదినములవరకు వెడలుచుండుట. బహునిస్త్రాణగా నుండుట, ప్రథమ రజస్వల మిక్కిలి ఆలస్యమగుట, ఋతువు అణచిపెట్టబడుట.

శ్వాసావయవములు:— న్యుమోనియాయొక్క తృతీయావస్థలో బాగుగా పనిచేయును. ఛాతీలో నొప్పిగాయుండుట. గురకను మాన్పును. పసుపుపచ్చగాను, చిక్కగాను, ముద్దవలెను వెడలుచుండు స్రావముతో కూడిన దగ్గు, ఊపిరాడకుండుట, ఉబ్బసపురోగులలో ఛాతీలో ఆమము ఎక్కువగాజేరి ఊపిరాడకుండుట. చల్లనిగాలిలోదగ్గు వుపశమించుట.

చర్మము:—నరుకులు, దెబ్బలు, పుండ్లు, ఇవి చీముపట్టి త్వరగా మానకుండుట, పసుపుపచ్చని పక్కులు కట్టుచుండుట, లేక చీము వెడలు చుండుట.

కాళ్ళు, చేతులు:—రసికారుడలుచున్నట్టి గోరుచుట్టు. అరికాళ్లలో మంటలు. దురదగానుండుటను మాన్పును. పక్షవాతపునొప్పులను, మేహవాతపునొప్పులను మాన్పును. తిమ్మెర్లు. దుష్టరక్తనాళములవాపులను, కాళ్ళు, పాదములు నీరుపట్టుటను మాన్పును.

జ్వరము:—కురుపులు, పుండ్లు మొదలగునవి చీముపట్టుచుండునప్పుడువచ్చు జ్వరము. దీనిలో దగ్గు, అరికాళ్లు మంటలువుండుట. సన్నిపాతజ్వరములో నీళ్లవిరేచములువచ్చినప్పుడుఇది బాగుగా వుపయోగపడును.

మోతాదు:—$3x$ మొదలు 200 పొటెన్సీ. చర్మవ్యాధులలో 12 వ పొటెన్సీ బాగుగా పనిచేయును. $6x$ వరకు నిది మాత్రిలలోను, అరకుల లోను తయారు కాబడదు.

---

## 321. కేంఫరు మోనోబ్రోమేటం.

## CAMPHOR MONOBROMATUM.

ఇది నరముల వుద్రేకముమీదవచ్చు రోగలక్షణములమీద బాగుగా పనిచేయును. స్వప్నస్ఖలనములు, మితిమీరిన లేపనము, పిల్లలకు వచ్చు కలరా విరేచనములు బాలపాపచిన్నె మొదలగు కంపముతోకూడిన రోగములు, అపస్మారగము, వీటిమీదనిది బాగుగా పనిచేయును. పాలతల్లుల స్తన్యమును వృద్ధిజేయును.

దిశలు మారినట్లగుపడుట, ఉత్తరము దక్షిణముగాను తూర్పు పడమరగాను అయిన వనుకొనుట; నిద్రపట్టునప్పుడు భయంకరమైన కలలు వచ్చుట; కలలలో దెయ్యములు కనపడుట; అపస్మారములో ఒకమారు యేడుపు, ఒకమారునవ్వువుండుట; బాలికలకు, ఆడవారికి, యెక్కువగా చదువుటవలనను మానసికోద్రేకమువలనను వచ్చు తలనొప్పులు: పరాకు మాటలు; నపుంసకత్వము—ఇవి దీనివుపయోగమునుసూచించును.

మోతాదు:—$3x$ మొదలు 30 పొటెన్సీ.

---

## 322. కార్బో యానిమలిసు. CARBO ANIMALIS.

ఇది ముఖ్యముగా అతినిస్త్రాణజెందినవారికిని, గండమాలరోగ సంబంధమైన తత్వములుగలవారికిని, ముసలివారికిని బాగుగా వుపయోగపడును. ఋతుస్రావము, కుసుమ, నీళ్ళవిరేచనములు, వీటివలన రోగికి బహు నిస్త్రాణవచ్చుటను మాన్పును. ఇది యాంటిసోరిక్ ఔషధము. క్వయినాను ఎక్కువగా వాడుటవలని దుర్గుణములనిది మాన్పును.

మనస్సు:—ఒంటరిగా నుండగోరుట. విచారగ్రస్తముగానుండుట. మాట్లాడుటయందు యిష్టముండకపోవుట.

తల:—ఉదయమున తలత్రిప్పగానుండుట. తలయందు రక్తాధిక్యమువలన కంగారువచ్చుట. దౌడలును, పెదవులును నీలివర్ణముగానగుపడుట. మెదడు వదులుగానున్నట్లుతోచుట.

కన్నులు:—దగ్గరనున్నవస్తువులు ఆనకుండుట. కండ్లు వదులుగానున్నట్లుతోచుట.

చెవులు:—చీముపట్టి పాడగుట. సరిగా వినపడకపోవుట. ఏవైపునుండి ధ్వనివచ్చుచున్నదో సరిగా తెలియకుండుట.

ముఖము:—రాగిరంగుమచ్చలు, దద్దుర్లు.

నోరు:—పండ్లు వదులుగాను, నమలుటకష్టముగాను యుండుట. దుర్వాసనగాయుండుట. పెదవులు బీటలుతీయుట.

అన్నకోశము:—క్రొవ్వుపదార్థములును, పొగాకును, రోగికి అయిష్టముగా నుండుట. రుచి చేదుగానుండుట. వాయువువలన గిలక ముందుకు చొచ్చుకొనివచ్చుట, ఆహారము విషతుల్యమగుట (అనగా, పాడైపోయిన చేపలను, కుళ్లిపోయిన కూరగాయలను తినుటవలన వచ్చినరోగములను మాన్పును).

గుదము, మలాశయము:—మలబద్ధము. మలము గట్టిగా వుండలవలె

వెడలుట. మలవిసర్జనలో దుర్వాసనతోకూడిన అపానవాయువు మాత్రి మెక్కువగా వెడలుట.

మూత్రావయవములు:—దుర్వాసనతోకూడిన మూత్రము అపరిమితముగా వెడలుట.

మర్మావయవములు:—సవాయివ్యాధిమీద బాగుగా పనిచేయును. మరియు దీనికి సంబంధించిన బిళ్లలకుకూడ వాడనగును. స్త్రీలలో వేవిళ్లను మాన్పును. ఋతువు చాలముందుగాను, తరుచుగాను. స్రావము చాలరో జులవరకును వెడలుచు, యిందువలన మాట్లాడుటకుకూడ కష్టముగానుండు సంతతి నిస్త్రాణకలుగుట. మర్మావయవములలో మంటగానుండుట. స్తనములలో పొడుచుచున్నట్లుండు బాధలు, మరియు వీటిలోని మాంసగ్రంధులు గట్టిపడి బాధగానుండుట. మర్మావయవములలో బయలుదేరు పుట్టవ్రణము, లేక కేన్సరును మాన్పును.

శ్వాసావయవములు:—ఛాతీలో ఉదయమునను, భోజనానంతరమునను ఆమముజేరి గురగురలాడుచుండుట, ఊపిరాడపోవుట, రాత్రి పరుండినయెడల దగ్గువచ్చుట. పగలు అరుపచ్చగాను, దుర్వాసనతోనుకూడి చీముపంటిస్రావము వెడలుట.

కాళ్లు, చేతులు:—సులభముగా నొప్పిపెట్టుచుండుట. తిమ్మెరలుగానుండుట, వ్రేళ్లుసులభముగా వంగకపోవుట, కీళ్లసంధులలో బలములేమి.

చర్మము:—ముఖముమీద బయలుదేరు మొటిమలను మాన్పును. శరీరమంతయు దురదగానుండుట. యెఱ్ఱని మొటిమలు. మెడవద్దను, గజ్జలలోను, స్తనములలోనువున్న మాంసగ్రంధులు వాచుట, బాధగానుండుట.

జ్వరము:—రాత్రియందు చెమట దుర్వాసనగాయుండుట, బహు నిస్త్రాణను గలుగజేయుట. పక్కగుడ్డలు చెమటవలన పసుపుపచ్చగానగుట. పగలు చలిగానుండుట. రాత్రియందు జ్వరమువలని నిద్రలేమి.

ఉద్రేకము:—చల్లనిగాలిలో, తాకుడువలన, బహిష్టులో.

ఉపశమనము:—వెచ్చనిగదిలో.

సహచరులు:—కాల్కేరియాఫాసు.

విరుగుళ్లు:—ఆర్సెనికం ఆల్బం, నక్సువామికా, కేంఫరు.

పోలికలు:—బేడియాగా, సెపియా, సల్ఫరు, గ్రాఫైటిసు.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 36 దినములు.

---

## 323. కార్బోవెజ్. CARBO VEGETABILIS.

సోమరులుగానుండు స్థూలశరీరుల దీర్ఘవ్యాధులమీద నిది బాగుగా పని చేయును. ఇట్టివారి శరీరములోని రక్తనాళములలో రక్తచలనము లేక యుండుటవలన శరీరముకుళ్లును. ఇట్టిరక్తప్రసరణములో సులభముగా క్రిములు ప్రవేశించుటవలన సన్నిపాతము మొదలగు భయంకరమైనరోగలక్షణములు కలుగుట; శరీరము మంచువలె చల్లగాను, నీలిరంగుగాను అగుట; ప్రాణశక్తితగ్గిపోవుట; రోగిముఖము కళావిహీనమై చనిపోయినవాని ముఖము వలె కనపడుట; నాడి సన్నగిలుట, శ్వాస చల్లగానుండుట, శరీరము చల్లబడుట, శ్వాస త్వరితముగా పీల్చుకొనుటకై యెక్కువగా గాలి అవసరమగుట, ఇందువలన వడిగా పంకాను విసరవలసివచ్చుట, మరియు, రోగి పరుండిన గదితలుపులన్నిటిని పూర్తిగా తెరువవలసివచ్చుట; రోగి ప్రాణములేనివానివలె నగుపడుచున్నను తలవెచ్చగానుండుట; ఇవి దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—అప్పుడప్పుడు జ్ఞాపకశక్తి తగ్గుచుండుట. చీకటియం దయిష్టముగా నుండుట.

తల:—తలతిప్పు, తలబరువుగానుండుట, నుదుటిలో నొక్కుచున్నట్లు నొప్పిగానుండుట. టోపీనొక్కుచున్నట్లుండుటవలన బాధగా తోచుట. ప్రసవించినవెనుక తలవెంట్రుక లూడిపోవుట,

ముఖము:—పాలిపోయి పచ్చబడుట, చావుముఖమువలె నగుపడుట.

కన్నులు:—దృష్టిమాంద్యము. కండ్లయెదుట నల్లనిమచ్చలు కనపడుట. కండ్లుబరువుగానుండుట. స్రావము వెడలుట, అధిక పరిశ్రమవలన దూరదృష్టి ఆనకపోవుట.

చెవులు:—గింగురుమనుచున్నట్లుండు ధ్వనులు. ఆర్చుకొనిపోయి నట్లుండుట. దుర్వాసనతో కూడిన చీము వెడలుట. ఎక్కువ రసమువాడుట వలనవచ్చు చెముడు.

ముక్కు:—ముక్కునుండి రక్తముస్రవించుచుండుట. రక్తముప్రతి దినము యెన్నియోసారులు వారములకొలది వెడలుచు వుండుట. ఇందువలన రక్తక్షీణతగలిగి ముఖముపాలిపోవుట, తరుచు తుమ్ములువచ్చుచుండుట.

నోరు:—నాలుకమీద తెల్లని, లేక గోధుమరంగుగల పూత. ఇగుళ్ల నుండి సులభముగా రక్తమువెడలుట. ఇగుళ్లలో పుండ్లగుట. ఇగుళ్లనుండి దుర్వాసనతో కూడిన స్రావము. పండ్లుకదలుట. నోరు ఆర్చుకొనిపోవు చున్నను దాహములేకుండుట. లాలాజలము తీగెవలె సాగుచు వెడలుట.

అన్నకోశము:—రోగి తరుచు కాఫీ, పుల్లనిపదార్థములు, తీపిపదార్థములు, ఉప్పనిపదార్థములు కోరుచుండుట. క్రొవ్వుపదార్థములును, పాలును, భుజించుటకు పనికివచ్చు పదార్థములును, సులభముగా జీర్ణమగుపదార్థములును రోగికి అయిష్టముగానుండుట. త్రేణుపులువచ్చుట, మంటగాను, నిండుగాను వుండుట. శూలవచ్చుట, భోజనమైన అరగంటకు కడుపులో బాధగానుండుట. ఆహారము నెమ్మదిగా జీర్ణమగుట. కడుపు పొంగరించుట; ఇందువలన కట్టుకొనినవస్త్రము బిగువుగా కట్టుకొనలేకుండుట.

మలము, మలాశయము:—పుండును గలుగజేయునట్టి ఆమము, మలముపల్చని గంగుగాను, మంటగాను, దుర్వాసనతోను, నీళ్లవలెను, రక్తముతోను, తీపుతోను, పసుపుపచ్చని ఆమములోను, యెక్కువదుర్గంధముతోను, అప్రియత్నముగాను వెడలుట. జిగటవిరేచనములు దుర్వాసనతో వెడలుట. ఇది కలరాలో బాగుగా పనిచేయును,

పురుషావయవములు:—విరేచనమగునపుడు ఫ్రాస్టేటుగ్రంధినుండి స్రావము వెడలుట.

స్త్రీఅవయవములు:—ఒకబహిష్టు మొదలు 2-వ బహిష్టువరకు రక్త స్రావము మానకుండుట, బహిష్టుకుముందుగా చిక్కగాను, ఆకుపచ్చగాను, లేక పాలవలెను పుండును కలుగజేయునట్టి కుసుమ వెడలుట, పిల్లలకు స్తన్యమునిచ్చుటవలన కలుగు నిస్త్రాణ.

శ్వాసావయవములు:—స్వరపేటిక గరుకుగానుండుట, మరియు కంఠధ్వనిబొంగురుగావచ్చుట, మరియు కంఠము గట్టిగాయెత్తి మాట్లాడినయెడల మాట సరిగా రాకపోవుట, ఊపిరాడకుండుట, దుర్వాసనగానుండుస్రావముతోకూడి విడిచిపిడిచిదగ్గువచ్చుచుండుట. రక్తస్రావములు. వయోవృద్ధులలోవచ్చు ఉబ్బసపుదగ్గు.

కాళ్లు, చేతులు:—అవయవములలో తిమ్మిరలుగానుండుట, చితుకకొట్టినట్లునొప్పులుగానుండుట. కీళ్లువంగకుండుట, బరువెక్కుట, పక్షవాతమువచ్చినట్లగుపడుట. కాళ్లు మొద్దుబారి చెమటపట్టుట.

జ్వరము:—దేహము చల్లగానుండుట. దాహముగానుండుట. ఆహారమునుతీసికొనినయెడలచెమటపట్టుట. క్షయసంబంధమైనజ్వరము, దీనిలో నిస్త్రాణను కలుగజేయునట్టి చెమట. మన్యపుజ్వరములో చలిగాయున్నప్పుడు దాహముగా నుండుట. శరీరమునకు రాత్రియందు చెమటపట్టుట.

చర్మము:— తేమగాను, చెమట వెచ్చగాను యుండుట. చిక్కిపోయినవారిలో తలవెంట్రుకలూడుచుండుట. పుండ్లు యెన్నాళ్లకును మానకుండుట. బాధలు మంటతో కూడియుండుట. రాచకురుపులు దుర్వాసనతోకూడిన స్రావముతోకూడియున్నప్పుడును, మంటలుగాయున్నప్పుడును దీనిని వాడనగును.

ఉద్రేకము:—ఉదయమున, సాయంకాలమున, పరుండుటకుముందు, గట్టిగా చదువుటవలన, పాడుటవలన, రసమును క్వయినాను యెక్కువగా వాడుటవలన, క్రొవ్వుపదార్థములను తినుటవలన, వెచ్చనిగదిలో.

ఉపశమనము:— త్రాగుపులవలన, నిబ్బరముగా కూర్చుండుటవలన, చల్లనిప్రదేశములో, విసరుటవలన, చల్లని గాలిలో.

సహచరులు:— కాలీకార్బ, డ్రోసిరా, చైనా.

పోలికలు:— గ్రాఫైటిసు, కాష్టికం, లెకెసిసు, యూపటోరియం పెర్ఫ, రూ మెక్స.

విరుగుళ్లు:— ఆర్సెనికం ఆల్బం, కేంఫరు, కాఫీ, మెర్క్యూరియస్, లెకెసిస్, ఫెరం మెట్.

చైనా, లెకెసిసు, మెర్క్యూరియసు— లకిది విరుగుడు.

మోతాదు:— $6_X$ మొదలు 1000 పొటెన్సీ. సామాన్యముగా పెద్ద పొటెన్సీలలో బాగుగా పని చేయును. చిన్న పొటెన్సీలు జీర్ణకోశవ్యాధుల మీద బాగుగా పని చేయును 30 అంతకు పైపొటెన్సీలు ప్రాణశక్తి నశించుచున్నప్పుడు వాడనగును. దీనిగుణకాలపరిమితి 36 దినములు.

---

## 324. కాష్టికం. CAUSTICUM.

ఇది యాంటిసోరిక్, యాంటిసైకోటిక్, మరియు యాంటిసిఫిలిటిక్ ఔషధము. ఇది అన్నిరకముల తత్వములవారికి వుపయోగపడును. ఇది ముఖ్యముగా నిలువగాయుండిన మేహవాత, పక్షవాతరోగములమీదను, మాంసగ్రంథులవాపులమీదను, శ్వాసావయవరోగములమీదను బాగుగా పని చేయును. రోగికి రాత్రియందు యెముకలలోను, కీళ్లసంధులలోను చీల్చుచున్నట్లు బాధలు యెక్కువగా నుండుట, క్రమముగా శరీరపాటవముతప్పి, నిస్త్రాణజెంది, తుదకు పక్షవాతవ్యాధి పొలగుట, చిన్నపిల్లలు నడచుటను ఆలస్యముగా నేర్చుకొనుట.— ఇది దీని వుపయోగమును సూచించును. ఇది కుడిప్రైపు అవయవముల రోగములమీద బాగుగా పని చేయును. నిద్ర లోపమువలనను, చన్నీటిస్నానమువలనను, వ్యవహారసంబంధమైన విసుగువలనను, తీరనివిచారమువలనను, వచ్చు రోగములమీద బాగుగా పని

చేయును. ముఖము, పైకనురెప్పలు, పెదవులు, నాలుక, స్వరపేటిక, మొదలగు ఒక్కొక్క అవయవమునకు వచ్చు పక్షవాతముమీద బాగుగా పనిచేయును.

మనస్సు:—జ్ఞాపకశక్తి తక్కువగానుండుట, పరధ్యానముగా నుండుట. బిడ్డ ఒంటరిగా నిద్రపోవుట కిష్టపడకపోవుట. నిరాశ, ఆతురత, అస్థిమితము, జాలి, యీలక్షణములను రోగి కలిగియుండుట. బాధలను గురించి తలచుకొనుటవలన అవి యెక్కువగుట. ముఖ్యముగా మూలశంఖ బాధ యెక్కువగుట.

తల:—కాళీగానున్నట్లు తోచుట. నుదుట పొడుచుచున్నట్లు బాధగానుండుట. నడినెత్తి బిగపట్టినట్లుండుట. తలతిప్పు.

ముఖము;—కుడిపార్శ్వమునకు పక్షవాతమువచ్చుట,అడుగుదౌడలో మహావాతమువలన నొప్పిగానుండుట, ముఖము పాలిపోయి జబ్బుపడినవానివలె నగుపడుట.

కన్నులు:—అంతరకుసుమలు, లేక కేటరాక్టుకు బాగుగా పనిచేయును. కనురెప్పలువాచి యెఱ్ఱపడి, బాధగానుండుట, మరియు పుండ్లుపడుట, దృష్టిమాంద్యము, కంటి పైరెప్పలపక్షవాతమునకు బాగుగా పనిచేయును. కనురెప్పలు బరువుగానుండుట.

చెవులు:—గింగురుమన్నట్లు ధ్వనులు వినిపించుచుండుట. మాట సరిగా వినపడకపోవుట. పొడుచుచున్నట్లు నొప్పిగావుండుట. గులివి యెక్కువగా చేరుట. ప్రతిధ్వనులు వినపడుచుండుట.

నోరు:—మాట ముద్దగాను, కష్టముగాను వచ్చుట. మాట్లాడుటకు సంబంధించిన అవయవముల పక్షవాతమువలన మాటరాకుండుట, నాలుకకు పక్షవాతమువచ్చుటవలన కొణుకుపోవుట.

అన్నకోశము:—రోగికి బీరుత్రాగుటయందును, ఘాటుగానుండు వస్తువులు తినుటయందును కోర్కెగలిగియుండుట. ఆహారపురుచిగాని, చూపుగాని, మరియు తియ్యనివస్తువులుగాని అయిష్టముగా నుండుట. మం

టతోకూడి, రుచిలేని తేన్పులువచ్చుట, భోజనముచేయ నారంభించి
నప్పుడు ఆకలి మాయమగుట. తలలో నెచ్చుదనమును, కడుపులో శూల
యును ఒకేసారియుండుట. గొంతుకలోనికి వుండవలె వచ్చుచున్నట్లు
తోచుట. పులితేన్పులతోకూడిన అజీర్ణము.

మలము, మలాశయము:—మలము మెత్తగాను, కొద్దిగాను వెడలుట.
ఒకప్పుడు గట్టిగా ఆమముతోకూడి వెడలుచుండుట. తినికినపిమ్మటగాని,
లేక నిలుచుండిననేగాని విరేచనమవకపోవుట. మలము రక్తముతోకలసి
వెడలుచుండుట. ఆసనము దురదగానుండుట. మూలశంఖములలు పెద్దవి
గానుండుట. భగందరమును మాన్పును.

మూత్రావయవములు:—తుమ్ముటవలనను, దగ్గుటవలనను, అప్రియ
త్నముగాను మూత్రము వెడలుట (పల్సటిల్లా). శస్త్రచికిత్సానంతరము
మూత్రము వెడలుట ఆగిపోయినప్పుడు దీనిని వాడనగును. మూత్రము
చుక్కలుగా పడుట.

పురుషావయవములు:—తరుచు స్ఖలనములగుచుండుట, విరేచనానం
తరము ఫ్రాస్ట్రేటుగ్రంధినుండి స్రావము వెడలుచుండుట, సంభోగమునందు
వీర్యముతోపాటు రక్తముకలసి వెడలుట.

స్త్రీ అవయవములు:—బహిష్టులో రాత్రియందు బహుతురక్తము వె
డలకుండుట, మరియు నిది పగటియందుమాత్రమే వెడలుట. కుసుమ రాత్రి
యందు వెడగుట మరియు ఇది నిస్త్రాణను కలుగజేయుచుండుట. ఋతుఘ్న
ఆలస్యముగానగుట (పల్సటిల్లా, కోనియం).

శ్వాసావయవములు:—స్వరపేటిక నొప్పిగానుండుట. దగ్గుతో
పాటు ఛాతీలో నొప్పిగానుండుట. స్రావము కొలదిగానున్నను కాండిం
చుటకు శక్తిచాలక దానిని మ్రింగవలసివచ్చుట. రాత్రియందు పరుండుట
కష్టముగానుండుట. స్వరపేటికసంబంధమైన కండరములు సరిగా పనిచే
యకుండుట. ఇందువలన గట్టిగా మాటాడలేకపోవుట. ఊపిరాడకుండుట.

కాళ్లు, చేతులు:—చేతులు తిమ్మిరెక్కుట. మేహవాతమువలన చీల్చుచున్నట్లుండు బాధలు వెచ్చదనమువలన వుపశమించుట. ఒక అవయవమునకుమాత్రమే పక్షవాతమువచ్చుట. మోకాళ్లలో సత్తువలేక పోవుటవలన నడచునపుడు బాధగానుండుట. స్నాయుబంధములు (Tendons) గట్టిపడుట, ముడుచుకొనుట.

చర్మము:—చెవులవెనుకను, గజ్జలలోను నొప్పిగానుండుట. ముక్కుమీదను వేళ్లమీదను పొక్కులులేచుట. వీటినుండి సులభముగా రక్తము స్రవించుట. శరీరము కాలుటవలన వచ్చుబాధలను మాన్పును. శరీరము కాలి పుండుయెన్నాళ్లకును మానకుండినయెడల దీనిని వాడవలెను. పుండ్లుమంటలు గానుండుట. పాదములలో బయలుదేరు ఆనికాయల బాధలను నివారణ చేయును.

ఉద్రేకము:—చల్లనిగాలివలన, కదలికవలన, నడచుటవలన, విరేచనానంతరమున, మంచిగాలిలో.

ఉపశమనము:—వెచ్చదనమువలన, తేమగాలిలో.

ఎసాఫాటీడా, చైనా, కొలోసింథిసు, యూఫేషియా, ప్లంబం మెట్, మెర్క్యూరియసు, సల్ఫరు—లకిగవిరుగుడు.

దీనికిముందుగా గాని, తరువాతగాని ఫాస్ఫరసు, కాఫీ, (Acids) పుల్లనిపదార్థములను ద్రావకములను వాడరాదు.

సహచరులు:—మెర్క్యుకర్, కార్బొవెజ్, పెట్రోసీలినం.

విరుగుళ్లు:—నక్సువామికా, కాఫీ, చైనా, ఎసాఫాటీడా, కొలోసింథిస్.

మోతాదు:—6 మొదలు 1000 పొటెన్సీ. నిలవగాయున్నజబ్బుల మీద పెద్దపొటెన్సీలే వాడనగును. దీనిగుణకాలపరిమితి 50 దినములు.

బాహ్యోపయోగములు:—దీనిని మదరుటించరురూపమున తీసికొని 10 లగాయితు 20 రెట్లు నీళ్లలోకలిపి లోషన్లును తయారుచేసి, శరీరము

కాలిబొబ్బలెక్కినపిదప, అట్టిబొబ్బలమీద యీలోషనులో గుడ్డనుగాని, దూదినిగాని ముంచికట్టవలెను. మరియు యిట్టిలోషనునే వ్రేలిగోళ్లపుండ్ల మీదను, మరియు చీముపట్టినపుండ్లు, లేక దెబ్బలకును, పైవిధముననే వాడవచ్చును.

---

## 324. చైనా ఆర్సు—చినినం ఆర్సు.

## CHINA ARS—CHININUM ARS.

తీరని నిస్త్రాణను, అలసటను మాన్పును. మన్యపుజ్వరలక్షణములు, పార్శ్వపునొప్పులు లేక నరములదోషములు, ఉబ్బసము, క్షయ, నీళ్లవిరేచనములు మొదలగు రోగములు యెక్కువ నిస్త్రాణతో కూడియున్నప్పుడిది బాగుగా పనిచేయును. పుగాకు నుపయోగించుటవలన వచ్చినరోగములను మాన్పును.

మనస్సు, తల:—జ్ఞాపకశక్తి లేకపోవుట. ఆతురతగా నుండుట. చిరచిరలాడు చుండుట, అటుపిమ్మట తలనొప్పివచ్చుట. అకస్మాత్తుగా వచ్చు తలతిప్పు. ఇది తలనెత్తిచూచుటవలన వుద్రేకించుట. తల నిండుగా నుండుటవలన బద్దలగునట్లు తోచుట. నుదుటియందును, ముచ్చిలిగుంటలోను, బరువుగాను, నొప్పిగాను యుండుట; ఇది కదలికవలన హెచ్చగుట.

కన్నులు:—వెలుతురును చూచుట కష్టముగానుండుట. వెచ్చని కన్నీళ్లు విస్తారముగా వెడలుట.

చెవులు:—గంటలు వాయించుచున్నట్లు ధ్వనులు వినబడుచుండుట. మాట సరిగా వినపడకపోవుట.

ముఖము:—కండరములు వణకుచుండుట. ముఖము పాలిపోయి, పొంగరించియుండుట. ముక్కునుండి మావనటువంటి రక్తస్రావములు.

నోరు:—నాలుకపైని చిక్కని పసుపుపచ్చని పూత యుండుట. నోరు చేదుగాయుండుట, ఆకలిలేకపోవుట. దుర్వాసనగా యుండుట.

అన్నకోశము:—ఆకలిలేకపోవుట, చల్లనినీటిని త్రాగుటయందును, తీపివస్తువులు తినుటయందును యెక్కువ కోర్కెగలిగియుండుట. గుడ్లను గాని చేపలనుగాని తినినవెంటనే నీళ్లవిరేచనములు బాధలేకుండగా అగునప్పుడు ఇది పనిచేయును.

పొత్తికడుపు:—కాలేయపు వాపును మాన్పును.

మలము, మలాశయము:—మలము పూర్తిగా వెలుపరింపబడువరకును, పల్చగాను, గోధుమవర్ణముగాను, బాధలేకుండగను మలము వెడలుచునే యుండుట ఉదయమున బట్టకట్టుకొనుటకునుగూడ వ్యవధానములేనంతటి తొందరగా, యెక్కువ చిక్కని ఆమముతో కూడిన నీళ్లవిరేచనమగుట.

హృదయము:—మిక్కిలియెక్కువప్పుడు వుబ్బసరోగములోవలె వూపిరి అందకపోవుట, గుండెదడ, బహిరంగమైన గాలిని యెక్కువగా కోరుట. హృదయము ఆగిపోయినట్లు భావనయుండుట.

శ్వాసావయవములు:—పీల్చగలిగినకంటె యెక్కువ గాలిని కోరుచుండుట. ఉదయము లగాయితు మధ్యాహ్నమువరకును వూపిరాడుట కష్టముగాయుండుట, అప్పుడు, తెరచియున్న కిటికీవద్ద కూర్చొనిన ఇది వుపశమించుట. ఉబ్బసపువ్యాధిమీదను క్షయరోగముమీదను బాగుగా పనిచేయును. ముసలితనములో యెక్కువగా శ్లేష్మము వెడలుచుండుట, అప్పుడప్పుడు జ్వరము లేక వుడుకు తగులుచుండుట, యీలక్షణములు రాత్రియందెక్కువగుచున్నప్పుడు దీనిని వాడవలెను.

నిద్ర:—నిద్రగాఢముగాను, యెక్కువ కలలతో నునిండియుండుట. ఒకప్పుడు అస్థిమితముతోను, ఆతురతతోను కూడియుండుట. మరియు తరుచు మెలకువవచ్చుచుండుట. నరములదోషములవలన నిద్రలేకుండుట (ఇట్టిస్థితిలో 5 × లేక 6 × పొటెన్సీ పొడుమును ఒక్కమోతాదును ఇవ్వవలెను.)

జ్వరము:—తరుచు చలి, వణకుయుండుట, చెమట చల్లగాను,

యెక్కువగాను పోయుచుండుట. శరీరము వెచ్చగానుండుట. ఎక్కువ నిస్త్రాణగాయుండుట.

కాళ్లు, చేతులు:—ఎక్కువ నీరసముగానుండుట. చేతులు, కాళ్లు మోకాళ్లు చల్లగానుండుట. చీల్చుచున్నట్లు బాధగానుండుట. పిక్కలు లాగుచుండుట.

ఎముకలలో బిగపట్టినట్లుండుట; ఇట్లు నడుచుచున్నప్పుడుకూడ వుండుట, కీళ్లసంధులలోపల మంటతోకూడిన నొప్పి. అస్థిమితమువలన ఇంటిలో వుండలేక ఇల్లువదలి బయటకు పోవుచుండుట, నిస్త్రాణవలన పడుండవలెనని తోచుట.—ఇవి దీని ప్రత్యేకలక్షణములు.

పోలికలు:—యాపిసు, ఎథూజా, కేక్టసు.

మోతాదు:—$3_x$ లగాయతు 200 పొటెన్సీ. చిన్నపొటెన్సీలే బాగుగా పనిచేసినవి.

---

## 325. చైనా సల్ఫ—చినినం సల్ఫ.

## CHINA SULPH-CHININUM SULPH.

దీనిని పెద్దపొటెన్సీలో వాడినయెడల క్వయినావలన అణచిపెట్టబడిన మన్యపుజ్వరమును బయటకు రప్పించి దానిని మాన్పును. మేహవాత నొప్పులను మాన్పును. ఆసనమువద్ద రక్త మెక్కువజేరుటను, నురదనుమాన్పును. మూత్రపిండములవాపు చాలకాలమువరకు నిలువగా యుండినప్పుడును యెక్కిళ్లను కట్టుటకును దీనిని వాడనగును. రక్తస్రావమువలన యెక్కువ నిస్త్రాణజెందినప్పుడు ఇది బాగుగా పనిచేయును. వెన్నెముకలో బాధవలన ముట్టుకొనుటకు నొప్పిగానుండుటనుమాన్పును.

మనస్సు:—ఎక్కువ ఆతురత, విచారము వుండుటవలన ఉదయమందు మామూలుకన్న యెక్కువ త్వరగా లేవవలసివచ్చుట.

తల:—నుదుటను, కనుబొమలలోను మన్యపుజ్వరముకు సంబంధించి నొప్పివచ్చుట, ఇది మధ్యాహ్నమందును యెడమవైపునను యెక్కువగుట.

మరియు దీనితోపాటు తలతిప్పు వుండుట. రోగి వీధిలో నడుచుచున్నప్పుడు పడిపోవుట, నిలుచుండుటకుశక్తిలేకపోవుట, కండ్లు సరిగా కనపడకపోవుట.

కన్నులు:—నీరుకారుచుండుట. దృష్టి మబ్బుగాను, కండ్ల ఆవ్చుకుపోయి యుండుట. కండ్లయెదుట నిప్పుకణములు, నల్లనిమచ్చలు కనపడుచుండుట.

చెవులు:—గింగురుమనుచున్నట్లును, గర్జించుచున్నట్లును, ఝుంకారము చేయుచున్నట్లును ధ్వనులు వినిపించుచుండుట.

ముఖము:—పక్షవాతపునొప్పి కంటికి దిగువన ప్రారంభించి కంటిలోకిని, కంటిచుట్టును వ్యాపించుట. బాధలు నొక్కుటవలన వుపశమించుట, మరియు నివి ఒకే వేళకు వచ్చుచుండుట. పాలిపోయి బాధపడుచున్నవానివలెను, జబ్బుచేసినవానివలెను కండ్లు లోతునపడియుండుట. సాయంకాలమందును, కాఫీతాగినపిమ్మటను, ముఖము వెచ్చగానుండుట. తరుచు ముక్కునుండి రక్తస్రావమగుచుండుట. తుమ్ములువచ్చుచుండుట.

నోరు:—ఇగుళ్లు పుండ్లగుట. తరుచు యెక్కువగా లాలాజలమూరుచుండుట. నాలుక తెల్లని పూతచే కప్పబడియుండుట. పసుపుపచ్చగాను, తెల్లగాను వుండునట్టి నాలుకపూత. రుచిచేదుగానుండుట. ఆకలిగానున్నను ఆహారము రుచించకపోవుట.

అన్నకోశము:—భోజనానంతరము తేన్పులు వచ్చుచుండుట. మన్యపుజ్వరములో వమనమగుటయు కట్టును.

పొత్తికడుపు:—విపరీతమైనశూల. ఆంత్రములవద్దను, ప్లీహమువద్దను, వాపుగాను, గట్టిగాను వుండుట. వాయువువలన కడుపు వుబ్బరించుట

మలము, మలాశయము:—తీరనిమలబద్ధము, దీనితోపాటు శరీరము వెచ్చగానుండుట. ఒకప్పుడు దుర్వాసనతోకూడిన నీళ్లవిరేచనములు, ఇవి దినమునమున కొన్నియో వెడలుట, అప్రయత్నముగా వెడలునీళ్లవిరేచనములు

వెన్నెముక:—ఛాతీ వెనుకనున్న వెన్నెముకలో అతిసున్నితముగా వుండుట. బాధలు మెడ, తలవరకుకూడ వ్యాపించుట.

మూత్రావయవములు:—మూత్రము రక్తముతో కలిసిపోవుచుండుట. మరియు నిది చిక్కగాను, బంకమట్టిరంగుగాను వెడలుచుండుట. మూత్రము విస్తారముగాను, శ్వేతధాతువుతో కలసియు పోవుచుండుట. ఉబ్బురోగుల లో మూత్రము మబ్బురంగుగాను, దుర్వాసనతోను వెడలుచుండుట.

పురుషావయవములు:—సంభోగేచ్ఛతగ్గుట.

స్త్రీ అవయవములు.—బహిష్టు చాల ముందరగా అగుట. బహిష్టులో ఒకసారి ఋతుస్రావము, మరియొకసారి కుసుమ, వెడలుచున్నప్పుడు పని చేయును.

ఛాతీ:—గుండెదడ. వూపిరాడకుండుట. పొట్టవుబ్బుటవలన వూపిరాడుట కష్టముగానుండుట; మరియు నిది మూత్రము విడిచినపిదపతగ్గుట.

చర్మము:—యెక్కువ దురదగాను, పొక్కులతోను, ముడతలుపడి, యుండుట. ముట్టుకొనుటకు నొప్పిగా యుండుట.

జ్వరము:—యెక్కువ ఆతురతగాను, ఉష్ణము వుండవలసిన కన్న తక్కువగాను యుండుట. వెచ్చనిగదిలోనున్నను, వణకుపట్టుట. చలిగానున్నప్పుడు అపరిశుద్ధనాళములు వాచి బాధగానుండుట. సాయంకాలము 3 గంటలకు ప్రతిదినమును చలివచ్చుట. శరీరము పగలు వెచ్చగాను సాయంకాలమందు చెమటతోను యుండుట.

నిద్ర:—పగలు నిద్రమత్తుగాయుండుట. రాత్రి తరుచు అపలింతలు, వణకు, నొప్పులున్నట్లు బాధలు యుండుట.

ఉద్రేకము:—తాకుటవలన.

ఉపశమనము:—నొక్కుటవలన, ముందరకు వంగుటవలన.

విరుగుళ్లు:—సేటర్నియూరు, లెకెసిస్, ఆర్నికా, పల్సటిల్లా, ఆర్సెనికం అల్బం, కాస్టికం, ఫెర్రం మెట్, హెపారుసల్ఫ.

పోలికలు:—యాపిసు, ఆర్సెనికం ఆల్బం, బ్రియోనియా, కార్బొయానిమలిసు, యూపటోరియంపెర్ఫు, నక్సువామికా, పల్సటిల్లా, స్టేనం మెటాలికం, స్టాఫిసేగ్రియా.

మోతాదు:—2x మొదలు 1000 పొటెన్సీ. ఇది చిన్నపొటెన్సీలలో బాగుగా పనిచేయుచున్నది.

---

## 326. క్లోరం. CHLORUM.

స్వరపేటిక ముడుచుకుపోవుటతోను, కంపించుచు యుండుటతోను యుండుయీయాడ్పువలన శ్వాసను విడుచుటకు కష్టముకలుగుటయు, రొంప, ముక్కునుండు నీళ్లవంటిస్రావము వెడలుట, నోరు వెచ్చగను బాధగను యుండుటమరియు, పుండుపడుటయు దీని ప్రధానలక్షణములు.

మనస్సు, తల:—చిరచిర. కీడురానున్నదను భయము. ఆవేశమువలని కోపములు. జ్ఞాపకశక్తి లేకుండుట. నుదుటినొప్పివలన పరుండవలయునని యుండుట దగ్గినచో నుదుట వెచ్చనిచెమటవచ్చుట.

ముక్కు:—రొంపతోకూడిన తలనొప్పి. వుదయమున తుమ్ములు వచ్చుచుండుట. ముక్కుశోణములు పుండ్లుపడుట. వాసన తెలియకుండుట.

నోరు:—నాలుకనల్లబడుట, ఆరుచుకొనిపోవుట(బేప్టిషియా). దుర్వాసన. పుల్లని లాలాజలను వచ్చుట.

శ్వాసావయవములు:—తేమగాలివలన మాట బొంగురుగావచ్చుట. వూపిరిలోతీయుట సులభముగానే యున్నను వూపిరిని విడుచుట అతికష్టముగానుండుట (మిఫైటిసు). స్వరపేటిక ముడుచుకొనిపోవుటవలన వూపిరాడకుండుట; యిందువలన ముఖము నీలిరంగుగా నగుట. పిల్లిమోర్తలు. అతితరుచుగా పొడిదగ్గు కొద్దికొద్దిగా వచ్చుచుండుట. శ్లేష్మమును వెలువరించుట కష్టముగానుండుట. శ్లేష్మ మెక్కువగా పుట్టుచుండుట.

హృదయము:—వడిగాకొట్టుకొనుట.

జ్వరము:—చలి వుదయమున 10 గంటల లగాయతు మధ్యాహ్నము 2 గంటల వరకు యుండుట. అతితిందోళణ, వేడిమి. శరీరము కాలిపోవు చున్నంతవెచ్చగానుండుట. రాత్రులందు చమటలుపట్టుట. టైఫసుజ్వరము.

వుద్రేకము:—అర్థరాత్రిము మొదలు వుదయము 7 గంటల వరకు, పరుండినచో, ఎక్కుచు దిగుచు నడుచుటవలన.

వుపశమనము:—బహిరంగమైనగాలిలో.

పోలికలు:—మిఫైటిసు, బ్రోమియం, నేట్రంమూరు.

విరుగుళ్లు:—లైకోపోడియం, ప్లంబంఎసెటట్, ఆల్బుమెన్.
యాసిడుహైడ్రో—కిది విరుగుడు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 327. క్రైసరోబీనం—యాసిడ్ క్రైసో.

## CHRYSAROBINUM—ACID CHRYSO

ముఖ్యముగా తామరకును, మానవటువంటి పొక్కులతోను పుండ్ల తోను కూడిన చర్మరోగములకు దీనిని వాడవచ్చును. చర్మరోగములలో దళసరిగా పెద్దపెద్ద పక్కులు కట్టుచుండుట. తొడమీదను, పాదములమీదను, చెవులవద్దను దురద ఎక్కువగా నుండుట.

మోతాదు:—$6_X$ మొదలు 200 పొటెన్సీ. 6 x పొడుమురూపమున వారమునకు రెండు మోతాదులు వాడినచాలును.

---

## 328. సిన్నబారిస్. CINNABARIS.

ఇది ముఖ్యముగా సవాయిరోగముమీదను, సెగరోగము మీదను యీరెండురోగములును కలిసియున్నప్పుడునుకూడ పనిచేయును. సవాయి దోషమువలన బాధపడుచున్నవారికి సెగరోగము తగులుటవలన శరీరతత్వ

ములో కలుగు మార్పులమీద నిది బాగుగా పనిచేయును. అట్టివారికి చర్మముమీద పులిపిరికాయలు లేక మొటిమలవంటివి విస్తారముగా బయలుదేరుట; ఇవి మొనతేరక, విస్తరించియుండుట, మరియు నిట్టివి శిశ్నాగ్రిచర్మముమీద బయలుదేరుట, ఎర్రగాను, వాపుతోను, దుర్వాసనగల చీముతోను, యుండుట; పుండ్లనుండియు, పొక్కులనుండియు, తాకుట వలనను రక్తము స్రవించుట — ఈలక్షణములు దీనివుపయోగమును సూచించును.

తల:—తలనొప్పివలన యెక్కువ బాధగానుండుట. నుదురు చల్లగాను నొప్పిగాను యుండుట, యీనొప్పి వుష్ణోపచారమువలన వుపశమించుట. ముఖముష్పాంగరించి కండ్లు యెర్రగానుండుట. కనురెప్పలు దళసరెక్కుటను మాన్పును. చెవిమీదదురద, పొక్కులుబయలుదేరుట.

ముక్కు:—పసుపుపచ్చని ముద్దవలె ఆమము వెడలుట. దురదగానుండుట. ముక్కుమొదటనొప్పి పారంభించి ముక్కు ప్రక్క యెముకలలోకి పాకుట.

నోరు:—నాలుకపై తెల్లనిపూతయుండుట. రుచి చేదుగా యుండుట. లాలాజలము, మూత్రము, యెక్కువగా వెడలుట. నోటినుండి కుళ్లు వాసన వచ్చుట. గొంతుకలోని గవదకాయలు పుండ్లుపడుట పుండ్లు నిప్పువలె యెర్రగా కనబడుట.

పొత్తికడుపు:—నెచ్చగానుండుట. అపానవాయువు చేరియుండుట.

మలము, మలాశయము:—విరేచనములో జిగట, రక్తము కలిసి వెడలుట. ఆకుపచ్చని ఆంబవిరేచనములు.

పురుషావయవములు:—అంగమువాచుట శిశ్నాగ్రిచర్మము వాచుట. దీనిపైని బయలుదేరిన పులిపిరికాయలనుండి సులభముగా రక్తము స్రవించుట. అండములు పెద్దవగుట. బిళ్లలు, అడ్డకర్రలు, సవాయిసంబంధమైన పుండ్లు, వీటిని మాన్పును. సంభోగమునందును, ఆహార పానీయము

లందును, తీరనితోర్కె గలిగియుండుట. రాత్రిపరుండిన పిమ్మట లేచిన మెక్కువగానుండుట.

స్త్రీ అవయవములు:—కుసుమవ్యాధిలో స్రావము వెడలుచున్న వ్వుడు గర్భాశయములో నొక్కుచున్నట్లుండుట.

కాళ్లు, చేతులు:—కీళ్లసంధులలో చల్లగానుండుట. చేతులలో చీల్చుచున్నట్లు నొప్పులుగానుండుట, చేతివేళ్లు, వాటికణుపులు, వెచ్చగాను యెఱ్ఱగాను యుండుట.

చర్మము:—చెవులు, ముఖము, అఱచేతులు, ముక్కు, తొడలలోపలివైపు, మోకాళ్లు, కాళ్లు, ఆసనము, భుజములు వీటిలో దురదగానుండుట. చర్మము యెఱ్ఱగానుండుట.

వుద్రేకము:—కుడివైపున పరుండినపుడు.

పోలికలు:—కేంఫరు, లెకెసిస్, తూజా, యాసిడునైట్రికు, సేపియా, మెర్క్యూరియసు, క్లెమేటిసు, సెనీగా.

విరుగుళ్లు:—హేపారుసల్ఫు, యాసిడ్ నైట్రిక్, ఓపియం, సల్ఫరు.

మోతాదు:—3x మొదలు 30 పొటెన్సీ. చిన్నపొటెన్సీలలోపొడుము రూపమున బాగుగా పనిచేయును.

---

## 329. కోబాల్టం. COBALTUM.

మర్మావయవదోషములు, వెన్నెముక లేక నడుముకుసంబంధించిన దోషములు; ఇవి రేతస్ఖలనములతో ద్వంద్వముగానుండుట; నిస్త్రాణ, మనోచాంచల్యము, వుదయమున వుద్రేకించు ఎముకలలో నొప్పులు—వీటిమీద నిది ముఖ్యముగా పనిచేయును.

మనస్సు:—మానసికోద్రేకమువలన రోగోద్రేకముగలుగుట. రోగి యొకసారి కులాసాగాను, ఒకసారి కోపముగాను, ఒకసారి మందముగాను,

ఒకసారి చురుకుగాను వుండుట. చదువుటయందు ఎక్కువ ఆసక్తి గలుగుట.

తల:—తలను ముందుకువంచుట బాధకరముగానుండుట. గడ్డము, తల అతిదురద.

కన్నులు:—చదివినను, వ్రాసినను దృష్టి మందగించుట.

నోరు:—నాలుక తెల్లనిపూతతోనుండుట (యాంటింక్రూడం). నాలుకమధ్య బీటలు. నోరు, గొంతుక ఆర్చుకుపోవుట.

అన్నకోశము, పొత్తికడుపు, మలాశయము:— కాలేయము, ప్లీహము వాచుట. నీళ్ల విరేచనములతో శూలద్వంద్వముగానుండుట. మలము వుండలవలె గట్టిగాను కొద్దికొద్దిగాను వెడలుట. ఆసనమునుండి రక్తము స్రవించుచుండుట.

పురుషావయవములు:—కుడివృషణములో నొప్పి మూత్రవిసర్జనకు పిమ్మట ప్రశమించుట. శృంగారసంబంధమైన కలలతో నిద్రయందు స్ఖలనముగుచుండుట. మరియు వీటివలన తలనొప్పివచ్చుట. నపుంసకత్వము. లేపనము లేకుండగనే స్ఖలనమగుట. నరముల నిస్త్రాణవలన కాళ్లు, పిక్కలు లాగుచుండుట. మూత్రము విడుచునపుడు మూత్రనాళము చివర మంటగానుండుట. పొత్తికడుపుమీదను మర్మావయవములమీదను పసుపుపచ్చని—గోధుమరంగు మచ్చలు బయలుదేరుట. శెగరోగముయొక్క ద్వితీయావస్థ.

కాళ్ళు, చేతులు:—వణకుట. నొప్పులు. మణికట్టులోనొప్పి. మోకాళ్లు పట్లుతప్పినంతటి నీరసము. పాదములకు చెమటలు.

నిద్ర:—స్ఖలనములు మరియు శృంగారమైన కలలవలని నిద్రలేమి. విశ్రాంతినివ్వని నిద్ర.

చర్మము:—పొడిగాను, పొక్కులతోను యుండుట. పడక వేడిమి వలని దురదలు.

ఉద్రేకము:—ఉదయమున, కూర్చున్నపుడు.

ఉపశమనము:—పరుండుటవలన, నడుచుటవలన

పోలికలు:—జింకం మెట్, యాగ్నసుకేస్టసు, సెలీనియం, సేపియా, కెన్నబిసుయిండికా, నక్సువామికా, తాల్లియం.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 330. కొరాలియం. CORALLIUM.

(పగడము)

ఇది శ్వాసావయవములయొక్కయు మర్మావయవములయొక్కయు రోగములమీద బాగుగాపనిచేయును. ముఖ్యముగా యిది కొరింతరగ్గును మర్మావయవములమీద బయలుదేరు సవాయిపుండ్లను మాన్పును.

మనస్సు, ముఖము:—ఒట్లు పెట్టుకొనుచుండుట. తల పెద్దదైనట్లు తోచుట. కండ్లు వెచ్చగాను యెర్రగాను కొవ్వొత్తిదీపమును చూచుట వలన మంటగాను వుండుట. తలలోని బాధలు చల్లనిగాలినిపీల్చుట వలనను వుద్రేకించుట. నాసికారంధ్రములోని పుండ్లవలన యెక్కువబాధగానుండుట. ముక్కునుండి రక్తము స్రవించుచుండుట.

పురుషావయవములు:—అంగము బొగడపైనను, మరియు శిశ్నాగ్ర చర్మములోపలివైపునను పగడమువలె యెర్రనిపుండ్లుపడి వాటినుండి పసుపుపచ్చగాను దుర్వాసనతోను స్రావము లేక చీము వెడలుట. నిద్రలో స్ఖలనములు కలలు రాకుండగనే అప్రయత్నముగా అగుటను, సంభోగ శక్తి తగ్గుటను మాన్పును. మర్మావయవములమీద యెక్కువగా చెమట పట్టుట. సెగరోగములోవలె దుర్వాసనతోగూడిన పసుపుపచ్చన ఆకుపచ్చన మిశ్రమవర్ణముగల స్రావము వెడలుట.

శ్వాసావయవములు:—స్రావ మెక్కువగా వెడలుట. పీల్చిన వాయువు చల్లగానున్నట్లు తోచుట. పొడిదగ్గు యెక్కువగా వచ్చుటవలన వూపిరి అందకపోవుట, ఛాతీలో నొక్కుచున్నట్లు బాధగానుండుట. విడువకుండగ దగ్గుటవలన రోగినిస్త్రాణజెంది వెనుకకు పడిపోవుట. దగ్గువుదయమున వుద్రేకించుట, పగలుదగ్గు సాధారణముగా అప్పుడప్పుడు వచ్చుచుం

డుట. రాత్రియందు కోరింతదగ్గునుపోలి విడువకుండగను, ఆయాసముతోను, వూపిరందకపోవుటతోను దగ్గువచ్చుట. ఇది కోరింతదగ్గు మీద బాగుగా పనిచేయును.

వృద్ధికము:—బహిరంగమైన గాలిలో, వెచ్చనిగదిలోనుండి చల్లనిగదిలోనికి మారుటవలన.

మెర్క్యురియస్—నకిది విరుగుడు.

పోలికలు:—కాస్టికం, బెల్లడోనా, హయాస్యామస్.

సహచరులు:—సల్ఫరు.

మోతాదు:—6x మొదలు 30 పొటెన్సీ.



## 331. కుప్రం ఎసెటె. CUPRUM ACET.

ఇది యెక్కువ మానసిక పరిశ్రమవలనను; పొక్కులను, దద్దురులను అణచిపెట్టుటవలనను వచ్చు రోగములమీదను, శ్వాసావయవ రోగముల మీదను, బాగుగా పనిచేయును. కోరింతదగ్గును మాన్పును.

మెదడు, తల:—జ్ఞాపకశక్తి లేకుండుట. పరధ్యానముగానుండుట. పోలీసువాళ్లు, తనను పట్టుకొనుటకు వచ్చినారనుకొనుట. అధికప్రస్తావన చేయుచుండుట. విచారముగానుండుట. నుదుటిలో పొడుచుచున్నట్లు నొప్పిగానుండుట. యింటిపైకప్పు యెత్తుగానుండుగదిలో తలతిరుగుట, తల భారముగాను, ఒకపార్శ్వమునందు నొప్పిగాను, యుండుట.

ముఖము:—దౌడలు దగ్గరపడినట్లుగాయుండుట. విచారగ్రస్తముగా కనుపించుట.

అన్నకోశము, పొత్తికడుపు:—శూల తెరలు తెరలుగా వచ్చుచుండుట. తరుచు వమనములగుచుండుట. రక్తమును, శైత్యరసమును,నురగవంటి తెల్లనిపదార్థమును వమనముచేసుకొనుట. పొత్తికడుపులో తీవ్రగా నుండుట.

మలము, మలాశయము:—వివిధరకములగు క్రిములు మలముతో కలసి వెడలుచుండుట. జిగట, రక్తము మలములో కలసి వెడలుచుండుట. కలరాలో బాగుగా పనిచేయును.

శ్వాసానయనములు:—వూపి రందకపోవుట. ముకుముకొనిపోయి నట్లుండుట. చీల్చుచున్నట్లుండు బాధతో వచ్చు పొడిదగ్గు. దగ్గు రాత్రి 11 గంటలు లగాయితు ఒంటిగంటవరకు వచ్చుచుండుట. విడిచి విడిచి వచ్చు దగ్గును, కోరింతదగ్గును మాన్పును.

చర్మము:—పొంగు, మశూచికము, మంత్రిము మొదలగు, బహువిధ చర్మరోగములమీద పనిచేయును. శరీరమంతయు చిన్నవిగాను పెద్దవిగాను యుండునట్టి బొబ్బలను, దురదలేనట్టి కుష్టురోగములోవలెనుండు పొక్కులు, దద్దురులు మొదలగు లక్షణములనుకూడా మాన్పును. కుష్టును మాన్పును.

వృద్ధికము:—మనోవికారమువలన, తాకుడువలన, వెచ్చదనము వలన, కదలికవలన.

ఉపశమనము:—నమలుటవలన, నొక్కుటవలన, రాత్రియందు, బాధగానుండినవైపు పరుండుటవలన.

ఇది కుప్రిం మెట్ వలెనే పనిచేయునుకాని దీనిపని కుప్రిం మెట్ కన్న యెక్కువ తీవ్రముగానుండును,

విరుగుళ్లు:—బెల్లడోనా, చైనా, కోనియం, హెపారుసల్ఫ, సిక్యూటా విరోసా, డల్కమారా, హెపారుసల్ఫు, ఇపెకాక్, మెర్క్యూరియసు, నక్సువామికా.

మోతాదు:—3x మొదలు 6x వరకు పర్గమమున సోడుమురూపమున వాడవలెను. పిమ్మట ఇంతను హైపొడెర్మిసును కూడా వాడవచ్చును.



## 332. కుప్రం మెట్. CUPRUM METALLICUM.

(రాగి—తామ్రము)

నరములలో లాగుచున్నట్లు బాధలు, కండరములలో నొక్కుచున్నట్లుండు నొప్పులు—యీలక్షణములతోనుండు రోగములు (పక్షవాతము, బాలపాపచిన్నె, మొదలగు కంపముతోకూడిన వ్యాధులు) నియమితకాలములందు వచ్చుచుండుట; చర్మరోగముల నణచిపెట్టుటవలన కలుగు మానసికలక్షణములు; తీసికొనిన పానీయములు గలగలధ్వనితో లోనికిదిగుట; కలరా వ్యాధిలో పొత్తికడుపులో నొక్కుచున్నట్లు నొప్పిగానుండుట, పిక్కలులాగుట; కంపముతోగూడిన ఫిట్లు వేళ్ళలో ప్రారంభించి శరీరమంతటను వ్యాపించుట; రక్తదోషమువలన చర్మముమీద మచ్చలు నలుపుగాను, నీలివర్ణముగాను యుండుట—ఇవిదీనివుపయోగమును సూచించును.

మనస్సు:—అనుటకు వుద్దేశింపని మాటలనుఅనుట. ఇది **అపస్మార**ముకు ముందుగా గలిగినపుడు యీఔషధము బాగుగా పనిచేయును. అభిప్రాయములు తప్పుగాను, ఆతురతతోను, తొందరగాను గలుగుచుండుట. కనపడినవారిని పిచ్చివానివలె కొరుకుచు,కొట్టును యుండుట. వస్తువులను చీల్చుట, లేక బద్దలుకొట్టుట. పరాకుమాటలాడుచుండుట. ఒకప్పుడు అధికకోపము వచ్చుచుండుట యొక్కవ విచారగ్రస్తముగా నుండుట. ఆయాసము చెమట పట్టినపిమ్మట తగ్గుట.

తల:—కంగారుగాను, బరువుగాను యుండుట. నుదిటిలోను, కనుబొమలలోను, తలవెనుకను అప్పుడప్పుడు పొడుచుచున్నట్లు నొప్పిగానుండుట, ఈనొప్పి నొక్కుటవలన ఉద్రేకము జెందుట.

కన్నులు:—నొక్కుచున్నట్లు నొప్పిగాయుండుట. కంపములోవలె కనుగ్రుడ్లను అటునిటు త్రిప్పుచుండుట.

చెవులు:—దురదగానుండుట. మాటవినబడక పోవుట.

ముక్కు:—దిబ్బడవేయుట, కుడివైపు నాసికారంధ్రము నుండి రక్తముస్రవించుట, నీళ్లవంటిస్రావము వెడలుట.

ముఖము:—విచారగ్రస్తముగాను, బాధపడుచున్నవానివలెనుయుండుట. ముఖముమీది కండరములు నొక్కుకొనిపోవుట లేక ముడుచుకొనిపోవుట.

నోరు:—పొడిగానుండుట. నోటివద్ద నురగవచ్చుట. నాలుకయెఱ్ఱగాను, పొడిగాను గరుకుగానుయుండుట. నాలుకపై తెల్లని లేక గోధుమ వర్ణపుపూతయుండుట. నత్తిమాటలాడుట. నాలుకకు పక్షవాతమువచ్చుట. నాలుక పామునాలుకవలె, లోపలకును, వెలుపలకును వచ్చుచుండుట (లెకెసిస్). గవదకాయలు యెఱ్ఱగా వాచుట.

అన్నకోశము, పొత్తికడుపు:—వెచ్చని ఆహారములను, చల్లనిపానీయములను కోరుచుండుట. రుచి తియ్యగాను, లోహపురుచిగాను వుండుట. బహిష్టులో స్రావము వెడలుచున్నప్పుడు వికారము, వమనము, పొట్టలో నొక్కుచున్నట్లు బాధలు యుండుట. లాగుచున్నట్లును, కోయుచున్నట్లును, విపరీతముగా బాధయుండుట. గజ్జలలోని మాంసగ్రంథులు వాచుట. యెక్కిళ్లను మాన్పును. పొత్తికడుపు వుబ్బరముగాను, వెచ్చగాను, ముట్టుకొనుటకు నొప్పిగాను యుండుట. వికారము, వమనములు చల్లని నీరు త్రాగినయెడల తగ్గుట. బొడ్డువద్ద కోయుచున్నట్లు బాధగానుండుట. కలరా వ్యాధి ఆఖరు దశలో పిక్కలులాగుట, అవయవములు ముఖము నల్లబారుట యున్నప్పుడు బాగుగా పనిచేయును.

మలము, మలాశయము:—మలము నల్లగాను, బాధతోను, రక్తము, తీపుతోను వెడలుట మరియు నిస్త్రాణను కలుగజేయుట. ఒకప్పుడు మలబద్ధముగాను శరీరము వెచ్చగాను యుండుట. మూలశంఖునుండి రక్తము స్రవించుట.

మూత్రావయవములు:— యెక్కువగా మూత్రానుమానముండుట. మూత్రము కొలదిగా వెడలుట. రాత్రియందు నిద్రలో అప్రయత్నముగా మూత్రము విడచుటను మాన్పును.

పురుషావయవములు:—అంగము వాచుట; దీనిచివరను వాపుగాను

బాధగాను యుండుట. రోగవ్యాధిలో స్రావము ఒకప్పుడు యెక్కువగాను మరియొకప్పుడు తక్కువగాను వెడలుట. మూత్రద్వారము మూసికొని పోవుట.

స్త్రీ అవయవములు:—పాదములలో చెమట వణచిపెట్టుట వలన బహిష్టు ఆగిపోవుట (సైలీషియా). ఋతువు బహుఆలస్యముగాను, స్రావము చాలదినములవరకును వెడలుచుండుట. గుండెదడను రక్తహీనతను మాన్పును. ప్రసవానంతర నొప్పులమీదనిది బాగుగా పనిచేయును.

శ్వాసాశయములు:—ఇది కోరింతదగ్గుమీద సిద్ధౌషధము (Specific) వలె, పనిచేయును. దీనిలో బిడ్డ కొయ్యబారుట, శ్వాస ఆగి పోవుట, శరీరమును విరుచుకొనుట, వుక్కిరిబిక్కిరియగుట, ముఖము, శరీరము నీలవర్ణముగానగుట, తెలివి తప్పుటవుండుట; తెలివివచ్చినకొంత సేపటికి వమనము చేసుకొనుట గలుగుట ఇట్టిలక్షణములమీద నిది బాగుగా వుపయోగపడును. ఆకస్మికముగావచ్చు వుబ్బసపుదగ్గు, ఇది 2, 3 గంటలైనపిమ్మట ఆకస్మికముగానే తగ్గుట. రాత్రి వుద్రేకించు దగ్గులు, వీటిలో వూపిరాడకుండుట, గొంతుక బొంగురుపోవుట, వుదయమున దుర్వాసనతో గూడిన స్రావముతో దగ్గువచ్చుట.

హృదయము:—కండరములు కొంకర్పునే కన్పబడి యుండుట (ఫైటోలక్కా); క్రమముగా నిది బలహీనతజెంది పోవుట, నాడినిస్త్రాణగానుండుట. గుండెదడను, పోటును మాన్పును. నాడిఒకప్పుడు గట్టిగాను, ఒకప్పుడు మందముగాను, అనేకవిధములుగా కొట్టుకొనుచుండు నప్పుడు ఇది బాగుగాపనిచేయును.

కాళ్లు, చేతులు:—చేతులుచల్లగానుండుట. అరిచేతులలో తిమ్మిరగానుండుట. అపస్మారములో లేక మూర్ఛలో ఫిట్టువచ్చుటకు ముందు (Aura) "ఆరా" అనబడు నరములలో కరిగిలినట్లుండు భావన, మోకాలులోకలిగి, శరీరములోని పైఅవయవములలోనికి ప్రాకినట్లుతోచుట; దీని వెంటనే రోగికి వేళ్లు ముడుచుకొనిపోవుట, తిమ్మిరలుగా నుండుట,

అవయవములు కంపించుట గలుగుట. ఇది కంపనముతోగూడిన వ్యాధుల మీద బాగుగా పనిచేయును. పిల్లలకు పండ్లువచ్చుకాలములోకలుగు కంపముతోగూడిన (బాలపాపచిన్నె వెుదలైన) రోగముల మీద బాగుగా పనిచేయును.

చర్మము:—దురదగానుండుట. మోచేతి లోపలివైపు తామర వంటి చర్మరోగము బయలుదేరుట. నీలిరంగుమచ్చలు, మానవటువంటి పుండ్లను, కుష్టును మాన్పును.

నిద్ర:—శరీరస్మారకము తప్పి నిద్రపోవుట, దీనిలో శరీరమును కదల్చుచుండుట. నిద్రపోవుచున్నప్పుడు పొత్తికడుపుతో గుడగుడలాడు ధ్వని కలుగుట

జ్వరము:—రాత్రియందు చెమటపట్టుట. నెమ్మదిగా వుద్రేకించుజ్వరములు. కాళ్లలోను చేతులలోను యెక్కువ చెమటపోయుచుండుట. నాడినెమ్మదిగాను, నిస్త్రాణగాను యుండుట.

వుద్రేకము:—కుడివైపున, తాకుటవలన, కదలికవలన, పరుండుట వలన, నొక్కుటవలన, ముందరికివంగుటవలన, బహిష్టుకుముందర వమనమగుటవలన.

వుపశమనము:—వెచ్చదనమువలన, విరేచనానంతరమున, చెమట పట్టినపిమ్మట చన్నీరు త్రాగుటవలన.

సహచరులు:—కాల్కేరియా కార్బ.

ఆరంమెట్, మెర్క్యూరియసు, ఓపియం—లకిదివిరుగుడు.

పోలికలు:—కాల్కేరియాకార్బ, జల్సిమియం, సిక్యూటావిరోసా, కొలోసింధస్, విరేట్రింఆల్బం, యాపిసు.

విరుగుళ్లు:—బెల్లడోనా, కేంఫరు, డల్కమారా, హెపారుసల్ఫు.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ. పెద్దపొటెన్సీలు బాగుగాపనిచేయుచున్నవి. దీనిగుణకాలపరిమితి 2 లేక 3 వారములు,

## 333. కుప్రిం సల్ఫు. CUPRUM SULPH.

(మయిల తుద్ధము)

ముఖ్యముగా నిది కంటిరోగములమీదను జీర్ణావయవ రోగముల మీదను చర్మవ్యాధులమీదను బాగుగా పనిచేయును.

తల:—నడినెత్తిని మంటతోకూడిన బాధ.

కన్నులు:—కనురెప్పలలో కొయ్యకండలు పెరుగుట. కండ్లనుండి గసివలెనుండు స్రావము వెడలుచుండుట. కండ్లు బిగపట్టినట్లుండుట, దృష్టిమాంద్యము. మూసుకొనినను రెప్పలు కదలుచుండుట.

అన్నకోశము, పొత్తికడుపు:—వికారము, తలతిప్పు తరుచుగా వచ్చుచుండుట. ఆకుపచ్చగను గోధుమవర్ణముగను వుండు ఆమమును వమనము చేసుకొనుట. కడుపులో బాధవలన సొమ్మసిల్లిపోవుట. కడుపు అర్చుకుపోవుట. కాలేయము వాచుట. విరేచనబద్ధము,

హృదయము:—వ్రుండపెట్టినట్లు యుండుట. గట్టిగా కొట్టుకొనుచున్నట్లుండుట.

శ్వాసావయవములు:—రాత్రియందు వుద్రేకించునట్టి తీవ్రమయిన దగ్గు. ఇందుతో నాలుక, పెదవులు నీలిరంగుగా నగుచుండుట.

చర్మము:— పాలిపోవుట. దురదగానుండుట, అర్చుకొనిపోయి పొడిగాను, దురదగాను యుండుట.

వుద్రేకము:—విశ్రాంతివలన బాధలు వుద్రేకించుట.

పోలికలు:—మెర్క్యురియసు, కాలీబైక్,

విరుగుళ్లు:—గుడ్లు, పాలు.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 334. ఫెర్రం ఆర్స. FERRUM ARS.

కాలేయమును, ప్లీహమును సంబంధించిన రోగములమీదను, రక్త క్షీణతమీదను ఇది బాగుగా పనిచేయును.

కాలేయము, ప్లీహము వాచుట; అజీర్ణవిరేచనములగుట, మూత్రములో శ్వేతధాతువు కలసిపోవుట, ఈలక్షణములు జ్వరముతోగూడి యున్నప్పుడిది బాగుగా పనిచేయును. జ్వరములో ముఖము కందుట, యెక్కువ చెమటపట్టుట, జ్వరములేనప్పుడు ముఖము పాలిపోయివుండుట, యేమిచేయుటకును తోచకుండుట, విరేచనబద్ధము, ఒకప్పుడు ఆమముతో గూడిన అజీర్ణవిరేచనములు, జ్వరములో దాహము కలుగకుండుట, చిక్కిపోవుట, నిస్త్రాణజెందుట, రక్తక్షీణత గలుగుట, చర్మము పొడిగాను, మంత్రపుపొక్కులవంటి చర్మరోగముతో నిండియుండుట. శరీరము వెచ్చగాను మంటగాను యుండుట; ఈలక్షణములు దీని వుపయోగమును సూచించును.

పోలికలు:—ఫెర్రం మెట్, ఆర్సెనికం ఆల్బం, కాల్కేరియా ఆర్సు, చైనా, ఫెర్రం అయోడ్.

మోతాదు:— 6 మొదలు 30 పొటెన్సీ.

---

## 335. ఫెర్రం బ్రోమేటం. FERRUM BROMATUM.

ఇది మర్మావయవరోగములమీద బాగుగా పనిచేయును.

మనస్సు, తల:—తల పెద్దదై పోయినట్లు భావనయుండుట. కండ్లు భారముగా వుండునట్లును, రెప్పలు మూతలుపడునట్లును తోచుట. ముక్కు, నోరు అర్సుకొనిపోవుట. ఈలక్షణములు ముక్కునుండి స్రావము వచ్చినపిమ్మట వుపశమించుట.

మలము, మలాశయము:—రక్తము, ఆమము, తీపుతో నీళ్లవిరేచనములు వెడలుట. అతితరుచుగా విరేచనమగుటవలన ఆసనము ఒరియుట,

పురుషావయవములు:—శుక్లనష్టము, రక్తక్షీణత, నిస్త్రాణ; ఇవి విచారముతో కూడి యున్నప్పుడిది బాగుగాపనిచేయును.

స్త్రీఅవయవములు:—గర్భాశయము భారముగాను, అసుఖకరముగాను వుండుట. ఇందువలన యేపనిచేయుటయును కొంతవరకు అభ్యంతరముగా నుండుట. మేడమెట్లు ఎక్కుట, దిగుట కష్టముగాతోచుట. గర్భాశయము వెలుపలకువచ్చుట. ఒరుపును గలుగజేయునట్టి విరేచనములు తగ్గినపిమ్మట, ఒరుపునుకలుగజేయునట్టి చిక్కని ఆముమువంటి స్రావముతోనుండు కుసుమరోగము బయలుదేరుట.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

---

## 336. ఫెర్రం అయోడ్. FERRUM IODATUM.

మాంసగ్రంధుల వాపులు, కంతులు, తరుచు కురుపులు బయలుదేరుచు మానుచుయుండుట, రక్తవిహీనత, శుష్కించిపోవుట—వీటిమీద నిది బాగుగా పనిచేయును.

తల:—భారముగాను, కంగారుగాను, నొప్పిగాను యుండుట—యీలక్షణములు బహిరంగమైనగాలిలో నుపశమించుట.

కన్నులు:—వాచి, చీమువంటి స్రావము వెడలుట. కొయ్యకండలు రెప్పలలో పెరుగుట.

చెవులు;—హోరుమనుధ్వనులు వినిపించుచుండుట.

ముక్కు:—మానని స్రావము. ఆకుపచ్చనిలేక పసుపుపచ్చని స్రావము.

నోరు:—లోహపురుచి, వివిధములగు రుచులుగానుండుట.

గొంతుక:—బొంగురుతనము. తినినఆహారము గొంతుకలోనికి త్రోయబడినట్లుండుట.

అన్నకోశము:—ఆహారము గొంతుక కడ్డముగాయున్నట్లు భావన. త్రేనుపులు. ఆకలిలేమి. పొగత్రాగుటయం దయిష్టత. ఎక్కువదాహము.

పొత్తికడుపు:—కొంచముగాతినినను పొట్టనిండుట. వుబ్బరింపు, బరువు. కాలేయము, ప్లీహముయొక్క వాపు జ్వరముతో కూడియుండనపు డిది పనిచేయును.

పురుషావయవములు:—మూత్రనాళములో మంట, బాధతో కూడిన అధిక లేపనము.

స్త్రీ అవయవములు:—ఎక్కువ నిస్త్రాణతో ద్వంద్వముగానుండు హిస్టీరియా లేక అపస్మారము, మరియు కుసుమరోగము, గర్భాశయము వెలుపలికివచ్చుట, స్వస్థానము తప్పుట. ఋతువు అణచిపెట్టబడుట లేక ఆగిపోవుట.

మూత్రావయవములు:— ముదరరంగుగాను, తియ్యనివాసనతోను మూత్రము వెడలుట. మూత్రమును ఆపుకొనలేకపోవుట. రక్తవిహీనులగు చిన్నపిల్లలు మూత్రము నప్రయత్నముగా విడచుట.

శ్వాసావయవములు:—ముక్కు, కంఠనాళము, స్వర పేటికనుండి పలుచని స్రావము. రొమ్ముక వెనుక నొప్పి.

వుద్రేకము:—కదలికవలన, నడచుటవలన, రాత్రియంగు, తాకుడు వలన, వెచ్చదనమువలన.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో.

పోలికలు:— ఎబ్రూమినా, హెలోనియాస్, కాలోఫైలం, గ్రాఫైటిసు, అయోడియం, కాలీబైక్.

మోతాదు:—$\theta$x మొదలు 30 పొటెన్సీ.

## 337. ఫెర్రం—ఫెర్రం మెట్.

## FERRUM—FERRUM MET.

(ఖడ్గలోహము)

రక్తక్షీణతతోను, నిస్త్రాణతోను, బాధపడుచుండువారల రోగముల మీదనిది బాగుగా పనిచేయును. ఇట్టివారికి మాట్లాడుటవలనను, నడకవలనను, నీరసమువచ్చుటను; చర్మము, ముఖము పాలిపోయి యుండుటను; రక్తప్రసారము సరిగానుండకపోవుటను మాన్పును. అట్టివారిరక్తములోని ఎర్రని రక్తకణములను వృద్ధిపొందించి దేహపుష్టి నిచ్చును. ఆముత్వచలు, ముఖము, పెదవులు పాలిపోయి యుండుట, ఇవి మనోవికారమువలనను, బాధవలనను యెర్రగానగుటను, రక్తస్రావములను మాన్పును. ఆకలిని పుట్టించును. అజీర్ణవమనములను, కదలికవలన వచ్చు తలనొప్పులను మాన్పును. ఋతువు త్వరగానగుటను, స్రావము యెక్కువగాను, చాలకాలము వరకు యుండుటవలననువచ్చు నిస్త్రాణను మాన్పును.

మెదడు:—చిరచిరలాడుచుండుట. కొలది ధ్వనులనుకూడ భరింపలేకుండుట. తాను చెప్పినది కాదనిన కోపమువచ్చుట.

తల:—సుత్తితో బద్దలుకొట్టుచున్నట్లుండు తలనొప్పులను మాన్పును. తలవెనుకను నొప్పివచ్చుట.

కన్నులు:—ఎర్రగాను, నీళ్లుకారుచును వుండుట. అక్షరములు కలిసిపోయినట్లగుపడుట.

ముఖము:—రక్తక్షీణత గలుగుటవలన పొంగరింపుగాను ఎర్రగానుండుచోట్ల తెల్లగాను వుండుట. పరిశ్రమవలనను, బాధవలనను, మనోవికారమువలనను యెర్రగాకుండుట.

ముక్కు:—జలుబువలన నీళ్లవంటి స్రావము వచ్చుట. రక్తస్రావముగలుగుటను మాన్పును.

నోరు:—పండ్లసలుపు, ఇది కుంచుపలె నుండు చల్లని నీటివలన వుపశమించుట.

అన్నకోశము, పొత్తికడుపు:—రుచి కుళ్ళిన గుడ్లరుచివలె నుండుట. నాలుకపై తెల్లని పూతయుండుట. ఆకలిఒకసారి యెక్కువగాను,మరియొకసారి తక్కువగాను యుండుట. ఒకప్పుడు విపరీతముగా ఆకలివేయుట. కాలేయములోను, నడుములోను నొప్పిగాయుండుట. కాలేయము వాచి పెద్దదియగుట. ప్లీహము మన్యపుజ్వరమువచ్చినపిదప వాచుట. భోజనానంతరము పొట్ట పొంగరింపుగాను, నొక్కుచున్నట్లును యుండుట.

మలము, మలాశయము:— సినమంతము విరేచనానుమానముతో నుండుట. మలము వెడలకపోవుటవలన తినుకుచుండుట. అజీర్ణవిరేచనములను కట్టును. భోజనము చేయుచున్నప్పుడు బాధలేకుండగను అప్రయత్నముగాను విరేచనమగుట. మూలశంఖునుండి రక్తము స్రవించుట, లేక దుర్వాసనతోగూడిన స్రావము వెడలుట. ఈలక్షణములు చీల్చుచున్నట్లుండు బాధతోను, దురదతోను కూడియుండుట. చిన్నపిల్లలలో ఆసనముదురదగా నుండునప్పుడును, మలాశయము వెలుపలకు వచ్చినప్పుడును పనిచేయును.

మూత్రావయవములు:—పగలు నడుచుచున్నప్పుడును; రాత్రియందును అప్రయత్నముగా మూత్రము వెడలుట.

మర్మావయవములు:— సంభోగేచ్ఛ యెక్కువగుట. నపుంసకత్వమును, వీర్యస్ఖలనములను మాన్పును. స్త్రీలలో సంభోగేచ్ఛ తగ్గినప్పుడును, వంధ్యత్వమును మాన్పుటకును పనిచేయును. బహిష్టుకుపెమ్మట అపస్మారము లేక హిస్టీరియా లక్షణములు కనిపించుట. గర్భస్రావమును మాన్పును.

శ్వాసావయవములు:— వూపిరాడకపోవుట. ఛాతీలో నొక్కుచున్నట్లుండుట, వుదయమందును, రాత్రియందును, హస్తప్రయోగాది దురభ్యాసములకలవాటుపడినవారికిని, క్షయరోగులకును, అధికపరిశ్రమవలనను, ఋతువు అణచిపెట్టబడుటవలనను వచ్చు రక్తస్రావమును మాన్పును.

హృదయము:— వడిగా కొట్టుకొనుట. గుండె దడ కదలిక వలన హెచ్చగుట. నాడి నిండుగా కనిపించినను నిస్త్రాణగా యుండుట.

కాళ్లు, చేతులు:—రాత్రియందు చేతులలోను, కాళ్లలోను చీల్చుచున్నట్లు బాధగానుండుట. లాగుచున్నట్లును, కొయ్యబారినట్లును నొప్పిగా యుండుట. భుజములలో వచ్చు మహావాతపు నొప్పులు. పిక్కలులాగుచుండుట.

చర్మము:—నొక్కినచోట సొట్టలుపడుట. పాలిపోయి పసుపుపచ్చగాను, యెండిపోయినట్లును, మురికిగాను సులభముగా కందుచునుండుట. అవయవములకు నీరుపట్టినపుడిది బాగుగా పనిచేయును.

జ్వరము:—అవయవములు చల్లగానుండుట. ముఖము, తల వెచ్చగానుండుట. అరికాళ్లలోను, అరిచేతులలోను వెచ్చగానుండుట. తెల్లవారుఝామున 4 గంటలకు చలివచ్చుట. నిస్త్రాణను గలుగజేయునంతటి చెమటలు పట్టుచుండుట. చెమటపట్టిన గుడ్డలు పసుపుపచ్చగానగుట.

వృద్ధికము:—కదలిక వలన, చెమట పోయుచున్నప్పుడు, అర్ధరాత్రిమున.

ఉపశమనము:—నెమ్మదిగా నడుచునప్పుడు, నొక్కుటవలన, వేసవిలో, విరేచనానంతరమున, ఒంటరిగానున్నప్పుడు.

సహచరులు:—చైనా, ఎల్యూమినా, హెమామెలిస్.

విరుగుళ్ళు:—ఆర్సెనికం ఆల్బమ్, హెపారుసల్ఫ, కార్బొవెజ్, మెర్కుసాల్, చైనా, ఇపెకాక్, పల్సటిల్లా.

పోలికలు:—గ్రాఫైటిసు, బొరాక్సు, ఎనకార్డియం, ఫాస్ఫరసు, సెలీనియం, తూజా, రూస్టాక్సు, కాస్టికం.

ఆర్సెనికంఆల్బం, చైనా, అయోడియం, మెర్క్యూరియసు, యాసిడుహైడ్రో, ఆల్కహాలు సంబంధమైన పానీయములకిదివిరుగుడు.

మోతాదు:—$6_X$ మొదలు 1000 పొటెన్సీ. రక్తక్షీణతగలవారిలో $3_X$ మొదలు $6_X$ వరకు (సాధుమును) వాడుట మంచిది.

---

## 338. ఫెర్రం మూరు. FERRUM MURIATICUM.

ఇదిరక్తదోషములమీదను, రక్తస్రావములమీదను, మేహవాతరోగములమీదను బాగుగా పనిచేయును.

తల:—పైత్యసంబంధమైన తలనొప్పి.

కన్నులు:—రక్తపుముద్దవలె ఎర్రగా నుండుట.

ముఖము:—పాలిపోయి, పొంగరించి యుండుట. పాలిపోయిన బుగ్గలమీఁద యెఱ్ఱని రంగుగా మచ్చలుండుట.

మలము, మలాశయము:—నీళ్లవిరేచనములు చాలకాలమువరకు వెడలుచుండుట, ఆకలిలేకపోవుట, శరీరముశుష్కించుట. మలమువల్లగాను, సిరావలెను విస్తారముగాను వెడలుట. రక్తము వెడలునట్టి మూలశంఖ. దీనితో క్రిమిరోగము ద్వంద్వముగా నుండుట.

మూత్రావయవములు:—మధుమూత్రము. మూత్రపిండములనుండి కాని మూత్రద్వారమునుండిగాని రక్తస్రావమగుట. మూత్రములో ఫాస్ఫేట్సు అలవాటుగా పోవుచుండుట. అప్రయత్నముగా మూత్రమును విడుచుట.

పురుషావయవములు:—ప్రాస్టేటుగ్రంధి వాచుట, పెద్దదగుట. స్ఖలనము లగుచుండుటను మాన్పును.

స్త్రీఅవయవములు:—సంభోగమునందు నొప్పిగాను, కోయుచున్నట్లు బాధగాను యుండుట. మరియు సంభోగము ఆనందకరముగా నుండకపోవుట. ఋతుశూలను, కుసుమనుమాన్పును. బహిష్టు అణచిపెట్టబడుట.

కాళ్లు, చేతులు:—నీరసమువలన పడుకొనవలసివచ్చుట. అవయవములలో తిమ్మిరివచ్చుట. భుజములోను చేతిలోను కంధరములలోను పట్టు

వాతములోవలె చీల్చుచున్నట్లుండు బాధవలన చేయియెత్తుట కష్టముగానుం డుట. కుడిభుజములో మేహవాతసంబంధమైన మంట, వాపు, బాధయుం డుట. మేహవాతనొప్పులను మాన్పును. కాళ్లకు నీరుపట్టుట, వుబ్బుట.

చర్మము:—త్వరగా కుళ్లునట్టి స్వభావముగల పుండ్లు. దెబ్బతగిలిన చోటినుండి యెగతెగని రక్తస్రావము వచ్చుట.

పోలికలు:—చైనా, సేటర్నిమూరు, శాంగ్విసేరియా.

వుద్రేకదు:—భోజనము (ముఖ్యముగా గుడ్లను తినుట) వలన, కదలికవలన, రాత్రియందు, వుదయమున నొక్కుటవలన.

మోతాదు:—$6_X$ లగాయతు 30 పొటెన్సీ.

బాహ్యోపయోగములు:—దెబ్బలనుండి రక్తము స్రవించకుండా చేయుటకు లేక ఆపుటకు కొద్దిముక్కలు దెబ్బతగిలినచోట దీనిని స్వచ్ఛ మైనట్టి టించరురూపమున పట్టించవచ్చును లేక దీనిని 10 రెట్లు నీళ్లలో కలిపి గుడ్డనుగాని దూదినిగాని ముంచి కట్టినయెడల రక్తస్రావములు కట్టును.

---

## 339. ఫెర్రం ఫాస్. FERRUM PHOSPHORICUM.

(లోహభాస్వరము. ష్యూస్లరుగారి ద్వాదశలవణములలో నిది నాల్గవది.)

ఎర్రని రక్తకణములను వృద్ధిపొందించి శరీరమునకు ఆరోగ్యమును కలుగజేయును. వుడుకును నజ్జును తగ్గించి సమధాతువుగా నుంచును. ఇది ముఖ్యముగా (i) యెర్రనివాపు, బాధ, వెచ్చదనముతోగూడిన రోగముల యొక్క ప్రథమావస్థకును, (ii) కదలికవలన వుద్రేకించునట్టియు చల్లదన మువలన వుపశమించునట్టియు బాధలకును, (iii) అవయవములయందు రక్త మెక్కువగా జేరుటవలన గలుగు రక్తస్రావములకును, (iv) దెబ్బలు, నరు కులు, ఇలుకునొప్పులు, మోటపనిచుట్లవలన కలిగిన గాయములకు—పనిచే యును. రక్తక్షీణతను మాన్పును. తరుణవ్యాధులయొక్కయు ముఖ్యము గా

జ్వరములయొక్కయు ప్రథమావస్థలోను సాధారణముగా జలుబువలనను పుడుకువలనను వచ్చు బాధలన్నిటికిని దీనిని వాడవచ్చును.

మనస్సు:—పరిశ్రమయందయిష్టత. నిరాశగాను అధైర్యముగాను వుండుట. మనసు నిలకడ, జ్ఞాపకశక్తి యుండకపోవుట.

తల:—రక్తాధిక్యమువలనను ఎండవేడిమివలనను తలనొప్పివచ్చుట. మరియు చల్లదనమువలన నిది వుపశమించుట. ఉడుకువలన తలమీద పొక్కులు కురుపులు బయలుదేరినపుడును ఇది బాగుగా పనిచేయును. పార్శ్వపు నొప్పిమీద బాగుగా పనిచేయును.

కన్నులు:—ఎరుపులు, వాపులు, మంటలు, నీళ్లుకారుట, వీటితో వచ్చు కండ్ల కలకలను మాన్పును. వెలుతురును చూచుట కష్టముగా నుండుట (కాల్కేరియా ఫాసు).

చెవులు:—వాచుట, యెర్రబడుట, చీము, రక్తము స్రవించుట, చెవిలోపోటు వచ్చుచుండుట, యీలక్షణములమీద నిది బాగుగా పనిచేయును.

ముక్కు:—జలుబువలన నీళ్లవంటి స్రావము వెడలుటను రక్తస్రావములను కట్టును.

ముఖము:—వెచ్చగా నుండుట. పంటిపోటును మాన్పును. రక్త క్షీణతవలన పాలిపోవుట. గాలిబిళ్లలు (కాలీమూరుతో మార్చుచుయివ్వవలెను).

నోరు:—వెచ్చగాను యెర్రగాను బాధగాను ఆర్చుకుపోయి యుండుట. పంటిసలుపు వెచ్చని పానీయములవలన వుద్రేకించుట.

గొంతుక:—ఎర్రగాను, వెచ్చగాను, వాపుగాను, బాధగాను యుండుట. గవదకాయల వాపును మాన్పును. గాయకులలో బొంగురు తనమును పోగొట్టును.

అన్నకోశము:—వమనములను అజీర్ణములను మాన్పును. అన్నహి

తవులేకుండుట, పుల్లనివమనములగుట. యెక్కువదాహముగా నుండుట.

పొత్తికడుపు:—పుడుకువలన విరేచనబద్ధముగా నుండుట, మరియు అంత్రములలోని ఆమత్వచలు అర్చుకొనిపోవుట.

మలము, మలాశయము:—నీళ్ళవిరేచనములను అజీర్ణవిరేచనములను, రక్తవిరేచనములను, జిగటవిరేచనములను కట్టును. మూలశంఖునుండికలుగు రక్తస్రావములను కట్టును.

మూత్రావయవములు:—తరుచు మూత్రనుమానము. మూత్రముప్రయత్నముగా పెడలుట. మూత్రము మంటతోను పసుపుపచ్చగాను పెడలుట.

పురుషావయవములు:—శుక్లనష్టము, వృషణములవాపు, బిళ్ల, శెగరోగము, వీటిమీద పనిచేయును. వీటిలో బాధలు పుడుకువలన యెక్కువైనప్పుడు దీనిని ముఖ్యముగా వాడవలయును.

స్త్రీ అవయవములు:—మర్మావయవము వాచుట, వెచ్చగానుండుట. ఋతుశూల, వేవిళ్లు, పాండుజ్వరము, గర్భాశయ రక్తస్రావములు—వీటిమీద బాగుగా పనిచేయును.

శ్వాసావయవములు:—వెచ్చదనము, వాపు, జ్వరముతోకూడియున్న న్యుమోనియా, బ్రాంకైటిసు, ప్లూరైటిసు మొదలగు శ్వాసావయవరోగములయొక్క ప్రథమావస్థలో నిది బాగుగా పనిచేయును. పొడిదగ్గు, శ్లేష్మముతో రక్తజీరవుండుట, లేక రక్తస్రావము గలుగుట వున్నప్పుడు బాగుగా పనిచేయును.

నడుము, కాళ్లు, చేతులు:—నిక్కుకవలన గాని, మేహవాతము వలనగాని వచ్చు నొప్పులు, వాపులు, బాధలను మాన్పును. అవయవములు మొద్దుబారుట, కీళ్లసంధులు వాచుట, చల్లదనమువలన కాళ్లు కొయ్యబారుటను, మరియు కుంటితనము వచ్చుటను మాన్పును. అరిచేతులు వెచ్చగా నుండుట.

హృదయము:—నాడి నిండుగాను వడిగాను, కొట్టుకొనుచుండుట, గుండె దడగానుండుట.

చర్మము:—వెచ్చదనము, వాపు, బాధతో కూడియున్న కురుపులు పుండ్లు, రాచకురుపులు. పొంగు మొదలగు రోగములయొక్క ప్రథమావస్థలో నిది బాగుగా పనిచేయును. ఆర్చుకొనిపోయి వెచ్చగానుండుట. ఒకప్పుడు దురదగానుండుట. వేసవికాలపు కురుపులు లేక సెగ్గడ్డలకు యిది అమోఘముగా పనిచేయును.

జ్వరము:—అన్ని జ్వరములయొక్కయు ప్రథమావస్థలో అనగా వెచ్చదనము, నొప్పి, బాధ, దాహము, వాపు, రొంప, చలి, మేహవాత నొప్పులు, పైలక్షణము లేవియున్నను యిది బాగుగా పనిచేయును. యెక్కువ వెచ్చదనముతోగూడిన తీవ్రజ్వరము, అరిచేతులు ముఖము వీటిలో వెచ్చదనము, ఆర్చుకుపోవుట వున్నప్పుడు దీనిని వాడవలయును. జ్వరము 102 డిగ్రీలకన్న హెచ్చుగా నున్నపుడు కాలీఫాసుతో మార్చుచు యివ్వవలయును.

నిద్ర:—వుడుకుగా నుండుటవలన నిద్రపట్టకపోవుటను మాన్పును.

నిక్కాక తత్వముగలవారికిది ప్రధానౌషధము. వీరికి యేరోగము గలిగినను ఆలోచించనక్కరలేకయే దీనిని వాడవచ్చును.

వుద్రేకము:—కదలికవలన, వుద్రేకమువలన, వెచ్చదనమువలన.

వుపశమనము:—చల్లదనమువలన.

పోలికలు:—ఎకోనైటు, జెల్సీమియం, కాస్టికం, పల్సటిల్లా, చైనా, ఆర్సెనికం ఆల్బం, గ్రాఫైటిసు, పెట్రోలియం.

మోతాదు:—3x మొదలు 1,000 పొటెన్సీ. 6x, 12x పొడుము రూపములోను, బిళ్లరూపమునను బాగుగా పనిచేసినది. 6xలోను అంతకు దిగువపొటెన్సీలలోను యిది మాత్రలలోను అరకులలోను తయారుకాబడదు డాక్టరు స్కూస్లరుగారు దీనిని 12 వ పొటెన్సీలో పొడుమురూపమున వాడిరి.

## 340. గ్లొనోయిన్. GLONOINE.

ఎండదెబ్బ (Sun Stroke) వలని దోషముల నిది మాన్పును. నరములనిస్త్రాణచే బాధపడువారికి,రక్తపుష్టిగలవారికిని;యోష్ణిని దేహచ్ఛాయ, యెక్కువ ఇంద్రియజ్ఞానముగల స్త్రీలరోగములకును బాగుగాపని చేయును. గ్యాసులైటు వెలుతురులో పనిచేయువారికి తలనెప్పబకుట, స్టవ్ (Stove) లేక మరపొయ్యి వేడివలనగాని, యెండలో నడచుటవలనగాని తలనెప్పబకుట; ఇట్టినెప్పదనము భరింపలేనివారికిది బాగుగాపనిచేయును. రోగములాకస్మికముగా వచ్చుచుండుట; రోగి చల్లనినీటియందుకోరిక గలిగి యుండుట; స్త్రీలలో బహిష్టుకు బదులుగా తలనొప్పి వచ్చుటయు దీని నుపయోగమును సూచించును.

మనస్సు:—మనస్సు కంగారుగానుండుట. తాను యెచ్చటనున్నది చెప్పలేకపోవుట, బాగుగా తెలిసినవీధులు క్రొత్తగా కనుపించుట,తనయిల్లు చాల దూరముగానున్నట్లు తోచుట. అపస్మారసంబంధమైన ఫిట్లు లేక కంపము; దీనిలో రోగి తెలివితప్పి పడిపోవుట. అవయవములకు కంపము, నోటివద్ద నురగలువచ్చుట. సూర్యరశ్మిని లెక్కచేయక యెండలోనుండి సూర్యుని దేవునిగా కొలుచువారిలో యెండవేడివలనకలుగు పిచ్చితనమును మాన్పును.

తల:—తలలో నాడి గట్టిగా కొట్టుకొనుచున్నట్లుండుట, తల నిండుగానున్నట్లును, పెద్దదై పోయినట్లునుతోచుట.వుదయమునను,పూర్వాహ్ణమందును, తలనొప్పి వుద్రేకమునొందుట. కదల్చుటవలన తలనొప్పి యెక్కువగుట. ఎండవేడిమివలన తలనొప్పి వుద్రేకించుట, మరియు నిది బహిరంగమైన గాలిలోను నొక్కుటవలనను వుపశమించుట. తలనుకదల్చుట వలనను ముందరకు వంగుటవలనను తలతిరిగివచ్చుట. తలలో, మెదడు కెరటములవలె కొట్టుకొనుచున్నట్లుతోచుట. రుదరివాతము(Apoplexy) మీదను, తలకు నీరుపట్టునప్పుడును బాగుగా పనిచేయును. ఎండదెబ్బ (Sunstroke) కు యిది ప్రధానౌషధము. తలమీద యేవిధమైన బరు

వును, ముఖ్యముగా టోపెని, తలపాగా (తలగుడ్డ)ను మోయుట కష్టముగా నుండుట.

గొంతుక:—మెడనిండుగా నుండునట్లు తోచుట, మెడసద్దనున్న దుస్తులను వదులుచేయవలసి వచ్చుట. స్వరపేటిక ముడుచుకొని పోవుట.

స్త్రీఅవయవములు:—బహిష్టు ఆగిపోవుట లేక అణచిపెట్టబడుట వలన తలకు, మెదడుకు, రక్తమెక్కువగా జేరుట; ముఖము పాలిపోవుట, వెచ్చనిగదిలో లక్షణములు ఉద్రేకించుట, మరియు నివి శీతగాలిలో నడచుటవలన వుపశమించుట, నీళ్లవిరేచనములగుచుండుట, స్మృతితప్పి పడిపోవుట. గర్భిణులలోగాని ప్రసవానంతరమునగాని కంపముతోకూడి వచ్చు ఫిట్టుమీద బాగుగా పనిచేయును.

హృదయము:—నొక్కుచున్నట్లు పొడుచుచున్నట్లు బాధగానుండుట. నాడి అతితరచుగా కొట్టుకొనుచుండుట. యెండదెబ్బవలన నాడి నెమ్మదిగాను సన్నముగానుయుండుట. గుండెదడ.

వుద్రేకము:—సూర్యరశ్మివలన, గ్యాసులైటువలన, వేడియెక్కుటవలన, టోపీని ధరించుటవలన, వుదయము 6 గంటల లగాయితు మధ్యాహ్నము 1 గంట వరకు.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో, చల్లదనమువలన, నొక్కుట వలన.

విరుగుళ్లు:—ఎకోనైటు, కేంఫరు, కాఫీ, నక్సువామికా.

పోలికలు:—బెల్లడోనా, హయాస్యామసు, యాపిసు, జల్సీమియం, స్ట్రెమోనియం.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ.

## 341. గ్లిసరినం. GLYCERINUM.

ఇది శరీరమానసిక దుర్బలత్వములను మార్చి, దేహమునకు పుష్టిని గలుగజేయుటలో సహాయపడును. మధుమూత్రమును, అతిమూత్రమును, ఆకలి మందముగానుండుటను, విరేచనమువకపోవుటను మాన్పును.

తల:—మనస్సు కంగారుగా నుండుట. తల నిండుగానున్నట్లు తోచుట.

ముక్కు:—దిబ్బడవేయుట, తుమ్ములు వచ్చుచుండుట, ఒరియుట.

శ్వాసావయవములు:—ఛాతీ నిండుగానున్నట్లు తోచుట. పిడువ నటువంటి దగ్గును, నిస్త్రాణను మాన్పును.

మలము, మలాశయము:—విరేచనబద్ధమెక్కువగానుండుట. మలము గట్టిగా, ఆర్చుకుపోయి యుండుట.

మూత్రావయవములు:—తరుచుగాను, యెక్కువగాను మూత్రము వెడలుచుండుట. మూత్రముయొక్క తారతమ్యసాంద్రత (Specific-gravity) యెక్కువగానుండుట. మూత్రములో చక్కెర యెక్కువగా కలసిపోవుట. ఇది అతిమూత్రమును మధుమూత్రమును మాన్పును.

స్త్రీ అవయవములు:— బహిష్టులో స్రావము విస్తారముగాను, చాలదినములవరకును, గర్భాశయములో దిగలాగుచుండు బాధతోను వెడలుట. రోగి అతినిస్త్రాణజెంది యుండుట. బహిష్టుకు 2 దినములకు ముందుగా తలనొప్పి తీవ్రముగా వచ్చుట.

కాళ్లు, చేతులు:—పాదములు వెచ్చగాను, బాధగాను, వాచినట్లుగాను వుండుట.

మోతాదు:—30, 200 పొటెన్సీలు.

---

## 342. గ్రాఫైటిసు. GRAPHITES.

ఇది యాంటిసోరిక్ ఔషధము. చర్మవ్యాధులమీద నిది బాగుగా పనిచేయును. విరేచనబద్ధము, బహిష్టు ఆలస్యముగాజరుగుట; యీలక్షణములు గలిగియుండు స్థూలశరీరులగు ఆడువారికి బాగుగా పనిజేయును. లక్షణములు రాత్రియందును, బహిష్టులోను, బహిష్టుకుపిమ్మటను వుద్రేకమునొందుచుండుట, రోగికి అతిసులభముగా జలుబుచేయుచుండుట, ఆకస్మికముగా నిస్త్రాణవచ్చుచుండుట, చర్మవ్యాధులలోను, ముఖ్యముగా తలమీద బయలుదేరు పొక్కులనుండి చిక్కని తేనెవలెను జిగురుగానువుండు స్రావము వెడలుటయు దీని వుపయోగమును సూచించును.

యుక్తవయస్కురాండ్రకు పల్సటిల్లా యెట్లు వుపయోగపడునో; అట్లే ముట్లుడుగు కాలమునందు యిదియును బాగుగా వుపయోగపడును.

మనస్సు:—విచారమువలన గల్గు రోగలక్షణములు. పరిశ్రమయందిష్టముండకపోవుట. విచారగ్రస్తముగాను, నిరాశగాను వుండుట, చావునుతప్ప దేనినిగురించియు ఆలోచనయుండకపోవుట. ఏవిషయములోను,మనస్సును స్థిరపరచుకొనలేకపోవుట.

తల:—లేచినప్పుడు తాగినవానివలె తలతిరుగుట. వుదయమున లేచుసరికి వికారముగాను, కంగారుగాను వుండుట. తలమొద్దగా నుండుట తలవెంట్రుకలూడిపోవుట. తలపైభాగమందంతటను పొక్కులు బయలుదేరి వీటినుండి వెడలిన స్రావము లేక చీము తలవెంట్రుకలతోకలసి, అట్టలుఅట్టలుగా పక్కులుకట్టి, ముట్టుకొనుటకు బాధగానుండుట (200 పొటెన్సీలో బాగుగా పనిచేసినది). నడినెత్తిని మంటగా నుండుట. వుదయమున పార్శ్వపునొప్పి, దీనితో వమనానుమానము గలుగుట. మేహవాతపునొప్పి ఒకపార్శ్వమునందు బయలుదేరి, పండ్లలోనికిని మెడలోనికిని వ్యాపించుట.

కన్నులు:—కండ్లు యెర్రబడుట, వెలుతురును చూడలేకపోవుట. దూరదృష్టిఆనకపోవుట. కాచబింబముపైపొండ్లను మాన్పును. చీమువలెవేషళ్లు

వట్టి స్రావమును మాన్పును. దృష్టిమబ్బుగ్రమ్మినట్లుండుట. చదువుచున్నప్పుడు అక్షరములు రెట్టింపుసైజుగా కనబడుట. కండ్లకలకలను మాన్పును. కనురెప్పలు యెఱ్ఱగావాచుట. కనురెప్పలమీద బయలుదేరు మంత్రపుపొక్కులమీద పనిచేయును.

చెవులు:— దౌడను కదల్చునప్పుడు చెవులలో పటపటమని ధ్వని వినిపించుట. శబ్దమగుచున్నప్పుడు బాగుగా వినపడుట. చెవులు ఆర్పుకుపోవుటవలన సరిగా వినపడకుండుట చెవి తేమగా నుండుట. రక్తజిగతోను, పల్చని నీళ్లవలెను, దుర్వాసనతోను, యుండెడుచీము స్రవించుచుండుట. చెవి దిగువనుండు మాంసగ్రంథులు వాచుట. చెవివెనుక పొక్కులు బయలుదేరి చెమర్చుచుండుట.

ముక్కు:— వాసనను అతిసులభముగా గ్రహించుట. పుష్పముల యొక్క సువాసనను భరింపలేకపోవుట, ముక్కు లోపలిభాగమందు బాధగాను, తీపుగాను యుండుట. ముక్కు కోణములు బీటలువారి పుండ్లుపడి పక్కులు కట్టియుండుట. దుర్వాసనతోగూడిన స్రావము వచ్చుచుండుట.

ముఖము:— పాలిపోయి, దిగులుపొందినట్లుండుట. రక్తక్షీణతతో పొంగరించియుండుట. రసితోగూడిన మొటిమలు బయలుదేరుట, ముఖము ఆర్చుకొనిపోయి, ముడతలుపడినట్లుగా యుండుట. నోటివద్దను, గడ్డముమీదను చీముతోనుండు మంత్రపుపొక్కులు బయలుదేరుట.

నోరు:— పండ్లలో నొక్కుచున్నట్లు నొప్పిగాయుండుట. తాకుడువలనను కరచుటవలనను యీనొప్పి యెక్కువగుట. నాలుక చాల నొప్పిగానుండుట. నాలుకపై తెల్లని పూతయుండుట. బాధగానుండెడి తెల్లని పుండు నాలుకచివర బయలుదేరుట. నోటినుండియు, యిగుళ్ళనుండియు, కుళ్లిన వాసనవచ్చుట. లాలాజలమెక్కువగా వూరుచుండుటవలన దానిని వుమియుచుండుట. గొంతుకలోని మాంసగ్రంథులు వాచుట. గొంతుకనొప్పిగానుండుట.

అన్నకోశము;— తరుచు తేన్పులతో గూడియుండెడు స్రావము

వెడలుచుండుట. రుచి పుల్లగాను, వుప్పగాను, చేదుగాను కుళ్లిన గుడ్లవలెను యుండుట. మాంసమునందయిష్టత. తీపిపదార్థములు తినుటవలన డోకవచ్చుట. వెచ్చనిపానీయములు వికటించుట. భోజనానంతరము వికారము, వమనమువచ్చుట. పరుండినయెడల కడుపునొప్పి వుపశమించుట. పడకనుండి లేచినయెడల యిది మగల మరలవచ్చుచుండుట.

పొత్తికడుపు:—పొత్తికడుపు వుబ్బరించి గట్టిగానుండుట. అపానవాయువు వెడలుటకుముందు కొరుకుచున్నట్లు నొప్పిగాయుండుట. భోజనానంతరము బట్టను వదులుగా కట్టుకొనవలసివచ్చుట. గజ్జలలోని మాంసగ్రింధులువాచుట. దురదతోగూడిన చర్మరోగము బయలుదేరుట.

మలము, మలాశయము:—విరేచనబద్ధము. మలముగట్టిగాను పెద్దపెద్దవుండలవలెను కొద్దిగా జిగటతోను, వెడలుచుండుట. ఆసనములోని పుండ్లను మాన్పును. కాలేయము గట్టిగానుండుట. మలబద్ధమును మాన్పును. ఆసనములోని ఆమత్వచలు ఆర్చుకొనిపోవుట. ఆసనములో పుండ్లుపడుట, మలాశయము వెలుపలకువచ్చుట. కత్తితోచీల్చినట్లు, బాధతోను, విపరీతమైన దురదతోను, ముట్టుకొనినయెడల నొప్పిగాను వుండునట్టి మూలశంఖుమీద పనిచేయును.

మూత్రావయవములు:—మూత్రము పుల్లనివాసనతోను, ముదిరిన గోధుమవర్ణముగాను వుండుట. మూత్రానుమాన మెక్కువగా యున్నను మూత్రము స్వల్పముగా వెడలుట. రాత్రియందు మూత్రము తరుచుగా వెడలుచుండుట.

పురుషావయవములు:—మితిలేని సంభోగేచ్ఛ. సంభోగము నందయిష్టతతోగూడిన నపుంసకత్వము. వృషణములమీద దురదతోను, తేమగాను వుండునట్టి పొక్కులు బయలుదేరుట.

స్త్రీఅవయవములు:—ప్రథమ రజస్వలచాల ఆలస్యముగావగుట. కుసుమ పల్చగాను, తెల్లగాను, విస్తారముగాను, నడుములో నొప్పితోను, వెడలుచుండుట, నడచుచున్నప్పుడు కుసుమ యెక్కువగావెడలుచుండుట.

ట. ఋతుసావ్రము చాలతక్కువగాను, పాలిపోయినరంగుగాను, ఋతు
వు చాల ఆలస్యముగాను అగుట. యెడమఅండాశయము వాచుట, గట్టి
పడుట. బహిష్టు అణచిపెట్టబడినప్పుడు చేతులు ఒరుపుగా నున్నట్లుతో
చుట. స్తనములలోని కంతులను మాన్పును.

శ్వాసావయవములు:—స్వరపేటికలో గిలిగింతలు పెట్టుచున్నట్లుం
డుట. గాఢముగా పూపిరిపీల్చుటవలన రాత్రియందు దగ్గువచ్చుట ఛాతీ
లో నొక్కుచున్నట్లు బాధగా నుండుట. వుబ్బసపుదగ్గు.

హృదయము:—ముడుచుకొని పోవుచున్నట్లుండుట. నాడిగట్టి
గాను, నిండుగాను, వుదయమున త్వరితముగాను, మధ్యాహ్నమందును
సాయంకాలమందును మందముగాను వుండుట. ఆతురతతోను ముక్కు
నుండి రక్తసావ్రముతోను ద్వంద్వముగా వుండునట్టి గుండెదడ.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—మెడవద్దనున్న మాంసగ్రం
ధులు వాచి బాధగానుండుట, యిందువలన మెడబిగపట్టినట్లుండుట. వేళ్ల
లో మహావాతనొప్పులవలన బాధగాయుండుట, చేతులపై చర్మము గట్టి
గాను, బీటలుతోను వుండుట. గోళ్లుదళసరెక్కుట, బీటలుతీయుట. పుప్పి
గోళ్లను మాన్పును.

చర్మము:—అచ్చటచ్చట దురదగా నుండుట, తేనెవలె జిగటగా
నుండు సావ్రముతోగూడియున్న మంత్రిపుపొక్కులు. యుక్తవయస్కు
రాండ్రి శరీరములో క్రొవ్వుపట్టు సూచనలు గలిగినప్పుడు పనిచేయును.
పుండ్లు సులభముగా నగుచుండినను పుండ్లు వచ్చినపిమ్మట సులభముగా
మాత్రము మానకుండుట. మాంసగ్రంథులు వాచుట, గట్టిపడుట. పిల్లల
యొక్క కీళ్లసంధులలో గరుకుగాను, పుండ్లుపడునట్లును వుండుట.

నిద్ర:—తరుచు ఆవలింతలువచ్చుట. పగలునిద్రమత్తుగా నుండుట.
భోజనానంతరము పడుకొనవలసివచ్చుట. రాత్రియందు వీధులమ్మట తిరగ
వలయునని కోరికగలుగుట. చాలరాత్రియైనపిదపకాని నిద్రపట్టకపోవుట.
ఆతురత, భయము, విసుగుదలతోగూడిన కలలు వచ్చుట.

జ్వరము:—భోజనానంతరము చలి యెక్కువగుట. పానీయములు త్రాగినపిమ్మట చలి తగ్గుట. బహిరంగమైన గాలిలో కూడ చలి తగ్గుట. సాయంకాలమునందును, రాత్రియందును శరీరము వెచ్చగాను, అస్థిమితముతోను యుండుట. కదలికవలన చెమటపట్టుట. రాత్రియందు విస్తారముగా చెమటలు పోయుట.

వృద్ధిక్రమము:—రాత్రియందు, బహిష్టుగో, కదలికవలన, వుదయమున, సాయంకాలమందు.

వుపశమనము:—చీకటిలో, త్రేణుపులవలన, శరీరముపైని బాగుగా కప్పుకొనుటవలన.

సహచరులు:—ఆర్జెంటం నైట్రికం, కాస్టికం, హేపారుసల్ఫ, లైకోపోడియం, ఆర్సెనికంఆల్బం.

విరుగుళ్లు:—ఆర్సెనికంఆల్బమ్, నక్సువామికా, ఎకోనైట్, చైనా, నైన.

ఆర్సెనికంఆల్బం, అయోడియం, రస్టాక్సు—లకిది విరుగుడు.

మోతాదు:—6 మొదలు 1000 పొటెన్సీ. 12, 200 పొటెన్సీలు బాగుగా పని చేయుచున్నవి. చర్మమునల వాపులకు, బాధలకు దీనిని ఆయింటుమెంటు (Ointment) రూపమున పైకిపట్టించవచ్చును. దీని గుణకాలపరిమితి 40 మొగాయతు 50 దినములు.

---

## 343. గన్ పౌడర్. GUN POWDER.

ఇది అన్నివిధములైన రక్తదోషములమీదను బాగుగా పనిచేయును. కురుపులు, పుండ్లు బయలుదేరిన ప్రదేశములు కుళ్లనారంభించుట, విషతుల్యమైన ఆహారమువలన గలుగు రోగలక్షణములు, డబ్బాలలో సరిగానిలువచేయబడని మాంసమును తినుటవలన వచ్చు రోగములు-వీటిమీద బాగుగా పనిచేయును.

కురుపులు, రాచకురుపులు, మానకుండుట, నిలువగా వున్నటు వంటి కురుపులు, రక్తము విషతుల్యమగుట, ఇగుళ్లనుండి రక్తస్రావమగుట, నోటినుండి దుర్వాసన వచ్చుట, రక్తము స్రవించునట్టి దెబ్బలు తగులుట, లోతైనగాయములుపడుట (గుండుదెబ్బ మొదలైనవి); ఇవి త్వరగా మానకుండుట. దెబ్బతగిలిన ప్రదేశము చెడుట లేక కుళ్లుటను ఆపుచేయును. పాడైనఆహారమును నీళ్లను త్రాగుటవలనవచ్చు రోగలక్షణములను మాన్పును.

విరుగుళ్లు:—ఎకోనైటు, కేంఫరు, నక్సువామికా, కాఫీ.

పోలికలు:—లెకెసిస్, ఎఖినేషియా.

మోతాదు.—3x మొదలు 30 పొటెన్సీ.

---

## 344. హెక్లా లావా. HEKLA LAVA.

ఎముకలకు దెబ్బతగులుటవలని దోషములనిది మాన్పును. దౌడల వాపులు, పుప్పిపంటిదోషములను, ఎముకలదోషములను, కంతులను, పంటి సలుపులను, పిల్లలకు దొడ్డికాళ్లుపడుటను, సవాయిదోషమును ఇదిమాన్పును.

తల:—నిలువగాయున్న తలనొప్పి.

ముక్కు:—సవాయిదోషమువలనయెముకలుపుచ్చుట, పుండ్లుపడుట.

ముఖము:—పుప్పిపండ్లవల్లను, లేక పండ్లనూడదీయించుకొనిన పిదప ముఖమునందలి నరములలో బాధలు (పార్శ్వపునొప్పి, మున్నగునవి).

నోరు:—ఇగుళ్లు పుండ్లగుట, దవుడయెముక సమీపమున వాపులు బయలుదేరుట. కాల్షియం లవణలోపము వలన పండ్లు త్వరగా రాకుండుట మున్నగు బాధలుగలుగుట. పంటికురుపు.

ప్రదేశికము:—తాకుడువలన, నొక్కుటవలన

పోలికలు:—సైలీషియా, మెర్క్యూరియసు, కాల్కేరియాకార్బు, ఫాస్ఫరసు, సల్ఫరు, కాలీఅయోడ్, సింఫైటం, రూటా.

మోతాదు:—6x మొదలు 30 పొటెన్సీ.

## 345. హెపారు సల్ఫు. HEPAR SULPH.

ఇది యాంటిసోరిక్ యౌషధము. ఇది చర్మరోగములమీదను, శ్లేష్మరోగములమీదను, రసదోషములతో గూడిన రోగములమీదను బాగుగా పనిచేయును.

మనస్సు:—జ్ఞాపకశక్తి లేకపోవుట. సాయంకాలమందును, రాత్రియందును, విచారగ్రస్తముగాను, ఆత్మహత్యచేసుకొనవలెనను ఆలోచనలతోను యుండుట. యెక్కువ ఇంద్రియజ్ఞానముతోను, చిరచిరలాడుచును యుండుట. త్వరితముగాను ఆలోచన చేయకుండగను మాట్లాడుట; క్రూరమైన ఆలోచనలు చేయుచుండుట.

తల:—స్వారి చేయుటవలనను, తలను కదుపుటవలనను వికారము, తల తిప్పువచ్చుట. వుదయమున కుడికనుబొమపద్దను, ముక్కు మొదటను పొడుచుచున్నట్లు నొప్పిగానుండుట. తేమగానుండు పొక్కులవద్ద నొప్పిగాను, దుర్వాసనగాను యుండుట. వుదయమున లేచుసరికి విపరీతముగా దుగదగానుండుట; గోకినయెడల మంటగాను, బాధగాను యుండుట. తలమీద చల్లని చెమటపట్టుట. తలలోనికి మేకు దిగగొట్టినట్లు బాధగానుండుట.

కండ్లు:—కనుగుడ్డును లోపలకునొక్కి వేసినట్లు నొప్పిగా యుండుట. కండ్లు కదల్చుట బాధగానుండుట. కాచబింబముపైన చిన్నచిన్న మచ్చలు, పుండ్లుబయలు దేరుట. వుదయమున లేచినపుడు ప్రాతఃకాల సూర్యుని చూచుటవలన కండ్లలో నొప్పివచ్చుట. కొంత్రవ్వపత్తి దీపపువెలుతురులో దృష్టి మందముగానుండుట. వస్తువులు యెర్రగాను, యెక్కువ పెద్దవిగాను అగుచుండుట.

చెవులు:—దురదగానుండుట. దుర్వాసనతో గూడిన చీము వెడలుట; మాట సరిగా వినబడకపోవుట, చెవిలో పురుపు బయలుదేరుట, చెవిమీదను, చెవి వెనుకను, చెవిలోను చర్మము పొరలుపొరలుగా ఊడుచుండుట.

ముక్కు:—వాసన సులభముగా తెలియుట, ముక్కువాచి యెర్రబడి బాధగానుండుట, దీనినుండి స్రావము వెడలుట; స్రావము రక్తముతో కలసి దుర్వాసనతో వెడలుట, గాత్రిపాటనలన ముక్కునుండి రక్తము స్రవించుట. బహిరంగమైన చల్లనిపొడిగాలివలన తుమ్ములు, రొంపవచ్చుట.

ముఖము:—పసుపుపచ్చగానుండుట. కుడివైపు పార్శ్వమునొప్పి కనుబొమలలోనికి చెవిలోనికి పెదవులలోనికి వ్యాపించుట. నోరువిప్పినప్పుడు దౌడలో పొడుచుచున్నట్లు బాధగానుండుట. క్రింది పెదవి మధ్యభాగమున పగులుట.

నోరు:—నోరు, ఇగుళ్లు తాకుటకు నొప్పిగానుండుట. మరియు వీటినుండి రక్తము స్రవించుట. వెచ్చనిగదిలో పంటిసలుపు వుద్రేకించుట. నోటిలోను, ఇగుళ్లలోను పుండ్లుపడుట.

గొంతుక:—నొక్కుచున్నట్లును, నులిమివేయుచున్నట్లును, భావనయుండుట. గొంతుకలో చేపయెముక గుచ్చుకొనినట్లుగాగాని లేక గసికదిగగొట్టినట్లుగాగాని భావనయుండుట. గుటకవేయుచున్నప్పుడు గొంతుకలోవాపుగాని, వుండవంటిదిగాని గొంతుకను అడ్డుపడినట్లుగాయుండుట.

అన్నకోశము:—రుచి కుళ్లినట్లుగాను, లోహపు రుచిగాను, చేదుగానుయుండుట. భోజనానంతరము త్రేనుపులువచ్చుట. శూల, పొడిదగ్గువచ్చుట. పుల్లని, ఆకుపచ్చని లేక ఆమముతో గూడిన వమనములు వచ్చుట.

పొత్తికడుపు:—నడుచుచున్నప్పుడును, దగ్గునప్పుడును వూపిరిపీల్చునప్పుడును, ముట్టుకొనుటవలనను కాలేయములో కుట్టుచున్నట్లుబాధగాయుండుట (బ్రియోనియా, మెర్క్యురియసు). నిలువగాయున్న రోగములమీదబాగుగా పనిచేయును. పొత్తికడుపులో పుండగుట. పొత్తికడుపు వుబ్బరముగాను వ్రేలాడుచున్నట్లును యుండుట. గజ్జలలోని మాంసగ్రంధులు (బిళ్లలు) వాచి, చీముపట్టుట.

మలము, మలాశయము:—మలబద్ధమును మామూలు. మలము గట్టిగా ఆర్చుకుపోయి యుండుట. జిగటవిరేచనములు అనుపచ్చగాను లేక మట్టి రంగుగాను, జిగటతోను వెడలుట. పల్చని మలమునుగూడ వెలువరించుట కష్టముగా నుండుట. ఆసనమునుండి పల్చని మలముతోపాటు రక్తస్రావ మగుట. మూలశంఖ బయలుదేరుట.

మూత్రావయవములు:—మూత్రము నెమ్మదిగా వెడలుట. మూత్రమును పట్టి చూచినయెడల పైభాగమందు నూనెవంటిపదార్థము పైకితేలుట. ముసలివారిలో కలుగు మూత్రసంబంధమైన బాధలమీద పనిచేయును.

పురుషావయవములు:—అంగముపైని సవాయిపుండ్లనుపోలిన పుండ్లు బయలుదేరుట (నైట్రిక్ యాసిడ్). శృంగారసంబంధమైన చేష్టలులేకయే, వుద్రేకము, స్ఖలనము కలుగుట. బిళ్లలనుండి చీముస్రవించుట, అడ్డగర్రలు బయలుదేరుట. మర్మావయవములకు తొడకు మధ్యభాగమందు తేమగాను నొప్పిగాను దురదగాను వుండుట. మానవటువంటి రోగవ్యాధి.

స్త్రీ అవయవములు:—బహిష్టుకు బహిష్టుకుమధ్య స్రావముగలుగు చుండుట. దుర్వాసనతోగూడినకుసుమ. బహిష్టు ఆలస్యముగాను, స్రావము కొద్దిగాను అగుట ముట్లుడుగు కాలములో యెక్కువ చెమటలుపోయు చుండుట.

శ్వాసావయవములు:—గొంతుక బొంగురుపోవుట. స్వరపేటికలో గరుకుగా నుండుట. నడచుచున్నప్పుడు దగ్గు యెక్కువగుట. శరీరమును కప్పుకొనక పోయినప్పుడును, చల్లని ఆహారమును తినుటవలననుగాని దేహములో యేఅవయవముగాని చల్లబడుటవలనను దగ్గు బయలుదేరుట. పొడిగాను చల్లగాను వుండునట్టి గాలిలో యెక్కువఆయాసముతోనుండు వుబ్బసపుదగ్గుమీద పనిచేయును. వూపిరాడదంతటి దగ్గు వచ్చుట. క్షయజాతి దగ్గులమీదను, రసదోషమువలన వచ్చు దగ్గులమీదను బాగుగా పనిచేయును.

హృదయము:— దడగానుండుట. నాడి నిండుగాను వడిగాను యుండుట.

నఖము, కాళ్లు, చేతులు:— వేళ్ళు కణుపులువాచుట. చేతుల యొక్క చర్మము చీటలుదీయుట, గరుకుగాను ఆర్చుకుపోయి యుండుట.

చర్మము:—చిన్న చిన్న గాయములుకూడ సులభముగా చీముపట్టుట. పొక్కులు, దద్దురులు, మొదలగునవి ముట్టుకొనుటకు నొప్పిగా యుండుట. మంత్రపు పొక్కులు శరీరమంతటను క్రమముగా వ్యాపించుట, పుండ్లనుండి సులభముగా రక్తము స్రవించుచుండుట. శరీరముపైని కప్పుకొనవల యునని యుండుట. మశూచికము. శరీరమునుండి దుర్వాసన బయలు దేరుచుండుట.

నిద్ర:—సాయంకాలమందు యెక్కువ నిద్రమత్తుగా యుండుట. అధిక ఆలోచనవలన అర్ధరాత్రమునకు పిమ్మట నిద్రపట్టకుండుట.

జ్వరము:—బహిరంగమైన గాలివలన చలివచ్చుట. రాత్రియందు శరీరము పొడిగాను, వెచ్చగాను యుండుట. యెక్కువగా చెమటపట్టుట. చెమటపుల్లని వాసనతోను, జిగురుగాను, దుర్వాసనగానువుండుట. మన్యపు జ్వరములో ప్రధమమున రాత్రి 8 గంటలకు చలివచ్చుట. ఇది రసదోషములను మాన్పుటలో అగ్రగణ్యమైనది.

వుద్రేకము:—పొడిగాను చల్లగాను వుండుగాలిలో, తేమగాలి వలన, పాదరసమువలన, తాకుడువలన, బాధగాయున్నవైపు పరుండుట వలన.

వుపశమనము:—వెచ్చదనము వలన, భోజనానంతరమున, అపాన వాయువు వెడలినపిమ్మట.

సహచరులు:—కాలెండ్యులా.

విరుగుళ్లు:—బెల్లడోనా, కేమోమిల్లా, సైలీషియా, యాంటింటార్టు, యాసిడుఎసెటిక్.

పోలికలు:—సైలీషియా, కాల్కేరియాసల్ఫ, ఆర్సెనికం ఆల్బం, యాంటింటార్టు, మెర్క్యూరియస్, తూజా, సల్ఫరు, సేపియా,

కాలీఅయోడు, అయోడియం, మెర్క్యురియసు, మున్నగు లోహ సంబంధమగు అవుషధముల—కిది విరుగుడు.

మోతాదు:—2x మొదలు 1,000 పొటెన్సీ. చీమునుపట్టించి చీముసు వెడల్చుటకు దీనిని 2x, 3x, పొటెన్సీలలో వాడవలయును. చీముపట్ట కుండా జేయుటకు లేక కురుపులను యెదుగకుండగ నాపివేయుటకు దీనిని 200, 1000 పొటెన్సీలో అప్పుడప్పుడు వాడుటమంచిది. క్షయసంబంధ మైన చిహ్నాలు శ్వాసావయవములలో గలిగిన వారికి దీనిని పెద్దపొటెన్సీ లలో గాని తరుచుగాగాని వాడరాదు. దీని గుణకాలపరిమితి 8 వారములు.

---

## 346. ఇండిగో. INDIGO.

(నీలిమందు).

ముఖ్యముగా క్రిమికోపముతో ద్వంద్వముగాగాని, అధిక విచారమువలనగాని వచ్చిన అపస్మారము లేక మూర్ఛమీదనిది బాగుగా పనిచేయును.

రోగి వుద్రేకముతోను, తొందరగాను వుండుట, అధికమైన నర ముల నిస్త్రాణ ఇవి దీనిప్రధానలక్షణములు.

మనస్సు:—విచారముగాను, కంగారుగాను యుండుట. రాత్రి యందు రోగి కేకలువేయుట, యేడ్చుట.

తల:—వికారము, తలనొప్పివచ్చుట. నుదురు కట్టివేసినట్లు భావన. పొట్టలోనుండి తలలోనికి వేడి ఎగబ్రాకుచున్నట్లుండుట.

ముక్కు:—తుమ్ములు, రక్తస్రావము.

చెవులు:—నొక్కుచున్నట్లుబాధ, హోరు, చీల్చుచున్నట్లుండు బాధలు.

నోరు, అన్నకోశము:—లోహపురుచి, త్రేనుపులు. పొట్టవుబ్బ రింపు రక్తమిశ్రితమైన లాలాజలము వెడలుట. తేపవెడలుచుండుట,

మలాశయము:—వెలుపలకువచ్చుట. ఆసనము దురద. క్రిమిదోషము. మానని విరేచనబద్ధము.

మూత్రావయవములు:—అతితరుచుగా మూత్రానుమానము.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ తగ్గుట. మర్మావయవములు దురదలుగా నుండుట.

స్త్రీఅవయవములు:—ఋతువు చాల ముందరగానగుట. బహిష్టులో నున్నప్పుడు స్తనములలో మంటలుగానుండుట.

కాళ్లు, చేతులు:—భోజనానంతరము బాధలు వుద్రేకించుట.

నరములు:—మూర్ఛ. బాధలెక్కువగుటతో హిస్టీరియాలక్షణములు ప్రవేశించుట. మందముగానుండుటతో ఫిట్టుప్రారంభించుట. కంపములు ఆకస్మికముగా వచ్చుట.

వుద్రేకము:—విశ్రాంతిగానున్నపుడు, కూర్చున్నపుడు.

వుపశమనము:—నొక్కుటవలన, కదలికవలన, మర్దనమువలన.

పోలికలు:—కుప్రింమెట్, కాలీబ్రోమేటం, బ్యూఫో, రూస్టాక్సు, లైకోపోడియం, ఇగ్నేషియా, బాప్టిషియా.

విరుగుళ్లు:—కేంఫరు, నక్సువామికా.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ.

---

## 347. అయోడియం లేక అయోడం. IODIUM OR IODUM.

నల్లని దేహచ్ఛాయ, నల్లని తలవెంట్రుకలు, నల్లనికండ్లు, యెక్కువ నిస్త్రాణ, శరీరము చిక్కిపోవుట గలవారికిది బాగుగా పనిచేయును. బహిష్టులోను, మెట్లెక్కుటవలనను, యెక్కువనీరసము, వూపిరాడకపోవుట యెడతెగని ఆకలి గలిగియుండుట; బాగుగా భోజనము చేయుచున్నను కండరములు యెండిపోయి, శరీరము శుష్కించుట (నేట్రింమూరు);

కొలదిగంటలకొకసారి భోజనము చేయవలసివచ్చుట; భోజనము చేయని యెడల యెక్కువ ఆతురతగాను బాధగాను యుండుట; భోజనము చేయు చున్నప్పుడును, చేసినపిమ్మటను, లక్షణము లుపశమించునట్లు భావన గలుగుట; మాంసగ్రంధుల వాపులు; రసదోషములు—ఇవి దీని వుపయోగ మును సూచించును.

మానస్సు:—కంగారుగాను, ఆత్మహత్య చేసుకొనవలెనని వుద్దేశ్య ముతోను, మరపుతోను యుండుట. విచారగ్రస్తముగాను యేడ్చుచును యుండుట. అస్థిమితముచలన స్థిమితముగా కూర్చొనుట, నిద్రబోవుట కుదరక పోవుట.

తల:—తలకు ఇనుపబద్దని చుట్టినట్లు భావనయుండుట. తలతిప్పు వంగుటవలనను, వెచ్చని గదిలోను, వుద్రేకము జెందుట. ముసలివారిలో తలనిండుగాను, భారముగాను వుండుటతో గూడిన తలనొప్పిని మాన్పును.

కండ్లు:—కన్నీళ్లు ఎక్కువగా కారుచుండుట. నొప్పిగానుండుట. కనుపాపలు పెద్దవగుట, కనుపొట్టలు వుబ్బుట, దృష్టిమందముగానుండుట.

చెవులు:—సరిగా వినబడకపోవుట.

ముక్కు:—అకస్మాత్తుగా వచ్చేడు విషపడిశెము. బహిరంగమైన గాలిలో ముక్కునుండి నీళ్లవంటిస్రావము యెక్కువగా వెడలుట. తుమ్ము లు వచ్చుచుండుట. ముక్కు దిబ్బడవేయుట. వాసన తెలియక పోవుట.

నోరు:—ఇగుళ్లు వదులుగా నుండుట. వీటినుండి సులభముగా రక్త ము స్రవించుట. నాలుకమీద దళసరిగా నుండుపూత. నోరు దుర్వాసన.

గొంతుక:—స్వరపేటిక ముడుచుకొనిపోయినట్లు తోచుట. థైరా యిడు గ్రంధి పెద్దదగుట, కొండనాలుక వాచుట.

అన్నకోశము:—యెక్కువఆకలిగాను, దాహముగాను యుండుట. క్షారము ఆహారము తీసికొనినపిమ్మట వమనము వచ్చుట.

పొత్తికడుపు:—కాలేయము ప్లీహము వాచి నొప్పిగా నుండుట.

కా మెర్ల రోగము. గజ్జలలోని మాంసగ్రంథులవాపు. అపానవాయువు వెడల కుండుట.

మలము, మలాశయము:—ప్రతి విరేచనముతోను రక్తము వెడలు చుండుట. విరేచనములో జిగట మాత్రమే వెడలుచుండుట. విరేచనాను మానము యెక్కువగా నుండుట.

మూత్రావయవములు:—మూత్రము తరుచుగాను, విస్తారము గాను, ముగ్గిన ఆకుపచ్చన పసుపుపచ్చన మిశ్రమవర్ణముగాను వెడలు చుండుట. మూత్రము ఆణచిపెట్టబడుట. రాత్రియందు మూత్రము అప్రయత్నముగా వెడలుట.

పురుషావయవములు:—అండములువాచుట, గట్టిపడుట. బుడ్డను మాన్పును. సంభోగశక్తి తగ్గుట. అండములుయెండిపోవుట లేక చిన్నవగుట.

స్త్రీఅవయవములు:—బహిష్టు సరిగానుండక పోవుట. గర్భాశయ రక్తస్రావములను మాన్పును. ఒరుపులను కలుగజేయునసును బహిష్టులో వెడలుచుండుట. అండాశయము, గర్భాశయము వాచుట, గట్టిపడుట. బహిష్టులో చాల నిస్త్రాణగా నుండుట.

శ్వాసావయవములు:—స్వర పేటిక నొప్పిగానుండుట. రక్తజీరతో గూడిన శ్లేష్మము వెడలుట. శ్వాసావయవములలో గిలిగింతలు పెట్టుచున్న ట్లుండుట వలన పొడిదగ్గు వచ్చుచుండుట. ఛాతీలో కుట్టుచున్నట్లుండుట. మంటగానుండుటతో గూడిన పొడిదగ్గు, శ్లేష్మ మెక్కువగా వెడలుచుండుట, ఛాతీ బిగపట్టినట్లుండుట. శ్వాసావయవములపైపొర వాచుట. గొంతుక బొంగురుగా నుండుట. జలుబును మాన్పును.

హృదయము, నాడి:—హృదయములో బరువుగాను, నొక్కుచున్న ట్లును, చీల్చుచున్నట్లును, బాధగా యుండుట. హృదయమును నులిమివేసి నట్లు నొప్పిగా యుండుట. స్వల్ప శరీరశ్రమ వలనగూడ ఛాతీలోను, హృదయములోను, నీరసము వచ్చుట. హృదయము వాచుట, హృదయము

లోని కండరములలో కొంకర్లు పోవుచుండుట, పొడగుట. నాడి నిస్త్రాణగాను, సన్నముగాను, వడిగాను కొట్టుకొనుచుండుట.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—గండమాలరోగము. ఎడమమోచేతిలో చీల్చుచున్నట్లుండు బాధ. అవయవములు కంపించుట. పాదములకు నీరుపట్టుట. కీళ్లసంధులు వాచుట, బాధగా నుండుట. ఎముకలలో రాత్రియందు నొప్పివచ్చుట. రోగసంబంధమైన మేహవాతనొప్పులు. మేహవాతనొప్పులు. రాత్రియందు కీళ్లలో వచ్చునట్టి నొప్పులు. కీళ్లలో ముకుచుకొని పోవునట్లుండు భావన గలుగుట.

చర్మము:—పసుపుపచ్చగాను, తేమగాను వుండుట ఒకప్పుడు ఆర్చుకుపోయి గరుకుగా యుండుట. మాంసగ్రంధులు వాచుట. హృదయరోగముతో గూడిన వుబ్బుమీదనిది బాగుగా పనిచేయును.

నిద్ర:—ఆతురతతో నుండు కలల వలన నిద్ర అస్థిరముగా నుండుట. నిద్రలో విస్తారముగా చెమట పట్టుట.

జ్వరము:—వెచ్చని గదిలోకూడ వణకు వచ్చుచుండుట. ఒకమారు వెచ్చగాను ఒకమారు చలిగాను వుండుట. రాత్రియంతయు పాదములు చల్లగానుండుట; మరియు విస్తారముగా చమటపట్టుట. వుదయమున చెమట పుల్లని వాసనగా నుండుట. క్షయరోగుల జ్వరముమీదను న్యుమోనియా లోను బాగుగా పనిచేయును.

వుద్రేకము:—వెచ్చదనమువలన, వెచ్చనిగదిలో, కుడిపైపున, నిశ్శబ్దముగా యున్నప్పుడు, పరిశ్రమవలన, తాకుడువలన.

వుపశమనము:—నిబ్బరముగా కూర్చుండుట వలన, భోజనమువలన, యిటునటు తిరుగుటవలన, బహిరంగమైన గాలిలో.

సహచరులు:—లైకోపోడియం, బేడియాగా.

విరుగుళ్లు:—బెల్లడోనా, హెపారుసల్ఫు, కేంఫర్, ఆర్సెనికం ఆల్బం, యాపిస్, చైనా, కాఫీ, మెర్క్యూరియసు, ఫాస్ఫరసు, సల్ఫరు.

మెర్క్యూరియసు, ఆర్జెంటుసైట్రికం, ఆర్సెనికంఆల్బం, కాల్కేరియాకార్బు—లకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 1000 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 6 వారములు.

---

## 348. కాలీ ఆర్సు. KALI ARS.

ఇది మానసటువంటి చర్మరోగములమీద బాగుగా పని చేయును. చర్మరోగములుఒకప్పుడుపాత్రిశోషపద్రవకరములుగా కూడ యుండుటయు, రోగి అస్థిమితముగాను, నిస్త్రాణగాను, రక్తక్షీణతతోను యుండుటయు దీనివుపయోగమును సూచించును.

అన్నకోశము:—ఆకలిలేకపోవుట. విస్తారము దాహాముగానుండుట. భోజనానంతరము బాధగాను, వికారముగాను యుండుట. తినిన ఆహారమును వమనము చేసుకొనుట.

పొత్తికడుపు, మలాశయము:—అంత్రములలో మంటలు, బాధలు. పొట్ట వుబ్బరింపు. తెల్లని నురగతో వెడలు నీళ్ల విరేచనములు. ఆసనములో ఎఱ్ఱని కొరకంచు పెట్టినట్లుండుట.

స్త్రీఅవయవములు:—మర్మావయవమునుండి కుళ్లువాసనతో గూడిన స్రావము వచ్చుట, బహిష్టు ఆగిపోవుట. స్తన్యము హరించి పోవుటను మాన్పును.

చర్మము:—బట్టలు తీసివేసిన పిమ్మట శరీరముమీద భరింపలేనంత చమట పట్టుట, ఆర్చుకొనిపోయి బీటలుతీసి, ముడతలుపడి యుండుట. మోచేతుల యొక్కయు మోకాళ్ల యొక్కయు ముడతలలోని మేహావాత లక్షణములు గాలి మార్పుల వలన వుద్రేకము జెందుట. అపాయకరమగు పుట్టవ్రణము ఆకస్మికముగా బయలు దేరుట. మంతపు పొక్కులవంటి చర్మరోగము, దీనిలో పొక్కులు బయలుదేరుచు, మానుచు, గోకినయెడల

తిరిగి బయలు దేరుచు, వీటినుండి నీళ్లుకారుచు యెన్నాళ్లకును మానకుండుట. మొటిమలు, పొక్కులు బయలు దేరుట.

వృద్ధికము:—రాత్రియందు, వెచ్చదనమువలన.

పోలికలు:—ఆర్సెనికంఆల్బం, చైనా, సిక్యూటా, అయోడియం.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ.

---

## 349. కాలీ బైక్. KALI BICHROMICUM.

స్రావములతోనుండు రోగములు, సవాయి లేక చర్మరోగములు వీటితో బాధపడు స్థూల శరీరులకు ఇది బాగుగా పనిచేయును. క్రొవ్వు పట్టి చామనచాయగాను, పల్చని తల వెండ్రుకలతోను, పొట్టిమెడతోను యుండువారికిది బాగుగా పనిచేయును. కండ్లు, ముక్కు, నోరు, గొంతుక వూపిరి గొట్టములు, ఆహారనాళము, స్వరపేటిక, సప్తపథ, మూత్రనాళము—వీటియొక్క ఆమత్వచల దోషములమీద బాగుగా పనిచేయును. ఆమత్వచలనుండి చిక్కని జిగురువంటి స్రావము తీగవలె సాగుచు, వెలువడుచుండుట (హైడ్రాస్టిసు), రోగి ఒకప్పుడు మేహవాత రోగముతోను ఒకప్పుడు జీర్ణకోశ సంబంధమైన రోగముతోను లేక జిగటవిరేచనములతోను బాధ పడుచుండుట; వేసవిలోవచ్చు రోగములు; బహిరంగమైన గాలివలన జలుబు చేయుచుండుట; బాధలు అకస్మాత్తుగావచ్చి అట్లే మాయమగుట. మరియు నివి ఒకచోటనుండి మరియొకచోటకు మారుచుండుటయు దీని వుపయోగమును సూచించును.

తల:—ఆకస్మికముగావచ్చు తలనొప్పి, వికారము. తలనొప్పివలన దృష్టి మందగించుట. చెవినుండి చిక్కని పసుపుపచ్చని దుర్వాసనతో గూడిన తీగవంటి స్రావము వెడలుట.

ముక్కు:—పుండుపడుట. ఆమత్వచలు వాచుట. తుమ్ములు

విస్తారముగా వచ్చుచుండుట. ఆకుపచ్చని లేక పసుపుపచ్చని స్రావము తీగవలె సాగుచు వెడలుచుండుట.

నోరు:—నాలుక యెఱ్ఱగాను నునుపుగాను బీటలుదీసి యుండుట. నాలుకపైని దళసరియైన పూతగలుగుట.

గొంతుక:—గవదకాయలపైని బూడిద వర్ణముగల రసితో గూడిన పుండ్లు. కొండనాలుక, గవదకాయలు వాచి యెఱ్ఱగా నుండుట.

అన్నకోశము:—రోగి పుల్లని పదార్థములను తినగోరుట. రుచి లోహపురుచిగాను, తియ్యగాను, పుల్లగాను, వుదయమున చేదుగాను, యుండుట. భోజనానంతరము జఠర లక్షణము లుపశమించి మేహవాత లక్షణములు బయలుదేరుట.

మలము:—వుదయమున జిగురుగానుండు మలము వెడలుట. జిగట విరేచనములు; దీనిలో నురగతో గూడిన మలము వెడలుచు ఆసనము తీపుగానుండుట. విరేచనబద్ధము.

పురుషావయవములు:— సంభోగేచ్ఛ లేకుండుట, పుండ్లలో కుట్టుచున్నట్లుండు బాధ రాత్రియందు వుద్రేకించుట. సవాయి పుండ్లనుండి జున్నుముక్కలవలె చీము వెడలుచుండుట. జీర్ణించిన రోగ.

స్త్రీఅవయవములు:—బహిష్టు త్వరగానగుట. కుసుమ సంబంధమైన స్రావము పసుపుపచ్చగాను, తీగవలెను, నడుములో నీరసముతోను వెడలుట. వేసవిలో గర్భాశయము వెలుపలకు వచ్చుట.

శ్వాసావయవములు:—జలుబువలనవచ్చు స్రావములు పసుపుపచ్చగాను, ముద్దగాను, జిగురుగాను, తీగవలెను వెడలుచుండుట. స్వరపేటికలో గిలిగింతలు పెట్టుచున్నట్లుండుట. ఖంగుమను ధ్వనితో వచ్చు దగ్గు. దగ్గునప్పుడు రొమ్మెముకలో నొప్పిబయలుదేరి, భుజములలోనికి వ్యాపించుట,

హృదయము:—చల్లగానున్నట్లు తోచుట. దడగానుండుట, నాడి వక్రముగాను నిస్త్రాణగాను వుండుట,

నడుము, కాళ్లు, చేతులు:—చేతులమీద చర్మరోగములు బయలు దేరుట. మేహవాత నొప్పులు. హృదయమున నడుములో నొప్పులుగా నుండుట. నడుచునప్పుడు నొప్పులుగా నుండుట.

చర్మము:—పొడిగాను, యెర్రగాను, వెచ్చగాను యుండుట. మశూచికములోవలె మంటతోను బాధతోను యుండెడు పొక్కులు బయలుదేరుట. దురదతోకూడిన నీటిపొక్కులు బయలుదేరుట.

నిద్ర:—తృప్తిలేని నిద్ర. మూత్రవిసర్జనకై మెలుకువ జెందుట.

జ్వరము:—నడుములో చలిగాను, నిద్రమత్తుతోను యుండుట. వెచ్చని ప్రదేశమున నుండగోరుట. విరేచనమగునపుడు వీపుమీద చెమట పట్టుట. చల్లనిచమటవిస్తారముగా నుదిటియందును, చేతులమీదను పట్టుట.

వృద్ధికము:—వేసవిలో, హృదయమున, దుస్తులను తీసివేసిన పిదప.

వుపశమనము:—చర్మరోగములు శీతకాలములో వుపశమించుట.

సహచరులు:—యాంటింటార్టు.

బీరు, మెర్క్యూరియసు, మెర్క్యూఅయోడ్—ల కిది విరుగుడు.

విరుగుళ్లు:—ఆర్సెనికం ఆల్బమ్, లెకెసిన్, పల్సటిల్లా.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 350. కాలీకార్బ్. KALI CARBONICUM.

శరీరపాటవము తప్పినట్టియు, క్రొవ్వుపట్టుచుండునట్టియు, వుబ్బు, పక్షవాతము మొదలగు వ్యాధులచే బాధపడునట్టియు, ముసలివారియొక్క రోగములమీద నిది బాగుగా పనిచేయును. రక్తక్షీణతతోను, నిస్త్రాణతోను బాధపడువారికి చాలవుపయోగకరముగా నుండును(యాసిడ్ ఫాసు, చైనా). బాధలు కుట్టుచున్నట్లును, పొడుచుచున్నట్లునువుండుట, మరియు నివి విశ్రాంతివలనను, బాధగానుండువైపు పరుండుటవలనను వృద్ధికము

జెందుట (బాధగానుండునైపు వరుంచుటవలన లక్షణములు వుపశమించు నప్పుడు బ్రియోనియాను వాడవలయును); రోగలక్షణములు వుదయమున వుద్రేకము జెందుచుండుట; క్షయసంబంధమైన తత్వములు; రోగియొక్కవ చెమటతోను, నడుమునొప్పితోను, నిస్త్రాణతోను యుండుట. కండరములలో క్రొవ్వు యెక్కువగా జేరుటవలన నవిచెడిపోవుట, ప్రసవానంతరమునను, గర్భస్రావమునకు పిమ్మటనువచ్చు నిస్త్రాణలు—ఇవి దీనివుపయోగమును సూచించును.

మనస్సు:—తొందరయందయిష్టత. విచారముగాను చిరచిరలాడుచును యుండుట. భయముతోను ఆలోచనలతోను నిండియుండుట. కడుపులో అంగోళనగాయుండుట. ఒంటరిగా నుండుటకు అయిష్టత.

తల:—తలవెంట్రుకలు ఆరిపోయినట్లుండుట, వూడిపోవుట.

కండ్లు:—మీదికనురెప్పలు వాచుట. అతిసంభోగమువలన దృష్టి మందగించుట.

ముక్కు:—పక్కులుకట్టుట. పుండ్లుపడుట.

నోరు:—నాలుక తెల్లన. భుజించునప్పుడు పంటినొప్పివచ్చుట.

అన్నకోశము, పొత్తికడుపు:—రుచి చేదుగానుండుట. వుబ్బరింపుగానుండుట. మంచునీరువలనవచ్చు జఠరదోషములు. భోజనమునందయిష్టత. కడుపుపైని నొప్పిగాయుండుట. కడుపుసున్నితముగా నుండుట. కాలేయములో కుట్టుచున్నట్లు బాధగానుండుట. నిలువగాయున్న కాలేయసంబంధమైన వ్యాధులలోను, కామెర్లరోగమునను, వుబ్బునను దీనినివాడవచ్చును.

మలము, మలాశయము:—విరేచనము వెడలుచున్నప్పుడు కుట్టుచున్నట్లును మండుచున్నట్లును బాధతోయుండు పెద్దపెద్ద మూలశంఖుమొలలను మాన్పును. విరేచనానుమాన మెక్కువగా యుండుట. మలమును వెలువరించుటకు ఆసనముయొక్క బలముచాలకపోవుట. కష్టముమీద వెడలునట్టి పెద్దపెద్దవిరేచనములు. మలాశయము సులభముగా వెలుపలకు వచ్చుచుండుట (పోడోఫైలం, గ్రాఫైటిసు).

పురుషావయవములు:—సంభోగవాంఛ యెక్కువగాగాని తక్కువగాగాని యుండుట. స్ఖలనానంతర మెక్కువ నిస్త్రాణవచ్చుట.

స్త్రీఅవయవములు:—బహిష్టుకు ముందును, బహిష్టులోను, దీనికి అనంతరమునను, యెక్కువతీపుగా నుండుట. ఒరుపును కలుగజేయునట్టి పసుపుపచ్చకుసుమను, నడుమునొప్పినిమాన్పును. స్తనములలోచీల్చుచున్నట్లును, కుట్టుచున్నట్లును యుండుట.

శ్వాసావయవములు:—గొంతుక బొంగురుపోవుట. దగ్గు తెల్లవారు ఝామున 3 లగాయితు 4 గంటలవరకును వుద్రేకము జెందుట. దగ్గు విడిచి విడిచి వచ్చుచుండుట. దీనితో వికారము, వమనము, వూపిరందకపోవుట స్వరపేటికలో అరుచ్కొనిపోయినట్లుండుటను మాన్పును. గొంతుకలో గిలిగింతలు పెట్టుచున్నట్లుండుటచే వచ్చు పొడిదగ్గునుమాన్పును. నడుచుచున్నప్పుడు వూపిరిని వదలుట వలన ఛాతీలో బిగపట్టుచుండుట. ఛాతీకి నీరుపట్టుట. కొండనాలుక పొడుగగుట వలనవచ్చు దగ్గు. క్షయరోగమువచ్చు సూచనలున్నప్పుడు; అనగా తరుచు రొంప పట్టుచుండుట, వెచ్చని ప్రదేశములో నున్నప్పుడు లక్షణము లుపశమించుట, గలుగుచున్నప్పుడు దీనిని వాడవలయును.

హృదయము:—తరుచుగాను, విపరీతముగాను, స్వల్ప పరిశ్రమ వలనను, గుండెదడ వచ్చుచుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—మాంసగ్రంథులు వాచుట. నడుచునప్పుడు నడుము నొప్పివచ్చుట, ఇందువలన నడచుటను మానివేసి పరుండవలయునని తోచుట. కీళ్లసంధులలోను కండరములలోను కుట్టుచున్నట్లుండుబాధ. తొడలలో పక్షవాతములోవలె లాగుచున్నట్లుబాధ గానుండుట. కాలిబొటనవేళ్ల చివళ్లను చాలబాధగానుండుట అరికాళ్ళు చాలనొప్పిగా యుండుట.

చర్మము:—పొడిగాను, దురదగాను, మంటగాను యుండుట.

నిద్ర:—భోజనానంతరము మత్తుగా యుండుట. రాత్రి 1 లేక 2 గంటలకు మెలకువ వచ్చిన పిదప నిద్రపట్టక పోవుట.

జ్వరము:—లోపల వెచ్చగాను, పైని చల్లగాను యుండుట. చలి, జ్వరము, వూపిరాడకుండుట.

వుద్రేకము:—సంభోగమువలన, చల్లని గాలివలన, యెడమపైపున, బాధగానుండు వైపున పరుండుట వలన.

వుపశమనము:—వెచ్చని గాలిలో, కదలికవలన, పగటియందు.

సహచరులు:—కార్బోవెజ్, నేట్రంమూరు, సేపియా.

విరుగుళ్లు:—కేంఫరు, కాఫీ.

మోతాదు:—6 మొదలు 1,000 పొటెన్సీ. దీనిని అతితరచుగా వాడరాదు. మేహవాత రోగములలోను, మూత్రవ్యాధులలోను, క్షయలోను జాగరూకతతో వాడవలయును. దీని గుణకాలపరిమితి 6 వారములు.



## 351. కాలీఅయోడ్. KALI IOD.

రసదోషములతో కూడిన రోగలక్షణములమీదను, సవాయి వ్యాధిమీదను క్షయ సంబంధమైన లక్షణములమీదను ఇది బాగుగా పనిచేయును. ఇది రస దోషములను పూర్తిగా నాశనము చేయును. సవాయి వ్యాధి యొక్క అన్నిదశలలోను బాగుగా పనిచేయును. మాంసగ్రంధుల వాపులను మాన్పును. రోగి తూనికకు తగ్గిపోవుట, రక్తమును వుమియుచుండుటను మాన్పును.

మనస్సు, తల:—విచారముగాను ఆతురతగాను చిరచిరలాడుచును యుండుట. తల బరువుగానుండుట. విపరీతమైన తలనొప్పి వచ్చుట. మెదడు పెద్దదైనట్లుతోచుట. ముఖమునందువచ్చు పార్శ్వపునొప్పి. తలకు నీరుపట్టుట.

ముక్కు:—ఎర్రగా వాచియుండుట. వెచ్చగాను నీళ్లవలె పల్చ

గాను, ఒరుపును కలుగజేయుచును యుండునట్టి స్రావము విస్తారముగా వెడలుచుండుట. ముక్కునుండి దుర్వాసన వచ్చుచుండుట. ముక్కుదూలము సవాయి దోషమువలన చెడిపోవుట.

కండ్లు:—సవాయి దోషము వలన కనీనికాపటలము వాచి, కంటి నుండి స్రావము వచ్చుట. పుసులు కట్టుచుండుట. కండ్లు యెఱ్ఱబడుట.

పురుషావయవములు:—అండములు యెండిపోవుట, గట్టిపడుట, సంభోగేచ్ఛ తగ్గుట. సవాయి సంబంధమైన పుండ్లు, ఓళ్ళలు, అడ్డకఱ్ఱలు, ఎముకలలో నొప్పులు, అంగము యెఱ్ఱగావాచి బాధగా నుండుట, సవాయిదోషముల వలనవచ్చు కీళ్ళనొప్పులు, వాపులు; మాంసగ్రంధుల వాపులు—వీటిమీద బాగుగా పనిచేయును. కోడిజుట్టుసవాయిని మాన్పును; దీనికి తూజాను కూడ వాడవచ్చును

స్త్రీఅవయవములు:—బహిష్టుఆలస్యము గాను, స్రావ మెక్కువగాను వెడలుట. కుసుమ ఒరుపును గలుగజేయుచు వెడలుట. బహిష్టుకు బహిష్టుకు మధ్య స్రావమగుట.

శ్వాసావయవములు:—స్వరపేటిక గరుకుగా నుండుట, వాచుట. పుబ్బసము. మెట్లు యెక్కుటవలన హృదయములో నొప్పిగాను. శ్వాస కష్టముగానుయుండుట. క్షయవ్యాధిలో చీమువంటి శ్లేష్మము వెడలుట. మరియు నిస్త్రాణను కలుగజేయుచును ఊపిరి ఆడకను యుండుట. చిక్కగాను, ఆకుపచ్చగాను, వుప్పగానుండు శ్లేష్మముతో దగ్గు వచ్చుచుండుట.

కాళ్ళు, చేతులు:—ఎముకలలో యెక్కువ బాధగా నుండుట. రాత్రియందును, తేమగాలిలోను, కీళ్లలో నొప్పివచ్చుట. మోకాళ్లలో వాపుతోగూడిన నొప్పులు. కూర్చున్నప్పుడు దిగువ అవయవములమీద చీమలుపాకుచున్నట్లుండుట, మరియు నిది సరుండుటవలన వుపశమించుట.

చర్మము:—గట్టిపడుట, మోటగానుండుపొక్కులు బయలుదేరుట. పూదారంగు మచ్చలు కాళ్లమీద యెక్కువగా బయలుదేరుట. కనురెప్పలు,

నోరు, కొండనాలుక ఇవి వుబ్బునట్లు సూచనగలుగుట. చర్మమునుండియు ఆమత్వచలనుండియు రక్తముస్రవించుట.

వుద్రేకము:—వెచ్చని దుస్తులను ధరించుటవలన, వెచ్చనిగదిలో, రాత్రియందు, తేమ గాలిలో.

వుపశమనము.—కదలికవలన, బహిరంగమైన గాలిలో.

విరుగుళ్ళు:—హెపారుసల్ఫు, మెర్క్యూరియసు.

మెర్క్యూరియసు—నకిది విరుగుడు.

మోతాదు:—6 మొదలు 1,000 పొటెన్సీ.

---

## 352. కాలీ మూరు. KALI MURIATICUM.

(క్షారలవణము. స్కూస్లరుగారి ద్వాదశలవణములలోనిది ఐదవది).

శ్లేష్మరోగములు, మాంసగ్రంధుల వాపులు, శెగరోగము యొక్క ప్రధమావస్థ, చర్మరోగములు, జిగటవిరేచనములు, పైత్యాధిక్యము—వీటి మీదనిది బాగుగా పనిచేయును. నాలుకపైని తెల్లని బూడిదరంగుగాను, దళసరిగాను యుండు పూతగలుగుట, తెల్లని చిక్కని శ్లేష్మము వెడలుట—యివి దీని ముఖ్యలక్షణములు.

మనస్సు:—రోగనివృత్తికై లంకణము చేయవలసి వచ్చుననుకొనుట.

తల:—విరేచనబద్ధముతో గాని, పైత్యమువలనగాని వచ్చుతలనొప్పి. చుండ్రును మాన్పును.

కండ్లు:—తెల్లని పెద్ద పెద్ద పుసులుకట్టుట. కండ్లువాచుట, యెర్రబడుట, బాధగానుండుట, కనురెప్పలలో దుర్మాంసము పెరుగుట, యిసుక పోసినట్లుండుట.

చెవులు:—చీము వెడలుట్ల మాంసగ్రంధులవాపుతో వచ్చు చెవిపోటు,

ముక్కు:—చిక్కని జిగుపచ్చని స్రావము, రక్తము (ఆర్నికా, బ్రియోనియా) వెడలుట. దిబ్బడ వేయుట.

ముఖము:—దౌడ వాది బాధగా నుండుట (ఫెరగ్రింఫాసు). గాలిబిళ్లలు.

నోరు:—నీళ్లుకారుచుండుట, పుండ్లుపడుట, నాలుకపైని తెల్లని లేక గోధుమవర్ణముగా నుండు పూత, వాపుగలుగుట (ఫెరగ్రింఫాసు). ఇగుళ్లువాచుట. గవదకాయలు పెద్దవగుట, వాచుట.

అన్నకోశము:—క్రొవ్వుతోగూడిన ఆహారములు, పిండివంటలు మొదలగు వాటివలన వచ్చు ఆజీర్ణమును కడుపునొప్పిని, మాన్పును.

పొత్తికడుపు, మలము, మలాశయము:—విరేచన బద్ధము, అజీర్ణము వలనికడుపునొప్పి, జిగటవిరేచనములు, రక్తమొలలు, కడుపు వుబ్బరింపు, నీళ్లవిరేచనములు—వీటిని మాన్పును.

మూత్రావయవములు:—కాలేయదోషమువలన మూత్రము ముదర రంగుగా వెడలుట.

పురుషావయవములు:—ఇది శెగవుపరిధానౌషధము; పరిధమావస్థలో బాగుగా పనిచేయును. సవాయి సంబంధమైనబిళ్ల, యిదివెచ్చగాను, వాపుగాను బాధగాను, యుండునపుడు ఫెరగ్రింఫాసుతో మార్చుచు యివ్వవల యును.

స్త్రీఅవయవములు:—తెల్లగా పాలవలెను, చిక్కగాను, వెడలు చుండు కుసుమను మాన్పును. ఋతురక్తము విస్తారముగాను, నల్లగాతారు వలెను, ముద్దలుగాను వెడలుచుండుట (ప్లాటినా). వేవిళ్లనుమాన్పును.

శ్వాసావయవములు:—దగ్గు, కోరింతదగ్గు, ఉబ్బసము—వీటిని మాన్పును. వూపిరాడకపోవుట, శ్లేష్మము తెల్లగాను, చిక్కగాను, వెలువ రించుటకు కష్టముగాను యుండుట. చాతీలో గురగురలాడుచుండుట.

హృదయము:—గుండెదడ. హృదయముపై పొరవాపును మాన్పును.

కాళ్లు, చేతులు:—మేహవాత నొప్పులు, వాపులు. మాంసగ్రంథుల వాపు. కాళ్లు, చేతులు ఒరియుట.

చర్మము:—కురుపులు, పుండ్లు, రాచపుండ్లు—వీటి వాపును, బాధను తగ్గించును. టీకాలవలని దోషమును మాన్పును. దురద, చీము, వాపుతో గూడిన కురుపులు మొదలగు చర్మరోగములమీద బాగుగా పనిచేయును.

జ్వరము:—శ్లేష్మజ్వరము, అజీర్ణజ్వరము, సన్నిపాతజ్వరము-వీటి మీద పనిచేయును. జ్వరముతోపాటు నాలుకమీద తెల్లని లేక బూడిద రంగువంటి పూతయున్నప్పుడు దీనిని వాడవలెను. దీనితో ఫెర్రంఫాసును మార్చుచుయిచ్చినయెడల శ్లేష్మ, వాత, పైత్యజ్వరములన్నియును, వీటితో నుండు దగ్గు, వికారము, వమనములు, విరేచనబద్ధము, మొదలగు లక్షణము లన్నియును మానును.

నిద్ర:—అలుసుడు వలన నిద్ర పట్టకపోవుట.

వుద్రేకము:—అజీర్ణపదార్థములను తినుటవలన, కదలికవలన.

మోతాదు:—3x మొదలు 200 పొటెన్సీ. ఇదిపొడుము మరియు బిళ్లల రూపమున బాగుగా పనిచేయుచున్నది. 200 పొటెన్సీలో పొడుము రూపమున శ్వాసముమీద బాగుగా పనిచేయును. ఇది 6x లోను అంతకుతక్కువ పొటెన్సీలలోను అరకు రూపమునను, మాత్రలలోను తయారుకాబడదు.

---

## 353. కాలీ ఫాసు. KALI PHOSPHORICUM.

(క్షారభాస్వరము. సూక్ల్సరుగారి ద్వాదశలవణములలోనిది ఆరవది).

ఇది నరములకు, మెదడుకు, సంబంధించిన రోగములమీదను; రక్తదోషములమీదను, బాగుగా పనిచేయును. నరముల నిస్త్రాణను, నపుంసకత్వమును, నిద్ర పట్టకపోవుటను, హిస్టీరియాను, శుక్లనష్టమును, రక్తస్రావములను మాన్పును. దీనిని గర్భిణీస్త్రీలు సేవించినయెడల వారుసుఖముగా ప్రసవింతురు. నరముల సంబంధమైన రోగములలో దీనిని మెగ్నీషియా

ఫాసుతో మార్చుచు యిచ్చినయెడల చాల వుపయోగకరముగా నుండును. ఇట్లే శరీరపుష్టికొరకు దీనిని కాల్కేరియా ఫాసుతో మార్చుచు యిచ్చుట మంచిది.

మనస్సు:—జ్ఞాపకశక్తి లేకపోవుట, నిద్రపట్టకపోవుట, చురుకుగా లేకపోవుట, అపస్మారము లేక మూర్ఛను, వున్మాదము లేక పిచ్చిని, మనోవ్యాధిని మాన్పును.

తల:—తలనొప్పి అధికమైన మానసిక పరిశ్రమవలన వచ్చునప్పుడు పనిచేయును. ఇందువలన విద్యార్థులు, వుపాధ్యాయులు, ప్లీడర్లు మొదలగు వారందరికిని ఇది చాల వుపయోగకరముగా నుండును.

కండ్లు:—అధిక సంభోగము వలనవచ్చు దృష్టి మాంద్యము, మెల్ల చూపు, కండ్ల ఎరుపులు వాపులు వెలుతురును చూడలేక పోవుటను మాన్పును.

చెవులు:—చీము వెడలుట మాంసగ్రంథుల వాపుతోవచ్చు చెవిపోటును మాన్పును.

ముక్కు:—రక్తస్రావములను కట్టును.

ముఖము:—వుష్ణోపచారమువలన వుపశమించు పార్శ్వపు నొప్పి.

నోరు:— నోరు దుర్వాసనగా యుండుట. ఇగుళ్లు స్పంజివలె మెత్తగా నుండుట. ఇగుళ్ళనుండి రక్తము స్రవించుట. మానసికపరిశ్రమ వలనవచ్చు పండ్ల సలుపును మాన్పును.

గొంతుక:—బొంగురుపోవుట, ముక్కుమాటలాడుట.

అన్నకోశము: —భోజనము చేసినవెంటనే తీరని ఆకలి వేయుచుంచుట. యెక్కువ దాహముగా నుండుట. అన్నకోశము వుండ్లగుట.

పొత్తికడుపు:—ప్లీహములో బాధ. పొత్తికడుపు వుబ్బరింపు.

మలము, మలాశయము:—జిగట విరేచనములు, రక్తవిరేచనములు. విరేచనము లెక్కువగా అగుటవలని నీరసము. కలరా విరేచనములు,

మూత్రావయవములు;—తరుచుగాను, నరముల నిస్త్రాణవలనను అప్రియత్నముగాను, మూత్రమునువిడచుట. పిల్లలు పక్కలో మూత్రము విడచుటను మాన్పును.

పురుషావయవములు:—రక్తశెగను మాన్పును. శుక్లనష్టము, స్వప్న స్ఖలనము, నపుంసకత్వము, ముష్టిమైథునము—వీటిని మాన్పును.

స్త్రీఅవయవములు.—బహిష్టు ఒకప్పుడు ఆలస్యముగాను, ఒకప్పుడు ముందరగాను, నిస్త్రాణతోనుండు స్త్రీలలోకలుగుట. బుతుశూలను మాన్పును (మెగ్నీషియా ఫాసు). హిస్టీరియా లేక అపస్మారములో, కడుపులోనుండి గొంతుకలోనికి బంతి వెడలుచున్నట్లుండు భావన గలిగినపుడిది పనిచేయును. నరముల నిస్త్రాణచే బాధపడువారిలో గలుగు గర్భస్రావములను మాన్పును. సుఖ ప్రసవమునకై గర్భిణీస్త్రీలకు యివ్వవలసిన 4 ఔషధములలో నిది యొకటి: తక్కినవి (1) కాల్కేరియాఫ్లోరు, (2) కాల్కేరియాఫాసు, (3) మెగ్నీషియాఫాసు.

శ్వాసావయవములు:— వుపన్యాసముల నిచ్చుటవలనవచ్చు నీరసమును మాన్పును. శారీర పరిశ్రమవలనవచ్చు ఆయాసమును, నీరసమును మాన్పును. వుబ్బసపు దగ్గువలన వూపిరందకపోవుటను మాన్పును.

హృదయము:—శరీరమానసిక పరిశ్రమవలన వచ్చు గుండెదడ.

నడుము, కాళ్ళు, చేతులు:—పక్షవాతము, తిమ్మెరలు మీద పని చేయును. రోగి తూలి పడిపోవుచుండుటను మాన్పును.

చర్మము:—చర్మరోగములలో దుర్వాసనతోగూడిన స్రావములు, నీటిపొక్కులు, మంత్రపుపొక్కులు, రాచపురుపులు; వీటినుండి దుర్వాసనతోగూడిన స్రావములు వెడలుటను మాన్పును.

జ్వరము:—విషజ్వరము, సన్నిపాతజ్వరము; వీటిలో మగత, సంధి, నిద్రలేమి, దుర్వాసనతో గూడినస్రావము, నీరసమును దీనినివాడవచ్చును.

నిద్ర:—భయంకరమైన కలలతోగూడిన నిద్ర. పిల్లలు నిద్రలో వులికిపడుట. కెవ్వున కేకవేయుట. నిద్ర జెందకపోవుట.

వృద్ధికము:—ధ్వనుల వలన, కూర్చుండిన పిదప లేచుటవలన, పరిశ్రమవలన.

ఉపశమనము:— నెమ్మదిగా కదలుట వలన, భోజనము వలన.

పోలికలు:—యాసిడుఫాసు, ఫాస్ఫరసు, కాలీకార్బు, ఓపియం, లెకిసిసు, రూస్టాక్సు, ఇగ్నీషియా, హాయాస్యామసు, ఎనకార్డియం, ఆర్నికా, పల్సటిల్లా.

మోతాదు:—3x మొదలు 10,00,000 పొటెన్సీ. 3x లగాయితు 200 వరకు పొడుము రూపమున బాగుగా పని చేయుచున్నది. అవసాన కాలమందు 1,000 పొటెన్సీకి తక్కువగాకుండా వాడినయెడల చింతామణివలె పనిచేయును. ఇది 6x పొటెన్సీవరకు అరకురూపమునను మాత్రల రూపమునను తయారుకాబడదు.

---

## 354. కాలీ సల్ఫు. KALI SULPHURICUM.

(క్షారగంధకము. సూక్ల్సరుగారి ద్వాదశలవణములలో నిది ఏడవది.)

ఇది చర్మరోగముల మీదను, శ్వాసావయవ రోగముల మీదను బాగుగా పనిచేయును. పసుపుపచ్చని, లేక పసుపు ఆకుపచ్చని మిశ్రమ వర్ణముగానుండు స్రావములు వెడలుచుండుట, లక్షణములు సాయంకాలమందును, వెచ్చని గదిలోను వృద్ధికించుట, మరియు నివి బహిరంగమైన గాలిలో వుపశమించుట, నాలుక పసుపుపచ్చని లేక జిగురుగానుండు పూతతో కప్పబడి, చప్పని రుచితో నుండుట, దేహావాతనొప్పులు ఒక చోటినుండి మరియొకచోటికి మారుచుండుట—ఇవిదీనిముఖ్యలక్షణములు.

మనస్సు:—చిరచిరలాడుచును తొందరగాను వుండుట.

తల:—బట్టతలను, చుండుర్ను మాన్పును. తలమీది పొక్కులను, తలతిర్పను మాన్పును.

కండ్లు:—అంతర కుసుమలు. రెప్పలమీద పసుపుపచ్చని పక్కులు కట్టుట. వెలుతురును చూడలేకపోవుట. కండ్లకలక.

చెవులు:—పసుపుపచ్చని స్రావముతో గూడిన చెవిపోటు.

ముక్కు:—వాసన తెలియక పోవుట, దిబ్బట వేయుట.

ముఖము:—పార్శ్వపునొప్పి. ఇది ఒకచోటనుండి మరియొకచోటికి మారుచుండుట. పుట్టుపర్రిణమును మాన్పును.

నోరు:—చెచ్చగాను, చేదుగాను వుండుట. పండ్లసలుపును, ఇగుళ్ల బాధను మాన్పును. నాలుకపై పసుపుపచ్చని పూత. రుచి తెలియకపోవుట. గవదకాయలు వాచుట.

అన్నకోశము:—దాహముగాను, వికారముగాను, మంటగాను వుండుట. వమనములను అజీర్ణమును మాన్పును.

పొత్తికడుపు:—కామెర్ల రోగము. వుబ్బరముగాను పోట్లుగాను వుండుట.

మలము, మలాశయము:—గంధకపువాసనతో వెడలునట్టి అపాన వాయువును, నీళ్ల విరేచనములను మాన్పును. కలరాలక్షణములు.

మూత్రావయవములు:—మూత్రము బహుకష్టముగాను, చుక్కలు చుక్కలుగాను, శ్వేతధాతువుతో కలిసియు పోవుచుండుటను మాన్పును.

పురుషావయవములు:—పసుపు పచ్చని లేక ఆకుపచ్చని, చిక్కని స్రావముతో గూడిన సెగరోగముమీద బాగుగా పని చేయును. సెగరోగము నణచిపెట్టుటవలన అండములు వాచుట. జీర్ణించిన సెగకును, సవాయికిని దీనిని వాడవచ్చును.

స్త్రీఅవయవములు:—బహిష్టులో తలనొప్పివచ్చుట. బహిష్టు చాల ముందరగాను లేక చాల ఆలస్యముగాను, స్రావము తక్కువగాను అగుట. పసుపుపచ్చని, జిగురువంటి లేక ఆకుపచ్చని కుసుమ.

శ్వాసావయవములు:—పసుపువచ్చని లేక ఆకుపచ్చని జిగురువంటి స్రావములతో గూడిన బ్రాంకైటిసు, క్షయ మొదలగు రోగములమీద

బాగుగా పనిచేయును. పుబ్బసములో శ్వాస కష్టముగా నుండుట (కాలీ ఫాసు).కొరంతదగ్గుకు దీనిని మెగ్నీషియా ఫాసుతో మార్చుచు యివ్వవలెను.

నడుము, కాళ్లు, చేతులు:—మేహవాతనొప్పులు, వాపులు, బాధలను మాన్పును. నొప్పులు ఒకచోటనుండి మరియొకచోటికి మారుచుండుట.

చర్మము:—గజ్జి, చిడుము—ఇట్టి పొక్కులతో గూడిన చర్మరోగములమీద బాగుగా పనిచేయును. కురుపులనుండియు, పుండ్లనుండియు పసుపుపచ్చని చీము వెడలునపుడిది పనిచేయును. క్షయ సంబంధమైన పుండ్లమీద బాగుగా పనిచేయును. గోళ్లు పొడగుటను యెదుగకుండుటను మాన్పును.

జ్వరము:— మేహవాత, సన్నిపాత, మన్యపు జ్వరముల మీద బాగుగా పనిచేయును. నాలుకపై పసుపుపచ్చని పూతయుండుట. వృష్ణము సాయంకాలము తగిలి అర్ధరాత్రివరకు యుండుట. రక్తదోషముతో గూడిన జ్వరములమీద బాగుగా పనిచేయును. చెమటను పట్టించి జ్వరమును వుపశమింప జేయును; ఇందుకొరకు దీనితో ఫెరంఫాసును గూడ మార్చుచు వాడుట మంచిది.

వుద్రేకము:—వెచ్చనిగదిలో, సాయంకాలమందు.

వుపశమనము:—చల్లనిగాలిలో, బహిరంగమైన గాలిలో.

రూస్టాక్సు—నకిది విరుగుడు.

పోలికలు:—పల్సటిల్లా, హైడ్రాస్టిసు.

మోతాదు:—3x మొదలు 1,000 పొటెన్సీ. 6x, 12x పొడుము లేక బిళ్లల రూపముల బాగుగా పనిచేయును. ఇది 6x లోను, ఇంతకన్న చిన్నపొటెన్సీలలోను మాత్రిలలోను అరకులలోను తయారుఅవదు.

---

## 355. క్రియసోటం. KREOSOTUM.

నల్లని దేహచ్ఛాయ, పల్చగా నుండునట్టియు, సరిగా యెదుగనట్టియు, పుష్టిగా లేనట్టియు, ఒకప్పుడు వయసును అతిక్రమించిన స్థూలదేహ

ముగల పొడుగుపాటి స్త్రీరోగులకు ఇది బాగుగా వుపయోగపడును. రక్తస్రావములు, పుండ్లు, పుట్టవ్రణములకు దీనిని వాడవచ్చును. ఒరుపును కలుగజేయును, మంటతోను, దుర్వాసనతోను, యుండు స్రావములమీద బాగుగా పనిచేయును. పుష్టిలేకపోయినను పొడుగుగా యెదిగిన పిల్లల రోగములమీద బాగుగా పనిచేయును. పిల్లలకు పండ్లువచ్చు కాలములో నిది బాగుగా వుపయోగపడును. ఆడువారిలో ముట్లుడిగిన పిమ్మటవచ్చు రోగములమీద బాగుగా పనిచేయును.

మనస్సు:—సంగీతమువలన విచారము, గుండెదడవచ్చుట. ఆలోచనలు మాయమగుచుండుట.

తల:—నొక్కుచున్నట్లు నొప్పిగా యుండుట. బహిష్టుసంబంధమైన తలనొప్పి.

కన్నులు:—వుప్పని కన్నీళ్లు వెడలుట. కనురెప్పలువాచి యెర్రగానుండుట.

చెవులు:—మాట సరిగా వినబడకపోవుట.

ముక్కు:—దుర్వాసనతో గూడిన స్రావము. వాసనవచ్చుట.

ముఖము:— జబ్బుచేసినవానివలె నగుపడుట. బుగ్గలుయెర్రగా వాచుట.

నోరు:—పెదవులు ఎర్రగాను, రక్తము స్రవించుచును యుండుట. పండ్లువచ్చు కాలములో బిడ్డకు సరిగా నిద్రపట్టక పోవుట. ఇగుళ్లలో బాధగా నుండుట. పండ్లు బహుత్వరితముగా చెడిపోవుట. ఇగుళ్లు స్పంజి వలె మెత్తగాను, రక్తము స్రవించుచును యుండుట. పండ్లు చెడిపోయి ముక్కలు ముక్కలుగా వూడిపోవుట (స్టాఫిసేగ్రియా, యాంటిమోనియం క్రూడం). పుప్పిపండ్లసలుపును మాన్పును. దీనికి 2x, 3x పొటెన్సీలలో అగరును దూదితోతడిపి పంటి దొలకలో వుంచినయెడల బాధ వెంటనే మానును.

గొంతుక:—దుర్వాసనతోను, మంటగాను వుండుట.

అన్నకోశము:—వికారము, భోజనమైన చాలసేపటివరకు వమనములు వెడలుచుండుట. కడుపులో మంచునీరువలెచల్లగా నుండుట. బాధ భోజనానంతరము వుపశమించుట. రక్తవమనము. నీరు తాగిన పిమ్మట నోరు చేదుగా యుండుట.

పాత్తికకోశము:—వుబ్బరించి యుండుట. దుర్వాసనగాను గోధుమ రంగుగాను యుండు నీళ్లవిరేచనములు, మరియు రక్తవిరేచనములు వెడలుచుండుట. పిల్లలకు పండ్లువచ్చు కాలములో ఆకుపచ్చని విరేచనములు. నిస్త్రాణ, చర్మము ఆర్చుకొనిపోవుట—వీటితోనుండు కలరాలక్షణములను మాన్పును.

మూత్రావయవములు:—మూత్రనుమానము గలిగినపుడు మూత్ర విసర్జనకొరకుతొందర పడవలసి వచ్చుట. మూత్రము దుర్వాసనతో వెడలుట. పరుండినపుడు మాత్రమే మూత్రము వెడలుట.

పురుషావయవములు:—సంభోగమునందు అంగములో మంట.

(స్త్రీ)అవయవములు:—కుసుమ పసుపుపచ్చగాను, ఒరుపును గలుగ జేయుచును వెడలుట. బహిష్టు చాల త్వరితముగా అగుట. మరియు స్రావము యెక్కువ కాలమువరకును వెడలుచుండుట. సంభోగానంతరము రక్త స్రావము వచ్చుట. ఇది వేవిళ్లమీద బాగుగా పనిచేయును. బహిష్టులో స్రావము పరుండినపుడు మాత్రమే యగుట; కూర్చుండినపుడును, నడుచునప్పుడును ఆగిపోవుట. చల్లనపానీయమువలన ఋతుశూల వుపశమించుట. ఋతుస్రావము ఆగిఆగి వెడలుచుండుట (పల్సటిల్లా). ప్రసవానంతరము దుర్వాసనతో కూడిన మైల వెడలుట.

శ్వాసావయవములు:—స్వరపేటికలో నొప్పిగా నుండుట. గొంతుక బొంగురుగా నుండుట. దగ్గిన పిదప చీమువంటి శ్లేష్మము వెడలుట. వర్షకాలములో ముసలివారికివచ్చు దగ్గులమీద బాగుగా పనిచేయును. వీరికి రొమ్ముమునకపైని నొక్కుచున్నట్లు బాధగా యుండుటను మాన్పును.

నడుము, కాళ్లు, చేతులు:—వడుములో లాగుచున్నట్లు నొప్పిగా యుండుట. యెక్కువ నీరసముగా నుండుట. కీళ్లసంధులలోను, చట్టల లోను, మోకాళ్లలోను, నొప్పిగా నుండుట.

చర్మము:—రాత్రియందు దురదగాను, వెచ్చగాను యుండుట. అరికాళ్లు మంటలుగా యుండుట. చిన్నచిన్న పుండ్లనుండి రక్తము అతి సులభముగా స్రవించుచుండుట (క్రొటాలస్, లెకెసిస్).

నిద్ర:—తరుచు నిద్రమత్తుతో నుండుట. ఆవలింతలు వచ్చుచుం డుట. ఆతురతతో కూడిన కలలు వచ్చుచుండుట.

వృద్రేకము:—బహిరంగమైన గాలిలో, చల్లదనము వలన, విశ్రాం తివలన, వేసవిలో, పరుండినపుడు.

వుపశమనము:—వెచ్చదనమువలన, కదలికవలన.

సహచరులు:—అర్సెనికంఆల్బమ్, ఫాస్ఫరస్, సల్ఫర్.

విరుగుళ్లు;—నక్సువామికా, ఎకోనైట్, అర్సెనికంఆల్బం, చైనా, ఇపెకాక్.

దీనికి ముందుగాని వెనుకగాని కార్బోవెజ్ వాడరాదు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 356. లేపిసు ఆల్బ్సు. LAPIS ALBUS.

మాంసగ్రంధులదోషమువలన కంతులను పుట్టవ్రణములను గండ మాలరోగమును మాన్పుటలోను ఇది అమోఘముగా పనిచేయును.

ముఖ్యముగా నిది గర్భాశయమునందు బయలుదేరు మెత్తని కంతు లను కరగించివేయుటలోను (రాతివలెగట్టిగానుండుకంతులకు కాల్కేరియా ఫ్లోరును గాని సిస్టసుకెనడెన్సిసును గాని కార్బోయానిమలిసును గాని, వాడ వచ్చును); రొమ్ములందును, అన్నకోశమందును గర్భాశయమునందును మంట

లుగా నుండుటను మాన్పుటలోను, కంతులకు సంబంధించిన రక్తస్రావము లను, వంటితోగూడిన బాధలను మాన్పుటలోను ఇది వుపయోగపడును.

తల:—మానని తలనొప్పి.

అన్నకోశము:—తీరని ఆకలి. ఆకలి ఎక్కువ తక్కువలుగా నుండుట. తినినవెంటనే తిరిగి ఆకలివేయుచున్నట్లుండుట. తినినఆహారమేమియు పుష్టినివ్వకపోవుట.

చెవులు:—చీము వెడలుట (సైలీషియా).

ఛాతీ:—స్త్రీలరొమ్ములలో బయలుదేరు కంతులు. స్తన్య సంబంధమైన గ్రంధులవద్ద బాధలు. మాంసగ్రంధులు గట్టిపడుట.

చర్మము:—మానని పుండ్లు, కురుపులు.

స్త్రీఅవయవములు:— గర్భాశయ కంతులతోనల్లగను ఎక్కువ దుర్వాసనగను యుండు రక్తస్రావమగుట. ఋతుశూలతోనుండు బహిష్టు. ఋతుశూల బాధకోర్వలేక రోగిమూర్ఛిల్లుట. ఋతుస్రావము వెడలుటకు ముందుగా శూలవచ్చుట.

పోలికలు:—సైలీషియా, ఆర్సెనికం ఆల్బం, కాల్కేరియా ఫ్లోరు, సిస్టసు, బేడియాగా, కాల్కేరియాఅయోడు, ఆర్సెనికం అయోడు, కోనియం, ఎస్టీరియాస్ రూబెన్సు, కార్బోయానిమలిసు.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

## 357. లితియం కార్బ్. LITHIUM CARB.

నిలువగాయున్న మేహవాతదోషములకును, హృదయదోషములకును, దీనిని వాడవచ్చును.

తల:—భోజనము చేయుచున్నప్పుడు తలనొప్పి వుపశమించుట (నేట్రింకార్బ).

ముక్కు:—ఎర్రగావాచియుండుట. ఇంటిలోనున్నపుడు ముక్కు పొడిగాను, బహిరంగమైన గాలిలోనికివెళ్లినప్పుడు తేమగానుఅగుచుండుట.

పురుషావయవములు:—దిక్కుగను, లికుపచ్చనపసుపుపచ్చన మిశ్రమపర్ణముగానుండు స్రావము.

స్త్రీఅవయవములు:—బహిష్టులో స్రావము ఒక్కసారిగా ఆగిపోవుటతో తలనొప్పివచ్చుట. బుతువు ఆలస్యముగాను, స్రావము కొలది గాను అగుట.

మూత్రావయవములు:—మూత్రనాళమునందుమంట. రాత్రియందు నిద్రించుచున్నపుడు అతి తరుచుగా మూత్రానుమానము గల్గుచుండుట. మూత్రము బురదనీటివలెను, అమముతో కలసియు, ఎర్రని గోధుమరంగు మిశ్రితముగానుండు మడ్డితో కలిసియు వెడలుట. మూత్రదోషములు హృదయదోషములతోను, మేహవాతదోషములతోను ద్వంద్వముగా నుండుట.

హృదయము:—మానసికోద్రేకమువలన ఎప్పటికప్పుడు గుండెలోదడ, నొప్పివచ్చుట. మూత్రవిసర్జనానంతరము గుండెనొప్పితగ్గుట.

కాళ్ళు, చేతులు:—వీటికండరములలోను, జాయింట్లలోను దెబ్బలుతగిలినట్లు నొప్పులుగాను బాధగానుయుండుట (హేమామెలిస్). చిన్న చిన్న కీళ్లసంధులలో నొప్పులు. వేళ్లచివర కణుపులు ఎర్రగావాచి, బాధగానుండుట.

చర్మము:—మేహవాతదోషముగలిగిన ప్రదేశమందు లేక పార్శ్వమందు చిన్నచిన్నపొక్కులతోకూడిన చర్మరోగము బయలుదేరుచుండుట. ఆర్చుకుపోయి, పొడిగాను, గరుసుగానుయుండుట.

ప్రకోపము:—కదలికవలన, వెచ్చనినీటివలన, రాత్రియందు, ముందుకువంగుటవలన, కుడివైపున.

ఉపశమనము:—విశ్రాంతివలన, బహిరంగమైన గాలిలో, లేచుటవలన, ఇటునటు తిరుగుటవలన.

పోలికలు:—ఎల్యూమినా, యాసిడు బెంజోయిక్, లైకోపోడియం, కాలీసైక్, లెడం, కామ్మొమిల్లా, కోనియం, ఆరం మెట్.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ.

---

## 358. మెగ్నీషియా కార్బ్. MAGNESIA CARB.

చిరచిరలాడుచుండెడు పిల్లలరోగములమీద నిది బాగుగా పనిచేయును. వీరిశరీరము పుల్లని వాసనవేయుచుండుట, వీరు రొమ్ముపాలు యెనోయొకజబ్బుతో బాధపడుచుండుట, గర్భాశయసంబంధమైన వ్యాధులు, ముట్లుడుగుకాలములో వచ్చురోగములు, స్త్రీరోగులలో నిస్త్రాణ—యివి దీనివుపయోగమును సూచించును.

మనస్సు:—భయముగాను, ఆతురతగాను ఉండుట. విచారగ్రస్తముగాను, మాట్లాడుటకు యిష్టములేకయు యుండుట.

తల:—వేడిగాలిలో తల యెక్కువ దురదగానుండుట. పండుకొనినపైపు తలవెంట్రుకలను లాగినట్లు నొప్పిగాయుండుట. కండ్లయెదుటనల్లని మచ్చలు కనిపించుచుండుట.

చెవులు:—మందముగా వినబడుట. పైపైపున తిమ్మిరగానుండుట.

ముఖము:—ఒక పార్శ్వమునందు చీల్చుచున్నట్లు నొప్పిగా నుండుట. ఇది విశ్రాంతిగా నున్నప్పుడు వుద్రేకముజెందుట; మరియు నిది కదలికవలన వుపశమించుట. గర్భిణీస్త్రీలలో పంటిపోటును మాన్పును. పంటిపోటు రాత్రియందును, చల్లదనమువలనను, స్థిమితముగా నుండునప్పుడును యెక్కువగుట. జ్ఞానదంతములు వచ్చునప్పుడు కలుగు రోగలక్షణములు (చైరాంతసు చైకే).

నోరు:—రుచి చేదుగానుండుట. నీటిపొక్కులవంటి పొక్కులు బయలుదేరుట. రక్తమువంటి లాలాజలము వూరుట. రాత్రియందు ఆర్చుకుపోవుట.

అన్నకోశము:—పండ్లను, కూరగాయలను, పుల్లని పదార్థములను కోరుట. పులితేన్పులు. చేదుగానుండు నీళ్లవంటి పదార్థమును వమనము చేసుకొనుట. మాంసమును తినుటయందు కోర్కెగలిగి యుండుట.

పొత్తికడుపు:—గురగురలాడుచుండుట. దిగలాగుచుండుట. బరువుగా నుండుట. ముడుచుకు పోయినట్లును, గిల్లుమన్నట్లును బాధ.

మలము:—విరేచనముకు ముందు పొత్తికడుపులో నమలుచున్నట్లు బాధగాను, శూలగాను వుండుట. ఆకుపచ్చగాను, నీళ్లవలెను, నురగగాను వెడలు విరేచనములు. నరముల నిస్త్రాణతో వచ్చు విరేచనబద్ధము. పోతపాలు, లేక డబ్బాపాలు అరగక, పాలే విరేచనమగుట.

స్త్రీ అవయవములు:— బహిష్టుకు ముందర గొంతుక నొప్పి, బొంగురుతనము వచ్చుట. బహిష్టు చాల ఆలస్యముగాను, స్రావము కొద్దిగాను, చిక్కగాను, తారువలె నల్లగాను, అగుచుండుట. కుసుమ రంగులేనట్టి స్రావమును పోలి వెడలుట. ఋతుస్రావము నిద్రలోను, లేక పరుండినప్పుడు మాత్రమే వెడలుచుండుట; నడచుచున్నప్పుడవక పోవుట.

శ్వాసాశయములు:—ఛాతీలో పొడుచుచున్నట్లు బాధ. గుండెదడ. ముడుచుకొని పోవుచున్నట్లు బాధగా నుండుట. వూపిరాడక పోవుట. వుప్పని రక్తజీరతో నుండు శ్లేష్మము వెడలుట.

నిద్ర:—తృప్తిగానుండని నిద్ర. పరుండునపుడుకంటె లేచుసరికి యెక్కువ అలసటగా నుండుట.

వృద్ధికము:—పడక వేడిమివలన, విశ్రాంతివలన, పాలవలన, బహిష్టులో, శీతోష్ణస్థితులమార్పులవలన, ప్రతి 3 వారములకు.

ఉపశమనము:—వెచ్చని గాలిలో, బహిరంగమైన గాలిలో నడచుటవలన.

సహచరులు:—కేమోమిల్లా.

విరుగుళ్లు:—ఆర్సెనికం ఆల్బమ్, మెర్క్యూరియసుసాల్, నక్సువామికా, పల్సటిల్లా, కేమోమిల్లా, రియం.

యాసిడు యెసెటికం—న కిది విరుగుడు.

పోలికలు:—క్రియసోటం, ఏలోస్, చేరాంథసు చేకీ.

మోతాదు:—6 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 40 లగాయతు 50 దినములు.

---

## 359. మెగ్నీషియా మూరు. MAGNESIA MURIATICA.

ఇది స్త్రీల రోగములమీదను, ముఖ్యముగా హిస్టీరియా మీదను, మర్మావయవ రోగములమీదను, పండ్లు సరిగా రానటువంటి పిల్లలకు పాలు జీర్ణము కానప్పుడును, బాగుగా పని చేయును. కాలేయ రోగములతో విరేచనబద్ధమున్నప్పుడిది బాగుగా పనిచేయును. నిలువగాయున్న కాలేయవ్యాధులు; వీటిలో బాధ వెన్నెముక లోనికిని, పొట్టవద్దకును, వ్యాపించుచున్నప్పుడును, యీనొప్పి భోజనానంతరమున నుండునప్పుడును, యిది బాగుగా పనిచేయును. గర్భాశయ రోగములు ఆజీర్ణముతోగూడి యున్నప్పుడివి పని చేయును. సముద్రస్నానముపలనవచ్చు దోషములను మాన్పును.

మనస్సు:—మాట్లాడుటయందయిష్టత. పరిశ్రమయందసహ్యత.

తల:—తలనొప్పివలన తల బ్రద్దలగుచున్నట్లుండుట; ఇది కదలిక వలనను, బహిరంగమైన గాలిలోను, వుద్రేకము జెందుట; మరియు నొక్కుటవలనను వెచ్చదనమునిచ్చు గుడ్డచుట్టుటవలనను వుపశమించుట (సైలీషియా). తలకు యెక్కువ చెమటపట్టుట (కాల్కేరియాకార్బ, సైలీషియా).

ముక్కు:—నాసికా రంధ్రములలో పుండ్లు పడుట. వాసన, రుచి తెలియకపోవుట, ముక్కునుండి స్రావము వెడలుచుండుట, దిబ్బడవేయుట, పరుండినపుడు వూపిరిని నోటితో పీల్చవలసి వచ్చుట.

నోరు:—పెదవులమీద నీటిపొక్కులు బయలుదేరుట. ఇగుళ్లువాచి

వీటినుండి రక్తము సులభముగా స్రవించుచుండుట. నాలుకను కాల్చివేసి నట్లు మంటగానుండుట.

అన్నకోశము:—ఆకలి లేకపోవుట, నోరు దుర్వాసనగా నుండుట. నోటిలోనికి తెల్లని నురగ వచ్చుచుండుట. పాలను జీర్ణము చేసుకొనలేక పోవుట. పిల్లలకు ఘుగ్గుపట్టినను గాని లేక పొత్తికడుపులోని కండరములలో నొక్కినను గాని మూత్రము వెడలకపోవుట.

పొత్తికడుపు:—కాలేయములో నొక్కుచున్నట్లు బాధగానుండుట. ఇది కుడిప్రక్కన పరుండుటవలన యెక్కువగుట. కాలేయము వాపుగాను కడుపు వుబ్బరముగాను వుండుట. పుట్టుకనుండి యున్నట్టిన్ని, వృషణముల లోనికి దిగునట్టిన్ని గిలకకుపని చేయును.

మూత్రావయవములు:—మూత్రము బహుకష్టముమీద వెడలుట. తినుకుటవలనను, నొక్కుటవలనను, మూత్రము వెడలుట.

మలము, మలాశయము:—పిల్లలకు పండ్లువచ్చుకాలములో గలుగు విరేచనబద్ధమును మాన్పును. పిల్లకుములము కొద్దికొద్దిగాను, వుండలవలెను, మేకపెంటికలవలెను వెడలుట.

స్త్రీఅవయవములు:—ఋతుస్రావము నల్లగాగడ్డలుకట్టి వెడలుట. పరిశ్రమవలనను, మలవిసర్జనయందును కుసుమసంబంధమైన స్రావము వెడలుచుండుట. బహిష్టులో యెక్కువ వుద్రేకముగలుగుట. నడుములోను తొడలలోను నొప్పులుగా నుండుట.

హృదయము:—కూర్చున్నప్పుడు గుండెదడ, గుండెలో నొప్పి వచ్చుట, ఇది కదిలికవలన వుపశమించుట (జల్సిమియం). హృదయరోగ ములు కాలేయము వాపుతో నుండునపుడు పనిచేయును.

శ్వాసావయవములు:— విడచివిడచి వచ్చు పొడిదగ్గు. దీనివలన ఛాతీలో నొప్పిగాను, మంటగాను వుండుట.

కాళ్ళు, చేతులు:— నడుములోను, చట్టలలోను, చేతులలోను, కాళ్లలోను నొప్పులుగానుండుట.

ఉద్రేకము:— భోజనము చేసిన క్షణమునకు, కుడివైపు పరుండుట వలన, సముద్రస్నానమువలన.

ఉపశమనము:— కదలికవలన, నొక్కుటవలన, బహిరంగమైన గాలిలో.

విరుగుళ్ళు:— కేంఫరు, కేమోమిల్లా.

మెర్క్యూరియసు— నకిది విరుగుడు.

పోలికలు:— నేట్రంమూరు, పల్సటిల్లా, సెపియా, కేమోమిల్లా

మోతాదు:— 3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 40 లగాయతు 50 దినములు.

---

## 360. మెగ్నీషియా ఫాసు. MAGNESIA PHOSPHORICA.

(మహాగ్నిష భాస్వరము. ష్యూస్లరుగారి ద్వాదశలవణములలో నిది ఎనిమిదవది)

ఇది శూల, తిమ్మెరలు పార్శ్వపునొప్పులు, పక్షవాతము, మూర్ఛ, ఋతుశూల, పంటిపలుపు మొదలగు నరముల సంబంధమైన బాధలమీద బాగుగా పని చేయును. మంచి దేహచ్ఛాయతోను నిస్త్రాణతోను యుండు వారికిని, కుడివైపు అవయవములమీదను, యిది బాగుగా పనిచేయును. దీనితో కాల్కేరియా ఫాసును మార్చుచు యిచ్చుచుండిన యెడల నరముల సంబంధమైన పలువిధ వ్యాధులమీద బాగుగా పనిచేయును.

మనస్సు:— మందమతిగా నుండుట. ఆలోచన చేయుటయం దయిష్టత. మానసిక లక్షణములలో కాలీఫాసుకును దీనికి సంబంధముయుండుట వలన యీ రెంటిని మార్చుచు వాడవలయును.

తల:— నరములసంబంధమైన తలనొప్పి. దీనిలో బాధలు పొడుచు చున్నట్లుండుట. మరియు నిది విడిచివిడిచి వచ్చుచుండుట. నొప్పి ఒక్క-

పార్శ్వమునకే కలిగిన యెడల దీనితో ఫెరంఫాసును మార్చుచు యివ్వ వలయును. ఉష్ణోపచారమువలన వుపశమించునట్టియు, శీతలోపచారముల వలన వుద్రేకించునట్టియు బాధల నిది మాన్పును.

కండ్లు:—మెల్లకన్ను. కండ్లనుండి నీళ్లుకారుట (నేటరియూసు). ఒకవస్తువు 2 వస్తువులుగా కనిపించుట.

చెవులు:—శబ్దనాడిలో దోషమువలన చెవులు మందముగా వినిపించుట. చన్నీటితో ముఖమును వడఃమును కడుగుకొనుటవలనవచ్చు చెవిపోటును మాన్పును.

ముక్కు:—ఎడమ నాసికారంధ్రము ఒరుపు.

ముఖము:—పార్శ్వపునొప్పి ఒకవైపునుండి మరియొక వైపునకు మారుచుండుట, బాధలు మెరపుతీగవలె అకస్మాత్తుగా వచ్చుచుండుట. మహావాతనొప్పులు.

నోరు:—నత్తిగాను, నెమ్మదిగాను మాట్లాడుట. జిగురుగానుండెడు లాలాజలమూరుచుండుట. పిల్లలకు పండ్లువచ్చుకాలములో గలుగుఫిట్లుతోగూడిన రోగముల (బాలపాపచిన్నె) మీద బాగుగా పనిచేయును. పంటిసలుపును మాన్పును.

గొంతుక:—రాత్రియందు వుద్రేకించు కోరింతదగ్గును మాన్పును. పొడిదగ్గు విడిచివిడిచి వచ్చుచుండుట.

అన్నకోశము:—ఎక్కిళ్లను మాన్పును. రాత్రింబగళ్లు ఓకరింపు వచ్చుట. మంటతోగూడిన త్రేణుపులు వేడినీళ్లు త్రాగుటవలన వుపశమించుట. కడుపు వుబ్బరింపుగాను, ముడుచుకొని పోవునట్లును వుండుట. తలతిప్పును, వమనములనుమాన్పును.

పొత్తికడుపు:—జిగటవిరేచనముల వలన నమలుచున్నట్లును, గోకుచున్నట్లును బాధగానుండుట. గుడగురలాడుచుండుట. వాయువు చేరుట వలన వుబ్బరముగా నుండుట,

మలము, మలాశయము:——నీళ్లవిరేచనములు, వమనములు, వీటితో పిక్కలులాగుట, చలి వచ్చుట, కడుపులో బాధగానుండుట. జిగట విరేచనములు. మలము గట్టిగా ఆరుచుకుపోయి గోధుమవర్ణముగాను, బాధతోను వెడలుట.

మూత్రావయవములు:——చిన్న చిన్న రాళ్లు మూత్రములో కలిసి బాధతో వెడలుచుండుట (నేట్రం.సల్ఫు). నరముల వుద్రేకమువలన నిద్రలో మూత్రము అప్రయత్నముగా వెడలుటను మాన్పును. మూత్రము అణచిపెట్టబడుట, లేక బంధింపబడుట.

పురుషావయవములు:——శెగ రోగమువలన మూత్రనాళము కప్పబడుట. మూత్రద్వారములో కోయుచున్నట్లును నొక్కుచున్నట్లును నొప్పిగా యుండుట. సంభోగేచ్ఛ యెక్కువగుట.

స్త్రీఅవయవములు:——ఇది ఋతుశూలకు ప్రధాన ఔషధము. ఋతుస్రావము వెడలుటకు ముందరగా శూల వచ్చునప్పుడును, మరియు శూల విడిచివిడిచి వచ్చుచున్నప్పుడును, యిది పని చేయును. బాధత్వరగా మాననియెడల కాలీఫాసునుకూడ మార్చుచు యివ్వవలయును. బాధలు ప్రసవవేదనలోవలెను, వృష్ణోపచారమువలన వుపశమించుచును యుండుట. సూతికసంబంధమైన కంపములను మాన్పును. మావిని వెలువరించును. గర్భిణీస్త్రీలకు గర్భముదాల్చినది మొదలు యివ్వవలసిన 4 ఔషధములలోను ఇదియొకటి. తక్కినవి (1) కాల్కేరియాఫ్లోరు, (2) కాల్కేరియాఫాసు, (3) కాలీఫాసు.

శ్వాసావయవములు:——తేరణుపులతోను, ఛాతీలో బాధతోను వచ్చు వుబ్బసపు దగ్గును మాన్పును. దగ్గుఫిట్టులోవలె విడిచివిడిచి వచ్చుచుండుట. కోరింత దగ్గుకు దీనిని, కాలీమూరును, మార్చుచు యివ్వవలయును. వూపిరినొప్పికిని గొంతుక బొంగురుతనమునకును పని చేయును.

హృదయము:——నరములదోషముతోగూడిన గుండెదడను మాన్పును.

మెడ, నడుము, కాళ్లు చేతులు:—నరములకు సంబంధించిన బాధలు పొడుచుచున్నట్లుండుట. పక్షవాతము మొదలగు కంపములతో నుండు రోగములమీద పనిచేయును. పిక్కలు లాగుచుండుట. వ్రాతగాండ్రవ్రేళ్లు వంకరపోవునపుడు దీనిని వాడవలయును.

నిద్ర:—నరముల సిస్త్రాణవలన నిద్రపట్టకపోవుట. బాధకరమైన కలల వలన నిద్రచెడిపోవుట.

జ్వరము:—దినమువిడచి దినము వచ్చుచుండుట. సాయంకాలము భోజనానంతరము వచ్చు చలి, కుడుపుమీద పనిచేయును. చలి వెన్నెముక పొడుగునను పైకిని క్రిందకును ప్రాకుచుండుట.

చర్మము:—మంగలికత్తి వలనగలుగు దురదతో గూడిన మంటు రోగమును మాన్పును. ఆనికాయలలో కుట్టుచున్నట్లు బాధగాను, మంటగాను యుండుట దద్దురులు బయలుదేరుట.

వుద్రేకము:—కుడివైపున, జలుబువలన, చలిగాలివలన, తాకుడు వలన, కదలుటవలన, చన్నీటితో కడుగుటవలన.

వుపశమనము:—వెచ్చదనమువలన, నొక్కుటవలన, శరీరమును వంచుటవలన, మర్దనమువలన.

విరుగుళ్లు:—బెల్లడోనా, జెల్సిమియాం, లెకెసిస్.

పోలికలు:—కేమోమిల్లా, కొలోసింథిస్; పల్సటిల్లా, సేక్ కేనినం, కాలోఫైలం, కేక్టను, జల్సిమియం, జాంతోజైలం, లైకోపోడియం, నేట్రింమూరు, సైలీషియా.

మోతాదు:—3x మొదలు 1,00,000 పొటెన్సీ. 3x, 6x, 12x పొటెన్సీలలో పొడుము లేక బిళ్లల రూపమున బాగుగాపనిచేయుచున్నది. ఇది 6x పొటెన్సీవరకు ఆగకులోను మాత్రిలలోను తయారవడు.

## 361. మెగ్నీషియా సల్ఫ్. MAGNESIA SULPH.

నీళ్ళవిరేచనములు, అతిమూత్రము, వమనములు, వికారము, జిగట విరేచనములు, పంటిసలుపు—వీటిమీదనిది ముఖ్యముగా పని చేయును

తల:—అన్ని విషయములలోను చెడుతలంపులు కలుగుట. ఆతురత. మరణము సమీపించుచున్నదనుకొనుట. తలదిమ్మ, భారము. బహిష్టులో తలబరువు. కండ్లు మంటలుగాను, నొప్పులుగానుయుండుట. దృష్టి మాంద్యము. చెవిలోపోట్లు, ధ్వనులు.

ముక్కు:—రాత్రియందు ముక్కునుండి రక్తస్రావమగుట; ఇందు వలన తలనొప్పి వుపశమించుట.

నోరు:—పొడిగానుండుట. తిమ్మిరిగానుండుట. నాలుక గరుకు దేరుట. నీళ్ళూరుట.

అన్నకోశము:—చెడిన గృడ్లవాసనను పోలిన త్రేంపులు. పులియ గొట్టుట. ఆహారమునందియిష్టత. తినిన ఆహారమును ముందుగాను అటు పిమ్మట ఆమమును వమనము చేసుకొనుట.

పొత్తికడుపు, మలము, మలాశయము:— గుడగుడలు. పిల్లలలో పులిసిన లక్షణములతో విరేచనములగుట. క్రిమిదోషము.

స్త్రీ అవయవములు:—ఋతుస్రావము చాల ముందరగాను విస్తారముగాను, చిక్కగాను, నల్లగాను వెడలుట. బహిష్టుకు బహిష్టుకు మధ్య ఋతుస్రావము వెడలుచుండుట. చిక్కగను విస్తారముగాను వెడలు కుసుమ. నడచుచున్నప్పుడు కుసుమ మంటగాస్రవించుట. 14 దినములకే బహిష్టు అగుచుండుట.

జ్వరము:—వుదయమున 9 లగాయతు 10 వరకు చలివచ్చుట. తల వెచ్చన మరియు తక్కిన శరీరమంతయు చల్లన.

మోతాదు:— 3 మొదలు 30 పొటెన్సీ.

## 36½. మేంగనం ఎసెటిక్. MANGANUM ACETICUM.

కాలేయమునందు కొవ్వుచేరుటతో నిది దుస్థితిజెందుట, రక్తకణము లందలి యెఱ్ఱుపనము తగ్గి, శరీరముపాలిపోవుట, కామెర్లరోగము, శరీరము నను నీరుపట్టుట, మేహవాతదోషములు, సవాయిజీర్ణించుటవలని పలువిధ ములగు లక్షణములు, పక్షవాతకోపము, యిట్టి కఠినరోగములమీద నిది బాగుగా పనిచేయును.

మనస్సు:— విచారముగానుండుట. జ్ఞానేంద్రియములు మందముగా పనిచేయుట. పరధ్యానముతో నుండుట.

తల:— కూర్చున్నను నిలుచున్నను వికారమువచ్చుట. తలపెద్దదై నట్లు బరువుగాతోచుట. తలలో వుడుకుబయలుదేరుట, దీనితోపాటు దాహము గొనుట.

కన్నులు:— దృష్టిమాంద్యము. మంటలుగాను ఆర్చుకుపోయినట్లును వుండుట. వుదయమున కనురెప్పలంటుకొనుట. కనురెప్పలువుబ్బుట. దూరపువస్తువులు అనకపోవుట.

ముక్కు:— ఆర్చుకుపోవుట. దిబ్బడవేయుట. ఒరియుట. జలుబు చేయుట.

చెవులు:— ముక్కుచీదినయెడల పటపటశబ్దమువినపించుట. దిబ్బడ వేయుట. తేమగాలిలో మాటవినబడక పోవుట. బాధలు యితర అవయవ ములనుండి చెవులవరకు వ్యాపించుట. ధ్వనులు వినిపించుచుండుట.

ముఖము:— పాలిపోవుట, ఎండిపోవుట, పెదవులు ఆర్చుకుపోవుట. భోజనానంతరము దవుడలలో నొప్పులు.

ఆహారనాళము:— నాలుక పుండ్లుపడి, బాధగానుండుట. నాలుక పై కాయలు బయలుదేరుట. పొట్ట వుబ్బరింపు. పైత్యదోషములు. వుదయ మున నోరు పట్టివాసనవేయుట. దాహములేకుండుట. భోజనము తృప్తిగా చేసినపిమ్మటవలె ఆహారమునందయిష్టత. పులియగొట్టుట. కాలేయము

వాపు నిలువ గా యుండుట. బొడ్డువద్దనొప్పి. ఎక్కువ గా అపానవాయువు వెడలుట. అతివిరేచన బద్ధము.

మూత్రావయవములు:—తరుచు మూత్రానుమానము. ఫూదారంగు గాను మట్టిపలెను యుండు సుద్దితో కలిసిన మూత్రము వెడలుట.

స్త్రీ అవయవములు:—బహిష్టు త్వరితముగాను, స్రావము తక్కువ గాను అగుట. ముట్టుడుగు సమయమున తరుచుగా వుడుకు తగులుచుండు ట బహిష్టుకు బహిష్టుకు మధ్య రక్తస్రావములు.

కాళ్లు, చేతులు:—శరీరమందంతటను, ఏ అవయవమును గాని, పార్శ్వమును గాని ముట్టుకొనిన నొప్పిగానుండుట. ముందుకువంగి నడుచుట. ముందుకు పడిపోవునట్లుండుట. ఎముకలలో నొప్పులు. చీలమండల లో నొప్పులు, మోకాళ్లు దురద, బాధ. కీళ్లసంధులలో మంటలు బాధలు వచ్చుట.

నిద్ర:—సాయంత్రమున పెందలకడనే నిద్రవచ్చుట.

చర్మము:—గోకినచో దురదతగ్గుట. జాయింట్లలో చీముపట్టిన పుండ్లు. పుండ్లు సులభముగా మానకుండుట. మంటలుగా నుండుట.

జ్వరము:—శరీరమునొప్పులు, ఛాతీలోనుబుగ్గలలోను వెచ్చదనము. వక్కసారిగా ముఖమునకు శరీరమునకు వుడుకుతగులుట. ఆయాసముతో గూడిన అతిచమట. రాత్రియందు చమటలుపోయుట (యిది క్షయరోగ చిహ్నములను సూచించును). నాడి ఒక్కరీతిగానుండకపోవుట.

వృద్ధికము:—చల్లనితడిగాలిలో, గాలిమార్పులవలన.

వుపశమనము:—పరుండుటవలన, సాగతాగుటవలన.

విరుగుళ్లు:—కాఫీ, మెర్క్యూరియసు.

పోలికలు:— రూస్టాక్సు, సల్ఫరు, ఆర్జెంటంమెట్, కుప్రింమెట్, లైకోపోడియం, కాలీఅయోడు, ఎసాఫొటీడా.

మోతాదు:—6x మొదలు 30 పొటెన్సీ.

## 363. మెర్క్యూరియసు—మెర్క్యూరియస్ సాల్యూబిలిస్.

## MERCURIUS—MERCURIUS SOLUBILIS.

(ఇది యాంటి సిఫిలిటిక్ ఔషధము).

ఎముకలు, మాంసగ్రంధులు, మర్మావయవములు, శ్వాసావయవములు—వీటికి సంబంధించిన రోగములమీద నిది బాగుగా పని చేయును. మూత్రము, విరేచనము, చెమట మొదలగు స్రావములు దుర్వాసనతో నుండుట, నోటినుండి దుర్వాసన వచ్చుచుండుట, ఎముకలవ్యాధులలో బాధలు రాత్రియందు ఉద్రేకము జెందుట, రోగి అధికమైన చల్లదనము, వెచ్చదనముకూడభరింపజాలకుండుట, జిగటవిరేచనములు, రోగి క్రమక్రమముగా క్షీణదశకు వచ్చుచుండుట—ఇవి దీని ప్రయోగమునుసూచించును.

మనస్సు:—నెమ్మదిగా సమాధానము చెప్పుట. ప్రాణముయెడల విసుగు జెందుట. జ్ఞాపకశక్తితగ్గుట. దృఢసంకల్పము లేకపోవుట. తొందరగామాట్లాడుట. సంధిలో గొణుగు కొనుచుండుట. తనకేదియో అపాయము రానున్నదనితోచి పారిపోవలయునని కోర్కెగలిగియుండుట.

తల:—వెల్లగిల పరుండినప్పుడు వికారముగానుండుట. తలచుట్టూ బద్దీ కట్టబడియున్నట్లు తోచుట. ఒక పార్శ్వమునందు చీల్చుచున్నట్లు బాధగానుండుట. గోకుడుకురుపులు బయలుదేరుట. వెంట్రుకలూడిపోవుట. పిల్లలతలకు చెమట పట్టునప్పుడిది పని చేయును.

కన్నులు:—వాచుట, యెర్రబడుట, బాధగానుండుట, వెలుతురు చూడలేకపోవుట, నీళ్లుకారుట, మంటగానుండుట, ఒరియుట, కనురెప్పలు అప్పుడప్పుడు మూతలుబడుట, వాచుట, చూచుచున్నప్పుడు కండ్లు బలవంతముగా మూయబడుటవలన వస్తువులు సరిగా అవకపోవుట. దృష్టి మందగించుట. కండ్లయెదుట మబ్బువలె నుండుట. సవాయి దోషమువలన కనీనికాపటలము వాచుట, బాధగా నుండుట. రాత్రియందు కన్నులలో పొడుచుచున్నట్లు బాధగా నుండుట.

చెవులు:—పసుపుపచ్చని, చిక్కని, రక్తముతోను, దుర్వాసన గాను, ఉండునట్టి స్రావమువచ్చుట, కురుపులు వేయుచుండుట, పోటుచు చున్నట్లు బాధగా నుండుట.

ముక్కు:—ఎండలోనున్నప్పుడు తుమ్ములు వచ్చుచుండుట. పసుపు పచ్చగాను, ఆకుపచ్చగాను, దుర్వాసనతోను, చీముకలెను, స్రావము వెడ లుచుండుట. పుల్లని, చిక్కని స్రావము వెచ్చనిగదిలో యున్నపుడు యెక్కువగా వెడలుచుండుట. తుమ్ములవలన ముక్కు గరుకుగానగుట, మంటగానుండుట.

ముఖము:—పాలిపోయి బూడిదరంగుగా వుబ్బుట. ముఖములోని యెముకలు పుచ్చుట. సవాయి సంబంధమైన పొక్కులు లేచుట.

నోరు:—పండ్లు కదలుట, నల్లబడుట, పుచ్చిపోవుట. పండ్లమీద ఇగుళ్లు లేనట్లుండుట. పండ్లకు నాలుక తగులుటవలన నొప్పివచ్చుట. నోటి నుండి దుర్వాసనవచ్చుట. నాలుక యెఱ్ఱగాను, వాపుగాను, పుండ్లతోను వుండుట. ఒకప్పుడు నాలుక నల్లగాను, వాపుగాను, వంచలు యెఱ్ఱగాను లేక తెల్లని పూతతోను యుండుట. నీళ్లు వూరుచుండుట. లాలాజలగ్రం థులు వాచి బాధగానుండుట. రుచి రాగిరుచిగానుండుట. ఒకప్పుడు యిది తియ్యగాను, పుల్లగాను, చేదుగాను, లోహపురుచిగాకూడ వుండుట. నోటి యొక్క దుర్వాసన గది అంతయు వ్యాపించుట, నోరు తేమగాను, యెక్కువ దాహముగాను యుండుట.

గొంతుక:—గాలిమార్పులతోవచ్చునట్టిపుండ్లు. గుటక వేయునపుడు చెవులలో కుట్టుచున్నట్లుండుట. గవదకాయలు చీముపట్టుటవలన గుటక వేయుట కష్టముగా నుండుట. కొండనాలుక పెద్దదగుట. గొంతుక బొం గురుపోవుట. సవాయిసంబంధమైన పుండ్లను మాన్పును.

అన్నకోశము:—కుళ్లిన రుచితోగూడిన త్రేనుపులు. ఎక్కిళ్లు. చల్లని పానీయములకొరకు యెక్కువ దాహము గలుగుట. జీర్ణశక్తితగ్గుట.

ఆకలి హెచ్చుట. తాకుటవలన నొప్పిగా యుండుట. భోజనానంతరము పొట్టలో రాయి పెట్టినట్లు బరువుగానుండుట.

పొత్తికడుపు:—ఉబ్బరింపుగాను, బాధగాను యుండుట. కాలేయము వాచి, గట్టిపడి, పెద్దదగుట. ముట్టుకొనుటకు నొప్పిగా నుండుట. పైత్యరసము తక్కువగా స్రవించుట. కామెర్లరోగము. కుడిగజ్జలలో పొడుచుచున్నట్లు నొప్పిగా యుండుట. గజ్జలలోని మాంసగ్రంధులు వాచుట, చీముపట్టుట. సవాయిసంబంధమైన బిళ్లలు.

మలము, మలాశయము:—తారువలె నల్లగాను, చిక్కగాను, అజీర్ణముతోను ఒకప్పుడు పసుపుపచ్చగాను, ఆకుపచ్చగాను, ఆమముతోను, రక్తముతోను, పుల్లనివాసనతోను, ఆసనములో ఒరుపును గలుగజేయుచును, మట్టిరంగుగాను, విరేచనములగుచుండుట. విరేచనమైన పిమ్మట ఆసనములో తీపుగా నుండుట. జిగటవిరేచనములను కట్టును. మలము గట్టిగా వెడలుటకు ముందును, వెడలుచున్నప్పుడును, వెడలిన పిమ్మటను, రక్తము స్రవించుచుండుట. విరేచనానంతరము మలాశయము వెలుపలకు వచ్చుట. క్రిములు లేక నులిపురుగులు వెడలుచుండుట.

మూత్రావయవములు:—మూత్రనాళము మంటగానుండుట. శెగరోగము. శిశ్నాగ్రచర్మము వాచుట, పుండ్లుపడుట. శెగలో స్రావము చిక్కగాను, ఆకుపచ్చగాను లేక పసుపుపచ్చగాను వెడలుట. ఆకుపచ్చని స్రావము రాత్రియందు బాధ లేకుండగ వెడలుట. మూత్రము ముదర రంగుగాను, కొలదిగాను, రక్తజీరతోను, శ్వేతధాతువుతోను వెడలుట. రక్తముకలసి వెడలునట్లుగా మూత్రము యెర్రగా వెడలుట. మూత్రపిండములవాపు, బాధ.

పురుషావయవములు:—సంభోగశక్తి పూర్తిగా నశించుట. అంగముమీద సుఖవ్యాధుల సంబంధమైన పుండ్లు, పొక్కులు మొదలగునవి గలుగుట, అంగము వాచుట, బాధగా నుండుట,

స్త్రీ అవయవములు:—ఋతుస్రావ మెక్కువగా వెడలుట. పొత్తి కడుపులో నొప్పులుగా నుండుట. బహిష్టులో నున్నప్పుడు స్తనములలో బాధగా నుండుట. స్తన్యము పుష్కలముగా నుండుట: ఋతువు అణచి పెట్టబడుట. కుసుమ ఒరుపును గలుగజేయును, ఆకుపచ్చగాను, యెర్రని రక్తమువలెను, వెడలుట. గర్భాశయమునందును, స్తనములలోను బయలు దేరు పుట్టవ్రణమునకు పనిచేయును.

శ్వాసావయవములు:—క్షయలో రక్తముతో గూడిన శ్లేష్మము వెడలుట. మెట్లెక్కుట వలనను నడచుట వలనను వూపిరందకపోవుట. రెక్కయెముకలోనుండి ఛాతీలో కుడివైపునకు పొడుచు చున్నట్లుండు బాధలు వ్యాపించుట. ఛాతీలో మంట గొంతుకలోనికి వ్యాపించుట. వూపిరితిత్తులు వాచి పెద్దవగుట. యెడతెగని నీళ్లవంటి స్రావము వెడలు చుండుట. గొంతుక బొంగురుతనమును మాన్పును. కోరింతదగ్గులో ముక్కు నుండి స్రావము గలుగునప్పుడు పనిచేయును (ఆర్నికా).

హృదయము:—కొలది పరిశ్రమ వలననుగూడ గుండెదడ వచ్చుట.

నడుము, కాళ్లు, చేతులు:—మాంసగ్రంధులు వాచుట, బాధగా నుండుట. అవయవములు కంపించుట. అప్రియత్నముగా అవయవములు కదులుచుండుట. నిస్త్రాణగాను, విసుగుగాను యుండుట, భుజములోను, గుత్తులలోను కదలికవలన పొడుచుచున్నట్లు బాధగా యుండుట. అవయవములమీద చల్లని చెమటపట్టుట. వుబ్బుట, లేక నీరుపట్టుట. చేతులమీద చిడుమువంటి చర్మరోగములు బయలుదేరుట.

చర్మము:—కామెర్లరోగము. పసుపుపచ్చగా నుండుట. నీటి పొక్కులు బయలుదేరుట. పుండ్లనుండి సులభముగా రక్తము స్రవించుట. పుండ్లవంచలు మాంసపుముద్దవలెనుండుట. సుఖాయివ్యాధియొక్క ప్రథమ, ద్వితీయ అవస్థలమీద బాగుగా పనిచేయును. గుండ్రటి రాగిరంగుమచ్చలు బయలుదేరుట. విస్తారముగా చెమట పట్టుట.

నిద్ర:—రాత్రింబగళ్లు యెక్కువ నిద్రమత్తుగానుండుట. [illegible]

లైన కలలు వచ్చుచుండుట. నిద్రలో మూల్గుచుండుట. నిద్ర ఆలస్యముగా పట్టుట, తిరిగి వుదయమున త్వరితముగా మెలకువ వచ్చుట.

జ్వరము:—బహిరంగమైన గాలిలోను, విరేచనమునకును విరేచనమునకును మధ్యకాలములోను, పరుండినపిమ్మటను చలి వచ్చుచుండుట. చలి సాయంకాలమునందు పాకుచున్నట్లుండినను కుదుపును గలుగజేయక పోవుట. ఒకప్పుడు వెచ్చగాను, మరియొకప్పుడు చలిగాను యుండుట. రాత్రియందు ప్రతివిరేచనమునకు పిమ్మటను చెమటపట్టుచుండుట. చెమట చల్లగాను, నూనెవలెను, దుర్వాసనతోను, వస్త్రములకు పసుపుపచ్చని రంగును కలుగజేయుచు వెడలుట. నాడి చురుకుగానుండుట. ఒకప్పుడు మందముగాను వణకుచున్నట్లును వుండుట.

వృద్ధికము:—రాత్రియందు, పడక వేడిమివలన, చల్లని గాలివలన, చమటపట్టినపిమ్మట.

వుపశమనము:—ఏకుపువలన, విశ్రాంతివలన, సంభోగమువలన.

సహచరులు:—బేడియాగా.

విరుగుళ్లు:—హెపారుసల్ఫ, ఆరం మెటాలికం, మెజీరియం, యాసిడ్ నైట్రిక్, కేంఫర్, ఆర్నికా, బెల్లడోనా, కార్బోవెజ్, నక్సువామికా, కుప్రం మెట్, ఆర్సెనికం ఆల్బమ్, నేట్రం మూరు, కాలీఅయోడ్, సల్ఫరు, స్టాఫిసేగ్రియా, డల్కమారా, లెకెసిసు, కాల్కేరియాకార్బ, చైనా, ఓపియం.

విషపురుగులు కుట్టుట, పంచదార తినుటవలని దోషములు, యాంటింటార్టు, ఆరం మెట్, లెకెసిసు, బెల్లడోనా, ఓపియం, ఫైటొలక్కా, వెలీరియానా, చైనా, గల్కమారా, తూజా, మెజీరియము—లకిదివిరుగుడు.

దీనిని సైలీషియాకు ముందరగాని వెనుకగాని వాడరాదు.

మోతాదు:—$3_X$ మొదలు 1,00,000 పొటెన్సీ. 1, 2, పొటెన్సీలలో కురుపులను పక్వమునకు తీసకొని వచ్చుటకు పనికివచ్చును. మరియు చిన్నపొటెన్సీలలో సవాయి లక్షణములమీదను, కంటిరోగములమీదను

పని చేయును. పెద్దపాటెన్సీలలో ఆహారనాళమును సంబంధించిన రోగములమీద బాగుగా పనిచేయును. జిగట విరేచనములకు $3_X$ మొదలు $6_X$ వరకు పొడుము రూపమున బాగుగా పనిచేయుచున్నది. దీని గుణకాలపరిమితి 2 మొదలు 3 వారములు.

---

## 364. మెర్క్యూరియస్ బిన్ అయోడ్— మెర్క్యూరియసు అయోడేటసు రుబర్.

## MERCURIUS IODATUS RUBER— MERCURIUS BIN IODATUS.

దీనిని డిఫ్తీరియాకును, గొంతుకపుండ్లకు, బాధలకు, మాంసగ్రంధుల వాపులకును వాడవచ్చును. పిల్లలకు జలుబు చేసినపుడును, నిలువగాయున్న సవాయిదోషములమీదను, చీముస్రవించుచుండునట్టి సవాయిసంబంధమైన బిళ్లలకును, గట్టిగా నుండునట్టి సవాయిపుండ్లకును, వాడవచ్చును. టాన్సిల్సు లేక గవదకాయలు వాచుట, పెద్దవగుట— ఈలక్షణములను మాన్పుటలో నిది అగ్రగణ్యమైనది. ఇది ఎడమవైపున వచ్చు రోగలక్షణములమీద పనిచేయును.

ముక్కు:— ముక్కునుండి స్రావము వచ్చుట, మాట ముందముగా వినబడుట. కుడినాసికారంధ్రము పెచ్చగా నుండుట.

నోరు:— ఇగుళ్లు వుబ్బుట. మాంసగ్రంధులు వాచుట. పండ్లసలుపు. నోటిలో నీళ్లు యెక్కువగా వూరుట. నాలుక గట్టిపడుట; మరియు దీనిని కదల్చుటవలన నొప్పివచ్చుట.

గొంతుక:— మెడ, గొంతుకలోని కండరములు కొయ్యబారుట, కొండనాలుక పొడుగగుటవలన దగ్గువచ్చుట, ఎడమగవదకాయవాచుట.

చర్మము:— చిన్నచిన్నపుండ్లు, పక్కుల్లు బయలుదేరుట. సవాయిసంబంధమైన పుండ్లు, బిళ్లలు. అండములలో కంతులు బయలు దేరుట.

విరుగుళ్లు:— హెపాస్ సల్ఫ్.

పోలికలు:—యాసిడు నైట్రికం, కాలీ బైక్, మెర్క్యుకర్, హెకెపిసు,

మోతాదు:—3x మొదలు 200 పొటెన్సీ.

---

## 365. మెర్క్యు కర్. MERCURIUS CORROSIVUS.

మర్మావయవములు, గొంతుక, పొత్తికడుపు, ఆంత్రములు, మూత్రావయవములు—వీటికి సంబంధించిన రోగములమీదనిది బాగుగా పనిచేయును. రక్తవిరేచనములను, ఆసనము తీపును మాన్పును.

మనస్సు:— విచారగ్రస్తముగా నుండుట. పరాకు మాటలు.

తల:—వికారము. చల్లగాను, చల్లని చెమటతోను నుండుట. ముందరకు వంగినప్పుడు వికారముగాను, తలతిప్పుగాను యుండుట.

కండ్లు:—సవాయిరోగముపలన కనీనికా పటలములో బాధ. కాచబింబముపైని లోతైనపుండ్లు. సవాయిరోగుల కండ్లజబ్బులను మాన్పును. కండ్ల కలకలు. కండ్లు ఎఱ్ఱబడుట, వాచుట.

చెవులు:—వాపు, బాధ, పోటుగా నుండుట. సరేసు (Glue) వలెనుండు స్రావము, దుర్వాసన వచ్చుట. తరుచు రక్తము స్రవించుచుండుట. నీళ్లవంటి స్రావము వచ్చుచుండుట

ముఖము:—పాలిపోయి, ముడుచుకొని పోయినట్లుండుట. బుగ్గలు, ముఖము కందుట, ఉబ్బుట, గట్టిగాను ఎఱ్ఱగాను కందబారుట, ముఖమునకు నీరు పట్టుట.

నోరు:—పండ్లు కదులుట, వూడిపోవుట, గారపట్టుట; ఇగుళ్లు వుబ్బుట, స్పంజివలె మెత్తగానుండుట; మరియు వీటినుండి సులభముగా రక్తము కారుట, పుండ్లుపడుట; నాలుకమీద తెల్లగాను, దళసరిగాను వుండునట్టి ఆమముతోగూడిన పూత. నాలుక వాచుట, బాధగానుండుట. నోరు యెఱ్ఱగా వాచుట, బాధగానుండుట, ఆర్చుకొనిపోయి యుండుట.

ఆమత్వచలపైని పుండ్లుపడుట, వీటినుండి స్రావముగలుగుట. నోటిలోని పుండ్లు, గొంతుక, ఇగుళ్ళు—వీటినుండి దుర్వాసన వచ్చుట.

గొంతుక:—కొండనాలుక యెఱ్ఱగా వాచుట, పొడుగగుట, గవద కాయలు వాచుట, పుండ్లుపడుట. సూదులతో గుచ్చుచున్నట్లు బాధ.

అన్నకోశము:—కడుపులో మంట బయలుదేరి నోటివరకు వ్యాపించుట. రక్తజీరతోను, పసరికగాను, లేక పైత్యముగాను అగునట్టివమనములు.

పొత్తికడుపు:—వుబ్బరించి నొప్పిగా యుండుట.

మలము, మలాశయము:—ఆకుపచ్చగాను, పసుపుపచ్చగాను, జిగటతోను, రక్తముతోను, వెడలునట్టి విరేచనములను కట్టును. విరేచన బద్ధము. విరేచనము గట్టిగా వెడలుట. రక్తవిరేచనములతోపాటు వమనము లగుచుండునపుడు పనిచేయును.

మూత్రావయవములు:—మూత్రము అణచిపెట్టబడుట. మూత్రకోశములో తీపుగానుండుట. మూత్రము కొలదిగాను, వెచ్చగాను, రక్తముతోను, యెక్కువ బాధతోను, చుక్కలుచుక్కలుగాను వెడలుచుండుట. శ్వేతధాతువు మూత్రములో పోవుచుండునపుడు పనిచేయును. శెగ సంబంధమైన స్రావము మొదట పల్చగాను, తరువాత చిక్కగాను ఆకుపచ్చగాను, రాత్రియందు యెక్కువగాను, మంటతోను, మూత్రముతో వెడలుచుండుట. ఇసుకపొడివంటి మడ్డితో వెడలు మూత్రము. చిన్నచిన్న మాంసపు ముక్కలను పోలియుండు చిక్కని ఆమము మూత్రములో కలసి వెడలుచుండుట.

పురుషావయవములు:—అంగము, అండములు యెక్కువగా వాచుట. సవాయిపుండ్లు దళసరెక్కి వీటినుండి పల్చని స్రావము వచ్చుచుండుట. సవాయి సంబంధమైన బిళ్ళలు.

స్త్రీ అవయవములు:—శెగసంబంధమైన ఆకుపచ్చని స్రావము. కుసుమ పాలిపోయినట్లుండు పసుపుపచ్చని రంగుగాను, తియ్యని వాసనగాను యుండుట. ఋతువు ముందరగాను, స్రావమెక్కువగాను అగుట

శ్వాసావయవములు:— క్షయసంబంధమైన దగ్గుతోనుండు రక్త స్రావము, జ్వరము, గొంతుక బొంగురు పోవుట.

హృదయము:—నిద్రలో వడగానుండుట. నాడి సన్నముగాను, నిస్త్రాణగాను, ఒకప్పుడు దుడుకుగాను యుండుట.

చర్మము:—సవాయియొక్క ద్వితీయావస్థలో వచ్చు దద్దురులు, పొక్కులు. లోతైనపుండ్లు కుళ్లనారంభించుట. యెఱ్ఱగాను వెచ్చగాను యుండుట.

జ్వరము:—పరిశ్రమవలన చలివచ్చుట, శరీరము చల్లగాను, శరీర మంతటను, ముఖ్యముగా నుదిటియందును, విస్తారముగా చల్లనిచెమట పట్టుట; ఇట్టిచెమట రాత్రియందెక్కువగా నుండుట. నాడి నిస్త్రాణగా నుండుట. చర్మము మంటగాను, కుట్టుచున్నట్లు బాధగాను యుండుట.

వృద్ధికము:—రాత్రియందు, సాయంకాలమందు, గాఢముగా వూపిరి పీల్చుట వలన.

వుపశమనము:—వెచ్చని చెమటవలన, కూర్చున్నపిదపలేచుటవలన.

పోలికలు:—ఆర్సెనికంఅల్బం, లెకెసిస.

విరుగుళ్లు:—కాల్షియం సల్ఫైడ్, కోడిగుడ్డులోని తెల్లనిసొన, సైలీషియా, మెర్క్యుసాల్, సేపియా, లాబీలియా ఇన్ఫ్లేటా, హెపారు సల్ఫు, యాసిడునైట్రిక్.

మోతాదు:—3 మొదలు 1,000 పొటెన్సీ.

---

## 366. మెర్క్యూరియసు డల్సిస్. MERCURIUS DULCIS.

ఆమత్వచలనుండి (ముఖ్యముగా కండ్లయొక్కయు, చెవులయొక్కయు) కలుగు స్రావములమీద పనిచేయును. అంత్రములు, కాలేయము—వీటియొక్క దోషములమీద పనిచేయును.

తల:—రసదోషమువలన తలవెంట్రుక లూడిపోవుట. కంటి రోగములు పరిశ్రమవలన వృద్ధికించుట.

చెవులు:— చెవినుండి చీము వచ్చుచుండుట (కాలీమూరు). చిన్న పిల్లలలోను, ముసలివారిలోను వచ్చు చెవుడును, చిన్నపిల్లల చెవినుండి చీము వచ్చుటను మాన్పును.

నోరు:—దుర్వాసన. నీళ్లు కారుచుండుట, గొంతుక పుండ్లుపడుట, గుటకవేయుట కష్టముగా నుండుట, ఇగుళ్లు నొప్పిగా నుండుట. నాలుక నల్లగానుండుట. ముదరరంగుగాను దుర్వాసనగాను లాలాజలము వెడలుచుండుట.

అన్నకోశము:—వికారము, వమనములు. పిల్లలవమనములు.

పొత్తికడుపు, మలాశయము:—కాలేయము వాచుట, గట్టిపడుట. కామెర్లరోగముతోనుండు వుబ్బు లక్షణము. ఆకుపచ్చనినీళ్లవిరేచనములు. నమలుచున్నట్లుండు బాధతో వెడలుట ఆసనములో మంటగాను, బాధగాను వుండుట. జిగటవిరేచనములు కొద్దికొద్దిగాను, ఆమము, రక్తము, పైత్యరసముతో కలసియు వెడలుట. విరేచనబద్ధము.

చర్మము:—ముడతలుపడి యుండుట, మాంసగ్రంథులు వాచుట, రాగిరంగు మచ్చలు బయలుదేరుట.

పోలికలు:—కాలీమూరు, యాసిడుసల్ఫు.

విరుగుళ్లు:—హెపారుసల్ఫు.

మోతాదు:—3 మొదలు 30 పొటెన్సీ. విరేచనమగునట్లు చేయుటకు దీనిని 1x పొడుము రూపమున మోతాదు 1కి 3 వడ్లగింజలయెత్తు పొడుమును పావుగంటకొక మోతాదు చొప్పున 2 లేక 3 మోతాదులను యివ్వవచ్చును.

## 367. మెర్క్యూరియసు అయోడేటస్ ఫ్లేవస్— మెర్క్యూరియసు ప్రోటో అయోడు.

## MERCURIUS IODATUS FLAVUS MERCURIUS PROTO IOD.

గొంతుక సంబంధమైన రోగలక్షణముల మీదను, ముఖ్యముగా మాంసగ్రంథుల వాపుమీదను, బాగుగాపనిచేయును. సవాయిపుండ్లు గట్టిపడి యెన్నాళ్లకును మానకుండుట, గజ్జలలోని మాంసగ్రంథులు వాచుట, గట్టిపడుట, స్తనములలో కంతులు బయలుదేరుట, కుడివైపునవచ్చు రోగలక్షణములు—వీటి మీద నిది బాగుగాపనిచేయును.

నాలుక:—నాలుక మొదట పసుపుపచ్చగాను, చిక్కని పూతతోను యుండుట. నాలుక చివళ్లు యెర్రగానుండుట.

గొంతుక:—జున్నుముక్కల వంటిపదార్థము వెడలుచు, దుర్వాసనతోనుండుట. నత్తుపథకు పైవైపున చిన్నచిన్న పుండ్లుపడుట. కుడివైపు గవదకాయపైని చిన్నచిన్నతూట్లు పడుట. గొంతుకలో వుండ పెట్టినట్లుండుట. తరుచు గుటక వేయవలెనని తోచుచుండుట.

చిగుళ్లు:—హెపారుసల్ఫు.

మోతాదు:—6x పొటెన్సీ వాడుము.

---

## 368. మెథిలీను బ్లూ. METHYLENE BLUE.

ముఖ్యముగా నిది నరముల దోషములమీదను, మూత్రావయవరోగములమీదను, రక్తదోషములమీదను పనిచేయునదిగా పరిగణింపబడినది. శరీరమునుండి బహిర్గతముకావలసిన రసి లేక చీమువంటిపదార్థములు శరీరమున జీర్ణమగుటవలని పలువిధములగు దోషముల నిదిమాన్పును (పైరోజీనియాం).

మనస్సు:—తెలివితప్పుట.

తల:—విపరీతమైన బాధతోగూడిన తలనొప్పి. విడువని తలనొప్పి.

మూత్రావయవములు:— మూత్రము బంధింపబడుట. సెగరోగము. మూత్రము ఆకుపచ్చగా వెడలుట. సెగరోగముతోఁగూడిన కీళ్లనొప్పులు. మూత్రములో చీము వెడలుట. మూత్రకోశమునందు చిరచిర.

శ్వాసావయవములు:— ప్లూరిసీలో "నీరము" ను అంతరింపజేయును.

నరములు:— నరములసంబంధమైన బాధలు. మూర్ఛ. కొరియా లక్షణములు. కంపములతోఁ గూడిన రోగములు. ధనుర్వాతముయొక్క తుది అవస్థ.

జ్వరము:— సన్నిపాతజ్వరములో పొట్ట ఉబ్బరింపు. పరాకు మాటలు. మన్యపుజ్వరము రాకుండగ నాపుచేయును.

పోలికలు:— పైరోజీనియం.

మోతాదు:— 3x మొదలు 30 పొటెన్సీ.

---

## 369. నెప్తలీనం. NAPHTHALINUM.

ముఖ్యముగా నిది కోరింతదగ్గుమీదను, కంటి రోగములమీదను, మూత్రావయవరోగముల మీదను బాగుగా పని చేయును.

మనస్సు:— తెలివితప్పి పడుండుట. పిచ్చిదనము. పరాకుమాటలాడుట.

కన్నులు:— కాచబింబము మరియు స్ఫటికాకారబింబము కిరణాభేద్యమగుట. అంతరకుసుమలు.

మలాశయము:— ఆంత్రములందు హుక్‌వరమ్ అనబడు కొంకిపురుగులు బయలుదేరుట. అప్రయత్నముగా మలమూత్రములు వెడలుట.

మూత్రావయవములు:— రక్తమూత్రము. మూత్ర విసర్జనయందు తీరనికోర్కె. నవాసాగరపు వాసనవంటి గాఢమైన వాసనగల మూత్రము వెడలుట. నూతనముగా వచ్చినట్టిగాని జీర్ణించినట్టిగాని సెగవ్యాధి.

మూత్రము ముదిరిన గోధుమవర్ణముగా పెడలి, కొలదిసేపటికి నల్లనిరంగుగా మారుట.

శ్వాసావయవములు;—కోరింతదగ్గు (డ్రాసీరా). ప్రాపిరితీయుటకు వ్యవధిలేకుండగ దగ్గువచ్చుట. వుప్పుసపుదగ్గు. జలుబుచేయుట, తుమ్ములు వచ్చుచుండుట. బ్రాంకైటిసులో చిక్కని శ్లేష్మము పడలుచు దగ్గు ఆగి ఆగి వచ్చుటను మాన్పుటకు 12x వాడమని డాక్టరు కార్టీయరుగారుసిఫారసు చేసిరి. దగ్గుబాధకరముగా నుండుటతో రోగి ముఖము నీలిరంగుగానగుట. యాన్షుట్జుగారీ ఔషధమును 1వ పొటెన్సీలోవాడి ఎక్కువగుణములను గ్రహించిరి. క్షయదగ్గు ప్రాపిరాడనీయకుండగ వచ్చుట.

చర్మము:—దురదలు. మంత్రపుపొక్కులు.

జ్వరము:—తలనొప్పి. ఆకలిమాంద్యముతో ఆకస్మికముగా జ్వరము వచ్చుట.

నిద్ర:—దినములకొలది నిద్రమత్తుగానుండుట.

పోలికలు:—డ్రాసీరా, కొరాలియం, కోకసుకేక్టీ, ఆర్నికా, బెల్లడోనా, ఇపెకాక్, పెట్రోలియం, బెసిలినం, సోరినం, ఆర్సెనికంఆల్బం, సినా, ట్యూబర్కిలియం, కాలీఅయోడ్.

మోతాదు:—3x మొదలు 6x పొటెన్సు.

---

## 370. నేట్రం ఆర్సు. NATRUM ARSENICUM.

ఇది చర్మరోగములమీదను, శ్వాసావయవరోగములమీదను బాగుగా పనిచేయును.

ముక్కుమొదట నొప్పిగానుండుట, జలుబుచేయుట, యీలక్షణములు తలనొప్పితోయుండుట దీనివుపయోగమును సూచించును.

మనస్సు:—నరములదోషముతో కూడిన అస్థిమితము. మనో చాంచల్యము.

తల:—పొగచుట్టసొగవలన తలనొప్పియెక్కువగుట. తలకాలీగా నున్నట్లుతోచుట. కదలికవలన బాధ హెచ్చుట.

ముక్కు:—నీళ్లకంటిస్రావము—ఇది గొంతుకలోనికి పడుచుండుట. దిబ్బడవేయుట. పక్కులనూడదీసిన ప్రదేశమున బాధగానుండుట.

కన్నులు:—నీరసముగానుండుట. బరువుగానుండుట. హృదయమున అంటుకొనుట. మంటగాను, బాధగాను పొడిగానువుండుటతో సులభముగా అలియుట.

ముఖము:—దవుడలలోని కండరములలో పట్లుగానుండుటవలన నములుట కష్టముగానుండుట. ముఖమువెచ్చగా సొంగరించియుండుట.

గొంతుక:—ఎఱ్ఱన, బాధ, వాపు.

శ్వాసావయవములు:—ఏడేండ్లు దాటినపిల్లల బ్రాంకైటిసుమీద బాగుగాపనిచేయును. గనులలో పనిచేయువారిలోవచ్చు వుబ్బసము. బాధకరముగానుండెడుదగ్గు, దీనితో శ్లేష్మము అనుపచ్చగానెడలుట. ఛాతీలోను, హృదయమువద్దను నొక్కుచున్నట్లు బాధగానుండుట.

చర్మము:—మొండిచర్మరోగములు. మంత్రిపుపొక్కులు, పుండ్లు యివి తీవ్రమైన రక్తదోషములను సూచించుట.

జ్వరము:—చలివలన నిప్పుసెగవద్దను వెడలుటను గాని, కప్పుకొనుటను గాని కోరుట.

వుద్రేకము:—వేడిమివలన, నొక్కుటవలన, కదలికవలన, పగటియందు, రాత్రియందు, శరీరపరిశ్రమవలని వేడిమివలన.

వుపశమనము:—ముందుకు వంగుటవలన.

పోలికలు:—కాలీకార్బ్, యాపిసు, ఆర్సెనికంఆల్బం, కాలీబైక్,

లైకోపోడియం, నేట్రింమూరు.

మోతాదు: —3 మొదలు 30 పొటెన్సీ.

---

## 371. నేట్రిం కార్బ్. NATRUM CARB.

బహిరంగమైన గాలియందును, శరీరమానసిక పరిశ్రమలయందును అయిష్టత, బుద్ధిమాంద్యము — ఈలక్షణములతోనుండు తత్వములమీద నిది బాగుగా పనిచేయును. వేసవిలక్షణములవలన యెక్కువ నిస్త్రాణ, ఎండ దెబ్బవలని దోషములు, కొలది శరీరమానసిక పరిశ్రమలవలనగూడ నిస్త్రాణ గలుగుట. కొలదిదూరము నడచిన షిమ్మటవచ్చు నీరసమువలన చతికిలబడుట, చీలమండలలో నీరసము — యీలక్షణములు దీని ప్రయోగమును సూచించును.

మనస్సు: — సులభముగా గ్రహించుట. ఆలోచన కష్టముగానుండుట. విచారగ్రస్తముగా నుండుట. గాలివానవలన ఆతురతగాను, అస్థిమితముగాను యుండుట, మరియును యీ లక్షణములు సంగీతమువలనయెక్కువగుట (యాంబ్రాగ్రిషియా).

తల: — స్వల్పమైన మానసిక పరిశ్రమవలనగూడ తలనొప్పివచ్చుట. తలనొప్పి యెండవలనను, గ్యాసులైటు కాంతివలనను వుద్రేకము జెందుట (గ్లొనోయిన్). తల పెద్దదైనట్లు తోచుట.

ముక్కు: — ముక్కుపైని పెద్దపెద్ద మొటిమలు బయలుదేరి, ముక్కువాచుట. విడువకుండా యుండునట్టి రొంపను, ముక్కు దిబ్బడవేయుటను మాన్పును. స్రావము దుర్వాసనగాయుండుట. కాండిరించుటవలన అనుమ విశేషముగా వెలువడుట.

ముఖము: — పసుపుపచ్చని మచ్చలు, మొటిమలు. పైపెదవివాచుట. ముఖము పాలిపోయియుండుట.

అన్నకోశము: — సోడా బిస్కతులవలన వృపశమించునట్టి అజీర్ణ

మును మాన్పును. జీర్ణము నెమ్మదిగా అగుట. పాలయందిష్టము ండకపోవుట. భోజనానంతరము మందముగా నుండుట. రుచి చేదుగా నుండుట. అజీర్ణముచే బాధపడు వయోవృద్ధులకు తరుచు త్రేణుపులు వచ్చుచుండుట. ఆహారము పులియగొట్టుట. మేహావాతలక్షణములు వచ్చుట. వుదయము 5 గంటలకు ఆకలిగా నుండుట. వేడి చేసినప్పుడు చల్లని మంచినీళ్లు త్రాగుట వలని దోషమును మాన్పును.

పొత్తికడుపు, మలము, మలాశయము:—రాత్రియందు పొత్తికడుపులో శూల వచ్చుట. ఆకస్మికముగా విరేచనానుమానము కలుగుట. పాలు త్రాగుటవలనవచ్చు నీళ్లవిరేచనములను మాన్పును. ఆసనములో దురదగాను తిమ్మెరగాను యుండుట. విరేచనము ఒకప్పుడు కష్టమువిూదను, మరియొకప్పుడు అతి తొందరగాను, చప్పుడుచేయుచును వెడలుట.

స్త్రీఅవయవములు:—ఋతువు ఆలస్యముగాను స్రావము కొలదిగాను యగుట. కుసుమ దుర్వాసనగాను, ఒరుపును గలుగజేయుచు, శూల వచ్చినపిదప వెడలుచుండుట. అవయవములో క్రిందికి దిగలాగుచున్నట్లును, బరువుగాను యుండుట.

శ్వాసావయవములు:—బయటనుండి వెచ్చనిగదిలోనికి రాగానే పొడిదగ్గువచ్చుట. ఉప్పనిరుచిగల స్రావముతోనుండుదగ్గు, రక్తస్రావము.

నిద్ర:—శృంగారసంబంధమైన కలలువచ్చుట. పగలు నిద్రమత్తుగా యుండుట. ఉదయమున త్వరితముగా మెలకువ వచ్చుట

కాళ్లు, చేతులు:—చాల కాలమునుండి నిలువగాయున్న బెణుకు నొప్పి. మోకాళ్లవరకునుమంచువలె చల్లగానుండుట. చీలమండలో సులభముగా బెణుకుచుండుట. ఎముకలు స్వస్థానములను తప్పుచుండుట బొట్టనవ్రేలుకును తక్కిన వ్రేళ్లకును మధ్య నొప్పిగాయుండుట.

చర్మము:—వ్రేళ్ల చివళ్లను, కణుపుల మీదను బొట్టనవ్రేళ్లమీదను పొక్కులు బయలుదేరుట చర్మమువిూద నీటిపొక్కులు అచ్చటచ్చట బయ

లు దేరుట. అరికాళ్లుగరుసుగాను బాధగాను ఉండుట సులభముగా చెమటపట్టు సూచనగలుగుట లేక చర్మముసాడిగాను, గరుసుగాను, బీటలుతీసియుండుట.

జ్వరము — వెచ్చగాను, నిస్త్రాణగాను, నిద్రితోనుయుండుట. శరీర మందంతటను చమటలు పట్టుచుండుట.

ఉద్రేకము:— కూర్చుండుటవలన, సంగీతమువలన, మానసిక పరిశ్రమవలన, ఎండవేడిమివలన, గాలివానవలన.

ఉపశమనము:— కదలికవలన, ముక్కులోను చెవిలోను వేళ్లు పెట్టుకొనుటవలన.

చైనా — కిది విరుపడు.

పోలికలు:— యాసిడు లేక్టిక్, నేట్రింఫాసు.

విరుగుళ్ళు:— ఆర్సెనికం ఆల్బమ్, కేంఫరు.

మోతాదు:— 6x మొదలు 200 పొటెన్సీ.

---

## 372. నేట్రిం మూరు. NATRUM MURIATICUM.

(స్ఫటికలవణము. ష్యూస్లరుగారి ద్వాదశలవణములలో నిది తొమ్మిదవది)

ఇది ముఖ్యముగా శరీరము వుబ్బుట, లేక నీరుపట్టుట; సంధి లక్షణములు; చలిగాను, మందమతిగాను యుండుట, కండ్లనుండి నీళ్ళు కారుచుండుట, నీళ్ళవిరేచనములు, పడిశెము, మన్యపు జ్వరము— వీటిమీద బాగుగా పనిచేయును.

మనస్సు:— సంధిలక్షణములు (కాలీఫాసు); దీనితో నాలుకపై నురగవంటి పూత. కంగారుగాను, నిరాశగాను, విచారముగాను యుండుట. మతి భ్రమజెందినట్లుండుట. మానసిక పరిశ్రమవలన అలసటవచ్చుట.

తల:— సుత్తితో తలను బద్దలుకొట్టినట్లుండుట. ఎండలో తిరు-

గుటవలన వచ్చు తలనొప్పిని మాన్పును. చుండురు బయలుదేరుట వెంట్రుకలూడిపోవుట.

కన్నులు:— దృష్టిమాంద్యము. కాచబింబముపైని నీటిపొక్కులు, తెల్లని మచ్చలు బయలుదేరుట (కాటిమూరు) కండ్లువాచుట, రెప్పలు ఎఱ్ఱపరెక్కుట, నీళ్ళు కారుచుండుట, మంటగానుండుట, పుళ్ళుట. కండ్ల కలకను మాన్పును.

చెవులు:—హోరు, దురద, మంట, బాధ, చీము.

ముక్కు:—తరుచు రొంపపట్టుట, తుమ్ములువచ్చుట. నీళ్లవంటి స్రావము వెడలుట. వాసన, రుచి తెలియకపోవుట, దిబ్బడవేయుట.

ముఖము:—పాలిపోవుట. నరముల సంబంధమైన నొప్పి; దీనితో నుండు విరేచనబద్ధము—వీటిని మాన్పును. క్వయినా వాడినవారికి వచ్చు పార్శ్వపునొప్పి.

నోరు:—పుప్పని లాలాజలము వూరుచుండుట. కొండనాలుక పొడుగగుట. నురగవంటి ఆమము వూరుచుండుట, పండ్లసలుపు. ఇగుళ్లనుండి రక్తము స్రవించుట. రుచి తెలియకపోవుట. నాలుక, నోరు ఆర్చుకొనిపోవుట.

గొంతుక:—గండమాలరోగము. మాంసగ్రంథుల వాపు.

అన్నకోశము:—నీళ్లవంటి వమనము, లేక యెక్కువ లాలాజలము వూరుటతోనుండు జీర్ణకోశరోగములమీద బాగుగా పనిచేయును. పుప్పని పదార్థములను తినగోరుట. ఎక్కువ దాహముగానుండుట.

పొత్తికడుపు, మలము, మలాశయము:—తరుచు నురగతోగూడిన నీళ్లవిరేచనములగుచుండుట. కాలేయములోను, ప్లీహములోను బాధగానుండుట. మూలశంఖతోనుండు విరేచనబద్ధముమీద బాగుగా పని చేయును. మలము గట్టిగా వెడలినపిమ్మట ఆసనములో చీల్చివేసినట్లు బాధగాయుండుట, మరియు రక్తము స్రవించుట.

మూత్రావయవములు:—అతి మూత్రము, అతిదాహము. నడచునప్పుడు, దగ్గునప్పుడు, మూత్రము ప్రయత్నముగా వెడలుట.

పురుషావయవములు:—అండములలో నొప్పిగా నుండుట. జీర్ణించిన సవాయివ్యాధిలో, పుండ్లనుండి పల్చని స్రావము, చీము వెడలుట. జీర్ణించిన సెగలో నీరువలెను, బంకగాను. వెడలునట్టి స్రావము. బుడ్డను, నపుంసకత్వమును, శుక్లనష్టమును మాన్పును.

స్త్రీఅవయవములు:—తెల్లని, చిక్కని, స్రావము తోనుండును. ఋతువు ఆలస్యముగా నగుట, స్రావమెక్కువగానగుట, తల నొప్పివచ్చుట, అవయవములలో యెక్కువ దురదగా నుండుట. సెగ, సవాయిరోగములు స్రావములతోనున్నప్పుడిది పనిచేయును. గర్భిణులు నురగగాను పల్చగాను వుండునట్టి ఆమమును వమనము చేసుకొనుట.

శ్వాసావయవములు:—వుబ్బసములోను, కోరింతదగ్గులోను, నీళ్ళవంటి పల్చని స్రావము వచ్చుట. శ్వాసావయవములు వాచుట. నురగవంటి శ్లేష్మము దగ్గినపిమ్మట బహుకష్టముమీద వచ్చుట. గొంతుక బొంగురుపోవుట, దగ్గుటవలన ఛాతీలో నొప్పివచ్చుట (ఫెరింఫాము). వర్షకాలములోవచ్చు శ్వాసావయవరోగములమీద బాగుగా పనిచేయును.

నడుము, కాళ్లు, చేతులు:—చేతులమీదను, కాళ్లమీదను నీటిపొక్కులు బయలుదేరుట. మేహవాతనొప్పులు. నడుచుచున్నప్పుడు కీళ్లలో శబ్దమగుట.

చర్మము:—ఎక్కువగా ఆర్చుకుపోవుట, నీళ్లవంటి స్రావము గలుగుట. మంత్రపుపొక్కులవంటి చర్మరోగములు. తేళ్లు మొదలగు విషజాతి పురుగులు కుట్టినపుడిది బాగుగా పనిచేయును. (తేలుకాటును నేట్రం మూరు 2x లోపలికిని పైకిని వాడవలెను).

నిద:—అస్థిమితమైననిద్ర. ఇంటిలో దొంగలుపడినట్లు కలలు.

జ్వరము:—తేమ ప్రదేశములలో నివశించువారికి వచ్చు చలి జ్వరము లేక మన్యపుజ్వరము (నేట్రింసల్ఫు). చలి ఉదయము 10 గంటలు

మొదలు ఒంటిగంటవరకు యుండుట. చలి, దాహము ౭.కేసారి యుండుట. చలివచ్చుటకు ముందు యెక్కువవెచ్చదనము, తలనొప్పి, దాహము. నీరసము గలుగజేయునట్టి పుల్లని వాసనగానుండు చెమట పట్టుట.

రక్తముక్షీణదశకువచ్చి నీళ్లవలెను, పల్చగానుయుండుట; ఇందులో రోగి పాలిపోవుట. పాండురోగము వచ్చుట. ఆమత్యాచలు ఆర్చుకొని పోవుట. శరీరమునందలి ప్రతి అవయవములోను తేమను యెక్కువ తక్కువలు కాకుండా నుంచి ఆరోగ్యమును గలుగజేయును. రక్తక్షీణతలో దీనిని కాల్కేరియాఫాసుతో మార్చి యిచ్చినయెడల బాగుగా పనిచేయును.

ఉద్రేకము:— ఉదయమున, సముద్రపుటొడ్డున, శీతగాలివలన, సూర్యరశ్మితోగూడిన వేడిమివలన లేక యెండలో.

వుపశమనము:— బహిరంగమైన గాలిలో, సాయంకాలమున, వుపవాసమువలన, కూర్చుండుటవలన.

క్వాయినా, అర్జెంటంనిట్ యాసిసు—లకిది విరుగుడు.

విరుగుళ్ళు:—యాసిసు, ఆర్సెనికం ఆల్బమ్, కేంఫరు, ఫాస్ఫరసు.

మోతాదు:—2x మొదలు 10,00,000 పొటెన్సీ. 6x, 12x పొటెన్సీలలో పొడుము లేక బిళ్లలరూపమున నిది బాగుగా పనిచేయుచున్నది. దీని గుణకాలపరిమితి 40 లగాయతు 50 దినములు. ఇది 6x లోను అంతకు చిన్నపొటెన్సీలలోను మాత్రిలలోను అరఖులలోను తయారవదు.

---

## 373. నేట్రం నైట్రికం. NATRUM NITRICUM.

వాపు, బాధ, వెచ్చదనము, యెరద్రముతోనుండు పలువిధ వ్యాధుల మీద నిది పనిచేయును. రక్తవిహీనతను, నిస్త్రాణను మాన్పును. ప్రసవానంతరమునను, మశూచికములోను, మూత్రకోశము సంబంధమైనట్టి రక్తస్రావములనుమాన్పును. యూరిక్ యాసిడుకు సంబంధించిన పలువిధములగు రోగములు అనగా మేహవాతదోషములు మున్నగు వాటినిమాన్పును.

తల:—ఎడమ చెవిలో వెచ్చదనము, మరియు కుడిచెవిలో చల్లదనము. ముక్కునుండి రక్తస్రావము. లోపలకు నొక్కుచున్నట్లుండు బాధ. చెవిపోటు. చెవినుండి చీము వెడలుట.

అన్నకోశము:—పులిసిన లక్షణములు. పులితేన్పులు. కాఫీ యెడల అయిష్టత. వుబ్బరించుట.

పాత్తికడుపు:—వుబ్బరింపు, బాధకరమైన విరేచనబద్ధము.

మూత్రావయవములు:—అతిమూత్రము. లేతరంగుగాను, ఎక్కువ తారతమ్యసాంద్రతతోను మూత్రము విస్తారముగా వెడలుట.

హృదయము:—హృదయసమీపమున నొప్పి. నాడి నెమ్మదిగాను నీరసముగాను యుండుట.

జ్వరము:—ఇన్ఫ్లూయింజా జ్వరము. శరీరము పొడుగునను చల్లదనము. అతి చలి. పాదములు చల్లన.

వుద్రేకము:—పరిశ్రమవలన, మెట్లునెక్కుటవలన, నడుమును వంచుకు కూర్చుండుటవలన, గాఢముగా వూపిరిని దీయుటవలన.

పోలికలు:—కాలీనైట్రికం, ఎకోనైటు, ప్లంబంమెట్.

మోతాదు:—3 మొదలు 30 పాటెన్సీ.

---

## 374. నేట్రం ఫాసు. NATRUM PHOS.

(స్వర్జికభాస్వరము. ష్యూస్లరుగారి ద్వాదశలవణములలో 10 వది)

ఇది ముఖ్యముగా పులిసిన వాసనతోను, పులిసిన రుచితోను గూడిన రోగలక్షణములమీద బాగుగా పనిచేయును. అజీర్ణజ్వరము, క్షయవ్యాధి, క్షయకు సంబంధించిన మాంసగ్రంధులు బయలుదేరుట, పిల్లలకు పాలను పంచదారను యెక్కువగా నిచ్చుటవలని రోగములు, నిద్రయందు పండ్లు కొరుకుట, మలముతో నులిపురుగులు వెడలుట. అతిమూత్రము, క్రిమి

దోషము, మేహవాతరోగము, తలతిర్గిష్వ, శుక్లనష్టము, స్వప్నస్ఖలనము, కండ్ల కలకలు—వీటిని మాన్పును.

మనస్సు:—యేదియో అపాయము వచ్చునని ఆతురత గాను, భయముగాను వుండుట. జ్ఞాపకశక్తి తక్కువగా నుండుట. నీరసముగాను, చిర చిర లాడుచును, విసుగుగాను యుండుట.

తల:—అజీర్ణదోషమువలన తల తిర్గిష్వ, మొద్దుబారుట, తల నొప్పి వచ్చుట. పుల్లనినురగనంటి పదార్థము గొంతుకలోనికి వచ్చుచుండుట (ఫెరగింఫాసు). తల నొప్పిగా వుండుట. వుదయమున లేచుసరికి తలనొప్పి వచ్చుట.

కండ్లు:—వాపు, ఎరుపు, బాధ, కీటితో పసుపుపచ్చని మీగడ వంటి సార్గివము వచ్చుట. వుదయమున కండ్లు అంటుకొనుట, పుసులు కట్టుట. మెల్లకన్ను. మాననటువంటి కండ్లకలక.

చెవులు:—ధ్వనులువినిపించుట. ఒక చెవి యెఱ్ఱగాను, వెచ్చగాను, దురదగాను వుండుట. యీలక్షణములు అజీర్ణముతో గూడియున్నప్పుడిది పనిచేయును (ఫెరగింఫాసు).

ముక్కు:—దుర్వాసనతో యుండుట. దురదగానుండుట. రోగి తనముక్కును గోకుచును నలుపుచును యుండుట; ఇదిక్రిమిరోగలక్షణము.

ముఖము:—యెరర్రగా మచ్చలతోని ండియుండుట. మచ్చలు. బయలుదేరుచు, పోవుచు నుండుట. ముఖము పాలిపోవుట. లేక నీలివర్ణముగా నగుట, కందబారుట లేక యెరర్రబారుట.

నోరు:—అంగుడుపైని పసుపుపచ్చని మీగడవంటిపూతయుండుట. గవదకాయులనుండియు, సప్తపథనుండియు, పసుపుపచ్చని మీగడవంటి పదార్థము వచ్చుచుండుట. పుల్లని రుచితో నుండుట. నాలుకపై పసుపు పచ్చనిమీగడవంటి పూత. అజీర్ణదోషము వలనను, క్రిమిదోషము వలనను పిల్లలు నిద్రలో పండ్లుకొరుకుచుండుట. పండ్లువచ్చు కాలములో పిల్లల

అజీర్ణదోషమును మాన్పును. గొంతుకలో వుండ పెట్టినట్లుండుట.

అన్నకోశము:— పులితేన్పులు. అన్నకోశములో పుండ్లగుట. భోజనానంతరము నొప్పివచ్చుట. పుల్లనివమనములు, తేన్పులు వచ్చుట (ఫెర్రం ఫాసు). ఆకలిలేమి. అజీర్ణముగాను, రుచిచేదుగానువుండుట. క్రిమిదోషమువలని కడుపునొప్పినిమాన్పును. క్రొవ్వుపదార్థములు, పిండివంటలు తినుటవలనిఅజీర్ణము. అజీర్ణమువలన ఛాతీలోమంట.

పొత్తికడుపు:— వుబ్బరింపు, శూల, కడుపులో గురగురలాడుచుండుట, ఇవి పులితేన్పులతో గూడియున్నప్పుడు పనిచేయును.

మలము, మలాశయము:— చిన్నపిల్లలకు పుల్లనివాసనతో నుండు పసరువంటి నీళ్లవిరేచనము లగుటను మాన్పును. మలముతో వెడలువట్టి అన్నిరకముల క్రిములను దీనిని వాడవచ్చును. చిన్నపిల్లల విరేచనబద్ధము.

మూత్రావయవములు:— మూత్రములో శ్వేతధాతువు కలసివెడలుట. రాత్రియందు మూత్రము అప్రయత్నముగా వెడలుట. చిన్నపిల్లలకు మూత్రానుమానము గలిగినప్పుడు ఆపుకొనలేకపోవుట. తరుచుగా మూత్రానుమానము గలుగుట. మధ్యమధ్య మూత్రపుధారఅడ్డిపోవుట. అతిమూత్రము.

పురుషావయవములు:— స్వప్నములేకుండగనే స్ఖలనమగుట. వీర్యము పల్చగా నీళ్లవలెనుండుట. సంభోగేచ్ఛ యెక్కువతక్కువలుగా నుండుట. స్ఖలనానంతరము నీరసమువచ్చుట.

స్త్రీఅవయవములు:— కుసుమ పసుపుపచ్చని మీగడవలెను, తెల్లగాను, పుల్లనివాసనతోను, దురదతోను, నొప్పితోను పుండును గలుగజేయుచును వెడలుటను మాన్పును. బహిష్టునెలనెలకు సరిగా కాకుండుట. గర్భాశయము వెలుపలకువచ్చుట. బహిష్టుకుముందుకలుగు నిద్రలేమిని వరముల వుద్రేకమునుమాన్పును. గర్భిణీస్త్రీలకు పుల్లని వమనములగుటను మాన్పును.

శ్వాసావయవములు:— రొమ్ముముకవద్దను, ప్రక్కయెముకలలోను,

బాధగానుండుట. గట్టిగా వూపిరిపీల్చుటవలన ఛాతీలో నొప్పిగానుండుట. గొంతుక బొంగురుపోవుట, నీరుతాగినపిమ్మట దగ్గువచ్చుట.

హృదయము:—అజీర్ణమువలన హృదయము సరిగా కొట్టుకొనక పోవుట, దడగానుండుట.

మెడ, నడుము, కాళ్లు, చేతులు:—శుక్లనష్టమువలనవచ్చు కాళ్లనొప్పి. గండమాలరోగము. సాయంకాలమున నడుములో నీరసముగాయుండుట. కీళ్లసంధులలోవచ్చు మేహవాతనొప్పులు, వాపులు. నడుచుచున్నప్పుడు తూలుచుండుట. గుత్తులలో నొప్పిపట్టుట.

నిద్ర:—క్రిమిదోషమువలని నిద్రలేమి. నిద్రలోపండ్లుకొరుకుట, కెవ్వుమని కేకలువేయుట, ముక్కునులుపుట. ఆసనముదురదగానుండుట. శృంగార సంబంధమైన కలలు వచ్చుట

చర్మము:—మంటగాను, పసుపుపచ్చని మాగడవంటి స్రావముతోయుండు మంత్రపు పొక్కులు. కాళ్లు పగటియందు మంచువలె చల్లగానుండుట, రాత్రియందు మంటగా నుండుట.

జ్వరము:—పుల్లని, ఆకుపచ్చని వమనములతో గూడిన మాన్యపుజ్వరము. చెమట పుల్లని వాసనవేయుట. అజీర్ణమువలన అప్పుడప్పుడు వుడుకు తగులుచుండుట. మరియు నుదిటిలో నొప్పిగా నుండుట.

వృద్ధికము:—బహిష్టులో, సాయంకాలమందు, మెల్లకునప్పుడు. బహిరంగమైన గాలి యిష్టముండకపోవుట.

విరుగుళ్ళు:—సేపియా, యాశిసు.

మోతాదు:—$3_x$ మొదలు 1,00,000 పొటెన్సీ. $6_x$, $12_x$ పొటెన్సీలలో నిది పొడుము ఓళ్లలు రూపముున బాగుగా పనిచేసినది. ఇది 6x లోను అంతకు తక్కువపొటెన్సీలలోను అరకులలోను మాత్రలలోను తయారవదు.

---

## 375. నేట్రం సల్ఫ్. NATRUM SULPH.

(స్వర్జికగంధకము. ఇది సూ్క్లరుగారి ద్వాదశలవణములలో 11 వది)

విరేచనబద్ధము, అజీర్ణము, పైత్యసంబంధమైన రోగములు, మధుమూత్రము, మన్యపుజ్వరము, మహావాతరోగములు, వుబ్బసము, శెగ, నరములసంబంధమైన రోగములు, కాలేయముకు ప్లీహముకు సంబంధించిన రోగములు, తలత్రిప్పు—వీటిమీద నిది బాగుగా పనిచేయును.

మనస్సు:—అధైర్యముగాను, నిరాశగాను వుండుట. యీలక్షణములు వుదయమునను, తేమగాలిలోను యెక్కువగుట. పైత్యోద్రేకము వలన ఆత్మహత్య చేసుకొనవలెనని తోచుట. రాత్రి నిద్రపట్టకపోవుట, పరాకుమాటలాడు చుండుట. మానిసిక లక్షణములు సంగీతమువలనను, విచారము వలనను యెక్కువగుట.

తల:—నిద్రమత్తుతోనుండు తలనొప్పి. శూల, పైత్యసంబంధమైన విరేచనములు లేక వమనములు, వీటితోనుండు తలనొప్పిని మాన్పును. ఆలోచన చేయుటవలన తలసంబంధమైన లక్షణములు యెక్కువగును.

కన్నులు:—పసుపుపచ్చగా నుండుట. కనురెప్పలలోనీటిపొక్కుల వలెనుండు దుర్మాంసము పెరుగుట. వుదయమునకనురెప్పలుఅంటుకొనుట.

చెవులు:—గంటలు వాయించు చున్నట్లు చప్పుడగుట. పొడుచు చున్నట్లు బాధగా నుండుట.

ముక్కు:—బహిష్టులో ముక్కునుండి రక్తముస్రవించుట. ముక్కు దిబ్బడ వేయుట. ఆరుచుకొనిపోయి మంటగా నుండుట. పసుపుపచ్చగా నుండు వుప్పని స్రావము వచ్చుట.

ముఖము:—పాలిపోయి లేక కామెర్లరోగములోవలె పసుపుపచ్చగానుండుట. మొటిమలు బయలుదేరుట.

నోరు:—చేదుగా నుండుట. చిక్కని తెల్లని ఆమము వుమియు చుండుట. మంటగా నుండుట, నాలుకపై గోధుమ ఆకుపచ్చని మిశ్రమ వర్ణముగానుండు పూతగలుగుట. నాలుక యెర్రగానుండుట, పంటిసలుపు

పొగత్రాగుట వలనను, చల్లని గాలివలనను, నోటిలో చల్లని నీటిని పట్టి వుంచుట వలనను వుపశమించుట. ఇగుళ్ళు మంటగా యుండుట.

అన్నకోశము:—సాయంకాలమందు దాహముగా నుండుట. పొట్ట వుబ్బి బరువుగా నుండుట. వికారముగా నుండుట. పైత్యరసమునువమనము చేసుకొనుట, రుచి పుల్లగా నుండుట. మగతగాను తలనొప్పిగాను యుండుట. పిండి పదార్థములను జీర్ణము చేసుకొనలేకుండుట. పులితేన్పులు వచ్చుచుండుట.

పొత్తికడుపు:—కాలేయము పెద్దదగుట, కాలేయసంబంధమైన రాళ్ళు బయలుదేరుట. యెడమనైపు పడుండుటవలన బాధ. బట్టను గట్టిగా కట్టుకొనుటకు భరింపలేకుండుట. వుబ ్బరముతోనుండు శూల.

మలము, మలాశయము:—ఆకుపచ్చని, పైత్యసంబంధమైన విరేచనములు. శీతకాలములో వుదయమున పల్చని విరేచనములగుట, అపానవాయువు వెడలుట, ఆసనముమీనను తొడలమధ్యను కాయలువలె బయలుదేరుట.

మూత్రావయవములు:—మూత్రములో పైత్యరసము యెక్కువగా జేరి ఎర్రగా వెడలుట. ఇది మధుమూత్రమును మాన్పును. చిన్న చిన్న రాళ్లు, యిసుకవంటి పదార్థము, మూత్రములోకలిసి పోవుచుండుట. ప్రోస్టేటు గ్రంధి వాపును మాన్పును.

పురుషావయవములు:— జీర్ణించినట్టియు, అణచిపెట్టబడినట్టియు శెగమీద బాగుగా పనిచేయును. మర్మావయవములు దురదగా నుండుట, సవాయిసంబంధమైన పుండ్లు.

స్త్రీఅవయవములు:—పొక్కులతో నిండియుండి బాధగాను వాపుగాను, వెచ్చగాను యుండుట. బహిష్టుకు ముందు ముక్కునుండి స్రావము వెడలుట. బహిష్టులో స్రావము దుర్వాసనగాను, ఒరుపును గలుగజేయును; విరేచనబద్ధము, శూలతోను లేక వుదయమున నీళ్లవిరేచనములతోను

యుండుట. కుసుమ దుర్వాసనగాను, ఒరుపును గలుగజేయుచును బాధతోను వెడలుట. గర్భిణీస్త్రీలవేవిళ్లను, రుచి చేదుగా నుండుటను మాన్పును.

శ్వాసావయవములు:——తేమగాలివలన వుద్రేకించు వుబ్బసముమీద పనిచేయును. ఛాతీలో గురగురలాడుచు వచ్చు శ్లేష్మముతోనుండు వుబ్బసపు దగ్గు. తేమగాలిలో వూపిరాడకపోవుట. తెల్లవారగట్ల దగ్గు వుద్రేకించుట. పిల్లల వుబ్బసమును మాన్పును.

నడుము, కాళ్ళు, చేతులు:——నడుములోను, వెన్నెముకలోను, చితుకకొట్టినట్లు నొప్పిగాయుండుట. గజ్జలలోని మాంసగ్రంధులు వాచి చీముపట్టుట, గోళ్లవద్దవాచుట, చీముపట్టుట, పుండ్లగుట, బాధగానుండుట. చట్టలనుండి మోకాళ్లవరకు బాధగా నుండుట. అరికాళ్లలో మంట మోకాళ్లవరకు వ్యాపించుట. మేహవాతనొప్పులు.

నిద్ర:——కామెర్లరోగము వచ్చు సూచనలున్నప్పుడు నిద్రమత్తుగా నుండుట. చదువుటవలన పైత్యలక్షణములతోనుండు మగత యెక్కువగుట.

చర్మము:——కండ్లవద్దను, నెత్తిమీదను, ముఖముమీదను, ఛాతీవద్దను, ఆసనమువద్దను వులిపిరికాయలవంటి పొక్కులు బయలుదేరునట్టి సూచనలు గలుగుట. మంత్రిపుపొక్కులు, తామర మరియు భగందరమును పోలియుండు లోతైన పుండ్లనుండి నీళ్లవంటి రసి వచ్చుచుండుట. చర్మము పసుపుపచ్చగా నుండుట.

జ్వరము:——ఇది మన్యపుజ్వరముయొక్క అన్నిదశలలోను బాగుగా పనిచేయును. పైత్యవమనములను కట్టును. పైత్యజ్వరమును పసుపుపచ్చని ఆకుపచ్చని మిశ్రమవర్ణముగానుండు వమనములను కట్టును. లోపల చల్లగా నుండుట. నడినెత్తిని వెచ్చగానుండుట. దాహములేమి. చెమటపట్టుట. పొత్తికడుపులో నొప్పిగా యుండుట.

తేమప్రదేశములలోను, తేమగానుయుండు ఇండ్లలోను నివాసమువలనను, మరియు తేమవలననువచ్చు రోగములన్నిటిమీదనుయిది బాగుగాపని చేయును.

వృద్ధికరము:—తేమగాలిలో, గాలిమార్పులవలన, ఎడమవైపుపరుం డుటవలన.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో, పొడిగాలిలో, కదలిక వలన, నొక్కుటవలన.

సహచరులు:—ఆర్సెనికం ఆల్బమ్, తూజా.

మోతాదు:—$3_X$ మొదలు 1,000 పొటెన్సీ. ఇది $6_X$ పొటెన్సీలో పాడములోను, బిళ్లలలోను బాగుగా పనిచేయును. ఇది $6_X$లోను ఇంతకు తక్కువపొటెన్సీలలోను అరకులోను మాత్రలలోను తయారవదు.

---

## 376. నిక్కొలం మెట్. NICCOLUM MET.

నరములనిస్త్రాణ, మానని తలనొప్పులు, అజీర్ణము, మలబద్ధము, దృష్టి మాంద్యము మున్నగు లక్షణములమీద నిది బాగుగా పనిచేయును. తరుచు జలుబుచేయుటను మాన్పును. విద్యావ్యాసంగము చేయునట్టివారికిది అను కూలమైనది.

మనస్సు:—విచారముగా నుండుట. ఏదో అపాయము జరుగునను భయము మాట్లాడుటయందయిష్టత.

తల:—తలలో మేకుకొట్టినట్లుండు తలనొప్పి. వుదయమున నడిరాత్రిని నొప్పి. కుట్టుచున్నట్లుండు బాధలు. వుదయమున తలతిప్పువచ్చుట, నుదుట వెచ్చన, బరువు.

ముక్కు:—ముక్కు దిబ్బడ. తుమ్ములు విపరీతముగా వచ్చుట. జలుబుచేయుట. ఆర్చుకుపోవుట. ముక్కుచివర ఎఱ్ఱదనము, వాపు.

గొంతుక:—నులిమివేసినట్లుండుట.

అన్నకోశము, పొత్తికడుపు, మలాశయము:—ఎక్కువ దాహము మరియు తీవ్రమైన ఎక్కిళ్లు. పాలను త్రాగినవెనుక నీళ్లవిరేచనమగుట, ఆసనము తీపుగానుండుట, పొట్టలోనినొప్పి త్రేణుపులకు కిమ్మట వుప శమించుట. ఛాతీ దిగువను చాకుతో పొడుచుచున్నట్లుండు బాధ, విరేచ

నానుమానమే గాని విరేచనమవకపోవుట (నక్సువామికా). మలము గట్టిగా వెడలుట.

స్త్రీ అవయవములు:—మూత్రవిసర్జనానంతరము పలుచగా నీళ్ల వలె వెడలుకునుమ. బహిష్టు చాల ముందరగాను, స్రావము కొలదిగాను, యుండుట. స్రావము కొలదిసేపుమాత్రమే వెడలుట. కొందరిలో బహిష్టు ఆలస్యముగా అగుట, మరియు, నిస్త్రాణగను, కండ్లు మంటలుతోను యుండుట.

శ్వాసావయవములు:—దగ్గునప్పుడు లేచికూర్చొని, తలను గట్టిగా పట్టుకొనవలసివచ్చుట. దగ్గునట్టి బిడ్డను ఎత్తుకొననిచో బిడ్డను కంపములు వచ్చుట. తెల్లని శ్లేష్మము వెడలుట.

నిద్ర:—తృప్తినివ్వని నిద్ర.

వుద్రేకము:—వుదయమున పడకనుండి లేచుటతోడనే, నియమిత కాలములందు, ప్రతి రెండువారములకు, ప్రతిసంవత్సరమున, వుదయమున.

వుపశమనము:—సాయంకాలమున.

మోతాదు:—6x మొదలు 200 పొటెన్సీ.

---

## 377. నిక్కోలం సల్ఫ. NICCOLUM SULPHURICUM.

ముఖ్యముగా నిది నియమితకాలములందువచ్చు పార్శ్వపునొప్పులను తలనొప్పులను మాన్పుటలో నమోఘముగా పనిచేయును.

తల:—నీరసమువలన పరుండవలయునని కోరిక గలుగుట. బడలిక వలన యేమిచేయుటకును తోచకుండుట. విద్యావంతులలోవచ్చు తలనొప్పులు, గొంతుక బొంగురుతనము, అజీర్ణము, మరియు మలబద్ధములను మాన్పును. రాగిరుచి.

నడుము, కాళ్లు, చేతులు:—నడుము మొద్దుబారుట, వంగకుండుట, అరికాళ్లు మంటలుగానుండుట. వెన్నెముక బాధగానుండుట. వుదయమున

పడకనుండి లేచుసరికి అరికాళ్లు మంటలుగానుండుట. కాళ్లు, ముంజేతులు బరువుగాను, నీరసముగాను యుండుట, వెల్లగిల పరుండలేకపోవుట.

స్త్రీ అవయవములు:—బహిష్టు అవనున్నట్లువలె అండాశయములో నొప్పిగా నుండుట. శరీరమునకు వెచ్చవ తగులుచుండుట.

మూత్రావయవములు:— మూత్రి మెక్కువగా వెడలుట. ఇందువలన రోగి రాత్రియందు 3 లేక 4 సార్లు లేవవలసి వచ్చుట.

మోతాదు:—6x మొదలు 30 పొటెన్సీ.

---

## 378. ఓవా టెస్టా. OVA TESTA.

దీనిని కుసుమవ్యాధికిని, మానకుండా వెడలునట్టి ఋతుస్రావమును కట్టుటకును, మర్మావయవమునందు బయలుదేరు పుట్టవ్రణమును మాన్పుటకును, నడుమునొప్పికిని వాడవచ్చును. వెన్నెముక విరిగినపిమ్మట తీగతోగాని దారముతోగాని కట్టినట్లు భావనయుండుట దీని ప్రత్యేకలక్షణము. వులిపిరికాయలను మాన్పును. దుర్వాసనగాను, విస్తారముగాను వెడలునట్టి తెల్లకుసుమను మాన్పును.

మోతాదు:—3x, 6x పొడుము. ఇది నెమ్మదిగా పనిచేయును. దీనివలన సరియైనగుణము గలుగుటకు సాధారణముగా కొలదివారములు పట్టును.

---

## 379. పేరఫిన్. PARAFFINE.

గర్భాశయ రోగములమీదను, విరేచనబద్ధమును మాన్పుటలోను, బాగుగా పనిచేయును. బాధలు చాకుతో కోయుచున్నట్లుండుట మరియు ఒకచోటనుండి మరియొకచోటికి తరుచు మారుచుండుటయు దీని ప్రత్యేక లక్షణములు.

తల:—తల ఎడమవైపునవచ్చు బాధలు. బాధలు కుట్టుచున్నట్లు, మెలివేయుచున్నట్లు యుండుట. ఇట్టిబాధలు చెవులలోకూడ వచ్చుచుండుట. నడినెత్తిని ఎడమవైపున మేకు దిగగొట్టినంతటి బాధవచ్చుట.

కన్నులు:—కండ్లయందర నల్లనిమచ్చలగుపడుట. దృష్టిమాంద్యము. కనురెప్పలు యెగ్రిబడుట.

నోరు:— పళ్లనుండి దవుడదిగువవరకును మెలివేయుచున్నట్లును, చీల్చివేయుచున్నట్లును యుండుబాధ. జిగురుగానుండుట. లాలాజలముతో నిండుటవలన తరుచు వుమియవలసి వచ్చుచుండుట. రుచిచేదుగా నుండుట. రుచి తప్పుట. ఆకలిలేమి.

అన్నకోశము:—ఎల్లప్పుడును ఆకలిగా నుండుట. అన్నకోశము బాధతో గుండెదడ ద్వంద్వముగానుండుట. తినినకొలదిగంటలకు పులి త్రేపులువచ్చుట. దెబ్బతగిలినట్లువలె కడుపులోనొప్పి దినమున్నర వరకు నుండుట.

పొత్తికడుపు:—కోయుచున్నట్లుండు బాధలవలననిద్రలేమి. బొడ్డు దిగువనుండిమర్మానయవములోనికి చాకుతో కోయుచున్నంట్లుండుబాధలు. గోకుచున్నట్లు, నములుచున్నట్లువుండుబాధ వెన్నెముకలోనికివ్యాపించుట.

మలాశయము:—పిల్లల విరేచనబద్ధమున కిది సిద్ధౌషధమునంటిది (ఎల్యూమినా). తరుచు విరేచనానుమానము(నక్సువామికా). మూలశంఖతో ద్వంద్వముగాను, నిలువగానుయుండు విరేచనబద్ధము.

స్త్రీఅవయవములు:—బహిష్టుఅలస్యముగాను స్రావము నల్లగాను (కాలీసల్ఫ), విస్తారముగాను వెడలుట. పాలవలెను, చుక్కలుచుక్కలు గాను స్రవించుచుసుసుమ. స్తనములలోపల బాధగాయున్నట్లు చన్మొనలు తాకుడుకు బాధకరముగాయుండుట. మంటలుగానుండు బాధలు. మూత్రము వెచ్చగా వెడలుట.

కాళ్లు, చేతులు:— మెట్లనెక్కునప్పుడు వెన్నెముకలోని నొప్పి గజ్జలలోనికి వ్యాపించుట కీళ్లసంధులలో విద్యుచ్ఛక్తి అదుటువలెనుండు

బాధలు గలుగుచుండుట. చీలమండలలోను, అరికాళ్లలోను చీల్చుచున్న ట్లుండుబాధలు పాదములవాపులతో ద్వంద్వముగానుండుట. అరిచేతులు చాల పెచ్చగా నుండుట.

చర్మము:— కాలినపరదేశము ఎక్కువ దుస్థితిజెందుట అనగా కుళ్లుట, చీము కారుచుండుట. మంచువలని లేక చన్నీటిలో నానుటవలన పాదములు ఒరియుట మొదలగు దోషముల నిది మాన్పును.

నిద్ర:-- రాత్రింబవళ్లు నిద్రింపకోరుట. శృంగారసంబంధమైన కలలు.

జ్వరము:— చలి, దీనికిపిమ్మట శరీరము వెచ్చనగుట, దాహముగా నుండుట; అటుపిమ్మట చమటలుపోయుట; యీలక్షణములు తరుచు మారుచు గలుగుచుండుట.

వృద్ధికము:—వంగుటవలన, నడచుటవలన, నిలుచుండుటవలన.

వుపశమనము:— బాధగానున్న పార్శ్వమును దేనిపై నైనను ఆను టవలన, నిద్రకుపిదప, విశ్రాంతికిపిదప.

పోలికలు:— నెత్తలీన్, పెట్రోలియం, క్రియసోటం, ఆయోడి యం, సేపియా, బ్యూఫో, నేట్రంసల్ఫు, నేట్రంమూరు, లెకెసిస్.

మోతాదు:—6x (పొడుము) మొదలు 30 పొటెన్సీ.



## 380. పెట్రోలియం. PETROLEUM.

చిరచిరలాడునట్టియు, దెబ్బలాడునట్టియు, సులభముగా కోపము జెందునట్టియు, విసుగుజెందునట్టియు స్వభావముగలవారిరోగములమీద నిది బాగుగా పనిచేయును. బండిలోను, రైలుమీదను, ఓడమీదను ప్రయా ణముచేయుటవలన వచ్చు రోగలక్షణములను మాన్పును. లక్షణములు యిట్లే వచ్చి అట్లే మాయమగుచుండుట (బెల్లడోనా, మెగ్నీషియాఫాసు)ను

జఠర, శ్వాసావయవ సంబంధమైన రోగములు మానకుండగను, తరుచుగాను వచ్చుచుండుటను మాన్పును.

మనస్సు:—త్వరలో చనిపోవుదుననుకొని వ్యవహారములను చక్క బెట్టుకొనవలయునని యుండుట. విచారగ్రస్తముగాను, దృష్టి మాంద్యముతోను యుండుట. మానసిక వుద్రేకమువలన రోగలక్షణము లుద్రేకము జెందుట. నిద్రలోను, పరాకుమాటలాడుచున్నప్పుడును ఒకకాలు రెండుకాళ్ళుగాను మరియొక మనిషి తనప్రక్కనే పరుండినట్లును, లేక పరుండిన బిడ్డ యిద్దరు బిడ్డలుగా నున్నట్లును తోచుట.

తల.—తేమగానుండు పొక్కులు తలమీదను, తలవెనుకను, చెవులవద్దను బయలుదేరుట. తలవెనుకభాగము సీసముతో చేయబడినట్లు బరువుగానుండుట. కర్రతో చేయబడినట్లును, తిమ్మిరగానున్నట్లునుతోచుట. చల్లనిగాలి వీచుచున్నట్లు తోచుట.

కన్నులు:—కనురెప్పలమీది వెంట్రుకలు వూడిపోవుట. దృష్టి మందగించుట. దూరముగానున్న వస్తువులుమాత్రమే ఆనుట. సన్నని అక్షరములను కంటియద్దములు లేకుండ చదువలేకుండుట.

చెవులు:—సమీపముననున్న వారుమాట్లాడుటవలన భరింపలేనంతటి ధ్వని గలుగుట. చెవులవెనుక యెక్కువదురదతోనుండుమంత్రపుపొక్కులు బయలుదేరుట. సరిగా వినబడకపోవుట.

ముక్కు:—ముక్కుకోణములలో పుండ్లుపడుట, చీటలుతీయుట, మంటగానుండుట. ముక్కుచివర దురదగానుండుట, రక్తము స్రవించుట. దుర్వాసనవచ్చుట; చీము, స్రావమువచ్చుచుండుట, పక్కులుకట్టుట.

అన్నకోశము:—విరేచనానంతరము ఆకలి గొనుట. వికారము. నోటిలో నీళ్ళూరుచుండుట. కడుపు ఖాళీగా యుండునపుడు వచ్చుబాధ భోజనానంతరము వుపశమించుట. క్రొవ్వు సంబంధమైన ఆహారమందును మాంసమందును అయిష్టత. కేబేజి (Cabbage) తిననివిమ్మట లక్షణము

లుదేఁకము జెందుట. అజీర్ణమువలన గుండెలలో మంటగానుండుట. రాత్రి యందు ఆకలివేయుటవలన ఆహారము తీసికొనవలసివచ్చుట (సోరినం). వెల్లుల్లివాసన వచ్చుట.

పొత్తికడుపు, మలాశయము:—పగటియందుమాత్రమే నీళ్లవిరేచనములు వెడలుట. ఆసనము దురదగానుండుట. భగందరమును మాన్పును.

పురుషావయవములు:— మూత్రద్వారములో దురదగానుండుట. ప్రోస్టేటుగ్రంథి వాపుగాను, బాధగాను యుండుట.

స్త్రీ అవయవములు:—కుసుమ శోణితధాతువువలెను, యెక్కువగాను వెడలుట (ఎల్యూమినా, బోరాక్సు, బొవిస్టా, కాల్కేరియాఫాసు). బహిష్టుకు ముందర వచ్చు తలనొప్పి (క్రియసోటం). అవయవములు నొప్పిగాను, తేమగాను వుండుట. చన్మొనలు దురద.

శ్వాసావయవములు:—దగ్గుటవలన తలనొప్పి వచ్చుట. గొంతుక బొంగురుపోవుట (కార్బోవెజ్, కాష్టికం, ఫాస్ఫరస్). ఛాతీలో నొక్కుచున్నట్లుండుట; ఇది శీతలిగాలో హెచ్చగుట.

హృదయము:—చల్లగానున్నట్లు తోచుట. (కార్బోయానిమలిసు, నేట్రంమూరు). యెక్కువగా కోపమువచ్చినపిమ్మట సొమ్మసిల్లుట, వెచ్చగానుండుట, దడగానుండుట.

మెడ, నడుము, కాళ్ళు, చేతులు:—మెడ కొయ్యబారి బాధగానుండుట. నడుములో నొప్పి వచ్చుట. వేళ్లచివళ్లు గరుకుగానుండుట, చీటలుతీయుట. వర్షకాలములో పుండ్లుపడుట. మోకాళ్లు వంగకపోవుట. నిలువగాయున్న బెణుకు నొప్పులు. మోకాళ్లలో కరుక్కుమని శబ్దమగుట.

చర్మము:—రాత్రియందు దురదగానుండుట. ఆర్చుకుపోయి, ముడతలుపడి, గరుకుగాను, పగుళ్లతోను వుండుట. పడక రాపడము వలని పుండ్లు. చర్మము రేగుటవలన సులభముగా చీముపట్టుట (హెపార్‌సల్ఫ). దళసరిగాను, మంటగాను, దురదగాను వుండు అకువచ్చుని పొక్కులు

బయలుదేరుట. చర్మము గరుకుగాను, యెఱ్ఱగాను వుండుట. పగుళ్లనుండి సులభముగా రక్తము స్రవించుట. బాధగానుండు నీటిపొక్కులు.

జ్వరము:—మొదట చలితోను, తరువాత చెమటతోను యుండుట. రాత్రియందు సుఖము, తల వెచ్చన. పాదములకు చెమటపట్టుట.

వుద్రేకము:—తేమవలన, తుపానుకు ముందుగ, బండ్లలో ప్రయాణమువలన, శీతకాలములో, భోజనము వలన.

వుపశమనము:—వెచ్చని గాలిలో, తలను యెత్తుగానుంచి పరుండుటవలన, పొడిగానుండు గాలిలో.

పోలికలు:—కార్బొవెజ్, గ్రాఫైటిసు, సల్ఫరు, ఫాస్ఫరసు.

సహచరులు:—సేపియా.

విరుగుళ్లు:—నక్సువామికా, కాక్యులసు, ఫాస్ఫరసు.

యాసిడునైట్రికు, సీసమువలని దోషము—లకిది విరుగుడు.

మోతాదు:—3 మొదలు 1,000 పొటెన్సీ. చిన్నపొటెన్సీలు బాగుగా పనిచేయుచున్నవి. దీనిగుణకాలపరిమితి 40 లగాయతు 50 దినములు,

---

## 381. ఫాస్ఫరస్. PHOSPHORUS.

పల్చగాను, పొడుగుగాను, చామనచాయగాను వుండు వారికిని, వయస్సులోనున్న స్త్రీలకును, ఇంద్రియజ్ఞాన మెక్కువగా గలవారికిని, సున్నితముగానుండుతత్వములుగలవారికిని ఇది బాగుగా వుపయోగపడును. త్వరితముగా యెదుగుచున్నట్టియు, వంగిపోయిన నడుముతోనుండునట్టి, లేక నడుమునువంచి నడచుచున్నట్టియు, రక్తక్షీణతతో నుండునట్టియు, యువకులయొక్క రోగములమీదను, వుదయమున నీళ్లవిరేచనములగుచుండు ముసలివారియొక్క రోగములమీదను బాగుగా పనిచేయును. "అరో

డిక్ ” వలని దుర్గుణములను, వుప్పును యెక్కువగా వాడుటవలని దుర్గుణములను మాన్పును. ఎముకలు సులభముగా విరిగిపోవునట్టి తత్వములవారికిది మంచిది.

మనస్సు:—తుపాను వచ్చునప్పుడుగాని, ఒంటరిగా నుండునపుడుగాని, యెక్కువ ఆతురతగాను, అస్థిమితముగాను యుండుట. శారీర మానసిక పరిశ్రిమలయందయిష్టత. తాను ముక్కలుముక్కలుగా విడిపోయినట్లును, యీముక్కలను కలుపుట లేక జేర్చుట కష్టమనియూలోచుట. మగతగానున్నప్పుడు మెలకువ తెచ్చుటవలన ఒకనిమిషముమాత్రిమే తెలివిగానుండుట. మరియు వెంటనే గొణుగుకొనుచు మగతజెందుట. హిస్టీరియాలోవలె ఒకసారి నవ్వుచును, మరియొకసారి యేడ్చుచును యుండుట. ఆలోచనచేయుట కష్టముగా నుండుట. అస్థిమితముగా నుండుట. చిరచిరలాడుచుండుట. దేనియందును సిగ్గుజెందకుండుట. పిచ్చియెత్తునున్నవానివలె నుండుట. లేనిపోనిబాధలను తలపెట్టుకొని కలతజెందుట.

తల:—వికారము, భారము, బాధతో నుండుట. నడచుచున్నప్పుడును, కూర్చున్నచోటినుండిగాని పడకనుండిగాని లేచునప్పుడును తూలుచుండుట. మత్తును గలుగజేయునట్టి పదార్థములను, కాఫీని యెక్కువగా వుపయోగించుటవలన వచ్చు వికారము. రుద్రివాతము. దినమువిడచి దినము వచ్చు తలనొప్పి. వెన్నెముకనుండి తలలోనికి వ్యాపించునట్టి వుడుకు. తల దిమ్మరగాను, తలవెనుకభాగమందు చల్లగాను వుండుట. దురదగానుండుట. చుండుర్బయలుదేరుట. తలవెంటుర్కలు యెక్కువగా వూడిపోవుచుండుట.

కన్నులు:—అంతరకుసుమాలు (సైలీషియా, బెరీటాకార్బ, కోనియం, కాల్కేరియాకార్బ, కాల్కేరియాఫ్లోరు, కాల్కేరియా సిలికేటా). కండ్లయెదుట నల్లనిచుక్కలు కదులుచున్నట్లు కనబడుట. అక్షరములు యెరర్గాకనబడుట. దృష్టినాడి సన్నగిలుట లేక అర్చుకొనిపోవుట. కండ్లు, కనురెప్పలు వుబ్బుట. పొగాకునెక్కువగావాడుటవలని దృష్టిమాంద్యము.

చెవులు:—సరిగా వినబడకపోవుట. ముఖ్యముగా మనుష్యుల కంఠ

ధ్వని వినబడకపోవుట. కాయలు (Polypi) బయలుదేరుట దురద.

ముక్కు:—వాచుట, సులభముగా రక్తము స్రవించుట. పీనసరోగము. తరుచుతుమ్ములు; ఆకుపచ్చని, పసుపుపచ్చనిస్రావములు, చీమువంటి ఆమము వెడలుచుండుట. ముక్కుయెముక పుచ్చుట.

ముఖము:—పాలిపోయి, బూడిదరంగుగాను, పసుపుపచ్చగాను, పొంగరించి చావుముఖమువలె యుండుట. బిగపట్టినట్లుండుట. ముఖములోను, కనుబొమలవద్దను, దౌడలలోని యెముకలలోను చీల్చుచున్నట్లు, పొడుచుచున్నట్లు, నొప్పిగాయుండుట. అడుగు దౌడయెముక పుచ్చుట.

నోరు:—నాలుక ఆర్చుకుపోయి, కదలకుండగను, నల్లనిపక్కులతోను, బీటలతోను, తెల్లనిపూతతోను, నిగనిగలాడుచును వుండుట. వుప్పని లేక తియ్యని లాలాజలము యెక్కువగా వూరుచుండుట.

గొంతుక:—ఆర్చుకుపోవుట. గవదకాయలువాచుట. కొండనాలుక వాచుట, పొడుగగుట, మంటగానుండుట.

అన్నకోశము, పొత్తికడుపు:—పాలను త్రాగినపిమ్మట రుచిచేదుగాను, పుల్లగానుయుండుట. భోజనమునందు కోరికయున్నను, ఆహారమును వడ్డన చేసినపిదప తినుటయందయిష్టత. తరుచు పుల్లని త్రేపులు వచ్చుచుండుట. రాత్రియందు యెక్కువ ఆకలిజెందుట. యెల్లప్పుడును వికారముగా నుండుట. ఆహారమును, పైత్యరసమును, ఆమమును, నల్లనికాఫీమడ్డివంటి పదార్థమును వమనము చేసుకొనుట. కాలేయము యెండిపోవుట; గట్టిపడుట, ఒకప్పుడు పెద్దదగుట, కామెర్లరోగమువచ్చుట. ప్లీహమువాచుట, కడుపు పొంగరించుట, గరుగ్రరుగ్రమను చుండుట.

మలము, మలాశయము:—కుళాయి గొట్టములోనుండి వచ్చునట్లు నీళ్లవిరేచనములగుట. అప్రయత్నముగా విరేచనములగుచుండుట. ఆసనము తెరచియున్నట్లుండుట. నీరసమునుగలుగజేయుచును బాధలేకుండగను, నీళ్లవిరేచనములు వుదయమున వెడలుచుండుట. మూలశంఖ నుండియు, ప్రతి విరేచనముతోను రక్తము స్రవించుచుండుట. మలము కొద్దిగాను, గట్టిగా

ను, పొడుగుగాను ముక్కలవలెను, అరుగుకుపోయి కుక్కయొక్క మలము వలె బహుకష్టముమీద వెడలుట.

మూత్రావయవములు:—మూత్రము పాలిపోయిన రంగుగాను, నీళ్ల వలెను, విస్తారముగాను, తరుచుగాను, ఇటుకపొడివంటి మడ్డితోను వెడలుచుండుట. అధిక సంభోగమువలన మూత్రములో రక్తము వెడలుట. అతిమూత్రమునుమాన్పును. రాత్రియందుఅతితరచుగా మూత్రమువెడలుట.

పురుషావయవములు:—అధికమైన కామోద్రేకము. అధికసంభోగమువలనవచ్చు నపుంసకత్వము. స్ఖలనములవలనను, శెగవ్యాధి నణచిపెట్టుట వలనను వచ్చు వృషణముల వాపును, బాధను, బుడ్డను మాన్పును.

స్త్రీ అవయవములు:—అధికమైన కామోద్రేకము. బహిష్టులో స్రావము యెక్కువగా నుండుటవలనగాని, బహిష్టు ఆలస్యముగా నగుట వలనగాని లేక అధికసంభోగమువలనగాని వచ్చు వంధ్యత్వమును లేక గొడ్డుతనమును మాన్పును. బహిష్టుకు బదులుగా నీళ్ళవంటి లేక ఒరుపును కలుగజేయునట్టియు, నిస్త్రాణగలుగజేయునట్టియు, కుసుమరోగము ప్రవేసించుట. బహిష్టుకు బహిష్టుకు మధ్య విస్తారముగా స్రావము గలుగుచుండుట. బహిష్టు అతి త్వరితముగా నగుట. స్రావమెక్కువగాను, చాల దినముల వరకును యుండుట. బహిష్టుకుముందు యేడ్పువచ్చుట. బహిష్టులో నడుములో నొప్పివచ్చుట. గుండెదడవచ్చుట.

శ్వాసావయవములు:— గొంతుక బొంగురుగానుండుట. గట్టిగా మాట్లాడుటవలనవచ్చు బొంగురుతనమును మాన్పును. సప్తపథలోను, స్వర పేటికలోను గరుకుగానుండుటవలన తరుచు దగ్గు వచ్చుచుండుట. పొడి దగ్గును మాన్పును. సాయంకాలమందును, రాత్రియందును, చదువుటవలనను, నవ్వుటవలనను, గట్టిగా మాట్లాడుటవలనను, గాలి వెచ్చదనములో నుండి చల్లదనములోనికి మారుటవలనను, యెడమవైపునగాని వెల్లగిలగాని పరుండుటవలనను, పరిశ్రమవలనను, దగ్గు వచ్చుచుండుట. దగ్గుచున్నప్పుడు అప్రియత్నముగా మలము వెడలుట. స్రావము కష్టముమీదను, మరగ

గాను, రక్తజీరతోను, ఇనుప తుప్పురంగునుపోలి, చిక్కగాను చీమువలె ను, తెల్లని ఆమమువలెను, చల్లగాను, వుప్పని రుచితోను, వుదయమున లేచినపిమ్మట రంగులేకుండగను, వెడలుట. శ్వాస బహుకష్టముతోను, బాధతోను వెడలుట. ఛాతీలో నొక్కుచున్నట్లుండు బాధగాను బిగపట్టి నట్లును వుండుట. వూపిరితిత్తి వాపుమీద పనిచేయును. సన్నముగాను, పొడుగుగాను త్వరితముగా యెదుగునట్టివారలకు యెక్కువ నిస్త్రాణతోను రక్తస్రావముతోను, బ్రాంకైటిసుతోను వచ్చునట్టి క్షయవ్యాధిమీద బాగుగా పనిచేయును.

హృదయము:—క్రొవ్వుతో కప్పబడుట, క్షీణదశకు వచ్చుట. కుడి పార్శ్వమునందు వచ్చు రోగలక్షణములు. కదలికవలన దడవచ్చుట.

మెడ, నడుము, కాళ్ళు, చేతులు:—మెడ కొయ్యబారుట. వెన్నె ముక పైభాగమందును, నడుములోను, నొప్పిగా యుండుట. పక్షవాతము వచ్చినట్లు అన్ని అవయవములలోను, నీరసముగా యుండుట. పరిశ్రమ వలన అవయవములు కంపించుట. పిల్లలకుదొడ్డికాళ్లు పడుట. మోకాళ్లు మేహవాతములోవలె కొయ్యబారుట, సాయంత్రమున పాదములువాచుట. పాదములు మంచువలె చల్లగా నుండుట.

చర్మము:—కామెర్లరోగము. చర్మమును గిల్లినను, నొక్కినను నొప్పిలేకుండుట, లేక మొద్దుబారుట, గట్టిపడుట, దురదగా నుండుట. లోతైన పుండ్లుపడుట. పుండ్లనుండి పల్చగా దుర్వాసనగా నుండు చీము వచ్చుట. చిన్నచిన్న గాయములనుండిగాని, పుండ్లనుండిగాని, విస్తారము రక్తము స్రవించుట; యిది మానినపిమ్మట తిరిగి పుండ్లుపడుచుండుట. మశూచికపు పొక్కులలో రక్తముచేరుట. మోకాళ్లమీదను, మోచేతుల మీదను పొక్కులతో గూడిన చర్మరోగము బయలుదేరుట.

నిద్ర:—నిద్రమత్తుగా నుండుట. తలలో మంటతోనుండు వెచ్చ దనము, మంట, గొణుగుకొనుచుండుట యుండుట. పగటియందు నిద్ర గాను, రాత్రియందు అస్థిమితముగాను యుండుట. అర్ధరాత్రియునకు

పూర్వము నిద్రపట్టకపోవుట. రోగి నిద్రలో నడచుట. శృంగార సంబంధమైన కలలు వచ్చుట.

జ్వరము:—న్యుమోనియాతోను, బ్రాంకైటిసుతోను, యుండు మైఫను జ్వరము. ఇది క్రమముగా క్షయలోనికి మారుట. అవయవములు రాత్రియందు పరుండినప్పుడు చల్లగా నుండుట. రాత్రి శరీరము వెచ్చగా నుండుట. యెక్కువ చెమటపట్టుట. వుదయమున నీరసము గలుగజేయునట్టి చెమటలు పోయుట. ఒకమారు వెచ్చగాను, ఒకమారుచలిగానుయుండుట.

వుద్రేకము:— సాయంకాలమందు, అర్ధరాత్రిమునకు ముందుగ, వుదయమున, నడచుచున్నప్పుడు, పైత్యము వలన, వెచ్చదనము వలన, తుపానులో, యెడమవైపు పరుండుట వలన, పాడుట వలన, మెట్లెక్కుటవలన.

వుపశమనము:—చల్లని గాలిలోను బహిరంగమైన గాలిలోను కదలిక వలన, చీకటిలో, కుడివైపు పరుండుట వలన.

సహచరులు:—ఆర్సెనికం ఆల్బమ్, కార్బోవెజ్, ఏలియంసేపా, ఇపెకాక్.

విరుగుళ్లు:—నక్సువామికా, కేంఫరు, కాఫీ, ఆర్నికా, కాల్కేరియా కార్బ, సల్ఫరు, చెలిడోనియం, టెరిబింతినా, వైను.

దీనిని అతిచిన్న పొటెన్సీలోగాని, అతితరచుగాగాని వాడరాదు. ఈవిషయమును ముఖ్యముగా క్షయవ్యాధి నివారణలో గమనించవలెను. కాష్టికముకు దీనిని ముందుగాని వెనుకగాని వాడరాదు.

టెరిబింతినా, రూసువెనినెటా, కేంఫరు, అయోడియం, నేట్రంమూరు, పెట్రోలియం—ల కిది విరుగుడు.

మోతాదు:— 6 మొదలు 200 పొటెన్సీ. ఇది కాల్కేరియాకార్బకు పైవానిను తరువాత బాగుగాపనిచేయును. దీని గుణకాలపరిమితి 40 దినములకు పైగాయుండును.

## 382. ప్లాటినా. PLATINA

ఇది స్త్రీలరోగములమీద బాగుగా పనిచేయును. పక్షవాతము, శరీరము మత్తుమందు తీసికొనినట్లు మొద్దుబారుట, అవయవములలో తిమ్మెరలుగానుండుట, మొద్దుబారుట; హిస్టీరియా సంబంధమైన కంపములు— వీటిని మాన్పును. బాధలుక్రమముగా హెచ్చుచును, తగ్గుచును యుండుటను, అచ్చుపని చేయువారికి వచ్చు శూలను మాన్పును.

మనస్సు:—అసందర్భముగా మాట్లాడుట. ఇంద్రియ జ్ఞానములో యెక్కువ మార్పులు గలుగుట—ఎక్కువ గర్వించుట, యెదుటివారియందు తప్పులుపట్టుట, మగవారిని చూచినయెడల భయపడుట, పరాకు మాటలాడుట, తాను గొప్పదాన ననియు యితరులు కొద్దివారలనియు తలచుట. చంపుటకు ఆపుకోలేనంత ఆలోచనకలుగుట, పరులను లెక్క చేయకపోవుట, యెదుటివారు తనకన్న శారీరికముగాను, మానసికముగాను, తక్కువ వారనియు, యెదుటనున్నవస్తువులు మొదలగునవి తక్కువవిలువగలవి లేక అక్కరకురానివి, చిన్నవి అనియు అనుకొనుట.

తల:—పడివేయునట్లు తిమ్మెరతోగూడియుండు నొప్పి. తలనొప్పి తిమ్మెరలతో నుండుట.

కండ్లు:—వస్తువులు చిన్నవిగా కనబడుట.

ముఖము:—చల్లగాను, పురుగులు పాకుచున్నట్లుగాను, తిమ్మెరలుగాను కుడిప్రైపున వుండుట.

అన్నకోశము:—విపరీతమైన ఆకలి. ముడుచుకొనిపోయినట్లుండుట వుబ్బరించుట. వికారముగాను, నీరసముగాను యుండుట.

పొత్తికడుపు:—చిత్రకారులయొక్కయు, అచ్చుపని చేయువారియొక్కయు శూలను మాన్పును. బొడ్డువద్ద నొప్పిగా యుండుట.

మలము:—జిగురుమట్టివలె మెత్తగాను లేక కాలినట్లు చిట్లమువలెను యుండుట. ప్రయాణము చేయు ప్రతినిధులు లేక ప్రయాణము చేయు

నట్టి ఏజంట్లు; వీరికి ఆహారపానీయములలో తరుచు మార్పు గలుగుచుం డుటవలన వచ్చు విరేచనబద్ధమును మాన్పును (పముద్రయానము చేయు చున్నవారి విరేచనబద్ధమునకు బ్రియోనియా వాడవలయును).

పురుషావయవములు:—స్ఖలనము త్వరగా వగట. సుఖానుభవము కొలదిగా వుండుట.

స్త్రీ అవయవములు:— లోపలను పైవైపులను మొద్దుబారుట. అండాశయము బాధగాను, మంటగాను యుండుట. ఆపుకొనజాలని సం భోగవాంఛ. హిస్టీరియా లేక అపస్మారము. ఋతువు చాలముందరగాను, సాప్రమెక్కువగాను, నల్లగాను, ముద్దలముద్దలవలెను, కంపములతోను, దిగలాగుచున్నట్లుండు నొప్పితోను, చలితోను వచ్చుట. ప్రసవించిన స్త్రీలలోను, కన్యకలలోను సంభోగేచ్ఛ అధికముగా గలుగుట.

కాళ్లు, చేతులు:— పక్షవాతము వచ్చినట్లును, నీరసముగాను యుండుట.

నిద్ర:—కాళ్లు చాచుకుని నిద్రించుట.

సీసముయొక్క దోషములకిది విరుగుడు.

వుద్రేకము:—కూర్చుండుటవలన, నిలుచుండుట వలన.

వుపశమనము:—నడచుటవలన.

విరుగుళ్లు:—పల్సటిల్లా.

మోతాదు:—$3_x$ (పొడుము) మొదలు 200 పొటెన్సీ. దీనిగుణకా లపరిమితి 5 మొదలు 6 వారములు.

—

## 383. ప్లంబం ఎసెట్, PLUMBUM ACETICUM.

పక్షవాతసంబంధమైన బాధలమీదనిది బాగుగా పని చేయును.

పక్షవాతమునొందిన కాళ్లలోను చేతులలోను గలుగు బాధలను,

అన్నకోశమువందలి పుంశువలన అండలికంఠరముల సంబంధమైన బాధలను దూన్చును.

పోతాము:—$6_x$ మొదలు 30 పొటెన్సీ.

---

## 884. ప్లంబంమెట్. PLUMBUM METALLICUM.

వెన్నెముక సంబంధమైన రోగములు, కండరములు ఆకస్మికస్ పోవుట లేక యెండిపోవుట, పక్షవాతము వచ్చుట, రక్తము క్షీణించుట, నిస్త్రాణ జెందుట, రోగి క్రిమముగాను త్వరగాను కృశించి పోవుట, జీర్ణించిన మేహ వాత లక్షణములు—వీటిమీద నిది బాగుగాపనిచేయును.

మనస్సు:—జ్ఞాపకశక్తి పోడగుట. తనను చంపుదురనియు తనకు విషము పెట్టుదురనియు, తనప్రక్కనున్న ప్రతివాడును హంతకుడనియు భీతి జెందుట. విచారగ్రస్తముగా యుండుట. నెమ్మదిగా గ్రహించుట. కంపముతో గూడిన మూర్ఛ. జీర్ణించిన సవాయి రోగమువలన మనస్సు స్థిమితము లేకపోవుట.

తల:—ఒకమారు పొడుచుచున్నట్లు బాధగాను, మరియొకమారు పరాకుమాటలాడుచును యుండుట. గొంతుకనుండి మెదడులోనికి బంతి యెగబ్రాకుచున్నట్లు భావనగాను, బాధగాను యుండుట. వెంట్రుకలు ఆరిపోయినట్లుండుట.

ముఖము:— పాలిపోయి, శవమువలె పసుపుపచ్చగానగుట. దవుడలునొక్కుకు పోవుట. జిడ్డుగాను నిగనిగలాడుచును యుండుట.

కన్నులు:—పాపలు ముడుచుకు పోవుట, కండ్లు పచ్చబడుట, దృష్టి నాడిలో వాపు, బాధ. గుడ్డులో లాగుచున్నట్లు బాధగానుండుట.

నోరు:—నాలుకను చాపుట కష్టముగానుండుట, నాలుకకు పక్షవాతము వచ్చినట్లుండుట. ఇగుళ్ళు వాచుట, పాలిపోవుట. నోరు జిర్చుకు పోయినట్లుండుట, దుర్వాసనగా నుండుట,

అన్నకోశము:—ఎల్లప్పుడును వమనములు వచ్చుచుండుట. ఘన పదార్థమును గుటక వేయలేకపోవుట. తినిన ఆహారపురుచితో త్రేనుపులు వచ్చుచుండుట. పైత్యరసమును లేక రక్తమును వమనము చేసికొనుట.

పొత్తికడుపు:— శూల అన్ని అవయముల లోనికిని వ్యాపించుచుండుట. పొత్తికడుపునకు తాడు కట్టివెన్నెముక వైపునకు లాగుచున్నట్లు భావన గలుగుట. అపానవాయువు వెడలకుండుటవలన శూలవచ్చుట. బాధతో నుండు గిలక.

మలము, మలాశయము:—మలముయొక్కువగా చేరి, గట్టిపడిపోవుట వలన వెడలుట కష్టముగానుండుట. ఆసనమునకు పక్షవాతమువచ్చినట్లుండుట, ముడుచుకొనిపోవుట. విరేచనబద్ధము. మలము గట్టిగాను, ముద్దలుగాను, నల్లగాను, వెడలుటకు తొందరతోను యుండుట.

మూత్రావయవములు:—మూత్రము చుక్కలు చుక్కలుగా శ్వేతధాతువుతో కలసి వెడలుచుండుట. మూత్రముయొక్క తారతమ్యసాంద్రత (Specific Gravity) తక్కువగా నుండుట.

పురుషావయవములు:— సంభోగశక్తి లేకపోవుట. అండములు పైకిలాగుకొనిపోవుట. వృషణములు ముడుచుకొనిపోవుట, నపుంసకత్వము. శెగవ్యాధివలన మూత్రము బంధింపబడుట.

స్త్రీ అవయవములు:—స్తనములలో కుట్లుచున్నట్లును, మండుచున్నట్లును బాధగానుండుట. గర్భస్రావ సూచనలు గలుగుట. విడిచి విడిచివచ్చు ఋతుశూల, దీనితో స్రావమాగిపోవుట. గర్భిణీలో విరేచన బద్ధము. స్తన్యము కొలదిగాను నీళ్లవలెను యుండుట. స్తనములు వాచుట, గట్టిపడుట.

శ్వాసావయవములు:—దగ్గుటతో రక్తము శ్లేష్మముతో వెడలుట.

హృదయము:—కండరములు పొడగుట. నిస్త్రాణగా యుండుట. నాడి ఘంధనముగాను, సన్నముగా తీగవలెను యుండుట.

నడుము, కాళ్లు, చేతులు:— నడుములో నొప్పులు మెరవులీగవలె అకస్మాత్తుగా వచ్చి పోవుచుండుట. దిగువ అవయవములకు పక్షవాతము వచ్చుట. ఒక్కొక్క కండరముకు పక్షవాతము వచ్చుట. చేతితో దేనిని యెత్తలేకపోవుట. పియానో, లేక హార్మోనియం వాయించువారి చేతుల లోనికండరములకు పక్షవాతమువచ్చుట. పిక్కలలో లాగుచున్నట్లుం డుట. అవయవములలో గుచ్చుచున్నట్లుండుట. చీల్చుచున్నట్లు బాధ గానుండుట. పాదములు వుబ్బుట. రాత్రియందు కుడికాలి బొటనవ్రేలిలో నొప్పివచ్చుట.

చర్మము:—కామెర్లరోగము. ఆర్చుకుపోయి యుండుట. ముంజే తులలోని, కాళ్లలోని, దుష్టరక్తనాళముల వాపులు. పైత్యసంబంధమైన పసుపుపచ్చని మచ్చలు.

వుద్రేకము:—రాత్రియందు, కదలిక వలన.

వుపశమనము:—మర్దనము వలన, గట్టిగా నొక్కుటవలన, శారీర పరిశ్రమ వలన.

విరుగుళ్లు:—ప్లాటినా, ఎల్యూమినా, పెట్రోలియం, బెల్లడోనా, నక్సువామికా, ఓపియం, జింకం మెటాలికం, ఎల్యూమెన్, యాంటిం కూడం, కాక్యులస్.

మోతాదు:—$6_X$ మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 3 లగాయతు 4 వారములు.

---

## 385. రేడియం బ్రోం. RADIUM BROMATUM.

చర్మముకు, ఎముకలకు కండరములకు, అమత్వచలకు సంబంధించిన పలువిధములగు దోషములమీదనిది బాగుగా పనిచేయునది గాయెంచబడినది.

కపాలము చాల చిన్నదిగా నున్నట్లు తోచుట, కంటిలో తాడు వంటిది యున్నట్లుభావన, శ్వాసనాళములలోని కేదియో పడిపోయినట్లుం

డుట, మోకాలునందు యెముకలు ముందుకుచొచ్చుకొని రానున్నట్లుభావన, శరీరమంతయు నొప్పులతో కూడిన అస్థిమితము మరియు అతినీరసము —ఇవి దీని ప్రత్యేకలక్షణములు.

మనస్సు:—ఒంటరిగా నుండలేకపోవుట అపాయము రానున్నదను భయము. విచారముగా నుండుట.

తల:—లేచుటతో వికారము వచ్చుట. నడుమునప్పుడు ఎడమవైపు నకు తూలిపడిపోవు సూచననలన దేనినైనను ఆనుకొనవలసివచ్చుట. పరుండినపిమ్మటను, వేడినీళ్లు స్నానముచేసిన పిదపను, బహిరంగమైన గాలిలోను, యీవికారము తూలు, తగ్గుట. తలభారము.

కన్నులు:—కళ్లలోనొప్పులు. కుడికంటిపైపునుండి బాధ నడినెత్తి లోనికి వ్యాపించుట.

నోరు:—లోహపురుచి. ఆర్చుకుపోవుట. నాలుకచివర గుచ్చు చున్నట్లు బాధ.

అన్నకోశము:—ఐస్‌క్రీము యెడలను తీపిపదార్థముల యెడలను ఆయిష్టత. త్రేణుపులు వచ్చుట. ఖాళీగాయున్నట్లు భావన. నెచ్చగా యున్నట్లు భావన.

పొత్తికడుపు:—వుబ్బరింపు, బాధ. అపానవాయువు వెడలు చుండుట. ఒకసారి విరేచనబద్ధము మరియొకసారి పలుచనివిరేచనములు వెడలు చుండుట.

మూత్రావయవములు:— పగటియందు మూత్రము వెడలకుండుట. మూత్రములో యిటుకపొడివంటి మడ్డియుండుట. మూత్రములో శ్వేతధాతువుపోవుట.

నడుము, కాళ్లు, చేతులు:—పక్షవాతము. మహావాతదోషములు. కీళ్ళలో నొప్పులు. అతి బాధకరముగానుండు నడుమునొప్పి, రెండుభుజములకుమధ్యను నొప్పిగాయుండుట.

చర్మము:— రంగుగానుండు చిన్నచిన్న పుట్టుమచ్చలు. బీటలు దీయుట, లోతైనపుండ్లు పడుట. మంత్రిపుపొక్కులవంటి చర్మరోగము ఇట్టివాటిలో తీవ్రమైన మంటలు, దురదలు బయలుదేరుట. నుదుటను, ఛాతీమీదను చిన్నచిన్న కురుపులు వేయుట. ఎక్సరే మరియు రేడియం చికిత్సలవలని కాల్పులదోషములు. చర్మముకుళ్లుట.

నిద్ర:—అసాధారణమైన రీతిని ఆత్మహత్య చేసుకొనుచున్నట్లును, మూత్రమును విడుచుచున్నట్లును కలగనుట. భయముతో మెలకువజెందుట. హృదయమును సమ్మెటతో ముక్కలు గాకొట్టుచున్నట్లు కలగనుట.

వృద్ధికము:—లేచుటవలన, రాత్రియందు, పడక వేడిమివలన, చన్నీటితో కడుగుటవలన.

వుపశమనము:—బహిరంగమైన గాలిలో, వేడినీటి స్నానమువలన, కదులుచూ యుండుటవలన, నొక్కుటవలన.

విరుగుళ్లు:— నక్సమోస్కేటా, రూస్టాక్స, రూస్ వెనినేటా, టెల్లూరియం.

జెల్లడోనా—కిది విరుగుడు.

పోలికలు:—హైడ్రాస్టిసు, కోనియం, యురానియం నైట్రికం, టెల్లూరియం, లైకోపోడియం, కేడ్మియంసల్ఫు, ఆర్జెంటంనైట్రికం, యాంటిమంకూడం, కార్బొయానిమలిసు, సిమిసిఫ్యూగా, పల్సటిల్లా, ఆర్సెనికం ఆల్బం, ఎనకార్డియం.

మోతాదు:—12x మొదలు 30 పొటెన్సీ.

---

## 386. సెలీనియం. SELENIUM.

ఇది ఎముకలయందును, పండ్లయందును, యెక్కువగా జేరియున్నది. ముఖ్యముగా మర్మావయవ మూత్రావయవరోగములకును, పురుషులకు వృద్ధాప్యములో ప్రాస్టేటుగ్రంధినుండి స్రావము వచ్చునప్పుడును; రేపన శక్తి, సంభోగేచ్ఛ తక్కువగా నుండునప్పుడును, నిస్త్రాణనుమాన్పుటకును, ముసలితనములో శారీరమానసిక సంబంధమైన దుర్బలత్వములకును, జబ్బువలన కలుగు నిస్త్రాణకును దీనిని బాగుగా వాడవచ్చును. రోగి తన వ్యాపారసంగతులను మరచి పోవుచుండినను మరిచిపోయిన సంగతులనుగురించి కలగనుచుండుట. తాగుబోతులకు సంభోగానంతరమునను, లెమనీడ్, టీ, వైను; వీటివలనను ప్రతిసాయంకాలమందును తలనొప్పివచ్చుచుండుట. తలవెంట్రుకలు, మీసములు, కనుబొమలు, మర్మావయవమువద్ద రోమములు—ఇవి యన్నియు వూడిపోవుట. మర్మావయవ లక్షణముల విషయములో ఏగేరికస, యాగ్నసు కేస్టసు, ఆరం మెటాలికం, కెలేడియం సెగ్, కాల్కేరియాకార్బ, కోనియం, లైకోపోడియం, ఫాస్ఫరసు. యాసిడ్ ఫాసు—వీటి లక్షణములను కూడ యోచింపనగును.

మనస్సు:—శృంగారసంబంధమైన వూహలుతోచుచుండినను, నపుంసకత్వముచే బాధపడుచుండుట. ఎక్కువ విచారగ్రస్తముగానుండుట. మానసిక పరిశ్రమవలన అలసటవచ్చుట.

తల:—ఎడమకంటిపైని వచ్చునొప్పి ఎండలో నడచుటవలనను, గాఢమైన వాసనవలనను, టీ వలనను వుద్రేకము జెందుట. టీ త్రాగుటవలన తలనొప్పివచ్చుట.

గొంతుక:—బొంగురుతనము. గాయకుల బొంగురుతనము.

అన్నకోశము:—బ్రాంది మొదలగు నిషానిచ్చు పానీయములను కోరుచుండుట. పొగ త్రాగిన పిమ్మట యెక్కిళ్లు, త్రేణుపులు వచ్చుట.

పొత్తికడుపు, మలాశయము:—నిలువగాయున్న కాలేయ రోగ

ములు. కాలేయమువాచి కాలేయసమీపమున చిన్నచిన్న దద్దురు బయలు దేరుట. ఎక్కువ విరేచనబద్ధము.

మూత్రావయవములు:—మూత్రము అప్రయత్నముగాను, చుక్కలు చుక్కలుగాను వెడలుట.

పురుషావయవములు:— నిద్రలో వీర్యము చుక్కలు చుక్కలుగా వెడలుచుండుట; ఇట్లే ప్రాస్టేటుగ్రంధినుండి కూడ స్రావము వెడలు చుండుట. సంభోగమునకు ప్రయత్నించునపుడు అంగము ముడుచుకు పోవుట. సంభోగసంబంధమైన నిస్త్రాణ (Sexual neurasthenia) వీర్యము పల్చగాను, వాసనలేకయు వుండుట. సంభోగానంతరము చిర చిరగా నుండుట. సంభోగశక్తి తగ్గుట; శృంగారసంబంధమైన చేష్టలు, ఆలోచనలు యెక్కువగుట.

స్త్రీఅవయవములు:—ఋతువు మామూలుకన్న 8 రోజులు ఆల స్యముగాను, స్రావము విస్తారముగాను, నల్లగాను వెడలుట.

శ్వాసావయవములు:—ఉండలవలెనుండు ఆమము, రక్తము వెడలుట.

నడుము, కాళ్లు, చేతులు:— నడుమునకు పక్షవాతము వచ్చినట్లు నొప్పివచ్చుట. రాత్రియందు చేతులలో చీల్చుచున్నట్లు బాధవచ్చుట.

చర్మము:— చీలమండలవద్దను, చర్మముయొక్క మడతలలోను, వేళ్ల సంధులలోను దురదగా నుండుట. మొటిమలు బయలుదేరుట.

నిద్ర:—అర్ధరాత్రమువరకు నిద్రపట్టకపోవుట. పెందలకడనే ప్రతి దినమునను, ఒకేగంటకు మెలుకువవచ్చుట.

వుద్రేకము:—నిద్రించినపిమ్మట, వెచ్చని గదిలో, క్వాయినావలన, సంభోగమువలన.

దీనికి ముందుగాని, వెనుకగాని చైనా మరియు వైన్—ను వాడ రాదు.

విరుగుళ్లు:—ఇగ్నేషియా, పల్సటిల్లా.

పోలికలు:—యాగ్నస్ కేస్టస్, కెలాడియం సెగ్, సల్ఫరు, యాసిడ్ ఫాస్.

మోతాదు:—$6_x$ మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 5 మొదలు 6 వారములు.

---

## 387. సైలీషియా లేక సిలికా. SILICEA—SILICA.

(సైకతము. సూస్లరుగారి ద్వాదశలవణములలో నిది 12 వది).

కురుపులు, రాచకురుపులు మొదలగునవి పక్వమునకు రాకపోవుట వలన కురుపులనుండి చీము వెలువరింపబడక, వాపు, బాధ యెక్కువగు నప్పుడును, టీకాలవలని దుర్గుణములు, భగందరము, పుట్టవ్రణము, అంతర కుసుమలు, మూర్ఛ లేక అపస్మారము, బుడ్డ, మాంసగ్రంథులవాపు, శుక్ల నష్టము మొదలగు వ్యాధులమీదను ఇది బాగుగా పనిచేయును.

మనస్సు:—నిరాశ, జీవనమునందసహ్యత, పరధ్యానము, ఆతురత, ధ్వనులను భరింపలేకపోవుట.

తల:—చిన్నచిన్న పొక్కులు బయలు దేరివీటినుండి పసుపుపచ్చని పొరవము వెడలుట. బాధగా నుండుట. దుర్వాసనతోయుండు చెమట యెక్కువగా పట్టుట. తల త్రిప్పువలన రోగి ముందరకుగాని, యెడమ వైపునకుగాని పడిపోవుచున్నట్లుండుట.

కన్నులు:—అంతకుసుమలు లేక కేటరాక్టును, మశూచికములో కిరణాభేద్యమైన పొరవంటిపదార్థము బయలుదేరుటవలన దృష్టి చెదరుటను మాన్పును. కనురెప్పలపైని కాయలు బయలుదేరుట. ఆఫీసులో పనిచేయు వారికి వచ్చు అంతరకుసుమలు లేక కేటరాక్టు.

చెవులు:—దుర్వాసనతోనుండు చీముకారుట. ఎముకలు పుచ్చుట. పిస్తోలు పేల్చినట్లు చప్పుడయినట్లుండుట. చెవులలో హోరు.

ముక్కు:—ముక్కుచివర దురదగానుండుట, వుదయమున తుమ్ము

లువచ్చుచుండుట. ఎముకలు నొప్పిగాయుండుట. దిబ్బడవేయుట. వాసన తెలియక పోవుట.

ముఖము:—గడ్డముమీద చిన్న చిన్న పొక్కులు బయలు దేరుట. పార్శ్వపునొప్పి. కందులు.

నోరు:—నాలుకపైని వెంట్రుకయున్నట్లు భావన గలుగుట. చల్ల గాలివలన ఇగుళ్లలో బాధగానుండుట. పంటికురుపు.

గొంతుక:—అప్పుడప్పుడు గవదకాయలు వాచుట. బాధగానుండుట. థైరాయిడు గ్రంథి వాపుమీద బాగుగా పని చేయును.

అన్నకోశము:—పులితేన్పులు. గుండెలలో మంట. చలి, వున యమున వమనములు—వీటితోనుండు అజీర్ణము (నేట్రంఫాసు, కాల్కేరియాఫాసు). విపరీతమైన ఆకలి. పానీయములు త్రాగినవెంటనే వమనమగుట. ఆకలి తక్కువగానుండుట. దాహ మెక్కువగానుండుట.

పొత్తికడుపు:—పిల్లల వూసగపొట్టను మాన్పును. కాలేయము గట్టిపడుట. గజ్జలలోని మాంసగ్రంథులు వాచుట. పొంగరంచిగట్టిగానుండుట. పిల్లలలో క్రిమిరోగమువలని శూల.

మలము, మలాశయము:—విరేచనబద్ధము. మలము కొలదిగా వెడలి తక్కినది వెనుకకుపోవుట. ఆసనములోని పుండ్లను, భగంవరమును మాన్పును. మూలశంఖ బాధ యెక్కువగా నుండుట.

మూత్రావయవములు:—మూత్రములో చీము, ఆమముకలసి వెడలుట. కొరియాజబ్బులోగాని క్రిమిదోషమువలనగాని పిల్లలు నిద్రలో మూత్రమును అప్రయత్నముగా విడచుట. తరుచు మూత్రానుమానము గలిగినను మూత్రము కొద్దిగా వెడలుచుండుట.

పురుషావయవములు:—వృషణములపై చర్మము యేనుగు చర్మమువలె దళసరెక్కుట. బుడ్డ. జీర్ణించిన శెగవ్యాధిలో పసుపుపచ్చని, చిక్కని చీమువంటి స్రావము వెడలుట. శుక్లనష్టము, నపుంసకత్వము,

స్త్రీ అవయవములు:—తరచు నీళ్లలో నానుటవలన ఋతువు అణచిపెట్టబడుట బహిష్టుకు బహిష్టుకు మధ్య స్రావము కలుగుట. స్తనములపై కురుపు బయలుదేరి లోతైన పుండ్లుపడుట. బిడ్డకు స్తన్యమిచ్చునప్పుడు ప్రతిసారియు మర్మావయవమునుండి రక్తముస్రవించుట. పసుపుపచ్చని స్రావముతోనుండు కుసుమ.

శ్వాసావయవములు:—చన్నీరు త్రాగుటవలన దగ్గు హెచ్చుట. శ్లేష్మము యెక్కువగాను, చిక్కగాను, చీమువలెను, ఛాతీలో నీరసముతోను యుండుట.

హృదయము:—వడిగా నడచుటవలన గుండెదడ వచ్చుట.

కాళ్లు, చేతులు:—భుజములమధ్య నొప్పిగా నుండుట. వ్రాయుచున్నప్పుడు చేతులు కంపించుట. చాలదూరము నడచుటవలన పాదములకు నొప్పులతోవచ్చు కంపములను మాన్పును.

చర్మము:—మేహకురుపులు, పుండ్లు, రాచకురుపులు, దద్దురులు, పుట్టవ్రణములు, మొటిమలు, పీటియాన్నిటిమీదను పనిచేయును, కుష్టుమీద పనిచేయును. కురుపులు మొదలగు వాటిని పక్వమునకు తీసికొనివచ్చి చీమును వెలుపరించి వాటిని మాన్పును.

నిద్ర:—నిద్రలో మాట్లాడుట. శరీరము వెచ్చగా నుండుటతో నుండు నిద్రలేమి.

జ్వరము:—క్షయ సంబంధమైన జ్వరమున్నప్పుడు అరికాళ్ళలో మంటగానుండుట. కురుపులు చీము పట్టుట వలనను, పగటియందు చలితోను యుండునట్టిజ్వరము.

వుద్రేకము:—రాత్రియందు, పౌర్ణమికి, అమావాస్యకు, వుదయమున, బహిష్టులో, యెడమవైపునపరుండుట వలన, చల్లతనము వలన.

వుపశమనము:—వేడివలన, వెచ్చనిగదిలో, వేసవిలో.

సహచరులు:—పల్సటిల్లా, తూజా.

విరుగుళ్లు:—యాసిడుఫ్లోరిక్, హెపారుసల్ఫ, కేంఫరు.

సల్ఫరు, మెర్క్యూరియసు—లకిదివిరుగుడు.

పోలికలు:—హెపారుసల్ఫ, గన్‌పౌడరు.

దీనిని మెర్క్యూరియసునకు ముందుగాని వెనుకగాని వాడరాదు.

మోతాదు:—3 x మొదలు 1, 00, 000 పొటెన్సీ. ఇది 6x, 12x, 30x పొటెన్సీలలో పోడుమురూపమున బాగుగాపనిచేయుచున్నది. దీనిగుణకాలపరిమితి 40 లగాయతు 50 దినములు. ఇది 6x లోను ఇంతకు చిన్నపొటెన్సీలలోను అరకురూపమునను మాత్రలలోను తయారవదు.

---

## 388. సిలికా మెరీనా. SILICA MARINA.

ఇది నిలువగాయున్న విరేచనబద్ధమును మాన్పును. దీనిలక్షణములు సైలీషియాను, నేట్రంమూరుసును, వీటియొక్క లక్షణ సమ్మేళనమునకు సరిపోవునట్లుండును. మాంసగ్రంథులు వాచుట, పెద్దవగుట, బాధగానుండుట. పండ్లమీదజేరిన టార్టార్ (Tartar) అనబడు కాల్షియం (Calcium Deposit) సంబంధమైన పదార్థముజేరుట—వీటినిది మాన్పును.

మోతాదు:—3x మొదలు 6x వరకు పోడుమును వాడవలయును.

---

## 389. స్కూకం ఛక్. SKOOKUM CHUCK.

ఇది యాంటిసోరిక్ యౌషధము. ఇది చర్మమును ఆమత్వచలకు సంబంధించిన రోగములమీద బాగుగా పనిచేయును. టీకాలవలని దోషములు, చెవినుండి చీమువచ్చు చుండుట, దుర్వాసనతోను, కుళ్లినట్లుండు వాసనతో విస్తారముగాను వెడలునట్టి స్రావములు, యెక్కువ దురదతోను, చీముతోను వుండునట్టి చర్మరోగములు, చర్మము ఆర్చుకొనిపోవుట, మంత్రిపుపొక్కులు, యెక్కువ నీళ్లవంటి స్రావము, తుమ్ములతోనుండు

జ్వరలక్షణములు, మాననటువంటి చర్మరోగములు—వీటిమీదనిది బాగుగా పని చేయును.

విరుగుళ్లు:—టబాకం.

పోలికలు:—సేటర్నింమూరు, మెలాండ్రినం, సేబర్నింకార్బ, గ్రాఫైటిస్, వేక్సినినం, మెజోరిఁం.

మోతాదు:—3x మొదలు 6x పొడుము.

---

## 390. స్టేనం అయోడ్. STANNUM IODATUM.

ఇది శ్వాసావయవ రోగములమీదను, ముఖ్యముగా క్షయ మీదను బాగుగా పని చేయును. విడవకుండా దగ్గవలయునని యుండుట, గొంతుకలో పొడిగానుండు ప్రదేశము (Dry Spot) వద్ద గిలిగింతలు పెట్టుచున్నట్లుండుటవలన ఒకప్పుడు దగ్గు వచ్చుచుండుట, గొంతుక ఆర్చుకు పోయినట్లుండుట, పొగత్రాగువారిలో స్వరపేటికలోను, శ్వాసనాళములలోను, వచ్చు చిరచిర, దగ్గు పెద్దశ్వాసతోను, గుల్లగాను, స్రావముతోను యుండుట, చీమువంటి స్రావము వెడలుచుండుట, క్షయయొక్క మధ్య, ఆఖరుదశలలోని లక్షణములు, దగ్గుటవలన పాలిపోయిన పసుపుపచ్చని శ్లేష్మము వెడలుచుండుట దీనివలన గొంతుకలోను, ఛాతీలోను ఆర్చుకుపోయినట్లుండుట—వీటిమీదనిది బాగుగా పని చేయును.

మోతాదు:—3x మొదలు 6x వరకు సొడును.

---

## 391. స్టేనం—స్టేనం మెటాలికం.

## STANNUM—STANNUM METALLICUM.

నరముల మండలమునను, శ్వాసావయవములకును సంబంధించియుండు రోగములమీదను యిది బాగుగా పని చేయును. రోగి శరీరమునందును, మనస్సునందును యొక్కువ నిస్త్రాణ జెందియుండుట, ముఖ్య

ముగా క్షయసంబంధమైన తత్వముగలవారికి శ్వాసనాళ సంబంధమైన రోగలక్షణములు చీమువంటి స్రావము విస్తారముగా వెడలుటతోనుండుట, బాధలు నెమ్మదిగా కలుగుచును నెమ్మదిగానే పోవుచును యుండుట, పక్షవాత సంబంధమైన నీరసము, కంపములు మొదలగు లక్షణములు, మాట్లాడుటవలన రోగికి గొంతుకలోను, ఛాతీలోను నీరసము వచ్చినట్లు తోచుట—ఇవి దీని వుపయోగమును సూచించును.

మనస్సు:—పరిజాభీతి, విచారము, ఆతురత.

తల:—నుదిటిలోను, కనుబొమలలోను నొప్పిగా యుండుట. నడచుటవలనిచప్పుడు తలలో ప్రతిధ్వనించునట్లు బాధగానుండుట. వికారముతో నుండునపుడు యెదుటి వస్తువులన్నియు చాలదూరముగా నున్నట్లు తోచుట.

గొంతుక:—ఆర్చుకుపోయి పట్టుచున్నట్లు బాధగా యుండుట. శ్లేష్మము గొంతుకలో చుట్టబెట్టుకొని యుండుటవలన వెలువరించుట కష్టముగా నుండుట.

అన్నకోశము::—వండుచున్న పదార్థముల వాసన తగులుటవలన వాంతియగుట. రుచి చేదుగా నుండుట. కడుపుఖాళీగా నున్నట్లుతోచుట. యెక్కువ ఆకలితో యుండుట.

పొత్తికడుపు:—బొడ్డుచుట్టూ పీకుచున్నట్లు బాధ. గట్టిగా నొక్కుటవలన వుపశమించునట్టి శూల.

మలము, మలాశయము:—క్రిమిదోషము. తొందరను, బాధను గలుగచేయునట్టి జిగట, రక్తవిరేచనములు.

పురుషావయవములు:—సంభోగేచ్ఛ యెక్కువగుట. తరుచు స్ఖలనములగుటవలనవచ్చు నీరసము.

స్త్రీఅవయవములు:—దిగలాగుచున్నట్లు బాధగా తోచుట. కడుపులో నీరసము, ఖాళీగాయున్నట్లు భావన గలుగుట. గర్భాశయము

పెలుపలకు వచ్చుట (సేపియా). బహిష్టు త్వరగాను స్రావిన మెక్కువగాను అగుట. యెక్కువ నిస్త్రాణతోయుండు కుసుమను మాన్పును.

శ్వాసావయవములు:—ఛాతీలో నీరసముగా యుండుటవలన మాట లాడ లేకపోవుట. శ్వాస కష్టమువిూద పెడలుచుండుట. యెడమవైపు పరుండినప్పుడు శ్వాస తీయుటవలన కుట్టుచున్నట్లు నొప్పివచ్చుట. క్షయ సంబంధమైన జ్వరము, స్రావములు. బొంగురుతనము. గట్టిగా దగ్గునప్పుడు మాత్రమే శ్లేష్మము పెడలుట. సాయంకాలము నుండి అర్ధరాత్రివరకు విపరీతముగా పొడిదగ్గు వచ్చుచుండుట.

కాళ్లు, చేతులు:—పక్షవాత సంబంధమైన నీరసము. పట్టుకొన్న వస్తువులను వదలివేయుట. చీలమండలువాచుట. కలమును పట్టుకొనినపుడు వేళ్ళకు కంపము వచ్చుట. కుట్టుపని చేయువారికివచ్చు పక్షవాతమువిూద పనిచేయును. నరముల సంబంధమైన బాధలు.

నిద్ర:—ఒక కాలును చాపుకొని రెండవ కాలును ముడుచుకొని నిద్రించుట.

జ్వరము:—సాయంకాలమున యెక్కువ వెచ్చదనముతో యుండుట. రాత్రియందును, ముఖ్యముగా వుదయమగుసరికి నిస్త్రాణను కలుగ జేయునట్టి చెమటలుపోయుట. క్షయజాతిజ్వరము, చెమటలు ముఖ్యముగా నుదిటిలోను, మెడవిూదను పోయుచుండుట.

వుద్రేకము:—కంఠధ్వనిని వుపయోగించుట(నవ్వుట, మాట్లాడుట, పాడుట) వలన, కుడివైపు పరుండుటవలన, వెచ్చని పానీయముల వలన.

వుపశమనము:—దగ్గుట వలన, శ్లేష్మము వెడలిన పిమ్మట, గట్టిగా నొక్కుటవలన.

బంధుత్వము:—పల్సటిల్లా.

మోతాదు:—3 మొదలు 200 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 5 వారములు.

## 392. సల్ఫరు. SULPHUR.

(గంధకము).

ఇది గొప్ప యాంటీసోరిక్ ఔషధము. ఇది శరీరమునందలి కల్మషమును బయటకు పలువిధముల వెలుపరించుచుండును; ఇందువలన సాధారణముగా చర్మమునందు వెచ్చదనము, మంట, దురద కలుగుచుండును. తరుచు శరీరమునకు వుడుకు, లేక వెచ్చని తగులుచుండుట, నీటియందు అయిష్టత కలుగుట, వెంట్రుకలు, చర్మము, పొడిగాను, గట్టిగాను లేక బిరుసుగాను వుండుట; అవయవద్వారములు లేక రంధ్రములు యెర్రగానుండుట, వుదయమున 11 గంటలకు కడుపు ఆస్పృకొనిపోయినట్లుండుట, క్షణకాలము మాత్రమే కునుకు లేక నిద్రపోవుట—ఇవి దీనిముఖ్యలక్షణములు. క్షయసంబంధమైన తత్వములమీదను, పలుచని శరీరము, వంగిన భుజములుగలిగి, ముసలివారివలె వీపును భుజములను వంచి నడచువారికిని, ఎల్లప్పుడును చర్మరోగములతో బాధపడుచు పరిశుభ్రతతో నుండనివారికిని యిది బాగుగా పనిచేయును, పిల్లలు స్నానముచేయుటకును, శరీరము కడుగుకొనుటకును యిష్టపడకుండుట, పిల్లలు చిక్కిపోయి, పూసరపొట్టతోను, అస్థిమితముతోను, శరీరము వెచ్చదనముతోను, రాత్రియందు కప్పబడిన బట్టలను తోసివేయుచును యుండుట; క్రిమిదోషముచే బాధపడుట, సరిగా యెంచి యివ్వబడిన ఔషధము పనిచేయకుండుట, తరుణవ్యాధులలోగాని యెక్కువబాధతోనుండునట్టి వ్యాధులలోగాని జాగ్రత్తగా యెంచి యివ్వబడిన మందులు పనిచేయకపోవుట, ఇవి దీనివుపయోగమును సూచించును. పొక్కులు, దద్దురులు మొదలగు చర్మరోగములను అణచిపెట్టుటవలన వచ్చినట్టి క్షయరోగము, ఘోరమైన చర్మవ్యాధులు, దీర్ఘవ్యాధులు బయలుదేరుచుండునపుడు ఇది వుపయోగపడును (కాస్టికం, సోరినం).

మనస్సు:—అన్నివిషయములను మరచిపోవుచుండుట. ఆలోచన చేయుట కష్టముగా నుండుట, చింకిరిగుడ్డలు చూచి అందమైనవస్తువు

లనుకొనుట. తాను అధిక ఐశ్వర్యవంతుడ ననుకొనుట. పెద్దవారు చిన్న పిల్లలవలె సులభముగా కోపము జెందుచుండుట. యెప్పుడును తీరికలేక యుండుట. రోగులెప్పుడును చిరచిరలాడుచు, విచారగ్రస్తముగాను, పల్చని శరీరముతోను, ఒకప్పుడు మంచి ఆకలితోగూడ నుండుట.

తల:—నడినెత్తిని యెప్పుడును నెచ్చగా నుండుట (గ్రాఫైటిసు). తలను కదల్చుటవలన మెదడు కపాలమునకు కెరటములవలె కొట్టుకొనుచున్నట్లు బాధగా నుండుట. నియమితకాలములయందు వచ్చునట్టి తలనొప్పులు. దురదగానుండుప్రదేశమున గోకుటవలన మంటగా నుండుట. నడినెత్తి అర్చుకుపోయినట్లుండుట. వెంట్రుక లూడిపోవుచుండుట. తల నిండుగాను, భారముగాను యుండుట. కనుబొమలలో నొక్కుచున్నట్లుండుట.

కన్నులు, కనురెప్పలు:—కండ్ల నెక్కువగా నుపయోగించుటవలన అంతఃపటలము వాచుట, బాధగానుండుట. దీపముచుట్టు పరిధి కనుపించుట. కనురెప్పలచివళ్లు ఆర్చుకుపోయి దురదగాను, మంటగానుయుండుట. కనురెప్పలలో ఇసుకపోసినట్లు బాధగా నుండుట. రాత్రులయందు కనురెప్పలు అంటుకొనుట. కాచబింబముపైని చిన్నచిన్న పుండ్లు, పొక్కులు బయలుదేరుట. మానవటువంటి కండ్లకలకలు. కాచబింబము కిరణాభేద్యముగానగుట. చాలసేపు ఒకేవస్తువును చూచుచుండుటవలన దృష్టి చెదరుట. సూర్యకాంతిని చూచుట కష్టముగా నుండుట.

చెవులు:—చెవినుండి చీము వెడలుట నణచిపెట్టుటవలని దోషములు. స్రావముతోవచ్చు చెముడు. పిల్లల చెవులు యెర్రబడుట.

ముక్కు:—వాచి, యెర్రగాను, బాధగాను యుండుట. సాయంత్రము 3 గంటలకు వికారముతో రక్తస్రావము వచ్చుట. ముక్కునొప్పిగా యుండుట. బహిరంగమైన గాలిలో మంటతోనుండు నీళ్ళవంటి స్రావము వెడలుట, ముక్కు దిబ్బడవేయుట. పక్కులు కట్టుచుండుట.

ముఖము:—జబ్బుపడినవానివలె పాలిపోయి వుండుట. కండ్లు లోతునపడుట. ముఖము, దౌడలు, వీటిమీద యెర్రని గుండ్రని మచ్చలు పడినట్లుండుట. బహిరంగమైన గాలిలోను, రాత్రియందు పడకలోను, చన్నీటితో కడుగుటవలనను, పంటిపోటు వచ్చుచుండుట; మరియు తలకు భారము, చెవిపోటు వచ్చుచుండుట.

నోరు:—పెదవులు ఆర్చుకుపోయి, యెర్రగాను, మంటగాను వుండుట. ఉదయమున నోరు చేదుగానుండుట. ఇగుళ్లువాచుట; వీటినుండి రక్తము స్రవించుట. నాలుకపై తెల్లని పూత గలుగుట, నాలుక చివరను నాలుకనంచులను యెర్రగానుండుట. జ్వరములోను, రసదోషము వలనను నోటినుండి నీరూరుచుండుట.

గొంతుక:—ఆర్చుకుపోయి, గరుకుగా నుండుట. గోకుచున్నట్లుండుట. వెంట్రుకయున్నట్లు భావన గలుగుట. మంటగాను, యెర్రగాను, ఆర్చుకుపోయి యుండుట. వుండవంటిది పైకి యెగబ్రాకి సత్తుపథను మూసివేసినట్లు భావన గలుగుట.

అన్నకోశము:—తియ్యని (ఆర్జెంటంనైట్రికం), పుల్లని ఆహారపదార్థములయందును, నీళ్ళయందును, పాలయందును; ఆల్కహాలు, బీరు, విస్కీ మొదలగు ఉద్రేకమునిచ్చు పానీయములందును, కోర్కెగలిగి యుండుట. ఆహారము యెక్కువఉప్పగానుండుట. పుల్లని తేన్పులువచ్చుచుండుట. ఆకలి పూర్తిగా నశించిపోవుట, లేక అతిఆకలిగానుండుట. పుల్లని వమనమువచ్చుచుండుట, కడుపులో మంటగాను, బాధగాను, బరువుగాను యుండుట. తరుచు ఆహారము తినవలసివచ్చునంతటి ఆకలి; ఆహారము తినినచో తలనొప్పి, నీరసము వచ్చుట. అజీర్ణమువలన గుండెలలో మంట వచ్చుట. గర్భిణీలోవచ్చువికారము. వుదయమున 10 గంటలకు కడుపుఖాళీగాయున్నట్లును, సొమ్మసిల్లునట్లును యుండుట.

పొత్తికడుపు:—ముట్టుకొనుటకు నొప్పిగా యుండుట. సజీవముగానుండునదేదో కదులుచున్నట్లు తోచుట (క్రోకస్ సతీవస్, తూజా). కాలే

యముపైని నొప్పిగా యుండుట. పానీయములు త్రాగినపిమ్మట శూల వచ్చుట. పైత్యరసము వృద్ధియగుట. కాలేయమువాచి గట్టిపడుట. గాఢముగా వూపిరి పీల్చునప్పుడును, నడచుచున్నప్పుడును, ప్లీహములో కుట్టుచున్నట్లు బాధగానుండుట. గుడగుడలాడుట. కుళ్లిన గ్రుడ్లవాసనను పోలిన అపానవాయువు వెడలుట. వమలుచున్నట్లుండు శూల: ఇది విరేచనమగుటకు ముందుగావచ్చుట. శరీరమును వక్రముగా త్రిప్పుట లేక వంచుట వలన లక్షణము లుపశమించుట.

మలము, మలాశయము:—ఆసనము దురదగాను, మంటగాను యుండుట. పొత్తికడుపులో రక్తమెక్కువగా జేరుటతోనుండు మూలశంఖ. రాత్రియందు శూలతోకూడిన తీపుతోవచ్చు తెల్లని నీళ్ళవిరేచనములు; పులిసిన వాసనతోనుండు జిగటవిరేచనములు; వీటివలన వుదయమున తొందర కలుగుచుండుట. తరుచు రోగములతో బాధపడుచుండెడి లేక క్షయ సంబంధమైన తత్వములతో నుండు పిల్లలకు బాధలేకుండగను, దుర్వాసనతోను, నీళ్లవలెను, అప్రియత్నముగాను, వెడలు విరేచనములమీద బాగుగా పనిచేయును. ఒకమారు విరేచనబద్ధము, ఒకమారు నీళ్ళవిరేచనములు వుండుట. బయటకు రానట్టి పిలకలతో నుండు మూలశంఖరోగము. ఒకప్పుడు వీటినుండి నల్లనిరక్తము వెడలుచును, నడుములో దిగలాగుచున్నట్లు బాధయుండుట. మలము చిట్లుకట్టినట్లు గట్టిగా వెడలుట. ఆసనము పుండుపడుట.

మూత్రావయవములు:—హిస్టీరియా కంపము వచ్చినపిదప రంగులేనట్టి మూత్రము విస్తారముగా వెడలుట. మూత్రము ధారగా వెడలుచును, ఆగుచును యుండుట లేక సన్నని ధారగా వెడలుట. మూత్రానుమాన మాకస్మికముగా కలుగుట. మూత్రము నప్రియత్నముగా విడచుట. మూత్రము దుర్వాసనతో వెడలుట.

పురుషావయవములు:—అంగములో కుట్టుచున్నట్లుండు నొప్పి. స్ఖలనము లప్రియత్నముగా నగుట. అంగము ముడుచుకొనిపోయి, శక్తి

తక్కువై చల్లబడుట. వృషణములు వ్రేలాడు చుండుట. దుర్వాసనతో గూడిన చెమటతోను, దురదతోను యుండుట.

స్త్రీ అవయవములు:—మర్మావయవద్వారము మంటగా నుండుట. ఋతువు చాల ఆలస్యముగాను, స్రావము తక్కువగాను, చిక్కగాను, నల్లగాను, దుర్వాసనగాను, ఒరుపును గలుగ జేయుదును, కష్టముమీదను వెడలుట. చన్మొనలు బీటలుతీయుట. చురుక్కుమనుచు నొప్పిగా యుండుట. మంటగా నుండుట. మంటతోను, ఒరుపుతోను, వెడలునట్టి పసుపు పచ్చని కుసుమ. బహిష్టుకు పూర్వము తలనొప్పి వచ్చుట లేక బహిష్టు అణచిపెట్టబడుట.

శ్వాసావయవములు:—ఛాతీలో మంటగాను, నొక్కుచున్నట్లు బాధగాను వుండుట. శ్వాస కష్టముగా నుండుటవలన గదితలుపులను బారుగా తెరచియుంచవలసి వచ్చుట. ఛాతీలో బరువు. అర్ధరాత్రిమున వూపిరాడక పోవుటవలన కూర్చొని వూపిరి పీల్చవలసి వచ్చుట. ఆమము యెక్కువగా జేరుటవలన ఛాతీలో గురగురలాడుచుండుట.

హృదయము:—మెల్లెక్కినప్పుడును, యెత్తెక్కినప్పుడును గుండెదడ వచ్చుట. హృదయము పెద్దదైనట్లు తోచుట.

నడుము, కాళ్ళు, చేతులు:—నడుము వుండీలబద్దవలె వంగుట. వెల్లుల్లి వాసనతోనుండు చెమటలు చంకలలో పోయుట. అరికాళ్లు మంటలుగానుండుటవలన కప్పుకొనిన బట్టను తీసివేయ వలెనని యుండుట. అనికాయలవద్ద నొప్పులుగాను, పోట్లుగాను యుండుట.

చర్మము:—మొద్దుబారుట, విపరీతమైన దురద; మరియు గోకిన పిదప మంటగాను, బాధగాను యుండుట. పడక వేడిమివలన దురద వచ్చుట. చిన్నచిన్న నరుకులు, రాపడములు వాచి బాధగా నుండుట, చీముపట్టుట. పుండ్లవంచలు యెత్తుగానుండి రక్తము, దుర్వాసనగానుండు చీము స్రవించుచుండుట.

నిద్ర:—పగలు ఆపుకొనలేనంతటి నిద్రవచ్చుట. రాత్రియంతయు మేలకువతో నుండుట, ఆవలింతలు, ఆతురత, భయము, విసుగుదలతో నుండు కలలు వచ్చుట.

జ్వరము:—నడుము దిగువనుండి చలి యెగబ్రాకుట. తరుచు వెచ్చదనము గలుగుచుండుట. రాత్రియందు విస్తారముగా చెమటపోయుట. గంధకపు వాసనతో నుండు చమటపట్టుట, స్వల్పపరిశ్రమవలన గూడ చెమటపట్టుట.

ఉద్రేకము:—సాయంత్రమున, విశ్రాంతివలన, నిలుచుండినపుడు, పడకవేడిమివలన, ఆల్కహాలు సంబంధమైన వుద్రేకమునిచ్చు పానీయముల వలన, నియమితకాలములయందు.

ఉపశమనము:—పొడిగాను, వెచ్చగాను, యుండునట్టి గాలిలో; కుడివైపున పరుండుటవలన, నడుచుటవలన, కదలికవలన.

సహచరులు:—ఏలోస్, సోరినం, ఎకోనైట్.

దీనికి ముందరగా కాల్కేరియా కార్బను వాడరాదు.

విరుగుళ్లు:—కేంఫరు, మెర్క్యూరియసు, పల్సటిల్లా, ఎకోనైట్, కేమోమిల్లా, చైనా, రూస్టాక్స్, సేపియా.

చైనా, అయోడియం, మెర్క్యూరియసు, యాసిడునైట్రికు, రూస్టాక్స్, సేపియా, మరియు లోహములవలని దోషముల—కిదివిరుగుడు.

మోతాదు:—3x మొదలు 1, 00, 000 పొటెన్సీ. దీని గుణకాల పరిమితి 40 మొదలు 50 దినములు.

---

## 393. సల్ఫర్ అయోడేటం. SULPHUR IODATUM.

ఇది సులభముగా మానకటువంటి లేక మొండి చర్మరోగములు, ముఖ్యముగా మొటిమలు, నీళ్లవంటి స్రావము కారుచుండెడి మంత్రపు

పొక్కులు, మంగలిక త్తిరోగముపలనవచ్చు దురదతోకూడిన అంటువ్యాధి సంబంధమైన చర్మరోగములు—వీటిమీద బాగుగా పనిచేయును.

తల:—నుదటిలో నొప్పి, బిగపట్టినట్లుండుట. వెంట్రుకలు నిలుచున్నట్లు భావనగలుగుట.

గొంతుక:— కొండనాలుక, గవదకాయలు పెద్దవగుట, యెఱ్ఱబడుట. నాలుక దళసరెక్కుట.

మలము, మలాశయము:—ఆసనము దురద, విరేచనబద్ధము.

పురుషావయవములు:—శిగలో పసుపుపచ్చని స్రావము. మూత్రము బంధింపబడుట.

చర్మము:— మూత్రికోశనాళము, చెవులు, ముక్కు, దురదగానుండుట. మెడమీద కురుపులు బయలుదేరుట. చేతులపై దురదతోనుండు దద్దురు బయలుదేరుట.

మోతాదు:—$6_X$ పొడుము.

---

## 394. టెల్లూరియం. TELLURIUM.

నడుము బాధకరముగా నుండుట, లక్షణములు క్రమముగా వృద్ధి జెందుట, శరీరమంతయు నొప్పులుగా నుండుట, స్రావములు దుర్వాసనగా యుండుట—యివి దీని సాధారణలక్షణములు.

మెదడును చితుకకొట్టినట్లు భావన, బాధగానున్నచోట్ల ముట్టుకొనెదరను భయముగలుగుట, నిద్రకువెళ్ళుటతో గాలిలోనున్నట్లు తోచుట, చెవిలో యీలవేసినట్లు భావన, పొట్టపైభాగమున పటకాతో బిగకట్టినట్లు భావన—ఇవిదీని ప్రత్యేకలక్షణములు.

తల:—తలకు, మెడకు రక్తమెక్కువగాచేరుట, యిందుతోపొట్టలో నీరసముగలుగుట, తలదురద, ఎఱ్ఱనిమచ్చలు, బయలుదేరుట.

కన్నులు:—రెప్పలుదురద, దళసరెక్కుట, వాపు, బాధ. అంతర కుసుమలు.

చెవులు:—చేపవాసనవేయు చీముపెడలుట (పల్సటిల్లా, బెల్లడోనా). చెవుల వెనుక మంత్రిమువంటి చర్మరోగములు బయలుదేరుట. చెవుడు. గూబలోవాపు, దురద, బాధ.

ముక్కు:—జలుబు, దిబ్బడవేయుట.

అన్నకోశము:—యాపిల్ పండ్లయెడల కోరికగలుగుట. గుండెల లోమంటగానుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—మోకాళ్లలోని సంధిబంధనములు (Tendons) ముడుచుకుపోవుట. సయాటికా.

చర్మము:—ముఖముమీదను శరీరమందు ఇతర పార్శ్వములందును వెంట్రుకల కుదుళ్లనద్దను బయలుదేరు తామర (ట్యూబర్క్యులినం, బేసిలినం, సేపియా, నేట్రింమూరు), మంగలిక త్తివలని దోషములు (కాలీసల్ఫు).

చమట వెల్లుల్లివలె దుర్వాసనగాయుండుట. పల్లికలవలె బయలు దేరు చర్మరోగములు. ఒకదానికొకటి సమీపమునవుండు అనేకఅవయవములమీద లేక కోశముఃమీద తామర బయలుదేరుట (కాల్కేరియా కార్బ్, సేపియా). తామరబయలుదేరిన ప్రదేశము ఎత్తుగానయి దురద, మరియు నీళ్లవంటి స్రావము వెడలుట.

వృద్ధికము,—రాత్రియందు, విశ్రాంతితోనున్నప్పుడు, చల్లని గాలిలో, నొక్కుటవలన, తాకుడువలన, నవ్వుటవలన, బాధగానున్నవైపు పరుండుటవలన.

విరుగుళ్లు:—నక్సువామికా.

పోలికలు:—ఆర్సెనికంఆల్బం, సేపా, రేడియాబ్రోం, సెలీనియం.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

## 395. తాల్లియం. THALLIUM.

బట్టతల, కండ్లు అంటుకొనుట, దిగువ అవయవములకు పక్షవాతము వచ్చుట, అతి తీవ్రముగా పొడుచుచున్నట్లు, నొక్కుచున్నట్లు యుండు నరములసంబంధమైన బాధలు అగిఆగివచ్చుచుండుట, రాత్రియందు క్షయ సంబంధమైన చమటలుపోయుచుండుట—ముఖ్యముగా వీటిమీద నిది పని చేయును.

తల:—వేగముగా వెంట్రుకలూడిపోవుట.

కన్నులు:—తరుచు విస్తారము చీముపంటి స్రావము.

నోరు:—నీళ్ళూరుచుండుట.

అన్నకోశము, పొత్తికడుపు:—వికారము, వమనములు, ఆకలిలేమి, తీవ్రముగా పొడుచుచున్నట్లుండు బాధలు.

మలము:—విరేచనబద్ధము; నీళ్లవిరేచనములు, రక్తవిరేచనములు.

శ్వాసావయవములు:—శ్వాస నెమ్మదిగాను కష్టముగాను పీల్చుట.

హృదయము:—నెమ్మదిగా కొట్టుకొనుట.

కాళ్లు, చేతులు:—నీలిరంగుగానగుట. చీమలు ప్రాకుచున్నట్లుండుట.

సాధారణలక్షణములు:—రోగిచిక్కిపోవుట, కదులునపుడు తూలుటమున్నగునవి చేయుట.

పోలికలు:—పెట్రోలియం, కాస్టికం, ప్లంబంమెట్, అర్జెంటం నైట్రికం.

మోతాదు:—6 మొదలు 30 పొటెన్సీ.

## 396. తయూసినమిన్. THIOSINAMINUM.

కాచబింబము కిరణాభేద్యమగుట, అంతరకుసుమలు, కంతులవలె మాంసగ్రింధులవాపులు నిలువగా యుండుట. విరేచనముకొరకు వెళ్లి రోగి మూర్ఛిల్లుట.

చెవులు:—ధ్వనులు వినిపించుట. జలుబుతో చెముడు వచ్చుట. కొలదిబాధతో చెవినుండిచీము కారుట. చెవిలోనిపొర (Ear Drum) దళసరెక్కుట.

అన్నకోశము:—అతిఆకలి.

మూత్రావయవములు:—మూత్రిమెక్కువగా వెడలుట.

స్త్రీఅవయవములు:—గర్భాశయ సమీపమున కంతులు బయలు దేరుట.

శ్వాసావయవములు:—శ్వాస వడిగానుండుట.

సాధారణలక్షణములు:—శరీరము తూనికవృద్ధి యగుట.

పోలికలు:—సైలీషియా, యాసిడుఫ్లోరిక్, ట్యూబర్క్యులినం, యాసిడునైట్రికం, గ్రాఫైటిసు.

మోతాదు:—$6_X$ మొదలు 30 పొటెన్సీ.

---

## 397. యురానియం నైట్రికం. URANIUM NITRICUM.

అదిమూత్రము, మధుమూత్రము, కాలేయము దుస్థితిజెందుట, రోగి కృషించుట, నిస్త్రాణజెందుట, శరీరముకు నీరుపట్టుట లేక వుబ్బుట, స్త్రీరోగులలో బహిష్టు ఆలస్యమగుట మరియు నడుమునొప్పివచ్చుట; అమత్వచలు మరియు చర్మము అర్చుకుపోవుట—వీటిమీదనిది ముఖ్యము గాపనిచేయును.

తలలోనికి రక్తముప్రవహించుచున్నట్లుండుట. తలనొప్పితో జలుబు చేసినట్లుండుట, నడిపైపునకన్న ఎడమపైపునవున్న అవయవములు

దుస్థితి జెందినట్లుండుట — ఇవి దీని ప్రత్యేకలక్షణములు.

అన్నకోశమునందుగాని అంత్రమూలమునందుగాని బయలుదేరు (Duodenal ulcer—"also Gastric ulcer") పుండును మాన్పుటలో నిది అమోఘమైనది.

మనస్సు:—దినమంతయు అస్వస్థత గాయున్నట్లు భావన.

తల:—విచారముతో గూడినబాగ. అస్థిమితముగానుండుట.

కన్నులు:—ఎడమ పైకనురెప్పచివళ్లలో కాయలు, పొక్కులు బయలుదేరుట. కనురెప్పలువాచుట, అంటుకొనుట.

అన్నకోశము:—పుండుఅగుట, పుండువలని బాధ అన్నకోశము ఖాళీగాయున్నప్పుడు ప్రకోపించుట, భోజనానంతరమునగాని, పానీయములు త్రాగినపిదపగాని ప్రశమించుచుండుట. టీత్రాగుట యందు కోర్కెగలుగుట (సెలీనియం). అతిదాహము. పుబ్బరింపు. వాయువుజేరుట (లైకోపోడియం). మంటలుగానుండు బాధలు.

పురుషావయవములు:—రాత్రులందు స్ఖలనములగుచుండుటతో నపుంసకత్వము వచ్చుట. మర్మావయవములు చల్లబడి, తేమతోను, ప్రకోపము జెందకుండగను యుండుట.

స్త్రీఅవయవములు:—స్తన్యమధికముగా నుండుట. మూత్రరోగముతో బాధపడుచున్నప్పుడు ఋతుస్రావము ఆగిపోవుట, రోగి పాలిపోయి రక్తక్షీణతతో నుండుట.

మూత్రావయవములు:—అతిమూత్రము, మధుమూత్రము. మూత్రము చేపవాసనగాయుండుట. మూత్రము నాపుకొనినచో బాధవచ్చుట. మూత్రమప్రయత్నముగా వెడలుట (ముల్లీను ఆయిలు). మూత్రనాళమునందు మంటగాయుండుట.

ప్రకోపము:—రాత్రియందు, నడచుటవలన.

ప్రశమనము:—గాఢముగా వూపిరిపీల్చుటవలన.

పోలికలు:—కాలీబైక్, యాసిడుఫాసు, సిజీజియం జాంబోలినం, లేక్ డిఫ్లోరేటం, థైరాయిడినం, యాసిడు లేక్టిక్, లైకోపోడియం, సైలీషియా.

మోతాదు:—3x మొదలు 30 పొటెన్సీ.

---

## 398. ఎక్సురే. X-RAY.

దీనిని వాడుటవలన, అణచిపెట్టబడినరోగములు బయల్పడి, అంతరంగికముగానుండు రోగమాలిన్యములను వెలువరించి శరీరమునందలి జీవాణువుల యస్థితినిమాన్పి, రోగికి శారీరకముగాను మానసికముగాను స్వస్థతను దెచ్చును.

బాధలు భరింపశక్యముకాకుండుట, రక్తవిహీనత జెందుట మరియు రక్తమునందలి తెల్లకణములు ఎక్కువగా వృద్ధిజెందుట, కాలినపుర్దేశములు యెన్నాళ్లకును మానకుండుట, కఠినమగు చర్మరోగములు—ఇవిదీసి వుప రోగమును సూచించును.

తల:—మెడకొయ్యబారుట. తలగడనుండి తలనెత్తుటవలన మెడలోనొప్పివచ్చుట. ఆకస్మికముగా మెడనరము పట్టుట. గృచ్చుచున్నట్లుండునొప్పి.

చెవులు:—నిండుగాయున్నట్లుండుట. తలలో ధ్వనులగుచున్నట్లుండుట.

ముఖము:—కుట్టుచున్నట్లుండునొప్పి. కుడివైపు పైదవుడ యెముకలో నొప్పిగాయుండుట.

నోరు:—నాలుక గరుకుగాను, పొడిగానుయుండుట. గుటకవేయుటకష్టముగా యుండుట. వికారముగాయుండుట.

పురుషావయవములు:—శృంగారసంబంధమైన కలలు. వంధ్యత్వము.

వృషణములుయెండిపోవుట. సంభోగేచ్ఛనశించుట. సెగవ్యాధిఅణచిపెట్ట బడుట.

స్త్రీఅవయవములు:—అండాశయము గుస్తిలిజెందుట, ఎండిపోవుట, వంధ్యత్వముగలుగుట.

కాళ్లు, చేతులు:—మేహవాతదోషములు. నిస్త్రాణగానుండుట. అరిచేతులు గరుకుగను బీటలు దీసియు యుండుట. అలసటగాయుండుట.

చర్మము:—పొడిగానుండు మంత్రిపుపొక్కులతోగూడిన చర్మరోగము. పగుల్లు ఆర్చునుపోయి ముడతలు పడుట. గోళ్ళుదళసరెక్కుట. పురిపిరికాయలవంటివి బయలుదేరుట. కేన్సరుఅనబడు పుట్టవ్రణము.

వృద్ధిక్రమము:— పరుండునపుడు, అపరాహ్ణమందు, సాయంకాలమున మరియు రాత్రియందు, బహిరంగమైనగాలిలో.

మోతాదు:—30, 200 పొటెన్సీలు.

---

## 399. జింకం మెట్. ZINCUM METALLICUM.

నరములయందును, మెదడుయందును గలుగు నిస్త్రాణచే బాధపడువారికిని: ఋతువగుటకును, స్రావములను, మూత్రమును, వెలువరించుటకును ఆలోచనచేయుటకును, జ్ఞాపకముంచుకొనుటకును, శక్తిచాలనపుడును దీనిని వాడదగును. మానకుండగ పాదములనుగాని కాళ్లనుగాని కదల్చుచుండుట, ఋతుస్రావము వెడలుట ప్రారంభించినపుడు రోగలక్షణము లుపశమించినను స్రావము ఆగిపోయినయెడల రోగలక్షణములు తిరిగి కనిపించుట, ఎక్కువగా చదువుటవలనను, రాత్రియందు నిద్రపోకుండుట వలనను, అలసటవలనను వచ్చునట్టి తలదిమ్ము—ఇవి దీనిప్రయోగము సూచించును.

మనస్సు:—జ్ఞాపకశక్తి యుండకపోవుట. ధ్వనివలన లక్షణములు దీవ్రము జెందుట. బిడ్డకు చెప్పినసంగతులనుబిడ్డ తిరిగి చెప్పుచుండుట.

తెలివితక్కువగాను, సోమరతనముగాను వుండుట. ఎక్కువ వుగ్రముగా నుండ నుద్దేశించుట.

తల:—తలకు నీరుపట్టుట. నుదిటి కనుబొమలలో చీల్చుచున్నట్లు బాధగానుండుట. తలవెనుకను బాధ. నడినెత్తిని బరువుగా నుండుట. తలను చేతులను అప్రియత్నముగా కదల్చుచుండుట. తలదిమ్ము. నుదురు చల్లగాను, మెదడు దిగువభాగము వెచ్చగాను వుండుట. కష్టపడి చదువుకొనునట్టి పిల్లల తలనొప్పులను మాన్చును.

కండ్లు:—కనీనికాపటలమునందు గలుగు సవాయిసంబంధమైన రోగములు. సవాయి దోషములతోగూడిన కండ్ల కలకలు. మెదడుకు సంబంధించిన రోగములలో వచ్చు కంటియొక్క రోగలక్షణములు. మెల్లకన్ను. కండ్లలోను, కనురెప్పలలోను, మంటలుగా నుండుట.

చెవులు:—చీల్చుచున్నట్లుండు బాధలు. గూబ వాచుట. దుర్వాసనగా నుండు చీము కారుచుండుట. పిల్లలయొక్క చెవిపోటు.

ముక్కు:—నీళ్లవంటి స్రావము, దిబ్బడ వేయుట.

ముఖము:—మట్టిరంగువలె పాలిపోవుట. ఒకప్పుడు ఎర్రబడుట.

నోరు:—పండ్లు వదులుగా నుండుట. ఇగుళ్లనుండి రక్తము స్రవించుట. నాలుకమీద సీటిపొక్కులు బయలుదేరుట. పిల్లలకు పండ్లుసరిగా రాకపోవుట, నిస్త్రాణజెందుట.

గొంతుక:— అంగుడుమీదను నాలుకమొదటను, గవదకాయల మీదను రోగ సంబంధమైన సీటిపొక్కులవంటి చర్మరోగములు బయలుదేరుట.

అన్నకోశము:—మధ్యాహ్నము 11 గంటలకు తృప్తికలుగనట్టి ఆకలివేయుట. ఎక్కిళ్లు, వికారము. చేదుగానుండు ఆమమును వమనము చేసుకొనుట. తీపిపదార్థములను తినుటవలన కడుపులోను, గుండెలలోను, మంటవచ్చుట. వైనును కొలదిగా తీసికొనినను వికటించుట.

పొత్తికడుపు:—ఆహారమును కొద్దిగా తీసికొనినను కడుపుపొంగుట. నమలుచున్నట్లుండు బాధ, వుబ్బసముతో నుండు శూల. కాలేయము వాచి, గట్టిపడి, నొప్పిగా నుండుట. గజ్జలసమీపమున బయలుదేరు గిలక.

మలము, మలాశయము:—మలము పొడిగాను, గట్టిగాను వెడలుట. మలబద్ధము. పిల్లల కలరా లేక విరేచనములు, ఇవి ఆకుపచ్చని ఆమముతోను, చీముతోను కూడియుండినపుడిది పనిచేయును. టైఫసు సంబంధమైన విరేచనములు.

మూత్రావయవములు:—నరములదోషమువలన మూత్రము అణచిపెట్టబడుట. నడచునప్పుడును, దగ్గునప్పుడును మూత్రమప్రయత్నముగా వెడలుట.

పురుషావయవములు:—వృషణములు వాచుట, ఎగలాగుకొనిపోవుట. విపరీతమైన లేపనము గలుగుచుండుట. వెంట్రుక లూడిపోవుట. శుక్లనష్టము.

స్త్రీఅవయవములు:—యెడమ అండాశయములో బాధ. బహిష్టు ఆలస్యముగానగుట లేక అణచిపెట్టబడుట; యీలక్షణములు మర్మావయవములందును, స్తనములయందును బాధలతో కూడియున్నప్పుడు పనిచేయును. ప్రసవించిన కొద్దిరోజులలోనే స్త్రీలలో సంభోగేచ్ఛ గలుగుట. మైల అణచిపెట్టబడుట (పల్సటిల్లా). బహిష్టులో స్రావము రాత్రియందు యెక్కువగా గలుగుట. స్త్రీలయొక్క రోగలక్షణములు ఆతురతతోను, విచారముతోను, చల్లదనముతోను, నడుములో నీరసముతోను, పాదములను కదల్చుచుండుటతోను ఉండునపుడిది పనిచేయును.

శ్వాసావయవములు:—వుబ్బస వ్యాధితో ద్వంద్వముగా నుండు బ్రాంకైటిసు; దీనిలక్షణములు ఛాతీ ముడుచుకొని పోవుటతో నుండునపుడు పనిచేయును. స్రావము వెడలుట ప్రారంభించుటతోనే వూపిరి పీల్చుట కష్టముగానుండునట్టి లక్షణములు ఉపశమించుట.

హృదయము:—నాడి వక్రముగాను, నిస్త్రాణగాను యుండుట.

నడుము, కాళ్లు, చేతులు:—నడుములో నొప్పిగాయుండుట. పాదములు ఒరియుట, నీటిపొక్కులు బయలుదేరుట, కాళ్లపైని దుష్టరక్తనాళములు వాచుట. వెన్నెముక పొడుగునను మంటగానుండుట. వ్రాయుటవలనను, పరిశ్రమవలనను, మెడ లాగుచుండుట. అరికాళ్లలో నొప్పులు.

చర్మము:—కీళ్లసంధులలో దురదగానుండుట. నరముల దోషములతోను, రక్తహీనతతోను వుండునట్టిరోగులలో మంతిరిపు పొక్కులనంటే చర్మరోగములు. అణచిపెట్టబడిన చర్మరోగమును బయటకు తీసికొనివచ్చుటకును, అణచి పెట్టుటవలని దుష్టలక్షణములకును వాడవచ్చును.

నిద్ర:—నిద్రలో అరచుట భయముతో మెలకువ కెందుట. అవయవములను కదల్చుట, వులికిపడుట.

జ్వరము:—రాత్రియందు చెమటలు పట్టుట. తరుచు నడుములో జ్వర సంబంధమైన కంపములు వచ్చుచుండుట. కాళ్లు, చేతులు చల్లగానుండుట. రాత్రియంతయు చెమటలు పోయుచు వెచ్చగా నుండుట.

వృద్ధ్రికము:—తాకుడు వలన, నొక్కుట వలన, భోజనానంతరమున, సాయంకాలమందు, వైను త్రాగుట వలన, విశ్రాంతిలో, బహిరంగమైన గాలిలో, వెచ్చనిగదిలో.

వుపశమనము:—మర్దనము వలన, గోకుటవలన, తినుచుండినపుడు.

దీనిని "కేమోమిల్లా, నక్సువామికా" లకు ముందుగా గాని, వెనుకగా గాని వాడరాదు.

సహచరులు:—కాల్కేరియాఫాంసు.

పోలికలు:—ఎగేరికసు, ఇగ్నేషియా, ప్లంబం మెట్, ఆర్జెంటం మెట్, పల్సటిల్లా, హెల్లిబోరసు, ట్యూబర్క్యులినం.

విరుగుళ్లు:—కేంఫరు, హెపారుసల్ఫు, ఇగ్నేషియా.

కెరీటాకార్బ—నకిది విరుగుడు.

మోతాదు:—$6_X$ మొదలు 1,000 పొటెన్సీ. దీని గుణకాలపరిమితి 30 లగాయతు 40 దినములు.

---

## 400. జింకంఫాస్. ZINCUM PHOSPHORICUM.

ముఖ్యముగా నిది నరములదోషముల మీాద పనిచేయును.

మనస్సు:—అలసటజెందినట్లుండుటవలన మానసిక పరిశ్రమయందు యిష్టత. జ్ఞాపకశక్తి తగ్గుట.

తల:—నరముల దోషముతో కూడిన నొప్పి. వికారముగాను తల తిర్పుగాను యుండుట. తలనొప్పివలన తల బ్రద్దలగుచున్నట్లు తోచుట.

ముఖము:—నరములసంబాధమైన బాధలు.

అన్నకోశము:—వమనములు, వికారము.

మర్మావయవములు — సంభోగసంబంధమైన వుద్రేకముతో విపరీతమైన లేపనము. శృంగారసంబంధమైన కలలతో స్ఖలనములగుచుండుట.

నరములు:—అధికసంభోగమువలని నరములదోషములు.

నిద్ర.—నిద్రలేమి.

వుపశమనము:—పరుండుటవలన.

పోలికలు:—కాలీఫాసు, నేట్రింఫాసు, యాసిడుఫాసు.

మోతాదు:—$6_X$ మొదలు 30 పొటెన్సీ.

---

## 401. జింకంసల్ఫు. ZINCUM SULPHURICUM.

నరములు, కండ్లు. మర్మావయవములు. వీటికి సంబంధించియుండు పలువిధ రోగములమీాద నిది పనిచేయును.

తలలో మంటగానుండుట, మెరుపుతీగె తలగుండా వెడలుచున్న ట్లుండుటతో మెదడు చితికిపోవునట్లుండు బాధ. పొత్తికడుపు ముడుచు కుపోవుట, రక్తపరిసాగము కష్టముగానున్నట్లుతోచుట, శరీరమందంతటను గిలిగింతలు పెట్టినట్లుండుటతో నవ్వువచ్చుటను ఆపుకొనజాలకుండుట— ఇవి దీని ప్రత్యేకలక్షణములు.

మనస్సు:—చిత్తవిభ్రమము. పరాకుమాటలు. విచారము.

తల:—అతి దాహముతో గూడిన తలనొప్పి.

కన్నులు:—కాచబింబము కిరణాభేద్యమగుట. పాపలు పెద్దవగుట.

చెవులు:—హోరుమను ధ్వనులు.

ముఖము:—ముడతలుపడుట, పాలిపోవుట.

నోరు:—ఇగుళ్ళవాపులు, బాధలు. పుల్లనిరుచి.

అన్నకోశము:—నోరు పొడార్చుకొనిపోవుట. అతిదాహము. అజీర్ణమువలన ఛాతీలో మంట. కడుపులోమంట.

పొత్తికడుపు:—వాపు, బాధ, వీటితో బొడ్డువద్దముడుచుకుపోవుట మరియు, తీవ్రమయిన శూలవచ్చుట. విడువకుండగ యుండు శూల. గజ్జల లోను మూత్రకోశ సమీపమునను బాధ.

మలము, మలాశయము:—జిగటవిరేచనములు. ఆసనముతీపు. పైత్య విరేచనము. రక్తవిరేచనములు—వీటితో రోగి శుష్కించిపోవుట.

స్త్రీఅవయవములు:—బహిష్టుకు బహిష్టుకు మధ్య రక్తస్రావములు.

హృదయము:—కదిలినచో దడవచ్చుట. నాడి పరీక్షకు కలరాలో వలె ఆనకుండుట.

కాళ్లు, చేతులు:—వణకుట లేక కంపించుట.

చర్మము:—పాలిపోవుట, పాలవలెతెల్లగానుండుట. దుర్వాసనగా చీముపెడలుట.

నిద్ర:—తెలిపితస్వనట్లుగాను, నిద్రమత్తుగానుయుండుట, నిర్మల ముగానిద్రించుటను, చనిపోవుటను కోరుట.

జ్వరము:—చల్లదనము. చలి. వణకు. జ్వరముకుపిదప ఎక్కువచెమటపట్టుట. వేడిమి విడవకుండా యుండుటవలని నిద్రలేమి. కాళ్లు, చేతులు మంటగాను వేడిగాను యుండుట.

మోతాదు:—6x మొదలు 30 పొటెన్సీ.

---

## 402. జింకం వెలీరియానికం. ZINCUM VALERIANICUM.

పలువిధములగు నరములసంబంధమైన బాధలను ముఖ్యముగా అపస్మారమును ఇది మాన్పును.

మనస్సు, తల:—తలనిండుగాను, కంగారుగాను యుండుట. ఆలోచన కష్టముగానుండుట. నరములరోషముతో కూడి, అప్పటప్పటవచ్చు తలనొప్పి. బాధవలన రోగి పిచ్చియెత్తినవానివలెనుండుట, మరియు నిద్రను జెందకుండుట.

ముఖము:—నరములసంబంధమైన బాధలు. పార్శ్వపునొప్పి.

నోరు:—నాలుకపై తెల్లనిపూతగలుగుట.

అన్నకోశము:—పుల్లతేన్పులు వచ్చుట. ఆకలిలేమి.

పొత్తికడుపు, మలము, మలాశయము:—వుదయమున లేచుసరికి పొత్తికడుపులో శూలవచ్చుట. మూలశంఖ. తరుచు విరేచనానుమానము కలుగుచున్నను విరేచనమవక పోవుట (నస్సవామికా).

పురుషావయవములు:—పరుసగా ప్రతిరాత్రియందును రేతస్ఖలనములు.

స్త్రీఅవయవములు:—అండాశయమునందు నరములసంబంధమైన బాధ—యీబాధ పాదములవరకు వ్యాపించుట.

హృదయము:—హిస్టీరియాసంబంధమైన హృదయవేదన.

శ్వాసావయవములు:—రాయి కొట్టినట్లు బరువుగాతోచుట.

కాళ్లు, చేతులు:—వెన్నెముకలో బాధ. కాళ్లను కదల్చుచుమాత్రమే కూర్చుండ గలుగుట.

నిద్ర:—వరములదోషమువలని నిద్రలేమి.

వరములు:—"ఆరా" లేకుండగవచ్చునట్టి అపస్మార వ్యాధి. మానసి ఎక్కిళ్లనిది మాన్పును.

మోతాదు:—3x మొదలు 30 పొటెన్సీ.

# సంపూర్ణము.

# హోమియోపతీడాక్టరు.

ఇది హోమియోపతీ మెటీరియా మెడికా గ్రంథమునకు అనుబంధముగా చదువవలసిన అమూల్యగ్రంథము. ఇందు 786 ఔషధముల ముఖ్యలక్షణములు, పొటెన్సీలవివరము, రోగస్థానములు, ఉద్రేకవుపశమనములు, సహచరులు, అనుచరులు, విరుగుళ్ళు, పోలికలు, గుణకాలపరిమితి మున్నగు అనేకహాంశములు విపులముగా వ్రాయబడినవి.

డెమ్మీ ⅛ సైజు గ్రంథము. వెల సాదాప్రతి 1కి రు. 0—8—0
క్యాలికోప్రతి వెల రు. 1—0—0

# క్లినికల్ ఇండెక్సు—CLINICAL INDEX.

అవయవములు యెండిపోవుట:—ఆర్సెనికం ఆల్బమ్, అయోడియం.

అజీర్ణము:—నక్సువామికా, ఎనకార్డియం, పల్సటిల్లా, లైకోపోడియం. హైడ్రాస్టిసు, నేట్రంఫాసు, కాల్కేరియాఫాసు.

అతిమూత్రము:—రూసు ఆగ్నోమేటికా, యాసిడ్ ఫాసు, నేట్రంమూరు.

ఆటలమ్మ:—ప్రథమావస్థలో—యాంటిమోంటార్టు. పొక్కులలో చీము జేసిన పిమ్మట—మెర్క్యూరియస్, ఫెర్రంఫాసు, కాలీమూరు, కాలీసల్ఫ కాల్కేసల్ఫ. నిరోధకమునకు—పల్సటిల్లా.

ఉబ్బసము:—ఆర్సెనికం ఆల్బమ్, ఇపెకాక్, బ్లేటా ఓరియంటాలిసు, యూకలిప్టస్, నేట్రంసల్ఫ, కాలీమూరు, ఇపెకాక్, ప్యాసిఫ్లోరా ఇన్కార్నేటా, డ్రొసిరా, యాంటిమోనియం టార్టారికం, నేట్రంసల్ఫ, లోబీలియా ఇన్ఫ్లేటా, కాలీబైక్రోమికం, నక్సువామికా, కాలీఫాసు, క్వెబ్రాఖో, కుప్రం మెటాలికం.

ఎడినాయిడ్సు:—కాల్కేరియా అయోడ్, ఎగ్రఫిస్ న్యూటాన్సు.

ఎప్పెండిసైటిసు (క్రిమికవాపు):—ఎఖినేషియా, లెకెసిస్, బెల్లడోనా, ఫెర్రంఫాసు, కాలీమూరు, హెపారుసల్ఫ.

ఎముకలదోషములు:—కాల్కేరియా ఫాసు, యాసిడ్ ఫ్లోరిక్, ఆరం మెటాలికం, సైలీషియా, కాల్కేరియాఫ్లోరు, ఎసాఫొటీడా.

ఎక్కిళ్లు:—నక్సువామికా, జిన్సెంగు, మెగ్నిషియాఫాసు.

ఋతుశూల:—వైబర్నం ఆప్యులసు, కాలోఫైలం, మెగ్నీషియాఫాసు, పల్సటిల్లా, డయాస్కోరియా, జాంతోజైలం, కేమోమిల్లా.

క్రొవ్వు పెరుగుట (శరీరములో):—ఫ్యూకస్, ఫైటోలక్కా.

క్రిమిదోషము:—సినా, స్పైజీలియా, సెబాడిల్లా, ట్యూక్రియం మారం.

కురుపులు:—బెల్లడోనా, హెపారుసల్ఫ, ఫెర్రంఫాసు, కాలీమూరు, సైలీషియా, సల్ఫరు, లెకెసిస్, కాలెండ్యులా ఎఖినేషియా.,

కోరింతదగ్గు:—మెగ్నీషియా ఫాసు, కొరాలియం, డ్రొసిరా కుప్రం మెట్, స్పాంజియా, కుప్రం ఏసెట్, ప్యాసిఫ్లోరా ఇన్కార్నేటా.

కాలుట, బొబ్బలెక్కుట:—కాష్టికం, కేంథారిసు, కాలీమూరు, ఎఖినేషియా, కాలెండ్యులా, ఫెర్రంఫాసు.

కేన్సరు (పుట్టవ్రణము):--హైడ్రాస్టిసు, ఆర్సెనికం ఆల్బం, కాలీసల్ఫ, కాలెండ్యులా, కోనియం, ఎఖినేషియా, నేట్రంఫాసు, ఎస్టీరియాసు రూబెన్సు, యాసిడ్ నైట్రిక్, సల్ఫరు, ఆర్సెనికం అయోడేటం, కార్బో యానిమలిస్, రేడియంబ్రోం.

కారు (మోటారు) ప్రయాణమువలని దోషములు:—కొక్యులసు.

కేటరాక్టు(అంతరకుసుమలు):--ఫాస్ఫరసు, కాష్టికం, సినరారియా, కాల్కేరియా సిలికేటా, కాల్కేరియాఫ్లోరు, కాల్కేరియా ఫాసు, సేపియా, కోనియం, పల్సేటిల్లా, లైకోపోడియం, కాల్కేరియా కార్బ.

కలరా (విషూచి):—ఆర్సెనికం ఆల్బం, విరేట్రం ఆల్బం, కుప్రం మెటాలికం, కేంఫరు, కేంఫరుమోనోబ్రోమేటం, మెగ్నీషియాఫాసు, ఇగ్నేషియా, కాలీఫాసు, యాసిడ్ హైడ్రో, సెకేలే, పోడోఫైలం.

పిల్లలలో కలరా:—క్యూఫియావిస్కోస్, ఎథూజా, కాల్కేరియా ఫాసు, కేంఫర్, కేంఫర్ మోనోబ్రోమేటం, ఓపియం, కాల్కేరియా కార్బ, విరేట్రం ఆల్బమ్, కార్బోవెజ్, చైనా, కేమోమిల్లా, ఇపెకాక్, క్రోటను టిగ్.

కండ్ల రోగములు:—యూఫ్రేషియా, ఎకొనైట్, పల్సటిల్లా, నేట్రిం మూరు, రూటా, బెల్లడోనా, కాల్కేరియాసల్ఫ, సినరారియా మారిటైమా, నేట్రంఫాసు, తూజా, అర్జెంటం నైట్రికం.

కామెర్లరోగము:--బ్రయోనియా పోడోఫైలం, చెలిడోనియం, కాలీ మూరు, నేట్రంఫాసు, కేమోమిల్లా, కార్డూసు మెరీనసు.

కుష్టు—ఇయలస్, పైలీషియా, హైడ్రోకోటైల్, ఎఖినేషియా.

శ్వేతకుష్టు (బొల్లి):—ఆర్సెనికం సల్ఫ్యురేటం ఫ్లేవం, హైడ్రోకోటైల్, ఇలయస్ గ్వీన్, ఎఖినీషియా, ఎనకార్డియం, కలాట్రోపిస్.

కుసుమరోగము:—హైడ్రాస్టిస్, పల్సటిల్లా, తూజా, సేపియా, ఎలట్రిస్ ఫేరినోసా, ఓవాటెస్టా, ఆరంమూరు, కాలీమూరు, కాలీసల్ఫ, నేట్రంమూరు, నేట్రంఫాసు, హెలోనియాస్, కాల్కేరియాకార్బ

కాలేయరోగములు (లీవరురోగములు):—కార్డ్యూసు మెరీనసు, చెలిడోనియం, మెర్క్యూరియస్, సీనోథస్ అమెరికానస్.

కంతులు:—మెర్కుఅయోడ్ రుబ్రం, తూజా, ఫైటోలక్కా, కాల్కఫ్లోరు, కోనియం, కాల్కేరియా సిలికేటా.

కముసుదెబ్బలు:—ఆర్నికా, హైపెరికం, కాల్కేరియా ఫ్లోరు.
కంపము లేక ఫిట్లు (బాలపాపచిన్నె మొదలగునవి):—కుప్రంమెట్, మెగ్నిషియాఫాసు, కాలీఫాసు, జింకంమెట్, బెల్లడోనా, కాస్టికమ్, ప్యాసిఫ్లోరా ఇన్కార్నేటా, సినా, కేమోమిల్లా, స్ట్రెమోనియం, విరేట్రంఆల్బమ్, ఇపెకాక్, యామిల్నైట్రోస్, కేంఫరు.
కోరియా:—ఎగేరికసు, జింకం మెటాలికం, కుప్రం మెటాలికం, నేట్రం మూరు, కాల్కేరియా కార్బ, హయాస్యామసు, బెల్లడోనా, స్ట్రెమోనియం, సినా, కాస్టికమ్.
గర్భస్రావము:—కాలోఫైలం, వైబర్నం ఆప్యులస్, సెబీనా, హెలోనియాస్, ఎలట్రిసు ఫేరినోసా, సెకేలే.
గర్భాశయరక్తస్రావములు:—సెబీనా, క్రోకసు, ప్లాటినా.
గర్భాశయదోషములు:—ఫ్రాక్సినస్ అమెరికానా, సేపియా, పల్సటిల్లా, ఆరంమూరు, ఆరంమూరునేట్రం.
గొంతుకబొంగురు:—కాష్టికం, ఆర్జెంటంమెటాలికం, యాసిడ్ నైట్రిక్, స్పాంజియా, ఫాస్ఫరస్, ఆర్జెంటం నైట్రికం, కోకా, రూస్టాక్సు.
గవదకాయలు వాచుట (టాన్సిల్సు పెద్దవగుట):—ఎగ్రఫిస్ న్యుటాన్సు, బెరీటా అయోడ్, కాల్కేరియా అయోడ్, బెరీటాకార్బ, బెల్లడోనా, కాల్కేరియాకార్బ, కాల్కేరియాఫాసు, ఎఖినేషియా, కాలీమూరు, సైలీషియా, మెర్క్యూరియసు, కోనియం, పైటోలక్కా.
చెముడు:—పల్సటిల్లా, వెర్బేస్కం, ముల్లీన్ఆయిల్, కాలీమూరు.
చెవిపోటు:—ముల్లీన్ఆయిల్, కేమోమిల్లా, పల్సటిల్లా, బెల్లడోనా.
చెవినుండి చీము—కాలీమూరు, కాల్కేరియా సిలికేటా, ముల్లీనాయిల్.
చుండ్రు:—ఫాస్ఫరస్, లైకోపోడియం, కాలీసల్ఫు.
జ్వరము:—ఎకొనైట్, బెల్లడోనా, బ్రయోనియా, యూకలిప్టసు, ఎఖనేషియా, బాప్టీషియా, రూస్టాక్సు, ఆర్సెనికంఆల్బం, నక్సువామికా, ఫెర్రంఫాసు, నేట్రంసల్ఫు, కాలీమూరు, చైనా, సల్ఫరు.
తలవెంట్రుకలూడిపోవుట:—యాసిడ్ ఫ్లోరిక్, ఫాస్ఫరసు, కాలీసల్ఫు.
తలదిమ్ము:—ఎనకార్డియం, సైలీషియా, కాలీఫాసు, జింకంమెట్.
తలనొప్పి:—ఎకొనైట్, బెల్లడోనా, బ్రయోనియా, కాఫీ, నక్సువామికా, శాంగ్వినేరియా, సిమిసిఫ్యూగా, కమోనాంతసు వర్జినికా.

తామర:—బేసిలినం, సల్ఫరు, సేపియా, ఆర్సెనికం ఆల్బమ్.
తేలుకాటు:—ఎఖినేషియా, లిడం, నేట్రంమూరు, ఆర్సెనికం ఆల్బమ్.
త్రాగుడువలని దోషములు:—యాసిడ్ సల్ఫ, నక్సువామికా, క్వెర్కస్.
దగ్గు:—బ్రయోనియా, బెల్లడోనా, ఇపెకాక్, స్పాంజియా, హెపారు సల్ఫ, డ్రోసీరా, కుప్రంమెట్, మిర్టసుఛికేన్, యాంటిమంటార్ట్, బ్లేటాఓరియంటాలిస్, జస్టీషియా, మెగ్నీషియాఫాసు, ప్యాసిఫ్లోరా ఇన్కార్నేటా, ఫాస్ఫరస్, కొరాలియంరుబ్రం, హయాస్యామస్, కాలీబైక్రోమికం, శాంగ్వినేరియా, లెకెసిస్, సెనీగా, డల్కమారా, కాలీమూరు, కాలీసల్ఫ, నేట్రంమూరు, ఫెర్రంఫాసు.
నడుమునొప్పి:— సిమిసిఫ్యూగా, నక్సువామికా, రూస్టాక్సు, బ్రియోనియా, కాల్కేరియాఫ్లోరు, కాల్కేరియాఫాసు, ఓవాటెస్టా, పల్సటిల్లా, మెగ్నీషియాఫాసు.
నీరుపట్టుట (అవయవములకు):—ఆర్సెనికం ఆల్బం, రూస్టాక్సు.
నిస్త్రాణ:—ఆర్సెనికంఆల్బం, యాసిడ్ ఫాసు, అల్ఫాల్ఫా, అవీనాసతీవా, ఎలెట్రిస్ ఫేరినోసా, చైనా ఆర్సు, ఆర్సెనికం అయోడేటం, యాసిడ్ మూరు, చైనా, యాసిడ్ పిక్రికం.
నపుంసకత్వము:—డామియానా, శాలిక్సునైగ్రా, అవీనాసతీవా, సేబల్ సెర్యులేటా, యాసిడ్ ఫాసు, లైకోపోడియం, సెలీనియం.
నిద్రలేమి:—ప్యాసిఫ్లోరా యినార్కేర్నేటా, అవీనాసతీవా, కాఫీ, అల్ఫాల్ఫా, కేమోమిల్లా.
నల్లమందు అలవాటు:—అవీనాసతీవా, కేమోమిల్లా.
న్యుమోనియా:—చెలిడోనియం, బ్రయోనియా, కాలీమూరు, ఫెర్రంఫాసు.
పులియగొట్టుట:—నక్సువామికా, యాసిడ్ సల్ఫ, నేట్రంఫాసు.
పైత్యదోషములు:—పోడోఫైలం, నక్సువామికా, చెలిడోనియం, సల్ఫరు, మెర్క్యూరియస్, నేట్రంసల్ఫ, కాలీమూరు, కయోనాంతసువర్జినికా.
పార్శ్వపునొప్పి:--జల్సీమియం, శాంగ్వినేరియా, కాస్టికం, నేట్రంమూరు, ఆర్సెనికం ఆల్బం, మెగ్నీషియాఫాసు, కాలీఫాసు.
పుండ్లు (చితికిన కురుపులు వగైరా):—బెల్లడోనా, హెపారుసల్ఫ, సైలీషియా, ఎఖినేషియా, కాలెండ్యులా, కాల్కేరియాసల్ఫ.
**పొంగు (Measles)**:—మార్బిల్లినం, ఫెర్రంఫాసు, కాలీమూరు.

పొంగును రాకుండగ నాపుచేయుటకు:—పూర్బ్లిన్, బెల్లడోనా.
ప్రసవానంతర నొప్పులు:—మెగ్నీషియాఫాసు, కాలోఫైలం.
పడిశెము:—జెల్సిమియం, యూఫ్రేషియా, నేట్రంమూరు.
పంటికురుపు:—బెల్లడోనా, సైలీషియా, మెర్క్యూరియసు.
పక్షవాతము:—రస్టాక్స్, జెల్సిమియం, కాస్టికం, ప్లంబం మెటాలికం, ఎకోనైట్, కుప్రం మెట్, కాలీఫాసు, మెగ్నీషియాఫాసు.
ప్లూరసీ:—బ్రయోనియా, ఎకోనైట్, ఫెర్రంఫాసు, కాలీమూరు.
పాముకాటు:—ఎఖినేషియా, అంగుస్టిఫోలియా, యాసిడ్ హైడ్రో.
పంటిసలుపు:—కేమోమిల్లా, ప్లాంటాగో, బెల్లడోనా, ఫెర్రంఫాసు.
బహిష్టుదోషములు:—పల్సటిల్లా, నేట్రంమూరు, కాలోఫైలం, వైబర్నం అప్యులస్, బెల్లడోనా, ఇపెకాక్, సెబీనా, మెగ్నీషియాఫాసు, కాల్కేరియాఫాసు, ఎకోనైట్, హెలోనియాస్, సేపియా, బ్రయోనియా, ఫాస్ఫరస్, సిమిసిఫ్యూగా.
బ్రాంకైటీసు:—బ్రియోనియా, యాంటిమెంటార్టు, ఎకోనైట్, ఫెర్రంఫాసు, కాలీమూరు, బెల్లడోనా, నేట్రంమూరు, కార్బోవెజ్, కాలీబైక్రోమికం, ఫాస్ఫరస్, బాల్సమం పెరూవియానం, లొబీలియా ఇన్ఫ్లేటా, హెపార్సల్ఫ, స్పాంజియా.
బిళ్ల (సవాయి):—కార్బోయానిమలిస్, మెర్క్యూరియసు, ఫైటోలక్కా, యాసిడ్ నైట్రిక్.
బోదకాలు (ఏనుగుచర్మము):—ఇలయస్గ్విన్, హైడ్రోకోటైల్, ఆర్సెనికం ఆల్బం.
బుడ్డ:—గోడోడెన్ద్రాను, పల్సటిల్లా, కాల్కేరియా సిలికేటా, సైలీషియా, గ్రాఫైటీసు.
బ్రాంఖోన్యుమోనియా:—కాలీబైక్రోమికం, ఫాస్ఫరసు, యాంటింటార్టు.
భగందరము:—మెర్క్యూరియస్, హెపార్సల్ఫ, సైలీషియా, మిరిస్టికా.
మొటిమలు:—యాంటిమోనియం క్రూడం, బెర్బెరిస్ యాక్విఫోలియా, యాసిడ్ఫాసు, హైడ్రోకోటైల్, కాలీమూరు, సల్ఫరు.
మన్యపుజ్వరము:—చైనా, నేట్రంమూరు, ఆర్సెనికం ఆల్బం, జల్సిమియం, నక్సువామికా, ఇపెకాక్, షక్సుడికాక్షన్, అక్సిడెండ్రాను, నేట్రంసల్ఫ, యుపటోరియం పెర్ఫ.

మంగలిక త్రిదోషములు (గురదతోనుండు చిడుమువంటి రోగములు):— తూజా, సల్ఫరు అయోడేటం, కాలీసల్ఫు, మెగ్నీషియాఫాసు.
మశూచికము (Small pox):—యాంటింటార్టు. బ్రయోనియా, ఆర్సెనికం ఆల్బం, తూజా, వేరియోలినం, మెలాన్డ్రినం, కాలీమూరు, ఫెర్రంఫాసు, ఎఖినేషియా అంగుష్టిఫోలియా, నేట్రంఫాసు.
మశూచికము రాకుండగ నాపుజేయుటకు:— వేరియోలినం, వేక్సినినం, కాలీమూరు, మెలాండ్రినం, తూజా, యాంటింటార్టు.
మధుమూత్రము:—సిజీజియం జాంబోలెనం, ఫాస్ఫరసు, ఆర్సెనికం బ్రోమేటం, యాసిడ్ఫాసు, నేట్రంసల్ఫు, కాలీఫాసు, కాలీమూరు.
మూర్ఛ:—ఒయినాంతి కోకేటా, కుప్రంమెట్ కాలీమూరు, కాలీఫాసు.
మూలశంఖ:—నక్సువామికా, సల్ఫర్, నిగండియం అమెరికానం, హేమామెలిస్, ఎస్క్యులస్హిప్పొ, కాలిన్సోనియా, ఎలోసు.
మాంసగ్రంథులవాపు:—ఎగ్రఫిసున్యుటాన్సు, బెరీటాఅయోడు, కాల్కేరియా అయోడు, బెల్లడోనా, మెర్క్యుబిన్ అయోడు.
మేహవాతదోషములు:—రూస్టాక్సు, బ్రయోనియా, కోల్చికం, తూజా.
యాంత్రాక్సువిషము:—ఎఖినేషియా అంగుష్టిఫోలియా.
రక్తహీనత:—ఫెర్రంమెట్, చైనా, కాల్కేరియాఫాసు, ఫెర్రంఫాసు, నేట్రంమూరు, హెలోనియాస్, కాల్కేరియాకార్బు, ఆర్సెనికం ఆల్బం, అల్ఫాల్ఫా, ఎలట్రిస్ ఫేరినోసా.
రక్తస్రావములు:—సెబీనా, మిల్లిఫోలియం, చైనా, హేమామెలిస్, ఫెర్రంఫాసు, లెకెసిస్, కాల్కేరియాఫ్లోరు.
రుద్రవాతము (Apoplexy):—ఆర్నికా, బెల్లడోనా, ఫాస్ఫరస్, ఓపియం.
రాచకురుపులు:—ఆర్సెనికం ఆల్బం, టారంట్యులాక్యూబెన్సిస్, యాంత్రసైనం, లెకెసిస్, కాల్కేరియాసిలికేటా, సైలీషియా, ఎఖినేషియా, లెడం, హెపారుసల్ఫు, కాల్కేరియాసల్ఫు, మిరిస్టికా సెబిఫెరా, కార్బోవెజ్, బెల్లడోనా, మెర్క్యూరియస్, కొరిటేలస్.
ఉబ్బు:— యాటిరిస్ స్పైకేటా, ఎపోసైనం, ఎపోసైనం కెన్నబినం ఎడోనిస్వెర్నాలిస్, ఏపిస్, కన్వల్లేరియా, నేట్రంసల్ఫు, కాలీమూరు, నేటరింమూరు, బ్లాస్పీ బర్సాపేస్టోరిసు.

విరేచనబద్ధము:—నక్సువామికా, లైకోపోడియం, ఎల్యూమినా, హైడ్రాస్టిసు, గ్లిసరినం, ఓపియం, సల్ఫరు, కాలీమూరు, నేట్రింమూరు, యాబిస్ నైగ్రా. కాలిన్సోనియా, గ్రాఫైటిస్, బ్రియోనియా, ప్లంబం మెట్, కాల్కేరియాసిలికేటా, సిలికా మెరీనా.

విరేచనములు:—

నీళ్లవి:—క్రోటనుటిగ్, చైనా, ఆర్సెనికం ఆల్బం, ఇపెకాక్, విరేట్రం ఆల్బం, కేంఫరు, యాసిడ్ ఫాసు, యూక్లిప్టస్, ఎథూజా, ఎలోసు, కేంఫరు, గేంబోజియా, జిరానియం మేక్యులేటం, త్లాస్పి బర్సాపేస్టోరిసు, చైనా, నేట్రింమూరు, కాలీఫాసు.

పిల్లలలో:—కాల్కేరియాఫాసు, కేమోమిల్లా, నేట్రింమూరు.

జిగటవి:—మెర్క్యూరియసు, ఎలోసు, మెగ్నీషియాఫాసు, యూక్లిప్టసు, ఏలాంతసు, కొలోసింథిస్, కాలీఫాసు, ఆర్సెనికం ఆల్బం.

రక్తము:—మెర్కుకర్, ఫెర్రింఫాసు, మిల్లిఫోలియం, హేమామెలిస్, జిరానియం మేక్యులేటం.

ఊపిరి ఆడకుండుట:—క్వెబ్రాఖో, ఆర్సెనికం ఆల్బం, ఇపెకాక్.

వేవిళ్లు:—ఇపెకాక్, నక్సువామికా, ఎలట్రిసు ఫేరినోసా, కాక్యులసు, యామిగ్డలస్ పెర్సికా కార్టెక్స్, సింఫోరి కార్పసు రేసిమోసా.

వృషణములవాపు, బాధ:—రోడోడెండ్రాసు, పల్సటిల్లా, కాల్కేరియా సిలికేటా, ఫెర్రింఫాసు, కాలీమూరు, కాల్కేరియాఫ్లోరు.

ఉలిపిరికాయలు:—తూజా, యాంటిమోనియం క్రూడం, యాసిడ్ నైట్రిక్.

వ్రాతగాండ్ర వ్రేళ్లబాధలు:-మెగ్నీషియాఫాస్, కాలీఫాస్, కుప్రం మెట్.

వమనములు (వాంతులు):—ఇపెకాక్, నేట్రింసల్ఫు, యాంటిమోనియం క్రూడం, నక్సువామికా, ఆర్సెనికం ఆల్బం, కాక్యులసు, ఎథూజా.

శూల:—కొలోసింథిస్, కేమొమిల్లా, మెగ్నీషియాఫాసు, ప్లంబం మెటాలికం, డయాస్కోరియా, కోల్చికం, వైబర్నం ఆప్యులస్, నక్సువామికా, నేట్రంసల్ఫు. కుప్రిం మెట్, కేంఫరు, నేట్రంఫాసు.

శుక్లనష్టము (వీర్యనష్టము):—స్టాఫీశాగ్రియా, యాసిడ్ ఫాసు, శ్యాలిక్సునైగ్రా, చైనా, సేబల్ సెర్యులేటా, అవీనాసటీవా, యాగ్నస్ కేస్టసు, నక్సువామికా, లైకోపోయం, సల్ఫరు, జింకం మెట్, కోనియం, కలేడియం, జల్సీమియం, సెలీనియం, యాసిడ్ పిక్రిక్.

**ధనుర్వాతము (Tetanus):**—స్ట్రిచ్నినం. ప్యాసిఫ్లోరాయిన్కార్నేటా.

**సెగ:**—కెన్నబిస్ సతీవా. జెల్సిమియం. మేటికో. మెర్క్యూరియసు. తూజా. పల్సటిల్లా. కాలీమూరు. నేట్రింమూరు. గనోరినం లేక మెడోరినం. నేట్రింసల్ఫ. కాల్కేరియాసల్ఫ. శాలిక్సునైగ్రా. మెర్కుకర్. క్లెమేటిస్. కేంథారిస్. కాలీసల్ఫ. సల్ఫరు.

**సంధి:**—హాయోసామ్యస్. బెల్లడోనా. నేట్రింసూరు. బేప్టిషియా.

**సవాయి:**—మెర్క్యూరియుస్. ఎకినేషియా. కాలీబ్రోమైడ్. జకొరాండా. ఆరం మెటాలికం. బెర్బెరిసు యాక్విఫోలియా. సిఫిలినం. కేస్కారా ఆమార్గా. హెపారుసల్ఫ. యాసిడ్ నైట్రిక్. కార్బోయానిమలిస్. ఫైటోలక్కా. ఆర్సెనికం ఆల్బం. మెర్క్యూరియస్ బిన్ అయోడ్. సైలీషియా. కాలీమూరు. మెర్కుకర్. కాలీఫాసు. కాల్కేసల్ఫ.

**సెరిబ్రోస్పైనల్ జ్వరము:**—జల్సిమియం. బెల్లడోనా. హెల్లిబోరస్. ఆర్సెనికం ఆల్బం. రూస్టాక్సు. కేంఫరు. బ్రియోనియా. కుప్రం యొసెట్. క్రొటేలస్. గ్రిండెలస్. స్ట్రెమోనియం. కాలీఫాసు.

**స్తన్యవృద్ధికి:**—రిసినస్ కమ్యూనిస్. మెడ్యూసా. ఆల్ఫాల్ఫా. కాల్కెఫాస్.

**హృదయరోగములు:**—బ్రయోనియా. స్పైజిలియా. కేక్టసు. క్రెటేగసు. లేట్రోడెక్టసు. గ్లొనోయిన్. కన్వల్లేరియా మెజాలిసు. డిజిటాలిసు. స్ట్రోఫేన్తస్. మెగ్నిషియాఫాస్. కాలీఫాస్. యామిల్ నైట్రోసం. స్పైజీలియా. సిమిసిఫ్యూగా. నక్సువామికా.

**హిస్టీరియా లేక అపస్మారము:**—మోస్కస్. ఎసాఫటీడా. ప్లాటినా. ఇగ్నేషియా. అవీనాసతీవా. ఎలక్ట్రిస్ ఫేరనోసా. కాలీఫాసు. మెగ్నిషియాఫాసు. కేస్టోరియం. ఆరంమూరు నేట్రిం.

**క్షయ:**—ఆర్సెనికం అయోడేటం. కాల్కేరియా కార్బ. బేసిలినం. కాల్కేరియాఫాసు. కాలీఫాసు. ఫెర్రింఫాసు. నేట్రింఫాసు.

---

శ్రీ భుజంగరాడ్ ముద్రాక్షరశాల, జగన్నాధపురం, కాకినాడ.

మావద్ద కుటుంబములకు, వైద్యులకు, విద్యార్థులకు, అందరికిని పనికి వచ్చు టిన్క్యూసాల్టుల పెట్టెలు (తోలుతోను, చేవకఱ్ఱతోను చేయబడినవి) అన్ని సైజులలోను, ఔషధములతోను, ఔషధములు లేకుండగను అమ్మకమునకు సిద్ధముగానున్నవి. వాటిపటము లీక్రిందను పొందుపరుపబడియున్నవి.




వైద్యులకు పనికి వచ్చు తోలు పెట్టె. (జేబులో వుంచుకొనుటకు)




వైద్యులకు పనికి వచ్చు చేవ పెట్టె.

డ్రాయరు అమర్చబడినది.




కుటుంబౌషధ
ముల పెట్టె.
టేకుకర్రతో
చేయబడినది.

టిస్యూసాల్టుల
(ద్వాదశలవణ
ముల) నుంచుకొను
టేకు పెట్టె.

కుటుంబ వుపయో
గమునకు, వైద్యుల
వుపయోగమునకు.




పైన కనుపరచిన పెట్టెలు వివిధసైజులలో (పెద్దవి, చిన్నవి) ఖాళీగాను, మందులతోనున్నవియు, అమ్మకమునకు సిద్ధముగానున్నవి. ఈ పెట్టెలను, తెలుగున మాచే ప్రచురింపబడిన హోమియోపతీ వైద్యగ్రంథ ములను బహుతక్కువ ధరలకే అమ్ముచున్నాము.




కుటుంబౌషధములను వుంచుకొను తోలుపెట్టె. (జేబులో నుంచుకొనుటకు)

మేము విద్యుచ్ఛక్తిసహాయమున తయారుచేయుచున్నట్టి పొడుమురూపముననుండు టిస్యూసాల్టుల ధరలు.

| పొటెన్సీలు. | 1 డ్రా. | 2 డ్రా. | 4 డ్రా. | 1 ఔ. | 2 ఔ. | 4 ఔ. | ½ పౌ. | 1 పౌ. |
|---|---|---|---|---|---|---|---|---|
| 1x.5x, 11x,29x | 0-2-0 | 0-3-9 | 0-7-0 | 0.14-0 | 1-8-0 | 2-8-0 | 4-0-0 | 7-0-0 |
| 2x,3x, 6x,12x 30x | 0-1-9 | 0-3-0 | 0-5-0 | 0-8-0 | 0-12-0 | 1-4-0 | 2-0-0 | 3-8-0 |
| 60x, 100x, 200x | 0-3-0 | 0-5-0 | 0-8-0 | 0-12-0 | 1-4-0 | 2-8-0 | 4-0-0 | 6-0-0 |
| 59x, 99x, 199x | 0-4-0 | 0-7-0 | 0-12-0 | 1-4-0 | — | — | — | — |

## THE 12 BIOCHEMIC REMEDIES.

A very useful pocket book on the Theory and Practice of Biochemistry, with Materia Medica of the remedies and a condensed Repertory, in ENGLISH per Copy 0—8—0

ద్వాదశలవణచికిత్స:—డాక్టరు ష్యూస్లరుగారి 12 టిస్యూసాల్టులు అనబడు బయోకెమిక్ మందులతో చేయు వైద్యమునుగూర్చి. రు 0-8-0.

## బోరిక్కు అండు టాఫెల్ కంపెనీ టినుక్చ్యూర్ల ధరలు.

(అమెరికానుండి దిగుమతిచేయబడిన బిళ్లలు మరియు పౌడర్లు)

| పొటెన్సీలు | 1 డ్రాము | 2 డ్రాములు. | 4 డ్రాములు. | 1 ఔన్సు. | 2 ఔన్సులు. | 4 ఔన్సులు. |
|---|---|---|---|---|---|---|
| 3x 6x | 0-2-0 | 0--4-0 | 0- 7-0 | 0-12-0 | 1--4-0 | 2--6-0 |
| 12x | 0-3-0 | 0--6-0 | 0-10-0 | 1--0-0 | 1-10-0 | 2-10-0 |
| 30x | 0-4-0 | 0--8-0 | 0-12-0 | 1--4-0 | 2--0-0 | 2-14-0 |
| 200x | 0-6-0 | 0-12-0 | 1--4-0 | 2--4-0 | 4--0-0 | 6--8-0 |

## టినుక్చ్యూర్లతో నింపబడిన కుటుంబౌషధముల పెట్టెలధరలు.

3x, 6x, 12x, 30x పొటెన్సీలలో నింపబడి, గుండ్రని సీసాలతో అమర్చబడిన పెట్టెలు. వీటితోనొక ఇంగ్లీషు లేక తెలుగున వ్రాయబడిన బయోకెమిక్ వైద్యగ్రంథము, ఒకదంతపు గరిటికూడ యివ్వబడును.

| సీసాల సంఖ్య. | 1 డ్రాము. | 2 డ్రాములు. | 4 డ్రాములు. | 1 ఔన్సు. |
|---|---|---|---|---|
| 12 | 2--8-0 | 3--8-0 | 5-4-0 | 8-4-0 |
| 24 | 4--0-0 | 5-12-0 | 9-4-0 | 14-8-0 |
| 36 | 5--4-0 | 8--4-0 | 14-0-0 | 21-8-0 |
| 48 | 6-12-0 | 10--8-0 | 18-0-0 | 28-8-0 |

## ప్రత్యేకముగా టిస్స్యూసాల్టుల నుంచుకొను ఓకుపెట్టెల ధరలు (ఖాళీపెట్టెలు).

| సీసాల సంఖ్య. | గుండ్రని సీసాలు. | | | | | నలుచతురము సీసాలు. | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 డ్రాము. | 2 డ్రాములు. | ½ ఔన్సు. | 1 ఔన్సు. | 2 ఔన్సులు | ½ ఔన్సు. | 1 ఔన్సు. | 2 ఔన్సులు |
| 12 | 0-10-0 | 0-12-0 | 1-0-0 | 1-12-0 | 2-4-0 | 1-8-0 | 2-4-0 | 3-8-0 |
| 24 | 0-12-0 | 1--0-0 | 1-4-0 | 2--4-0 | 3-4-0 | 2-0-0 | 3-4-0 | 4-8-0 |
| 36 | 1--0-0 | 1--4-0 | 2-4-0 | 3--0-0 | 4-4-0 | 3-0-0 | 4-4-0 | 5-8-0 |
| 48 | 1--4-0 | 1--8-0 | 2-8-0 | 4--0-0 | 5-4-0 | 4-0-0 | 6-0-0 | 7-8-0 |
| 60 | 1--8-0 | 1-12-0 | 3-0-0 | 5--0-0 | 6-4-0 | 5-0-0 | 7-4-0 | 10-0-0 |

తోలుపెట్టెల ధరలు కోరినవారికి ఎప్పటికప్పుడు తెలిపెదము.

## హోమియోపతీ ఔషధముల ధరలు.

(లోపలికి పుచ్చుకొనునవి.)

| పొటెన్సీలు. | 1 డ్రాము | 2 డ్రాములు | 4 డ్రాములు | 1 ఔన్సు | 2 ఔ॥లు | 4 ఔ॥లు |
|---|---|---|---|---|---|---|
| | అ. పై. | అ. పై. | అ. పై. | అ. పై. | రు.అ. | రు.అ. |
| 3, 6, 12, 30x లేక c పొటెన్సీలు మాత్రలు | 1-3 | 2-3 | 4-0 | 8-0 | 0-13 | 1-4 |
| 1, 1x, 2,2x,5x,5,11x, లేక 11, 29x లేక c, 100, 200x లేక c పొటెన్సీలు మాత్రలు | 1-6 | 2-9 | 5-0 | 10-0 | 1-0 | 1-8 |
| 2-6x లేక c వరకు పొడుములు డ్రాము 1 కి 1-0-0 వరకు ఖరీదు వేసిన మందులవి | 1-9 | 3-3 | 6-0 | 10-0 | 1-4 | 2-0 |
| | రు.అ. | రు.అ. | రు.అ. | రు.అ. | రు.అ. | రు.అ. |
| 3x-200 వరకు అరకులు | 0-3 | 0-5 | 0-9 | 1-0 | 1-12 | 3-0 |
| 28x లేక c, 99 డిటో | 0-4 | 0-6 | 0-10 | 1-0 | 1-12 | 3-0 |
| 500 డిటో | 0-6 | 0-10 | 1-0 | 1-8 | 2-8 | 4-0 |
| 1000 ద్రావకము | 0-8 | 0-12 | 1-4 | 2-0 | 3-0 | 5-0 |
| 1000 మాత్రలు | 0-4 | 0-7 | 0-12 | 1-4 | 2-8 | 4-0 |
| 10 M ద్రావకము | 1-8 | 2-8 | ... | ... | ... | ... |
| 50 M ద్రావకము | 2-8 | 4-0 | ... | ... | ... | ... |
| C. M ద్రావకము | 3-0 | 5-0 | ... | ... | ... | ... |
| M. M ద్రావకము | 5-0 | 8-0 | ... | ... | ... | ... |

మా ధరలపట్టీలను అందరకును ఉచితముగా పంపెదము.

## టేకుకఱ్ఱతో చేయబడిన ఖాళీపెట్టెలయొక్క ధరలు.

| డ్రాయర్లు లేనివి. | | | డ్రాయర్లు అమర్చబడినవి. | |
|---|---|---|---|---|
| సీసాలు. | 1 డ్రాము. | 2 డ్రాములు. | 1 డ్రాము | 2 డ్రాములు. |
| 12 | 0--8-0 | 0--9-0 | ... | ... |
| 24 | 0-10-0 | 0-11-0 | ... | ... |
| 30 | 0-11-0 | 0-12-0 | ... | ... |
| 36 | 0-12-0 | 0-14-0 | ... | ... |
| 48 | 1--0-0 | 1--2-0 | ... | ... |
| 60 | 1--2-0 | 1--4-0 | 2-10-0 | 3--0-0 |
| 84 | 1-12-0 | 2--0-0 | 3--0-0 | 3--8-0 |
| 104 | 2--4-0 | 2-12-0 | 4--8-0 | 5--4-0 |
| 120 | 2-12-0 | 3--4-0 | 5--8-0 | 6--0-0 |
| 150 | 3--8-0 | 4--4-0 | 6--0-0 | 6-12-0 |
| 204 | 5--0-0 | 6--8-0 | 7--0-0 | 9--0-0 |
| 250 | 8--0-0 | 9--8-0 | 12--0-0 | 13--0-0 |
| 300 | 10--0-0 | 12--0-0 | 15--0-0 | 18--0-0 |
| 350 | 12--0-0 | 13--0-0 | 18--0-0 | 19--0-0 |
| 450 | 15--0-0 | 16--0-0 | 22--0-0 | 23--0-0 |
| 500 | 18--0-0 | 19--0-0 | 25--0-0 | 26--0-0 |

## కుటుంబౌషధముల పెట్టెల ధరలు.

### 1 డ్రాము సీసాలు.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 12 | 15 | 24 | 36 | 48 | 60 | 84 | 104 | 120 |
| 2-0 | 2-8 | 3-0 | 3-8 | 5-4 | 6-6 | 9-0 | 10-14 | 12-8 |

ఈమందుల పెట్టెలతో మందుల నుపయోగించు విధానమును తెలుపు ఇంగ్లీషు లేక తెలుగు వైద్యగ్రంథము ఒకటి ఉచితముగా యివ్వబడును. 1 డ్రాము సైజు సీసాలలో ఔషధములు 3 × మొదలు 200 పొటెన్సీవరకు మాత్రలరూపమున నింపబడి టేకుకఱ్ఱతో చేయబడిన కుటుంబౌషధముల పెట్టెలలో అమర్చబడి యివ్వబడును.

